

మేర్లపాక
మురళి
సీరియల్

విరబూసిన కుసుమం తుమ్మెదకి పంపిన మౌనసందేశం-
అష్టవిధ నాయికల హృదయాలు తమ నాయకునికోసం పడే తీయని తపన-
నెలవంక సొగసు చూసి తారలో కదలే సిగ్గుమురిపాల తొందర-
పరికిస్తే- పరిశీలిస్తే జగమంతా ప్రణయమయం! రసమయ సౌందర్యం!!
ఒక పన్నీటిజల్లు-ఒక మల్లెచెండు పరిమళం-
ఒక అత్తరు సీసా గుబాళింపు-ఒక వెన్నెల రాత్రి చల్లదనం-

ఒక్కసారి - ఒక్కచోట సమావేశమై
రసహృదయాలకు పంపుతున్న రసమయ ఆహ్వానం

# రారా మా ఇంటిదాకా

25.3.94 సంచికలోనే ప్రారంభం

తొలిరేయి...

తలుపులు మూసినదగ్గర్నుండీ
తలుపులు తెరిచేవరకు...
ఎదురయ్యే అనుభవాలు
అందరికీ ఒకటేనా?!
ఒక్కొక్కరి తొలిరేయిలో
ఒక్కో అనుభూతి!
ఆ రహస్య గాంధర్వాలను
అక్షరాలలో స్వరపరిస్తే
అది
రసరాజు పలికే ఆహ్వానం



# రారా మా ఇంటిదాకా

## మేర్లపాక మురళి సీరియల్

త్వరలో ప్రారంభం

# అంతా పాఠకదేవుళ్ల చలువే

सत्यमेव जयते

PRIME MINISTER

New Delhi
February 25, 1994

Dear Shri Balaram,

Thank you for your article in the recent issue of 'Swati' on my visit to Germany.

With regards,

Yours sincerely,

P. V. Narasimha Rao

[P.V. Narasimha Rao]

Shri Vemuri Balaram
Editor
'Swati'
Anil Buildings
Suryaraopet
P.B. No. 339
Vijayawada 520 002

ఈ ఉత్తరంలో అభినందించి ఆశీర్వదించిన ప్రధాని శ్రీ పి.వి. నరసింహారావు గారికి సదా కృతజ్ఞుడ్ని. కృతార్థుడ్ని.
—వేమూరి బలరామ్, ఎడిటర్

★ 1993- ఉజ్బెకిస్తాన్ & కజక్స్తాన్ 1994- స్విట్జర్లాండ్ & జర్మనీ దేశాలకు మేధావి, భారత ప్రధాని శ్రీ పి.వి.తో కలిసివెళ్ళే అవకాశం మీకు రావడం గొప్ప సంతోషాన్ని కలిగించింది. మీకా అర్హత వుంది- మీ నీతి, నిజాయితీలు, మీ శ్రమ, మీ అకుంఠితదీక్ష, సత్ప్రవర్త నతో మీరు సాధించిన ఘన విజయానికి లభించిన గౌరవ పురస్కారం అది. బహు అరు దుగా లభించే ఈ గౌరవ పురస్కారం మీకు లభించ డం చాలా గొప్ప విషయం.

ఒక ప్రాంతీయ పత్రికకి జాతీయస్థాయిని- గౌరవాన్ని ఆపాదించిపెట్టిన మీ వ్యక్తిగత ప్రతిభకు పట్టం ఈ పర్యటన.
—సూర్యదేవర రామ్మోహన్ రావు, హైదరాబాద్

★ నా ఆనందాన్ని చెప్పడా నికి మాటలు చాలడంలేదు. మేమంతా, స్వాతి పాఠకు లంతా గర్వించదగ్గ సమయ మిది. ప్రైమ్‌మినిస్టర్‌తో స్విట్జ ర్లాండ్, జర్మనీలకు ప్రయా ణించడం స్వాతికి దక్కిన ఘనమైన గుర్తింపు. కంగ్రాచ్యు లేషన్స్.
—జయదేవ్, మద్రాసు

★ పాత్రికేయరంగంలో మీరు చేసిన కృషి, సాధించిన విజ యం గురించి ప్రత్యేకించి చెప్పనక్కర్లేదు. కనుకనే ప్రధానితో పర్యటించిన పాత్రి కేయబృందంలో స్వాతి సపరి వార పత్రిక రెండోమారూ స్థానాన్ని దక్కించుకుంది. ఇది స్వాతికి తగిన అర్హత. తెలుగు పాఠ కులకు వినోదాన్నీ, విజ్ఞానాన్నీ, విద్యనీ, మన సాంస్కృతిక సంపదలోని విలు వల్నీ అందజేస్తున్న స్వాతి చిరకాలం వర్ధిల్లాలి.
—మాలతీచందూర్, ఎన్.ఆర్.చందూర్, మద్రాసు

★ శ్రీ వేమూరి బలరామ్ గారు స్విట్జర్లాండ్, జర్మనీ దేశాల్ని ప్రధానితో పర్యటించి- అక్కడి ప్రకృతిని తెలుగునాట- మన ముంగిట పరచి సగటు మనిషికి అంతగా ఆసక్తి వుండని విదేశీ, స్వదేశీ ఆర్థికవిధానాలను అలవోకగా, వినూత్నంగా, విస్పష్టంగా విపులీకరించి తెలుగువాడి మూడోకన్ను (జ్ఞాననేత్రం- అగ్నికణం కాదు!) తెరిపించినందుకు కృతజ్ఞతాభివందనాలు తెలి యజేస్తున్నాను.

ఏ దేశమేగినా
ఎందు కాలిడినా
తల్లి భూమిభారతిని పొగిడి
పొగడు పూదండలో
పూజించే సాహితీ
కళామతల్లి స్వాతి.
తెలుగునాట
స్వాతి స్థానం సుస్థిరం
సుమధురం పదిలం.
—డి. ప్రభాకర్, హైదరాబాద్

★ 'స్వాతి' ప్రపంచం చుట్టి వస్తే- ఆంధ్రుల జ్యోతి ప్రపం చం చుట్టివచ్చినట్టు! దృశ్యా త్మకమైన మీ వివరణను చదివి మేమూ ఆ యా ప్రదేశాల్ని దర్శించినంత అనుభూతిని పొందాం. ఇలాగే స్వాతి పత్రిక అన్ని కోణాల్లోనూ పాఠకుడ్ని చైతన్యవంతుడ్ని చేస్తూ మును ముందుకు సాగాలనీ, సారస్వత సువాసనల్ని వెదజల్లుతూ సమున్నత శిఖరాలకు చేరా లనీ మనసా, వాచా, కర్మణా కోరుతూ మహదానందాన్ని అనుభవిస్తూ, మనఃపూర్వక మైన శుభాకాంక్షల్ని తమకు అందజేస్తూ- —బొల్లిముంత నాగేశ్వరరావు, తెనాలి

★ సరళీకృత ఆర్థికవిధానం నేపథ్యంలో ప్రధాని పర్యట నలు అవశ్యం జరగాలి. ప్రధాని ప్రసంగపాఠాన్ని చక్కగా అం దించారు.

పాకిస్తాన్ పేరు ఎత్తకుం డానే వారి కుతంత్రాలను అనేకసార్లు విజయవంతంగా ఎదుర్కొన్నామని చెప్ప డంలో ప్రధాని ఆత్మవిశ్వాసం చెదరని దృఢ సంకల్పం ద్యోతక మయ్యాయి.

ఈ వ్యాసం ప్రచు రించి ఆ మేరునగ ధీరుని ఔన్నత్యాన్ని చాటి చెప్పారు. కృతజ్ఞతలు.

'మన దేశం అతివేగంగా విజయవంతమైన పురోగతి సాధిస్తున్న దేశం' అనడం వాస్తవానికి దగ్గరగా వుంది.
—ఆవసరాల శంకరనారాయణరావు, విశాఖపట్నం

కొత్త సీరియల్ ప్రారంభం

# రాత్రి వా ఇంటిదాకా

మేర్లపాక మురళి



బెడ్‌రూమ్‌లో నిద్రను మొక్కగా నాటితే చీకటి తేమకు పెరిగి కలల పూలను పూస్తుంది. కల అంటే జీవితానికున్న కిటికీ- అలాగని ఎవ రన్నది?

ఫ్రాయిడ్? లేకుంటే హేవలాక్ ఎల్లీస్.

తనని ఇప్పుడు ఎవరైనా హిప్నటైజ్ చేసి, ట్రాన్స్‌లోకి నెట్టేస్తే- ఏమడిగినా తను చెప్ప బోయేది ఒక పేరే- సు...జ...న... మనసులోని మూడు అరల్లోనూ నిండిపోయి, మరో ఆలోచనకు తావులేకుండా చేస్తున్న జీవి.

జీవితంలో ఇప్పటికే రెండక్షరాలను ఆక్ర మించుకున్న ఆ 'జీవి'తో ఫస్ట్‌నైట్ కూడా జరిగిపోతే మొత్తం వామనదేవుడిలా ఆక్రమించేసుకుంటుంది.

వామనదేవుడు పుంలింగం కదా- మరి స్త్రీలింగం వామనదేవి కాబోలు. ఈ లింగభేదం స్త్రీలను ఎంత హీనస్థితిలోకి నెట్టేసింది- సిమోన్ దిబోవర్లు, కౌత్ మిల్లెట్‌లూ- ఇంకా ఎందరు పుడితే ఈ పురుష ప్రపంచం మారుతుంది? లేకుంటే తన మామ, కూతురుమీద అంత అధికారం చెలాయిస్తాడా? ఆమె ఫస్ట్‌నైట్‌కికూడా ఈయనే ముహూర్తం నిర్ణయించాలా!

ఇప్పుడు మంచి ముహూర్తం లేదని ఫస్ట్‌నైట్‌ని పోస్ట్‌పోన్‌చేశాడు. శోభనం అంటే వాయిదావేసే విష యమా? జాస్మిన్లూ, మూన్‌లైటూ ఎప్పుడంటే అప్పుడొస్తాయా? గురజాడ కన్యాశుల్కం శతజయంతి ఉత్సవాలు జరుగుతున్న ఈ రోజుల్లో కూడా ఇలాంటి దారుణాలు ఎన్నో జరిగిపోతున్నాయి. లేకుంటే ఫస్ట్‌నైట్‌కి కూడా మంచి ముహూర్తాలూ, శాస్త్రాలూ, గర్భా దానం మంత్రాలు ఏమిటి? ఖర్మకాకపోతే.

మామా! నీలాంటి మూర్ఖుడికి అంత తెలివైన, అందమైన అమ్మాయి ఎలా పుట్టింది? నిజంగా నీకే పుట్టిందా...? పాపం ఉపశమించుగాక- మామమీద కోపం అత్తమీద చూపించడం ఏమీ బాగాలేదు.

ఇప్పుడు కావాల్సింది ఉపశమనాలు కాదు. అర్జెంట్‌గా సుజనతో శయనించడం. వాత్స్యాయనుడి కామసూత్రా లను కళ్ళ భాషలోకి తర్జుమాచేసుకుని, శరీరాలమీద రాసుకోవడం. శృంగార పారవశ్యం ఎలావుంటుందో తను పూజాబేడి ముఖం చూసి తెలుసుకున్నాడు. తనకు ఆ విషయంలో ఆఆలు కూడా తెలియవు. తను ఎప్పుడూ ఆడపిల్లతో గడపలేదు. కనీసం బ్లూ ఫిల్మ్ కూడా చూళ్ళేదు. కిన్సీ రిపోర్ట్ గురించి వినడమే తప్ప చదవలేదు.

యూనివర్సిటీలో అప్పుడప్పుడూ దొంగచాటుగా బ్లూఫిల్మ్‌లు వేసుకుని చూసేవాళ్ళు స్టూడెంట్స్. అరవై రూపాయలు అద్దెకట్టి వీడియో కేసెట్ ప్లేయర్ తెచ్చుకోవడానికి బదులు, ఆ డబ్బుకి ఆడపిల్లనే తెచ్చుకోవడం బెటర్‌కదా అని రూమ్మేటు జోక్ చేస్తుండేవాడు. తను ఎప్పుడూ అలాంటి చీకటి సాహ సాలు చేయలేదు. సుజనను బట్టల్లేకుండా ఊహించుకో లేకపోవడానికి ఇదే కారణం. ఎదిగిన ఆడపిల్ల అనాటమీ తెలియదు.

మొన్న పెళ్ళి రోజునే ఆడపిల్ల బొడ్డును అంత దగ్గరగా చూడడం. పెళ్ళిపీటలమీద సుజన పట్టుచీర పక్కకు తొలిగినప్పుడు అక్కడే తన చూపులు అతుక్కుపోయాయి.

మెడలో పూలదండ వున్నప్పుడు గులాబీ రేకుల పొట్లంలా కనిపించిన బొడ్డు, అక్షింతలు పడినప్పుడు



పచ్చగన్నేరైె.తలంబ్రాలు చల్లేప్పుడు బొండు మల్లిలా భ్రమ కల్గించి.చివరికి హోమంచుట్టూ ప్రదక్షిణాలు చేస్తున్నప్పుడు బంగారు పుష్పంలా విచ్చుకుంది.

అక్కడినుంచి కిందకి పట్టుచీర జరీఅంచు చూపులను జారనివలేదు. ఈ కేళీ విలాసాలన్నీ ఊహలకే పరిమితమా? ముహూర్తం కుదిరి శోభనం జరుగుతుందా? లేక ఈ జన్మకి ఇలా ఘోటకబ్రహ్మచారిలా—

"వంశీ...వంశీ..."

తల్లి పిలవడంతో నిద్రకాని. మగతకాని పొద్దెక్కేవరకు అతను పడుకోడు. కానీ ఇప్పుడతను కొత్త పెళ్ళికొడుకు. అయిదురోజుల క్రితమే నెల్లూరు టౌన్‌లోని ఓ సత్రంలో సుజనతో అతని పెళ్ళి జరిగింది.

ఇద్దరిదీ ఒకే ఊరు. ఆ ఊర్లో మొత్తం అయిదు వందల గడపలున్నా రెండే వీధులు. ఆ వీధిలో సుజన ఇల్లుంటే, ఈ వీధిలో అతని ఇల్లుంది. ఈ ఇంటి వరండాలో నిలబడితే ఆ ఇంటికిచెన్ పొగగొట్టం కన్పిస్తుంది.

స్థితిలో మంచంమీద అటూ ఇటూ దొర్లుతున్న అతను లేచి కూర్చున్నాడు.

అప్పుడు టైమ్ ఉదయం పదిగంటలైంది. బంగారు రంగు ఎండ కిటికీ నీడను బెడ్‌షీట్‌మీద అచ్చొత్తుతోంది. ప్రహరీగోడకు ఆనుకుని వున్న కొబ్బరిచెట్టు తల కటింగ్ చేసుకున్నట్లు ముస్పాతిక భాగం కనిపిస్తోంది. దానికి ఇవతల వున్న బోగన్‌విల్లా కొమ్మలు కిటికీమీద పరుచుకుని ఎర్రటిపూల ఎంబ్రాయిడరీ వున్న ఆకు పచ్చటి పరదాలా గాలికి అటూ ఇటూ ఊగుతోంది.

మామూలుగా అయితే అంత ఇంత దగ్గరలో భార్యాభర్తలున్నా కలుసు కోలేని విచిత్రమైన పరిస్థితుల్లో చిక్కుకుపోయారు.

పెళ్ళికాగానే శోభనాన్ని ఏర్పాటుచేశారు. తీరా ముహూర్తం దగ్గర పడిందనగా సుజనకు 'ఇబ్బంది' ఎదురైంది. ఇక ఆ మూడు రోజులూ వీలుకాదు కనుక దగ్గర్లో ఏదైనా మంచి ముహూర్తం వుందేమో చూడమని పురోహితుణ్ణి అడిగాడు సుజన తండ్రి సత్యనారాయణరావు.

ఆయనకి ఈ ముహూర్తాలూ. జ్యోతిష్యాలూ అంటే తెగనమ్మకం. పంచె కుచ్చిళ్ళు పోయడానికైనా పంచాంగం చూసేరకం. దగ్గర్లో మంచి ముహూర్తాలు లేవనీ.

## పాలబేబీ

బోరింగు పాప, జానాబెత్తెల జానమ్మ జయలలిత చాలా గ్యాప్ తర్వాత వస్తూ మరో కొత్త పేరుతో కనబడబోతోంది. 'హోడీకోడళ్ళు' లో 'పాలబేబీ'గా నూతన అవతారం దాల్చుతున్న జయలలిత ఉత్సాహాన్ని పుంజుకుంటోంది. "బోరింగు పాప లెవల్లో ఈ 'పాలబేబీ' పాపులరవుతుంద"ని చెప్పున్న జయలలిత, "ఈ సంవత్సరం నేను మళ్ళీ బిజీ అవుతాను" అని సంబరంగా అంటోంది.

"హీరోహీరోయిన్లు ఎంత హాస్యం చేసేసినా, మా అవసరం వుండకపోదు. మేము ఏ స్థాయి(?) హాస్యమైనా చేయగలం. హీరోయిన్లు అలా చేయలేరుగా. అందుకే మా అవసరం వుంటుంది" -అని తనని తాను హాస్యనటిగా వివరిస్తోందీ సెక్సీ చమక్కుల కామెడీ తార.



ఖచ్చితంగా నెల తరువాత ముహూర్తం వుందనీ, దానినే నిర్ణయించుకోమనీ పురోహితుడు చెప్పడంతో మరో ఆలోచనకు తావివ్వకుండా, దానినే ఖరారు చేశాడు.

పద్ధతి పాటించే రకం గనుక ఆయన అల్లుడ్ని పిలిచి- "ఇలా అయినందుకు నాకూ బాధగా వున్నా ఆ సర్వేశ్వరుడి సంకల్పాన్ని కాదనలేముగదా. మీ గర్భాదాన కార్యక్రమాన్ని వచ్చే నెల రెండో తేదీ నిర్ణయించాం. శోభనం అయ్యేవరకు భార్యాభర్తలు ఒకే ఇంట్లో వుండడానికీ, కలిసి తిరగడానికీ, మాట్లాడుకోవడానికీ శాస్త్రాలు ఒప్పుకోవు. గనుక నీ ఇంట్లో నువ్వూ, మా ఇంట్లో సుజనా వుండండి. అదిగో ఆ ముచ్చట అయిపోయాక ఆ తరువాత మీ ఇష్టం. హనీమూన్‌కైనా వెళ్ళండి- లేదూ ఈ పల్లెటూరులో అయినా గడపండి" అని ఖరాఖండిగా చెప్పాడు.

వింటున్న వంశీకి గొంతులో వెలక్కాయ ఇరుక్కుపోయినట్లు ఊపిరాడలేదు. నెలరోజులు ముహూర్తం కోసం ఎదురుచూడడమంటే కనపడే చందమామ చేతికి దొరక్కపోవడమే. కానీ అంతకంటే చేసేదీ ఏమీలేదు గనుక అలాగేనన్నట్లు బలవంతంమీద తల ఊపాడు.

అందుకే గత నాలుగు రోజులుగా అలా మంచం మీద అటూ ఇటూ దొర్లుతున్నాడే తప్ప అవతలి వీధిలో వున్న మామగారి ఇంటికి కూడా వెళ్ళలేదు. భార్య అయిన ప్రేయసిని చూడనుకూడా లేదు.

అవును! వాళ్ళిద్దరూ లవర్స్. సంవత్సరం క్రితమే యూనివర్సిటీలో వాళ్ళ పరిచయం చాలా గమ్మత్తుగా జరిగింది.

అప్పుడతను యూనివర్సిటీలో ఎం.ఏ. సోషియాలజీ ఫైనలియర్ చదువుతున్నాడు. ఓ తెలుగు ప్రొఫెసర్ ప్రోత్సాహంతో కొందరు స్టూడెంట్స్ కలిసి 'లిటరరీ సర్కిల్' అనే సాహితీ సంస్థను ఏర్పాటుచేశారు. దానికి వంశీ కార్యదర్శి. వెంటనే 'చలం నవలల్లో స్త్రీ పాత్ర' అనే అంశంమీద ఓ ఆదివారం సాయంకాలం మీటింగ్ ఏర్పాటుచేశారు.

యూనివర్సిటీ ఆర్ట్స్ బ్లాక్ ఆడిటోరియంలో నాలుగు గంటలకు మీటింగ్ జరుగుతుందనీ, అందరూ రావాలనీ కరపత్రాలు ముద్రించి యూనివర్సిటీ అంతా పంచారు. ఆదివారం రానేవచ్చింది.

మూడుగంటలకే నిర్వాహకులంతా ఆడిటోరియంకు చేరుకున్నారు. ఉపన్యాసకులంతా ఒక్కొక్కరే రావడం మొదలుపెట్టారు. రానిది స్టూడెంట్సే. మూడుముప్పావయినా ఒక్కస్టూడెంట్‌కూడా అటు చూసిన పాపాన పోలేదు. నిర్వాహకులకు చెమటలు పడుతున్నాయి. ఏంచేయాలో పాలుపోవడంలేదు.

"వ్వాట్ హేపెండ్? ఒక్కరూ రారేమిటి? శ్రోతలేకుండా మీటింగ్ ఎలా నడపడం?" సంస్థ అధ్యక్షుడు శర్మ నెర్వస్‌గా అడిగాడు.

"స్టూడెంట్స్‌లో చాలామంది అడవిరాముడు బెనిఫిట్ షోకు వెళ్ళిపోయారని వార్త. చెప్పేవాడికి వినేవాడెప్పుడూ లోకువే అన్న సామెతను ఇప్పుడైనా రివర్స్ చేసుకోండి" వంశీ తనకు తెలిసిన సమాచారం చెప్పాడు.

"అలాంటి అతితెలివి జోకులెయ్యకు. ఇప్పుడు జరగాల్సింది చూడు. ఈ గండం నుంచి బయటపడేందుకు నాకు ఒక్కటే మార్గం కనిపిస్తోంది. మనలో ఎవరో ఒకరం లేడీస్ హాస్టల్‌కి వెళ్ళి కొంతమందినైనా బ్రతిమలాడో, బుజ్జగించో తీసుకురావడం" మరో కార్యదర్శి స్వామినాథం సలహా ఇచ్చాడు.

అప్పుడు విప్పారింది శర్మ ముఖం. "ఎవరో ఎందుకు? వంశీనే వెళతాడు. మనకు బాగా పరిచయం వున్నవాళ్ళు ఒక్కరూ లేరు" స్వామినాథంతో అని వంశీవైపు తిరిగి "మీ ఊరమ్మాయి ఈమధ్యే ప్రీవియస్‌లో చేరిందికదా. ఆమెను కలిసి, ఆమెతో పాటు కొందర్ని తీసుకొచ్చే ఏర్పాటు చెయ్. కమాన్ క్విక్" అని తొందరపెట్టాడు.

"నేనా? నావల్లకాదు. సుజనది మా ఊరేకానీ, చిన్నప్పట్నుంచీ మద్రాస్‌లో చదువుకుంది. ఆమెను పెంచుకున్న మద్రాసు పిన్ని ఇటీవల చనిపోవడంతో ఇక్కడికి వచ్చి చేరింది. ఎప్పుడో సంవత్సరం క్రితం మా ఊరి బస్టాండ్‌లో దూరం నుంచి చూడడం తప్ప ఎప్పుడూ పలకరించిన పాపానపోలేదు. ఇక్కడ చేరాక కూడా ఎదురుపడి ఒకరికొకరు చూసుకోనైనాలేదు"

కానీ శర్మ వినలేదు. బలవంతాన హాస్టల్‌కు అతన్ని తరిమాడు.

హాస్టల్ గేటుతీసుకుని లోపలికి వెళుతుంటే అతని కాళ్ళు వణికాయి. కళ్ళు బైర్లుకమ్మాయి. కానీ తమాయించుకున్నాడు.

సెంట్రీ కనపడగానే-"సుజన- సోషియాలజీ ప్రీవియస్- ఈమధ్యే చేరింది. రూమ్‌నెంబర్ తెలియదు" అని వినిపించీ వినిపించనట్టు చెప్పాడు.

సెంట్రీ గుర్తుపట్టాడు. వరండాలోకి వెళ్ళి "రూమ్ నెంబర్ పదకొండూ- సుజన- రూమ్ నెంబర్ పదకొండూ" అని గట్టిగా అరిచాడు.

మరో నిముషానికి సుజన వచ్చింది. ఆమె రాగానే విజిటర్‌ని చేత్తో చూపించాడు సెంట్రీ.

ఆమెను చూడగానే చిన్న జర్క్ ఇచ్చాడతను.

పౌర్ణమిరోజున సముద్రపు ఒడ్డున నిలబడి చూస్తే నీళ్ళల్లో చేపపిల్ల పొలుసులా మెరిసే వెన్నెల రేఖ. సువాసన తప్ప మరో అస్తిత్వం లేనట్టు ఆకుల మధ్య ముఖం దాచేసిన మొగలిరేకు. సాయంకాలం

## మూంగ్ ఖీర్



**కావలసినవి :** అరకప్పు పెసరపప్పు, అరకప్పు బియ్యం, 1 లీటరు పాలు, అర టిన్ కండెన్స్‌డ్ మిల్క్, 1 కప్పు ఫ్రెష్ కోకోనట్ మిల్క్, కిస్‌మిస్, బాదం, ఏలకుల పొడి, నెయ్యి, జీడిపప్పు.

**తయారుచేసే విధానం :** నెయ్యి కొద్దిగా వేసి, పెసరపప్పు లైట్ బ్రౌన్‌గా వచ్చేవరకూ వేయించాలి. బియ్యం కడిగి, బియ్యంలో పెసరపప్పు వేసి తగినంత నీరు పోసి ప్రెషర్ కుక్కర్‌లో వుంచాలి. (విడిగానైనా వండవచ్చు) ఉడికాక దించాలి. నేతిలో జీడిపప్పులు, కిస్‌మిస్, బాదంపప్పులను వేయించి తీయాలి. దళసరి గిన్నెలోగానీ లేదా పాన్‌లోగానీ పాలు పోసి, బాగా కాగాక, దాంట్లో ఉడికిన పెసరపప్పు, బియ్యం వేసి బాగా కలపాలి. సిమ్‌లో వుంచి ఉడకనివ్వాలి. అప్పుడు దాంట్లో కొబ్బరిపాలు పోసి, 5 నిమిషాలయ్యాక దాంట్లో కండెన్స్‌డ్ మిల్క్ వేసి బాగా కలపాలి.

కొద్దిగా గట్టిపడుతోందన్నప్పుడు దానిలో ఏలకుల పొడి వేసి, బాగా కలిపి పొయ్యిమీద నుండి దించాలి. అప్పుడు జీడిపప్పులు, కిస్‌మిస్, బాదంపప్పులతో మూంగ్‌ఖీర్‌ను అలంకరించండి. ◆

పూట లోయలోకి ఇంకిపోయే సంధ్యకాంతీ, ఆకాశంలో దక్షిణం నుంచి ఉత్తరానికి కట్టిన తోరణం గాలికి ఎగిరిపోతున్నట్టు సాగే పక్షుల గుంపూ- ఇలా చాలా చాలా గుర్తొచ్చాయి అతనికి.

ఆడపిల్ల ఎంత డిగ్నిఫైడ్‌గా వుండడానికి వీలుందో అంత డిగ్నిఫైడ్‌గా వుంటుందామె. చూడగానే ఏదో గౌరవభావం ఎదుటి వ్యక్తిలో గూడుకట్టుకుపోతుంది. ఆమె అందంకూడా అలాంటిదే. మీదపడి రక్కేయ్యాలనిపించదు. పాదాలముందు కూర్చుని ఆరాధనతో చూస్తూ తన్మయత్వం అనుభవించాలనిపిస్తుంది.

అందుకే అతను భాష మరిచిపోయాడు. ఎవరన్నట్లు చూస్తూ ఆమె దగ్గరికి వచ్చినిలబడ్డా నోరు పెగల్లేదు.

"మీరు" అంటూ ఆగింది.



## జాకీ ఛాయిస్

"మా పిల్లలు పెద్దయ్యాక ఏ వృత్తిలో స్థిరపడాలో అప్పుడే నేనాలోచించేశాను" అని ఆనలుసిసలు తండ్రిలా సంబరపడుతున్నాడు జాకీష్రాఫ్.

"మా అబ్బాయి పైగరేమో డైరెక్టర్, అమ్మాయి కృష్ణ డాక్టర్ ఆవాలనుకుంటున్నాను. మేం కేవలం వినోదాన్ని అందిస్తాం. కాని, డాక్టర్లు ప్రాణాలు కాపాడతారు కదా!" అంటూ తన ఛాయిస్ వెనుక కారణాన్ని కూడా అందరికీ వినిపిస్తున్నాడు జాకీష్రాఫ్.

అప్పటికి సర్దుకున్నాడు. "నా పేరు వంశీ. సోషియాలజీ ఫైనలియర్. మనది ఒకే ఊరు. అయినా పరిచయం లేదు" అన్నాడు.

"మిమ్మల్ని ఎప్పుడూ ఊర్లో చూసినట్టు గుర్తు లేదే"

"మీరు ఎప్పుడు ఊర్లో వున్నారుగనుక? మద్రాసులోనే వుండి, చుట్టంచూపుగా అప్పుడప్పుడూ వచ్చేవాళ్ళు. దిగువ వీధిలో మా ఇల్లు. మా నాన్న రామారావు. రెండేళ్ళ క్రితం చనిపోయారు"

"ఆఁ గుర్తొచ్చారు"

ఇక ఫరవాలేదనిపించి అవీ ఇవీ ఓ అయిదు నిముషాలపాటు మాట్లాడి- అసలువిషయం చెప్పాడు.

"రాజకీయ నాయకులకే కాదు- మీకూ జనం పోగుచేసే బాధ తప్పడంలేదన్నమాట. అడవిరాముడు ధాటికి చలం నిలబడలేకపోయాడా?" అని నవ్వింది.

అతనూ ఆమెతో శ్రుతి కలిపాడు.

"అయితే మీరెళ్ళండి. ఇప్పుడు అందరి దగ్గరికీ వెళ్ళి చెప్పి తీసుకురావడం వీలుకాదు. కానీ చిన్న ట్రిక్ ప్లేచేస్తాను. మీ ఆడిటోరియం నిండిపోతుంది" అంది.

ఆ ట్రిక్ ఏమిటో అతను అడగలేదు. ఆడిటోరియం నిండితే అదే చాలనుకుని ఆమె దగ్గర సెలవు తీసుకుని వచ్చేశాడు.

నిర్వాహకులంతా ఆడిటోరియం మెట్లమీద నిలబడి జనం కోసం ఆత్రుతతో ఎదురుచూస్తున్నారు. అయిదునిముషాల తరువాత ఓ అమ్మాయిల గుంపు లైబ్రరీ వైపునుంచి అటుకేసి రావడం కనిపించింది.

"వాళ్ళంతా మీటింగ్‌కేనా?" సందేహంగా అడిగాడు శర్మ.

"ఆఁ మా ఊరమ్మాయి పిలుచుకొస్తోంది. కానీ ఆడిటోరియం నిండిపోతుందని చెప్పి- అదేమిటి ఓ పదిమందిని మాత్రమే వేసుకొస్తోంది" వ్యగతంలా చెప్పాడు వంశీ.

సుజన ఏమీ మాట్లాడకుండా అతనివైపు చూసి, పంకరింపుగా నవ్వి లోనికెళ్ళి కూర్చుంది.

"ఆ పదిమందైనా వచ్చినందుకు సంతోషించు. ఇప్పటికే నాలుగున్నరకావస్తోంది. మీటింగ్ మొదలు పెట్టేద్దాం" శర్మ హడావుడి చేస్తూ లోపలికి లాక్కెళ్లాడు.

మీటింగ్ ప్రారంభమైంది. మొదటి వక్త ఉపన్యాసం మొదలు పెట్టాడు. అదిగో అప్పుడు ప్రారంభమైంది అబ్బాయిల వెల్లువ. గుంపులు గుంపులుగా అబ్బాయిలు వస్తూనే వున్నారు. మరో పావుగంటకు ఆడిటోరియం నిండిపోయింది.

వక్తలంతా పూనకం వచ్చినట్లు మాట్లాడారు. సూపర్‌ఫ్లాప్ అవుతుందనుకున్న మీటింగ్ సూపర్ డూపర్ హిట్ అయింది.

జనం అంతా వెళ్ళిపోతున్నారు.

ఇంతకీ సుజన ప్లేచేసిన ట్రిక్‌ఏమిటో తెలుసుకోవాలన్న ఉత్సాహంతో వంశీ గేటు దగ్గర నిలబడ్డాడు.

ఆమె రాగానే థాంక్స్ చెప్పి "ఇంతకీ ఏం మాయ చేశారు?" అని అడిగాడు.

"వెరీ సింపుల్- తిరునాళ్ళకీ, జాతర్లకీ స్టూడెంట్స్ ఎందుకెళతారు? మీ పరిభాషలో చెప్పాలంటే 'కలర్స్' కోసం. ఆ కలర్స్ ఈ మీటింగ్‌లోనూ వున్నాయని చెప్పడానికి అమ్మాయిల్ని వెంటేసుకుని అలా మెన్స్ హాస్టళ్ళ గుండా నడిచి ఇక్కడికి చేరుకున్నాం. మేం ఎక్కడికి వెళుతున్నామో అబ్బాయిలకు తెలిసేటట్లు గట్టిగా మాట్లాడుకున్నాం. దట్సాల్" అని నవ్వి అక్కడి నుంచి కదిలింది.

పౌర్ణమి రోజున పండువెన్నెల్లో బిర్లామందిర్ కొసన నిలబడి నక్షత్రాలను కోసుకొన్నట్లు ఫీలయ్యాడు అతను ఆమె నవ్వును చూసి.

ఇది జరిగిన నెలరోజులకు జూనియర్లు సీనియర్లకు ఇచ్చే వేలిడిక్టరీ ఫంక్షన్ జరిగింది. లాటరీలో అయిదు లక్షల రూపాయిలు వస్తే ఏంచేస్తారో చెప్పాలని అమ్మాయిలకు సరదాగా ఓ పరీక్ష పెట్టారు.

ప్రీవియస్ అమ్మాయిలు ఒక్కొక్కరే డయాస్ మీదకు వచ్చి చెబుతున్నారు.

కొందరు భర్తను కొనుక్కొంటామన్నారు. ఆ జవాబుకి హాలంతా చప్పట్లతో మార్మోగింది. ఓ అమ్మాయి అయితే తనకు ఇష్టమైన కుక్కల్ని కొని పెంచుకుంటానంది. ఈసారీ చప్పట్లు మ్రోగాయి.

చివరికి సుజన వంతు వచ్చింది.

వంశీ అటెన్షన్‌లోకి వచ్చాడు. ఆమె ఏం చెబు

తుందో వినడానికి కాస్తంత ముందుకి వంగాడు.

సుజన మైక్ ముందు నిలబడి "ఆ డబ్బుతో ప్యాకెట్ సైజు భగవద్గీతలా శ్రీశ్రీ మహాప్రస్థానాన్ని ముద్రించి, ప్రతి వీధిమూలనా నిలబడి బైబిల్‌లా అందరికీ పంచిపెడతాను" అంది.

ఎవరూ చప్పట్లు చరచలేదు– ఒక్క వంశీతప్ప. నిశ్శబ్దంలోంచి దూసుకొస్తున్న అభినందనల్లా అని పిస్తున్న ఆ శబ్దాలను వింటూ డయాస్ దిగింది. ఆమె తిరిగి తన సీట్లో కూర్చొనేంతవరకు అతను అలా చప్పట్లు చరుస్తూనే వున్నాడు.

అదిగో ఆ క్షణంలో అతను ఆమె ప్రేమలో పడి పోయాడు. అయితే అతను అందరి అబ్బాయిల్లా ఆమె వెంటబడి విసిగించలేదు. కుళ్ళుజోకులు వేస్తూ ఆకర్షించాలని ప్రయత్నించలేదు.

ఆ రోజునుంచి ప్రతి రాత్రీ ఆమె పట్ల కలుగుతున్న భావనలనీ, అల్లుకుంటున్న వెర్రిఊహల్నీ, రాత్రిని రంగులమయం చేస్తున్న కలల్నీ– అన్నిటినీ రాయటం మొదలుపెట్టాడు.

ప్రిపరేషన్ హాలిడేస్ అయిపోయి రేపటినుంచి పరీక్షలు మొదలవుతాయనగా ఆ రోజు సాయంకాలం ఆమె దగ్గరికి వెళ్ళాడు. కాఫీ తాగుదామని క్యాంటీన్‌కి ఆహ్వానించాడు.

క్యాంటీన్‌లో కాఫీ తాగాక తను తీసుకొచ్చిన రెండు వందల పేజీల చొప్పున వున్న పద్నాలుగు నోటు బుక్కులను ఆమె ముందుంచాడు.

"వేలిడిక్టరీ ఫంక్షన్ రోజునుంచి మీమీద నాకున్న ప్రేమనంతా– ఇదిగోండి ఈ సుదీర్ఘ లేఖలో మొర పెట్టుకున్నాను. మొత్తం రెండువేల ఎనిమిది వందల పేజీలయ్యాయి. చదువుకోండి– పరీక్షలైపోయిన రోజున వస్తాను. నామీద మీ అభిప్రాయం ఏమిటో చెప్పండి" అని కాసేపాగి– "ఇన్ని పుస్తకాలు మోయ లేరనుకుంటాను. హాస్టల్ వరకు తెచ్చిస్తాను" అన్నాడు.

ఆమె వద్దన్నట్లు తల ఆడించి "మోసుకుపోగలను" అంది. ఇక మరో మాట మాట్లాడకుండా అక్కడినుండి వచ్చేశాడు.

ఖచ్చితంగా పరీక్షలైపోయిన చివరి రోజున హాస్టల్‌కి వెళ్ళాడు. ఇతని కోసమే వెయిట్ చేస్తున్న ఆమె మౌనంగా అతన్ని అనుసరించింది. నిజమైన పరీక్ష ఇప్పుడే మొదలైందనుకున్నాడు. జీవితంలో మొదటి సారి అతను టెన్షన్ అనుభవిస్తున్నాడు.

ఇద్దరూ క్యాంటీన్ చేరుకున్నారు.

సీట్లో కూర్చున్నాక అతన్ని తదేకంగా చూస్తున్న ఆమె ఒక్కసారిగా బరస్ట్ అయిపోయింది. కన్నీళ్ళు వరదలా తన్నుకొచ్చాయి. చుట్టూవున్న వాళ్ళు తమను గమనిస్తున్నారనైనా చూడకుండా ఏడ్చేసింది.

అతను కంగారుపడ్డాడు. ఎందుకు ఏడుస్తోందో తెలియని అతనికి ఎలా సముదాయించాలో కూడా తెలియడంలేదు.

తనను తాను కంట్రోల్‌చేసుకోవడానికి విఫల యత్నం చేస్తూ చెప్పింది. "ఇంత ప్రేమని, ఇంతటి అభిమానాన్ని తట్టుకోవడం సాధ్యమేనా? ఈ చిన్న గుండె ఎన్నిసార్లు రెపరెపలాడిందో ఎలా చెప్పగలను?

మీ ఉత్తరం చదువుతూ ఎన్నిసార్లు ఏడ్చానో, ఎన్నిసార్లు నవ్వానో, ఎన్నిసార్లు నన్ను నేను స్వప్నాల్లోకి విసిరేసుకున్నానో ఎన్నిసార్లు తన్మయత్వంతో ముడుచుకుపోయానో ఎలా చెప్పగలను?

మిమ్మల్ని చూడాలన్న బలమైన కోర్కెని అణుచు కోవడానికి ఎంతగా ఏడ్చానో మీకెలా వివరించగలను? అక్షరాల అభిషేకం అంటే ఇదే కాబోలు. మనసా వాచా కర్మణా నేను మీదాన్ని అని చెప్పడంకన్నా నేను మీకేం ఇవ్వగలను?"

అప్పుడు వంశీ ఎలా ఫీలయ్యాడో అతనే చెప్ప లేడు. భావోద్వేగాలమధ్య వాళ్ళిద్దరూ భాష మరిచి పోయారు ఆ క్షణాల్లో.

ఆ తరువాత వంశీ ఊరికి వచ్చి, అంతవరకు కౌలుదారులు చేస్తున్న తమ భూమిని తీసుకుని వ్యవ సాయం ప్రారంభించాడు. ఆమె ఫైనలియర్‌కి వచ్చింది. అప్పుడప్పుడూ ఇద్దరూ యూనివర్సిటీలో కలుసుకునేవాళ్ళు. ఆమె పరీక్షలు రాశాక, ఇక రెండు మూడు రోజుల్లో ఊరికి వస్తుందనగా అతను వెళ్ళి హాస్టల్‌లో కలిశాడు.

"నాకెంత ఆనందంగా వుందో చెప్పలేను. ఇక నుంచీ ఇద్దరం ఒకే ఊర్లో వుంటాం. మొన్న సండే ఊరికి వచ్చినప్పుడు మా వరండాలోంచి చూస్తే మీ ఇంటిముందుండే కొబ్బరిచెట్టు కనిపించింది. అచ్చు నిన్ను చూసినంత ఆనందం కలిగిందనుకో. చెట్టునీ, పుట్టనీ భగవంతుడని ఎందుకు మొక్కుతారో ఈ జనం అనుకునేదాన్ని ఇన్నిరోజులూ. కానీ మనం ఆరాధించే వ్యక్తికి సంబంధించింది ఏదైనా అతని ఉనికినే తెలియజేయడంతో వాటిపట్లకూడా మనసు ఆరాధన మొదలవుతుందని ఆ క్షణంలో అనిపించింది. లేకుంటే మీ ఇంటి కొబ్బరిచెట్టు చూసి అంత ఆనందపడడమేమిటి?" అంది.

అతను నవ్వుతూ వుండిపోవడంతో తిరిగి ఆమె ప్రారంభించింది.

"ఇక నిన్ను చూడకుండా ఒక్కక్షణం వుండలేను. మన పెళ్ళి ఝామ్‌ఝామ్‌మని తొందర్లో జరిగిపో వాలి. మా నాన్నని మేనేజ్‌చేసే పూచీ నీదే. ఆయనంత మూర్ఖుడు ప్రపంచంలో వుండడు. పంచాంగం ఆయన ఆరో ప్రాణం. రాహుకాలం, యమగండం చూడందే ఇంట్లోంచి కాలుకూడా బయటపెట్టడు. జాతకాలూ, జ్యోతిష్యం, వాస్తూ, సాంప్రదాయాలూ ఇలా అన్నిటినీ అతిగా నమ్ముతాడు.

కాబట్టి మనం ప్రేమించుకున్నాం, పెళ్ళిచేయం డంటే అందరి నాన్నల్లాగే సుతరామూ అంగీకరించడు. కాబట్టి మనిద్దరి జాతకాలూ బ్రహ్మాండంగా వున్నా యనీ, మనిద్దరికీ పెళ్ళిచేస్తే సీతారాముల్లా వుంటామని మన ఊరి అవధాని చెప్పేటట్లు అరేంజ్‌చెయ్. మని ద్దరం ప్రేమించుకుంటున్నామని బయటపడేలోగా ఇది జరిగి పెళ్ళి అయిపోవాలి. శుభస్య శీఘ్రం" అని ఊపిరి వదలకుండా ఏకబిగిన చెప్పింది.

ఆమె చెప్పినట్లే వేయిరూపాయిలతో అవధానితో పనికానించేశాడు. పెళ్ళయిపోయింది. కానీ చిక్కంతా ఫస్ట్‌నైట్ దగ్గరే వచ్చింది. ముహూర్తం రోజున అలా అయిపోవడంతో నెలరోజులు వాయిదా పడింది.

సత్యనారాయణరావుకి మొత్తం నలుగురు ఆడ పిల్లలు. మగపిల్లలు లేరు. సుజన చిన్నపిల్ల. మిగిలిన ముగ్గురికీ పెళ్ళిళ్ళు అయిపోయాయి. వాళ్ళ వాళ్ళ కాపురాలు వాళ్ళు చేసుకుంటున్నారు.

శోభనం ఇలా వాయిదాపడడంతో సుజన అక్క య్యలు ముగ్గురూ ఊర్లకు బయల్దేరితే సత్యనారాయణ రావు వాళ్ళను ఆపేశాడు.

"శోభనం ముచ్చట జరక్కుండా మీరు వెళ్ళడా నికి లేదు. పిల్లలకు చదువుపోతుందంటే అల్లుళ్లతో పిల్లల్ని పంపేయండి. రాక రాక వచ్చారు. ఆ ముచ్చటా తీరాక నేనే స్వయంగా వచ్చి మిమ్మల్ని దిగబెడతాను.

చిన్నల్లుడు ఒక్కడే. ఆ ఇంట్లో ఆడపిల్లలెవరూ లేరు. అన్నదమ్ములూ లేరు. ఉన్నదంతా తల్లీ కొడుకే. అందువల్ల ఈ శోభనం గొడవంతా ఆడవాళ్ల ముచ్చట గనుక మీరు కాలు కదపడానికి లేదు" అని ముగ్గురు కూతుళ్ళనూ బయల్దేరనివ్వలేదు. అల్లుళ్ళు పిల్లల్ని తీసుకుని ఎవరి ఊళ్ళకు వాళ్ళు వెళ్ళిపోయారు.

సుజన, వంశీల వివాహం అయ్యాక ఇంత ప్రహ సనం గడిచిందన్నమాట.

"వంశీ... వంశీ" తల్లి మళ్ళీ పిలవడంతో బద్దకా న్నంతా ఒంటినుంచి విదుల్చుకుని తన రూమ్ తలుపు తెరిచాడు.

"నీకేదో ఉత్తరం వచ్చినట్లుందిరా" అని ఆమె ఓ పోస్టల్ ఎన్‌వలప్ అందించింది.

**(ఇంకావుంది)**



## రేఖ తీరు!

ఈమధ్య రేఖ తన మాటల్లో మదనమనోహరి మడోన్నా పేరు ఊరికే ప్రస్తావిస్తోంది. ఓసారి, "నేను మడోన్నాలా భౌతికసుఖాలకి వెంపర్లాడేదాన్ని కాదు" అంది. మరోసందర్భంలో, "నాకిప్పటికీ జనంపై ఎంతో నమ్మకముంది. వారు నన్నభిమానించడం మానరని. నేను మడోన్నాలాంటిదాన్ని అయితే ఇలా వుండగలిగేదాన్ని కాదు" అని చెప్పిందామె.

మాటిమాటికీ మడోన్నాని తలుస్తూ 'ఆమెలాంటి దాన్ని కా'దనడంలో రేఖ ఉద్దేశమేమిటో విన్నవారికి అంతుపట్టడంలేదు.



తెచ్చివ్వబోయినారా అని. చాలామంది చెప్పరిస్తారు. కాసేపు వెతికి తమ దరిద్రాన్నీ, తెలివితక్కువనూ తిట్టుకుంటూ ఇల్లు చేర్తారు. అలాంటప్పుడు..."

"అది సంచిలో వేసుకుని వెళ్తావు. కదూ..." ఇన్‌స్పెక్టరు హేళనకు అవ్వ నవ్వింది. "అలాగే అనుకుంటే ఇంతసేపిక్కడిలా పడిగాపులు పడివుండటమెందుకూ..." ఇన్‌స్పెక్టరుకు మాట పెగల్లేదు. మిరిమిరి చూశాడవ్వను.

"ఇది నాది కాదని తెలుసు. దీన్ని అసలువాళ్ళకివ్వాలనీ తెలుసు. దీన్ని కాజెయ్యాలనే దురాశా నాకులేదు. ఇది దొరికిన కొంతసేపు నేనక్కడే వున్నాను కూడాను. ఎవరైనా సొమ్ము పోయిందని వెతుక్కుంటారేమోనని. కానీ ఎవరూ రాలేదు. అయినా నేనింటికి పోలేదు. ఇదుగో ఇలా వచ్చి ఇక్కడ కూచున్నాను. చివరవరకూ చూసివెళ్ళడం ధర్మమనుకుని కూచున్నాను" ఇన్‌స్పెక్టరు బలం పుంజుకున్నాడు. చిక్కావులే అన్నట్టు చూసి నవ్వాడు.

"ఒకవేళ ఎవరూ చివరవరకూ రాలేదనుకో. అప్పుడేం చేద్దామనుకున్నావో అది చెప్పు పాపం"

"అలాంటప్పుడు అది నేను మీకిచ్చాననుకో బాబూ. మరి మీరేం చేస్తారు దాన్ని?"

ఇన్‌స్పెక్టరుకు చిర్రెత్తుకొచ్చింది. అసలీ తిక్క ముసల్దానితో ఇంత సౌమ్యంగా ఇంతసేపు మాట్లాడ్డమే తన తప్పు. దీని లాపాయింట్లూ ఇదీ. "అప్పుడింటికి తీసుకెళ్ళి నా భార్యకిస్తా. సరేనా..." అన్నాడు, మండిపోతూ విసురుగా.

వ్వ చిద్విలాసంగా నవ్వింది. "అదే. అందుకే ఇవ్వలేదు బాబూ. ఈ వస్తువు జారిపడింది. దొరికినప్పుడు దాని స్వంతదారుకివ్వటం న్యాయం. అలా వీలుపడనప్పుడు దొరికినవాళ్లే తీసుకోవటం ధర్మం. అంతేగాని మధ్యమీకెందుకివ్వాలి. ఒంటిమీది సొమ్ము జారిపోతున్నా గమనించుకోకుండా, గమనించింతర్వాతైనా పోలీసులకో ఎవరికో చెప్పుకోకుండా కూచున్న వాళ్లనెవరేం చేస్తారూ. వాళ్ల ఖర్మ అనుకోవాలంతే. అలాంటప్పుడు మీరు మాత్రమేం చేస్తారూ.

ఎవరైనా వచ్చి మా వస్తువు పోయిందంటే ఇవ్వగలరేమోగాని ఇల్లిల్లూ తిరిగి అడిగి ఎవరిదో తెలుసుకుని మరీ ఇవ్వరు గదా. అలాంటప్పుడు నాకు దొరికింది నాదిగాక మీదెలా అవుతుంది? బాబూ! మీరే న్యాయం చెప్పండి మరి..."

ఇన్‌స్పెక్టరు బుర్ర తిరిగిపోయింది లాజిక్ విని. ఔరా! ముసలమ్మా. ఏం బుర్ర. ఏం తెలివి. నీవు... నీవు నిజంగా దేశమేలాల్సినదానివి. ఎవరన్నారు. ముసలివాళ్లు అశక్తులనీ, చేతగానివాళ్లనీ.

సీరియల్

# రారా మా ఇంటిదాకా



## - మేర్లపాక మురళి

ఉత్తరాన్ని అటూ ఇటూ తిప్పుతూ తిరిగి తన గదిలోకి వచ్చి మంచంమీద ఏటవాలుగా పడుకుని ఉత్తరాన్ని చించాడు. అక్షరాలను గుర్తుపట్టాడు. సుజన రాసింది. ఆ వీథిలోంచి ఈ వీథిలోకి ఉత్తరమా అని ఆశ్చర్యపోతూ చదవడం ప్రారంభించాడు.

"వంశీ!

మన శోభనాన్ని వచ్చేనెల రెండోతేదీ నిర్ణయించారు. ఇది తెలిసిన వెంటనే మా అక్కయ్యలు ముగ్గురూ నన్ను ఆటపట్టించడం ప్రారంభించారు. తమ మరిది సరసుడైతే ఫస్ట్‌నైట్ కోసం అంతకాలం ఆగలేడనీ, ఒట్టిదద్దమ్మ అయితేనే ముహూర్తంవచ్చేవరకు ఎదురుచూస్తాడనీ ఎగతాళిచేయడంమొదలు పెట్టారు. ఈ సమయంలో నాకూ, వాళ్లకీ మధ్య మాటా మాటా పెరిగింది.

మా వంశీ ఎంత గొప్ప ప్రేమికుడో, అంత సరసుడని నేనన్నాను. అయితే నాన్న పెట్టించిన ముహూర్తంలోపే మీరు ఫస్ట్‌నైట్ జరుపుకోండని అన్నారు. తాము నాన్న పక్షమే గనుక మనిద్దరం కలుసుకోవడానికి కూడా వీలు కల్పించరట. పైపెచ్చు మనం కలుసుకోకుండా వాళ్ళు అడ్డుకుంటారట. ఇలాంటి స్థితిలో మనం వాళ్ళ కళ్లుగప్పి శోభనం జరుపుకోవాలన్నది పందెం. ఈ పందెంలో వాళ్ళు నెగ్గితే ఒక కోరిక కోరతారు. దాన్ని మనం తీర్చాలి. మనం విజయం సాధిస్తే మనం అడిగింది వాళ్ళివ్వాలి.

ఇలా మా మధ్య కుదిరిన ఛాలెంజ్‌ని నువ్వు ఒప్పుకుంటావన్న భరోసాతో సరేనన్నాను. శాస్త్రాలూ, పద్ధతులూ అంటూ మా నాన్న మనం కలుసుకోవడానికిగానీ, మాట్లాడుకోవడానికిగానీ అనుమతించరు. ఆయన ఇలాంటివాటిని ఎంతగా పట్టించుకుంటారో నీకూ తెలుసు.

అందువల్ల ఆయన్నీ, పందెం వేసిన మా ముగ్గురు అక్కయ్యలనూ బోల్తాకొట్టించి మనం ఫస్ట్‌నైట్ జరుపుకోవాలి. దీనికి గడువు వచ్చేనెల రెండు. కాబట్టి నువ్వే ఏదో మతలబుచేసి మనం కలుసుకునే ఏర్పాట్లు చేయాలి. ఇదంతా నీతో చెప్పే వీలులేక ఈ వీథిలో వున్న నేను ఆ వీథిలో వుండే నీకు ఇలా పోస్టల్ ద్వారా రాయబారం పంపుతున్నాను. అంటే నేనే స్థితిలో వున్నానో ఊహించు.

ఈ ఛాలెంజ్ గురించి ఆలోచిస్తుంటే రాత్రి నా ఎం.ఫిల్. రీసెర్చికి ఓ బ్రహ్మాండమైన టాపిక్ తట్టింది. అదేమిటంటే 'ఫస్ట్‌నైట్ అండ్ ఇట్స్ రిఫ్లెక్షన్స్' అన్నది. స్త్రీ తన జీవితంలో మొదటిసారి ఒక మగవాడి ఉద్రేకాల్ని, ఉద్వేగాల్ని చూసేది శోభనంరోజే. అమ్మాయిలకు ఓ కొత్త జీవితానికి స్టార్టింగ్ పాయింట్ శోభనమే. భర్త అయినవాడు ఎలాంటివాడో తెలుసుకునేందుకు క్వొశ్చన్‌నైజర్‌లాంటిది ఫస్ట్‌నైట్.

తను పుట్టిన ఊరు, కన్నతల్లిదండ్రులూ, స్నేహితులూ- వీరందర్నీ వదిలి కొత్త వ్యక్తితో, కొత్త జీవితాన్ని ప్రారంభించేందుకు మహాప్రస్థానం మొదలయ్యేది ఆ రాత్రినుంచే. తన జీవితం ముందు ముందు ఎలా గడుస్తుందో తెలిపే లిట్మస్ టెస్ట్ శోభనం.

మొదటిరాత్రి అంటే కేవలం సెక్సే కాదుకదా. దానికి ముందూ వెనకా చాలా వుంటాయి. అదిగో వాటిని రికార్డ్ చేస్తాను. ఆర్థికపరిస్థితులూ, నైతికవిలువలూ, మెంటల్ ఇంబాలన్స్‌లూ, రకరకాల కాంప్లెక్సులూ- ఇవన్నీ మొదటిరాత్రి ఎలా ప్రతిఫలిస్తాయో, జీవితంలో అవి కల్పించే ప్రభావం ఎలా వుంటుందో విశ్లేషిస్తాను.

రేపటినుంచే నా థీసిస్‌కి శ్రీకారం చుడతాను. నేను చిన్నప్పట్నుంచీ మద్రాసులో వుండడంవల్ల మన ఊరి అమ్మాయిల గురించి ఏమీ తెలియదు. ఈమధ్యే వాళ్లతో పరిచయాలు ప్రారంభమయ్యాయి. వీళ్ళనందర్నీ ఫస్ట్‌నైట్‌మీద ఇంటర్వ్యూచేస్తాను. వాళ్ళ శోభనం రోజున ఏం జరిగిందో తెలుసుకుంటాను.

ఎలా వుంది నా రీసెర్చ్ ఐడియా? పాశ్చాత్యదేశా

### గత సంచికలోనే ప్రారంభమైన 'రారా మా ఇంటిదాకా' జరిగినకథ

వంశీ కాలేజీ చదువులుండగా తోటి విద్యార్థిని సుజన పరిచయమౌతుంది. వారిద్దరి పరిచయం ప్రేమగా మారుతుంది. ఇద్దరిదీ ఒకే పల్లెటూరు.

వంశీ, అతడి తల్లితో ఓ వీధిలో వుంటే, మరో వీధిలో సుజన వాళ్ళ కుటుంబం వుంటుంటారు. ఇరువైపు పెద్దలూ అంగీకరించి వంశీ, సుజనల పెళ్లి జరిపిస్తారు.

అయితే శోభనం ముహూర్తం దగ్గరపడిందనగా సుజనకు మూడురోజులు 'ఇబ్బంది' ఎదురౌతుంది. ఆ మూడురోజులూ వీలుకాదుకనక, మరో ముహూర్తం చూస్తాడు సుజన తండ్రి. ఆ ముహూర్తం నెలరోజుల తర్వాతగానీ వుండదు. కనుక అప్పటిదాకా శోభనం వాయిదాపడుతుంది.

సుజన తండ్రికి ముహూర్తాలు, జ్యోతిషాల పిచ్చి ఎక్కువ. అందువల్ల చాలా స్ట్రిక్టుగా వుంటాడు. ఈ పరిస్థితిలో వంశీకి ఓ లెటర్ వస్తుంది.

ల్లోనే స్త్రీలు ఇలాంటివాటికి జవాబులు చెబుతారని. మనదేశంలో చెప్పరని అంటుంటారు. కానీ ఇది అబద్ధం. ఇలా అనుకుంటూ మనమేదో మనకులేని గొప్పతనాన్ని ఆపాదించుకుంటూవుంటాం. లేదూ మనస్త్రీలను ఆ కామెంట్లతో చిన్నబుచ్చుతుంటాం. కానీ ఒక్కవిషయం వంశీ! బెడ్‌రూమ్ ఎక్కడైనా ఒకటే. అమెరికాలో అయినా, ఇండియాలోనైనా మనిషి స్వభావం ఒక్కటే. అందుకే మన స్త్రీలూ తమ ఫస్ట్ నైట్‌ల గురించి చెబుతారని అనుకుంటున్నాను.

ఇక ఏమిటి విశేషాలు?

మా సిస్టర్స్‌తో నేను వేసిన పందెంలో మనం నెగ్గాలి. ముహూర్తానికంటే ముందుగానే ఎవరికీ తెలియకుండా మన శోభనం ఝూమ్‌ఝూమ్ అని జరిగిపోవాలి. భారం అంతా నీదే. విష్‌యూ బెస్టాఫ్ లక్-

యువర్స్- సుజన"

ఉత్తరం అంతా చదువుకున్నాక 'ఈ పందానికి నేను ఓకే' అని గట్టిగానే తనకు తానే చెప్పుకున్నాడు వంశీ.

•   •   •

సాయంకాలమైంది. సంధ్యకాంతి సూర్యకిరణాల బ్రష్షులతో లోకానికి ఎరుపురంగుపూస్తోంది. సూర్యుడు వెళుతున్న రథచక్రాలకు కుంకుమధూళి పైకెగసినట్టు పడమటి కొండలు ప్రకాశిస్తున్నాయి. పచ్చటిపైర్లమీద గాలి షికారు కొడుతోంది.

అలాంటి సమయంలో సత్యనారాయణరావుగారి ఇల్లు కాలం గోడకు తగిలించిన పురాతన తైలవర్ణ చిత్రపటంలా వుంటుంది.

అది పాత బిల్డింగ్. ఆయన తండ్రి కట్టించింది. ఇటీవల మరమ్మతులు చేయించారు.



## జయప్రద బిజీ



"హిందీలో నేనేమీ ఖాళీగాలేను. తెలుగుకే చాలా దూరమయ్యానన్న ఫీలింగ్ కలిగి, మళ్ళీ ఇక్కడి చిత్రాల్లో నటిస్తున్నాను" అని చెప్పింది 'జీవితఖైదీ'లో నటిస్తున్న జయప్రద. త్వరలో ఓ బెంగాలీ చిత్రంలో కూడా చేయబోతోందిట.

రాజకీయ నాయకురాలి పాత్ర చేయాలని తహతహలాడిన జయప్రద, ఓ తమిళ సినిమాలో ఎం.పి.గా చేసి తన తపన తీర్చుకుంది. ఇప్పుడు మరో తమిళ చిత్రంకూడా చేయబోతోంది.

"జీవితఖైదీ లాంటి మంచి కథలు దొరికితే ఇకపై కూడా తెలుగులో నటిస్తాను" అని విన్నవించుకుంటోంది జయప్రద.

---

ముందు విశాలంగా లాన్ వుంటుంది. ఆ తరువాత పెంకులతో వేసిన వరండా, వెరైటీకోసం ఎర్రటి ఆకులతో వేసిన పందిరిలా కనిపిస్తుంది. లోన హాలుతో కలిపి అయిదు గదులుంటాయి. చివరన చాలా భాగం ఖాళీగా వుంది, ఆ తరువాత ప్రహరీగోడ వుంటుంది. ఖాళీభాగంలో సిమెంటు గచ్చు వుండడంతో స్త్రీలు సాయంకాలాలు అక్కడ కూర్చుని బాతాఖానీ వేస్తుంటారు. డాబాకు లోపలినుంచే మెట్లున్నాయి. డాబామీద రెండు గదులున్నాయి. ఒకదాన్ని సుజన వాడుకుంటూ వుంది. రెండోదానిలో సత్యనారాయణ గారి అమ్మ పరంజ్యోతి వుంటుంది. అక్కడే బాత్రూమ్ వగైరా వుండడంతో ఆ ముసలామె ఎప్పుడో తప్ప కిందకు దిగదు.

ఆ సాయంకాలం ఎదురింటి నిరుపమను ఇంటికి రమ్మని కబురంపిన విషయం గుర్తొచ్చి సుజన తన గదినుంచి దొడ్లోకి వచ్చింది. పనిమనిషి సుబ్బులుతో చెప్పి ప్రహరీగోడ దగ్గర రెండు పేముకుర్చీలు వేయించింది.

మరీ గట్టిగా మాట్లాడితే తప్ప వెనుకనున్న వరండాల్లో కూర్చున్నవారికి వినిపించదు. తనూ, నిరుపమ హాయిగా మాట్లాడుకోవచ్చని సంతృప్తిచెందింది. ఒక కుర్చీలో కూర్చుని ఆ వారం వీక్లీని తిరగేయసాగింది.

వరండాలో ఆమె అక్కయ్యలు ముగ్గురూ సన్నజాజుల దండలు కడుతున్నారు. సుజన అంత దూరంలో ఒంటరిగా కూర్చోవడంతో పెద్దక్కయ్య ఉమ పిలిచింది.

"ఏమిటే అంత ఏకాంతంగా కూర్చున్నావ్? ఆడవాళ్ళ గాలి సోకకూడదనా ఏమిటి? శోభనం కోసం అంత ఆరాటపడిపోకు. మరిదిగారు జడుసుకోగలరు. ఇటొచ్చి కూర్చో"

"ఇంతకీ మన పందానికి మీ శ్రీవారు ఒప్పుకున్నారా? లేక తనవల్ల కాదని చేతులెత్తేశారా?" రెండో అక్క రమాదేవి అడిగింది.

"ఒప్పుకున్నట్టే. ఈ ఛాలెంజ్‌లో మేము నెగ్గడం ఖాయం. ముహూర్తానికి ముందే మిమ్మల్నందరినీ బురిడీ కొట్టించి ఫస్ట్‌నైట్ జరిపేసుకుంటాం"

"అంటే మీ ఆయన ఏ క్షణంలోనైనా మాయారూపంలో వచ్చి నిన్ను వాటేసుకుంటాడంటావ్" చిన్నక్క హేమ అంది.

"మరిదిగార్ని చూస్తే అలా అనిపించడంలేదు. శ్రీరామచంద్రుడి చిన్నతమ్ముడిలా వున్నాడు. అతని కాండక్ట్ సర్టిఫికేట్‌లో కూడా 'గుడ్' అనే వుంది" ఉమ ఉడికించడానికి అలా అంది.

"అవసరమైతే ఆ శ్రీరాముడే శ్రీకృష్ణుడిలా అవతరించలేదూ. అలాగే మా వంశీకూడా. మీరలా చూస్తూ వుండండి- గడువులోపల ఆయన రాజకుమారుడిలా దర్జాగా ముందు ద్వారం గుండా వచ్చి వెనక దారిగుండా నన్ను ఎగరేసుకుపోతాడు"

"వెయిట్ అండ్ సీ- ఎవరు గెలుస్తారో? మమ్మల్ని బోల్తాకొట్టించినా నాన్నను ఎవరూ మోసం చేయలేరు. శాస్త్రాల్ని ఔపోసనపట్టిన ఆయన దగ్గర మీ వంశీ ఆటలు సాగవు. మేమూ వేయికళ్ళతో కాపలా కాస్తాం" రమ ఛాలెంజింగ్‌గా అంది.

"ఇలా రావే. సన్నజాజుల దండకట్టాం. నువ్వూ పెట్టుకో. శోభనంకాని కొత్త పెళ్ళికూతురివి కదా. వీటి వాసన ఆ వీధిలోకి పాకితేనైనా మీవారికి ఇన్స్‌పిరేషన్ వస్తుందేమో" హేమ పిలిచింది.

"అలాంటి అవసరం లేదులే. నా చిటికెనవేలు చూపే మా వంశీ శృంగారంలో శివాలెత్తిపోగలడు" అంటూ సుజన అక్కడికి వచ్చి సన్నజాజుల దండలో కొంతభాగాన్ని తుంచి తలలో పెట్టుకుంది. తిరిగి వచ్చి తన కుర్చీలో కూర్చుంటూ వుండగా నిరుపమ వచ్చింది.

ఆమెకి పాతికేళ్ళుంటాయి.

నందితిమ్మన ఆమె ముక్కునీ, ధూర్జటి ఆమె పెదవుల్నీ, అల్లసాని పెద్దన ఆమె కళ్ళనీ, శ్రీనాథుడు ఆమె వక్షస్థలాన్నీ, చేమకూర వేంకటకవి ఆమె నడుమునీ, ముద్దుపళని ఆమె జఘనాన్నీ తయారుచేసినట్టు అద్భుతంగా వుంటుంది.

"రా నిరుపమా! నీకోసమే చూస్తున్నాను" సుజన ఆప్యాయంగా పిలిచి కుర్చీలో కూర్చోబెట్టింది.

"తీరిగ్గా రమ్మని కబురు పెట్టావ్. ఏమిటి విశేషాలు?"

"బోర్‌కొడుతోంది. సరదాగా నీతో కాలక్షేపం చేద్దామని"

"కొత్త పెళ్ళికూతురికి బోర్‌కొట్టడమేమిటి? ఎవరైనా పలకరిస్తే ఊహలు చెదిరిపోయాయని చీవాట్లు పెట్టే స్థితిలో వుండాలి నువ్వు"

"అంత చిన్నపిల్లను కాదనుకుంటా నేను. అది సరేగానీ ఇంట్లో మీవారు వున్నారా?"

"లేరు. టౌన్‌కి వెళ్ళారు ఏదో మీటింగ్ వుందని. లాస్ట్ బస్‌కికానీ రారు"

ఆమె భర్త ఆనంద్ ఆ ఊర్లో వి.డి.ఓ.గా పనిచేస్తున్నాడు. నెల్లూరికి పక్కనున్న పల్లెటూరు స్వంతఊరు. ఆరునెలల క్రితం ట్రాన్స్‌ఫర్ మీద ఆ ఊరొచ్చాడు.

"అయితే రాత్రి తొమ్మిదింటివరకు మనం మాట్లాడుకోవచ్చు. అన్నట్టు, నువ్వు బాగా డ్రస్ చేసుకుంటావు నిరుపమా! రోజూ చూస్తుంటానుకదా- చక్కగా ముస్తాబై కనిపిస్తావ్. చాలామంది ఆడపిల్లలకు డ్రస్ సెన్స్ వుండదు. మిడ్

---

సమ్మర్‌లో బ్లాక్‌శారీ కట్టుకుని మ్యాట్నీకి వెళ్ళే స్త్రీలున్నారు. థియేటర్ దగ్గరికి వెళ్ళేసరికి చెమటతో తడిసి ముద్దయిపోతారు.

మరికొందరైతే తెల్లటిచీర కింద ముదురురంగు లంగాలు వేసుకుంటారు. దీంతో కిందిభాగం ఒక రంగులోనూ, పైభాగం తెల్లగానూ వుండి చూడడానికి ఆడ్‌గా వుంటుంది.

ఇంకొందరైతే ఎర్రటిచీరమీద నల్లటి జాకెట్ వేసుకుని అచ్చు డి.ఎం.కె.జెండా కర్రలా కనిపిస్తారు. తెల్లనూ,జెర్రెర్స్ని ఒంటికి అతికించుకున్నట్టు కొందరు తెల్లటిజాకెట్‌కింద నల్లటి బ్రాలు వేసుకుంటారు"

"నిజమే. చాలామంది అమ్మాయిలకు మంచి డ్రస్సులే వుండవు. తలకు రాసుకోవడానికి కొబ్బరి నూనె లేనివాళ్ళే ఎక్కువ. పల్లెటూరు అమ్మాయిల్లో ఎవరో కొందరికి తప్ప మిగిలిన వాళ్ళకు రెండు మూడు డ్రస్సులకంటే మించి వుండవు"

"నిజమే. కానీ నేను చెప్పేంది డ్రస్సులు వుండీ ఎలా డ్రస్ చేసుకోవాలో తెలియనివాళ్ల గురించి"

"పేదరికం కాకపోతే అమాయకత్వం. ఆడపిల్లకు ఈడురాగానే తల్లిదండ్రులు సంకెళ్ళను తగిలించేస్తారు. బయటకు వెళ్ళి నలుగురిలో తిరగని అమ్మాయిలకు వీటి గురించి ఏంతెలుస్తాయి? ఫస్ట్‌నైట్‌న ఏం జరుగుతుందో తెలియని ఆడపిల్లలు కూడా చాలా మందే వున్నారు. దీనికి బెస్ట్ ఎగ్జాంపుల్ మా ఊర్లో పెదరాయుడిగారి అమ్మాయి రాధ"

సుజనకు ఇంట్రెస్ట్ ఎక్కువైంది. తన రీసెర్చి టాపిక్‌కు ఉపయోగపడే విషయం కనుక "ఎవరా రాధ?" అని అడిగింది.

"మా ఊర్లో ఏకైక మోతుబరి పెదరాయుడు. ఊర్లోని ముప్పాతిక భాగం భూములు ఆయనవే. అందరికంటే తామే ఎక్కువన్న అహంభావం వారికి బాగానే వుండేది. దీంతో ఇరుగుపొరుగువారితో కూడా క్లోజ్‌గా వుండేవాళ్ళు కారు.

ఎవరింటికీ వచ్చేవాళ్లు కారు. ఎవరూ వాళ్ళింటికి వెళ్ళేవాళ్ళు కారు. ఒక్కమాటలో చెప్పాలంటే వాళ్లకు సోషల్ లైఫ్ వుండేది కాదు.

రాయుడికి ఒకతే కూతురు. పేరు రాధ. చాలా అందంగా పాలలో ముంచి తీసినట్టు తెల్లగా, దంతపు బొమ్మలా వుండేది. పదోతరగతిలోనే చదువు ఆపించేశారు. రజస్వల అయిన సంవత్సరానికల్లా పెళ్ళి చేశారు. ఫస్ట్‌నైట్‌న గదిలోకి వెళ్ళడానికి ససేమిరా ఒప్పుకోలేదు రాధ.

'ఆ కొత్త వ్యక్తితో నేను గదిలోకి వెళ్ళను. బూచాడిలా పెద్ద పెద్ద మీసాలు- ఆ హిప్పీక్రాపు- సూది రంధ్రాల్లా చిన్న చిన్న కళ్ళు- ఆయన్ను చూస్తుంటే భయమేస్తోంది. గదిలో ఒంటరిగా వుంటే- ఆయన నన్ను గొంతునులిమి చంపేస్తే- ఓమ్మో- నేను వెళ్ళను దేవుడో" అంటూ మొరాయించింది.

గదిలో ఆయన నిన్ను చంపడని తల్లిదండ్రీ చెప్పినా వినలేదు. అంతకంటే మించి ఎలా చెప్పాలో వాళ్ళకి అర్థంకావడంలేదు. శోభనం రోజున పెళ్ళికొడుకు చంపేస్తాడని బెదిరిపోతున్న ఆ పిల్ల అమాయకత్వాన్ని ఎలా పోగొట్టాలో తెలియడంలేదు.

ఇదంతా గమనిస్తున్న ఆమెబామ్మ రంగంలోకి దిగింది. మనవరాల్ని దగ్గరికి పిలిచి 'ఏమిటే ఆ భయం పిచ్చిమొహమా. గదిలో ఆయన నిన్ను చంపడు- కనీసం కొట్టడుకూడా. మీ నాన్న మీ అమ్మని చంపేశాడా? లేదే- మరి నీకెందుకు భయం?

గదిలో మహాఅయితే ఆ అబ్బాయి నిన్ను ముద్దులు పెట్టుకుంటాడేమో- అంతే- శోభనం అంటే ముద్దులు పెట్టుకోవడమే. అంతకుమించి నిన్నేమైనా చేస్తే గట్టిగా అరువ్. మేమంతా ఈ హాల్లోనేగదా పడుకునేది' అని బుజ్జగించి చెప్పింది.

'అంతేనంటావా?'

'అవునే. ముద్దులు తప్ప మరేదానికీ నిన్ను ముట్టుకోడే'

'అలా అయితేనే వెళతాను'

ఇదంతా పెళ్ళికొడుకు చాటునుంచీ విన్నాడు. రాధ అమాయకత్వం అతనికి అర్థమైంది. ముద్దులు తప్ప మరేమీ పెట్టుకోకుండా ఎలా మేనేజ్ చేయాలా అని ఆలోచనలోపడ్డాడు.

గదిలోకి వెళ్ళి వెయిట్‌చేస్తుండగా రాధ పాల గ్లాసుతో ప్రవేశించింది. ఏడుపుకి కందిపోయి మందార మొగ్గల్లా అయిపోయిన ఆమె బుగ్గల్ని చూస్తూ లోనికి ఆహ్వానించాడు.

మంచంమీద కూర్చోబెట్టాడు. పాలు తాగి మీదకి ఒరగబోతున్న అతనిని ఆమె దూరంగా నెట్టేసింది.

'ఏమిటలా మీద పడిపోతావ్? నువ్వు నన్ను ముద్దుపెట్టుకుంటావని మాత్రమే బామ్మ చెప్పింది. అంతకుమించి ఏమైనా చేస్తే నేను బామ్మను పిలుస్తాను. జాగ్రత్త' అంటూ ఏడుపు కలగలిపిన గొంతులో హెచ్చరించింది.

అతనికి సమస్య పూర్తిగా అర్థమైంది. ఆ సమస్యను ఎలా పరిష్కరించాలో కూడా తట్టింది.

'నేనూ అంతకంటే ఏమీ చేయను. కేవలం ముద్దులే పెట్టుకుంటాను. ముద్దంటే ఏ అవయవంతో ఆ అవయవాన్ని తాకటమేకదా. ఫర్ ఎగ్జాంపుల్- నీ చేతుల్ని నా కాళ్లతో తాకలేనుకదా. పెదవుల్ని పెదవులతో, కళ్ళను కళ్ళతో స్పృశించడమే ముద్దంటే. అంతకంటేమించి ఏం. చేసినా నువ్వు బామ్మని పిలువ్ అన్నాడు. ఆ లాజిక్‌కి ఆమె కన్విన్స్ అయింది.

ఇక ఆగలేదు అతను. తన కళ్ళతో ఆమె కళ్లను తాకాడు. ముక్కుతో ముక్కును రుద్దాడు. పెదవులతో పెదవులమీద అద్దాడు. ఇలా కళ్లతో మొదలు పెట్టిన అతను ఎక్కడ ఆగాడో ఊహించు. అలా రాధ ఫస్ట్‌నైట్ జరిగిపోయింది" అంతవరకు చెప్పి నవ్వసాగింది నిరుపమ. సుజన ఆమెతో శ్రుతి కలిపింది.

"ఆ రాధ మొగుడు ఎవరోగానీ గొప్ప చతురుడిలా వున్నాడే. లేకుంటే అలాంటి అమ్మాయిని చిన్న లాజిక్‌తో దారిలో పెట్టగలిగేవాడా?" సుజన బలవంతంగా నవ్వాపుకుంటూ అంది.

"అది సరేగానీ- నీ శోభనం వాయిదా పడిందట కదా- ఎవరో చెప్పారు" నిరుపమ తను విన్నది నిజమా కాదా అని తెలుసుకోవడానికి అడిగింది.

"అవును. సరిగ్గా ముహూర్తం సమయానికి నేను

## వాణీకి మరో అవకాశం

రొమాంటిక్ ఇమేజ్ పుణ్యమా అని ఇద్దరేసి తారలతో వలపువిందులేస్తున్నాడు రాజశేఖర్. ఇప్పుడు 'గ్యాంగ్ మాస్టర్'లో నగ్మాయే కాక, వాణీవిశ్వనాథ్‌తో కూడా వలరాజుగా పాటల సన్నివేశాల్లో ప్రేమవిన్యాసాలు చూపించబోతున్నాడు.

నగ్మాతోపాటు చిరంజీవి సరసన (ఘరానా మొగుడు) నటించిన వానపాటల వాణీ, ఇప్పుడు ఆదే నగ్మాతో రాజశేఖర్ సరసన నటించడంతో సెంటిమెంటల్‌గా మహాఉత్సాహంగా వుంది. తానింక కమర్షియల్ స్టార్ అయిపోవచ్చని ఆనందపడుతోంది. బి. గోపాల్ డైరెక్షన్‌లో వస్తున్న ఈ చిత్రంలో పసందైన అందాల విందులు చేయనుందామె.





## శరత్‌కుమార్ డైరెక్షన్

'కెప్టెన్' హీరో శరత్‌కుమార్‌కి తెలుగు బాగా వచ్చు. నేతాజీ సుభాష్‌చంద్రబోస్ పాత్ర పోషించాలని శరత్‌కుమార్ సరదా. అందుకే నేతాజీకి సంబంధించిన వివరాలన్నీ సేకరిస్తున్నాడు.

ఈ చిత్రం ఓ భారీచిత్రమవుతుందిట. "దానికి డైరెక్షన్ కూడా నేనే వహిస్తాను" అంటున్నాడు. విలన్ నుండి హీరోగా ఎదిగి, అక్కడి నుండి దర్శకుడిగా ఉద్యమించబోతున్నాడన్నమాట.

## గర్భిణీ స్త్రీలలో మానసిక ఒత్తిడి

ఉద్యోగాలు చేయడం, ఇంటిపనులు చూసుకో వాల్సిరావడంతో స్త్రీలమీద ఒత్తిడి పెరిగి గర్భిణిగా వున్న సమయంలో వారు పలురకాల ఇబ్బందులకు గురిఅవుతున్నట్టు పరిశోధకులు అంటున్నారు. ఈ ఒత్తిడి ఫలితాలు చాలామందిలో స్పష్టంగా కన్పించవని, అయితే తల తిరుగుడు, తల నొప్పి, గుండె నొప్పి, కంటి చూపు మందగించడం, శ్వాస కోశ ఇబ్బందులన్నీ ఆ ఒత్తిడి ఫలితమేనంటున్నారు.



గతంలో గర్భందాల్చిన ఐదవనెల నుండి పుట్టింటిలో పెద్దల పర్యవేక్షణలో ప్రసవానికి సిద్ధమయ్యేవారని, వారికి కలిగే అనుమానాలను పెద్దలు పరిష్కరించేవారని, ఆహారపు నియమాలను పాటింపజేసేవారని అందుకే ప్రసవ సమయంలో ఇబ్బందులు తక్కువగా వుండేవని పరిశోధకులు అంటున్నారు. ఇప్పటికీ తొలికాన్పును కన్నతల్లి పర్యవేక్షణలో జరపడం తల్లీ, బిడ్డలకు క్షేమం అనేది వైద్యుల సలహా.

పట్టణాలలో వుండి ఉద్యోగాలు చేసే స్త్రీలకు ప్రసవానికి మూడు, నాలుగు వారాలముందు మాత్రమే సెలవు లభిస్తున్నది.

దీనితో వారి మానసిక ఆందోళన ప్రభావం కండరాలమీద పడి ప్రసవ సమయంలో సహకరించడం లేదు. ఫలితంగా ఆపరేషన్ చేసి పిల్లలను బయటకు తీయాల్సి వస్తున్నది.

కాబట్టి గర్భిణీ స్త్రీలు పెద్దల పర్యవేక్షణలో వుండాలని, ఒత్తిడి ప్రభావం లేకుండా వుండేందుకు యోగా చేయాలని, మానసిక విశ్రాంతి కావాలని, తమ శారీరక ఇబ్బందులను వాయిదా వేయక వెంటనే వైద్యుడిని సంప్రదించాలని పరిశోధకులు సూచిస్తున్నారు. ✦

---

'అవుటాఫ్ ది డోర్స్'. ఆ తరువాత మంచి ముహూర్తం లేదని నెలరోజులు వాయిదావేశారు మా నాన్న. అసలు ఆడపిల్లలకు ఈ మూడురోజుల తతంగంతోనే డిప్రెషన్ మొదలవుతుంది. తన ఇష్టాయిష్టాలన్నీ కూడా వేరే విషయాలపై ఆధారపడివున్నాయని ఆడపిల్లకు తెలిసిపోతుంది. మనుషులేకాకుండా, ప్రకృతిసైతం తనమీద పెత్తనం చెలాయిస్తూ వుందని అర్థమై పోతుంది.

ఉదాహరణకు ఓ రోజు ఇంటిల్లిపాదీ సినిమాకు వెళ్ళాలని అనుకుందాం. ఆమెకూడా ఎంతో ఉత్సాహంతో బయల్దేరుతూ వుంటుంది. కానీ సడన్‌గా ఇష్టంలేని అతిథి అర్ధరాత్రి వచ్చినట్లు మూలం కూర్చుంటుంది. ఇలాంటి సమయంలో సినిమాకు రాకూడదనీ, ఈ మూడురోజులూ ఇంటి బయటే వుండాలనీ చెప్పి, వరండాలో చాపవేసి, సెపరేట్‌గా చెంబూ గ్లాసూ ఇచ్చి అందరూ వెళ్ళిపోతారు. ఆమె బిక్కు బిక్కుమంటూ ఒంటరిగా తనని కంట్రోల్ చేస్తున్న ప్రకృతిని తిట్టుకుంటూ వుండిపోతుంది"

"నిజమే- మనం ఈ సంఘం చేతిలో కీలుబొమ్మలం. ఆకలి మన కడుపులోనే వేసినా, అది తీరే పదార్థాలన్నీ బయటే వుంటాయి. మనం అంతా ఎవరో వెనకనుంచి చెప్పేస్తూవుంటే నటిస్తుంటాం. అందుకే మానవజీవితం ఒక నాటకం అంటారు. ఈ నాటకానికి సూత్రధారి ఎవరో తెలుసా? డబ్బు- అది కావాలనుకుంటే మనల్ని నవ్విస్తుంది- ఏడిపించాలనుకుంటే ఏడిపిస్తుంది. ఈ పాఠం నేనెప్పుడు నేర్చుకున్నానో తెలుసా? నా ఫస్ట్‌నైట్ రోజున"

సుజన ఎగ్జైట్‌మెంట్‌తో తూలింది. వెదకబోయిన తీగ కాలికి తగిలినట్లు ఆమె ఉక్కిరిబిక్కిరైంది. ఫస్ట్ నైట్ గురించి తాను అడగాలనుకుంటూ వుండగానే నిరుపమ ఆ టాపిక్‌ఎత్తడం గమ్మత్తుగా వుంది ఆమెకి.

"నీ ఫస్ట్‌నైట్ రోజునా! ఏం జరిగింది?"

"అదంతా ఓ తమాషా"

"ఆఁ... ఏంజరిగిందో చెప్పవా!"

"చెప్పక తప్పదా! ఎప్పుడో- మూడు సంవత్సరాల నాటి సంగతి. తలచుకుంటుంటే ఏదో నిన్నో మొన్నో జరిగినట్లుంటుంది"

సుజన కుర్చీలో సర్దుకుని కూర్చుంది. నిరుపమ ఆ జ్ఞాపకాలన్నిటినీ మనసుపొరల్లోంచి బయటికిలాగినట్లు అటూ ఇటూ కదిలి చెప్పటం ప్రారంభించింది.

"నాకు అప్పుడు ఇరవైరెండేళ్ళు. ఉమెన్స్ కాలేజీలో డిగ్రీపూర్తిచేశాను. పీజీ చెయ్యాలనిపించలేదు. చదువు బోర్‌కొట్టేసింది. చదువు బోర్‌కొట్టిందంటే మరేదో కావాలనిపిస్తూ వుందన్నమాట. ఏదో తెలియని ఆరాటం ప్రారంభమైంది. ఇదీ అని చెప్పలేముగానీ జీవితంలో ఏదో మార్పు కావాలని కోరుకుంటోంది మనసు. ఎవరితోనో గాఢంగా మాట్లాడాలని, అతని కోసం ఎదురుచూడాలనీ, పిండివంటలు తినిపించాలనీ, వెన్నెల్లో ఆరుబయట మంచం మీద కూర్చుని కబుర్లు చెప్పాలనిపిస్తోంది.

ఎం.ఏ. చదవడానికి ఆర్థికరీత్యా కూడా కష్టం కావడంతో మా నాన్న కూడా నన్ను బలవంతం చేయలేదు. అమ్మానాన్నలకూ నేను, అన్నయ్యా సంతానం.

మా పొలం కాక మరో అయిదు ఎకరాలు లీజుకు తీసుకుని వ్యవసాయం చేస్తున్నాడు వాడు. వ్యవసాయమే మాకు వృత్తి.

మంచి సంబంధం వచ్చిందని మొదట మా అన్నయ్యకి పెళ్ళిచేశారు. మా వదిన కాపురానికి వచ్చింది. ఆమె నాకంటే రెండేళ్ళు చిన్నది. బాగా కలుపుగోలుగా వుండేది.

మా ఇంట్లో ముందువరండాకాక రెండే గదులు. మొదటి గది మా అన్నయ్యావాళ్ళు వాడుకునేవాళ్ళు.

వాళ్ళిద్దర్నీ చూస్తుంటే నా బాధ మరింత ఎక్కువైంది. చూడకూడదనుకున్నా వాళ్ళ సరసాలు కళ్ళబడేవి. వినకూడదనుకున్నా వాళ్ళమాటలు వినపడేవి. అలాంటి సమయాల్లో శరీరమంతా తీయగా మూల్గేది. రాత్రిళ్ళు అయితే మరీ ఘోరం. బెడ్‌రూమ్‌లో వాళ్ళిద్దరూ పడుకునేవాళ్ళు.

నేనూ, అమ్మా, నాన్నా వరండాలో పడకలు వేసుకునేవాళ్ళం. అమ్మానాన్నా ఏదో లోకాభిరామాయణం మాట్లాడుతున్నా నా చెవులు మాత్రం బెడ్‌రూమ్ తలుపులకు వేలాడుతుండేవి. గుసగుసలూ, నవ్వులూ తరువాత లైట్ ఆరిపోయేది.

ఇక నా అవస్థ వర్ణనాతీతం. కొబ్బరిఆకుల మధ్య వేలాడుతూ కనిపించే చంద్రవంక నా యవ్వనాన్ని మేల్కొల్పే కొరడా కొసలా అనిపించేది. నా అవయవాల్లో దూరి అల్లరిపెట్టే గాలి ఎవరో పంపిన ప్రణయ రాయబారాన్ని నాకు విన్పిస్తున్నట్టే వుండేది. నేను పడుకున్న నులకమంచం కొర్కెల్ని రేపే మంత్రాల పల్లకిలా తోచేది.

అంతలో గదిలో లైటు వెలిగేది. తలుపు కొద్దిగా తెరుచుకునేది. వదిన తలమాత్రం బయటపెట్టి మేము నిద్రపోయామో లేదోనని పరికించి చూసేది. అప్పటి ఆమె ముఖంలో కనిపించే చెమటబిందువులు ఆ మసకవెన్నెల్లో పగడంరాయిమీద ఆరబెట్టిన ముత్యాల్లా కనిపించేవి.

నాకంటే రెండేళ్ళు చిన్నదైన ఆమె అంత సుఖపడిపోవడం చూస్తుంటే ఈర్ష్యలాంటిది తెలుకొండెలా లేచేది. ఇంట్లో మొదట ఆడపిల్లలకి పెళ్ళిచేయాలని పెద్దలు ఎందుకంటారో నాకప్పుడు అర్థమైంది.

ఇదిగో ఇలాంటి సమయంలో నాకో పెళ్ళి సంబంధం వచ్చింది. పెళ్ళికొడుకు పేరు ఆనంద్. మా పక్క ఊరే. ఇందుకూరుపేటలో ఎ.డి.ఓ. ముందూ వెనకా ఎవరూ లేరు. శుక్రవారం రోజు పెళ్ళిచూపులకొస్తున్నట్లు అతని దగ్గర్నుంచి వర్తమానం అందింది.

నాకు అప్పట్నుంచీ కాలు ఓ దగ్గర నిలువలేదు. ఏం చేస్తున్నా ఏదో అలజడి నన్ను ఊపేయడం ప్రారంభించింది. కళ్ళు మూసుకుంటే చాలు ఏదో అస్పష్టమైన రూపం నామీద వాలిపోతున్నట్లే వుంది. సాయంకాలం కాలవగట్లంట నడుస్తుంటే ఎవరో నా పైట చెంగును వెనకనుంచి లాగుతున్న భ్రమ కలుగుతోంది. స్నానం చేయడానికి బట్టలన్నీ విప్పుతుంటే ఎవరో దొంగచాటుగా చూస్తున్న భావనే గుబులు పుట్టిస్తోంది. ఇరవైమూడేళ్ళ యవ్వనం ఇంద్రజాలం ఇదంతానని సరిపెట్టుకున్నాను.

శుక్రవారం రానే వచ్చింది. ఆ రోజే నాన్నా, అన్నయ్యా కోర్టుపనిమీద నెల్లూరు వెళ్ళాల్సివచ్చింది.

'మీరే ఎలానో మేనేజ్‌చేసెయ్యండి. ఈ వాయిదా విషయం మరిచిపోయి శుక్రవారం వస్తానంటే సరే నన్నాను' అని నాన్న వెళ్ళిపోయాడు.

ఇంట్లో నేనూ, అమ్మా, వదినా మిగిలాం.

**(ఇంకావుంది)**



మనస్సు మీద భారం ఉండదు
శరీరం మీద భారం ఉండదు
ప్రతి రోజూ ఒక మాత్ర
Rx
CONTRACEPTIVE PILLS
माला·डी
Mala·D
గర్భ నిరోధక మాత్రలు
ప్యాకెట్ ఒక్కొక్కటి 2 రూపాయలకు లభిస్తుంది
davp 93/437 Telugu

# దంపతుల మధ్య అబద్ధాలు!

అబద్ధం ఆడి ఏమీ నిర్మించలేమనీ,ఏ బంధాన్నీ కొనసాగించలేమనేది నేటికీ మనం నమ్మే విషయం. ముఖ్యంగా వివాహబంధంలో అబద్ధానికి తావుండకూడదంటారు పెద్దలు. ఒకరిమీద మరొకరికి విశ్వాసం, ఒకరిమాటమీద మరొకరికి నమ్మకం వున్నప్పుడే ప్రేమ జనిస్తుందని, ప్రేమ పునాదిగా నిర్మించుకున్న సంసార సౌధమే కలకాలం నిలుస్తుందని అంటారు.

పెళ్ళిచేసుకున్న జంట మొదటిరోజున చెప్పుకునే కబుర్లు, చేసుకునే బాసలు మూసపోసినట్టు ఒకేలా వుంటాయి. ఒకరికొకరుగా బ్రతకాలనుకుంటారు. ఒకరికి తెలియకుండా మరొకరు ఏ పనీ చేయకూడదని ఒట్టు పెట్టుకుంటారు. అబద్ధాలు ఆడకూడదని వాగ్దానాలు చేసుకుంటారు. ఆ మూడు రాత్రులు గడిచిన తరువాత సాగే సంసారంలో తమ తొలి రాత్రి మాటలు ఎంతవరకు నిలబెట్టుకున్నామని ఎందరు తరచి చూసుకుంటారు?

## నిజమా! అబద్ధమా!

వారలా వెనక్కితిరిగి చూసుకోకపోవడానికి కారణముంది. వారు చేసుకున్న బాసలన్నీ సంసారపు అనుభవాన్నిచవిచూడక పూర్వానివి. ఆ తరువాత తాము గడిపే కాలంలో వారు పూర్తిగా నిజమేచెబుతారా? అబద్ధాలు అసలు ఆడరా? వారు ఆడే అబద్ధాలు, చెప్పే నిజాలమీదే వారి దాంపత్య జీవితం ఆధారపడి వుంటుందా?

ఏభై, అరవై సంవత్సరాల వైవాహిక జీవితం ఆనందంగా గడిపినవారంతా ఒక్కసారికూడా అబద్ధం ఆడలేదనుకోవాలా? అసలు సంసారంలో నిజం లేదా అబద్ధం అనే విషయంలో శాస్త్రప్రకారం కానీ, అనుభవం ప్రకారం కానీ ఏకాభిప్రాయానికి రావడం చాలా కష్టమంటారు.

మొదటిరాత్రి ఒకరిదగ్గర మరొకరు నిజం దాచకూడదంటూ చేసుకున్న మాటలు ఆచరించడం కష్టమని అతిత్వరలోనే అర్థంచేసుకుంటారు భార్యాభర్తలు. అందుకే వారు అనుభవంలో రాజీమార్గం అనుసరిస్తారని, తమంత తాముగా పూర్తి నిజాలను చెప్పరని, అవతలివ్యక్తి నిజం చెప్పడంలేదని తెలిసినా అడ్డుకునే ప్రయత్నం చేయరని ఒకవర్గంవారు వివరిస్తున్నారు.

## అబద్ధాలు కూడా అవసరం

"వివాహబంధంలో పూర్తిగా నిజమే చెబుతూ ఆనందంగా బ్రతకటం అతికష్టమని, ఒక్కొక్కసారి బాధాకరంగా కూడా వుంటుందని, అయినా నిజం చెప్పటాన్ని మానేసిన రోజున నిజమైన ప్రేమను అనుభవించటం, దాంపత్యబంధాన్ని ఆనందించటం తగ్గిపోతుందని" మరో వర్గానికి ప్రాతినిధ్యం వహిస్తున్న వారి అభిప్రాయం.

వివాహం విజయవంతమవ్వాలంటే ప్రేమతో పాటు ఒకింత అబద్ధాలు కూడా అవసరమని ఇంకొంత మంది అంటారు. రెండు వేరు వేరు ప్రాంతాల్లో, భిన్నమైన వాతావరణాల్లో, భిన్నదృక్పథాలతో పెంచబడ్డ స్త్రీ, పురుషులు హఠాత్తుగా ఒకచోట కలిసి వివాహం పేరుతో బంధాన్ని ఏర్పరచుకున్నప్పుడు ఇబ్బందులు ఎదురవటం చాలాసహజం. ఇద్దరి భావాలు ఒకేలా వుండవు. అభిరుచుల్లో తేడా వుండవచ్చు.



సత్యమార్గాన్ని ఎంచుకుని ఒకరి అంశాలలో మరొకరు తప్పులెంచుకుంటూ కూర్చుంటే సంసారం సజావుగా సాగుతుందా!

సంసారంలో ఒకరికొకరు సహకరించుకుని ముందుకు సాగేలా వుండాలికానీ, ఒకరికొకరు బ్రేక్‌లు వేస్తున్నట్లుగా వుండనే వుండకూడదు.

రెండు వేరు వేరు ప్రాంతాల్లో, భిన్నమైన వాతావరణాల్లో, భిన్నదృక్పథాలతో పెంచబడ్డ స్త్రీ, పురుషులు హఠాత్తుగా ఒకచోట కలిసి వివాహంపేరుతో బంధాన్ని ఏర్పరచుకున్నప్పుడు ఇబ్బందులు ఎదురవటం చాలాసహజం.

ఇద్దరి భావాలు ఒకేలా వుండవు. అభిరుచుల్లో తేడా వుండవచ్చు. విభేదాలు వచ్చినప్పుడు వాటిని పూర్తిగా చర్చించుకుని ఒక అంగీకారానికి రాగల చిత్తశుద్ధి వుండాలి. నిజం మాట్లాడకపోవడం వేరు, అబద్ధం చెప్పడం వేరు అనే విషయాన్ని గుర్తించాలి.

## దంపతుల అనుభవాలు

ఇరవై సంవత్సరాలు సంసారంచేసిన తరువాత కూడా భర్త జీతం ఎంతో, ఆయన అకౌంట్ ఏ బ్యాంక్‌లోవుందో, ఆ అకౌంట్‌లో ఎంత డబ్బుందో తెలియని భార్యలున్నారు. భార్య ఆ విషయం గురించి తెలుసుకునేందుకు ఆసక్తి చూపకపోవడం ఒక కారణం కావచ్చు. భార్య అడిగినా చెప్పని భర్త మరో కారణం కావచ్చు. భార్యకు తన గురించిన పూర్తి వివరాలు చెప్పాల్సిన అవసరం ఎంత మాత్రం లేదనేది ఈ భర్తల ఉద్దేశం.

భర్త అన్నివిషయాలు చెప్పనంతమాత్రాన తనమీద ప్రేమలేదని భార్య అనుకోదు. భార్యకు అన్ని విషయాలు చెప్పకపోవడానికి ఆయనకు తగ్గ కారణమేదో వుండి తీరుతుంది. అనవసరంగా ఇతరుల ముందు తమ ఆదాయం గురించి భార్య ఎక్కడ మాట్లాడుతుందోననే భయం ఆయనది. ఇందులో భర్త అబద్ధం ఆడడంలేదు. నిజంచెప్పడంలేదంతే. దీనివలన సంసారంలో ఇబ్బంది తలెత్తదు.

## పూర్తి నిజం ప్రమాదమా!

పూర్తి నిజం చెప్పడం ప్రమాదాలకు దారితీస్తుందనేది మరొకరి అనుభవం. సాధారణంగా చదువుకునే రోజుల్లో ఆడైనా, మగైనా ఎవరో ఒకరిమీద ఇష్టత ప్రదర్శించడం సహజం. అది కొందరిలో ప్రేమకు దారి తీస్తుంది. మరికొందరిలో ఆ ఇష్టత మౌనంగా మిగిలిపోతుంది. ప్రేమగా మారిన తరువాత దంపతులయ్యే జంటలు తక్కువే.

అయితే పెళ్లికాగానే తన ప్రేమ వ్యవహారం తప్పనిసరిగా భర్త లేదా భార్యకో చెప్పాలా! కొత్తగా కోటి కోర్కెలతో వివాహజీవితం ఆరంభించబోయే క్షణంలో తన మనసు అంతకుముందే కొంత చలించిందని చెప్పుకోవడంవల్ల ప్రయోజనం ఏమిటి? ఆ విషయం ఆలోచించక తన కాలేజీ ప్రేమకథను చెప్పుకున్న యువకుడికి వివాహ జీవితం నరకమవటం ఖాయం. అదేభార్య తన ప్రేమకథనం చెప్పుకుంటే భర్త వదిలేసినా వదిలేస్తాడు.

అందుకే గత జీవితంలోని నిజానిజాలను వదిలేసి, సాగబోయే జీవితంలో నిజంమీద నిలబడితే చాలంటారు ఈ దంపతులు. జరుగుతున్న జీవితంలోని నిజాలను చెప్పడం కూడా కోరి కష్టాలను తెచ్చుకోవడమేనంటారు మరికొందరు దంపతులు.

ఇటీవలి కాలంలో ఆడవారు కూడా ఉద్యోగాలు చేస్తున్నారు. ఉద్యోగ ధర్మంగా మగవారితో కలిసి మాట్లాడడం, పార్టీలకు వెళ్లటం కొన్ని సందర్భాల్లో తప్పదు.

ఆఫీసులో పనిసమయంలో కొందరు వేసే జోక్‌లు సందర్భానుసారంగా నవ్వు తెప్పిస్తాయి. ఆ సంఘటన ఇంటికి వచ్చిన తరువాత కూడా నవ్వు తెప్పించవచ్చు. అది భర్తకు కూడా నవ్వు తెప్పిస్తుందనే నమ్మకంతో చెప్పిన భార్యకు, ఆ రాత్రి భర్త చూసిన చూపు ఇంకెప్పుడూ నిజం చెప్పకూడదనిపిస్తుంది.

"ఆఫీసుల్లో జరిగే ప్రతి అంశాన్ని భర్తకు చెపితే సంసారాలు నిలబడవంటుంది" ఒక ఉద్యోగిని.

## శ్రీవారి అసత్యాలు

ఉద్యోగం చేసే మగవారికి కూడా కొన్నిరకాల కష్టాలు తప్పవు. అనుకోకుండా పార్టీలో బలవంతం మీద మందు పుచ్చుకుని, ఆ విషయాన్ని గర్వంగా భార్యకు చెప్పి భంగపడ్డ భర్తలున్నారు. ఆఫీసులోని ఆడకొలీగ్స్ అందాలను, వారు డ్రస్ వేసుకునే పద్ధతులను వివరిస్తూ, అలాగే తన భార్య వుండాలని కోరుకున్న భర్తకు 'మీరు ఆఫీసులో చేస్తున్న నిర్వాకం ఇదేనన్నమాట' అనే ఈసడింపు.

ఆ రోజు పడకగదిలో కూడా పడుకోని భార్య ప్రవర్తన అనుభవంలోకి వస్తుంది. అవతలి పడతి అందంగా కనిపించినా ఆ విషయాన్ని భార్యతో చెప్పకూడదని, ఒకవేళ బలవంతంమీద మందు పుచ్చుకున్న నోటినుండి వాసన రాకుండా రిఫ్రెషనర్ వాడాలని భర్తలు నేర్చుకునే విషయం.

## 'నిజం' కూడని పరిస్థితులు

భార్యాభర్తల్లో ఒకరికొకరికి నచ్చని అంశాలు అనేకం వుంటాయి. ఉదాహరణకు తన భర్త హుందాగా అందరిముందు ప్రవర్తించాలని భార్య కోరుకుంటుంది.



అప్పుడప్పుడూ కొన్ని నిజాలు దాచక తప్పదు

అదేవిధంగా తన స్నేహితులముందుకు అందంగా అలంకరించుకుని రావాలని భర్త కోరుకుంటాడు.

అయితే అందుకు భిన్నంగా జరిగిన సందర్భాల్లో ఏంచేయాలి? తక్షణం అందరి ఎదుట తన అభిప్రాయాలను ప్రకటించాలా! లేక అలా వున్నా బాగానే వుందని, అయితే అంతకన్నా బాగుండే ప్రయత్నం చేయాలని నచ్చచెప్పాలా! ఏది మంచి పద్ధతి? ఏ పద్ధతివల్ల ఎక్కువ ఫలితం వుంటుంది?

ఇటువంటి సందర్భాలలో నిజానికి తావుండకూడదనేది అందరూ అంగీకరించే విషయం.

కొన్ని సందర్భాలలో భార్యాభర్తల్లో ఎవరో ఒకరు ఇతరులతో అబద్ధం ఆడాల్సివస్తుంది. అటువంటి సమయంలో 'సత్యమునే పలకవలెనంటూ' ఆ మాటలు అబద్ధాలని తెలిసేలా ప్రవర్తిస్తే అవతలి వ్యక్తి పరిస్థితి ఎలా వుంటుంది? కాబట్టి కొన్ని సమయాలలో నిజం పనికిరాదు.

## నిజం చెప్పకపోవడం

నిజం మాట్లాడకపోవడం వేరు, అబద్ధం చెప్పడం వేరు అనే విషయాన్ని గుర్తించాలి. నిజం చెప్పకపోవడం తప్పు కాదనేది ఎక్కువమంది దంపతుల అభిప్రాయం. నిజం చెప్పి చిక్కులను కొనితెచ్చుకునేకన్నా ఆ నిజాన్ని చెప్పకుండావుండడమే మంచిదంటారు. అయితే నిజం కప్పిపుచ్చడానికి అబద్ధం ఆడడం మాత్రం అంతమంచిది కాదు.

నిజం ఎందుకు చెప్పలేదనే ప్రశ్నను ఎలాగైనా సమర్థించుకోవచ్చు. కానీ అబద్ధం ఎందుకాడావనే దాన్ని సమర్థించుకోవటం కష్టం. ఒక అబద్ధం కప్పిపుచ్చడానికి మరికొన్ని అబద్ధాలు ఆడాల్సి వస్తుంది.

## ఎందుకు దాచాలి?

నిజాన్ని దాచడం అవసరమేనని దంపతులు ఎక్కువమంది అంగీకరిస్తున్నారు. తన భాగస్వామి భావాన్ని దెబ్బతీయకుండా వుండేందుకు నిజాన్ని దాచడంలో తప్పులేదంటారు వీరు.

తానెంతో, అందంగా వుంటాననే నమ్మకంగల భార్యను అందం లేకున్నా మెచ్చుకుంటాడు భర్త. అలా మెచ్చుకోవడం అబద్ధం కావచ్చు. అయితే ఆ అబద్ధంతో ఎవరికీ ఇబ్బంది లేదు.

భర్త తనలో లేని గుణాలను చెప్పుకుంటున్నా భార్య మాట్లాడకూడదు. ఆయన తన గొప్పలను చెప్పుకోవడంవల్ల భార్యకు వాటిల్లే నష్టం ఏమిటి? ఆ ప్రశ్న వేసుకుంటే భర్త మాటలకు అడ్డంతగలాల్సిన అవసరం భార్యకువుండదు. సంసారంలో ఇబ్బంది వుండదు.

దంపతులమధ్య ప్రేమ, ఆకర్షణ కొనసాగుతున్నంత కాలం నిజాలు, అబద్ధాల ఇబ్బందులు తలెత్తవు. అవి తగ్గిననాడే ఈ ప్రశ్నలు తలెత్తుతాయి. అవి తగ్గటానికి నిజం మాట్లాడటం ఒక కారణం కాకూడదు. అలాగని పూర్తిగా నిజాలే చెప్పుకునే దంపతులు లేరని కాదు.

- అటువంటివారికి ఎటువంటి విషయాన్నైనా వినగల ధైర్యం, ఒకరికొకరిమీద నమ్మకం వుండాలి.
- విభేదాలు వచ్చినప్పుడు వాటిని పూర్తిగా చర్చించుకుని ఒక అంగీకారానికి రాగల చిత్తశుద్ధి వుండాలి.
- వాదనలో అనుకున్న మాటలను ఆ తరువాత మరో సందర్భంలో ఆయుధాలుగా వాడుకునే అలవాటు వుంటే పూర్తి నిజాలు మాట్లాడే అలవాటు క్రమంగా తగ్గుతుంది.

మారుతున్న సామాజిక విలువలు జీవితంమీద పెరుగుతున్న ఒత్తిడులలో ఒకరికొకరుగా బ్రతుకుతూ సంసారాన్ని కొనసాగించడం కష్టమవుతున్నది. ఇటువంటి పరిస్థితుల్లో నిజాలు, అబద్ధాలు అంటూ అర్థం లేని అంశాలమీద దృష్టి పెంచి సంసారాలను కూలదోసుకుంటున్నవారి సంఖ్య ఎక్కువవుతున్నది.

తనకు కావాల్సిన ప్రేమను పొందుతూ, తిరిగి ఆదే ప్రేమను అందిస్తూ జీవితాన్ని ఆనందంగా నెట్టుకురాగలగడం ఒక కళ. ఆ కళను సాధించడంలో అబద్ధం పాత్ర ఏమేరకు పనికొస్తుందో, ఎవరికి వారు అనుభవపూర్వకంగా తెలుసుకుని పాటించాల్సిందే.

—కె. సోమశేఖర్

సీరియల్



# రావా ఇంటిదాకా

## మేర్లపాక మురళి

సాయంకాలం నాలుగుగంటల ప్రాంతాన పెళ్ళి కొడుకు ఒక్కడే వచ్చాడు. సాధారణంగా పెళ్ళిచూపులకు ఇద్దరు ముగ్గురు ఫ్రెండ్స్‌ను తీసుకుని వస్తారు. ఇదేమిటి? ఈయన ఒక్కరే వచ్చారని అనుకున్నాను.

ఈజీగా తయారయ్యే కేసరి చేసింది మా వదిన. కేసరితోపాటు వడలూ కాల్చింది. టిఫిన్లు అయ్యాక కాఫీ నేనే ఎత్తుకెళ్ళి ఇచ్చాను.

కాఫీగ్లాసును చేతిలోకి తీసుకుని 'మంచినీళ్ళు' అని అడిగాడు.

మరొకసారి నన్ను నింపాదిగా చూసేందుకే నన్ను మంచినీళ్ళు తెమ్మని ఆయన పురమాయించాడని గ్రహించాను.

మంచినీళ్ళు తీసుకెళ్ళి ఇచ్చాను.

అలా మా పెళ్ళిచూపులు జరిగాయి. ప్రత్యేకించి చూపినట్లు కాకుండా ఏదో కాజువల్‌గా చూపినట్లు జరిపించింది మా వదిన. ఇదంతా ఆమె ఐడియానే.

టిఫిన్లు అయ్యాక 'మీకు బోర్‌కొడుతూ వుందను కుంటా. అలా వెళ్ళి మా పొలాలు చూసిరండి. మా నిరుపమ మీకు తోడుగా వస్తుంది' అని అతనితో చెప్పింది వదిన.

'అలానే'

తలుపుచాటున నిలబడి ఇదంతా విన్న నాకు గుండె ఝల్లుమంది. అతనితో కలిసి వెళ్ళడం ఏదో బెరుకుగానూ, థ్రిల్లింగ్‌గానూ వుంది.

ఇద్దరం బయల్దేరాం. దొడ్డిదారిగుండా పొలాల్లోకి ప్రవేశించాం.

నేను ముందూ, అతను వెనకా.

రోజూ చూసే సాయంకాలమే అయినా ఆ రోజు కొత్తగా వున్నట్లుంది నాకు.

పచ్చటిపొలాల మీదనుంచి పైకెగురుతున్న గువ్వలు భూదేవి కాలికివున్న వెండిమువ్వలు గాలికి ఊగుతున్నట్లు కనిపించాయి. ఆకాశంలోని తెల్లటి మబ్బులు రెల్లుదుబ్బుల్లా వున్నాయి. సూర్యకిరణాలు వేలాడ దీసిన కనకాంబరాల దండల్లా అనిపించాయి.

ఇలాంటప్పుడు సంభాషణను నడిపించడం చాలా కష్టం. గుండెల్లో రకరకాల భావనలు గొంతులో సప్తస్వరాలను పలికిస్తు న్నాయి. అందుకే ఇలాంటప్పుడు మాటకంటే పాటే వస్తుంది. కూలీలు పనంతా ముగించు కుని పొలాల గట్లంబడి నడుస్తూ పాటలు ఎందుకు పాడతారో నాకప్పుడు అర్థమైంది.

'మీ ఊరు బావుంది' అన్నాడు అతను.

'ఊఁ' అన్నాను. అంతకుమించి మాట్లాడలేక పోయాను.

'మీరు అంతకంటే చాలా బావున్నారు'

రక్తమంతా నా బుగ్గల్లోకి ఎగజిమ్మింది. నా బుగ్గ ల్లోని ఎరుపు సంధ్యకాంతితో పోటీపడుతున్నట్లని పించింది.

'మీకు నేను నచ్చానా?' ప్రతి మగాడూ టెన్షన్‌తో ఎదురుచూసే ప్రశ్న అది.

అందుకే ఏమీ ఆలస్యం చేయకుండా అతనివంక చూసి నవ్వాను.



**2** వంశీ కాలేజీలో చదువుతుండగా తోటివిద్యార్థిని సుజన పరిచయమవుతుంది. వారిద్దరి పరిచయం ప్రేమగా మారుతుంది. ఇద్దరిదీ ఒకే పల్లెటూరులోని పక్కపక్క వీధులే. పెద్దల అంగీకారం మేరకు ఇద్దరికీ పెళ్ళవుతుంది.

శోభనం ముహూర్తం దగ్గరపడిందనగా సుజనకు 'మూడురోజుల' ఇబ్బంది ఎదురౌతుంది. ఆ మూడురోజులు వీలుకాదు కనుక, నెలరోజుల తరువాత మరోముహూర్తం చూస్తాడు సుజన తండ్రి. సుజన తండ్రికి జ్యోతిషాల పిచ్చి, ముహూర్తాల పిచ్చి ఎక్కువ. అందువల్ల చాలాస్ట్రిక్టుగా వుంటాడు.

ఈ పరిస్థితిలో పక్కవీధిలోనే వుంటున్న సుజన నుంచి వంశీకి ఓ లెటర్ వస్తుంది. శాస్త్రాలకు కట్టుబడివున్న తండ్రిని బోల్తాకొట్టించి ముహూర్తానికి ముందే తమ ఫస్ట్‌నైట్‌ని జరుపుకోవాలనేది ఆ ఉత్తరంలోని సారాంశం.

ఓరోజు సాయంకాలం కాలక్షేపం కోసం తమ ఇంటిప్రక్కనే వుంటున్న నిరుపమని పిలుస్తుంది సుజన. మాటల సందర్భంలో ముందుగా ఆమె యకురాలు అయిన రాధ అనే అమ్మాయి ఫస్ట్‌నైట్ ఎలా జరిగిందో చెప్పి, తన ఫస్ట్‌నైట్ గురించి వివరిస్తుంటుంది నిరుపమ.

'అంటే నచ్చానన్నమాట' అతను రిలీఫ్‌గా ఫీల వడం తెలుస్తూనే వుంది.

మా మాటలకు స్పీడ్‌బ్రేకర్‌లాగా పంటకాల్వ అడ్డొచ్చింది.

కాల్వదాటుతూ అతను తూలిపడబోయాడు. అనాలోచితంగానే తక్కున చేయి అందించాను. నా చేతి ఆసరాతో నిలదొక్కుకున్నాడు. నా చేయి వదలకుండానే కాల్వ దాటాడు.

అప్పుడు నేనేమై పోయానో నాకిప్పటికీ గుర్తే. పూరేకులమధ్య నా శరీరాన్ని వత్తేసినట్లు పులకింత లాంటిది ఒళ్ళంతా పాకినట్లు నాకిప్పటికీ జ్ఞాపకమే.

తిరిగి నడక సాగించాం.

మా పొలాలకు కంచెలాగా రైల్వే ట్రాక్ వుంది. అక్కడికెళ్ళి వంతెనకింద నిలబడ్డాం.

'ఇదిగోండి- ఇవే మా పొలాలు' అన్నాను.

ఆయన నానుంచి బలవంతంగా కళ్ళు తిప్పి చూశాడు.

'ఇది వంతెనలాలేదు. మనకోసం దేవతలు వేసిన పందిరిలా వుంది' అన్నాడు.

నేను చిన్నగా నవ్వాను.

'మీ నవ్వు ఎంత బావుందో తెలుసా? పౌర్ణమి రోజున మంచుశిఖరంమీద ఒంటరిగా నిలబడి వున్నప్పుడు ఆకాశంలోంచి మల్లెపూలవాన కురిస్తే ఎలా వుంటుందో అలా వుంది' అన్నాడు.



సిగ్గుతో ముఖాన్నంతా ఎరుపుచేసుకున్నాను.

అతని చూపులు నన్ను తడుముతున్నట్లే వుంది నాకు. బట్టలు లేనిచోట్లు అతను నాలుకతో అద్దుతున్నట్లే వుంది నాకు. ఇక అక్కడ వుండడం సాధ్యం కాదనిపించి 'రండి! వెళదాం' అన్నాను.

ఏవో రెండు మూడు పొడిమాటలతో ఇల్లు చేరుకున్నాం.

అప్పటికి బస్సు టైమైంది.

అతనిని సాగనంపిస్తూ నేనూ, వదిన గేటు దగ్గరి కొచ్చాం.

'ఉండండి– శకునం బాగా లేనట్లుంది. నీళ్ళు తీసుకొస్తాను' అని చెప్పి వదిన లోపలికెళ్ళింది.

అలా అతన్ని ఊరకనే వీధిలో నిలబెట్టడం బాగుండదనిపించి 'ఏమైనా మరిచిపోయారేమో చూసుకోండి' అన్నాను.

అతను సీరియస్‌గా చొక్కా జేబులు, ప్యాంటు జేబులూ తడుముకుని 'అవును చాలా విలువైంది మరిచిపోయాను' అన్నాడు.

నేను కంగారుగా 'ఏమిటి?' అని అడిగాను.

'మనసు' అన్నాడు నా ముందుకి జరిగి చిన్నగా.

'అదయితే పెళ్లిపీటలమీద ఇచ్చేస్తాన్లెండి' అన్నాను.

అంతలో వదిన వచ్చింది. అతను నీళ్ళు తాగి 'వెళ్ళొస్తానండి' అని బయల్దేరాడు.

వీధిమలుపు తిరిగేవరకు అక్కడే వుండి, ఆ తరువాత లోపలికి వచ్చాం.

'పొలాలవెంబడి షికారు కెళ్లారుకదా! ఏం మాట్లాడుకున్నారు?' అనడిగింది వదిన.

'ఏవో రెండుమూడు మాటలు'

'మీ ఇద్దరికీ ఏకాంతం కల్పించడానికే అలా పంపించాను. పెళ్ళికిముందు ఎంతో కొంత పరిచయముంటేనే ఎదుటివ్యక్తి మీద ఆకర్షణ పుడుతుంది. రెండునిముషాల పెళ్ళిచూపుల్లో గుర్తుంచుకోవడానికీ, నెమరువేసుకోవడానికీ ఏంవుంటుంది? అందుకే పెళ్ళిచూపుల్లో ఇద్దరికీ ఏకాంతం కల్పించాలి. వాళ్ళిద్దరి మధ్యా ఏదో జరిగినప్పుడే ఇద్దరూ పెళ్ళెప్పుడా అని ఎదురుచూస్తారు. రెండు నిముషాల పరిచయమే అయినా రెండు జన్మల అనుబంధంలా తోస్తుంది. కానీ చాలా ఇళ్ళల్లో ఇలాంటివి అనుమతించరు. అందుకే పెళ్ళన్నా అమ్మాయిలోకానీ, అబ్బాయిలో కానీ ఉత్సుకత వుండదు. ఏదో ఇది తప్పని తతంగంలా అనిపిస్తుంది'

వయసులో చిన్నదే అయినా బుర్రలో పెద్దదనిపించింది మా వదిన. ఆమె చెప్పింది అక్షరాలా నిజం. మేం అలా షికారుకెళ్ళడంవల్ల మా ఇద్దరి మధ్యా ఏదో ఆకర్షణ పుట్టింది. నాకైతే మేం షికారుకెళ్ళడం ప్రతిక్షణమూ గుర్తొచ్చేది.

తల వంచుకుని ఇల్లు ఊడుస్తుంటే నిశ్శబ్దంగా నా వెనకే అతను వచ్చి బొడ్లో దోపుకున్న పైటకొంగును లాగినట్లే వుండేది. ముంగిట్లో ముగ్గులు పెడుతుంటే వెనకే వచ్చి నా కళ్ళను మూసినట్లే తుళ్ళిపడేదాన్ని. బావిలోంచి నీళ్ళు తోడుతున్నప్పుడు అతను నా ఎదురుగా నిలబడి నీళ్ళు పోయమని దోసిలి పట్టినట్లే ఊహించేదాన్ని.

రాత్రి చంద్రవంక కింద పడుకున్నప్పుడు అతను నా నడుం మడతల్లో ముత్యాలను కుమ్మరించి చక్కిలిగింతలు పెట్టినట్లే భ్రమించేదాన్ని.

కాల్వ దాటుతున్నప్పుడు అతను చేయి పట్టుకోవడం గుర్తొస్తే ఇక ఏ పనీ చేయాలనిపించేది కాదు. రక్తమంతా దేనికోసమో శరీరంలో ప్రదక్షిణలు చేసేది. ఎద అంతా బరువుగా శృంగార ప్రబంధాన్ని అక్కడ ఒత్తుకున్నట్లు అనిపించేది. కళ్ళు మరో లోకంలో తెరుచుకుని ఊహల పట్టుచీరకు కలల జరీ అంచును నేసేవి.

ఇటునుంచి రెండు ఉత్తరాలు అటు వెళ్ళడం– అటునుంచి రెండు జాబులు ఇటు రావడంతో పెళ్ళి ఫిక్సయిపోయింది.

నా ఆనందానికి అవధుల్లేకుండా పోయింది.

చాలారోజుల్నుంచే పెళ్ళి హడావుడి మొదలైంది. నెల్లూరులోని ఓ సత్రంలో పెళ్ళి. ఆ రోజు సాయంకాలం నాలుగు గంటలకల్లా మేము నెల్లూరుకు చేరుకున్నాం. సత్రంలోని ఓ గదిలో మకాం. అతన్ని చూడాలన్న బలమైన కోరిక నేను కట్టుకున్న పట్టుచీరకంటే బరువుగా తయారైంది.

కానీ వీలుపడలేదు.

రాత్రి పదిగంటలప్పుడు ఆయన్ని నలుగుపెట్టడానికి పెళ్లిపందిట్లోకి తీసుకొచ్చారు. అప్పుడు చూశాను. ఏదో ఆత్మీయతాభావం జీవితంలో మొదటిసారిగా ఫీలయ్యాను.

తెల్లవారుఝామున మూడుగంటలకి పెళ్ళి.

పెళ్ళిపీటలమీద కూర్చున్నప్పుడు మధ్యలో ఆయన 'ఏదీ నా మనసు? పెళ్ళిపందిట్లో తిరిగి ఇచ్చేస్తానన్నావ్' అని అడిగాడు.

'ఈ రాత్రికి– శోభనం గదిలో తమలపాకు చిలకలో చుట్టి ఇచ్చేస్తాన్లెండి' అన్నాను.

'ఈ పెళ్ళిపందిరి కాస్త పట్టెమంచం అయిపోయి, ఆహూతులంతా అదృశ్యమై పోతే బావుండు' అన్నాడు.

'ఎవరు మాయమై పోయినా మన పెళ్ళి జరిపిస్తున్న పురోహితుడుమాత్రం అదృశ్యం కాడు. దక్షిణ ఇచ్చేదాకా కదలడు'

ఇలా మేమిద్దరం పెళ్ళిపందిరిలోంచే మాట్లాడడం మొదలుపెట్టాం. మేమిద్దరం కొత్తవాళ్ళం కామన్న ఫీలింగ్. పెళ్ళిచూపుల్లో మా మధ్య జరిగిన రెండు మూడు సంఘటనలవల్ల ఆ భావన కలిగిందనుకుంటాను. మా వదినకు మనసులోనే థాంక్స్ చెప్పుకున్నాను.

మధ్యాహ్నం భోజనాలయ్యాక బంధువులంతా వెళ్ళిపోయారు. నాన్న, అమ్మా, అన్నయ్యా, వదినలు మొదటిరాత్రి ఏర్పాట్లు చూడడానికి మా ఊరు చేరుకున్నారు.

రాత్రి ఏడుగంటల ప్రాంతాన మేము సత్రంనుంచి ఊరికి కారులో బయల్దేరాం. నేనూ, ఆనంద్ వెనక సీట్లో కూర్చున్నాం. డ్రైవర్ పక్కన మా చిన్నాన్న కూర్చున్నాడు.

కారు నెల్లూరు టౌన్ దాటి శివార్లలో ఆగింది. అందరం కాఫీలు తాగాం. కాఫీ తాగుతుంటే 'నీ ఎంగిలికాఫీ తాగాలనిపిస్తోంది' అన్నాడు ఆనంద్. మా చిన్నాన్న వింటాడేమోనని కళ్ళతోనే ఆయన వైపు చూపించాను.

నిజానికి అంత సరసుడైన భర్త దొరకడం నా అదృష్టమని మనసు ఆనందంతో గంతులేస్తోంది.

కారు తిరిగి బయల్దేరింది. దానిలోని చిన్న లైట్ తప్ప చుట్టూ చీకటి. గాలి కొత్త జంటను చూడడానికన్నట్లు లోనికి దూసుకొచ్చేస్తోంది.

'ఈ కారులో అనవసరంగా ఒకటుంది' అన్నాడు ఆనంద్ చిన్నగా.

'మా చిన్నాన్నా?'

'కాదు– మధ్యలో వెలుగుతున్న లైట్'

అది లేకుంటే ఏం చేసేవాడో ఊహించుకుంటేనే ఐస్‌ముక్కలమధ్య నా గుండెను వుంచినట్లయింది.

లైట్‌ను కొంచెంసేపటికి మరిచిపోయినట్లున్నాడు అతని వేళ్ళు ఎక్కడెక్కడో కదులుతున్నాయి. కానీ అతనికి నా పట్టుచీరతప్ప మరేమీ తగలడంలేదు. అతని అవస్థ చూస్తుంటే నాకు నవ్వొస్తోంది.

కారు మా ఊరిని సమీపిస్తోంది.

'మీ చిన్నాన్నా, డ్రైవర్ మాయమై పోయి, ఈ కారు ఇలానే పోతుంటే ఎంత బావుండో' అన్నాడు.

'కారు ఇలానే పోతే బంగాళాఖాతంలో పడిపోతుంది' అన్నాను నవ్వుతూ.



## ఎదిగే ప్రయత్నాలు

అందాలకు కొదువలేని అంజలీజాధర్‌కి తొలి చిత్రం 'మదోష్' ఫ్లాపైనా అవకాశాలకి కొరత ఏర్పడలేదు. కొత్తహీరోయిన్‌గా విజృంభించడానికి అనువైన గ్లామర్ పాత్రలు పొందుతున్న అంజలి తన హీరోలు షారుఖ్‌ఖాన్, సునీల్‌శెట్టిలను, "వారు పెద్దమనిషి తరహాగా వుంటూ, నాకు చాలా సాయపడుతూ, అవసరమైనప్పుడు నన్ను కాపాడుతూ, నాకెంతో ఉపకారం చేస్తున్నా"రంటూ పదే పదే మెచ్చుకుంటోంది.

అలా తారగా ఎదగడానికి పనికొచ్చే ట్రిక్కులలో అప్పుడే ఒకటి ప్రయోగించడం మొదలెట్టిన అంజలీ జాధర్ ముమ్ముందు ఎన్నెన్ని ఛాన్సులు కొట్టేస్తుందో!?

అంతలో కారు ఆగింది. కల ఏదో చెదిరినట్లని పించింది.

'అమ్మా నిరుపమా! మీరిద్దరూ వెళ్ళి విఘ్నేశ్వరుడికి మొక్కుకురండి' చిన్నాన్న చెప్పడంతో నేను పరిసరాలను గమనించాను.

మేం విఘ్నేశ్వరుడి గుడి దగ్గరికి వచ్చాం. మా ప్రాంతంలో ఆ గుడి చాలా ఫేమస్. ఎవరు ఏ పని చేయాలన్నా ఆ దేవుడికి మొదట మొక్కాల్సిందే.

చిన్నాన్న కారు దగ్గరే వుండిపోయాడు. నేనూ, ఆనంద్ గుడి దగ్గరికి వెళ్ళాం. మమ్మల్ని చూడగానే పూజారి ఆహ్వానించాడు. హారతి ఇచ్చాడు.

'మూడు ప్రదక్షిణలు చేయండమ్మా'

గుడిముందే లైటు వుండటంవల్ల వెనుక భాగమంతా చీకటిగా వుంది. గుడి అంతా నాకు బాగా పరిచయమైన స్థలం కావడంవల్ల నేనే ముందు నడిచాను.

గుడి వెనక్కి వచ్చాను. మసకచీకటిలో అడుగు లేస్తున్నాను. అదిగో-అప్పుడు పడింది ఆనంద్ చేయి నా నడుంమీద. కోరికనంతా పిడికిలిగా చేసినట్లు అక్కడ గట్టిగా అదిమాడు.

అలానే నిలబడిపోయాను. ఒంట్లోని నరాలన్నీ నడుం దగ్గరే కేంద్రీకృతమైనట్లు ఝల్లుమంది. అక్కడ మొదలైన సంచలనం శరీరాన్ని ఊపుతోంది.

అతను వెనకనుంచే నామీద వాలి, తన పెదవుల్ని నా పెదవులపై అదిమిపెట్టాడు. యుగాలుగా ఘనీభవించిన విరహం అప్పుడే ద్రవీకరించడం మొదలుపెట్టినట్లు తడి మొదలైంది.

అతని చేయి అక్కడినుంచి కిందకు దిగుతుంటే అప్పుడు మేల్కొన్నాను. సుతారంగా అతని చేతిని విడిపించుకుని ముందుకు నడిచాను.

ఒక్కప్రదక్షిణంతోనే సరిపెట్టేశాను. పూజారికికూడా విషయం అర్థమైందో ఏమో బలవంతం చేయలేదు.

తిరిగి కారు బయలుదేరింది.

ఇంటికొచ్చేసరికి ఎనిమిదైంది.

బాగా అలసటగా వుందనిపించి గదిలోకి వెళ్ళి, అలా నడుం వాల్చాను.

భోజనాలు ప్రారంభమయ్యాయి. బంధువుల కోలాహలంతో, సంభాషణలతో హడావుడిగా వుంది.

అప్పుడప్పుడు ఊర్లోని స్త్రీలు వచ్చి పెళ్ళికూతురి అలంకరణలో వున్న నన్ను చూసి వెళుతున్నారు.

మా అమ్మ వచ్చి 'భోజనానికి లేవవే' అంటే అలసటనంతా పక్కకు నెట్టి లేచాను. నన్ను ఎగాదిగా చూస్తున్న అమ్మ కంగారుగా 'వడ్డాణం ఎక్కడే' అని అడిగింది.

నా గుండెల్లో పెద్ద బండ రాయి పడ్డట్టు అదిరిపోయాను. ఆందోళనతో నా నడుంవైపు చూసుకున్నాను.

వడ్డాణం లేదు- ఎక్కడో పడిపోయింది.

క్షణంలో ఈ వార్త అంతా పాకిపోయింది.

వడ్డిస్తున్నవాళ్ళు కూడా చేష్టలుడిగి నిలుచుండిపోవడంతో భోజనాలు ఆగిపోయాయి. భోజనం చేస్తున్న వాళ్ళు అంతటితో సరిపెట్టుకుని లేచేశారు.

ఆకలి, నిద్ర, అలసట అన్నీ ఎగిరిపోయాయి నాకు. అటూ ఇటూ వెదుక్కుంటూ ముందు గదిలోకి వచ్చాను.

శోభనం కోసం దాన్ని ఏర్పాటుచేసినట్లున్నారు. మల్లెపూలదండలు మంచం నాలుగువైపులనుంచీ కిందకు జార్చారు. బెడ్‌మీదంతా మల్లెపూలు పరిచారు. అంతా సవ్యంగా జరిగివుంటే మరో గంటకు ఫస్ట్‌నైట్ మొదలయ్యేది.

ఇది జరిగిన తరువాత భోజనాలు తిరిగి ప్రారంభం కాలేదు. ఎవరికైనా ఆకలేస్తేగదా. అందరూ అలా డీప్ షాక్‌లో పడిపోయారు.

వరదవచ్చి వేళ్ళను పెకలిస్తే పడిపోయిన చెట్టులాగా నేను మంచంమీద పడిపోయాను.

నా కళ్ళల్లో నీళ్ళు.

మా అమ్మ ఏడుపు లంకించుకుంది. 'అది మనది కాదే- జాగ్రత్తగా వుండమంటే నా మాటను ఖాతరు చేశావా? ఇప్పుడు పెదరాయుడికి ఏం చెప్పమంటావే' అంటూ శోకాలు ప్రారంభించింది.

ఆ వడ్డాణం మాది కాదు. మా ఊర్లోని మోతుబరి పెదరాయుడి భార్యది. మొత్తం పాతికసవర్లు. అంటే దాదాపు ఎనభైవేల రూపాయలు. దాన్ని తిరిగి చేసి ఇచ్చే స్తోమత మాకు లేదు. నాకు తెలియకుండానే ఏడుపు తన్నుకొచ్చింది.

క్షణంలో ఈ వార్త ఇల్లంతా పాకిపోయింది. పెళ్ళికళ మాయమై ప్రేతకళ వచ్చేసింది. మా నాన్న అయితే ఈ విషయం వినగానే స్పృహతప్పి పడిపోయాడు. వరండాలో పడుకోబెట్టి, గుండెను మర్దనం చేశాకగానీ లేవలేదు.

అంతవరకు చిన్నపిల్లలా ఆనందంతో గెంతిన మా ఇల్లు ఠక్కున అవిటిదైపోయినట్లు నిశ్శబ్దం పేరుకుపోయింది. ఎవరి ముఖంలోనూ కత్తివేటుకు నెత్తురు చుక్కలేదు.

అంతా బావుంటేనే మనిషి. ఏ మాత్రం గాడి తప్పినా మనిషి కుదేలైపోతాడు. జలుబుచేసినా మనం భరించలేం. ఆత్మవిశ్వాసాన్ని కోల్పోతాం.

మనం తప్ప ప్రపంచమంతా బావున్నట్లు బాధపడిపోతాం. అలాంటిది స్థాయికి మించిన వస్తువును పోగొట్టుకుంటే ఎలా వుంటుందో అలా తయారైంది మా ఇల్లంతా.

అంతవరకు అంత మంచివాడితో పెళ్ళి అయినందుకు సంతోషంతో ఉక్కిరిబిక్కిరి అవుతున్న నాలో కూడా దుఃఖం సుళ్ళు తిరుగుతోంది. ఈ పెళ్ళి జరక్కుండా వుంటే ఈ విషాదం జరిగివుండదు కదా. ఈ పెళ్ళెందుకు జరిగిందిరా భగవంతుడా అను

## అరవిందస్వామి హీరోగా...

'రోజా' హీరో అరవిందస్వామిని మరోమారు హీరోని చేస్తూ మణిరత్నం 'బొంబాయి' అనే చిత్రాన్ని తీస్తున్నాడు. రాత్రి సమయంలో చిత్రీకరిస్తున్న ఈ చిత్రం ప్రత్యేకంగా రూపుదిద్దుకుంటోందిట.

పూర్తయ్యేదాకా ఏ వివరాలూ బయటపడే అవకాశంలేని ఈ ఫిల్మ్ గురించి ఎన్నో ఊహాగానాలు వినిపిస్తున్నాయి. అతివల మనసుదోచే అందగాడు అరవిందస్వామి హీరోగా పాపులర్ అయ్యే మరో చిత్రం కావచ్చు ఇది. ఇప్పటికే అతడి కొన్ని డబ్బింగ్ చిత్రాలు తెలుగులో రానున్నాయి.



## చికెన్ కుర్మా

కావలసినవి : చికెన్ 1 కిలో, ఉల్లిపాయలు 4, పచ్చిమిర్చి 6, కొబ్బరి పావుచెక్క, పెరుగు 1 కప్పు, ఉప్పు తగినంత, పసుపు కొద్దిగా, కారం 3 స్పూన్స్, ధనియాలు 2 స్పూన్స్, సోపు అరస్పూన్, గసగసాలు 2 స్పూన్స్, లవంగాలు 6, దాల్చినచెక్క 6, యాలకులు 4, బిరంజీ ఆకు కొద్దిగా, జీడిపప్పు 50 గ్రాములు, కొత్తిమీర 1 కట్ట, నూనె 150 గ్రా., అల్లం, వెల్లుల్లిముద్ద 2 స్పూన్స్.



చేసేవిధానం : స్కిన్ తీసిన చికెన్ ముక్కలు కడగాలి. కొబ్బరితురుము, గసగసాలు, సగం జీడిపప్పు నూరాలి. ధనియాలు, సోపు, 4 లవంగాలు, 4 దాల్చిన చెక్కలు, 2 యాలకులు వేడిచేసి పొడిచేయాలి. 2 ఉల్లిపాయలు నూరాలి. మిగిలిన ఉల్లిపాయలు, పచ్చిమిర్చి సన్నగా పొడవు ముక్కలు తరగాలి. చికెన్‌ముక్కలకు ఉప్పు, పసుపు, కారం, ఉల్లి ముద్ద, అల్లం, వెల్లుల్లి ముద్ద, పెరుగు, కొబ్బరి, గసగసాలు, జీడిపప్పు ముద్ద అన్నీ కలిపి పట్టించి 15 నిముషాలు నానబెట్టాలి.

స్టౌమీద పాత్రపెట్టి సగం నూనె వేడిచేసి ఉల్లిపాయ, పచ్చిమిర్చిముక్కలు వేయించి నానబెట్టిన చికెన్ వేసి వేయించాలి. పెరుగు, మసాలాలు పట్టించడం వలన నీరు వస్తుంది. ఈ నీటి లోనే చికెన్ ఉడికిపోతుంది.

కూర ఉడికి మంచి వాసన వస్తుంది. అప్పుడు దించి, మరొక బాణలి స్టౌమీద పెట్టి నూనె వేడిచేసి జీడిపప్పు, బిరంజీ ఆకు, లవంగాలు, యాలకులు, దాల్చినచెక్క వేసి దోరగా వేయించి ఉడికించిన కూరలో చికెన్ ముక్కలు మాత్రమే చిల్లుల గరిటతో తీసి నూనెలో వేయాలి. గ్రేవి వేయకూడదు.

చికెన్ ముక్కలు ఎర్రగా వేయించి మసాలాపొడి చల్లి కలియబెట్టి గ్రేవి కూడా వేయాలి. 1 కప్పు నీరువేసి ఉడికించి కొత్తిమీర చల్లి దించాలి.

ఈ కుర్మా చాలా రుచిగా వుంటుంది. పలావ్, అన్నం, చపాతీలకు వడ్డించాలి. —సి. పద్మావతి

కుంటూ. ఓ మూల మాసిపోయిన బట్టల మూటలా కూర్చుండిపోయాను. ఈ పెళ్ళి జరగడానికి ప్రధాన కారణమైన మా వదినని తిట్టుకున్నాను. జాణ కాబట్టే అలా పెళ్ళిచూపుల్లో అతని వెంట వెళ్ళమన్న ఐడియా ఇచ్చిందని తిట్టుకున్నాను.

ఇంతకీ వడ్డాణం ఎక్కడ పోయిందో ఎంత గింజాకున్నా తట్టడంలేదు.

కారులో సత్రంనుంచి బయల్దేరాక వెల్లూరులో ఓ టీ బంక్ దగ్గర ఆగాం. ఆ తరువాత గుడి దగ్గర దిగాం. ఈ రెండుచోట్లే పడిపోయే అవకాశం వుంది. ఇది తెలుసుకున్న అన్నయ్య అదే కారులో వెల్లూరు బయల్దేరాడు. నాన్న, మరో నలుగురు లాంతర్లు తీసుకుని కాలినడకన వెళ్ళారు.

అందరం వాళ్ళకోసం చూస్తూ ఏడుస్తున్నాం. ఎవరికైనా శోభనం మాట గుర్తొచ్చుంటే ఒట్టు. పెళ్ళికొడుకుని పట్టించుకున్న నాథుడు లేడు. పెళ్లి పందిట్లో నానా జోక్‌లు వేసిన అతను ఇంత బాధలో ఒక్కసారైనా వచ్చి పలకరించలేదు. దాంతో అతనిమీద నాకు విపరీతమైన కోపమూ, అసహ్యమూ కలిగాయి.

వడ్డాణం పోయిందని వినగానే నా దగ్గరికి వచ్చి 'పోతే పోయిందిలే డియర్- ఆఫ్టరాల్ అదెంత? రేపు సాయంకాలానికి కొత్తది తీసుకొచ్చి రాయుడి ముఖాన కొడదాం' అని అతను అనివుంటే హీరోలా ఫీలయ్యేదాన్నేమో.

మనకు ఎంత వయసొచ్చినా కొన్ని భ్రమలు పోవు. ఆయన కేవలం చిన్న ఉద్యోగి అనీ, ఎనభై వేల రూపాయిలను చెల్లించడం అతనికి అసాధ్యమనీ నాకు తట్టలేదు. ఆ విషాదంనుంచి ఎంత తొందరగా బయటపడతామా అన్న ఆత్రుత తప్ప మరొకటి లేదు. క్షణంక్రితం హీరోలా కనిపించిన అతను అప్పుడు జీరోలా అనిపించాడు. పరిస్థితుల ప్రభావం అలాంటిది.

బాధతో, టెన్షన్‌తో ఎవరికీ నిద్ర రావడంలేదు. అలా గుడ్లప్పగించి చూస్తోంది అమ్మ. వదిన ఏడ్చి ఏడ్చి నిద్రలోకి జారిపోయింది. మా మేనత్త అయితే శవం ముందు కూర్చుని ఏడుస్తున్నట్లు ఏవేవో చెప్పి ఏడుస్తోంది. ఇక నా సంగతి చెప్పక్కర్లేదు-నెల రోజులనుంచి లంఖణాలు చేస్తున్నట్లు తీసిపోయాను.

ఒంటి గంటప్పుడు మా అన్నయ్య వచ్చాడు. అందరం ఒక్కసారిగా చుట్టూ మూగాం.

'సత్రమంతా వెదికాను. హోటల్ దగ్గర కూడా చూశాను. ఎక్కడా దొరకలేదు. ఎందుకైనా మంచిదని పోలీసు రిపోర్ట్ కూడా ఇచ్చాను'

ఆ కబురుతో అందరం మరింత కుంగిపోయాం. ఇక దొరకదన్న నమ్మకం ఏర్పడిపోయింది. ఏం చేయాలో ఎవరికీ తోచడంలేదు.

రెండు దాటుతుండగా నాన్న వచ్చాడు. ఆయన ముఖం చూస్తేనే విషయం అర్థమైంది.

'గుడి దగ్గర వెదికాం. రోడ్డంటా వెదుక్కుంటూ పోయాం. ఊహూఁ లాభంలేకపోయింది' అని కూలబడిపోయాడు.

అందరూ అలా వరండాలో కూర్చుండిపోయారు.

అంతమంది వున్నా ఎవరూ మాట్లాడుకోవడం లేదు. అప్పుడప్పుడూ ఎవరికి తోచింది వాళ్ళు చెబుతున్నారు.

ఆ రాత్రంతా జాగారమే అయ్యింది మాకు. అమ్మ ఓ పక్క, నేను ఓ పక్కా, మా వదిన మరో పక్కా కూర్చుని మాలో మేమే ఏడ్చుకుంటున్నాం. నిద్ర మధ్యలో ఉలిక్కిపడి లేచినట్లుంది వదిన. అమ్మ ఎక్కిళ్ళు పెట్టి ఏడుస్తుంటే నామీద నాకే అసహ్యం వేసింది. నా నిర్లక్ష్యంవల్ల ఇదంతా జరిగిందన్న గిల్టీ ఫీలింగ్ నన్ను పీక్కుతింటోంది.

నాలుగున్నర ప్రాంతంలో పందిట్లో ఏదో హడావుడి మొదలైంది. అందరం నిస్సత్తువలోనే పైకి లేచాం.

మా మేనత్త పరుగుపరుగున అక్కడినుంచి వచ్చి నన్ను వాటేసుకుని 'వడ్డాణం దొరికిందే' అంటూ ఊపేసింది.

మంత్రించినట్టు బాధ మాయమై, దాని స్థానంలో ఆనందం పెల్లుబుకుతోంది.

'ఎక్కడ?'

'గుడి వెనక వుందట. రాత్రి మీ నాన్న, పూజారి ముందే వెదికారటగానీ వెనక చూడలేదట. ఇప్పుడు పూజారి లేచి నీళ్ళు తోడడానికి వెనుకనున్న బావి దగ్గరకి వెళుతుంటే కనిపించిందట'

అమ్మా, వదినా చిన్నపిల్లలే అయిపోయారు. ఎక్కడ చేతుల్ని వదులుగా వుంచితే పైకెగిరిపోతుందేమోనన్నట్లు అమ్మ అయితే వడ్డాణాన్ని రెండు చేతులతో గట్టిగా పట్టుకుంది.

అక్కడ ఎవరూ లేకుంటే నాన్న సంతోషం పట్టలేక పల్టీలు కొట్టి వుండేవాడు. అన్నయ్య అందరికీ మరోమారు లడ్లు పంచిపెట్టాడు.

అంతవరకు వున్న టెన్షన్, బాధ మంత్రించినట్టు మాయమయ్యాయి.

వడ్డాణం ఎప్పుడు పడిపోయిందో తెలిసింది. గుడి చుట్టూ ప్రదక్షిణం చేస్తూ అతను నా నడుం మీద చేయి వేసినప్పుడు అది నడుం పులకింతకో, ఒంటి జలదరింపుకో ఊడి పడిపోయుంటుంది. ఇదంతా ఆయనమూలంగానే జరిగింది.

అప్పుడొచ్చింది నిద్ర. కనురెప్పల మధ్య అడ్డంగా వున్నస్టిక్స్‌ను తొలగించినట్లు వాటంతటవే మూసుకుపోయాయి. మగతగా నిద్రలోకి జారిపోయాను.

ఎవరో నా పెదవులమీద వేళ్ళ కొసలతో రాస్తున్నట్లనిపించి కళ్లువిప్పాను. ఎదురుగా నా భర్త ఆనంద్.

'నిద్రా' అని అడిగాడు.

'ఆఁ'

'మన ఫస్ట్‌నైట్ ఏ ముచ్చటా తీరకనే ముగిసిపోయింది. ఈ రాత్రికైనా...' అంటూ నామీదకు వాలబోయాడు.

నాకు చిర్రెత్తుకొచ్చింది. 'ఇదిగో ఈ యావవల్లే రాత్రంతా టెన్షన్‌తో నరాలు నలిగిపోయాయి. వదలండి-గుడి దగ్గర అంత యావ ప్రదర్శించక గుట్టుగా వుండుంటే ఈ అనర్థమే జరగకపోవును. అంతా మీ నిర్వాకమే. ముందు ఇక్కడినుంచి వెళ్ళండి-మీరు చేయి వేస్తేనే కంపరం పుడుతుంది' అని ఈసడించుకున్నాను.

పాపం మానవుడు ఖంగుతిన్నాడు. ఫస్ట్‌నైట్ జరక్కపోగా భార్యచేత అలా తిట్లు తినడంతో చిన్నబుచ్చుకున్నాడు. మౌనంగా వెళ్ళిపోయాడు.

నేను తిరిగి పడుకుండిపోయాను.

**(ఇంకావుంది)**

# శాంతి కథలు



శ్రీ శ్రీ శ్రీ

విద్యాప్రకాశానందగిరిస్వాములవారు

# అపూర్వమైన పట్టుదల

పూర్వకాలమున ఒకానొక కుటుంబమునందు ఒక పిల్లవాడు జనించెను. ఆ పిల్లవాని తల్లిదండ్రులు ఆ బాలుని భవిష్యత్తు ఎట్లుండునో అను కుతూహలముతో అతనిని జ్యోతిష్కునియొద్దకు తీసికొని వెళ్లి చేయి చూపించిరి.

జ్యోతిష్కుడు చేతిని బాగుగ పరిశీలించి 'ఇతనికి విద్యారేఖ బాగుగా లేద'ని చెప్పెను.

అపుడు తల్లిదండ్రులు ఆ వాక్యమును వినగనే మహాశోకాకులచిత్తులైరి. 'బాల్యకాలములో విద్య చక్కగా నేర్చుకొనినపుడేకదా భవిష్యజ్జీవితము రాణించును, శోభించును! కాని పిల్లవానికి విద్యాదశ లేదని జ్యోతిష్కుడు చెప్పెను. మరి ఏ విధముగా ఈ పిల్లవాని విద్యావిషయకరంగము మూడు పూవులు ఆరు కాయలుగ శోభిల్లగలదు?' అని పిల్లవాని తల్లిదండ్రులు ఆలోచింప మొదలిడిరి.



ఈ విషయములన్నియు ఆ పిల్లవాడు ఆలకించుచునేయుండెను. జ్యోతిష్కుని పలుకులు, తల్లిదండ్రుల అభీష్టము బంధుమిత్రుల తీవ్ర అభిలాష- వీటన్నిటిని ఆ పిల్లవాడు శ్రద్ధతో గమనించుచునే యుండెను. అత్తఱి ఆ బాలుని హృదయములో తీవ్రతరమైన ఉత్సాహము, పౌరుషము, పట్టుదల జనించెను. 'ఏమైననుసరే, నేను విద్యను సాధించి తీరుదును'- అను దృఢతర నిర్ణయమును అతడు గైకొనెను.

వెంటనే ఆ పిల్లవాడు జ్యోతిష్కుల యొద్దకేగి చేతిపై విద్యారేఖ ఏ వైపునుండి ఏ వైపుకు పోవునో బాగుగ కనుంగొనెను. వెంటనే ఇంటికి వచ్చి ఒక చాకు తీసికొని ఆ విద్యారేఖను తానే చేతిమీద గీసికొనెను. అంతటితో ఆగక, అతని మహత్తర నిర్ణయమును అమలునందుంచుటకై అహర్నిశములు పట్టుదలతో, శ్రద్ధతో, ఏకాగ్రతతో విద్యను అభ్యసింప మొదలిడెను.

తత్ఫలితముగ అచిరకాలములోనే ఆ బాలుడు సమస్తశాస్త్రములందును పారంగతుడయ్యెను. ముఖ్యముగ వ్యాకరణమున మహాపండితుడై, ఆచార్యుడై లోకమున విఖ్యాతిగాంచెను. అతడే పాణిని. సంస్కృత వ్యాకరణమునకు అతడే ఆదిపురుషుడు. అతడే ప్రామాణికుడు. కాబట్టి పట్టుదల కలవారు ఎట్టి మహత్కార్యములనైనను తృటిలో సాధించివేయుదురు.

నీతి : పట్టుదల, సాహసము కలవారు మహత్కార్యములను అవలీలగ సాధించివేయుదురు. కాబట్టి ఆధ్యాత్మరంగమున సాధకుడు ఈ జన్మయందే తరించివేయవలెను. గమ్యమును చేరవలెను- అను దృఢతర దీక్షాబద్ధుడై చక్కగ సాధనలను అభ్యసించుచు త్వరలో ఆత్మానుభూతిని బడసి జన్మను ధన్యమొనర్చుకొనుగాక.

సీరియల్

# రారా మా ఇంటిదాకా



## -మేర్లపాక మురళి

ఉదయం ఏడు గంటల వరకు ఎవరూ నిద్ర లేవలేదు. అంత పొద్దెక్కేవరకూ పడుకోవడం మా ఇంట్లో అదే మొదటిసారి. స్నానంచేసి టిఫిన్లు ముగించేసరికి పదైంది.

'అలా నెల్లూరుకు వెళ్ళి మ్యాట్నీ చూసి రండి. ఇక్కడ పెళ్లికొడుక్కి బోర్‌కొడుతూ వుంటుంది' అన్నాడు అన్నయ్య.

దాంతో నేనూ, ఆనంద్ బయల్దేరాం.

తెల్లవారుజామున విసుక్కోవడాన్ని పూర్తిగా మరిచిపోయినట్లు నేను ప్రవర్తించాను. మొదట్లో ఆయన కొంత విముఖత ప్రదర్శించినప్పటికీ తరువాత సర్దుకున్నాడు.

హొటల్‌లో భోజనం చేసి థియేటర్‌కి వెళ్ళాం. చిరంజీవి సినిమా. జనం బాగానే వున్నారు. టికెట్లు ఇవ్వడానికి ఇంకా టైమ్ వుండడంతో మేమిద్దరం బుకింగ్‌కి దగ్గరగా నిలుచున్నాం.

అంతలో ఓ జంట వచ్చి మా పక్కన నిలబడు న్నారు. ఆమెకి ముప్పై ఏళ్ళ పైమాటే. అతనికి ముప్పై ఏడేళ్ళు వుంటాయి రమారమిగా.

వాళ్ళు మాట్లాడుకుంటూ వుండగానే అతనికి మూర్ఛరోగం వచ్చింది. చెట్టంత మనిషి మొదలు నరికిన చెట్టులా దభీమని కిందపడి పోయాడు. కాళ్లూ చేతులూ కొట్టు కుంటున్నాడు.

ఆమె బొడ్లోని తాళాల గుత్తి తీసి అతనిచేతిలో పెట్టింది. ఇద్దరు ముగ్గురు చుట్టూ చేరి ఏవో ఉచిత సలహాలు ఇస్తున్నారు.

అంతలో టికెట్లు ఇస్తున్నట్లు బెల్ మోగింది. ఆమె హడావుడి పడిపోయి, భర్తను అలానే వదిలి టికెట్ల కోసం కౌంటర్ దగ్గరికి పరిగెత్తింది.

స్త్రీలు కొద్దిమందేవుండడంతో ఆమెకి తొందరగానే టికెట్లు దొరికాయి. తిరిగి భర్త దగ్గరికి వచ్చింది. అప్పటికి అతనికి జబ్బు తగ్గింది. లేచి కూర్చున్నాడు.

ఆనంద్ కూడా టికెట్లు తీసుకొచ్చి 'వెళదాం రా' అని పిలిచాడు.

[illegible]ం బాల్కనీకి నడుస్తూండగా ఆనంద్ ఆమె మీద [illegible]చుకుపడ్డాడు-'చూశావా! ఆ మహాతల్లి ఏం చేసి[illegible]. మూర్ఛలో గిలగిలా కొట్టుకుంటున్న భర్తని వదిలేసి టికెట్ల కోసం పరిగెత్తింది. ఛీఛీ'

ఎందుకనో నేను మాత్రం అసహ్యించుకోలేక పోయాను.

సినిమా వదిలాక ఊరికి వచ్చాం.

కాస్తంత రిలాక్సయి, స్నానం ముగించేటప్పటికి ఎనిమిదైంది. మా మేనత్త నా దగ్గరికి వచ్చింది.

'ఇంకా ఏమిటలా కూర్చున్నావ్? లేచి తయా రవ్వు. తెల్లచీర కట్టుకో. రాత్రి ఆ వెధవ వడ్డాణంవల్ల ఏ ముచ్చటా తీరలేదు' అంటూ తొందరచేసింది.

నేను చీర మార్చుకున్నాను.

తొమ్మిది గంటల ప్రాంతాన గదిలోకి తోశారు ముత్తైదువులు.

'వెల్‌కమ్' అన్నాడు ఆనంద్.

నవ్వుతూ ఆయన దగ్గిరికి అడుగులు వేశాను. నేను కూడా ఎప్పుడూ చూసుకోని నా నగ్నత్వాన్ని మరికొద్దిసేపట్లో అతను చూస్తాడని ఊహ రావడం తోనే నాకు తెలియకుండానే సిగ్గు మేఘంలా కమ్మే సింది. తల వంచుకున్నాను.

నా ఎడమ చేయి పట్టుకుని మంచంమీదకి లాగాడు. పక్కన కూర్చున్నాను. చలికాలం నిప్పుల కుంప టికి దగ్గరగా కూర్చున్నట్లుంది.

'ఈ రోజు తెల్లచీరే ఎందుకు కట్టుకోమంటారో తెలుసా?'

తెలియనట్లు తల ఊపాను.

'రాత్రి గదిలో ఏం జరిగిందో తెలుసుకోవడానికి. రంగుల చీర యితే ఏమాత్రం నలిగిందో తెలుసుకోవడం కష్టం కనుక. మరి పాలు ఎందుకిచ్చి పంపిస్తారో చెప్పుకో'

మళ్ళీ నేను తల అడ్డంగా ఊపాను.

'భార్యాభర్తలిద్దరంటే నగపాలు కాబట్టి' అని చమత్కారంగా

3 వంశీ కాలే[illegible] చదువుతుండగా తోటి విద్యార్థిని సుజన పరిచయమవుతుంది. వారిద్దరి పరిచయం [illegible]గా మారుతుంది. ఇద్దరిదీ ఒకే పల్లెటూరులోని పక్క పక్క వీధులే. పెద్దల అం[illegible] మేరకు ఇద్దరికీ పెళ్ళవుతుంది.

శోభనం [illegible]ర్తం దగ్గిరపడిందనగా సుజనకు 'మూడురోజుల' ఇబ్బంది ఎదురౌ తుంది. ఆ మూ[illegible]లు వీలుకాదు కనుక మరో ముహూర్తం చూస్తాడు సుజన తండ్రి. సుజన [illegible]కి జ్యోతిషాల పిచ్చి ఎక్కువ. అందువల్ల చాలా స్ట్రిక్టుగా వుంటాడు. ఈ పరిస్థితుల్లో [illegible]నుంచి వంశీకి ఓ లెటరు వస్తుంది. ముహూర్తానికిముందే తమ ఫస్ట్‌నైట్ జరుపుకోవాల[illegible] ఉత్తరంలోని సారాంశం. ఓ రోజు తమ ఇంటి పక్కనే వుంటున్న [illegible] సుజన. ఆమె తన ఫస్ట్‌నైట్ గురించి చెబుతుంటుంది. పెళ్ళితతంగం నియమని[illegible] శోభనం సమయానికి ఎవరినో అడిగి తెచ్చి పెట్టుకున్న వడ్డాణం పూర్తయిన[illegible]తి నిరుపమ శోభనం ఆగిపోతుంది. పోవడం[illegible]



నవ్వాడు. నా భుజంమీద చేయి వేశాడు.

అప్పటికి సర్దుకున్నాను.

నోటికి పాలు అందించాను. కొంత తాగి కొంత నాకిచ్చాడు.

'రాత్రి చేయి వేస్తేనే కంపరం అన్నావుగా-మరి తీసెయ్యనా?' అంటూ చేయి తీసెయ్యబోయాడు.

మగవాళ్ళు అంతే. తమ భార్యో, ప్రేయసో ఏదైనా అంటే పూర్తిగా అప్‌సెట్ అయిపోతారు. బహుశా మేల్ సుప్రమసీవల్ల కావచ్చు.

దాన్ని క్లియర్ చేసుకుని, తిరిగి పుంజుకునేంత వరకు గింగిల్లాడిపోతారు.

చేయి తీయకుండా నా చేతు లతో అదిమిపట్టుకున్నాను.

'మధ్యాహ్నం థియేటర్ దగ్గర ఒకామె మూర్ఛ రోగంవచ్చిన భర్తను అలా వదిలేసి టికెట్ల కోసం వెళ్ళిందని తిట్టారుకదా'

'అవును'

'కానీ ఆమెను నేను అసహ్యించుకోలేకపోయాను'

అతను అర్థంకానట్లు నావైపు చూశాడు.

'మీరు ఒకకోణంలోంచి చూసి ఆమె ఘోరమైన తప్పు చేసిందని అనుకుంటున్నారు. కానీ మరో కోణంలోంచి ఆలోచించండి. వయసుబట్టి చూస్తే వాళ్ళిద్దరికీ వివాహం అయి ఏడెనిమిది సంవత్సరాలై వుంటుంది. పెళ్లి అయిన మూణ్ణెళ్ళకో ఆర్నెల్లకో ఆయనకి మూర్ఛ వచ్చుంటుంది. మొదటిసారి గింగిలా కొట్టుకుంటున్న భర్తను చూసి ఆమె పడిన ఆందోళన అంతా ఇంతా అయి వుండదు.

కన్నీళ్ళు కారిపోతూ వుంటే దగ్గరుండి సపర్యలు చేసుంటుంది. ఆయనికి మూర్ఛరోగం వుందని, అయితే ప్రమాదం ఏమీ లేదని అత్తామామలు అప్పుడు చెప్పుంటారు. ఆ నిజాన్ని జీర్ణించుకోవడానికే ఆమెకి చాలా కాలం పట్టుంటుంది.

తిరిగి రెండోసారి పడిపోయినప్పుడు మొదటిసారి పడినంత ఆందోళన పడి వుండదు. పది నిముషాంకి తిరిగి ఆయన లేచి కూర్చుంటాడని తెలియడంవల్ల సహజంగానే కంగారు తగ్గి వుంటుంది. ఇలా ఏడెనిమిది సంవత్సరాలు గడవడంతో అది ఆమెకి మామూలై పోయుంటుంది. అందుకే ఆయన్ని వదిలి టికెట్ల కోసం వెళ్లుంటుంది.

మనం మొదటిసారి చూస్తున్నామని ఆమేనీ అంత ఆందోళనపడమని అనడం భావ్యమా చెప్పండి'

ఆనంద్ నావైపు కొత్తగా చూస్తున్నాడు.

'అలానే ఇదీ ఆలోచించండి. పాతిక సవర్ల వద్దాణమంటే మాటలు కాదు. అది దొరకకపోయుంటే కనీసం పది సంవత్సరాలపాటు మా పొలాల్లో పండిన దంతా రాయుడికి ఇచ్చెయ్యాల్సి వచ్చేది. అదంతా మీవల్లే జరిగిందని అనిపించి కసురుకున్నాను. అంతే తప్ప మరేంకాదు'

'నేనూ అర్థంచేసుకున్నాననుకో'

'మిమ్మల్ని కసురుకున్నాక ఎందుకలా చేశానా అని బాధపడ్డాను. మీ వేలు తగిలితేనే పులకించిపోయిన

## విదేశీ షోలు తెచ్చే డబ్బు





ఇప్పుడు రెండుచేతులా సంపాదిస్తున్న హీరోలుగా గోవిందా, షారుఖ్‌ఖాన్, అమీర్‌ఖాన్, పేర్లనే చెప్పు కుంటున్నారు. ఓ వైపు సినిమాల్లో మంచి డిమాండ్ వున్నా మరోవైపు విదేశాల్లో ఇచ్చే షోలలో కూడా పాల్గొంటూ వారు లక్షలక్షలు గడిస్తున్నారు.

ఒక షోకి ఒక్కొక్కరికీ 35,000 డాలర్లు (దాదాపు 11 లక్షల రూపాయలు) లభిస్తోంది. వారు ఓ సినిమాకి పడే శ్రమ, తీసుకునే డబ్బులతో పోలిస్తే (షారుఖ్‌ఖాన్ ఓ సినిమాకి 20 లక్షలు తీసుకుంటాడు) అది చాలా ఎక్కువే. ఈ విదేశీ షోల సంపాదన రుచి మరిగి ఈ యువహీరోలు సినిమాలు మానుకున్నా ఆశ్చర్యపోనక్కరలేదేమో!

నేను మిమ్మల్ని అలా కసురుకున్నానంటే అదంతా పరిస్థితుల్లో వచ్చిన మార్పేనన్న విషయం బోధ పడింది. నైతిక విలువలుగానీ, సభ్యతా సంస్కారాలు గానీ-ఏవీ వాటికంతటవే ఎగ్జిస్ట్‌కావు. అన్నీ ఒకదాని కొకటి ఇంటర్‌లింక్. కానీ చాలామంది వేటికి వాటినే విడదీసి చూసి ఎదుటి వ్యక్తులమీద తీర్పులు చెప్పేస్తుం టారు. మనుషులందరూ మంచివాళ్ళే-పరిస్థితులు చెడ్డవే. ఈ జీవనసత్యం నాకెప్పుడు బోధపడిందో తెలుసా? మిమ్మల్ని తిట్టిన తరువాత. ఈ సత్యం బోధపడ్డాక మనుషుల్ని ద్వేషించలేం-ప్రేమిస్తాం'

ఆనంద్ నన్ను విస్మయంతో అలాగే రెప్ప వేయకుండా చూస్తుండిపోయాడు.

'ఏమిటలా చూస్తారు? ఇది సెకండ్‌నైట్ అయినా మనకు ఫస్ట్‌నైట్-లైట్ ఆర్పేయండి' అన్నాను.

• • •

రెండు రోజులు గడిచిపోయాయి.

సుజన తండ్రినీ, ఆమె ముగ్గురు అక్కయ్యలనూ బోల్తాకొట్టించి, తన ఫస్ట్‌నైట్ ముచ్చట ఎలా తీర్చు కోవాలా అన్న విషయం తప్ప మరొకటి ఆలోచించ లేకపోయాడు వంశీ.

చివరికి ఓ బ్రహ్మాండమైన ఐడియా తట్టిందతనికి. తన ఐడియా ఎక్కడైనా బెడిసికొడుతుందేమోనన్న అనుమానంతో దాన్ని అటూ ఇటూ తిప్పి ఆలోచిం చాడు. కానీ ఎక్కడా ఏ లొసుగులూ కనిపించలేదు. దాంతో ఇక ఆగలేకపోయాడు. ఆ రాత్రే తన పథకాన్ని ఆచరణలో పెట్టాలనుకున్నాడు.

సైన్యం తను చేయబోయే ఆపరేషన్‌కు కోడ్‌నేమ్ పెట్టుకున్నట్లు అతనూ తన పథకానికి 'పూలపల్లకి' అని నామకరణం చేశాడు.

ఆ ప్లాన్ ప్రకారం ఆ రోజు రాత్రి తొమ్మిది గంట లకు తన తల్లి బర్త్‌డే అని చెప్పి సత్యనారాయణరావు ఇంట్లో మత్తుమందు కలిపిన స్వీట్స్ ఇస్తాడు. అవి తినగానే అందరూ నిద్రలోకి జారుకుంటారు. నిద్రంటే అలాంటి ఇలాంటి నిద్ర కాదు- కుంభకర్ణుడి నిద్ర. అప్పుడు తన ఫస్ట్‌నైట్ లాగించేయాలన్నది అతని ప్లాన్. ఈ ప్లాన్ కోసం అన్నీ ముందుజాగ్రత్తలు తీసుకున్నాడు. ఆ ఇంట్లో ఎవరికైనా షుగర్ కంప్లైంట్ వుందో లేదో కూడా కనుక్కొన్నాడు. అదృష్టం కొద్దీ ఎవరికీ చక్కెరవ్యాధి లేదు.

రాత్రికే తమ ఫస్ట్‌నైట్ అనీ, తను ఇచ్చిన స్వీట్ తినవద్దనీ, తను రావడానికి వీలుగా దొడ్డితలుపు తీసి వుంచమనీ సుజనకు చెప్పాల్సిందే మిగిలివుంది. ఈ ఇన్‌ఫర్మేషన్‌ని సుజనకి ఎలా పాస్ ఆన్ చేయాలో తెలియక తలపట్టుకున్నాడు.

ఉత్తరం రాసి పోస్ట్‌చేసే టైమ్‌లేదు. ఎవరైనా నమ్మకస్థుంచేత పంపించాలని సుజనకు ఓ చిన్న ఉత్తరం రాశాడు.

దాన్ని జేబులో పెట్టుకుని ఇంట్లోంచి బయట పడ్డాడు. అప్పుడు ఉదయం పదిగంటలైంది. నీరెండ లోకానికి వెచ్చటి రగ్గు కప్పుతున్నట్లుంది.

జనం అటూ ఇటూ తిరుగుతూ హడావుడి పడిపోతున్నారు.

వంశీ ఊరి మొదట్లో వున్న నాడార్ అంగడికి వచ్చాడు. అక్కడ ఓ సిగరెట్ కొనుక్కుని వెలిగించి, బయటకొచ్చి నిలబడ్డాడు.

ఉత్తరాన్ని ఎవరైనా పిల్లంచేత పంపించాలని అను కున్నాడుకానీ అదంత శ్రేయస్కరంగా అనిపించలేదు. డాబామీదున్న సుజనను కలుసుకుని ఉత్తరం అంది వ్వడం పిల్లలకు సాధ్యం కాదు.

మరిక ఏంచేయాలో అని ఆలోచిస్తుంటే అంగ డికి వస్తున్న సుబ్బులు కనిపించింది.

ఆమెకి పాతికేళ్లుంటాయి. ప్యాకెట్‌లోని హల్వాలా వుంటుంది. పెళ్ళయిందిగానీ భర్తను వదిలేసింది. పెళ్లి అయిన మొదట్లో ఓ రోజు సాయంకాలం మల్లె పూల దండను జడలో జారవిడుచుకున్నట్లు పెట్టు కుంది. దీన్ని చూసి మొగుడు ఉగ్రుడైపోయాడు.

"ఏమిటా పూలు పెట్టుకోవడం? ఇలాంటి వెధ వ్వేషాలు సంసారస్త్రీలు వేయరు" అని కేకలేశాడు.

దీంతో ఆమెకి చిర్రెత్తుకొచ్చింది. "ఏమిట్రా కూశావ్! నేను సంసారస్త్రీని కానా? పూలు జారవిడుచు కోవడం అంత చేయరాని తప్పా? నువ్వు మాత్రం చొక్కా పైబటన్ పెట్టుకోకుండా వుంటావే. అది తప్పు కాదా? అలా చొక్కా బటన్ పెట్టుకోకుండా తిరగొద్దని నేనెప్పుడైనా అన్నానా?

అయినా తెలియకడుగుతాను- మొగుడైనంత మాత్రాన పూలు ఎలా పెట్టుకోవాలా అన్నది కూడా నువ్వే నిర్ణయించాలా? ఇలాంటివి నా దగ్గర కుదరవు. పుట్టింట్లో అయినా, మెట్టినింటిలోనైనా నా కాయ కష్టంమీదే నేను బతికేది. మరి అలాంటప్పుడు నీ దగ్గర మాటలు పడుతూ నేనెందుకు ఇక్కడుండాలి? ఇదిగో ఇప్పుడే వెళ్ళిపోతున్నాను" అని వచ్చేసింది.

పెళ్ళికిముందునించీ పనిచేస్తున్న సత్యనారాయణ రావుఇంట్లోనే తిరిగి పనికి కుదిరింది. భర్తను వదిలేసి నందుకు ఎప్పుడూ ఆమె పశ్చాత్తాపం చెందలేదు. ఇలా మొగుడ్ని వదిలెయ్యడం ఎవరైనా ఏమైనా అన్నా సహించేది కాదు.

"మీవాళ్లలో భర్తను వదిలేసినవాళ్ళు చాలా ఎక్కువే. అదే మా ఇళ్ళల్లో అయితే ఆడవాళ్లు ఇలా చేయరు" అని రైతులు తమ స్త్రీలంతా పతివ్రతలన్న అర్థం స్ఫురించేటట్లు మాట్లాడితే బెదిరిపొయ్యేది కాదు.

"అవును- మీ స్త్రీలు మాలా మొగుడ్ని వదిలి



వచ్చెయ్యరు. కారణం పతివ్రతలని కాదు– మరో దిక్కులేక. మాలా కాయకష్టంచేసి బతకలేరుగనుక మొగుడు మనసు కష్టపడేట్లు మాట్లాడినా నోరు విప్పరు. రోజూ తంతున్నా కాళ్ళు కదపరు" అని సూటిగా చెప్పేది.

ఆమె మాటల్లోని నిజం నషాళానికి అంటడంవల్ల పారబోయేదేతప్ప మాటలు వచ్చేవికావు రైతులకి.

అలాంటి సుబ్బులుచేత ఉత్తరం పంపడానికి ధైర్యం చాలకపోయింది వంశీకి. అందుకే అలా ఆమె వస్తున్న వైపు చూస్తూ నిలుచున్నాడు.

ఆమె అతని దగ్గరికొచ్చింది. "ఏమండీ పెళ్ళికొడుకు గారూ! ఇక్కడ నిలబడి మా సుజనమ్మకోసం తపస్సు చేస్తున్నారా ఏమిటి" అని అడిగింది.

"తపస్సా అని చిన్నగా అడుగుతావేమిటి? దానికి రెండు మూడు విశేషణాలు కలిపితేగానీ నా అవస్థకి సరిపోదు" అన్నాడు వంశీ.

"మీకు చెడ్డ ఇబ్బందొచ్చిపడింది. పెళ్ళి జరిగీ ఆ ముచ్చట తీరలేదు పాపం. మా బాబుకి ఆ శాస్త్రాల జబ్బు ఎప్పుడు వదుల్తుందోగానీ అందర్నీ ఇబ్బందుల్లో పెట్టేస్తున్నాడు. ఊరికి బయల్దేరాలన్నా పంచాంగాలన్నీ తిరగేస్తాడు. ఇంటికొచ్చిన చుట్టాల్ని కూడా వదలడు. వాళ్ళు బయల్దేరడం– టైమ్ బాగాలేదనో, పడమట చుక్క పొడిచిందనో– ఈయన నిలిపివేయడం జరుగుతూనే వుంటుంది.

ఇలా నాలుగైదురోజులు గడిస్తేగానీ ఆ చుట్టాలకు



తిరిగి ఊరెళ్ళే యోగం కుదరదు"

"ప్రయాణం అయితే వాయిదా వేసుకోవచ్చు. కానీ ఇది ఫస్ట్‌నైట్"

"మా బాబుది మరీ చాదస్తంలెండి. భార్యాభర్తలు కలుసుకోవడానికి ముహూర్తాలూ, గర్భాదానమంత్రాలూ ఎందుకు? ఇవన్నీ లేకుండా జంతువులు పిల్లల్ని కనడంలేదా ఏమిటి?"

"జంతువులకీ ఇవన్నీ వుండవు. ఈ కార్యక్రమమంతా వాటికి సీజనల్ బిజినెస్. కానీ మనుషులకు అలా కాదుగా. అందుకే ఇవన్నీ పెట్టారని అంటుంటాడు మీ సత్యనారాయణబాబు"

"అంతేనంటారా? కానీ నాకు మాత్రం ఇవన్నీ శుద్దదండుగనిపిస్తుంది. మా గంగాభవాని చెప్పినట్లు శోభనానికి ఇన్ని తంటాలు పడాలా!"

"గంగాభవానా! ఆమెవరు?" అతను ఎంతో ఆశ్చర్యపోతూ అడిగాడు.

"గంగాభవానా!" అంటూ తెరలు తెరలుగా నవ్వి. కొంతసేపటికి తనను తాను కంట్రోల్ చేసుకుని "మా వాడపిల్లే. అదంతా ఓ తమాషా. చెబుతాను వినండి" అని ప్రారంభించింది.

"గంగాభవానీ అని మా వాడలో ఓ పిల్ల వుండేది. గంధపుచెక్కలా మెరిసిపోయేది. ఎప్పుడూ పనీపాటా చేసుకునేవాళ్ళంగనుక మాకు ప్రపంచజ్ఞానం ఎలా

### ఆమని రెడీ!

"ఈ రోజుల్లో నిండుగా చీర కట్టుకొని నటిస్తే. ప్రేక్షకులు చూడలేకపోతున్నారు. వెంటనే లేచి వెళ్ళిపోతున్నారు. అందుకే ఎక్స్‌పోజింగ్ చేసితీరాలి. ఇది ఈ తరం అభిరుచి. కాబట్టే నాకూ ఏ అభ్యంతరాలూ లేవు. శ్రుతిమించితే ఎలాగూ సెన్సారుంది. నాకు సరైన గ్లామర్ పాత్ర దొరికితే నా సత్తా ఏంటో చూపిస్తాను" అని ఛాలెంజింగ్‌గా పలుకుతోంది ఆమని.

అందుకే ఇప్పుడు చేస్తున్న చిత్రాల్లో పైటలేకుండానూ, వానల్లో తడిసిపోతూనూ సౌందర్య ప్రదర్శన చేస్తోంది. ఇలా అభ్యంతరాల్లేని స్వేచ్ఛనిస్తే, అవకాశాలు రావడంలోకూడా ఆలస్యం వుండదేమో?!

వుంటుంది? నిద్ర లేచింది మొదలు ఒకటే పని. పొద్దుగుంకేవరకు పనిచేసేవాళ్ళం గనుక రాత్రి కాగానే ముసుగుతన్ని పడుకుండిపోతాం.

ఎప్పుడైనా సినిమాకు వెళ్ళినా పేర్లు రాగానే నిద్ర పోయి, శుభం అన్న అక్షరాలు వచ్చినప్పుడు ఎవరో తట్టి లేపితే లేస్తాం.

గంగాభవానీ అందరిలోకీ మరీ అమాయకపు పిల్ల. ఒక్కర్తో కలిసేదికాదు. ఒక్కర్తో మాట్లాడేది కాదు. తన పని తప్ప మరొకటి పట్టదు. అమాయకత్వం ఆ పిల్లకు ఆభరణంలా అమరింది.

ఇలాంటి గంగాభవానీకి పెళ్ళి కుదిరింది. పెళ్ళికొడుకు ఏదో ఆఫీసులో అటెండర్. పిల్ల టౌన్‌లో వుంటుందికదా అని ఆమె తండ్రి అతనడిగిన అయిదు వేలూ కట్నం కింద ఇచ్చాడు. పెళ్ళిచేసి ఇవ్వడానికి కూడా ఒప్పుకున్నాడు.

మా వాడలో ఏ కార్యానికైనా తప్పక వుండేది రేడియో. రేడియో అంటే బుల్లి రేడియో కాదు- ఇనుపగద్దల్లా వుండే లౌడ్‌స్పీకర్లు పెట్టి పాటలు విన్పిస్తారే అలాంటిదన్నమాట.

ఇలాంటి రేడియోపెట్టి, రెండుమూడు సెట్ల సీరియల్ బల్బులుపెట్టి జామ్‌జామ్ అని గంగాభవానీ పెళ్ళిచేశాడు ఆమె నాన్న.

పెళ్ళికొడుకుదంతా తెచ్చిపెట్టుకున్న స్టైల్ అని మాకర్థమైంది. కుడిచేతికి వాచ్ కట్టాడు. తన పేరును పొడిఅక్షరాల్లో చెక్కిన ఉంగరం వేసుకున్నాడు. కాళ్ళకు బూట్లు, కళ్ళకు నలుపుకళ్ళద్దాలు టిప్‌టాప్‌గా వున్నాడు పెళ్ళికొడుకు.

టౌన్‌లో వుంటున్నానన్న గొప్పలు, ఉద్యోగం చేస్తూ వున్నానన్న గర్వం ప్రతి కదలికలోనూ, మాట్లాడే ప్రతి మాటలోనూ కనిపిస్తోంది.

పెళ్ళి అయిపోయిన రాత్రే శోభనం ఏర్పాటైంది. ఎందుకు ఏదో, ఏది ఎందుకో తెలియని గంగాభవానీ జరిగే తంతులన్నీ ఆశ్చర్యంగా చూస్తోందేతప్ప మరే భావాన్నీ బయటపెట్టలేకపోయింది.

ఆ కొత్తవ్యక్తితో ఇంట్లోకి ఎందుకు తోశారో అర్థంకాక అమాయకంగా చూస్తూ ద్వారం దగ్గర నిలబడిపోయింది. ఓ మూలనున్న కిరోసిన్ దీపం రెక్కలు తెగి ఎగరలేని ఎర్రటి పురుగులా వుంది. నులకమంచం రాక్షసి సాలీడు అల్లిన గూడులా వుంది. దానిమీద పరిచిన రంగురంగుల దుప్పటి అందంగా వుంది.

'నీకోసమే చూస్తున్నాను- రారా- అంత సిగ్గు పడతావేమిటి? అదే మా టౌన్‌లో అయితే ఆడపిల్లలు ఇలా సిగ్గుపడరు తెలుసా?' అన్నాడతను టౌనంతా అతనిదే అయినట్టు.

ఆమె ఒకడుగు ముందుకేసింది.

'పూలజడ అంతా ఓల్డ్ ఫ్యాషన్. ముందు అది విప్పేయ్'

ఆమె మంచంమీద కూర్చుని అతను చెప్పినట్లే పూలజడ విప్పేసింది.

'ఇదే పెళ్లికి నేను కొన్న వాచీ-సీకో- మీ వాడలో ఎవరూ ఇలాంటి వాచీ కట్టుకుని వుండరు- మద్రాసుకు మా ఫ్రెండ్ పోతుంటే డబ్బులిచ్చి తెప్పించాను'





## విజయరమ్యాలే!

ఒళ్ళు చూపించి, కళ్ళు మెరిపించే సెక్సీ ఆకృతుల రమ్యకృష్ణ, తనకీ టాలెంట్ వుందని చెప్తోంది. ఒళ్లు చూపించడం మొదలెట్టాకే దశతిరిగిందని అంగీకరిస్తున్న రమ్యకృష్ణ, ఇప్పుడు తన ప్రతిభని ప్రదర్శించే పాత్రని పోషిస్తున్నానని అంటోంది.

రాఘవేంద్రరావు డైరెక్షన్‌లో, ఆర్.కె. చిత్రంలో వెంకటేష్ సరసన ప్రేమ ప్రధాన పాత్ర పోషిస్తూ "ఇది నా కెరీర్‌లో మరో బెస్ట్ చిత్రం. ఎంతో కృషి చేస్తున్నాను. ఇది ఆర్టిస్టుగా నన్ను మరింత పెంచుతుంది. గ్లామర్, టాలెంట్‌ల మేలుకలయిక ఇది" అని ఆశాభావంతో అంటోంది. రమ్యకృష్ణ సక్సెస్‌గ్రాఫ్ మరి దిగువముఖం పట్టదన్నమాట.

అని వాచీ విప్పి చూపించాడు.

'బూట్లుకూడా కొత్తవే. లేసులు కూడా వున్నాయి' అంటూ మూలపెట్టిన బూట్లు తెప్పించి చూపించాడు.

'మా టౌన్లో కాళ్ళకు బూట్లు లేకుంటే అసలు మతించరు. నీకూ ఓ జత కొనిస్తాలే' అన్నాడు.

'ఇంకెప్పుడూ అలా నడింపాపిట తీసుకోకు. సైడ్‌పాపిటే తీసుకో' అని ఓ అమూల్యమైన సూచన కూడా చేశాడు.

'నేనెప్పుడూ లైఫ్‌బాయ్ సోప్ వాడను. అంతా పియర్సే' అంటూ ప్రారంభించి- 'ఇది సిజర్‌సిగరెట్టు. మా టౌన్లో బాగా డబ్బున్నవాళ్ళే ఇది తాగుతారు' అన్నదాకా చెప్పి ఆమెను పూదరగొట్టాడు.

ఇక ఆ తరువాత అసలు శోభనం ప్రారంభమైంది. మధ్యలో 'నేను టౌన్లో పుట్టి పెరిగి, ఉద్యోగం చేస్తున్నా నీలాంటి పల్లెటూరి పిల్లను ఎందుకు పెళ్ళి చేసుకున్నావో తెలుసా? కన్యకావాలని- టౌన్లో అయితే దొరకరనుకో' అంటూ టౌన్లో వున్న స్త్రీల జాతకాలన్నీ తెలిసినట్లు మాట్లాడాడు.

ఆ పిమ్మట అతను, ఆమె ఓ అరగంటసేపు పెనుగులాడారు. పడకటింట్లో తను ఏ ఆడపిల్లనైనా ఆకట్టుకుంటానని అతనికి ఓ గొప్ప భ్రమ వుండేది. తన చేయి తగిలితే ఏ ఆడపిల్లయినా ఐస్ అయిపోతుందని నమ్మకం. ఆమె కూడా అలానే మురిసిపోయి వుంటుందనీ, ఈ మాట ఆమె నోటంట వినాలని శోభనం ముగిశాక- 'ఎలావుంది మన మొదటిరాత్రి?' అని కళ్ళు తమాషాగా అటూ ఇటూ కదుపుతూ అడిగాడు.

అంతవరకు అతను చెప్పినవన్నీ ఆశ్చర్యంతో విన్న గంగాభవానీ ఆ ప్రశ్నకు జవాబు చెబుతూ- 'ఇదేనా మొదటి రాత్రంటే, ఇదే శోభనం అయితే మా నాన్న నీకెందుకు అయిదువేలు ఇచ్చాడో నాకర్థం కావడంలేదు. దీనికి ఒప్పుకున్నందుకు మా ఎదురింటి రమేష్ నా చేతిలో ఏభై రూపాయలు నోటుంచాడు' అంది.

అంతే- తెల్లవారేసరికి అతను పారిపోయాడు. మళ్ళీ మా వాడకు వచ్చుంటే ఒట్టు" అని గంగాభవాని కథ చెప్పింది సుబ్బులు.

"మీ గంగాభవానీ ఎవరోగానీ కట్నం తీసుకునే మగవాళ్ళని భలే దెబ్బకొట్టింది. ఇంతకీ ఎక్కడికి బయల్దేరావ్?" వంశీ మామూలుగా అయితే ఇంకాస్త ఎంజాయ్ చేసుండేవాడేగానీ ప్రస్తుతం అతనున్న పరిస్థితి వేరు. సుజనకు ఉత్తరం చేరవేయాలన్న తొందరలో వున్నాడు.

"సుజనమ్మకు తలనొప్పిగా వుంది. అమృతాంజనం బాటిల్ తెమ్మంటే ఇటొచ్చాను"

"సుజనకి తలనొప్పా?" కంగారుపడిపోయాడు.

"మరీ అంత తలనొప్పి కాదులే. రాత్రి సరిగా నిద్రపట్టక తల నొప్పులోందట. ఇప్పటికే లేటయింది. వస్తానండీ" అని ఆమె కొట్టువైపు నడిచింది.

ఆమెతో ఉత్తరం పంపడం సేఫ్ అని వంశీకి తెలుసు. కానీ డైరెక్టుగా అడగలేడు. అలా అని ఈ అవకాశాన్నీ జారవిడుచుకోలేడు. ఏం చేయాలా అని ఆలోచిస్తూ అలానే నిలబడిపోయాడు.

సుబ్బులు అమృతాంజనం బాటిల్ కొని దుకాణం మెట్లు దిగుతోంది. ఆమె చేతిలోని ప్యాక్‌ను చూడగానే అతని బుర్రలో ఫ్లాష్ వెలిగింది.

తన తెలివితేటలకి తనే అబ్బురపడిపోతూ- "ఏదీ ఆ బాటిల్ ఒకసారి ఇవ్వు" అని సుబ్బుల్ని అడిగాడు.

ఎక్స్‌పైర్డ్ డేటూ, రేటూ చూస్తూ ఆమె గమనించకుండా ప్యాక్ మూత తీశాడు. మందు ఎలా వాడాలో ముద్రించివున్న కాగితాన్ని అందులోంచి తీసి, దాని స్థానే తను రాసిన ఉత్తరాన్ని పెట్టాడు. తిరిగి మూత పెట్టేసి, "అన్నీ కరెక్ట్‌గానే ఉన్నాయిగానీ, లోపల మందు ఎలా వాడాలో రాసిన కాగితం వుంది. దాన్ని చదువుకుంటే మందు ఎలా వాడాలో తెలుస్తుంది. చదువుకోమను" అని దాన్ని ఇచ్చాడు.

"అలానే"

తన ఆపరేషన్ మొదటి ఘట్టం పూర్తయిందని మురిసిపోయాడు. ఇలా చేయాల్సిన పనులు రెండున్నాయి. ఇవి రెండూ ముగించేస్తే 'పూలపల్లకి' గ్రాండ్ సక్సెస్. ఈ రాత్రే తమకు మొదటిరాత్రవుతుంది. నిజానికి దీనికి మొదటిరాత్రి అని పేరు పెట్టినవాడు మహామేధావి అనిపించింది.

ఆ హుషారులో మిగిలిన పనులు పూర్తిచేయడానికి టౌన్‌కి బయల్దేరాడు.

బస్సు దిగగానే ఆటో వేసుకుని తన మిత్రుడి మెడికల్ షాప్‌కి వెళ్ళాడు. అతన్ని చూడగానే మిత్రుడు సాదరంగా ఆహ్వానించాడు.

**(ఇంకావుంది)**





## సాక్షి

✦ స్పెషల్ ఫీచర్స్‌లో 'ఎమ్.జి.ఆర్. 'రహస్య' సంతానం' బాగుంది. ఆయన హేతువాదతత్వం కలిగివుండి పెంచుకున్న కుమార్తెలకు బాగా చదువుకున్న మధ్యతరగతిలోనివారిని అల్లుళ్లుగా తెచ్చుకోవడం, కుమార్తెలు తండ్రిపట్ల గల అనురాగాన్ని నిరూపించుకునేవిధంగా ఆయనకు ఒక గుడి నిర్మించడంలాంటి అంశాలు ఆసక్తికరంగా వున్నాయి.

'కోపాన్ని జయించే సులువైన పద్ధతులు' స్త్రీపురుష వయోభేదం లేకుండా అందరికీ ఉపయోగపడేలా వున్నాయి. 'దొంగంటే దొంగాకాదు' కథ మా మనసుల్ని దోచింది.

-జి. రఘుపతిరావు, వరంగల్

✦ స్వాతి చినుకులు 'నీలో నిన్ను చూసుకో'లో ఎడిటర్‌గారి మాటలు వెన్నుతట్టి ధైర్యంచెప్పినట్టున్నాయి.

స్పెషల్ ఫీచర్స్‌లో 'ఎమ్.జి.ఆర్. 'రహస్య' సంతానం' చదివి ఎన్నో విషయాలు తెలుసుకున్నాం. 'కోపాన్ని జయించే సులువైన పద్ధతులు' బావున్నాయి. 'రారా మా ఇంటిదాకా' సీరియల్ బ్రహ్మాండంగా సాగుతోంది.

'స్టార్‌డస్ట్'ద్వారా సినీతారల కష్టసుఖాలు తెలుస్తున్నాయి. 'హిట్లర్ మావయ్య'. 'పారడైజ్' సీరియల్స్ బాగున్నాయి.

-డి. మాధవీసత్యనారాయణ, నల్లగొండ

✦ 'లాజిక్' కథ బాగుంది. అవ్వ తెలివితేటలు, సమయస్ఫూర్తి, దయాగుణాలను రచయిత్రి చాలా బాగా ప్రస్ఫుటం చేశారు. ఒక్క పోలీసులేకాదు, ఇతర డిపార్ట్‌మెంట్‌లలోకూడా మనకు దొరికిన వస్తువును నమ్మకంతో వారి చేతిలో పెడితే, వారు దానిని అసలువారి చేతికి అందించినట్లుగా 'బిహేవ్'చేస్తూ తమ స్వప్రయోజనాలకి వినియోగించుకొంటున్నారు. అటువంటి స్వలాభపరులు ఎవరైనా ఈ 'లాజిక్' చదివి మారితే కథ ప్రయోజనం నెరవేరినట్టే!

-కిన్నెర.వి.కళ్యాణిఖని

✦ 'కళ్ళు' కథ చాలా బాగుంది. తల్లీ తనయుల అపురూపమైన అనుబంధాన్ని కళ్లకు కట్టినట్లు రాశారు. ఈ కథ చదివిన తర్వాత కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

-జె. శ్రీధర్, సూర్యారుపేట

✦ స్పెషల్ ఫీచర్స్‌లో 'ఎమ్.జి.ఆర్. 'రహస్య' సంతానం' ఆశ్చర్యం కలిగించింది. 'పువ్వులే నగలు!', 'మదన వసంతోత్సవం "హోళీ"'లు బాగున్నాయి. 'రారా మా ఇంటిదాకా' సీరియల్ బాగుంది.

-ఎ. దయాకర్, రాంపూర్



✦ స్పెషల్‌ఫీచర్స్‌లో 'కోపాన్ని జయించే సులువైన పద్ధతులు' బాగుంది. 'మనిషికి తన కోపమే తన శత్రువు' అనే సామెతను దృష్టిలో వుంచుకుని కోపాన్ని ఎలా తగ్గించుకోవాలో చాలా చక్కగా వివరించారు. 'బెడ్‌రూమ్ గూఢచారులు' చదివితే రాచకుటుంబాలకి కూడా గడ్డు రోజులొస్తాయని తెలిసింది. 'తాతా! అచ్చి!', 'కళ్ళు' కథలు బాగున్నాయి.

-రాజా కనుమోజుల, ఇల్లెందు

✦ స్పెషల్ ఫీచర్స్‌లో 'ఎమ్.జి.ఆర్. 'రహస్య' సంతానం' చదివి చాలా విశేషాలు తెలుసుకున్నాం. '18 ప్లాస్టిక్ సర్జరీలతో మళ్ళీ యవ్వనం!' చదివి ఆశ్చర్యపోయాం. 'రారా మా ఇంటిదాకా', 'హిట్లర్ మావయ్య', 'నిశీథి నియంత' సీరియల్స్ మమ్మల్ని ఆనందపరుస్తున్నాయి.

-చెన్నుపల్లి రామకృష్ణ, ఖమ్మం

✦ స్పెషల్‌ఫీచర్స్‌లో 'కోపాన్ని జయించే సులువైన పద్ధతులు' చదివి చాలా విషయాలు తెలుసుకొన్నాం. 'ఏ రోజున ఏ వస్తువు కొనాలి?', 'పువ్వులే నగలు!' బాగున్నాయి. 'ఇంట్లో క్రిమికీటకాల సమస్య ఎలా పోతుంది' ఉపయుక్తంగా వుంది. 'రారా మా ఇంటిదాకా' సీరియల్ చాలా ఇంట్రెస్టింగ్‌గా వుంది. 'స్టార్‌డస్ట్', 'పారడైజ్' సీరియల్స్ చాలా బాగున్నాయి. 'దొంగంటే దొంగాకాదు'కథ అద్భుతంగా వుంది.

-కె.నరేందర్‌గౌడు, మరికల్

✦ స్పెషల్‌ఫీచర్స్‌లో 'కోపాన్ని జయించే సులువైన పద్ధతులు', 'ఏ రోజున ఏ వస్తువు కొనాలి?' బాగున్నాయి.

'బెడ్‌రూమ్ గూఢచారులు' చదివి ఆశ్చర్యపోయాం. 'దొంగంటే దొంగాకాదు', 'తాతా! అచ్చి!' కథలు బాగున్నాయి. 'రారా మా ఇంటిదాకా', 'పారడైజ్', 'స్టార్‌డస్ట్' సీరియల్స్ బాగుంటున్నాయి.

-ఎన్. వెంకటేశ్వరరెడ్డి, చిన్నముడియం

✦ స్పెషల్ ఫీచర్ 'కోపాన్ని జయించే సులువైన పద్ధతులు'లో ఎన్నో విషయాలు తెలుసుకున్నాం. 'స్టార్‌డస్ట్', 'నిశీథి నియంత', 'పారడైజ్' సీరియల్స్ మమ్మల్ని ఆకట్టుకుంటున్నాయి.

-ఎస్. రవిసాగర్, నెల్లూరు

✦ స్పెషల్‌ఫీచర్స్‌లో 'కోపాన్ని జయించే సులువైన పద్ధతులు', 'ఇంట్లో క్రిమికీటకాల సమస్య ఎలా పోతుంది' చాలా బాగున్నాయి. 'తిరగేసి రాసే యువతి' మమ్మల్నెంతో ఆశ్చర్యపరిచింది. 'పారడైజ్', 'నిశీథి నియంత' సీరియల్స్ ఉత్కంఠభరితంగా సాగుతున్నాయి.

-జె. జయప్రకాష్, మాచర్ల

✦ స్పెషల్ ఫీచర్ 'కోపాన్ని జయించే సులువైన పద్ధతులు'లో చాలా విషయాలు తెలుసుకున్నాం. 'నిశీథి నియంత', 'స్టార్‌డస్ట్', 'రారా మా ఇంటిదాకా' సీరియల్స్ బాగున్నాయి. 'దొంగంటే దొంగాకాదు' కథ బాగుంది. -వి. శివశంకర్, గోరిజవోలు

✦ స్పెషల్‌ఫీచర్స్‌లో 'కోపాన్ని జయించే సులువైన పద్ధతులు', 'పువ్వులే నగలు!', బాగున్నాయి. 'మదన వసంతోత్సవం "హోళీ"'లో చాలా విషయాలు తెలుసుకున్నాం. 'తిరగేసి రాసే యువతి', '18 ప్లాస్టిక్ సర్జరీలతో మళ్లీ యవ్వనం' చాలా ఆశ్చర్యకరంగా వున్నాయి.

-పూడి రాజేశ్వరరావు, ప్రగడపుట్టుగ

✦ స్వాతి చినుకులు 'నీలో నిన్ను చూసుకో'లో ఎడిటర్ గారు మనిషి జీవితంలో ప్రగతిసాధించడానికి భయం ఎలా అడ్డొస్తుందో చాలా చక్కగా వివరించారు.

వచ్చేవారం స్పెషల్

సెలవుల్లో
హాయి హాయిగా...

స్పెషల్‌ఫీచర్స్‌లో 'కోపాన్ని జయించే సులువైన పద్ధతులు' గురించి బాగా విపులీకరించారు. 'ఇంట్లో క్రిమికీటకాల సమస్య ఎలా పోతుంది'లో క్రిమికీటకాలను వదిలించుకొనే ఉపయోగకరమైన చిట్కాలు చాలా తెలుసుకున్నాం. లేడీస్ క్లబ్‌లో 'అందానికి ఆరుసూత్రాలు' మహిళలకు చాలా ఉపయోగకరంగా వున్నాయి.

'లాజిక్' కథ బావుంది. 'దొంగంటే దొంగాకాదు', 'కళ్ళు', 'తాతా! అచ్చి!' కథలు చాలా బాగున్నాయి. 'రారా మా ఇంటిదాకా' సీరియల్ ఇంట్రెస్టింగ్‌గా వుండి మళ్ళీ మళ్ళీ చదవాలనిపిస్తోంది.

-బి. ఊర్మిళ, కర్నూలు

✦ నేడు ప్రేమలూ, ఆప్యాయతలూ మృగ్యమై సగటుమనిషి మనుగడ యాంత్రికంగా మారిపోతోంది.

సదరు విలువల పోషణ ఇంకా వుందంటూ, తల్లీకొడుకు, అత్తాకోడలూ, డాక్టరు రోగి మధ్య సంబంధ బాంధవ్యాలను విభిన్నకోణంలోంచి ఆవిష్కరిస్తూ సృష్టించిన 'కళ్ళు' కథ బావుంది.

అసలుసిసలైన మానవతామూర్తులను పరిచయం చేసిన తీరు, సమస్యల విశ్లేషణ, మధ్యతరగతి మనోభావాల చిత్రణ విశేషంగా ఆకట్టుకున్నాయి.

కొసమెరుపుగా స్వానుభవంలో 'చూపు విలువ' తెలుసుకున్న ఆ తల్లి మరొకరికి చూపు ఇవ్వగలిగే అవకాశాన్ని ఉపయోగించుకోవడం ఆమె ఉన్నత వ్యక్తిత్వానికి పరాకాష్ఠగా కథను ముగించడం చాలా బాగుంది. -పి.వి.ఎస్. చలం, విజయవాడ

✦ స్పెషల్‌ఫీచర్స్‌లో 'కోపాన్ని జయించే సులువైన పద్ధతులు'లో కోపాన్ని తగ్గించుకునే మార్గాలు ఉపయోగకరమైనవి. 'మదన వసంతోత్సవం "హోళీ"'లో ఎన్నో విషయాలు తెలుసుకున్నాం.

'రారా మా ఇంటిదాకా' సీరియల్ ఎక్స్‌పెక్ట్ చేసినదానికన్నా మిన్నగా వుండి, ఇంట్రెస్టింగ్‌గా చదివింపజేస్తోంది.

-యం. సుచరిత, హస్నాబాద్

పని అవుతుందో, లేదో అని కంగారుపడకండి.

సీరియల్



# రాధా ఇంటిదాకా

మేర్లపాక మురళి

"హలో వంశీ! హౌ ఆర్ యు? కొత్తపెళ్ళికొడుకుని ఎలా వున్నావని అడగడమే తప్పనుకో. కొత్త దంపతులకి జీవితం మూడు బెడ్‌రూమ్‌లూ, ఆరు బాత్రూమ్ లుగా వుంటుందనుకుంటా"

"నువ్వు చెప్పింది కరక్టే. కానీ నాకో చిన్న ప్రాబ్లెమ్ వచ్చిపడింది. ముహూర్తం కుదరక ఫస్ట్‌నైట్ నెల రోజులు వాయిదాపడింది. ఇక డీటైల్స్ అడక్కు. ప్రస్తుతం నువ్వు నాకో చిన్న సహాయం చేయాలి"

"ఏమిటో చెప్పు"

"వెరీ సింపుల్– ఏడుమంది ఓ ఆరుగంటలపాటు గాఢనిద్రలోకి జారిపోయే మత్తుమందు కావాలి"

"యుమీన్ స్లీపింగ్ పిల్స్"

"యా! లడ్డూలలో పెట్టి ఇచ్చే వీలుండే మందు ఇవ్వు. ప్రాణహానిగానీ, మరే ఇతర సైడ్ ఎఫెక్ట్స్‌గానీ వుండకూడదు"

"డీటైల్స్ అడగవద్దన్నావు గనుక–అడగకుండా ఇచ్చేస్తాను" అని ఆ మిత్రుడు షాపులోనికి వెళ్లాడు.

మరో అయిదు నిముషాల్లో బయటికి వచ్చి, వంశీ చేతిలో ఏడు చిన్న ప్యాకెట్లను వుంచాడు.

"ఒక్కొక్కదాన్ని ఒక్కొక్క లడ్డూలో మిక్స్‌చేసే సెయ్. ఇది తిన్నవాళ్లు ఆరేడు గంటంపాటు ఏనుగులు వచ్చి తొక్కినా లేవరు"

"ఓ! థాంక్యూ" అని, ఆ తరువాత సెలవు పుచ్చుకుని ఓ మిఠాయి దుకాణానికి వెళ్ళాడు.

ఆ కొట్టు యజమాని మార్వాడీ. రాజస్థాన్‌నుంచి వచ్చి అక్కడ సెటిలయ్యాడు. అతనితో బాగానే పరిచయం వుంది వంశీకి. ఏడు పొట్లాలను అతని చేతిలో వుంచి, ఒక్కో పొట్లాన్ని ఒక్కో లడ్డూలో వేసి తయారుచేసివ్వమని హిందీలో చెప్పాడు.

రెండు మూడు యక్షప్రశ్నలు వేశాక మార్వాడీ లోనికి వెళ్లి, మత్తుమందు బూందీలో కలిపి ఏడు లడ్డూలు తయారుచేసుకుని వచ్చాడు. అతనికి బిల్లు ఇచ్చేసి తిరిగి ఊరికి బయల్దేరాడు వంశీ.

ఇంటికి చేరుకునేసరికి మధ్యాహ్నం రెండయ్యింది. భోజనం ముగించుకుని అలా పడుకుండిపోయాడు.

సాయంకాలం ఆరు గంటల ప్రాంతాన మెలకువ వచ్చింది. స్నానం చేసి శోభనం పెళ్లికొడుకులా తయారయ్యాడు. తెల్లటి పైజామా, జుబ్బా వేసుకుని ఫారిన్‌సెంట్‌ని ఒళ్ళంతా స్ప్రే చేసుకున్నాడు.

రాత్రికి ఫస్ట్‌నైట్ జరిగిపోతుందని నమ్మకంగా అనిపించడంవల్ల ఏదో తెలియని హుషారు ఒక దగ్గిర నిలవనివ్వడంలేదు. అలా పొలాలవెంబడి తిరిగాడు.

రాత్రి ఎనిమిది గంటల ప్రాంతాన తిరిగి ఇంటికి వచ్చి, లడ్డూలను తీసుకుని సత్యనారాయణరావుగారి ఇంటికెళ్ళాడు. వరండాలోనే మామ ఎదురుపడ్డాడు.

అల్లుడు ఎక్కడ ఇంట్లోకి దూసుకొచ్చేసి, శాస్త్రాన్ని మంటగలిపేస్తాడోనన్న కంగారు కళ్ళల్లో కదలాడుతుండగా–"ఏం వంశీ! ఇలా వచ్చావ్?" అని దొంగను నిలబెట్టి ప్రశ్నించినట్లు అనుమానంగా అడిగాడు.

"ఇవేళ మా అమ్మ పుట్టినరోజండీ! ఇదిగో ఈ లడ్డూలను ఇచ్చి రమ్మంటే వచ్చాను" అని ప్యాకెట్టును ముందుకు తోశాడు.

ఆసరికే వంశీ వచ్చాడని ఇల్లంతా పాకిపోయింది. సుజన హాల్లో నిలబడిపోగా, ఆమె సోదరీమణులూ, తల్లీ మాత్రం వరండాలోకి వచ్చారు.

సత్యనారాయణరావు స్వీట్స్ ప్యాకెట్టుని భార్యకి అందిస్తూ– "ఈవేళ మన వియ్యంకురాలి పుట్టిన రోజట. స్వీట్స్ పంపింది" అన్నాడు.

"అలానా" అని ఆమె ముఖమంతా వెలిగిపోయేటట్లు నవ్వింది.

"సరే. నువ్విక వెళ్ళు నాయనా" అన్నాడు వంశీవైపు తిరిగి.

"వస్తానండీ" అందరివైపు చూస్తూ అని అక్కడి నుంచి బయటపడ్డాడు వంశీ.

అతను గేటు దాటాడో లేదో సుజన పెద్దక్కయ్య

**4** కాలేజీ చదువుతున్న వంశీ, సుజనల పరిచయం ప్రేమగా మారుతుంది. ఇద్దరిదీ ఒకే పల్లెటూరులోని పక్కపక్క వీధులే. పెద్దల అంగీకారంతో ఈ ఇద్దరికీ పెళ్ళవుతుంది.

శోభనం ముహూర్తం దగ్గర పడిందనగా సుజనకు 'మూడురోజుల' ఇబ్బంది ఎదురౌతుంది. ఆ మూడురోజులూ వీలుకాదు కనుక మరో ముహూర్తం చూస్తాడు సుజన తండ్రి. ఆ ముహూర్తం నెల రోజుల తర్వాతగానీ వుండదు. కనుక అప్పటిదాకా శోభనం వాయిదా పడుతుంది.

సుజన తండ్రికి జ్యోతిషం పిచ్చి ఎక్కువ. అందువల్ల చాలా స్ట్రిక్టుగా వుంటాడు. శాస్త్రాలకు కట్టుబడివున్న తన తండ్రిని, బోల్తాకొట్టించి ముహూర్తానికి ముందే తన ఫస్ట్‌నైట్ జరుపుకోవాలనే తన ఉద్దేశాన్ని ఓ లెటర్ ద్వారా వంశీకి తెలియజేస్తుంది సుజన. అప్పటినుంచి వంశీకూడా అదే ఆలోచనలో వుంటుంటాడు. అందుకు ఓ పథకంకూడా సిద్ధంచేస్తాడు. రాత్రి తలుపులు దగ్గరకి వేసి వుంచమని సుజనకి తెలియజేయడం అతను వేసిన పథకంలో చివరి అంశం. ఓ రోజు సుజన కోసం సుబ్బులు తీసుకువెళుతున్న అమృతాంజనం ప్యాక్‌లో తను రాసిన ఓ లెటర్‌ని వుంచుతాడు వంశీ.



ఉమ తల్లి చేతి లోంచి ప్యాకెట్టును తీసుకుని స్వీట్స్ ఏమిటోనని చూసింది.

"ఇదేమిటి? లెక్కపెట్టి నట్లు ఏడంటే ఏడే స్వీట్స్ పంపింది.మనిషికి ఒకటికంటే ఎక్కువ తింటే అజీర్తి చేస్తుం దనా?" అంది సుజనవైపు తిరిగి వెటకారంగా.

తమను బోల్తాకొట్టించడానికి వంశీ ఈ ఎత్తు వేశాడని వాళ్ళు ఊహించలేకపో యారు. విషయం తెలిసిన సుజన మాత్రం వస్తున్న నవ్వును బలవంతంగా ఆపుకుని, పైకిమాత్రం గంభీరంగా ముఖం పెట్టింది.

"అలా మాట్లాడకే" అన్నపూర్ణమ్మ తిరిగి ప్యాకెట్టు అందుకుని తలా ఒకటి ఇచ్చి, సుజన బామ్మకు ఇవ్వడానికి డాబామీదకు వెళ్ళింది.

సుజన తన లడ్డూను తింటున్నట్టు నటిస్తూ దొడ్లోకి వెళ్ళి, ఎవరూ తనను చూడడంలేదని నిర్ధారించు కున్నాక, దాన్ని బలంకొద్దీ పొదల్లోకి విసిరింది.

కొంతసేపు అక్కడే వుండి ఇంట్లోకి వచ్చింది. అందరూ లడ్లు తింటూ కనిపించారు. మరి కాసేపట్లో వాళ్లకంతా ఏదో అవు తుందని అనుకుందిగానీ, అదేమిటో మాత్రం అంతుబట్టడంలేదు.

అప్పటికి భోజనాలు అయిపోవడంతో అందరూ పడు కోవడానికి సన్నద్ధులవుతున్నారు.

సుజన మెల్లిగా అడుగులో అడుగు వేసుకుంటూ డాబా మీదకు చేరుకుంది. బామ్మ గదివైపు చూసింది.

ఆమె అప్పటికే గురకపెడుతోంది.

తన రూమ్‌లోకెళ్ళి పడుకుంది. శరీరమంతా కోరికతో నిండిపోయినట్టు బరువుగా తోస్తోంది. అంతకాలం బుద్ధిగావున్న జాకెట్టు ఇప్పుడు బంధనాలు తెంచుకోవడానికి ప్రయత్నిస్తున్నట్టు అన్పిస్తోంది. అప్పటివరకు తనను చుట్టుకున్న చీర తాత్కాలిక వియోగానికి సిద్ధపడుతున్నట్లుంది. కాళ్ళకున్న వెండి గజ్జలు చిరుశబ్దాలు చేస్తూ వంశీకి ఆహ్వానం పలుకు తున్నట్లు భ్రమ కలుగుతోంది.

అటూ ఇటూ దొర్లిందిగానీ శరీరం తన మాట వినడంలేదు. బుద్ధిగా పడుకోవడానికి సహకరించడం లేదు. వేడిసెగలు రేగుతున్నట్లుంది. తల్లోని మల్లె పూలు కసికొద్దీ సువాసనలను పెంచుతున్నట్లు ఆ గదంతా పన్నీటి మధ్యనున్న దీవిలా వుంది.

దొడ్డితలుపు తీసి వుంచమని వంశీ చెప్పడం గుర్తొచ్చి తిరిగి కిందకు దిగింది. హాల్లో ముగ్గురు అక్కయ్యలు, సంక్రాంతి దినాన ముంగిట తీర్చిదిద్దిన రంగురంగుల ముగ్గులను పాదచారులు చెరిపేసినట్లు అడ్డదిడ్డంగా పడి నిద్రపోతున్నారు.

దొడ్డితలుపును శబ్దంకాకుండా తెరిచి మెల్లగా నడుచుకుంటూ వచ్చి తన గదిలో దూరింది.

మంచంమీద పడుకోవడం తరువాయి రంగు రంగుల కలలు కళ్ళమీద వలలా వాలిపోయాయి.

వంశీ పరిస్థితి కూడా ఇందుకు డిటోలానే వుంది. ఇంట్లో ఏదో తిన్నాననిపించి బయటపడ్డాడు. పది గంటలు ఎప్పుడౌతుందా అని ఆత్రుతపడిపోతూ రచ్చమీద కూర్చున్నాడు.

పైన చందమామ దేదీప్యమానంగా వెలుగుతోంది. చల్లటి గాలి శరీరాన్ని చుట్టుకుంటోంది. పల్లె మొత్తం నిద్రలోకి జారుకోవడానికి ఆయత్తమవుతోంది.

తను వెళ్ళగానే సుజన ఎలా ఫీలవుతుందోనని రకరకాలుగా ఆలోచిస్తున్నాడు అతను. వెళ్ళగానే కౌగిలించుకుంటుందా? భలే ప్లాన్ వేశావే అని ముద్దు పెట్టుకుంటుందా? రమ్మని కళ్ళతోనే పిలిచి కూర్చోవ డానికి మంచాన్ని చూపిస్తుందా? ఏం చేస్తుంది? ఫస్ట్ నైట్‌న తామిద్దరి మధ్యా దొర్లే మొదటి మాట ఏమై వుంటుంది?

తను శబ్దం కాకుండా గదిలోకి వెళ్ళి, వెనకనుంచి కళ్ళు మూస్తే థ్రిల్లింగ్‌గా వుంటుంది. కానీ కళ్ళు మూయాలంటే సుజన తప్పకుండా బోర్లా పడుకుని వుండాలి. ఆడపిల్లలు ఎలా బోర్లా పడుకుంటారో అతనికి అర్థంకాలేదు. మగాళ్ళ ముందుభాగమంతా ఫ్లాట్‌గా వుంటుంది గనుక బోర్లా పడుకోవడానికి ఇబ్బంది వుండదు. కానీ ఆడపిల్లకు అలాకాదుగా- ఎత్తులు, పల్లాలు వుంటాయి గనుక అలా పడుకోవ డానికి సాధ్యపడదని అనిపించి కళ్ళు మూసే ప్రతి పాదన విరమించుకున్నాడు.



## ఒట్టి ప్రేమేనా?

రియాపిళ్లై పేరెత్తగానే సంజయ్‌దత్ నోటంట అన్నీ కాంప్లిమెంట్లే విన్పిస్తున్నాయి. "ఆమెది చక్కని మనసు. గర్వం, అతిశయం లాంటివి లేకుండా చక్కగా ప్రవర్తిస్తుంది. మోడల్స్‌కి, సినీతారలకి వుండే అవలక్షణాలేమీ ఆమెకి లేవు. తను ప్రేమించినవారిపట్ల ఎంతో శ్రద్ధాసక్తులు కనబరుస్తుంది. ఆమె ఓ అద్భుత మైన వ్యక్తి. పరిపూర్ణస్త్రీ" అని తెగ చెప్పేస్తున్నాడు.

కానీ, పెళ్ళి మాటెత్తితే, "నేను హఠాత్తుగా అప్పటి కప్పుడు తట్టిన ఆలోచనతో రిచాను పెళ్ళాడాను. చివరికి ఏమైంది? మళ్ళీ అదే పునరావృతం కావా లనుకోవడంలేదు" అంటూ మాట మారుస్తున్నాడు సంజయ్‌దత్.

బైక్ పదవుతుండగా అక్కడినుంచి కదిలాడు. వెన్నెల వీధుల్లో కాల్వలు కట్టి పారుతున్నట్లుంది.

ఓ ఇంటి వసారానున్న కుక్క అతన్ని చూసి మొరగబోయి, అంతలో తమాయించుకుని తిరిగి పడుకుండిపోయింది. ఇదంతా గమనించిన అతను కుక్కకు మనసులోనే థాంక్స్ చెప్పాడు.

సుజన ఇల్లు సమీపిస్తుంటే గుండె వేగం హెచ్చింది. ఏదో తెలియని జలదరింపు ఒంట్లో పాకింది. కాళ్ళు తడబడుతున్నాయి.

ఇంటిపక్కనుంచి వెళ్ళి దొడ్లోకి చేరుకున్నాడు. వెన్నెల పడినంతవరకూ తెల్లగా వుండి, వరండా మాత్రం చీకటిగా వుంది.

తలుపును మెల్లగా నెట్టాడు.

కిర్రుమంటూ తెరుచుకుంది. ఒక్కసారిగా ఆనందం గుండెలోంచి చిమ్మింది. తను చెప్పినట్లు సుజన తలుపు తెరిచి వుంచడం సగం గెలుపులా ఫీలయ్యాడు.

లోపలికి అడుగుపెట్టాడు. హాల్లో ఎవరో పడుకుని వున్నట్లనిపించగానే మరింత మెల్లగా అడుగులు వేయ డం ప్రారంభించాడు.

హాల్లోంచి ముందుగదిలోకి వచ్చి, అక్కడినుండి డాబామీదకు వున్న మెట్లెక్కడం ప్రారంభించాడు.

నాలుగయిదు మెట్లెక్కాడో లేదో పైన మొదట్లో ఎవరో కూర్చున్నట్లనిపించింది. కళ్ళు చిలుకరించి చూశాడు. గోడనీడ పడడంవల్ల ఎవరో సరిగా తెలియ డంలేదు. మరో రెండు మెట్లెక్కాడు.

సుజనే తనకోసం వెయిట్‌చేస్తూ, తనను ఆట పట్టించడానికి మౌనంగా వుందనుకుని "హాయ్" అంటూ పలకరించాడు.

"ఎవరదీ?" ఆ ఆకారం నోరు విప్పింది.

అతను షాక్ తిన్నట్లు అలా ఆగిపోయాడు. ఆమె సుజన బామ్మ.

ఒక్కసారిగా మెట్లనుంచి దూకి పారిపోవాలనిపిం చింది అతనికి. కానీ శరీరం తన స్వాధీనంలో లేనట్లు మొద్దుబారిపోయింది.

"నేను-వం...శీ...ని" కాసేపు తమాయించుకు న్నాక చెప్పాడు-

"నువ్వా! ఈ వేళప్పుడు ఇలా వచ్చావేమిటి?" అనుమానంగా అడిగింది.

"అదీ...అదీ...అమ్మ తలనొప్పిమందు పట్ట మ్మంటే ఇలా వచ్చాను. కింద అందరూ నిద్రపో తుంటే సుజన పైనుంటుందికదా మందు అడుగుదా మని వచ్చాను" పరవాలేదు-నమ్మే అబద్ధమే చెప్పా ననుకుంటూ మరో రెండు మెట్లెక్కాడు.

"తలనొప్పి మందుకేనా! ఇంకా మా మనవరాలి కోసం వచ్చావేమోననుకున్నాను. కాదన్నమాట. కానీ ఈ కాలం పిల్లలు ఎందుకూ పనికిరారని నువ్వు నిరూపించావ్. శోభనం నెలరోజుల తరువాత అంటే ఎలా ఒప్పుకున్నావ్ నువ్వు? అదంతా నాకు తెలియదు, శోభనం జరిగి తీరాల్సిందేనని మీ మామయ్యతో ఖచ్చితంగా చెప్పి వుండాల్సింది. ఇలాంటి సమస్య మాకూ ఎదురైంది. కానీ సుజన తాతయ్య ముహూర్తం వచ్చేవరకు ఆగలేదే. మరేం చేశాడని అడగవేం? అదంతా పెద్ద కథ. రా! ఇలా వచ్చి కూర్చో" అంటూ ఆహ్వానించింది.

ఇదెక్కడి ఖర్మరా బాబూ! తన ఫస్ట్‌నైట్ జరక్క పోగా, ముసలామె చెప్పే ఫస్ట్‌నైట్ గురించి వినాల్సి రావడంకన్నా నరకం మరొకటి వుండదనుకుంటూ, ఇక తప్పదని మెట్లన్నీ ఎక్కి ఆమెకు కాస్త దూరంలో కూర్చున్నాడు.

వంశీ వచ్చాక టైమ్ ఎందుకు వేస్ట్ అని సుజన అన్ని తలుపులూ, కిటికీలూ మూసివేయడంవల్ల వీళ్ళ మాటలు ఆమెకు వినిపించడంలేదు. అదీగాక ఫ్యాన్ సౌండ్‌కూడా బయటి శబ్దాలను లోపలికి రానివ్వడంలేదు.

వంశీ బుద్ధిగా పద్మాసనం వేసుకుని కూర్చున్నాక సుజన బామ్మ చెప్పడం ప్రారంభించింది.




## కీటకాల్ని నాశనంచేసే హెక్సిట్

ఇంట్లో దోమలు, బొద్దింకలవంటి కీటకాల్ని పోగొట్టేందుకేకాక, గార్డెనింగ్ చేసేవారికి కూడా ఉప కరించే కీటకనాశక మందు 'హెక్సిట్'ని హెూయెక్స్ట్ ఇండియా సంస్థ మార్కెట్లో ప్రవేశపెట్టింది.

పర్యావరణానికి ఎటువంటి హాని కలిగించని డెల్టామెత్రిన్ అనే పదార్థం వున్న 'హెక్సిట్' కీటక నాశకంగా చాలా శక్తివంతంగా పనిచేస్తుంది. చక్కని సువాసన కలిగివుంటుంది.

250 మిల్లీలీటర్ల హెక్సిట్ క్యాన్ ధర 39 రూపా యలు. కావాలనుకుంటే దానితోపాటే స్ప్రేగన్ 20 రూపాయలకి లభిస్తుంది. •

"నాకూ, సుజన తాతయ్య వీరభద్రరావుకి పెళ్ల యింది. పెళ్లిపీటలమీద ఆయన్ను చూసి జడుసుకున్నాను. చెయ్యెత్తు మనిషి-గుబురుమీసాలు. తల పాగా చుట్టుకుని కూర్చున్న ఆయన్ని కళ్ళు పైకెత్తి చూడాల్సి వచ్చింది.

ఆయన సంస్కృతాంధ్ర భాషల్లో పండితుడు. హైస్కూల్లో టీచరు ఉద్యోగం.

మా కాలంలో పెళ్లంటే మూడు రోజుల ముచ్చట. పెళ్లి ఇంకా పది రోజులు వుండనగా బంధువులు రావడం ప్రారంభించేవారు. పెళ్లయ్యాక కూడా మరో వారమో, పది రోజులో వుండేవారు.

పెళ్లి తంతంతా ఇప్పుడు గంటలో ముగించేస్తున్నారు. మా కాలంలో అలాకాదు. అన్నీ పద్ధతి ప్రకారం జరిగేవి. పెళ్లికి ముందురోజు నుంచీ హడావుడి ప్రారంభమయ్యేది. ఊర్లోని దేవుళ్ళకంతా మొక్కేవాళ్ళం. ఇక అప్పుడు ఒంటిపూట భోజనమే. పెళ్లి జరిగే మూడు రోజులూ నియమనిష్ఠలతో వుండేవాళ్ళం. కళ్ళు మండిపోతున్నా, కాళ్ళు పీకుతున్నా అన్నీ పద్ధతి ప్రకారం జరిపేవారు.

వివాహం అయిపోయింది.

ఆ రాత్రి శోభనమని అమ్మలక్కలు అనుకుంటూ వుండగా విన్నాను. ఏదో తెలియని గుబులు గుండెల్లో బయల్దేరింది. ఆ రోజు పగలు ఎలా రాత్రిలోకి మారిందో నాకు గుర్తులేదు.

రాత్రి ఏడు గంటలనుంచే ఆ కార్యక్రమం మొదలైంది. పురోహితుడు గర్భాదానం మంత్రాలు చదువుతున్నాడు. నేను ముత్తైదువుల మధ్య కూర్చుని వున్నాను. తొమ్మిది గంటలకి పురోహితుడు మంత్రాలు చదవడం ముగించాడు. నాకు తెల్లచీర కట్టారు. పూలజడ కుట్టారు.

నన్ను గదిలోకి తోసేందుకు సిద్ధపడుతుండగా మా నాన్న మా మేనత్తని పక్కకిపిలిచి ఏదో చెప్పాడు.

ఆమె మా దగ్గరికి వచ్చి 'ఈ రోజు శోభనంలేదట. పెళ్లికొడుక్కి జ్వరం తగిలిందట' అని చెప్పింది.

ఆయనకు జ్వరం అనగానే కంగారుపడిపోయాను. పెళ్లి జరిగి నిండా పది గంటలు కాకపోయినా అప్పటికే ఆయన నావాడన్న భావన నాటుకుపోయింది. ఆ రాత్రంతా ఆయన ఆరోగ్యం బాగవ్వాలని దేవుళ్లందరినీ పేరుపేరునా పిలిచి ప్రార్థించాను.

మరో మూడు రోజులు గడిచాయి.

కానీ ఆయనకు జ్వరం తగ్గలేదు. మరుసటి రోజే ఆదివెల ప్రవేశిస్తుంది. ఆదివెలలో భార్యాభర్తలిద్దరూ ఒకచోట వుండకూడదు.

మా నాన్న శాస్త్రులతో సంప్రదించి ఆదివెల పోయాకే గర్భాదానం కార్యక్రమం నిర్ణయించాడు. దాంతో ఆయన మరుసటి రోజు ఉదయమే ఊరెళ్లిపోయారు. నేను ఒంటరిదాన్నయిపోయాను.

వారం రోజుల తరువాత ఆయన దగ్గర్నుంచి ఉత్తరం వచ్చింది నాన్నకు. జ్వరం తగ్గిపోయిందని, ఇప్పుడు ఆరోగ్యంగా వున్నాననీ రాశాడు.

'భగవంతుడా!' అనుకుంటూ రెండు చేతులూ పైకెత్తి మొక్కుకున్నాను. వారం రోజులుగా బరువెక్కిన గుండె కుదుటపడింది. తొలిసారిగా ఊపిరి పీల్చుకుంటున్నట్లు గాఢంగా శ్వాసపీల్చాను.

ఆ రాత్రి నిద్రరాక అటూ ఇటూ దొర్లుతున్నాను. అమ్మా నాన్న హాల్లో నిద్రపోతున్నారు. నేను ముందు గదిలో పడుకున్నాను.

బాగా రాత్రయినట్లు జోరీగల రొద తప్ప ఇంకేమీ వినిపించడంలేదు. దూరంగా కప్పలు అరుస్తున్న శబ్దాలు చీకటి గాఢతను తెలియజేస్తున్నాయి.

అమావాస్య రోజులేమో- చిట్టచీకటి గుడ్లగూబ రెక్కలా వుంది.

ఉత్తరంలో నన్ను అడిగినట్లు చెప్పమని రాశాడు. ఆ చిన్నవాక్యం రేపుతున్న అలజడి మాత్రం పెద్దగానే వుంది.

జోరీగల రొద కూడా ఆగిపోయింది. రాత్రి మరింత చిక్కబడింది. ఆకాశం వెంట నడిచెళుతున్న గంధర్వకన్యల కాళ్ళకున్న వెండిపట్టీలు రాలిపడిపోయినట్లు చుక్కలు బారులు తీరున్నాయి. కిటికీ అంత ఆకాశం మల్లెపూలు వాడిపోకుండా చుట్టి వుంచడానికి వుంచిన నల్లటి వస్త్రంలా వుంది.

అదిగో-అప్పుడు వినిపించింది సైకిల్ బెల్. నా గది కిటికీ అవతలే ఎవరో సైకిల్ బెల్ మోగిస్తున్నట్లు గ్రహించాను. భయంతో గుండె కుంచించుకుపోయింది. కిటికీ కింది రెక్కలు తీసి చూద్దామంటే ధైర్యం చాలడంలేదు. దిగ్గున లేచి కూర్చున్నాను.

'పరంజ్యోతీ...పరంజ్యోతీ' మెల్లగా ఎవరో పిలుస్తున్నారు. ఆ గొంతును పోల్చుకోలేకపోయాను.

పేరుపెట్టి పిలుస్తున్నారంటే ఎవరో తెలిసినవాళ్ళే అయి వుంటారని, ధైర్యంచేసి కిటికీ రెక్కల్ని తీశాను.

'నేను వీరభద్రాన్ని'

వచ్చింది ఎవరో తెలిసింది. మెడలోని మంగళసూత్రాల్ని కళ్లకద్దుకుంటూ మంచం దిగాను. ఆదివెలలో-అదీ అంత రాత్రిపూట ఆయన ఎందుకొచ్చాడో ఊహించలేకపోయాను. ఇప్పుడు ఏం చేయాలో పాలుపోవడంలేదు. ఎటూ కదలక అలానే నిలబడిపోయాను.

'నీ కోసమే వచ్చాను'

చాలా చిన్నగానే చెప్పినా, ఆ శబ్దాలకే అమ్మా నాన్న లేచినట్లు కంగారుగా అటూ ఇటూ చూశాను.

'కాళహస్తిలో లాస్ట్‌బస్ దిగాను. ఇక అక్కడినుంచి బస్సులేదుకదా-బాడుగ సైకిల్ తీసుకొచ్చాను'

అంత రాత్రిపూట దాదాపు పదిహేను కిలోమీటర్లు సైకిల్ తొక్కుకొచ్చిన ఆయన్ని చూస్తుంటే భావావేశం పట్టలేక ఏడుపు తన్నుకొచ్చింది. ఇక ఒక్క

## అల్లరి అక్క-చెల్లెళ్లు

కొత్తకొత్త అందాల్ని కమనీయంగా కనువిందు చేస్తూ, దూసుకువస్తున్న నవతార శుభశ్రీ అసలు పేరు 'భారతి'. ఆమె తొలి తమిళ చిత్రంలో 'శుభశ్రీ'గా పేరు మార్చారు నిర్మాత వీరప్పన్.

శుభశ్రీకి అల్లరిపెట్టే గుణం సహజంగా వుందట. చిన్నప్పుడే పెద్దవాళ్లు చూడకుండా చిన్నపిల్లల్ని గిల్లేసి వచ్చేసేదిట. "పెద్దవాళ్ళని కంగారుపెడుతూ అల్లరితోనూ, ఆటలతోనూ బాల్యం గడిపేశాను"ని చెప్తున్న మాలాశ్రీ, ఇప్పటికీ అల్లరల్లరిగానే వుంటుంది.

అయితే- ఈ అల్లరిలో శుభశ్రీ గురువుగారు ఎవరో కాదు. అక్కామణి మాలాశ్రీ. పోటాపోటీగా అల్లరిపెట్టే ఈ 'అక్కచెల్లెళ్లలో "అక్కే గెలుపు సాధిస్తుంది" అని వినయంగా చెప్తోంది శుభశ్రీ. అవునూ-



వీరిద్దరితోనూ 'అల్లరి అక్కచెల్లెళ్లు' అనే టైటిల్‌తో ఎవరైనా ఓ సినిమా తీస్తే బావుంటుందేమో! ఎలాగూ 'అల్లరి' టైటిల్స్ ప్రభంజనం వుందికదా!

## సెనగలతో పలావ్

**కావలసినవి :** సెనగలు నానేసినవి పావు కేజీ, బియ్యం అరకిలో, ఆయిల్ అరకప్పు, పెద్దఉల్లిపాయ ముక్కలు 1 కప్పు, గరంమసాలా 2 చెమ్చాలు, అల్లం, వెల్లుల్లి నూరిన ముద్ద కొద్దిగా, పచ్చిమిర్చి 5, తగినంత ఉప్పు, పసుపు, పుదీనాకట్ట 1.



**చేసే విధానం :** ముందుగా బియ్యం బిరుసుగా వండుకోవాలి. తరువాత నానేసిన సెనగలు, ఉల్లిపాయ ముక్కలు వేయించుకోవాలి. గిన్నెలో నూనె పోసి కాగిన తరువాత, నూరిన అల్లం, వెల్లుల్లి, పచ్చిమిరపకాయలు వేసి, ఉడికిన బియ్యం, సెనగలు, ఉల్లిపాయలు ఆ గిన్నెలో వేసి, ఉప్పు, పసుపు,గరంమసాలా వేసి బాగా కలపండి.

పదినిమిషాల తరువాత సన్నగా తరిగిన పుదీనా కూడా వేసి దించండి. అందులోకి టమోటా సాస్ నంజుకొని తింటే ఎంతో రుచిగా వుంటుంది. పిల్లలు ఎక్కువగా ఇష్టపడతారు. **-పొత్తూరి పద్మిని**

క్షణం ఉపేక్షించడం కూడా తీరని ద్రోహమే అవుతుం దనిపించి మెల్లగా నడిచి తలుపు తీసుకుని ఆయన దగ్గరికి చేరాను.

'జ్వరం పోయింది. కావాలంటే చేయి పట్టుకుని చూడు. ఈ రోజే రసం అన్నం తిన్నాను. ఒళ్లు బాగయిపోయిన క్షణంనుంచి నిన్ను చూడాలన్న ఆరాటం మొదలైంది. సాయంకాలానికి ఆగలేకపో యాను. కాళహస్తి చేరేటప్పటికి పదైంది. ఇక అప్పుడు ఈ ఊరికి బస్సుల్లేవుగా. అదృష్టంకొద్దీ సైకిల్‌షాప్ అప్పుడే మూస్తున్నారు. వాడిని బతిమలాడి సైకిల్ ఇప్పించుకుని వచ్చాను. ఇంత శ్రమపడిందీ ఎందుకో తెలుసా? నిన్ను చూడ్డానికి'

ఉత్పలమాలలా హుందాగా, శార్దూలంలా గంభీ రంగా, కందపద్యంలా అందంగా, తేటగీతిలా సరళంగా, సీస పద్యంలా పొడవుగా వుండే ఆయన-చిన్నపిల్లాడు ఆటవెలది పద్యాన్ని అప్పజెబుతున్నట్టు చెబుతుంటే తమాషాగా అనిపించింది.

'రండి-లోపలికి' అన్నాను.

'వద్దు-మావయ్యను లేపకు. ఆదివెలకదా-అభ్యం తరం చెప్పొచ్చు-అందునా ఇంత రాత్రిపూట వచ్చా నంటే నామోషీగా వుంటుంది. మనిద్దరం డాబామీద కొంతసేపు కూర్చుందాం-ఇక్కడైతే మామయ్యా వాళ్ల లేచే ప్రమాదముంది. సరేనా...' అని నేను ఒప్పుకుంటానో లేదోనని కళ్లల్లోకి చూస్తున్నాడు.

సంస్కృతాంధ్రాల్లో మహాపండితుడు అయిన ఆయన ఎదురుగ్గా నిలబడి దీనంగా పిలుస్తుంటే వెళ్ల కుండా వుండగలనా? సరేనన్నట్లు తల ఊపాను.

నిశ్శబ్దంగా ప్రహరీగోడకున్న గేటు తీశాను. ఆయన ముఖంలో ఆనందం పౌర్ణమినాటి వెన్నెలే అయింది.

నేను గదిలోకి వెళ్ళి కిరోసిన్ దీపాన్ని వెలిగించి తెచ్చాను.

ఆయన సన్‌సైడ్ నీడలో సైకిల్‌ను నిలబెట్టి స్టాండ్ వేస్తున్నాడు.

ఆయన దగ్గరగా వెళ్లి దీపాన్ని కొద్దిగా పైకి లేపి పట్టుకున్నాను.

అప్పుడు చూశాను సైకిల్ ముందుచక్రాన్ని. భయంతో వణికిపోయాను. చేతిలోనున్న దీపం కూడా కదలడంతో స్టాండ్ వేయడం పూర్తిచేసిన ఆయన 'ఏమైంది పరంజ్యోతీ?' అని అడిగాడు.

నాకు నోటమాట రావడంలేదు. ముందు చక్రాన్ని చూడమన్నట్లు చేత్తో చూపించాను.

సైకిల్ చక్రం రిమ్ముల మధ్య పొడవైన పాము అడ్డదిడ్డంగా చుట్టుకుని వుంది. ముందు భాగమంతా చలనరహితంగా వున్నా. తోక మాత్రం చిన్నగా కదులుతోంది.

ఆయన కూడా కంగారుపడిపోయి, దీపాన్ని నా చేతుల్లోంచి లాక్కుని దగ్గరగా పెట్టి చూశాడు. ఆయనతోపాటు నేనూ వంగాను.

నాగుపాము పడగ స్పష్టంగా కనిపిస్తోంది. మధ్య భాగంలో ఒక దగ్గర శరీరం నుజ్జు నుజ్జు అయిపోయి వుంది. రిమ్ములకు అక్కడక్కడా రక్తంమరకలు అంటి వున్నాయి. ఆయన పక్కనున్న పుల్లను తీసుకుని దానిని పొడిచాడు. అది కదల్లేదు.

'చచ్చిపోయినట్లుంది. కాళహస్తి దాటాక ఓ చిన్న గుడి వస్తుందికదా-అక్కడ సైకిల్ దేనో ఎక్కినట్లని పించింది. తాడో, కొబ్బరిచిప్పో-ఏదో అలాంటిదై వుంటుందనుకున్నాను. సైకిల్ మాత్రం ఆపలేదు. కొంతసేపటికి పాము బుసలాంటి శబ్దాలు వినిపిం చాయి. అదంతా నా భ్రమే అనుకున్నాను. కానీ సైకిల్‌ని ఎక్కించింది పాముమీదేనన్నమాట.

సైకిల్ ఎక్కగానే నడుం విరిగుంటుంది. ఆ బెదురులో అది చక్రంలోకి ఎక్కేసుంటుంది. రిమ్ముల మధ్య తగులుకుపోయి, కొంతసేపు పెనుగులాడి చచ్చిపోయుంటుంది'

భయంతో గడ్డకట్టుకుపోయిన నేను తిరిగి సర్దు కున్నాను. కానీ నన్ను చూడాలని అంత రిస్కు తీసుకుని వచ్చిన ఆయన్ని అలా కళ్లార్పకుండా చూస్తూండిపోయాను.

పెడల్‌ని తొక్కుతున్నప్పుడు అదిగానీ కాలిని కరిచివుంటే ఏమై వుండేదో తలుచుకుంటేనే ఒళ్లు జలదరించింది.

దీపం ఎప్పుడు ఆరిపోయిందో గుర్తించలేదు. ఆయనే ముందుకు కదిలాడో,నేనే ముందుకు అడుగు వేశానో తెలియదు-

ఇద్దరం దగ్గరయ్యాం.

ఆ సన్‌సైడ్ చీకట్లోనే మా శోభనం జరిగిపోయింది" బామ్మ చెప్పడం ఆపింది.

మామూలుగా అయితే ఆ సంఘటనకు కదిలి పోయేవాడే వంశీ. కానీ అతనిని మొదటనుంచీ ఓ అనుమానం పీకుతోంది. బామ్మ చెప్పడం ఎప్పుడు పూర్తిచేస్తుందా, తన సందేహాన్ని ఎప్పుడు తీర్చుకుం దామా అనే తపనలోనే వున్నాడు.

అందుకే ఆమె ముగించగానే-"బామ్మగారూ! ఓ చిన్న డౌట్-తీరుస్తారా?" అని అడిగాడు.

"అడుగు నాయనా"

"రాత్రి మా అమ్మ పంపిన స్వీట్స్ మీరు తిన లేదా?" అడిగాడు వంశీ.

"తిన్నాను బాబూ"

అతను అదిరిపడ్డాడు. స్వీట్ తిని అలా నిద్రపో కుండా వుండడం ఇంపాజిబుల్. ఈమె నిజంగా బామ్మేనా లేక భూతమా అన్న మరో అనుమానం కలిగింది అతనికి.

"మరీ...మరీ" అంటూ నసిగాడు.

"ఏమిటి బాబూ-అడుగు"

"ఏమీలేదు. మీరింకా నిద్ర మేల్కొని వుంటే ఏమైందా అని అడుగుదామనుకుంటున్నాను" ఒక్కో మాటను సాగదీస్తూ చెప్పాడు.

"అదా! మీ అమ్మ నీ ద్వారా పంపించిన లడ్డు తిన్నానో లేదో నిద్ర ముంచుకొచ్చింది. ఈరోజైనా నిద్రమాత్రలు లేకుండా నిద్రపడుతున్నందుకు ఆ దేవదేవుడికి నమస్కరిస్తూ నిద్రపోయాను. కానీ ఇదిగో-నువ్వొచ్చేముందే మెలకువ వచ్చింది. రోజూ రెండు నిద్రమాత్రలు వేసుకుంటేగానీ నాకు నిద్ర పట్టదు నాయనా. ఈ రోజెందుకోమరి కోడలుపిల్ల మాత్రలు ఇవ్వకనే నిద్రపోయింది. కిందకెళ్లి ఎంత సేపు పిలిచినా నిద్ర లేవలేదు. ఇక లాభంలేదనుకుని ఇక్కడ కూర్చుండిపోయాను. ఇంతలో నువ్వొచ్చావ్. ఇక ఈ రాత్రంతా జాగారమే. నీకూ నిద్ర రాకుంటే ఇక్కడే వుండిపో. కాలక్షేపమన్నా అవుతుంది నాకు"

అదన్నమాట విషయం. డోస్ చాలకపోవడంవల్ల మధ్యలో లేచిపోయింది ముసల్ది. కానీ ఈమెకు నిద్ర మాత్రలు వేసుకునే అలవాటుందో లేదో ముందే తెలుసుకోకపోవడం తన తప్పేననిపించింది అతనికి.

ఇక తన పథకం పారదని గ్రహింపుకొచ్చి నీరస పడిపోయాడు.

"ఇంకొకసారి ఏమైందంటే?" తిరిగి మరో ముచ్చట చెప్పబోయింది బామ్మ.

అతను అడ్డు తగిలాడు. ఇక అక్కడ వుంటే తన అనుభవాలతో దేవుడి ప్రసాదాన్ని ఆరగించినట్లు తనని తినేస్తుందని గ్రహించి అక్కడినుంచి లేస్తూ "బామ్మగారూ! ఈ రోజుకి మీ శోభనం ముచ్చట్లు చాలు-వస్తాను-బతికుంటే శోభనం గురించి కలలైనా కనచ్చు" అని మరో మాటకు తావివ్వకుండా అక్కడి నుంచి పరుగులాంటి నడకతో బయటపడ్డాడు. తల పైకెత్తి చూశాడు.

ముఖానికి తెల్లటి రంగు పూసుకుని మబ్బుల ప్రేక్షకుల్ని నవ్విస్తున్న జోకర్‌లా వున్నాడు చంద్రుడు.

**(ఇంకావుంది)**



## నో రొమాన్స్!

గోవిందా అన్న కీర్తికుమార్ దర్శకత్వంలో 'దో ఆంఖే బారా హాత్'లో తళుకుబెళుకులు ప్రదర్శించ బోతున్న మధువంతి (భాగ్యశ్రీ చెల్లెలు). "అచ్చమైన భారతీయ యువతిలా వుండే మా అక్క పాశ్చాత్య దుస్తుల్లో గ్లామరస్‌గా కనిపించదు. అదే నాకైతే, వాటితోపాటు భారతీయ దుస్తులు కూడా చక్కగా నప్పుతాయి" అంటూ తన ప్రత్యేకతలను చాటుతోంది.

భాగ్యశ్రీలా నేను పెళ్ళితో సినిమాలను వదిలి పోనని ఖచ్చితంగా చెబుతోంది మధువంతి. "ఎవరైనా నన్ను ప్రేమిస్తే, అతను నన్ను ఈ రంగంలో ప్రోత్స హించాలి. అయినా ఇప్పుడవన్నీ ఎందుకు? కొన్నేళ్ళ వరకూ నా జీవితంలో రొమాన్సూ, పెళ్ళిల ప్రసక్తే వుండదు" అంటోంది నిక్కచ్చిగా.

# 'నా జ్ఞాపకాలు పోయాయి'

"మరపురాని బాధ కన్న మధురమే లేదు" తన మనస్పంద్రాన్నెంతెలా మధించుకుంటే పుట్టిందో గానీ ఈ భావం ఆ కవిలో, నిజంగా అక్షరలక్షలు చేస్తుంది.

నా మట్టుకునాకు, వేళ్ల దగ్గరా, మడమల దగ్గరా, అడుగునున్న నీలంరంగు అనిపించేలా అరిగిపోయున్న ఈ బుజ్జిగాడి (బుజ్జిగాడంటే చంటి కుర్రాడనుకునేరు. ఇరవయ్యేళ్ళుంటాయి) రబ్బరు జోళ్ళు తొడుక్కుని నడుస్తున్నపుడు వాటిల్లో దిగబడి విరిగిపోయున్న ముళ్ళ తాలూకు సుత(కొన)లు అప్పుడప్పుడు పాదాలలోకి కసుక్కుమంటూ దిగి చురుక్కు చురుక్కుమనిపించినప్పుడల్లా మరపురాని మధుర బాధానందమే.

మొన్నీమధ్య నేను కోనసీమలోని స్వర్గసీమలాంటి ఓ కుగ్రామంలో, మధుమాసంలో విరబూసిన అడవిపూల తోటల్లో వీరవిహారం చేసే గండు తుమ్మెదకి మల్లే, దినమొక క్షణంగా గడిపేసిన మధురక్షణాల తాలూకు మధురానుభూతులకు ప్రతీకలు పైన చెప్పిన రబ్బరు జోళ్ళు.

గోదారొడ్డునున్న పచ్చిక బీళ్ళలో గేదెలు కాసుకునే బుడ్డోళ్ళతో అరటి బోదెం దొప్పల్ని ప్యాడ్‌లుగా, గరిగమ్మని బ్యాటుగా, తాటి టెంక బుర్రల్ని బంతులుగా వుపయోగించి, జబ్బలు పులిసేందాకా కంట్రీ క్రికెట్ ఆడింది ఈ జోళ్ళు తొడుక్కునే.

గూటిబిళ్ళ ఆట నెపంతో, ముందుగా వేసుకున్న ప్లాను ప్రకారం, సందుచూసుకుని ఎంచుకునున్న ఇంటి పెరటిదొడ్లో పడేలా బిళ్ళని విసిరేసి, నంగనాచిలా, బిళ్ళ వంకతో వెళ్ళి పెరటిదొడ్లో జొరబడి (ఇంటివాళ్ళ కైండ్ పర్మిషన్‌తోనే) ఆ పరికే, కొబ్బరాకులతో అల్లిన తడికెలతో తయారైన టాప్‌లెస్ తానాల గదివాలున ఎదురుచూస్తున్న 'ఆహ్వానాన్ని' అణచుకోలేనంత ఆత్రుతతో ఆబగా ఆస్వాదిస్తున్న తరుణంలో, ఊహించని రీతిగా ఎదురైన హఠాత్పరిణామంతో, రసాస్వాదనకు రసభంగం కలిగిన రసాభాసా రభసకి అభాసుపాలు కాకుండా ఎస్కేపయ్యే ప్రయత్నంలో, పెరటి చుట్టూ ఫెన్సింగ్‌లా కట్టున్న ముళ్ళకంచె ప్రహరీని అమాంతం దూకేసెయ్యబోయి, దూకలేక కుక్క దూరెళ్ళడానికి చేసుకున్న కంతలోంచి మోకాళ్ళమీదుగా పాక్కుంటూదేక్కుంటూ దూరెళ్ళి ముళ్ళు తుప్పలు అనే తరతమ భేదం చూసుకోకుండా, డొంకలకి, బందలకి అడ్డంబడి పారిపోయినప్పుడు కాళ్ళనంటిపెట్టుకున్నవీ జోళ్ళే.

నాలుగైదు మైళ్ళ దూరానున్న టౌన్‌లో, మావూళ్ళమ్మవారి ఉత్సవాల సందర్భంగా ప్రదర్శించబోయే చింతామణి నాటకం చూడ్డంకోసం, చింత చచ్చినా పులుపు చావని కుసంత కళాపోసనగల ముసలాళ్ళతో కలిసి, పళ్ళు కటకటలాడించేస్తున్న చలిని లెక్కచేయకుండా, ముక్కవాసన కొడుతున్న చిమటలు కొట్టేసిన స్వెట్టరు తొడుక్కుని చంకల్లో చేతులుంచుకుని వణుకుతున్న గొంతులతో ఊసులాడుకుంటూ కాలినడకన వెళ్ళి రాత్తిర్తెల్లవార్లూ నిలబడి నాటకం చూసొచ్చింది ఇదే జోళ్ళతోనే.

ధాన్యం కళ్ళంకాడ కాపలా పడుకోడానికెళ్ళినప్పుడు, అల్లంత దూరాన చీకట్లో గాలికి జుత్తిరబోసుకున్న దయ్యాల్లా ఊగుతున్న అరటితోట దగ్గర పాతరేసున్న తేగల్ని, నక్కల ఊలలమధ్య పురుగుపుట్రా అనే పట్టింపు లేకుండా తవ్వి తెచ్చుకుని సహవాసగాళ్ళతో కలిసి చలిమంటలో కాల్చుకుతింటూ కబుర్లాడుకున్నప్పుడు ఈ జోళ్ళుకూడా క్రోతలుగా వున్నాయి.

జతగాళ్ళంతా మరీమరీ బలవంతపెట్టెయ్యడంతో, అసలెలా వుంటుందో మచ్చుకి రుచిచూద్దామని చెప్పి, రుచి మా గొప్ప రంజుగా అనిపించడంతో అరలొట్టి తాటికల్లు పట్టించేసి, దరిమిలా ఆల్లు తాగి నిప్పుతొక్కిన కోతిని తలపింపచేసే చేష్టలు చేసి, కైపు దిగింతర్వాత, ఎదురుగా నిలబడి నవ్వేచూస్తున్న (ఎంతసేపట్నుంచి చూస్తున్నాడో ఏమో!) తాతబ్బాయ్‌గారితో, "ఏదో పరదాకొద్దీ పొరబాటు జరిగిపోయింది. ఈ ఒక్కసారికి ఇంటిదగ్గర చెప్పకండి" అంటూ లెంపలు వేయించుకున్నది ఇవే జోళ్లతోనే.

ఇలా చెప్పుకుంటూపోతే ఇంకెన్నో, మరెన్నో, ఎన్నెన్నో.

అలా రేవులో గింకచ్చకాయిలా ఆనందంగా గడిపిన ప్రతి మధురక్షణం తాలూకు మధురానుభూతికీ ప్రతీకలు ఈ జోళ్ళయితే, ప్రత్యక్ష సాక్షులు వాటిల్లో దిగబడి విరిగిపోయున్న ముళ్ళు.



వాటి తాలూకు మొనలు చురుక్కుమనిపించినప్పుడల్లా నా మదిలో మెరిసిన ఆ జ్ఞాపకాల తాలూకు మెరుపులు నా కళ్ళల్లో ప్రతిదీప్తిస్తుంటాయి. గుండె గొంతుకలో కొట్టాడినట్టు, అరికాళ్ళని మంచుముక్కలతో సన్నగా నిమిరినట్టూ వర్ణనాతీతమైన తియ్యటి బాధ.

• • •

దైవదర్శనమయిన తర్వాత గుళ్లోంచి బయటికొచ్చి, చెప్పుల స్టాండుదగ్గరున్న కుర్రాడి చేతిలో పావలా పడేసి, జోళ్ళు తొడుక్కుని అడుగుతీసి అడుగు వెయ్యబోయేంతలో...

"సార్, ఇంకో పావలా వుంటే ఇప్పించండి... మీజోళ్ళనిండా ఎన్నెన్ని ముళ్ళున్నయ్యో, ఒక్కటి లేకుండా శుభ్రంగా పీకిపారేశాను సార్" అంటున్నాడు చెప్పుల స్టాండు కుర్రాడు. అంతే...

"నా జ్ఞాపకాలు పోయాయి!"

హెచ్. ఎస్. సురేష్‌కుమార్

సీరియల్

# రారా మా ఇంటిదాకా



## -మేర్లపాక మురళి

తన పూలపల్లకి ఆపరేషన్ ఫెయిలవడంతో దిక్కుతోచడంలేదు వంశీకి. సుజనకు ముఖం చూపించాలంటే సిగ్గుగా వుంది. తన ప్లాన్‌కు తిరుగుండదని, రెడీగా వుండమని ఉత్తరం రాసి చివరికి తను వెళ్లలేకపోవడం నామోషీగా వుంది. ఆమె బొమ్మమీద పీకలదాకా కోపం వస్తున్నా బలవంతాన నిగ్రహించుకుంటున్నాడు.

సుజన సిగ్గుతో తన అక్కయ్యల ముందు ముఖం వేలాడేసుకునే సీనును ఊహించుకుంటుంటే రక్తాన్నంతా ఎవరో శరీరంనుంచి లాగేస్తున్నట్టు ఫీలైపోతున్నాడు. మరో ప్లాన్‌కోసం మెదడులోని కణాలన్నిటినీ ఒక దగ్గరగా చేర్చి ఆలోచిస్తున్నాడు.కానీ లొసుగులు లేని ప్లాన్ తట్టడంలేదు.

ఇంట్లో వుంటే ఇవే ఆలోచనలు చుట్టుముట్టుతుండడంవల్ల అలా కొట్టు దగ్గరికి నడిచాడు.

అప్పుడు టైమ్ పదిగంటలు దాటింది. ఇళ్లలోంచి లేస్తున్న పొగలు కడుపులో ఆకలిని పుట్టించడానికి మంత్రగత్తెలు వేస్తున్న ధూపంలా వుంది. వీధి తిన్నెల మీద కూర్చున్న మగవాళ్ళు చేయబోయే వ్యవసాయం గురించి, చేసిన వ్యవహారం గురించి మాట్లాడుకుంటున్నారు. వాళ్ళ మాటల శబ్దాలు రాలుతున్న వడ్లగింజల్లా వున్నాయి. పిల్లలంతా వీధుల్లో రకరకాల ఆటలు ఆడుకుంటున్నారు. వాళ్లంతా అటూ ఇటూ తిరుగుతుంటే దేవతలు వాళ్లను గోళీల్లా చేసుకుని ఆడుకుంటున్నట్టుంది.

వంశీ ఓ సిగరెట్ కొనుక్కుని రచ్చదగ్గర నిలుచున్నాడు. రచ్చబండమీదున్న చిన్న శిల్పాన్ని చూస్తుంటే అతనికి మొదట తను సుజనను ముద్దు పెట్టుకోవడం గుర్తుకొచ్చింది.

యూనివర్సిటీలో చదువుకునే రోజుల్లో వాళ్లిద్దరూ సరదాగా ఓ ఆట ఆడుకునేవాళ్లు. ఏ సమయంలోనైనా ఒకరు మరొకర్ని 'స్టాట్యూ' అంటే అలా శిలా ప్రతిమలా నిలబడిపోవాలి. 'డౌన్' అంటేనే తిరిగి యథాప్రకారం అయిపోవాలి.

ఓ రోజు వాళ్లిద్దరూ గోవిందరాజుల గుడికి వెళ్లారు. ఆ రోజు బుధవారం కావడంవల్ల రష్ అంతగా లేదు. సాయంకాలానికి వీడ్కోలుఇస్తున్నట్లు అప్పుడే దీపాలు వెలిగాయి. ధ్వజస్తంభం ఆ వెలుగుల్లో బంగారు పూలు పూసే చెట్టుకాండంలా వుంది.

ఇద్దరూ గర్భగుడి వెనుకకు వెళ్లి ఒకచోట కూర్చున్నారు. మసకచీకటి మరెక్కడా చోటు లేనట్లు అక్కడ తలదాచుకున్నట్లుంది. అప్పుడప్పుడూ గాలికి ఎగిరి తగులుతున్న చీరపైట వంశీలో గిలిగింతలు పెడుతోంది. అంతవరకు అతను ఆమె చిటికెన వేలు కూడా తాకలేదు. కానీ అప్పుడు మాత్రం అతను ఆగలేకపోతున్నాడు. రక్తమంతా ఏదో సందేశం ఇస్తోంది. శరీరాన్నంతా ఆమె మీదకు వాల్చాలని ఆ సందేశం సారాంశం. ఆ మసకచీకట్లో అలానే ఆమె ముఖం మీదకి తల వాల్చబోయాడు. అతను ఏం చేయబోతున్నాడో గ్రహించి "ఇలాంటివి నిషిద్ధం" అంటూ అతని చుబుకాన్ని పట్టుకుని పైకి లేపింది.

అప్పుడొచ్చింది అతనికి ఆ ఐడియా.

"స్టాట్యూ" అన్నాడు. ఆ ఆటలోని ఒప్పందం ప్రకారం ఎదుటివ్యక్తి అలా అన్నప్పుడు తను శిలా ప్రతిమలా వుండిపోవాలి. అందుకే ఆమె అలా వుండిపోయింది.

ఆ సమయంలో ఆమె బుగ్గలమీద పెదవులు ఆన్చాడు. అంతకుముందు గుడిలో పెట్టిన పంచామృతం చప్పగా తోచింది అతనికి. ఆ ముద్దు అంతగా తీయగా వుంది మరి.

పెదవులను బాగా అదిమిపెట్టి, ఆ తరువాత ముఖాన్ని పైకి లేపాడు.

"డౌన్"

తిరిగి ఆమె మామూలుగా అయిపోయింది.

"స్టాట్యూ ఆటను ఇలా వాడుకోవడం దారుణం"

**5** కాలేజీలో చదువుతున్న వంశీ, సుజనల పరిచయం ప్రేమగా మారుతుంది. ఇద్దరిదీ ఒకే పల్లెటూరులోని పక్క పక్క వీధులే. పెద్దల అంగీకారంతో ఈ ఇద్దరికీ పెళ్ళవుతుంది.

శోభనం ముహూర్తం దగ్గరపడిందనగా సుజనకు 'మూడురోజుల' ఇబ్బంది ఎదురౌతుంది. ఆ మూడు రోజులూ వీలుకాదు కనుక మరో ముహూర్తం చూస్తాడు సుజన తండ్రి. ఆ ముహూర్తం నెలరోజుల తర్వాతగానీ వుండదు. కనుక అప్పటిదాకా శోభనం వాయిదా పడుతుంది.

సుజన తండ్రికి జ్యోతిషం పిచ్చి ఎక్కువ. అందువల్ల చాలా స్ట్రిక్టుగా వుంటాడు. శాస్త్రాలకు కట్టుబడివున్న తన తండ్రిని బోల్తాకొట్టించి ముహూర్తానికి ముందే తమ ఫస్ట్‌నైట్‌ని జరుపుకోవాలనే ప్రయత్నంలో వుంటుంటారు సుజన, వంశీలు. అందుకు ఓ పథకం కూడా వేస్తాడు వంశీ.

ఓ రోజు రాత్రి సుజన ఇంటికి వస్తాడు వంశీ. సుజనకోసం డాబాపైకి వెళ్తున్న వంశీకి సుజన బామ్మ కనబడుతుంది. ఆమె వంశీకి పౌరుషం కలిగించేందుకు తన ఫస్ట్‌నైట్ గురించి వివరిస్తుంది. ఇంకేవో సంభాషణలు పొడిగిస్తున్న ఆమె నుండి తెలివిగా బయటపడతాడు వంశీ.



అంది చిరుకోపాన్ని ప్రకటిస్తూ.

"మరిక ఏం చేయను? నీ చేతులు ఆడుతుండగా ముద్దుపెట్టుకోవడం సాధ్యంకాదనిపించింది"

"ఎప్పుడో విన్నా. ఇలా 'స్టాట్యూ' ఆటలో ఇబ్బందిపెడతాను"

"అలానే. పురుషులతోపాటు స్త్రీలకూ సమానంగా అవకాశాలు వుండాలని కోరుకునేవాడ్ని. ఎప్పుడో సమయం వచ్చినప్పుడు నువ్వూ దీన్ని వాడుకోవచ్చు"

కానీ ఆమె ఆ తరువాత ఎప్పుడూ 'స్టాట్యూ' ఆటలో ఇబ్బంది పెట్టలేదు. పాశుపతాస్త్రంలా దాన్ని దాచుకుంది. మరి దాన్ని ఎప్పుడు ప్రయోగిస్తుందో తెలియదు.

"ఏమిటి వంశీ! ఇక్కడున్నావ్?" మాటలు వినపడడంతో ఉలిక్కిపడి ఈ లోకంలోకి వచ్చాడు వంశీ.

ఎదురుగ్గా సుజన తండ్రి సత్యనారాయణ.

చేతిలోని సిగరెట్టు ముక్కను హడావుడిగా పారేసి "వూరకనే ఇలా నిలుచున్నానండీ" అన్నాడు.

ఆయన పక్కన మరోవ్యక్తి వున్నాడు.

ఎక్కడో చూసినట్లుందిగానీ ఎక్కడ చూసిందీ గుర్తురావడం లేదు.

"ఐయామ్ శరవణన్. మద్రాసు కిల్‌పాక్ సబ్ ఇన్స్‌పెక్టర్‌ని" వంశీ తనవైపు చూస్తుంటే చెప్పాడు ఆ అపరిచిత వ్యక్తి.

అప్పుడు గుర్తొచ్చింది వంశీకి. పెళ్ళిపందిట్లో ద్వారం దగ్గర కుర్చీలో కూర్చుని అదేపనిగా సిగరెట్లు వూదుతూ వున్నాడు ఈయన. డిప్రకటింగ్. కిందకు దిగిన మీసాలనుబట్టి పోలీసుమనిషని పోల్చుకున్నాడు. ఆయన అలా ద్వారం దగ్గర కూర్చుని వచ్చే ఆహూతులందర్నీ పరీక్షగా చూడడంవల్ల బాగా గుర్తుండిపోయాడు. ఎవరీ పోలీసు మనిషి? ఎందుకలా ద్వారం దగ్గర కూర్చుండిపోయాడో అర్థంకాలేదు. కానీ ఎవర్నీ అడగలేకపోయాడు.

"పెళ్ళికి వచ్చాడు. ఎలానూ ఇంతదూరం వచ్చాంగదా అని తిరుమలస్వామి దగ్గరికి వెళ్ళివచ్చాడు.

ఇప్పుడు తిరిగి మద్రాసు వెళ్ళిపోతున్నాడు" సత్య నారాయణ చెప్పాడు.

ఆయనకు షేక్‌హ్యాండిచ్చి "గ్లాడ్ టు మీట్ యు" అన్నాడు వంశీ.

"విష్ యు హేపీ మేరీడ్ లైఫ్. కళ్యాణంలో చిన్న ప్రాబ్లమ్ వస్తుందేమోనని మీ అంకుల్ నన్ను రమ్మని పిలిచాడు. అందుకేనప్పా మద్రాసు నుంచి మీ కళ్యాణం కోసం వచ్చాను. కానీ ఆ మురుగడి దయవల్ల ఆ ప్రాబ్లమ్ రాలేదప్పా. అందుకే అందరం రొంబా హ్యాపీ..." ఎస్.ఐ.ఇంకా తమిళయాసలో ఏదో చెప్ప బోతుంటే సత్యనారాయణరావు అడ్డుతగిలాడు.

"రండి శరవణన్‌గారూ! బస్సుకి టైమ్ అయిపో తోంది" అన్నాడు.

శరవణన్ ఆయన్ని పట్టించుకోకుండా "మాప్పిళే..." అంటూ పొడిగించబోయాడు. సత్యనారాయణరావు కంగారుపడిపోతున్నాడు. అప్పటికే ఆయన ముఖంలో చెమట ఊరడాన్ని గమనించాడు వంశీ.

"ఎస్.ఐ.గారూ! మీరు కదలండి" కసురుకుంటు న్నట్టు అనడంతో శరవణన్ విధిలేక "ఓకే మాప్పిళే- సీయు ఎగైన్" అని బయల్దేరాడు.

ఇద్దరూ వెళ్ళిపోయారు.

వంశీమాత్రం అలా నిలబడిపోయాడు. పెళ్ళిలో ఎదురౌతుందనుకున్న ఆ సమస్య ఏమిటో అతనికి బోధపడడంలేదు. మద్రాసునుంచి పోలీసు ఆఫీసర్‌ని పిలిపించారంటే సమస్య జటిలమైందే. అది ఏమిటో ఎంత ఊహించినా తట్టడంలేదు.

అప్పుడు గుర్తొచ్చింది అతనికి- సుజన ఇక్కడికి రాకముందు మద్రాసు కీల్‌పాక్‌లోని ఓ కాలేజీలో చదువుకుంధన్న విషయం. తన మావయ్య ముఖంలో కనపడిన కంగారునుబట్టి తనకు తెలియకుండా ఏదో దాచారని అతను పసికట్టాడు.

ఇక అక్కడ వుండలేక ఇంటివైపు కదిలాడు.

• • •

కైవల్య కోసం పదినిముషాలనుంచీ వెయిట్ చేస్తోంది సుజన. ఎలానూ ఫస్ట్‌నైట్ కాకపోయినా కనీసం తన రీసెర్చి అన్నా నిరాఘాటంగా కొనసాగితే బావుండునన్న ఆలోచనతో ఆ రోజూ కైవల్యను ఆహ్వానించింది. అంతకుముందురోజు రాత్రే వంశీ ప్లాన్ ఫెయిలయ్యింది. వంశీ ఎందుకు రాలేదో, ఎక్కడ ఎదురుదెబ్బ తగిలిందో అర్థంకాలేదు ఆమెకి. వంశీ ఏదైనా మరో ప్లాన్ వేశాడో లేదో కూడా తెలి యడంలేదు. తన అక్కయ్యాలముందు తన ఛాలెంజ్ నెగ్గదేమోనన్న సందేహంకూడా కలుగుతోంది. ఈ టెన్షన్‌నుంచి కాసేపైనా రిలాక్స్ పొందుదామని కైవల్యను పిలిచింది.

ఆమె కోసం చూస్తూ పెరట్లో కూర్చుంది.

రాత్రికీ, పగలుకీ వంతెనలా అనిపించే సాయం కాలం మెల్లగా కరిగిపోతోంది. ఆకాశాన్ని చుట్టేసిన చీకట్లు మెల్లగా భూమిమీదకు దిగుతున్నాయి. చెట్లలో చేరిన పక్షులు గుసగుసలాడుకుంటున్నాయి.

ఇలాంటి వాతావరణంలో కాఫీ తాగడం బ్రహ్మాం డంగా వుంటుందనిపించి కాఫీ తెమ్మని సుబ్బుల్ని కేకేసింది.

అప్పుడే ఇంట్లోకి అడుగుపెట్టిన కైవల్యను చూసి మరో కప్పుకూడా తెమ్మని పురమాయించింది.

వరండాలోకి వచ్చి, సుజన ఎక్కడ వుందో తెలి యకపోవడంతో అక్కడే ఆగిపోయిన ఆమెను చూసి, చేతులు తట్టి తన ఉనికిని తెలియజేసింది.

"ఇక్కడున్నావా? నీ గదిలో వున్నావేమోనని డాబా మీదకు వెళదామని అనుకుంటూ వుండగా చేతులు చరిచిన శబ్దం వినిపించింది" కైవల్య చెబుతూ ఎదురుగ్గా వేసివున్న కుర్చీలో కూర్చుంది.

"సాయంకాలంగదా. అలా ఫ్రెష్‌గాలి పీలుద్దామని"

"పనులన్నీ చక్కబెట్టుకుని తీరిగ్గా రమ్మని కబు రంపావ్- ఏమిటి విషయం?"

"ఏమీలేదు- ఊరకనే- కాలక్షేపం కావడంలేదు. సాయంకాలం కదా- అలా సరదాగా నీతో మాట్లాడ దామని" అంది సుజన.

వాళ్ళు మాటల్లో వుండగానే సుబ్బులు కాఫీ కప్పులతో వచ్చింది. చెరొకటి తీసుకుని సిప్‌చేయ డం ప్రారంభించారు.

కైవల్యకు ఇరవైఆరేళ్ళుంటాయి. చామనచాయ కావడంతో కాస్తంత సెక్సీగా కనిపిస్తుంది. అటు లావూ గానీ, ఇటు సన్నమూగానీ ఒడ్డికైన ఒళ్ళు.

"నీ శోభనం వాయిదా పడిందట కదా. అమ్మ లక్కలు చెప్పుకుంటుంటే విన్నాను. కారణం ఏమిటి?" కప్పు కింద పెడుతూ అడిగింది కైవల్య.

"ముహూర్తం కుదరక" నవ్వుతూ చెప్పింది సుజన.

"ఏదో సినిమాలో చెప్పినట్లు శోభనానికి కావల సింది ముహూర్తం కాదు- మూడ్"

"నిజమేకానీ- మా నాన్న విషయం నీకు తెలుసు కదా. ప్రతీదీ శాస్త్రోక్తంగా జరగాలంటాడు. అందుకే నెలరోజులు వాయిదాపడింది"

"ఏమిటో మనిషి బతుకు! జీవితం అంత సంక్లిష్ట మైంది మరొకటిలేదు. ఒకమనిషి సమస్యలకూ, మరొక మనిషి సమస్యలకూ పొంతన వుండదు. నీ శోభనం ఒక కారణంచేత ఆగిపోతే మరొకరిది మరో సమస్యవల్ల వాయిదా పడుతుంది. శ్రీనిజ అనే మా బంధువులమ్మాయిది మరోరకం సమస్య"

"శ్రీనిజ ఎవరు? ఏమిటామె సమస్య" సుజన ఉత్సాహంగా అడిగింది.

"శ్రీనిజది మాపక్కఊరే. మా పెదనాన్న కూతురు. పెదనాన్న పెళ్ళికాగానే అత్తవారింటికి ఇల్లరికానికి వెళ్ళాడు, ఇక అక్కడే సెటిల్‌అయిపోయాడు.

ఆయనకి ఒక్కటే కూతురు శ్రీనిజ. ఇంటర్ వరకు చదువుకుంది. ఆపై చదవడానికి తగిన వస తులు లేకపోవడంతో చదువు మానిపించేశారు. మరో రెండేళ్ళకు ఆమె పెళ్ళి ఫిక్సయింది.

పెళ్ళికొడుకుది మంగళగిరి. నెల్లూరులోని ఓ ప్రైవేట్ కాలేజీలో లెక్చరర్. పేరు అమర్. చూడడా నికి అందంగా, స్టైల్‌గా వుండేవాడు.

పెళ్ళయిపోయింది.

అతనికి అమ్మాయిలంటే సిగ్గో, భయమో తెలి యదుగానీ ఆడపిల్లలకు ఆమడదూరంలో వుండే వాడు. ఎప్పుడైనా ఎవరితోనైనా మాట్లాడవలసి వస్తే వణికిపోయేవాడు. సక్రమంగా నోటంట మాట వచ్చేది కాదు. ఆడపిల్ల ఎదురైనా ఠక్కున తలవంచు కునేవాడు. ఇలాంటి అతను ఫస్ట్‌నైట్ రోజున ఎలా ప్రవర్తిస్తాడో ఊహించు.



### నల్లజుట్టుకి తెలుపురంగు!

ఓ ఫంక్షన్‌లో బాలచందర్‌ని కలిసిన భారతీరాజా, బాలచందర్ నెరసిన జుట్టుని చూసి, "తలకి 'డై' వేసు కోండి. అప్పుడు మీరు కుర్రహీరోలా స్మార్ట్‌గా వుంటా"రని చెప్పాడు.

అందుకు దర్శకుడు బాలచందర్ నవ్వుతూ, "నిజంగానే నేను నా జుట్టుకి 'డై' వేశాను. అయితే అది తెలుపు రంగు 'డై'! నిజంగా నా తలలో ఒక్క నల్లవెంట్రుక కూడా లేదు?!" అని అనడంతో నోరు వెళ్లబెట్టడం భారతీరాజా వంతయ్యింది.

### సిగరెట్లు తాగడంలో ఓ జాగ్రత్త



సిగరెట్‌ను మానుకోలేనివారు పొగతాగడంవల్ల కలిగే హానిని ఓ పద్ధతిద్వారా కొంతమేరకు తగ్గించు కోవచ్చునంటున్నారు పరిశోధకులు.

సిగరెట్ చివరి అంగుళం భాగంలో 'హైడ్రో కార్బన్స్' ఎక్కువగా వుంటాయి. ఊపిరితిత్తుల కాన్స రికి కారణం అవే. అందువల్ల, 'సిగరెట్ ఆఖరిభాగాన్ని (మొత్తం సిగరెట్‌లో మూడవవంతు) తాగకుండా పారేస్తే, మీరు పీల్చే 'హైడ్రోకార్బన్లు' తగ్గడమేకాక, మీ పొగ తాగే అలవాటుకూడా తగ్గుతుం'దని వివ రిస్తున్నారు వైద్యనిపుణులు.

"అయితే సిగరెట్టులో మూడోవంతు తాగకుండా పారేసినందుకు బదులుగా మరికొన్ని సిగరెట్లు అద నంగా తాగడం. అలవాటు చేసుకోకుండా జాగ్రత్త పడా"లని వారు హెచ్చరిస్తున్నారు. ◆

వివాహం జరిగాక దంపతులిద్దరూ మా పెదనాన్న ఊరికొచ్చారు. మరపలి కోసం నేను కూడా వాళ్ళతో పాటు వెళ్ళాను.

ఊర్లోని స్త్రీలు చూడడానికి వచ్చినప్పుడు కూడా పెళ్ళికొడుకు గది వదిలి బయటికి రాలేదు.

'మగాడు ఏమిటమ్మా! ఇలా సిగ్గుపడిపోతున్నాడు' అని వాళ్ళంతా బుగ్గలు నొక్కుకున్నారు.

అమర్ తెగసిగ్గుపడిపోవడాన్ని చూసి మేమూ జోక్‌లు వేసుకున్నాం.

ఆ రాత్రి వాళ్ళ ఫస్ట్‌నైట్.

పదిగంటల ప్రాంతాన దంపతులిద్దర్నీ గదిలోకి తోసి గడిపెట్టాం.

ద్వారం దగ్గర నిలబడిపోయిన శ్రీనిజను అతను పిలవనైనా లేదు. మంచం దగ్గర అతనూ నిలబడి పోయి తలవంచేసుకున్నాడు.

సిగ్గుపడాల్సింది తనో, ఆయనో అర్థంకాలేదు శ్రీనిజకి. మా మాటలవల్ల అతని గురించి ఎంతో కొంత అవగాహనకొచ్చింది.

దాంతో తనే చొరవ తీసుకోకతప్పదనిపించి. నడుచుకుంటూ అతని దగ్గరికి వెళ్ళింది.

'పాలు తాగండి'

అదిగో అప్పుడు తల ఎత్తాడు అతను.

ఆమె చాలా అందంగా వుంటుంది. మొదటిసారి ఆమెను చూస్తున్నట్టు కళ్ళార్పడం కూడా మరిచి ఆమెని చూస్తుండిపోయాడు.

పాలు కొంత తాగి, మిగిలినవి ఆమెకిస్తూ 'తాగు'

## స్మిత జాగ్రత్తలు

నాజూకు నాజూగ్గా మరింతగా చిందులేయడానికి, అనవసరపు కొవ్వు తగ్గించుకునే ఓ ఆపరేషన్‌ని చేయించుకుంది సిల్క్‌స్మిత. అంతేకాదు- ఆ తర్వాత ఓ ప్రెస్ కాన్ఫరెన్స్ పెట్టి, తన ఫిగర్‌కున్న స్పెషాలిటీని ప్రదర్శించింది. తన ఆపరేషన్ డిటెయిల్స్‌ని కూడా వివరించింది. తన అందంపట్ల అమితంగా శ్రద్ధ చూపించుకుంటున్న సిల్క్‌స్మితని అభినందిస్తూ, ఓ హిందీ సినీపత్రిక కూడా ఈ వార్తను అందించింది.



స్మిత ఇన్నిన్ని జాగ్రత్తలు తీసేసుకుంటే ఇంకెంతెంత శృంగార రసాలు పండించేస్తుందో ఏంటో?!

అన్నాడు. శ్రీనిజ భర్త.

'అబ్బ! ఇంతసేపటికి మాట్లాడారు- ఇక పరవా లేదు' అనుకుంటూ పాలగ్లాసు తీసుకుంది.

ఇద్దరూ మంచంమీద కూర్చున్నారు.

'మా నాన్నకు మేం నలుగురూ మగపిల్లలమే. అమ్మ కూడా నా చిన్నప్పుడే చనిపోయింది. అందుకే ఇంట్లో ఎవరూ స్త్రీలు వుండేవాళ్ళు కాదు. నాన్నే వంటంతా చేసేవాడు. ఆయనే మమ్మల్నంతా పెంచాడు. చిన్నప్పట్నుంచీ స్త్రీలు ఇంట్లో లేకపోవడం వల్ల స్త్రీలతో మాట్లాడే అవకాశమే లేకపోయింది. హైస్కూల్ కూడా కో-ఎడ్యుకేషన్ కాదు. కాలేజీ లోనూ అంతే. అందుకే ఆడపిల్లలంటే జంకు'

పరవాలేదు- తన సమస్య ఏమిటో? అందుకు కారణాలు కూడా ఏమిటో తెలుసుకున్నాడు అనుకుని సంతృప్తిపడింది శ్రీనిజ.

'ఒక అమ్మాయి పక్కన అంత క్లోజ్‌గా కూర్చున్నది నీతోనే- అదీ పెళ్ళిపీటలమీద'

తన భర్తకు పెళ్ళికిముందే ఎలాంటి అనుభవమూ లేదని తెలియడంతో ఆమె చాలా ఆనందించింది.

'ఇక ఎప్పుడూ మీతోనే వుంటాను కదా. ఈ బెదురంతా పోతుందిలెండి'

అతను కొద్దిగా ధైర్యం పుంజుకున్నాడు. మెల్లగా ఆమె భుజంమీద చేయివేశాడు. అతనికి తెలియకుండానే చేయి వణుకుతోంది.

ఆమె దీనిని పసికట్టి ఏదో క్యాజువల్‌గా పట్టుకున్నట్టు అతని చేతిని తన చేత్తో బిగించింది.

కొంతసేపటికి వణుకు తగ్గింది.

అతనికి ఏదో చేయాలని వుందిగానీ ఎలా ప్రారంభించాలో, ఎలా ప్రొసీడ్ కావాలో తెలియడంలేదు. సెక్స్‌లో అతనికి థీరిటికల్ నాలెడ్జ్ కూడా లేదు.

ఆమెకి మాత్రం థీరిటికల్ నాలెడ్జ్ వుంది.

ఒళ్ళంతా దేనికోసమో ఆరాటపడిపోతూ వుంది. దాహం తెలుస్తోందిగానీ, దప్పిక ఎలా తీరుతుందో తెలియడంలేదు. ముద్దలా ఆమెమీద వాలిపోయాడు.

ఆమె సర్దుకుని పడుకుంది. పక్కన చేరిన అతను ఆమె మీదకి ఒరిగి నోటితో ఎక్కడెక్కడో తడుముతున్నాడు. అందులో ఒక పద్ధతిలేదు. ఏమీ తెలియని ఓ పల్లెటూరువాడు ఇంగ్లీషు సినిమాకి వెళితే ఎలా వుంటుందో అలా వుంది పరిస్థితి.

ఫైవ్‌స్టార్ హోటల్‌కి వెళ్ళిన ఓ సామాన్యుడు ఏ దారి ఎటు వెళుతుందో తెలియక తికమకపడిపోతున్నట్లు అతను గింజుకు పోతున్నాడు.

ఎంతసేపటికీ అలా పెదవులతో ఎక్కడెక్కడో రాయడం తప్ప మరి ముందుకు సాగలేకపోతున్నాడు.

ఆమెకి మాత్రం కొంత తెలుసు. కానీ తను యాక్టివ్ పార్ట్ తీసుకోవడానికి ఏదో తెలియని సిగ్గు ఆమెని వెనక్కి లాగుతోంది.

అతను అలా కొంతసేపు పెనుగులాడి, ఇక ఆపై ఏం చేయాలో తెలియక పూరకుండిపోయాడు.

ఆమెకి ఆ తరువాత ఏంచేయాలో చెప్పాలనిపించిందిగానీ చెప్పలేకపోయింది.

ఇద్దరూ మాటల్లో పడ్డారు. ఎప్పుడో తెల్లవారుజామున ఇద్దరూ నిద్రపోయారు. ఏమీ జరక్కుండానే ఆ రాత్రి తెల్లారిపోయింది.

రెండోరోజు అతనిలో కొంత మార్పు వచ్చింది. మునుపటిరోజులా గది తలుపులు బిగించుకుని కూర్చోలేదు. అప్పుడప్పుడూ బయటకొస్తున్నాడు.

రెండోరోజు రాత్రి యథాప్రకారం ఇద్దరూ గదిలోకి వెళ్ళారు.

ఇద్దరికీ ఇద్దరూ కొంత అలవాటు కావడంవల్ల బిడియం పోయింది. ఇద్దరూ అవీ ఇవీ కబుర్లు చెప్పుకున్నాక మంచం మీద పడుకున్నారు.

అతను కోరికతో కాలిపోతున్నాడు. ఆమెలో కూడా వెచ్చటి ఆవిర్లు ప్రవహిస్తున్నాయి.

అతను ఆమె ముఖంమీదకి వంగి గాఢంగా ముద్దు పెట్టుకున్నాడు.

'పరవాలేదే. ముద్దు పెట్టుకోవడం నేర్చుకున్నారే' అంది మెరుస్తున్న కళ్ళతో.

అతను నవ్వుతూ పెదవుల్ని కిందకి దించాడు.

ఆమెకి చక్కిలిగింతలాంటిది కలిగి, ఆపై సుఖంలో అది మరుగునపడిపోయింది. అతను పెదవులతో కంఠాన్ని తడిమి, ఆపై స్కిప్ అయిపోయి నడుం మీద నోటిని వుంచాడు.

అలా స్కిప్ చేయకూడదని చెప్పాలనిపించింది ఆమెకి. కానీ ఓ ఆడపిల్ల అంత డైరెక్టుగా ఎలా చెప్పగలదు? 'మీరు స్కిప్పింగ్ చేసేవారా వ్యాయామం కోసం?' అని అడిగింది.

అప్పుడు అలాంటి ప్రశ్న ఎందుకేసిందో తెలియని అతను 'లేదే' అన్నాడు.

'మరి కంఠంనుంచి నడుం దగ్గరికి వెళ్ళిపోయారే. స్కిప్పింగ్ అంటే బొత్తిగా ఇష్టంలేదు నాకు'



## వింత డేటింగ్

పూజాభట్ డేటింగ్‌లో ఓ వింతపద్ధతి పాటిస్తోంది. ఆమె ఒకరోజంతా కేవలం ఒకేరకమైన ఆహారాన్ని తీసుకుంటోంది. ఉదాహరణకి, నిన్నటి రోజున కమలాఫలాలు తింటే, ఇవాళంతా పుచ్చకాయను మాత్రమే తింటుంది. రేపటి ఆహారం యాపిల్ పళ్ళు మాత్రమే. అలా!

'ఈ డేటింగ్‌తో పూజాభట్ తాను కోరుకున్న నాజూకు అందాలు సంతరించుకుంటుందేమో!' అని కొందరు ఊహిస్తుంటే, "అనారోగ్యంపాలై మంచాన పడినప్పుడే ఆమెకీ వెర్రి తగ్గుతుం"దంటూ మరి కొందరు ఎగతాళిచేస్తున్నారు.

అతనికి కొంత అర్థమైంది.

తన తప్పును సరిదిద్దుకోవడానికి పెదవులు పైకెత్తాడు.

'కళ్ళమీద ఏ ఆచ్ఛాదనా లేదు. వాటిమీద డైరెక్టుగా ముద్దుపెట్టారుకదా. అలానే అక్కడ కూడా...' అని ఆపింది.

జాకెట్టు హుక్‌లు కూడా ఎక్కడుంటాయో అతనికి తెలీదు. అందుకే ఆమెను అటూ ఇటూ తిప్పాడు. అతని అదృష్టం కొద్దీ అవి ముందున్నాయి.

'హుక్‌లు విప్పడం కూడా ఒక కళే. మరి ట్రై చేయండి' అంది శ్రీనిజ.

అతను మరో పదినిముషాలకి విజయం సాధించాడు. 'సగం సాధించాను' అనుకుంది.

అతను తమకంతో అమృతాన్ని జుర్రుకుంటున్నాడు. ఆమె అరమోడ్పుకన్నుల మధ్య సుఖాన్ని ఫీలవుతోంది. పూర్తి అనుభవం కోసం తహతహలాడుతోంది. అయితే అతను మాత్రం అంతకుమించి ఏం చేయలేకపోతున్నాడు. మిగిలిన వివరాలు ఎలా చెప్పాలా అని ఆలోచిస్తోంది.

'మనం ఒక ఆట ఆడదామా?' అతని మాటలకు ఆమె కళ్ళు తెరిచి ఏమిటన్నట్లు చూసింది.

'నేను కళ్ళు మూసుకుని ముద్దులు పెట్టుకుంటాను. ఉదాహరణకు మొదట కళ్ళమీద ముద్దు పెట్టుకుంటాను. కళ్ళమీదే కరెక్టుగా ముద్దుపెట్టుకుంటే నువ్వు 'ఒప్పు' అనాలి. కళ్ళమీద కాకుండా పక్కన పెట్టుకుంటే 'తప్పు' అనాలి. ఇది ఆఫ్‌షియర్లీ ఎగ్జామ్ అన్నమాట నాకు'

'లెక్చరర్ బుద్ధి పోనిచ్చుకున్నారు కాదు'

'ఆఁ - మరి మొదలుపెట్టనా'

'ఓకే'

అతను పాపిటమీద ముద్దుపెట్టుకోవడానికి వంగాడు. కానీ కొంత ఎడమవైపు జరిగాడు.

'తప్పు' అంది.

ఈసారి నుదుటమీద కరెక్టుగానే పెదవులను అద్దాడు.

'ఒప్పు'

అతను విజయగర్వంతో నవ్వాడు.

ఈసారి కళ్ళమీద ముద్దుపెట్టుకున్నాడు. చివరికొచ్చేసరికి అయిదు తప్పులు, నాలుగు ఒప్పులూ తేలాయి.

'బొటాబొటిగా పాసయ్యానన్నమాట' అని కాసేపాగి ఏదో చిలిపి ఆలోచన వచ్చినట్లు చిన్నగా నవ్వి. 'మరి నువ్వు లెక్చరర్ అయివుంటే ఏం అడిగేదానివి?' అని ప్రశ్నించాడు.

ఆమె ఓ క్షణంపాటు కళ్ళు టపటపలాడించి 'నేనైతే ఒకే ప్రశ్న అడుగుతాను. అదేమిటంటే- దిగువ ఇచ్చిన ఖాళీని పూరించుము అంటాను'అంది.

అతనికి ఏదో అర్థమైంది.

పూర్తి అనుభవాన్ని ఆమె చవిచూసింది"

• • •

కైవల్య చెప్పడం ఆపిందిగానీ సుజన మాత్రం నవ్వాపలేదు. "శ్రీనిజ తెలివిగా తనకు కావాల్సింది సాధించుకుంది. మొత్తానికి పెద్ద ఇబ్బందేవచ్చిపడింది ఆమెకి. కానీ ఈ కాలంలో అలాంటి కుర్రాళ్ళు తక్కువే అనుకుంటాను" అంది ఆమె నవ్వును బలవంతంగా ఆపుకుంటూ.

"నిజమే. టి.వి.లు- సినిమాలు- పుస్తకాలు- ఇవి ఎంతో కొంత నాలెడ్జిని ఇస్తున్నాయి. అతను చిన్నప్పట్నుంచీ స్త్రీలకు దూరంగా పెరగడంవల్ల పూర్తిగా చీకటిలో వుండిపోయాడనుకుంటాను. ఇప్పుడు ఇద్దరూ చక్కగా కాపురం చేసుకుంటున్నారు"

"తొలిరేయి అనుభవానికి ఇద్దరూ కొత్తయివుంటే ఆ దాంపత్యం చాలా రోజులవరకు సజావుగా సాగుతుందని ఎక్కడో చదివాను"

"చాలా జంటల్లో కాపురం సజావుగా జరగకపోయినా, భార్యాభర్తలిద్దరూ రాజీపడిపోతారు. పెళ్లయిన కొత్తల్లో దంపతులు ఎక్కువగానే పోట్లాడుకుంటూ వుంటారు. కాలం గడిచేకొద్దీ ఇద్దరూ రాజీపడిపోవడానికి అలవాటుపడిపోతారు. రాజీపడిపోవడానికి ఒకసారి అలవాటైతే ఎంత హీనస్థితికైనా మనిషి దిగజారిపోతాడు. ఇందుకు నా ఫస్ట్‌నైట్ మంచి ఉదాహరణ"

"ఏం జరిగింది నీ ఫస్ట్‌నైట్ రోజున?" ఎగ్జైట్‌మెంట్‌లో అడిగింది సుజన.

మరొకరి ఫస్ట్‌నైట్ గురించి తెలుసుకోవాలని మనకు ఎంత ఉత్సాహం వుంటుందో,అదంతా చెప్పాలని ఎదుటి వ్యక్తికీ వుంటుంది.

అందుకే కైవల్య కూడా తన శోభనం గురించి చెప్పాలని నిర్ణయించుకుంది. కుర్చీలో సర్దుకుని కూర్చుంది.

**(ఇంకావుంది)**

# రాబోయే అసెంబ్లీ ఎన్నికలు
# ప్రధాని చాకచక్యానికి మరో పరీక్ష

న్యూస్ లెటర్
ఎస్. వెంకట నారాయణ



భారతదేశపు 25 రాష్ట్రాలలోనూ పది రాష్ట్రాల అసెంబ్లీ ఎన్నికలు నవంబర్ మాసంలో జరుగవలసి వున్నాయి గనుక, ఇప్పుడు దేశ ప్రధాని, పాలకపక్షమైన కాంగ్రెస్ పార్టీ అధ్యక్షులు పి.వి. నరసింహారావుగారి చాకచక్యం,నేర్పరితనాలు మరోమారు పరీక్షకు వస్తాయి. అంతగా సమర్థవంతంగాని తన పార్టీ ఎన్నికల యంత్రాంగాన్ని చైతన్య పరిచేందుకు రావుగారిప్పుడే తగు చర్యలకు శ్రీకారం చుట్టారు.

ఆంధ్రప్రదేశ్, కర్ణాటక,మహారాష్ట్ర, గుజరాత్, గోవా, బీహార్, ఒరిస్సా, మణిపూర్, సిక్కిం, అరుణాచల్‌ప్రదేశ్ రాష్ట్రాలలో అసెంబ్లీ ఎన్నికలు ఈ సంవత్సరం నవంబర్, 1995 మార్చి మధ్య నిర్వహించబడాలి. నవంబర్‌లో ఎన్నికలు జరుగనున్న రాష్ట్రాల్లో ఫలితాలు నిరాశాజనకంగా వుంటే, వచ్చే ఏడు ప్రారంభంలో ఎన్నికలు జరగవలసిన రాష్ట్రాల అదృష్టం, విజయావకాశాలమీద అవి దుష్ప్రభావం చూపవచ్చునని కాంగ్రెస్‌వాదులు కళవళపడుతున్నారు. ఆ కారణంగా పది రాష్ట్రాల్లోనూ ఎన్నికలు నవంబర్‌లోనే తలపెట్టవలసిందిగా రావుగారిని వారు ఒప్పించగలిగారు.

ఈ నెల ప్రారంభంలో కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ (సి.డబ్ల్యు.సి.) - అత్యున్నత స్థాయిలో నిర్ణయాలు తీసుకునే పార్టీ అగ్ర సంస్థ- జరిపిన సమావేశంలో దేశమంతటా వున్న పార్టీ రాష్ట్ర, జిల్లా విభాగాల్లో ఎవ్వరినైనా నియమించేందుకు, తొలగించేందుకు రావుగారికి సంపూర్ణాధికారాలు అప్పగించింది. రెండేళ్ళ క్రితం ఆయన తాను జరిపిస్తానని మాట ఇచ్చిన సంస్థాగత ఎన్నికలు ఇప్పుడు నిరవధికంగా వాయిదా పడ్డాయి.

నరసింహారావుగారికి ఆ విషయంలో త్వరలో రానున్న ఎన్నికలు అనుకూలమైన మిషగా లభించాయి. అసెంబ్లీ ఎన్నికలు గెలవడానికి కాంగ్రెసువాదుల శక్తియుక్తులన్నీ కేంద్రీకరించబడవలసిన తరుణంలో, సంస్థాగత ఎన్నికల ఆవశ్యకత పేరుతో వారి శ్రద్ధాసక్తుల్ని మళ్ళించడమెందుకు? ప్రపంచంలోనే అత్యంత విస్తృతమైన ప్రజాస్వామ్యదేశాన్ని నాలుగు దశాబ్దాలకు పైగా పరిపాలించిన కాంగ్రెస్ పార్టీకి అంతర్గత ప్రజాస్వామ్యం గిట్టని విషయం. విపరిహారిగా పార్టీ ఎన్నికలు జరిగి ఇరవైఏళ్ళకు పైనే అయింది.

అలాంటి అంతర్గత ఎన్నికలనేవి లేకుండా పార్టీని నడపడం ఇందిరాగాంధీ, ఆమె తనయుడు రాజీవ్‌గాంధీలకు ఆనందదాయకంగా వుండేది. ఆ పార్టీ అధినేతగా సార్థకంగా పనిచేయాలంటే, పార్టీని గట్టిగా తన అదుపులో వుంచుకోవడంతోబాటు, ప్రధాని పదవి కోసం అర్రులుజాస్తూ వున్న మానవవనరుల అభివృద్ధి శాఖామంత్రి అర్జున్‌సింగ్, మహారాష్ట్ర ముఖ్యమంత్రి శరద్‌పవార్‌వంటి వాళ్ళను ఎడంగా, హానికి దూరంగా వుంచాలని రావుగారు గ్రహించినట్టున్నారు.

పార్టీ నిర్వాహకులు ఓ విస్తృత కార్యాచరణ పథకాన్ని సమర్పించారు. ఎన్నికల్లో పోటీచేసేందుకుగాను అభ్యర్థులను 'బహుముఖమైన అంచనా విధానం' ద్వారానే ఎంపికచేయాలని వారు సూచించారు. వివిధ రాష్ట్రాలకు వెళ్ళవలసిన పార్టీ పరిశీలకులను మే 7వ తేదీకే ఎంపికచేయాలి. వారికి తమ విధి నిర్వహణలో అవగాహన పెంచే శిక్షణా కార్యక్రమం ఢిల్లీలో మే 15 నాటికి ముగుస్తుంది. వారికి తగు కార్యక్రమ ప్రాంతాలు మే 20 నాటికి కేటాయిస్తారు.

జూన్-జూలై 25ల మధ్య వారు జిల్లా కాంగ్రెస్ కమిటీ(డి.సి.సి.)ల ప్రతినిధులతో కలిసి 'బ్లాక్ కమిటీ'లను సందర్శిస్తారు. ప్రతి అసెంబ్లీ నియోజకవర్గానికి అయిదుగురు అభ్యర్థుల జాబితాను సిద్ధంచేస్తారు. ఆగష్టు 15 నాటికి ప్రతి రాష్ట్రంలోని ఎన్నికల సంఘం అందులోంచి ముగ్గురు అభ్యర్థుల పేర్లను ఎంచి, అఖిలభారత కాంగ్రెస్ కమిటీ



ఎన్నికలు జరగవలసిన పది రాష్ట్రాలలో ఆరు రాష్ట్రాలు కాంగ్రెస్ పరిపాలనలో వున్నాయి. కానీ ఆ రాష్ట్రాల్లో లంచగొండితనం, అంతర్గతకలహాలతో పార్టీ వేగిపోతున్నది. గట్టి పోటీనిచ్చి, గణనీయమైన పాత్ర ప్రదర్శించడానికి ప్రతిపక్షాలు ఆయత్తమవుతున్నాయి.

తన పార్టీ లోపాలు, పరిమితమైన ఎన్నికల ఆకర్షణ ప్రధానమంత్రికి ఎరుకే కాబట్టి, వీలైనన్ని పార్టీలు, బృందాల మధ్య కాంగ్రెసేతర ఓట్లను చీల్చడానికి ఆయన పకడ్బందీగా పథకాలు రూపొందించడంలో నిమగ్నులైవున్నారు.

(ఏ.ఐ.సి.సి.)కి పంపుతుంది. సెప్టెంబర్ 15 నాటికి ఏ.ఐ.సి.సి. తన సిఫారసులను పార్టీ ప్రధాన ఎన్నికల సంఘానికి అందజేస్తుంది. అక్టోబర్ 1నాటికి ఆ సంఘం అభ్యర్థుల పేర్లను ఖరారుచేస్తుంది. అప్పుడు ఎంపిక చేయబడిన స్త్రీ, పురుష అభ్యర్థులకు ఎన్నికల ప్రచారం చేసుకునేందుకు నెలకు పైగానే గడువు లభిస్తుంది.

గతంలో నెహ్రూ-గాంధీ వంశీయులు కాంగ్రెస్‌కు సారథ్యం వహించిన రోజుల్లో, ఎన్నికల్లో గెలిచి, అధి



కాన్షీరామ్



ఎన్.టి. రామారావు

కారం హస్తగతం జేసుకునేందుకు పార్టీ అభ్యర్థులు తమ అధినాయకుల జనాకర్షకశక్తిమీద ఆధారపడేవారు. ఎమర్జెన్సీ అత్యాచారాల కారణంగా 1977 లో ఇందిరా గాంధీపట్ల, బోఫోర్స్ ముడుపుల కుంభకోణంలోని లంచగొండితనం కారణంగా 1989లో రాజీవ్‌గాంధీ పట్ల, ఓటర్లు కినుక వహించినప్పుడు కాంగ్రెసువారు అధికారచ్యుతికి లోనయ్యారు.

అయితే జనాకర్షణ అన్నది నరసింహారావు గారికి గర్వించదగ్గ సలక్షణాల్లో ఒకటి కాదు. ఏది ఏమైనా, పార్టీ అధ్యక్షునిగా, దేశప్రధానిగా ఆయన నియమించ బడ్డారంటే, అది ఆయన ఎన్నికల్లో విజయం గడించే



ఎస్. బంగారప్ప



హెచ్.డి. దేవెగౌడ

సామర్థ్యాన్నిబట్టి కాదు. అయినప్పటికీ, ఆయన కొత్తపుంతలు తొక్కిన ఆర్థిక సంస్కరణలను చేపట్టారు; అయోధ్యలోని బాబ్రీమసీదు నేలమట్టమవడంలో ఏర్పడిన సంక్షోభాన్ని తట్టుకుని నిలువగలిగారు; లోక్‌సభలో తన పార్టీకి మెళకువతో మెజారిటీ ఆర్జించిపెట్టగలిగారు; గత నవంబర్‌లో ఉత్తరభారతంలో జరిగిన అసెంబ్లీ ఎన్నికల్లో తన పార్టీకి గణనీయమైన విజయాలు చేకూర్చగలిగారు; ఇన్ని సాధించి తన పేరు చెరపాలని ప్రయత్నించే వారిని సైతం ఆశ్చర్యచకితుల్ని చేశారు.

ఇంతగా 'కార్యసాధన' చేయగలిగిన రావుగారు, తన లోక్‌సభ నియోజకవర్గమైన నంద్యాలలోనైనా జనసందోహాన్నాకర్షించలేకపోయారు. అందుకని, రానున్న ఎన్నికల్లో తన పార్టీని విజయం వరించేందుకై ఆయన మరోమారు అపరిమితమైన తన చదరంగపు ఎత్తులు, చాకచక్యంమీద ఆధారపడవలసి వుంటుంది. ఎన్నికలు జరగవలసిన పది రాష్ట్రాలలో ఆరు రాష్ట్రాలు కాంగ్రెస్ పరిపాలనలో వున్నాయి. కానీ ఆ రాష్ట్రాల్లో లంచగొండితనం, అంతర్గతకలహాలతో పార్టీ వేగిపోతున్నది.

గట్టి పోటీనిచ్చి, గణనీయమైన పాత్ర ప్రదర్శించడానికి ప్రతిపక్షాలు ఆయత్తమవుతున్నాయి. అందుకనే నరసింహారావు గారు తన సన్నాహాలను ఇంత ముందుగా ప్రారంభించారు. తన పార్టీ లోపాలు, పరిమితమైన ఎన్నికల ఆకర్షణ ఆయనకి ఎరుకే కాబట్టి, వీలైనన్ని పార్టీలు, బృందాలమధ్య కాంగ్రెసేతర ఓట్లను చీల్చడానికి ఆయన పకడ్బందీగా పథకాలు రూపొందించడంలో నిమగ్నులైవున్నారు.

☆ బహుజన సమాజ్ పార్టీ (బి.ఎస్.పి.) నాయకుడు కాన్షీరామ్, తెలుగుదేశం పార్టీ (టి.డి.పి.) అధినేత



అర్జున్‌సింగ్



శరద్‌పవార్

ఎన్.టి. రామారావు (ఎన్టీఆర్)తో చేతులు కలుపకుండా వుండేందుకు తగుచర్యలు చేపట్టమని ఆంధ్రప్రదేశ్‌లోని తన సహచరుల్ని ఆయన కోరారు. షెడ్యూల్డ్ కులాల, షెడ్యూల్డ్ తెగల ఓట్ల మద్దతుతో అయిదేళ్ళ వ్యవధి తర్వాత, ప్రధాని స్వరాష్ట్రంలో టి.డి.పి. అధికారం తిరిగి హస్తగతం చేసుకోగలదని అంతటా భావించబడుతోంది.

ఇటీవలి కాలంలో ఆ రాష్ట్రంలో కాన్షీరామ్ పెద్ద ఎత్తున జనాన్ని ఆకర్షించగలుగుతున్నాడు. టి.డి.పి.తో బి.ఎస్.పి. చేతులు కలుపకుండా నివారించగలిగితే, టి.డి.పి. ఓట్ల మూలాధారాన్ని తెగగొట్టవచ్చు. అది కాంగ్రెస్‌కు లాభించగలదు.

☆ కర్ణాటకలో, ఎస్.బంగారప్ప నేతృత్వంలో ఆవిర్భవించిన కర్ణాటక కాంగ్రెస్‌తో జనతాదళ్ సీట్లు పంచుకునే ఏర్పాటును నివారించాలని కాంగ్రెస్ ప్రయత్నిస్తోంది. జనతాదళ్ గనుక జనప్రియుడైన తమ నాయకుడు హెచ్.డి. దేవెగౌడను ముఖ్యమంత్రిపదవికి అభ్యర్థిగా నిలుపగలిగితే, ఎన్నికల్లో ఆ పార్టీకి తిరుగు వుండదు.

కానీ ఆయన ప్రత్యర్థులు రామకృష్ణ హెగ్డే, ఎస్.ఆర్. బొమ్మయ్ మటుకు, తమ పార్టీ ఏ ఒక్క వ్యక్తినీ భవిష్యత్ ముఖ్యమంత్రిగా రంగంలోకి దింపడంలేదని ప్రకటించారు.

జనతాదళ్‌లాగే భారతీయ జనతా పార్టీ కూడా 'వొక్కలిగ' కులానికి చెందిన ఓటర్లనే ఆకర్షించ ప్రయత్నిస్తుంది. వెనుకబడిన జాతులవారి ఓట్లు బంగారప్ప పార్టీకి దక్కవచ్చు.

ఆ విధంగా కాంగ్రెసేతర ఓట్లు పై మూడు పార్టీల మధ్య పంచబడితే, ముఖ్యమైన ఈ రాష్ట్రంలో కాంగ్రెసుకు విజయం తథ్యమని నరసింహారావు



రబీరే



బిజూపట్నాయక్

గారు ఆశాభావంతో వున్నారు.

☆ మహారాష్ట్రలో 'చతుర్ముఖ' పోటీ జరిపే ప్రయత్నాలు కొనసాగుతున్నాయి. బి.జె.పి.-శివసేన సయోధ్యను విచ్ఛిన్నం చేయడానికి శరద్‌పవార్ ప్రయత్నించాడు. అక్కడ జనతాదళ్, వామపక్షాలు, బి.ఎస్.పి., ప్రాంతీయ బహుజన మహాసంఘ్ పార్టీలు ఏకమై ఉమ్మడి అభ్యర్థులను నిలబెట్టడాన్ని నిరోధించడానికి కాంగ్రెసు ప్రయత్నిస్తుంది.

☆ ఒరిస్సా విషయానికొస్తే, అక్కడ పాలకపక్షమైన జనతాదళ్‌లో చీలికలు తీసుకువచ్చే తంత్రంలో కాంగ్రెస్‌వాదులు నిమగ్నులైవున్నారు. మాజీ లోక్



లాల్ూప్రసాద్ యాదవ్



రామ్‌లఖన్‌సింగ్ యాదవ్

సభ స్పీకర్ రబీరేను, ముఖ్యమంత్రి బిజూపట్నాయక్ నుంచి విడిపోయి, స్వంత జనతాదళ్‌ను ఏర్పరచమని వారు ప్రలోభపెడ్తున్నారు.

☆ జనతాదళ్ పాలనలోవున్న బీహార్‌లో ముఖ్యమంత్రి లాలూప్రసాద్ యాదవ్‌కు ప్రత్యర్థిగా రామ్‌లఖన్ సింగ్ యాదవ్‌ను కాంగ్రెస్ ముందుకు తోస్తోంది. అంతేగాక మాజీ జనతాదళ్ మంత్రి నితీష్ కుమార్‌ను యాదవ్‌తో చేర్చే ప్రయత్నంలో వుంది.

నరసింహారావుగారు ఇతర రాష్ట్రాలలోనూ ఇలాంటి వ్యూహాల్నే పన్నుతున్నారు. అవి ఏ మేరకు విజయం కాగలవనేది వేచి చూడవలసిన విషయం. ♦

సీరియల్



# రాళ్ళ మా ఇంటిదాకా

## మేర్లపాక మురళి

చివరి సూర్యకిరణాలు ఆమెమీద పడుతుండడంవల్ల కైవల్య అందం మరింత మెరిసిపోతోంది.

ఆమె మీదకు ఒంగిన ఓ సూర్యకిరణం తల మధ్యలో పాపటి బిళ్ళలా సాగి, ముక్కుమీద ముక్కెరలా తళుక్కున మెరిసి, పెదవులకు ఎరుపురంగు పూసి, కంఠంమీద నెక్లెస్‌లా పరావర్తనం చెంది, ఇక అక్కడనుంచి సరళరేఖలా కిందకు దిగి, బొడ్డును బంగారపు గనిలా ప్రకాశింపజేసి, ఆ మీదట చీరకుచ్చిళ్ళల్లో దూరి, సిగ్గుబిళ్ళలా అమరి, ఆపై సిగ్గుతో అంతర్ధానమవుతోంది.

"మనకు ఏదైనా సమస్య ఎదురైనప్పుడు మనమంతా కామన్‌గా చేసేది-దానితో రాజీపడిపోవడం. ఈ రాజీపడిపోవడమనేది ఎంత భయంకరంగా వుంటుందో విను" కైవల్య ఆగింది. ఇదంతా అసలు సంగతికి ఉపోద్ఘాతమని తెలియడంవల్ల ఏమీ కామెంట్ చేయకుండా మౌనంగా వుండిపోయింది సుజన.

కైవల్య తిరిగి ప్రారంభించింది.

"మా ఊరు నగరి దగ్గరగా వున్న పల్లెటూరు. ఆ ఊర్లో మాకు చిల్లర దుకాణం వుండేది. ఆ ఊరికంతా మాదే అంగడి కావడంవల్ల బాగానే జరిగేది. కానీ మా నాన్నకు పేకాట పిచ్చి. ఊర్లో ఏ పనీ పాటా లేనివాళ్ళు సరదాగా ప్రారంభించిన ఆట చివరికి వ్యసనంగా పరిణమించింది. మా నాన్నకూ ఆ వ్యసనం పట్టుకుంది. పల్లెటూరు కాబట్టి డబ్బులు ఎక్కువగా పెట్టి ఆడేవాళ్ళు కాదు. కానీ మా నాన్నలాంటివాళ్లకు అది ఎక్కువే. అంగడి బాగా జరిగినా అందులో లాభం ఎంతొస్తుందని? రోజుకి ముప్పై లేదా నలభై రూపాయలు మిగిలేవి. మా కుటుంబం చాలా పెద్దది. అమ్మా నాన్నకు మొత్తం నలుగురు సంతానం. నేను పెద్దదాన్ని. నా వెనుక ఒక తమ్ముడు. ఇద్దరు చెల్లెళ్ళు. వచ్చే లాభాన్ని పేకాటలో ధారబోస్తూ. తిరిగిగెలుస్తూ మా నాన్న తంటాలుపడుతుండేవాడు.

నేను టెన్త్ క్లాస్ పాసయ్యాను. ఇక ఇంటర్ చదవాలంటే నగరికి వెళ్ళాలి. కాలేజీ మరో రెండు నెలల్లో తెరుస్తారనగా నా శరీరంలో విపరీతమైన మార్పులొచ్చాయి. యవ్వనాన్ని పిల్చుకుని ఊరినట్టు నా ఎద పెరిగింది. ఓ రెండు గుప్పెట్లు పొడుగు పెరిగాను. నడుం దగ్గర ఎవరో కర్ఫ్యూ పెట్టినట్లు ఆ భాగంలోని శరీరం మాత్రం అలానే వుండిపోయింది. ఇక దానికింది భాగం మాత్రం ఎదతో పోటీ పడింది. నాకు నేనే ఆశ్చర్యపోయేంత మారిపోయాను.

ఓ రోజు స్నానం చేసొచ్చి పావడా, జాకెట్టు వేసుకుంటూ వుండగా మా అమ్మ వచ్చి 'ఇది పైట-ఇక నుంచీ దీన్ని కూడా వేసుకో' అంది.

మౌనంగా దాన్నందుకున్నాను. దాన్ని వేసుకుని వీధిలోకి పోవాలంటే తగని సిగ్గుగా అనిపించింది. అందుకే ఓ రెండు రోజులపాటు ఇంట్లోంచి కాలు బైట పెట్టలేదు. మూడో రోజున అలా వరండాలోకి వచ్చి నిలుచున్నాను. నాలుగో రోజు బావి దగ్గరికి వెళ్ళాను. ఇక ఆ తరువాత బెరుకుపోయింది.

ఇదంతా నాన్న గమనించినట్లున్నాడు. 'ఇక నువ్వు కాలేజీకి వెళ్ళక్కర్లేదు. కొట్టు కూడా సరిగా నడవడం లేదు. డబ్బుకు చెడ్డ ఇబ్బందిగా వుంది' అన్నాడు.

-అలా నా చదువుకు బ్రేక్ పడిపోయింది. ఇక అప్పట్నుంచీ ఇంటి దగ్గరే వుండిపోయాను.

అప్పుడప్పుడే టి.వీ.లు ప్రవేశిస్తున్నాయి. మా ఊరి సర్పంచ్ మొదటిగా టి.వీ. కొన్నాడు.

సాయంకాలమైతే ఆడవాళ్ళందరూ టి.వీ. దగ్గర గుమికూడేవాళ్ళు.

ఈ సమయంలోనే మనోహర్ అద్దెకు టి.వీ., వీసీపీ తెచ్చి సినిమాలు వేసేవాడు. సినిమాలు చూడాలనుకొనేవాళ్ళు రూపాయి ఇవ్వాలి.

ఆ రోజు వినాయకచవితి.

ఆ రాత్రి మనోహర్ రెండు చిరంజీవి సినిమాలు డెక్‌లో వేస్తున్నట్లు తెలిసింది.

సినిమా రాత్రి ఎనిమిది గంటలకు స్టార్టవుతుంది. నేను తొందరగా భోజనంచేసి సినిమావేసే మనోహర్ ఇంటికి చేరుకున్నాను.

డాబా మీదకు కరెంట్ కనెక్షన్ తీసుకుని అక్కడ వేసేవాడు. నేను మెట్లెక్కి చివరి మెట్టుమీదకు చేరుకున్నాను. అక్కడ లైట్ వున్నా మెట్ల దగ్గర చీకటిగా వుంది. డబ్బులు కలెక్టు చేసుకోవడానికి మనోహర్ పిట్టగోడమీద కూర్చు

**6** కాలేజీలో చదువుతున్న వంశీ, సుజనల పరిచయం ప్రేమగా మారుతుంది. ఇద్దరిదీ ఒకే పల్లెటూరిలోని పక్కపక్క వీధులే. ఇద్దరికీ పెద్దల అంగీకారంతో పెళ్ళవుతుంది. శోభనం ముహూర్తం దగ్గరపడిందనగా సుజనకు 'మూడురోజుల' ఇబ్బంది ఎదురౌతుంది. ఆ మూడురోజులూ వీలుకాదు కనుక మరో ముహూర్తం చూస్తాడు సుజన తండ్రి. ఆ ముహూర్తం నెలరోజుల తర్వాతగానీ వుండదు. కనుక శోభనం వాయిదా పడుతుంది.

కానీ ముహూర్తానికి ముందే తమ ఫస్ట్‌నైట్‌ని జరుపుకోవాలనే ప్రయత్నంలో వుంటుంటారు సుజన, వంశీలు. అందుకు వంశీ వేసిన ఓ పథకం విఫలమౌతుంది.

ఓ రోజు వంశీ దగ్గరికి వస్తాడు సుజన తండ్రి. తనతోపాటు వచ్చిన యస్సై శరవణన్‌ని పరిచయం చేస్తాడు. అతని రాక వంశీకి అనుమానం కలిగిస్తుంది.

ఓ రోజు కాలక్షేపం కోసం సుజన ఇంటికి వస్తుంది కైవల్య. ఆమె, శ్రీ నిజ ఫస్ట్‌నైట్ గురించి చెప్పి, తన ఫస్ట్‌నైట్ గురించి కూడా సుజనకి చెప్పడానికి సంసిద్ధమౌతుంది.



న్నాడు. అతని ఫ్రెండ్ శరత్ టి.వీ.ని సరిచేస్తున్నాడు.

నేను నిలబడి చిన్నగా దగ్గి, లోనికి వెళ్ళడానికి ఒకడుగు వేశాను. శరత్‌వైపు చూస్తున్న అతను ఎవరో పిల్లలు వచ్చి లోనికి దూరుతున్నారనుకుని వెళ్ళకుండా ఆపడానికి చేయి అడ్డంపెట్టాడు.

నేను మెట్టు ఎక్కడం కోసం ఓ అడుగువేయడం, అతను చేయి చాచడం, అతని చేయి నా ఎదకు తగిలి, ఒక్కసారిగా నా కళ్ళముందు వేనవేం దీపాలు వెలిగినట్లనిపించడం క్షణంలో జరిగిపోయాయి.

కొత్తదైన ఆ స్పర్శకు అతను ఉలిక్కిపడడం మసక వెలుతురులో కనిపెట్టాను. జీవితంలో తొలిసారిగా మగవాడి స్పర్శ–అదీ తగలరాని భాగంలో.

బాగా వర్షం కురిశాక, చెట్టుకింద నిలబడి వున్నప్పుడు ఎవరైనా కొమ్మను విదిలిస్తే, మనమీద ఒక్కసారిగా నీటిబిందువులు జలజలా రాలినప్పుడు కలిగే అనుభూతిలాంటిది నాలో.

అతనూ అదే స్థితిలో వున్నాడు.

హైస్కూల్లో నాకంటే మూడేళ్ళు సీనియర్. టెన్త్ క్లాస్ ఫెయిలయ్యాడు. మరో రెండుసార్లు రాశాడుగానీ ఫలితం మాత్రం మారలేదు. ఇంటి దగ్గరే వుండిపోయాడు. వ్యవసాయం చేస్తుంటాడు. టీ.వీ.లు వచ్చాక, ఇలా సినిమాలు వేస్తూ పై సంపాదన సంపాదిస్తున్నాడు. ఇరవై రెండేళ్ళు వుంటాయనుకుంటాను.

'నువ్వా?' కాసేపటికి తేరుకున్నాక అన్నాడు.

నేనేమీ మాట్లాడకుండా చేతిలో రూపాయిబిళ్ళ వుంచి లోనికెళ్ళాను.

నా వెనకే జనం రావడం ప్రారంభించారు. చూస్తూ వుండగానే డాబా నిండిపోయింది. 'హౌస్‌ఫుల్ బోర్డు పెట్టేయ్' ఎవరో జనంలోంచి జోక్ చేశారు. సినిమా మొదలైంది. నా మనసు మాత్రం సినిమా మీద నిలబడడంలేదు. మాటి మాటికీ పైట సర్దుకుంటూనే వున్నాను. నేను మొదట వెళ్ళడంవల్ల చివరన పిట్టగోడకు దగ్గరగా కూర్చున్నాను. కలెక్షన్ అంతా చూసుకుని మనోహర్ వచ్చి నా వెనక నిలుచున్నాడు. టి.వీ. కాంతి తప్ప మరో వెలుగు లేదు. తలతిప్పి అతనివైపు చూడాలన్న మనసును అదుపులో వుంచడం కష్టమై పోతోంది. కానీ తమాయించుకున్నాను.

సినిమా అయిపోయింది.

కేసెట్ మార్చి మరోటి పెట్టడానికి మనోహర్ ముందుకు వెళ్ళాడు.

అతన్ని చూస్తూ అక్కడి నుంచి రావడం సాధ్యం కాదనిపించి, ఇదే తగిన సమయమనిపించి లేచి వచ్చేశాను. ఇంటికొచ్చి పడుకున్నాను.

మొదటిసారిగా నిద్ర రావడంలేదు. ఏవేవో ఆలోచనలు, ఊహలు, భయాలు–రేడియోలో పలుస్టేషన్లు ఒక్కసారిగా వస్తున్నట్లు అన్నీ కలగాపులగంగా కలిసిపోయాయి. పద్దెనిమిదేళ్ళ పరువం శరీరపు ఉనికిని తొలిసారిగా తెలియజేస్తోంది.

ఎప్పుడో కోడి కూస్తున్నప్పుడు నిద్రపోయాను.

ఇక అప్పట్నుంచి వీధిలోకి వస్తే మనోహర్ కోసం నా కళ్ళు గాలించేవి. ఎప్పుడైనా అతను ఎదురుపడ్డప్పుడు కాళ్ళు వణికేవి. కళ్ళు సిగ్గు బరువుకి కిందకు వాలిపోయేవి. శరీరమంతా బరువుగా తోచేది. రక్తప్రసరణంతా తెలిసేది.

మరో వారం రోజులకే మనోహర్ డెక్‌తెచ్చి, సినిమా వేశాడు. నేను ఏడుగంటలకంతా రడీ అయి

పోయి ఆ రోజులాగానే మొదటగా వెళ్ళాను. చివరి మెట్టు దగ్గరకు చేరుకుని ఒకడుగు వేయబోయేం తలో అచ్చం ఆ రోజులాగానే ఎటో చూస్తున్న అతను చేయి చాచడం, అది నా ఎదకు తాకడం జరిగిపోయింది.

ఇదంతా నటనే అని నాకు తెలుసు. కానీ నేనూ దాన్ని గుర్తించనట్టు రూపాయి చేతిలో పెట్టి లోపలి కెళ్ళాను. అంతక్రితం నెలకోమారు సినిమా వేసే అతను అప్పటినుంచీ వారానికి ఓ సినిమా వేస్తున్నాడు. కేవలం నేను వచ్చి, అలా నిలబడితే చేయి చాచడం కోసమే అతను అంత తొందరగా సినిమాలు వేస్తున్నాడని నాకు తెలుసు. అందుకే నేనూ సినిమా వేసిన ప్రతిసారీ అతన్ని నిరుత్సాహపరచడంలేదు.

కలెక్షన్ డల్‌గా వున్నా సినిమాలు వేస్తూనే వున్నాడు. ప్రతి వారం వంద రూపాయల నష్టం వస్తోంది. ఇలా అయితే బాగా లాస్ అవుతాడనిపించింది.

ఆ రోజు యథాప్రకారం సినిమాకెళ్ళిన నేను 'ఇక సినిమాలు ఇలా వారం వారం వేయకు. ముందులా నెలకోసారి వేయి. ఈ మధ్యలో మనం ఎలానో కలుసుకోవచ్చులే' అన్నాను.

నేను అలా మాట్లాడేసరికి షాక్ తిన్నాడు. లోనుంచి తన్నుకొస్తున్న ఆనందం అతని ముఖాన్ని సాగదీసింది. అలా చెప్పానుకానీ అతన్ని ఎలా కలుసుకోవాలో తెలిసింది కాదు. మా నాన్న చాలా స్ట్రిక్టుమనిషి. అందుకే నన్ను టెన్త్ క్లాస్‌తో ఆపించేశాడు.

నేను కనపడకపోయేసరికి అతను గింజుకుపోయాడు. ఓ రోజు సుగుణను రాయబారం పంపించాడు. ఆమె అవీ ఇవీ మాట్లాడాక 'ఏమిటి సంగతి? ఆ మనోహర్ నువ్వు కనపడడంలేదని చాలా ఇదైపోతున్నాడు' అంది.

ఆమె ఇలా రాయబారాలు మోస్తుందని తెలుసు. అందుకే ఆమె చెడ్డదని అంతకుముందు వరకు అనుకునేదాన్ని. కానీ ఇప్పుడు రాయబారం తెచ్చింది నాకు గనుక ఇతరుల కష్టాన్ని తీర్చడానికి కంకణం కట్టుకున్న మంచిదానిలా అనిపించింది. మంచికీ, చెడ్డకీ తేడా అదేననుకుంటా.



## దానాలొద్దు!

"నేను సంపాయించే ప్రతి పైసా నాకే చెందాలి. మొదట నా ఇంట్లో తగినంత డబ్బు చేరింతర్వాతే పరాయివాడి గురించి ఆలోచిస్తాను. 'ఇంట గెలిచి రచ్చగెలవడం' అనే సిద్ధాంతంపై నాకు నమ్మకం ఎక్కువ. ఇవాళ చేసిన పుణ్యం రేపటికి ఉపయోగపడుతుంది అనే విషయంపై నాకసలు నమ్మకంలేదు.

ముఖ్యంగా బిచ్చగాళ్ళకు దానం చేయవద్దు. ఎందుకంటే దేశంలో దొంగస్వాములు అధికమౌతున్నారు" అంటూ తన అభిమానులకు హితవు చెప్పున్నాడు కమల్‌హాసన్. ఇంతకీ ఈ నటుడికి బిచ్చగాళ్లపై అంత కోపం ఎందుకో?!

'ఏం చేయను? మా నాన్న-ఆయనికి తెలియకుండా ఎలా కలుసుకోవడం?'

'అయితే ఓ పని చెయ్. రేపు మధ్యాహ్నం మా ఇంటికి రా. ఆ సమయానికి మనోహర్‌ని రమ్మంటాను. ఎవరికీ డౌట్ రాదు'

'అలానే'

సుగుణ వెళ్ళిపోయింది.

నెక్స్ట్‌డే మధ్యాహ్నం అమ్మావాళ్ళు అలా బడలికతో నడుం వాల్చాక నేను సుగుణ ఇంటికి బయల్దేరాను. రహస్యంగా చేసే పనుల్లో వుండే ఆనందం అనుభవించడం ప్రారంభించాక ఇక ఆగవు.

కొత్త కొత్త పద్ధతుల్ని మనమే అన్వేషించుకుంటాం. లేకుంటే నేను అలా దొంగతనంగా సుగుణ దగ్గరికి వెళ్ళడం ఊహించలేని విషయం.

ఆ ఇంటిని చేరుకున్నాను.

అది చిన్న గుడిసె. లోపలంతా మసక వెలుతురు. మధ్యాహ్నమే ఆపాటి వెలుగుంటే ఇక సాయంకాలాలు, రాత్రులు చీకటిగుహలా వుంటుందేమో.

అదురుతున్న పాదాలతో లోపల అడుగుపెట్టాను. నన్ను చూడగానే ఏదో మాట్లాడుతున్న సుగుణ ఆగింది. మరో వ్యక్తి మనోహర్ అని గుర్తించాను.

'రారా! నీకోసం పాపం మనోహర్ చాలా ఇదైపోతున్నాడు' అంది సుగుణ.

అందుకే కాబోలు ఇలాంటి విషయాలకు మధ్యవర్తి వుండాలనేది. ఈ అవసరాన్ని గుర్తించే కాబోలు మేఘాలతోనూ, చిలుకలతోనూ పూర్వం రాయబారాలు పంపారు.

నేను ఇంటిమధ్యలోనున్న గుంజను పట్టుకుని నిలబడ్డాను.

మనోహర్ లేచి నిలుచున్నాడు. ఏం మాట్లాడాలో తోచనట్లు మౌనంగా వుండిపోయాడు.

'మీమధ్య నేనెందుకులెండి. అలా వెళ్ళొస్తాను' అని సుగుణ తలుపు వేసింది. గొళ్ళెం పెట్టిన చప్పుడు వినిపించింది.

అంటే బయటివాళ్ళకు ఇంట్లో ఎవరూ లేరనిపిస్తుంది. ఇలాంటి విషయాలు ఇలా జరుగుతాయని నాకప్పటివరకూ తెలియదు.

ఏం ఆశించి సుగుణ ఇంత సహాయం చేస్తూ వుంటుంది? మా ఇద్దరి దగ్గరా ఏమైనా లాభం పొందడానికి వుండచ్చు. ఏదో రహస్యంలో మనం పాలుపంచుకున్నామన్న థ్రిల్లింగ్ కావచ్చు. ఎదుటివాళ్ళు చెడిపోవాలన్న దుర్గకావచ్చు. లేదూ ఆ మాత్రం సహాయపడడం మానవధర్మంగా ఫీలవ్వచ్చు. అందులో వెనుకనున్న ఉద్దేశ్యం ఏమిటా అని ఆలోచిస్తున్న నేను మనోహర్ మరింత దగ్గరగా రావడం గుర్తించలేదు.

'కనిపించవ్-మాట్లాడవు-నేనెంత బాధపడిపోతున్నానో తెలుసా?'

తల పైకెత్తలేకపోతున్నాను. చీకటింట్లో అలా కలుసుకోవడం కొత్త. ఒళ్ళంతా ఏదురులోంది.

నేను ఏమీ మాట్లాడలేకపోయేసరికి నా చుబుకాన్ని పట్టుకుని పైకి లేపాడు.

'మా నాన్నకు తెలిసిందంటే పెద్ద గొడవైపోతుంది. అందుకే భయం'

'మనం పెళ్ళిచేసేసుకుందాం' ఠక్కున అన్నాడు.

ఆ చీకటింట్లో మరింత చీకటై పోయినట్లు భయపడిపోయాను. కులం-అమ్మానాన్న-ఊరు-వీటన్నిటినీ ఎదిరించి పెళ్ళి చేసుకోవడం సాధ్యమా? మా పెళ్ళి జరుగుతుందన్న ఆశ ఏ కోశానా లేదు. అసలు ఆ ఊహే భయం గొలుపుతోంది.

'ఏం మాట్లాడవు?'

'పెళ్ళా! అది జరిగే పనా?'

'ఎందుకు జరగదు! దూరంగా వెళ్ళిపోయి పెళ్ళి చేసుకుందాం'

'చూద్దాం. ముందు ఇక్కడినుంచి వెళ్ళాలి'

## ఆల్మండ్ చికెన్



**కావలసినవి :** కోడి 1, గసగసాలు 2 టేబుల్ స్పూన్స్, ఎండుమిర్చి 5, ఎండుకొబ్బరి సావుచెక్క, బాదంపప్పు ముక్కలు 20, పాలు 6 టేబుల్ స్పూన్స్, నూనె 4 టేబుల్ స్పూన్స్, అల్లం రసం 1 టేబుల్ స్పూన్, ఉప్పు తగినంత, పాలు 3 కప్పులు, గరం మసాలా 1 స్పూన్, శాఫ్రాన్ అర స్పూన్.

**చేసే విధానం :** గసగసాలు, ఎండుమిర్చి, కొబ్బరి, బాదంపప్పు, 4 స్పూన్స్ పాలు కలిపి మెత్తగా నూరాలి. కోడి పెద్ద ముక్కలు చేసి శుభ్రంగా కడగాలి. పాత్రలో నూనె వేడిచేసి నూరిన ముద్దవేసి 2 నిముషాలు వేయించి చికెన్‌ముక్కలు కలిపి తక్కువ మంటమీద 8 నిముషాలు వేయించాలి. అల్లంరసం, ఉప్పు, పాలు కలిపి మెత్తగా ఉడికించాలి.

శాఫ్రాన్ కలర్, మసాలా పొడి, 2 స్పూన్ల పాలలో కలిపి పేస్ట్‌చేసి కూరలో కలపాలి. నూనె పైకి తేలేవరకూ ఉడికించి దించాలి. ఇది చపాతీలకు బావుంటుంది.

-సి. పద్మావతి

పెళ్ళి ప్రస్తావన రాకుండా వుంటే మరికొంతసేపు వుండేదాన్నేమో. ఇక అక్కడ వుండడం ఇంపాజిబుల్ అనిపించింది. అందుకే తొందరపడిపోతున్నాను.

నా కంగారుని పసిగట్టినట్టున్నాడు 'సరే! ఎల్లుండి మధ్యాహ్నం ఇక్కడికే రా' అన్నాడు.

నా మొర దేవుడు ఆలకించినట్లున్నాడు సుగుణ వచ్చి తలుపు తీసింది.

నేను వెళ్ళాలనుకునేసరికి ఖచ్చితంగా ఆమె వచ్చి తలుపుతీయడం దేవుడి పనేకాక మరేమిటి?

ఆ ఇంటినుంచి ఎలా బయటపడ్డానో, మా ఇంటికి ఎలా చేరుకున్నానో తెలియదు. ఒళ్ళంతా చెమటతో తడిసి ముద్దయిపోయింది.

వారం తరువాత అనుకుంటాను మరోసారి సుగుణ వాళ్ళింట్లో కలుసుకున్నాం. ముందున్న బెంకు కాస్త వదిలింది. అందుకే సుగుణ బయటగొళ్ళెం పెట్టగానే చాపమీద కూర్చున్నాను.

మనోహర్ నా చేతులు రెండూ పట్టుకుని మాట్లాడడం ప్రారంభించాడు. అప్పుడే కాదు ఎప్పుడు ఏమేమి మాట్లాడుకున్నామో నాకిప్పటికీ గుర్తే. అయితే ఆ మాటలేమిటో ఇప్పుడు చెప్పమంటే చెప్పలేను. ఏవేవో స్వీట్ నాన్సెన్స్ అంతా దొర్లేది.

'నిన్న సాయంకాలం మీ ఇంటివైపు వచ్చానా నువ్వు కనిపించలేదు. రాత్రంతా నిద్రలేదనుకో'

'అద్దంలో చూసుకుంటూ తిలకంబొట్టు పెట్టుకుంటుంటే వెనక నువ్వుచేరి చూస్తున్నట్టే వుంటుంది' ఇలాంటి మాటలు. ఒకదానికొకటి సంబంధం లేని మాటలు. అయితే వీటినన్నిటినీ ఒకదానికొకటి కలిపేది- ప్రేమ. అందుకే అవంత మధురం.

ఆ రోజు వచ్చేటప్పుడు మనోహర్ నన్ను గట్టిగా కౌగిలించుకుని ముద్దు పెట్టుకున్నాడు. అప్పుడు నేనేమైపోయానో నాకే తెలియదు. ఆ చిన్న గుడిసెకు తక్కున రెక్కలు మొలిచి ఇంద్రలోకాలకు ఎగురుతున్నట్లే అనిపించింది.

ఆ బిగి కౌగిలిలో ఊపిరాడక కొట్టుకుపోయిన నేను వీధిలోపడ్డాక గుండెల్నిండా ఊపిరి పీల్చుకున్నాను. ఎదురుగ్గా వస్తున్న ఎద్దుల మెడలోని గంటల శబ్దం జలతరంగిణిలా వినిపించిందంటే నేను ఎంత అద్భుతమైన థ్రిల్లింగ్ లో వున్నానో ఊహించు.

ఇంటికి వచ్చాక కూడా ఆ ముద్దు స్పర్శ నన్ను వదల్లేదు. ఆ సమయంలో నేను గనుక దుకాణంలో వుండుంటే బహుశా పది రూపాయలకి సామానంతా ఇచ్చేసుండేదాన్ని. వెన్నెల రాత్రి మన వెనక మన నీడ వచ్చినట్లే ఏం చేస్తున్నా ఆ ముద్దుతాలూకు పులకరింత నన్ను ఓ రకమైన గగుర్పాటుకు గురి చేసేది. ఆ రాత్రి నేనేం తిన్నానో అన్నది ఎప్పటికీ గుర్తులేని విషయం.

సుగుణావాళ్ళింట్లో కలుసుకోవడంకూడా ఎక్కువ కాలం సాగలేదు. మూడోసారి నేను బయల్దేరపోతుంటే అమ్మ అడ్డుకుంది.

'దానింటి దగ్గర నీకేం పని? అదంత మంచిది కాదు. ఇంకెప్పుడైనా పోయావంటే ఊరుకోను'

ఆలా అక్కడికెళ్ళడం బంద్ అయిపోయింది. ఇక ఎలా కలుసుకోవాలో తెలిసింది కాదు. రెండు మూడు నెలలు కేవలం చూపులతోనే గడిచిపోయాయి.

పండగనెల వచ్చింది. గొబ్బెమ్మలు ప్రారంభమయ్యాయి. నేనూ ఓ గ్రూప్‌లో చేరిపోయాను.

### ఇంటి సెంటిమెంట్

తారలకు ఇంటి సెంటిమెంట్‌కూడా వుంటుంది. ఈ ఇల్లు మాకు 'అచ్చిరాలేదు', 'ఈ ఇల్లు అచ్చొచ్చింది' అని చెప్తుంటారు. నటి గౌతమి కూడా ఎంతో కాలంగా తను కాపురముంటున్న ఇంటిని ఖాళీచేసి కొత్త ఇంట్లోకి మారిపోయింది. కారణం- పాత ఇల్లు సరిగా కలసి రాలేదట. కొత్త ఇంట్లోకి చేరిన వేళావిశేషం- గౌతమి ప్రొడ్యూసర్‌గా మారింది. కొత్త ఇల్లు మహిమవల్ల ఆ సినిమా కూడా సూపర్ డూపర్‌హిట్ అయితే గౌతమి మరో ఇల్లు వెతుక్కునే అవసరం వుండదు మరి.



## తారల కళాపోషణ

డింపుల్ కపాడియాకి తీరికవేళల్లో కాలక్షేపం సన్నీడియోల్‌తో షికార్లు చేయడం ఒక్కటే కాదు. పెయింటింగ్ ఆమె హాబీ. డింపుల్ ఆర్టు నేర్చుకోవడమేకాక, తన ప్రతిభను కాన్వాస్‌పై పెట్టి, ఆ పెయింటింగుల్ని స్వగృహంలో అలంకరించింది.

పెయింటింగ్‌లో ప్రవేశమున్న మరో నటీమణి హేమమాలిని. ఆమెలా ఆ పెయింటింగులూ అందంగానే వుంటాయి. హేమమాలిని ఇంటి గోడలన్నిటిపైనా ఆమె వేసిన పెయింటింగులే వుంటాయి.



సాయంకాలం ఏడు గంటలకు గొబ్బెమ్మను ఎత్తుకుని ఇంటింటి దగ్గరా గొబ్బిలు తట్టి తొమ్మిది గంటల ప్రాంతాన ఇంటికి చేరుకునేవాళ్ళం.

గొబ్బిలు ప్రారంభమైన రెండోరోజు బావి దగ్గర సుగుణ కనిపించింది.

'ఆ మనోహర్‌కి ఏం మంత్రం వేశావో ఏమోగానీ నీ కోసం కలవరించి చచ్చిపోతున్నాడనుకో' అంది.

తక్షణ నాకో ఐడియా తట్టింది.

'రాత్రికి ఎనిమిది గంటలకు మన ఊరి బయటున్న శివాలయానికి రమ్మను. నే వస్తాను' అని చెప్పి, బిందె ఎత్తుకుని వచ్చేశాను.

ఆ రాత్రి గొబ్బిళ్ళు ప్రారంభమయ్యాయి. మూడిళ్ళ వరకు నేనూ గొబ్బిలు తడుతూ పాటలు పాడుతున్నాను. మూడో ఇల్లు దాటగానే తలనొప్పిగా వుందనీ, ఇంటికెళతాననీ మిత్రురాళ్ళతో చెప్పి, బయటపడ్డాను. వీళ్ళేమో ఇంటికెళ్ళానని అనుకుంటారు. అమ్మావాళ్ళేమో గొబ్బి తడుతున్నాననుకుంటారు. కాబట్టి ఈ మధ్యకాలంలో నేనెక్కడికి వెళ్ళానో ఎవరికీ తెలీదు. అదీ నా ప్లాన్.

మిత్రురాళ్ళను వదిలి, సందులోంచి మలుపు తిరిగి చీకట్లో కలిసిపోయి శివాలయం దగ్గర చేరాను. అది శిథిలాలయం. ఎవరూ వుండరక్కడ. ఊరికి కూడా చాలా దగ్గరే. అది మేం కలుసుకోవడానికి మంచి ప్లేసనుకున్నాను.

నేను వెళ్ళేసరికి మనోహర్ రెడీగా వున్నాడు. నన్ను చూడగానే ఒక్కసారిగా బరస్ట్ అయిపోయాడు కాబోలు నన్ను పట్టుకుని ముద్దుల్లో ముంచెత్తాడు.

అలానే వరండాలో కూర్చున్నాం. అతని చేతులు ఎక్కడెక్కడో కదులుతున్నాయి. అన్నీ టైట్‌గా వున్నాయి. జాకెట్ దగ్గర్నుంచి, పావడా ముడివరకు ఏదీ ఊడిరావడంలేదు.

అతని ప్రయత్నమంతా ఎందుకో తెలుస్తోంది. తన విరహాన్నీ, వియోగాన్నీ అంతటినీ నన్ను పొందడంలో తీర్చుకోవాలనుకుంటున్నాడు కాబోలు నాకు ఊపిరాడకుండా చేస్తున్నాడు.

ఏదో మత్తు నన్ను లొంగదీసుకుంటోంది. మరేదో కావాలన్న ఆరాటాన్ని తెలియజెప్పడాని కన్నట్లు రక్తం పరుగులు పెడుతోంది. కానీ చిన్నప్పట్నుంచీ విన్న నీతిసూత్రాలు, నంఘం చేతిలో బెత్తం పెట్టుకుని చెప్పిన జాగ్రత్తలు, అమ్మానాన్నలు బోధించిన నైతిక విలువలు నన్ను తట్టి మరీ లేపాయి.

నేను సుతారంగా అతన్ని విడిపించుకున్నాను.

మధురమైన ఆ అనుభవం పొందకుండా నేను చాలా పవిత్రంగా బయటపడ్డానని అప్పుడు గర్వంగా ఫీలయ్యినా, నా పెళ్ళయ్యాక మాత్రం అదెంత పొరబాటో నాకు తెలిసింది.

పెళ్ళివరకు రావాలంటే ప్రేయసీప్రియుల మధ్య ఈ అనుభవం తప్పక వుండాలంటాను. సంఘాన్ని ఎదిరించి పెళ్ళిచేసుకోవాలంటే ఇద్దరిమధ్యా బలమైన ఆకర్షణ వుండాలి. సెక్స్‌కంటే గొప్ప ఆకర్షణ మరొకటి లేదనుకుంటాను. అందులోనూ స్త్రీ- ఈ అనుభవం లేకపోతే ఎంత గొప్పగా ప్రేమించనీ, చివరికి అతన్ని చాలా సులభంగా వదిలిపెట్టగలదు.

ఆ అనుభవం లేకుంటే తామిద్దరూ ఎన్నిసార్లు సినిమాలకు వెళ్ళుండనీ, ఎన్నోసార్లు కలిసి హోటళ్ళకు తిరగనీ దేన్నీ లెక్క పెట్టదు. ఆ ఐదు నిముషాల అనుభవం ఏర్పడితే మాత్రం ఆ మగవాడ్ని స్త్రీ అంత నిర్లక్ష్యంగా వదిలిపెట్టదు.

ఇదంతా నా పైత్యం అనుకోవద్దు. పెళ్ళయిన చాలా మంది ప్రేయసీప్రియులకు పెళ్ళయ్యాక జరగాల్సిన శోభనం పెళ్ళికిముందే జరిగిపోయి వుంటుంది. అది కాకుంటే ఏ జంటా పెళ్ళివరకు రాదు.

చాలా ఇబ్బందిగా నన్ను వదిలిపెట్టాడు మనోహర్. ఆ సమయంలో స్త్రీని ఊరకనే వదిలిపెట్టడం వీలయ్యేది కాదు. కానీ మనోహర్ మెత్తటి స్వభావం కలవాడు.

నేను విముఖత చూపించగానే వెనక్కితగ్గాడు.

ఆ తరువాత గొబ్బెమ్మలు వున్న రోజులంతా మేమిద్దరం శివాలయం దగ్గర కలుసుకునేవాళ్లం. రెండు ముద్దులు, మూడుకౌగిలింతలు, నాలుగు గాఢమైన నిట్టూర్పులు తప్ప మరోదానికి నేను ససేమిరా ఒప్పుకోలేదు.

పండగనెల అయిపోగానే నాకు ఓ పెళ్ళి సంబంధం వచ్చింది. నాకు తప్ప అందరికీ ఆ సంబంధం నచ్చింది. మా నాన్నకయితే మరీ నచ్చింది. వరకట్నం అడక్కుండా పైపెచ్చు కన్యాశుల్కం ఇస్తానంటే పేకాటలో అప్పటికే బాగా లాస్ అయిపోయిన తండ్రికి నచ్చకుండా ఎలా వుండగలదు?

పెళ్ళిఖర్చంతా తానే భరించి, ఓ ఇరవైవేల రూపాయలు ఎదురిస్తానన్నాడు పెళ్ళికొడుకు. పెళ్ళిచూపులకి అతనొక్కడే వచ్చాడు. ఆ రాత్రి ఇదంతా చెప్పి పెళ్ళికొడుకు వెళ్ళిపోయాడు.

నన్ను పిలిచి నా ఇష్టం ఏమిటో అడిగింది అమ్మ.

'నాకు ఒద్దంటే వద్దు. పెళ్లాం చచ్చి ఓ బిడ్డ తండ్రి అయి నలభై అయిదేళ్ళ వయసులో తగుదునమ్మా అంటూ పెళ్ళికి తయారైన ఆ డొక్కును చేసుకోనుగాక చేసుకోను. ఇంకొక్కమాట- మనోహర్‌ని అదే చిననాయుడి కొడుకుని పెళ్లి చేసుకుంటాను. మన కులంగాదనీ మీరు అడ్డుచెప్పినా వినసుగాక వినను'

పెంపుడుమేకకి పలుపుతాడు వేసి లాక్కొస్తున్నప్పుడు, అది రాకుండా మొరాయిస్తే అదిలించడానికి వెనక్కి తిరిగిచూస్తే, పెద్దపులిలా కనిపించినప్పుడు ఎలా అయిపోతామో అలా అయిపోయింది అమ్మ. తాడును వదిలి పరుగెత్తినట్లు నాన్న దగ్గరికి పరిగెత్తింది. ఆ రాత్రంతా వాళ్ళిద్దరూ గట్టిగా మాట్లాడుకుంటే ఒట్టు. తెల్లవారేవరకు అలా గుసగుసలాడుకుంటూనే వున్నారు.

(ఇంకావుంది)

# ఈఎంసెట్ '94లో ప్రవేశపెట్టిన మార్పులు సబబా?

ఈమధ్యనే ఈఎంసెట్ '94 కన్వీనరు ఈ ఏడాది జరిగే ప్రవేశపరీక్షలో కొన్ని మార్పులను పత్రికాముఖంగా తెలియజేశారు. విద్యారంగంలో గొప్ప అనుభవమూ, దాని గురించి క్షుణ్ణమైన అవగాహనా వున్న కొందరు విద్యావేత్తలకి అవి సబబైనవి కావనే అభిప్రాయం కలిగింది. కీలకమైన వైద్య, ఇంజనీరింగ్ రంగాల్లో అనర్హులు అడ్డదార్లలో సీట్లు సంపాదించే పద్ధతిని నిరోధించి, ప్రతిభకే పట్టం కట్టేందుకు ప్రారంభించిన ఈ ఎంసెట్ విధానానికి, ఆ మార్పులవల్ల మొదటికే మోసం రాగలదని ఆ మేధావుల భావన.

వారి ఆలోచనల పరమార్థాన్ని ఓ హెచ్చరికగా తీసుకుని ప్రభుత్వం వెంటనే పునరాలోచించాల్సిన అవసరముంది. వారి సలహాలను తక్షణమే పరిశీలించడం ఎంతైనా అవశ్యకం.

కొందరు మేధావులైన : 1. శ్రీ కె. కోటేశ్వరరావు, మాజీ ఛైర్మన్, ఎమ్సెట్-83; మాజీ ప్రిన్సిపాల్, రీజినల్ ఇంజనీరింగ్ కాలేజి, వరంగల్, 2. ప్రొ॥ టి. వేణుగోపాలరావు, మాజీ ప్రిన్సిపాల్, ఎ.యు. ఇంజనీరింగ్ కాలేజి, వాల్తేరు, 3. శ్రీ ఎస్.ఆర్. పరిమి, ప్రిన్సిపాల్, బాపట్ల ఇంజనీరింగ్ కాలేజి, బాపట్ల, 4. శ్రీ ఆర్.పి. రంగనాథరావు, కన్వీనరు, ఈఎంసెట్-87, ప్రిన్సిపాల్, గాంధి ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ అండ్ మేనేజ్‌మెంట్, వాల్తేరు, 5. శ్రీ బి. జనార్దనరెడ్డి, ప్రిన్సిపాల్, ఎస్.ఆర్.కె.ఆర్.ఇంజనీరింగ్ కాలేజి, భీమవరం, 6. ప్రొ॥ ఎం.ఎస్. రాజు, మాజీ ప్రిన్సిపాల్, ఎ.యు. ఇంజనీరింగ్ కాలేజి, వాల్తేరు. వారి అభిప్రాయాలు, సూచనలు కింది వ్యాసంలో వున్నాయి.

—ఎడిటర్



సుమారు ఒకటిన్నర దశాబ్దాలక్రితం ఇంజనీరింగ్ కోర్సులలో అడ్మిషన్ల కొరకు ఎంట్రన్స్ పరీక్షలను మన రాష్ట్రంలో ప్రవేశపెట్టారు. మొదట రెండు విశ్వవిద్యాలయాలకే పరిమితమైన ఈ ప్రవేశ పరీక్ష క్రమేపీ రాష్ట్రంలోని అన్ని విశ్వవిద్యాలయాల ఆధ్వర్యంలోని ఇంజనీరింగు కళాశాలలకూ వర్తింపజేయడం జరిగింది. ఆ తర్వాత మెడికల్, అగ్రికల్చరల్ కోర్సుల ప్రవేశానికి కూడా ఒకే సంస్థ ఆధ్వర్యంలో ఒకేసారి జరిపే ఎంట్రన్స్ పరీక్షలను రూపొందించారు. మెడికల్, ఇంజనీరింగ్ కోర్సులలో ప్రవేశం కోరుకునే దాదాపు లక్షమంది విద్యార్థులు ఈఎంసెట్ (EAMCET) పరీక్షలకు ప్రతి ఏడాదీ హాజరవుతున్నారు.

గత సంవత్సరం ప్రవేశపరీక్ష ఫలితాలు ప్రకటించిన తర్వాత, ప్రవేశపరీక్షా పద్ధతిని సమీక్ష చేయాలనే నిర్ణయం తీసుకుని ఒక కమిటీని నియమించారు. అదే సమయంలో మొత్తంగా ప్రవేశపరీక్షను రద్దుచేసే అవకాశం వుందని వార్తలు వెలువడ్డాయి. కొద్దినెలల తర్వాత ఈ ఎంసెట్ పరీక్ష ఎటువంటి మార్పులు లేకుండా, యథావిధిగా జరుపబడుతుందని వార్తలు వచ్చాయి.

ఈమధ్యనే ఈఎంసెట్ '94 కన్వీనరు ఈ ఏడాది జరిగే ప్రవేశపరీక్షలో కొన్ని మార్పులను పత్రికాముఖంగా తెలియజేశారు. గణితం/బయాలజీ సబ్జెక్టులకు 50 ప్రశ్నలకు బదులుగా 100 ప్రశ్నలిచ్చి 100 మార్కులను కేటాయించడం; ఫిజిక్స్, కెమిస్ట్రి సబ్జెక్టులలో ఇదివరలోలాగానే చెరొక 50 మార్కులతో మొత్తం 200 మార్కులకు ప్రశ్నాపత్రం ఇవ్వడం; ఖాళీలను పూరించే ప్రశ్నలను పూర్తిగా తీసివేసి, ప్రతి ప్రశ్నకూ ఇచ్చిన నాలుగైదు సమాధానాలలో నుంచి సరైన సమాధానాన్ని ఎంపికచేసే పద్ధతిలోనే ప్రశ్నాపత్రం వుండడం (Multiple Choice Type); నాలుగేసి తప్పు సమాధానాలకు ఒక మార్కు వంతున తీసివేయడం- ఈసారి ఈఎంసెట్‌లో ప్రవేశపెట్టిన ముఖ్యమైన మార్పులు.

జూన్ 22న ఈఎంసెట్ '94 జరుగుతుందని అధికారిక ప్రకటన వెలువడిన తర్వాత మాత్రమే, ఈ పరీక్షావిధానంలో మౌలికమైన మార్పులను తెలియజేయడం ఆశ్చర్యం కలిగించింది. ఇంత మౌలికమైన మార్పులను ప్రవేశపెట్టేముందు, ఈ మార్పులు కలిగించబోయే ఫలితాల గురించి సుదీర్ఘమైన విశ్లేషణ అవసరమని ఎవరైనా అంగీకరిస్తారు.

ఇదివరలో ప్రతి 50 ప్రశ్నలకు ఒక గంటచొప్పున మూడు సబ్జెక్టులకు కలిపి మూడు గంటల వ్యవధి వుండేది. అంటే సగటున ప్రతి ప్రశ్నకీ 1-2 నిమిషాల వ్యవధి వుండేది. గణితంలో ప్రశ్నలకు ఈ సమయం చాలదనేది నిర్వివాదాంశం. అయితే విద్యార్థులకు ఫిజిక్స్, కెమిస్ట్రి ప్రశ్నలకు సగటున ఒక నిమిషం కంటేపట్టదు కనుక, ఆ మిగిలిన సమయాన్ని గణితానికి వినియోగించుకోగలిగేవారు. ఈ విధంగా విద్యార్థి గణితంలోని ప్రతి ప్రశ్నకు సగటున ఒకటిన్నర నిమిషాలకు మించి సమయం దొరికేది.

ఈ లెక్క ప్రకారం కొత్త విధానంలో, 200 ప్రశ్నలకు సమాధానాలు రాయడానికి నాలుగు గంటలకు తక్కువ కాకుండా సమయం కేటాయించాల్సింది. ఏకబిగిన నాలుగు గంటల పరీక్ష రాయడం విద్యార్థులకు ప్రయాసతో కూడినదనుకున్నట్లయితే, గణితంలో ప్రశ్నలను 50 నుంచి పెంచకుండా, వచ్చిన మార్కులను రెట్టింపుచేసి వుండవచ్చు. లేదంటే గణితం, బయాలజీ పరీక్షలు ఉదయం పూర్తిచేసి, ఫిజిక్స్, కెమిస్ట్రి పరీక్షలను సాయంత్రం నిర్వహించవచ్చు.

ఖాళీలను పూరించే ప్రశ్నలకంటే మల్టిపుల్ ఛాయిస్ ప్రశ్నలకు తక్కువ సమయం సరిపోతుందనే అపోహ కొందరిలో వుండవచ్చు. కానీ మల్టిపుల్ ఛాయిస్ ప్రశ్నల గురించి అవగాహన వున్నవారెవరైనా, అది సబబుకాదని అంగీకరిస్తారు. అంతేకాకుండా, తప్పు సమాధానాలకు మార్కులను తీసివేసే పద్ధతిలో విద్యార్థులు మరింత జాగ్రత్తగా వుండాల్సివస్తుంది కనుక, ఈ ప్రశ్నలకు సమయం ఇంకా ఎక్కువ పడ్తుంది.

వ్యవధి చాలదన్న ఇబ్బంది అందరికీ వుంటుంది కాబట్టి, పరీక్షకు కేటాయించిన వ్యవధి ఒక అరగంట గానీ, గంటగానీ తక్కువైనా అభ్యంతరం వుండవలసిన పనిలేదని కొందరు వాదించవచ్చు. కానీ అన్ని ప్రశ్నలకీ సమాధానాలు రాయడానికి ప్రయత్నించేసే వ్యవధి వున్నప్పుడే ప్రతిభ వున్న విద్యార్థులకు న్యాయం చేకూరుతుంది. లేనిపక్షంలో, వంద ప్రశ్నలలో ప్రతిభ వున్న విద్యార్థి కూడా సగటు విద్యార్థి రాయగలిగిన 50 లేక 60 ప్రశ్నలను మాత్రమే రాయగలిగే పరిస్థితి వస్తుంది. దీనివల్ల ప్రవేశపరీక్ష యొక్క ముఖ్యలక్ష్యమే దెబ్బతింటుంది. అప్లికేషన్లతో పాటు పరీక్షావిధానం గురించిన వివరాలు విద్యార్థులకు ఇప్పటికే చేరిపోయాయి కనుక, ఈ సంవత్సరానికి ఏమీ చేయలేమనుకుంటే, కనీసం 3 గంటల వ్యవధిని మరో అరగంట పొడిగించితే విద్యార్థులకు కొంతలో కొంత న్యాయం చేసినట్లవుతుంది.

ఇంటర్మీడియట్, సిబిఎస్ఇ(CBSE), ఐసిఎస్ఇ (ICSE), పరీక్షల వ్యత్యాసాల మూలంగా, ఒకే పరీక్షలో కూడా ఒక ఏడాదికీ మరో ఏడాదికీగల వ్యత్యాసాల మూలంగా, ఈ పరీక్షలలో మార్కుల ఆధారంగా అడ్మిషన్లు జరపడం సహేతుకం అనిపించుకోదూ, సమర్థనీయమూ కాదు. అందువల్లనే ఈ ఎంసెట్ పరీక్షలకు ఎంతో ప్రాధాన్యత వుంది. ప్రవేశపరీక్షా పద్ధతిలోనూ, దాని నిర్వహణలోనూ లోపాలను మనం సరిదిద్దుకోకపోవడం, అసలీ ప్రవేశపరీక్షలే అనవసరం అనే దురదృష్టకరమైన అభిప్రాయానికి దారితీస్తుంది.

సీరియల్

# రారా నా ఇంటిదాకా

-మేర్లపాక మురళి



రెండోరోజు రాత్రి నాన్న నన్ను తన గదిలోకి పిలిపించుకున్నాడు. లాలించి చెబుతున్నట్లు రెండు పెళ్ళిళ్ళలోని లాభనష్టాలను బేరీజువేసి చెప్పాడు. దాదాపు గంటదాకా నిరాఘాటంగా అన్నీ ఏకరువు పెట్టి చివరికి ఇలా అన్నాడు.

'నువు కులాన్ని మంటలో కలిపేసి, ఈ ఊర్లో, బంధువర్గంలో మమ్మల్నంతా తలదించుకుని బతకమంటావో, ఇరవైవేలు ఎదురిచ్చి, ప్రాణప్రదంగా చూసుకుంటానని అంటున్న ఆ మోతుబరి రైతుని చేసుకుని మమ్మల్ని గర్వంగా తలెత్తుకుని జీవించమంటావో చెప్పు. నీ ఇష్టం ఇక'

నేను నాన్న ముందు చెప్పలేదుగానీ అమ్మకు అతన్ని చేసుకోనని చెప్పాను. కానీ అమ్మా నాన్న చిట్టచివరికి ఆత్మహత్య చేసుకుంటామన్న బెదిరింపుకి దిగారు. తమ్ముడికి, చెల్లెళ్లకు విషమిచ్చి చంపి,తామూ చచ్చిపోతామని భీష్మించుక్కూర్చున్నారు.

ఇక నేను మెత్తపడకతప్పలేదు.

ఎప్పుడైతే నేను మెత్తపడ్డానని కనిపెట్టాడో వెంటనే నాకు తెలియకుండానే పెళ్ళి నిశ్చయ తాంబూలాలు పుచ్చుకుని, పెళ్ళి ముహూర్తాన్ని నిర్ణయించుకుని వచ్చాడు నాన్న. ఇరవైవేల మహత్యం మరి.

టౌన్లోని ఓ చిన్న సత్రంలో జరిగిపోయింది మా పెళ్ళి. అతి తక్కువమంది బంధువులు వచ్చారు. ఆహ్వానపత్రికంటే తక్కువమందికి ఇచ్చారు. ఈ పెళ్ళివల్ల కలిగే గిల్టీనెస్‌ని అలా బయటపెట్టుకున్నారు నాన్న, పెళ్ళికొడుకు.

పెళ్ళిపీటలమీద అతని పక్కన కూర్చోవడంతోనే అసహ్యం బయల్దేరింది నాలో. ఏదో బీభత్సదృశ్యాన్ని చూస్తున్నానన్న ఫీలింగ్. బట్టతలతో, రఫ్‌గా వుండే ముఖంతో, మెలితిరిగిన మీసాలతో చిన్న చిన్న పురుగులతో చేసినట్టున్న అతన్ని చూస్తుంటే కంబటి బూచీలు నన్ను చుట్టుకున్నట్లు భావించాను.

ముఖం దించుకుని కూర్చున్న నేను పెళ్ళితతంగం ముగిసేవరకు తలపైకెత్తలేదు. మంగళసూత్రధారణ జరుగుతున్న సమయంలో మానసికంగా చచ్చిపోయాను. జీవచ్ఛవం అంటే ఏమిటో ఆ క్షణంలో నాకర్థం తెలిసింది.

పెళ్ళిలో కాళ్ళు తొక్కోవడాలూ, ఉంగరం తీయడం కోసం పోటీపడడాలూ, గిల్లుకోవడాలూ, గిచ్చుకోవడాలూ ఏమీ లేవు. అది పెళ్ళిలా కాకుండా శ్రాద్ధ ఖర్మలా అనిపించింది.

పెళ్ళి అయిపోయాక మా ఊరికెళ్ళాం. మా ఊరి ముందున్న చెరువు నన్ను రమ్మన్నట్టే వుంది. విశాలంగా చిన్న చిన్న అలలతో ఊగుతున్న చెరువును చూడగానే చచ్చిపోవాలన్న బలమైన కోరిక కలిగింది. జీవించాలని రెట్టింపు ఉత్సాహం కలగాల్సిందిపోయి ఆత్మహత్య చేసుకోవాలన్న బుద్ధిపుట్టడం నా తప్పు కాదు. మా నాన్న చేసిన తప్పు.

ఇంటికెళ్ళాం. కొత్తపెళ్ళికొడుకుని చూడడానికి ఊళ్ళోని అమ్మలక్కలు గుంపులు గుంపులుగా రావడం మొదలుపెట్టారు. వాళ్ళు నావైపు జాలిగా, సానుభూతితో చూస్తుండడం తలపైకెత్తకుండానే కనిపెట్టగలుగుతున్నాను.

రాత్రయింది. హడావుడి కాని హడావుడి. స్నానం చేసి తెల్లచీర కట్టుకోమన్నారు. తెల్లటి జాకెట్టు తొడుక్కోమన్నారు.

మౌనంగా అన్నీ అలంకరించుకున్నాను. పిలుపొచ్చేవరకు ఆగమన్నారు. వెళ్ళి ఇంటివెనుకనున్న గచ్చుమీద కూర్చున్నాను.

ఆకాశంలో చందమామ ఉత్త మైనపుముద్దలా వుంది. వెన్నెల ఇసుకతుపాను సమయంలో లేస్తున్న దుమ్ములా వుంది. గాలి చల్లగా కాకుండా వేడిగా తగులుతోంది. ఊరంతా మాటుమణిగింది. మరికాసేపట్లో ఏదో ఉపద్రవాన్ని ఊహిస్తున్నట్టు ఊరకుక్క ఆదేపనిగా అరుస్తోంది.

పదిగంటల సమయంలో అనుకుంటాను మా అమ్మ వచ్చి నా చేతిలో పాలగ్లాసు పెట్టింది.

7 కాలేజీలో చదువుతున్న వంశీ, సుజనల పరిచయం ప్రేమగా మారుతుంది. ఇద్దరిదీ ఒకే పల్లెటూరిలోని పక్కపక్క వీధులే. పెద్దల అంగీకారంతో ఇద్దరికీ పెళ్ళవుతుంది. శోభనం ముహూర్తం దగ్గరపడిందనగా సుజనకు 'మూడురోజుల' ఇబ్బంది ఎదురౌతుంది. ఆ మూడురోజులూ వీలుకాదు కనుక మరో ముహూర్తం చూస్తాడు సుజన తండ్రి. ఆ ముహూర్తం నెలరోజుల తర్వాతగానీ వుండదు. కనుక అప్పటిదాకా శోభనం వాయిదా పడుతుంది. కానీ ముహూర్తానికి ముందే తమ ఫస్ట్‌నైట్‌ని జరుపుకోవాలనే ప్రయత్నంలో వుంటుంటారు సుజన, వంశీలు.

ఓ రోజు కాలక్షేపం కోసం సుజన ఇంటికి వస్తుంది కైవల్య. సుజన అభ్యర్థనమేరకు తన ఫస్ట్‌నైట్ వెనుకవున్న పైనం ఆమెకి వివరిస్తుంటుంది. టీ.వీ. సినిమా చూడడానికి ప్రెసిడెంటుగారింటికి వెళ్తుంది కైవల్య. అక్కడ టీ.వీ.సినిమాలు వేస్తున్న మనోహర్‌తో తన పరిచయం ప్రేమగా మారుతుంది కైవల్యకి.

ఇదిలా వుండగా ఎదురుకట్నం ఇచ్చి, పెళ్లిఖర్చులు కూడా తానే భరిస్తానంటూ కైవల్యని చేసుకోవడానికి ముందుకొస్తాడు ఇద్దరు పిల్లలున్న నలభై ఏళ్ల పెళ్లికొడుకు. ఆమె అందుకు ఇష్టపడదు.

'వెళ్ళు'

నిశ్శబ్దంగా అడుగులు వేశాను. వంటగదిలో అన్నీ ఓ మూలకు సర్ది పడకవేశారు.

మా ఇంట్లో వున్నవి రెండే గదులు. ముందుగదిలో దుకాణం వుంది. దాని వెనక పెద్ద వంటగది. ఆ గదిలోనే ఇప్పుడు పడక వేశారు. నవారు మంచంమీద పరుపువేసి, దానిమీద దుప్పటి పరిచారు. పక్కన ఓ స్టూల్‌వేసి, పెళ్లిలో మిగిలిపోయిన బాదుషాలు కాబోలు నాలుగో అయిదో వుంచారు. మిక్చర్ అయిపోయి నట్లుంది. కారం ఏమీలేదు.

పాలగ్లాసుతో తలుపుదాటి నిలుచున్నాను. సిగరెట్ తాగుతున్న ఆయన పొగలోంచి నన్నుచూసి 'తలుపు వేసేసి ఇటురా' అన్నాడు.

నేను కదల్లేదు.

'సిగ్గేమో. నా మొదటిపెళ్ళానికూ్కడా భలే సిగ్గు. మొగుడి దగ్గర సిగ్గూ, తల్లిదగ్గర ఆకలీ దాచుకోకూడదే అనేవాడ్ని'

పళ్ళికిలిస్తున్న ఆయన్ను చూస్తుంటే ఇంటి ద్వారం పైన వేలాడదీసే దిష్టిబొమ్మ కళ్ళముందు మెదిలింది.

విసురుగా వచ్చి, తన ప్రతాపం చూపించడానికి తలుపు బలంగా మూశాడు. ఆ శబ్దాన్ని వింటుంటే నా ఎముకలు విరుగుతున్నట్లే వుంది.

నన్ను లాక్కుని వెళ్ళి మంచంమీద కూర్చోబెట్టాడు. పాలగ్లాసును స్టూల్ మీద వుంచాను.

'ఏం పేరు? మరిచిపోయాను'

శోభనం గదిలో పెళ్ళాం పేరడిగే దౌర్భాగ్యస్థితిలో వున్నాం మనం. అయిదు నిముషాల పెళ్ళిచూపుల పరిచయంలో ఎదుటివ్యక్తి గురించి ఏం తెలుస్తుంది? మా ఆయన మరీ అధ్వాన్నం గనుక పేరు మరిచి పోయాడు. తేడా చాలా స్వల్పమే.

'కైవల్య'

'అలా అంటే ఏమిటి?' అని అడిగాడు.

'మోక్షమనుకుంటా'

'అర్థంకాని పేరు పెట్టుకున్నావే' అంటూ నన్ను గట్టిగా వాటేసుకున్నాడు. ఎలుగుబంటు పట్టుకుని వున్నా అంతగా జడుసుకుని వుండేదాన్ని కానేమో. జుగుప్సలాంటిది శరీరాన్ని కుంచింపజేస్తోంది.

తలనంతా లాగి చెంపమీద కొరికాడు. గుండెల్లో రేగిన మంట కళ్ళనీళ్ళరూపంలో తేలింది.

ఇక ఆయన మాట్లాడడని నాకు తెలిసిపోయింది. శోభనం ముందు నా భర్త మాట్లాడిన మాటలు అవే. బయటనున్న చందమామ జాలిగా నన్ను చూసి నవ్వుతున్నట్టే వుంది. పొగపొయ్యే కిటికీగుండా వెన్నెల బూజులాగా వేలాడుతోంది.

జాకెట్ హుక్‌ల కోసం వెదుకుతున్న ఆయన చేతులు ముళ్ళకంచెతో పెరుకుతున్నట్టు కదులు తున్నాయి. జాకెట్టు మధ్యన వేళ్ళుపోనిచ్చి లాగాడు. హుక్కులన్నీ తెగిపోయాయి. పందొమ్మిదేళ్ళ పరు వాన్ని తమలో కలిపేసుకున్న నా ఎదసంపద పొంగా ల్చిందిపోయి విచిత్రంగా టచ్‌మినాట్ ఆకుల్లాగా ముడుచుకుపోయాయి.



## మమ్ముట్టికి అమితాబ్ సత్కారం



**మం**చిని మంచే గుర్తిస్తుంది అంటారు. అది నిజమే. అందుకే జాతీయ ఉత్తమ నటుడు మమ్ముట్టిని ఆలిండియా సూపర్‌స్టార్ అమితాబ్‌బచన్, ఇటీవల మద్రాసులోని ఓ కార్యక్రమంలో పూలమాలవేసి సత్కరించాడు. 'పొంతనమాడు, విధేయన్‌మలయాళ చిత్రాలలో అద్భుతంగా నటించి అవార్డు పొందిన మమ్ముట్టి రెండవసారి ఈ జాతీయ అవార్డునిపొందడం నాకెంతో ఆనందంగా వుంద"ని అభినందించాడు అమితాబ్. అమితాబ్ అభిమానం మమ్ముట్టికి మరో అవార్డు దొరికినంత ఆనందాన్నిచ్చింది.

బ్రా ఎలాస్టిక్‌ను సాగబెరికి వదలడంతో కొరడా చివర తగిలినట్లు విలవిల్లాడిపోయాను. దాన్నీ తెంపా లని చూశాడు. వీలెంది కాదు. ఉంగరం చేయి గుచ్చు కుంటూ వుండగా దాని బంధనాలను విప్పాడు.

ఆయనకు కావాల్సింది స్త్రీ కాదు- స్త్రీ శరీరం. భార్య చనిపోయిన దగ్గర్నుంచీ వస్తులుంటున్నాడు కాబోలు ఆకలిగొన్న సింహంలా మీదపడ్డాడు. ఇలాంటి అన్‌ఈస్థటిక్‌వెధవని ఏ అమ్మాయి ప్రేమించి శరీరాన్ని ఇవ్వగలదు? అందుకే స్త్రీ శరీరంపట్ల మంచి యావతో వున్నట్టున్నాడు. ఆయన తోసిన తోపుకి మంచం అడ్డ బలంగా తగిలింది. రక్తం ఏమైనా వస్తూవుందేమో నని చూసుకోవాలనిపించింది. అప్పటికే నా చేతుల్ని తీసుకుని లాగి పట్టుకుని వున్నట్లు తెలిసి ఆ ప్రయ త్నాన్ని విరమించుకున్నాను.

పాపం నా తెల్లటి కాటన్ చీర అప్పటికే ఆయన మురికిని పీల్చుకుని నల్లగా ముఖంపెట్టింది.

కుచ్చిళ్ళను పట్టుకుని మోటుగా పైకిలాగాడు. పువ్వుకున్న రేకులన్నిటినీ దూసేసినట్లు అతని చేతులు కదిలాయి. లంగా బొందు చిక్కుప్రశ్నలా మరింత బిగుసుకుపోయింది. దాన్ని పట్టుకుని గింజు తున్నాడుగానీ అది ఊడిరావడంలేదు. నా శరీరంమీద అగ్గిలవాన కురుస్తున్నట్లే వుంది. కణాలన్నీ తమలోకి తామే ప్రవహిస్తున్నట్లు ముడుచుకుపోయాను. మూడంకె వేసుకుని, బిగదీసుకుపోయాను.

అతను బలాన్నంతా చేతుల్లోకి తీసుకుని లాగాడు. కందిరీగలు కుట్టినట్లు బాధతో కమిలిపోయాను. అయిదడుగులా అయిదంగుళాల మనిషిని నాలుగు అడుగుల పెట్టెలో పెట్టి బయటనుంచి చీలలతో బిగించినట్లు ముడుచుకుపోయాను.

'ఏమిటలా బిగుసుకుపోతావ్! ఇలా అయితే అయి నట్లే' అన్నాడు. అప్పటికే నిస్సత్తువ నాలోని చైతన్యా న్నంతటినీ హత్యచేసింది. కాళ్ళూ చేతులూ వశం తప్పి, ప్లాస్టిక్‌తో చేసినట్లు బిగదీసుకుపోయాయి. కళ్ళు వాటంతటవే మూసుకుపోతున్నాయి. శరీరం ప్రాణాన్ని కోల్పోయినట్లు చచ్చుబడిపోయింది.

అప్పటికే ఆయన నాలో కలిసిపోవడానికి నానా తంటాలుపడుతున్నాడు. కానీ నా స్థితి అందుకు వీలు కల్పించడంలేదు. శరీరం గట్టిగా ఇనుములా తయా రైంది. మెత్తదనం ఎక్కడో మాయమైపోయింది.

గుండెల్లో మంట మరింత ఎక్కువైంది నాకు. శరీ రాన్ని వుండలాచుట్టి ముళ్ళకంప మీద గిరవాటేసినట్లు కళ్ళలోంచి నీళ్ళు చిప్పిల్లుతున్నాయి.

కనురెప్పలు మూతలుపడ్డాయి. ఆ బాధను మరిచి పోవడానికి నేనూ, మనోహర్ గడిపిన క్షణాలను బల వంతంగా గుర్తుకు తెచ్చుకున్నాను.

మొదట-మనోహర్ డాబామీద వీడియో సినిమా చూడడానికి వెళ్ళినప్పుడు అతని చేయి నా ఎదకు తగలడం- సుగుణవాళ్ళింట్లో మనోహర్ గట్టిగా కౌగి లించుకుని, బుగ్గలపై సుతారంగా ముద్దుపెట్టడం- వీధిలో వెళుతూ నన్ను చూసి కొంటెగా కన్నుగీట డం, గొబ్బిలు తట్టడానికి వెళుతున్నానని ఇంట్లో చెప్పి, శివాలయం దగ్గర కలుసుకోవడం, అన్నీ పుష్పాడిమీద అచ్చొత్తిన చిత్రాల్లా కనిపిస్తున్నాయి. ఏదో హాయి శరీరానికి రిలాక్స్‌ని కలగజేసింది. జీవ కణాలన్నీ ఆనందాన్ని పీల్చుకుని సాగాయి. మనసు రంగుల తుపానులో చిక్కుకున్న గాలిపటమే అయింది. రక్తం జ్ఞాపకాలతో మరింత చిక్కబడింది.

నాలో కనిపించిన ఈ ఈజీకి నా భర్త ఓ క్షణంపాటు విస్తుపోయినట్లు ఒక క్షణం ఆగడం నాకు తెలియదు. నా మనసంతా మనోహర్ ఆక్రమించేసుకున్నాడు.

ఆ క్షణంలో నేనెవరో, నేనెక్కడున్నానో మరిచి పోయాను. శివాలయం వరండాలో నేనూ, మనోహర్ కలిసి సుఖాల అంచులు పట్టుకుని స్వర్గానికి పాకు తున్నట్టే వుంది.

'మనోహర్...మనోహర్' అంటూ నా భర్తని పట్టు కున్నాను. ఒక లిప్తకాలంపాటు ఆయన షాక్‌తో గడ్డ కట్టుకుపోయినట్లు నాకు తెలిసే అవకాశమే లేదు. నా హృదయమంతా, నా తనువంతా మనోహర్‌తో నిండిపోయింది.

'మనోహర్' ఈసారి మరింత గట్టిగా వాటేసుకు న్నాను. నా ఉద్రేకాన్ని చూసి నా భర్త తన వయసును మరిచిపోయాడు. రెట్టించిన ఉత్సాహంతో నన్ను పూర్తిగా ఆక్రమించుకున్నాడు.

ఓ పావుగంట తరువాత నేను ఆ ట్రాన్స్‌లోంచి బయటపడ్డాను. అప్పుడు గుర్తొచ్చాయి పరిసరాలన్నీ. పక్కనే అలిసిపోయి కనుగుడ్లను పైనున్న రూఫ్‌కేసి గురిచూస్తున్న ఆయన్ను చూస్తూనే భయంలాంటిది జరజరా గుండెల్లో పాకింది.

నేను కలవరించిన మనోహర్ ఎవరో చెప్పమంటా డని ఆయనవైపు చూడకుండా తలదించుకున్నాను.

చిత్రం-ఆయన ఆ ప్రశ్న వేయలేదు. అప్పుడే కాదు-మా పెళ్ళయిన మొదటిరాత్రి నుంచి ఇప్పటి వరకూ ఆయన నా దగ్గరికి చేరిన ప్రతి రాత్రీ నేను కళ్ళుమూసుకోవడం తరువాయి ఆ పేరును ఉచ్చ రిస్తున్నా ఆయన అడగలేదు.

నేను ఈజ్ అయిపోవడంవల్ల రెట్టింపు ఉత్సా హంతో సుఖాన్ని జుర్రుకోవచ్చన్న స్వార్థంతో ఆయన ఆ ప్రశ్న వేయడంలేదు. ఆ నాలుగు క్షణా లనూ భరించడం కోసం మనోహర్‌ని కలవరించే టెక్నిక్‌ను నేనూ విడవడంలేదు.

జీవితంలో ఇంత భయంకరంగా రాజీపడడం నాకూ, నా భర్తకే చెల్లింది" కైవల్య చెప్పడం ఆపింది. అప్పటికే బాగా చీకటిపడింది.

• • •

ఉదయం తొమ్మిదిగంటలై వుంటుంది. తూర్పు ఆకాశంలో సూర్యుడు మండుతున్న చక్రంలా తిరుగు తున్నాడు. గాలి నులివెచ్చగా తగులుతోంది.

సుజన అక్కయ్యలు ముగ్గురూ పెరట్లో వడి యాలు పెడుతున్నారు. సత్యనారాయణరావు భగవ ద్గీత టీకాతాత్పర్యం చదువుకుంటున్నాడు. అన సూయమ్మ వంటింట్లో కుస్తీలు పడుతోంది. సుజన బామ్మ డాబామీద నుంచి కిందకు దిగి వరండాలో

## 'ముద్దు' వద్దు



"ఈమధ్య మన సినిమాల్లో ముద్దు సన్నివేశాలు ఎక్కువౌతున్నాయి. నా వరకు నేను వాటికి కాస్త దూరంగానే వున్నాను. అమెరికావంటి పాశ్చాత్య దేశాల్లో రోడ్డుపై నిల్చున్నపాటునే ముద్దు పెట్టుకోవ డాలు జరుగుతుంటాయట.

మన దేశంలో భార్యాభర్తలుకూడా బహిరంగ ప్రదే శాల్లో చేయి చేయి కలిపి నడవడానికి కాస్త సంకో చిస్తారు. మన కట్టుబాట్లు ఇంత కట్టుదిట్టంగా వున్న ప్పుడు అనవసరంగా ఇతర దేశాల సంస్కృతిని ఎం దుకు దిగుమతి చేసుకోవడం?" అని 'ముద్దు' గురించి దీర్ఘమైన ఉపన్యాసాలిచ్చేస్తోంది కనక. ఏమైనా- పూనకాల సినిమాల్లో నటించాక పవిత్రవాక్కులు బాగా వంటపడుతున్నాయి!

స్వాతి సపరివార పత్రిక 13.5.94

కూర్చుని వీధిన వస్తూ పోతున్న జనాన్ని చూస్తోంది.

సుజన ఇంకా నిద్రలేవలేదు. రాత్రి చాలా పొద్దు పోయేవరకు ఆమె కైవల్య చెప్పిన సంగతులన్నీ నోట్ చేసుకుంటూ వుండిపోయింది. ఏ మూడింటికో నిద్రలోకి జారిపోయింది.

వడియాలు పెడుతున్న ముగ్గురూ మాటల్లో పడ్డారు. "మొన్నరాత్రి వంశీఇచ్చిన లడ్డుతినగానే అంత నిద్ర ముంచుకొచ్చిందేమిటి మన ముగ్గురికీ" సుజన పెద్దక్కయ్య ఉమ తన సందేహాన్ని వెలిబుచ్చింది.

"అందులో మత్తుమందు కలిపివుంటాడని నా నమ్మకం. అలా మనల్ని నిద్రపుచ్చి సుజన గదిలో దూరి, ఫస్ట్‌నైట్ ఛాన్స్ కొట్టేద్దామనుకున్నాడు కాబోలు. కానీ నేను సేకరించిన డేటా ప్రకారం అది చివరి క్షణంలో ఫెయిలైంది" రెండో అక్కయ్య రమాదేవి చెప్పింది.

"అదెలాగ?" చిన్నక్కయ్య హేమ అడిగింది.

"మన బామ్మకు నిద్రమాత్రలు వేసుకుని నిద్ర పోయే అలవాటుకదా. ఆ రాత్రి మాత్రలు ఇవ్వకనే అమ్మ నిద్రపోయింది. లడ్డులోని మత్తుమందువల్ల కొంతసేపు నిద్రపోయి తిరిగి లేచి కూర్చుంది బామ్మ. అప్పుడు మన సుజన హీరో రంగప్రవేశం చేశాడు. బామ్మ అడ్డుపడింది. తన రూమ్‌లో కలల్లో తేలిపోతున్న సుజన వంశీ రాకను గమనించలేదు. బామ్మ తన ఫస్ట్‌నైట్ ప్రహసనాన్ని చెప్పడంతో అతగాడు జడుసుకుని ఉడాయించాడు"

"లేకుంటే సుజన మన ఛాలెంజ్‌లో నెగ్గేదన్న మాట" అంది ఇంకో అక్కయ్య.

"అంతేకదా. ఆ దేవుడు బామ్మరూపంలో వచ్చి మనల్ని ఆదుకున్నాడన్నమాట. లేకుంటే సుజన మనపై విజయగర్వంతో స్వారీ చేసేది"

"ఇకనుంచి మనం జాగ్రత్తగా వుండాలి. భార్యాభర్తలిద్దరూ చాలా సీరియస్‌గా ఈ ఛాలెంజ్‌లో నెగ్గాలని చూస్తున్నారు"

"ఓ.కే! అలాగే" ముగ్గురూ కూడబలుక్కున్నారు.

హాల్లోంచి సత్యనారాయణ గొంతు శ్రావ్యంగా వినిపిస్తోంది. వంటింట్లోంచి మసాలా వాసన బరువుగా గాలిలోకి లేస్తోంది.

బామ్మ వస్తూపోతున్న జనంమీద సుబ్బులుతో కామెంట్ చేస్తోంది. అంత వయసులో కూడా ఆమె హుషారుగా వుంటుంది. తన వాక్చాతుర్యంతో ఎదుటి వాళ్ళను బురిడీలు కొట్టిస్తూ వుంటుంది.

"ఆ వచ్చేది జయకదా. పెళ్ళికి ముందు సార కాయలా వుండేది-ఇప్పుడేమిటి అలా ములక్కాడలా అయిపోయింది. కొంపదీసి మొగుడు దీన్ని ఒక్క క్షణం వదలడంలేదు కదా. ముందే వాడు సైన్యంలో పనిచేసి వచ్చినవాడు. వాడికి ప్రతీదీ యుద్ధంలా అనిపిస్తుందేమో" సుబ్బులు ఆమె మాటలకు నవ్వుకుంటూ వుండిపోయింది.

అంతలో ఖాకీడ్రస్సులో వున్న ఒక వ్యక్తి సైకిల్ తొక్కుకుంటూ అక్కడికి వచ్చాడు.

సైకిల్ నిలబెట్టి "సత్యనారాయణగారిల్లు ఇదేనా?"

## సంప్రదాయాలు

అన్యసంప్రదాయాన్ని అనుసరించగోరితే, దాన్ని గురించి క్షుణ్ణంగా తెలుసుకోవాలి, జాగరూకతతో అనుసరించాలి. లేకపోతే, అవకతవకలు జరుగుతాయి. ఇంగ్లీషుభాషలో పాశ్చాత్య సంప్రదాయం ప్రకారం ఇప్పుడు పెక్కుమంది అచ్చువేసి పంపిస్తున్న పెండ్లి శుభలేఖల సందర్భంలో–నిష్కర్షగా చెప్పాలంటే–ఎన్నెన్నో అవకతవకలు కానవస్తున్నాయి. వాటిని మా పాఠకుల దృష్టికి తీసుకువస్తున్నందుకు మమ్మ అపార్థం చేసుకోరని ఆశిస్తున్నాము; మాపై ఆగ్రహపడరని నమ్ముతున్నాము.

మాటవరసకి, పుల్లయ్యగారి కుమార్తె పెళ్లి జరుగుతున్నదనుకోండి. ఆయన పంపిస్తున్న శుభలేఖలు "శ్రీ మతి, శ్రీ పుల్లయ్య"ల పేర ప్రస్తుతం వెడుతున్నాయి. పాశ్చాత్య సంప్రదాయం ప్రకారం ముందుగా పేర్కొనవలసింది "మిస్టర్"నే, "మిసెస్"ను కాదు. అయినా, సభాసదులను ఉపన్యాసకుడు "లేడీస్ అండ్ జంటిల్‌మెన్" అని సంబోధించడం సంప్రదాయం కాబట్టి, అదే అన్నిసందర్భాలకు వర్తిస్తుందన్న భ్రమవల్ల కాబోలు, మన శుభలేఖలలో ముందు 'శ్రీ మతి'ని పేర్కొని, తర్వాత "శ్రీ "ని పేర్కొనడం జరుగుతున్నది. ఎవరు ఈ పద్ధతిని ముందుగా ప్రారంభించారో తెలియదుకాని, ఇది శుద్ధ తప్పు.

భర్త ఇంటిపేరునుబట్టి భార్య ఇంటిపేరు మారుతుంది. అందువల్ల "మిస్టర్" తర్వాతనే "మిసెస్"ను



పేర్కొనాలి. ఇందుకు విరుద్ధంగా వెళ్లడం ఏ సంప్రదాయం ప్రకారమైనా సబబు కాదు.

పోతే, ఈ శుభలేఖలలో "సౌభాగ్యవతి" అనే మాటను *"Sow"* అని కుదిస్తున్నారు. ఇంగ్లీషులో *"Sow"* అనే మాటకు అర్థమేమిటో తెలిసినవారు ఈ పిచ్చి పని చేయరు.

ఇదే విధంగా "చిరంజీవి"అనే పదాన్ని *"Chi"* అని కుదించడంకూడా అనవసరమే. *"Chi"* అనే ఇంగ్లీషు వర్ణక్రమాన్ని "ఫీ" అనికూడా ఉచ్చరించడానికి వీలున్నదన్న సంగతిని ఈ సందర్భంలో గమనించాలి. ఈ ప్రమాదం వున్నప్పుడు "చిరంజీవి" అని పూర్తిగా అచ్చువేయడమే సముచితం కాగలదు.

పోతే, సంభాషణ సందర్భంలో "నా మిసెస్", "మీ మిసెస్" అనడం కూడా శుద్ధ తప్పు. "మిసెస్" తర్వాత విధిగా భర్తపేరు రావాలి. లేదా "మై వైఫ్", "యువర్ వైఫ్" అనాలి.

సంప్రదాయాలు సరిగా తెలియకపోతే, ఏ భాషలోనైనా ఇట్టి పొరపాట్లు జరగడం కద్దు. "మా ఆవిడ" మనకు నుడికారం. అది తప్పుకాదు. ఇదే ధోరణిలో "మా భార్య" అనడం ఎంత ఘోరమో మేము ప్రత్యేకించి వివరించనక్కరలేదు.

ఇట్టి ఉదాహరణలు మరికొన్నింటిని పేర్కొనవచ్చు గాని, సంప్రదాయాన్ని క్షుణ్ణంగా తెలుసుకొనకపోతే, దాన్ని జాగ్రత్తగా అనుకరించకపోతే, ఎన్ని అవకతవకలు జరగగలవో ఇప్పటికే మేము తగినంతగా వివరించగలిగినట్లు నమ్ముతున్నాము.

–నార్ల వెంకటేశ్వరరావు

అని గట్టిగా అడిగాడు. వరండాను ఊడుస్తున్న సుబ్బులు ఒక్క క్షణం అతనివైపు చూసి "ఇదే! ఏమిటి?" అని ద్వారం దగ్గరికి వచ్చింది.

"సత్యనారాయణ గారికి టెలిగ్రామ్"

"అమ్మో! టెలిగ్రామా! అయ్యో! ఏం వచ్చింది నాయనా! తెల్లవారినుంచీ కుడికన్ను అదురుతూ వుంది. అప్పుడే అనుకున్నాను ఏదో దుర్వార్త వినబోతామని. ఏమైందిదేవుడో?" బామ్మ రాగయుక్తంగా శోకాలు ప్రారంభించింది.

ఈ అరుపులకి సత్యనారాయణ భగవద్గీతను మూసి ఇవతలకు వచ్చాడు.

వడియాలు పెడుతున్నవాళ్ళూ పరుగు పరుగున అక్కడికి చేరుకున్నారు. అనసూయమ్మ చేతులకున్న మసి అయినా తుడుచుకోకుండా వచ్చి "ఏమైంది?" అంటూ అందరివైపు చూస్తూ ప్రశ్నించింది.

ఈ హడావుడికి సుజన కూడా నిద్రలేచి. మేడమీద నుండి కిందకు దిగింది.

ఈలోగా ఖాకీ బట్టలతను వరండా మెట్లెక్కి పైకి వచ్చి "సత్యనారాయణ గారు మీరేనా?" అని అడిగాడు.

"అవును నాయనా"

"టెలిగ్రామ్ సార్. ఇదిగో ఇక్కడ సంతకం పెట్టండి"

ఆయన సంతకం పెట్టాక వణుకుతున్న చేతులతో టెలిగ్రామ్‌నందుకున్నాడు. అందులో వున్న మేటర్ చదివాక "అరే! మన వేదాంతం రఘురామయ్య కాలం చేశారే" బాధ మిళితమైన స్వరంలో స్వగతంలా అన్నాడు.

"తాతయ్య వేదాంతం రఘురామయ్య చనిపోయారా!" పిల్లలంతా ఒక్కసారిగా నోళ్ళు తెరిచారు.

అప్పటికి అర్థమైంది బామ్మకు. "అయ్యో! మా తమ్ముడు పోయాడా!" అంటూ ఏడుపు ప్రారంభించింది. ఆమెను సముదాయిస్తూ అందరూ లోనికి తీసుకువెళ్ళారు. అయినా ఆమె ఏడుపు ఆపలేదు.

"మరి అందరం వెళ్ళాలికదా. బయల్దేరండి" సత్యనారాయణ అన్నాడు.

"సుజన?" అనసూయమ్మ సందేహంగా అడిగింది.

"అది కొత్తపెళ్ళికూతురుగదా. అది చావులకు. కర్మక్రియలకూ రాకూడదు. శాస్త్రం ఒప్పుకోదు. అదింట్లోనే వుంటుంది. రాజంపాలెం ఎంత దూరం! మహావుంటే ఇరవై కిలోమీటర్లకు మించదు. రాత్రికి ఏ వేళకైనా వచ్చేయచ్చు. నెల్లూరులో మన ఊరికి వచ్చే లాస్ట్‌బస్ తొమ్మిది గంటలకి. దాన్ని మిస్ చేసుకోకుండా వచ్చేయాలి. రాత్రి చనిపోయాడు కాబట్టి ఈ రోజు ఎత్తుబడి అయిపోతుంది. మా అమ్మను వదిలేసివస్తే. కర్మక్రియల వరకూ వుండి ఆ తరువాత వచ్చేస్తుంది"

"అయ్యో! నా తమ్ముడూ" బామ్మ మధ్య మధ్యలో ఆగి ఏడుపు సాగిస్తూ వుంది.

ఇలా తర్జన భర్జనలు జరిగి చివరికి సుజనను ఇంట్లో వుంచి. తోడుగా సుబ్బుల్ని వుండమని. మిగిలినవారంతా చావుకు బయల్దేరారు. వాళ్ళు బస్టాండ్ చేరుకునేసరికి పదకొండుగంటలైంది. అప్పటికే అందరికీ ఆకలి బయల్దేరింది. వెళుతున్నది చావుకు కాబట్టి ఎప్పుడు తింటామో ఏమో అన్న వేదనకూడా మొదలైంది. ఈ వేదనలోనే అందరూ డస్సిపోయారు.

బస్టాండ్ దగ్గరున్న మామిడితోపులో ఓ పక్కగా నక్కివున్న వంశీ. వాళ్ళు ఎప్పుడు బస్సులో ఎక్కుతారా అని గుడ్లప్పగించి చూస్తున్నాడు.

వీళ్ళు చావుకి వెళ్ళి వచ్చేటప్పటికి ఎలా లేదన్నా రాత్రి పదిగంటలవుతుంది. ఇప్పుడు పదకొండు గంటలైంది. అంటే పదిగంటల సమయం వుంటుంది. ఈలోగా తన ఫస్ట్‌నైట్‌ని లాగించెయ్యాలి. రాత్రి జరిగితే అది ఫస్ట్‌నైట్ అవుతుంది. మరి పగలు జరిగితే ఏమనాలి? ఫస్ట్‌డే అంటారేమో. ఎవరూ ఇంతవరకు అనకపోయినా ఈ ఫస్ట్‌డే తనుతోనే మొదలవుతుంది. అదీ ఓ క్రెడిట్టే. రాత్రి జరిగినా, పగలు జరిగినా శోభనం శోభనమేగదా. మరి కొద్ది క్షణాల్లో తాను సుజన కౌగిలిలో కరిగిపోతాడు.

వంశీ ఈ ఊహలకే చలించిపోయాడు. ఏదో ఉద్రేకం గుండెను కదిలిస్తోంది. ఇంకొక్క క్షణం ఆగలేక బస్సు వస్తుందో లేదోనని చూశాడు. దూరంగా ఎర్రటి బస్సు వస్తోంది. అది అతని కళ్ళకు మాత్రం తన శోభనానికి పచ్చజెండా ఊపుతున్నట్టే వుంది.

బస్సు వచ్చి ఆగింది. అందరూ బిలబిలమంటూ ఎక్కారు. బస్సు బయల్దేరింది.

అంతవరకు తుప్పల్లో వున్న వంశీ ఇవతలికి వచ్చాడు. "ఆహా! జగమే ఊయలగా" అన్న పాట అప్రయత్నంగా అతని నోటివెంట వచ్చింది. సుజన ఒంటరిగా వుందన్న విషయం అతనికి ఎక్కడలేని ఉత్సాహాన్ని ఇస్తోంది. తామిద్దరూ శోభనం మధురిమలను అనుభవించడమే కాకుండా, ఛాలెంజ్‌లో కూడా నెగ్గుతామన్న థ్రిల్ రక్తాన్నంతా కవ్విస్తోంది.

మరో అయిదు నిముషాలకు ఇంటికి చేరుకున్నాడు. బాత్రూమ్‌లో దూరి శుభ్రంగా స్నానంచేశాడు. తెల్లటి పైజమా, లాల్చీ వేసుకున్నాడు. లైట్‌గా సెంట్ స్ప్రే చేసుకున్నాడు.

"అదేమిట్రా భోజనాలప్పుడు తయారయ్యావ్. ఎక్కడికి?" అతని తల్లి విచిత్రంగా చూస్తూ అడిగింది.

"ఎక్కడికీ లేదులేవే. అలా మా ఫ్రెండ్ ఇంటికెళ్ళొస్తాను" అన్నాడు వంశీ.

(ఇంకావుంది)

సీరియల్



# రారా మా ఇంటిదాకా

## మేర్లపాక మురళి

"ఏం మామయ్యకు మామయ్య చనిపోయాడట. మనిషిచేత చెప్పి పంపించారు. మనింటి తరఫున ఎవరైనా వెళ్ళుంటే బావుండేది. నేనెటూ వెళ్ళలేని స్థితిలో వున్నానుకదా. అందుకే నిన్ను పంపిద్దామని చూస్తే కనిపించకపోతివి" అంది అతని తల్లి.

"మామయ్యవాళ్ళు ఎదురుపడ్డారులేవే. కొత్తపెళ్ళికొడుకు చావులకి రాకూడదట. శాస్త్రం ఒప్పుకోదని చెప్పాడు. అందువల్ల నిలిచిపోయాను. నువ్వు భోజనం చేసెయ్. నేను ఆలస్యంగా వస్తాను" అన్నాడు వంశీ.

ఇక ఏమీ మాట్లాడలేక ఆమె కొడుకువైపు నిస్సహాయంగా చూస్తుండిపోయింది. చావుకి ఎవరో ఒకరు వెళ్లలేకపోయామన్న బాధ ఆమెను కుంగదీస్తున్నా అతను అదేమీ పట్టించుకోకుండా బయటికి అడుగువేశాడు.

ఎండ వెన్నెలంత హాయిగా వుంది. గాలి తన శోభనానికి ముత్తైదువులను పిలవడానికి అటూ ఇటూ తిరుగుతున్నట్టే వుంది. ఆకాశం చందనాన్ని రాసుకోవడానికి ఉపయోగించే రాతిపలకలా వుంది. అక్కడక్కడా వున్న మబ్బులు అగరొత్తుల పొగ ఆ రూపం దాల్చినట్లు కనిపిస్తున్నాయి.

ప్రకృతంతా తనకు సహకరిస్తున్నట్లు అనిపించింది వంశీకి. ద్రాక్షపళ్ళవైన్‌లో మనసును ఊరబెట్టినట్లు మత్తుగా వుంది. మగ్గంమీద దూదిని ఏకినట్లు శరీరాన్ని ఎవరో ఏకుతున్నట్లు ఉద్వేగం ప్రకంపనాలను పుట్టిస్తోంది. అతను వీధి మలుపు తిరిగాడు. కొత్తపెళ్ళికొడుక్కి దిష్టితీయడానికి పసుపునీళ్ళ పళ్ళెంను సిద్ధంచేసినట్లు గోపురంగుతో మెరిసిపోతున్న సత్యనారాయణగారిల్లును చూస్తూనే అతని నరాలన్నీ గొడుగుచువ్వల్లా విచ్చుకున్నాయి.

ఇంటిపక్కనుంచి నడిచి దొడ్లోకి వెళ్ళాడు. ఎవరూ లేరక్కడ. చాలా నిశ్శబ్దంగా వుంది.

"సుజనా! సుజనా" మెల్లగా పిలిచాడు.

హాల్లో సోఫామీద కూర్చున్న సుజన తనను ఎవరో పిలుస్తున్నట్లనిపించి బయటికి వచ్చింది.

వంశీనిచూడగానే ఆమెకు ఏడుపు తన్నుకొచ్చింది. భోరున ఏడుస్తూ అతని దగ్గరికి వడివడిగా వచ్చింది.

ఈ హఠాత్ పరిణామానికి అతను బెంబేలుపడిపోయాడు. తన శోభనం ఉద్రేకం మీద కన్నీళ్ళ వర్షం కురుస్తున్నట్లు గిలగిల్లాడిపోయాడు.

"ఏమైంది? ఎందుకేడుస్తున్నావ్?"

"మా తాతయ్య చనిపోయాడు. అమ్మావాళ్ళంతా ఇప్పుడే బయల్దేరి వెళ్ళారు"

అప్పుడర్థమైంది ఆమె ఎందుకేడుస్తోందో అతనికి. అర్థంకాగానే నవ్వు జలపాతంలా దూకింది.

నవ్వుతున్న అతన్ని ఒక్కక్షణం విస్మయంతో చూస్తుండిపోయింది.

"మా తాతయ్య చనిపోతే నీకు నవ్వొస్తోందా?" విసురుకుపోయింది.

"దాని వెనక చిన్న మెలిక వుంది. లోపలికెళదాం పద చెబుతాను" ఆమె భుజంమీద చేయివేసి లోపలికి నడిపించుకెళ్ళాడు.

ఇద్దరూ సోఫాలో కూర్చున్నారు.

"ఇంతకీ పూలంపాట్లం ఎక్కడ?" అతను నాలుగు వైపులా చూస్తూ అడిగాడు.

ఎవరున్నట్లు చూసింది.

"మబ్బులు"

"అది పూలంపాట్లమా? అలాంటి కాంప్లిమెంట్లు, ఉపమానాలు ఉపయోగించావంటే నే ఊరుకోను" చిరుకోపం ఎర్రగా పులుముకుంది ఆమె ముఖంమీద.

"ఇంకెప్పుడూ నీ ముందు అనములే"

"అంటే ఇంకెవరి దగ్గరైనా అంటావా?"

"ఛీఛీ-అలాంటిదేమీ లేదులే. నా మాటలకు ద్వంద్వార్థాలు వుండవు. ఇంతకీ ఎక్కడికెళ్ళింది?"

"ఇంటిదగ్గర ఏదో పనుందని వెళ్ళింది"

"ఎప్పుడొస్తుంది?"

**8** పెద్దల అంగీకారంతో వంశీ, సుజనల పెళ్లవుతుంది. శోభనం ముహూర్తం దగ్గర పడిందనగా సుజనకు 'మూడురోజుల' ఇబ్బంది ఎదురవుతుంది. ఆ మూడురోజులూ వీలుకాదు కనుక మరో ముహూర్తం చూస్తాడు సుజన తండ్రి. కానీ ముహూర్తానికి ముందే తమ ఫస్ట్‌నైట్‌ని జరుపుకోవాలనే ప్రయత్నంలో వుంటారు వంశీ, సుజనలు.

సుజన అభ్యర్థనమేరకు తన ఫస్ట్‌నైట్ గురించి వివరిస్తుంటుంది కైవల్య. మనోహర్‌ని ప్రేమిస్తుంది కైవల్య. ఇదిఇలావుండగానే నలభైఏళ్ళ వయసున్న ఓ మోతుబరిరైతు ఎదురు కట్నం ఇచ్చి కైవల్యని చేసుకోవడానికి ముందుకొస్తాడు. తండ్రి అంగీకారంమేరకు అయిష్టంగానే అతన్ని పెళ్ళిచేసుకుంటుంది. మనోహర్‌ని తలుచుకుంటూనే తన ఫస్ట్‌నైట్ జరుపుకుంటుంది.

ఓరోజు సుజన బామ్మకి తమ్ముడైన వేదాంతం రఘురామయ్య చనిపోయినట్లు సుజన ఇంటికి టెలిగ్రాం వస్తుంది. ఆ వార్తవిని కొత్తపెళ్ళికూతురు వెళ్ళకూడదు కనుక సుజన మినహా అందరూ రాజులపాలెంకి వెళతారు. ఇదంతా గమనిస్తున్న వంశీ, ఇదే అదను అనుకొని తన ఫస్ట్‌నైట్‌ని జరుపుకోడానికి సుజన ఇంటికి బయలుదేరతాడు.

"సాయంకాలం"

"హమ్మయ్య. మన శోభనానికి చివరనున్న అడ్డంకి కూడా తొలగిందన్నమాట"

"శోభనమా?" ఆమె ఆశ్చర్యపోయింది.

"శోభనమే. కాకపోతే మన ఫస్ట్‌నైట్ డే టైమ్ జరగబోతోంది-అంతే"

"నాకేమీ అర్థంకావడంలేదు"

"అర్థం కాకపోవడానికి ఇది పజిల్ కాదు. ఫస్ట్‌నైట్. ఇప్పుడే మన శోభనం. త్వరగా తయారవ్"

"నీకేమైనా పిచ్చిపట్టిందా? అవతల తాతయ్య పోయి నేనేడుస్తుంటే తగుదునమ్మా అని శోభనానికి ఎంచక్కా తయారయ్యావ్"

"అదా నీ బాధ? కానీ అసలు రహస్యం చెప్పేస్తున్నాను. మీ తాతయ్య పోలేదు"

ఆమె ఆశ్చర్యంతో బిగదీసుకుపోయింది.

"అవును. ఆయన నిక్షేపంలా తాంబూలం రోలులా వున్నాడు. నేనే ఈ డ్రామా అంతా ఆడాను"

అప్పటికి ఆమెకు కొంత అర్థమైంది. తాతయ్య చనిపోలేదన్న ఆనందం లీలగా మెదిలింది.

"డ్రామానా?"

"అవును. ఆ టెలిగ్రామ్ ఇచ్చింది నేనే"

"నువ్వా?"

"ఎందుకలా మాట మాటకీ ఆశ్చర్యపోతావ్! ఈ ఐడియా నాదే. 'పూలపల్లకి' ఫెయిలయ్యాక-మొదటి ప్లాన్‌కి నేను పెట్టుకున్న కోడ్‌లే పూలపల్లకి అంటే. ఈ పథకం పేరేమిటో తెలుసా? రవ్వల నెక్లెస్-బావుందా? ఇక అసలు విషయానికి వస్తే మీ తాతయ్య పోయినట్లు టెలిగ్రామ్ ఇస్తే అందరూ వెళతారని తెలుసు. నువ్వు కొత్త పెళ్ళికూతురువి గనుక నిన్ను పిలుచుకువెళ్ళరని ఊహించాను. మీ నాన్న కథ ఏమిటో నాకు తెలియంది కాదుగా. ఆయనలాంటి వాడు ప్రపంచంలో వుండడు. ప్రతిదానికీ జాతకాలు, రాహుకాలాలూ, యమగండాలు చూసే వ్యక్తి ఏ పనీ చేయలేడు. పని జరక్కుండా అడ్డుపడడంతప్ప"

"మొత్తానికి బ్రహ్మాండమైన ప్లాన్ వేశావే. కానీ తన తమ్ముడు పోయాడని ఏడుస్తున్న బామ్మను తలచుకుంటుంటే మాత్రం జాలేస్తోంది"

"ఆ దుఃఖం అంతా ఎంతసేపులే. ఆ ఊరికి వెళ్ళగానే విషయం తెలిసిపోతుంది. తమను ఆటపట్టించడానికి ఎవరో టెలిగ్రామ్ ఇచ్చారని అనుకుంటారు. ఇక భోజనాలు అవీచేసి, కాసేపు ముచ్చట్లాడి బయల్దేరేసరికి సాయంకాలమవుతుంది. ఈలోగా మనది..."

ఇక ఆపై చెప్పలేక ఆమెపై వాలి అలానే గాఢంగా ముద్దుపెట్టుకున్నాడు.

ఆమెకు శరీరమంతా జివ్వున లాగినట్లయింది. సుఖాన్ని కూరిన డైనమేట్లు రక్తంలో పేలినట్లు ఏదో



## షహీన్ ఛాన్స్

**బొం**బాయి నుండి తెలుగులోకొచ్చిన షహీన్, 'యస్ నేనంటే నేనే'లో కృష్ణతో నటిస్తోంది. ఆ సినిమా ఇంకా విడుదల కాకుండానే, మరో కొత్త చిత్రం (కృష్ణుడంటే కృష్ణుడు)లో కృష్ణతోనే నటించే అవకాశం సాధించింది.

షహీన్ చిరునవ్వులో గొప్ప గ్లామర్ వుంది. బాలీవుడ్ తారలమాదిరీ అందాలు చిందించే చొరవా వుంది. అయితే హిందీలో గొప్ప గొప్ప అవకాశాలే వదులుకుందట. ఓ సినిమాకి కాంట్రాక్ట్‌మీద సంతకం చేయబోయేటప్పుడు, ఓ బల్లిని చూసి పెన్ అక్కడ పారేసి, పరుగెత్తి వచ్చేసిందట. తన కెరీర్ గురించి సీరియస్‌గా పట్టించుకోలేదు కనుకే వెనకబడ్డానని చెప్తున్న షహీన్, తెలుగు ఫీల్డు బాగుందంటోంది.



తెలియని పులకరింత ఊపేస్తోంది.

అతను ఆమెను లేవదీసి, బెడ్‌రూమ్‌లోకి నడిపించుకు వెళ్ళాడు. ఇద్దరూ మాట్లాడుకోవడంలేదు. కోరిక క్షణక్షణానికీ పెరిగి మొత్తం శరీరాన్నంతా ఆక్రమించుకుంటోంది. అంతకుముందు తెలియని సుఖం కోసం మనసులు రెండూ వెదుక్కుంటున్నాయి.

ఆమె అలానే బెడ్‌మీద వాలిపోయింది.

స్వర్గం వాకిటముందు పెట్టిన ప్రమిదల్లా ఆమె కళ్ళు మెరుస్తున్నాయి. ఎర్రజీరలతో ఆహ్వానాన్ని రాస్తున్నట్లు అవి అటూ ఇటూ కదులుతున్నాయి. ఎద పొంగి, ఏదో వత్తిడి కోసం చూస్తున్నట్లు మరింతగా బిగుసుకుంది. అతని స్పర్శకోసం తపస్సుచేసి చిక్కిపోయినట్లు నడుం సన్నగా కనిపిస్తోంది.

శృంగార కావ్యాలను రాయడానికి వుంచుకున్న రసాయనాల ఇంకుబుడ్డీలా బొడ్డు లోతుగా వుంది. ఆ పైన జరుగుతున్నదేమిటో అర్థంకాకూడదని కాబోలు చీర మరింతగా మడతలుపడింది.

అతను పక్కగా పడుకుని ఆమెను తనవైపు తిప్పుకున్నాడు. ఒక్కసారిగా కనకాంబరాం పూలతోట పక్కకి ఒత్తిగిలినట్లనిపించింది.

ఆమె మూడంకెవేసి మరింతగా ముడుచుకుపోయి అతనివైపుకి జరిగింది. చేమంతుల పూలమాల శ్వాస తాకిడికి మెలితిరిగినట్లు ఫీలయ్యాడు.

ఇక తాళలేక తన కుడిచేతిని అతనిమీదవేసి గట్టిగా బిగించింది. ఎర్రమందారాలు ఒక్కసారిగా మీద రాలినట్లు పులకరించిపోయాడు.

కన్నెత్తి కోరికతో విశాలమైన ఫాలికేసి చూసింది. నందివర్ధనాల రెమ్మ కళ్ళకు గంతలు కట్టేసినట్లనిపించింది. అతను తమకంతో పెదవులను నుదిటిమీద అన్నాడు. సూర్యోదయం చిట్లి ముఖంమీద పరుచుకున్నట్లు ఉక్కిరిబిక్కిరయ్యాడు.

పెదవులను చెమ్మ చేశాడు-అమృతకలశం పగిలి అమృతమంతా ఒక్కసారిగా గొంతులోకి దిగుతున్నట్లు తబ్బిబ్బయ్యాడు.

కంఠంమీద నాలుకతో రాశాడు-సముద్రంలోని నీలిమ అంతా ఘనీభవించినట్లు నరాలు పొంగాయి.

ఎదమీద తన చెంపను వుంచాడు. మాధుర్యపు తుట్టెని కదిపినట్లయింది.

అక్కడినుంచి కిందకు పాకి బొడ్డులో నాలుకను జొనిపాడు. స్వర్గం ముందున్న కందకంలో దిగినట్లనిపించింది. ఆపై చీరకుచ్చిళ్ళలో ముఖాన్ని గుచ్చాడు. సుఖం లోతెంతో తెలిసింది.

అంతకుముందెప్పుడూ అనుభవంలోకిరాని ఉద్రేకం, క్రితం ఎప్పుడూ చవిచూడని ఉద్వేగం అతన్ని ఊపేశాయి. వేళ్ళు ఎక్కడెక్కడో తిరుగుతున్నాయి. అడ్డంకులన్నీ పూర్తిగా తొలగించడానికే అవి వున్నట్లు వేగంగా కదులుతున్నాయి.

ఆమె దాదాపుగా నగ్నంగా తయారైంది.

అతను కొద్దిగా పైకి లేచాడు.

సరిగ్గా అదే సమయంలో తలుపు చప్పుడైంది. ఇద్దరూ అలా ఫ్రీజ్ అయిపోయారు.

తలుపును ఎవరో బలంగా కొడుతున్నారు.

ఆమె ముందుగా తేరుకుంది. బట్టలన్నీ ఒక్క క్షణంలో సర్దుకుంది.

"ఎవరో వచ్చినట్లున్నారు" చాలా మెల్లగానే అన్నా అందులో కంగారుంది.

"ఎవరై వుంటారు?"

"ఏమో"

మళ్ళీ తలుపు చప్పుడైంది. ఇక తప్పదన్నట్లు ఆమె లేవబోయింది.

"నువ్వొద్దు. నేను వెళ్ళి చూస్తానులే"

"అలానే. ముందు నువ్వెళ్ళు"

అతను పైకిలేచి, క్రాఫ్ సర్దుకుని, ముఖంమీద వాలిన చెమటపొరను తుడుచుకుని, తలుపు దగ్గరికి నడిచాడు.

అక్కడ లైన్‌లో నిలుచుని, అసహనంగా చూస్తున్న సత్యనారాయణరావు గారు, ఆయన భార్య, తల్లి, ముగ్గురు కూతుర్లూ తన ప్రాణాన్ని తీసుకుపోవడానికి వచ్చిన యమదూతల్లా అనిపించారు అతనికి.

సిగ్గు, లజ్జ తప్పుచేస్తూ దొరికిపోయామన్న గిల్టీ నెస్ ఓ క్షణంపాటు అతన్ని కదలనివ్వలేదు.

అంతలో సుజన కూడా వచ్చింది. తల్లిదండ్రుల్నీ, అక్కయ్యలనూ చూడగానే ఏం జరిగుంటుందో సగం అర్థమైంది. వాళ్ళ వెనుక గుండ్రాయిలా అవి పిస్తున్న తాతయ్య కనిపించగానే పూర్తిగా అర్థమైంది.

అప్పటికే ఆలస్యం అయిపోయిందని గ్రహించిన ఆమె తలుపు బోల్టు తీసింది.

"ఏంటమ్మా! ఇంత ఆలస్యం!" ఆమెవైపు, అల్లుడివైపు అనుమానంగాచూస్తూ అడిగాడు సత్యనారాయణ.

ఉమ ఒక్క ఉదుటున చెల్లెలివైపు గెంతి "ఏమే! కొంపదీసి ఫస్ట్‌నైట్ అయిపోయిందా ఏమిటి?" అని చెవిలో నోరుపెట్టి గొణిగింది.

"లేదులేవే. ఇంకాసేపు మీరు రాకుండా వుండుంటే ఛాలెంజ్‌లో నెగ్గుండేవాళ్ళం. కానీ ఖర్మ- మా వంశీ రెండో ప్లాన్ కూడా ఫెయిలయింది"

కూతుళ్ళిద్దరూ గుసగుసలు ఆడుతుండడంవల్ల సత్యనారాయణ తను వేసిన ప్రశ్నకు సమాధానం చెప్పమన్నట్లు అల్లుడివైపు చూస్తుండిపోయాడు.

"ఇప్పుడే వచ్చానండీ. ఇంతలో సుజన వేదాంతం దాని విశిష్టత గురించి చెప్పమంటే ఎక్స్‌ప్లెయిన్ చేస్తున్నాను. ఇంతలో మీరొచ్చారు" వంశీ తడుముకో

## బెంగుళూరు మిరపకాయ పెరుగుకూర

**కావలసిన పదార్థాలు:** బెంగుళూరు మిరపకాయలు అరకిలో, పెసరపప్పు ఒక కప్పు, జీలకర్ర 1 టేబుల్ స్పూన్, ఎర్రమిరపకాయలు 10, తగినంత ఉప్పు.



**తయారుచేసే విధానం:** గంటసేపు పెసరపప్పు నీళ్ళలో నానబెట్టి తర్వాత ఆ పెసరపప్పు, జీలకర్ర, ఎర్రమిరపకాయలు, ఉప్పు అన్నీ మిక్సీలో వేసుకుని ముద్దగా కాకుండా, పలుచగా కాకుండా తీసుకోవాలి. శుభ్రంగా కడిగి వున్న పెద్ద మిరపకాయలన్నీ ముచిక వైపు కాకుండా మరోవైపు నుంచి రెండు పక్షాలుగా వంకాయ గుత్తికూర మాదిరిగా చీల్చుకుని ఈ మసాలాను అందులోపెట్టి, మూకుడులో నూనె కొంచెం ఎక్కువగా పోసి అందులో వేసి, పైన నీళ్ళు చల్లి అది బాగా ఉడికేవరకు పైన మూతపెట్టి మగ్గించి దించి పెరుగులో రెండు పచ్చిమిరపకాయలు, కొంచెం మెంతులు, కొంచెం ఆవాలు, కొంచెం ధనియాలు, కొంచెం ఇంగువ పోపుపెట్టి అందులో ఇవి వేయాలి. పచ్చిమిరపకాయకు ముచ్చిక తీయరాదు. ముచ్చికతో వుంటేనే రుచి. ఈ వంటకం అన్నంలోకి బాగా రుచిగా వుంటుంది. టిఫిన్లలోకి చాలా బాగుంటుంది.

—ఆదుర్తి లత

కుండా నోటికొచ్చిన అబద్ధం చెప్పాడు.

ఛాలెంజ్‌లో సుజన గెలవలేదని ఉమ తన చెల్లెళ్ళ వైపు చూస్తూ సైగచేసింది.

అంతలో బామ్మ ముందుకొచ్చి వంశీతో చెప్పింది "చూడు బాబూ! పిదపకాలం. మా కాలంలో ఇలాంటి మోసాలూ, కుట్రలూ ఎరుగుదుమా! నా తమ్ముడు పీడు- పీడు చచ్చిపోయినట్టు ఎవరో ఆకతాయి కుర్రాడు టెలిగ్రామ్ ఇచ్చాడు. అది నిజమేననుకుని మేం బయల్దేరి వెళ్ళాం. తీరా నెల్లూరు బస్టాండ్‌లో దిగి రాజుంపాలెం బస్సు కోసం చూస్తూవుంటే, మా తమ్ముడు దిగాడు. వాడు ఇక్కడికే రావడానికి బయల్దే రాడట. అందరం కలుసుకుని వస్తున్నాం"

ఆమె ఇంకా చెబుతూనే వుంది. తన పథకం ఎక్కడ బెడిసికొట్టిందో అర్థమైంది వంశీకి. చచ్చి పోయినట్టు తను ఇచ్చిన మనిషే ఇక్కడికి బయల్దేరి, నెల్లూరులోనే కనిపించడంవల్ల వచ్చిన చిక్కు ఇది. ఈయనగారు ఈ రోజే ఇక్కడికి రావడానికి బయల్దే రాలా? ఒరేయ్ వంశీ! నీకు అదృష్టం కలిసిరాలేదురా అని తనకు తానే సర్దిచెప్పుకుని, అక్కడినుంచి తేలు కుట్టిన దొంగలా నిశ్శబ్దంగా అడుగువేయబోయాడు.

మామ కంఠం కోపంలో బాగా కాలి ఖంగున మోగ డంతో ఆగిపోయాడు.

"ఇదంతా చేసింది ఎవరో నేను ఊహించగలను. మద్రాసులోని చిట్టిబాబే ఇంత నికృష్టానికి పాల్పడి వుంటాడు. సబ్‌ఇన్స్‌పెక్టర్ శరవణన్‌తో చెప్పి ఈసారి వాడికి సరిగ్గా బుద్ధి వచ్చేట్టు చేస్తాను" అంటూ ఆవే శంతో ఊగిపోతున్నాడు.

పోలీసు అధికారి అయిన శరవణన్ మద్రాసునుంచి తమ పెళ్ళికి రావడం, ఊరెళుతూ తనతో అన్న మాటలు తక్కున గుర్తొచ్చాయి వంశీకి. ఇప్పుడు తన మామయ్య చెప్పిన చిట్టిబాబుకి తమ పెళ్ళితో ఏదో లింక్ వుండి వుంటుందనిపించింది. అయితే ఆ లింక్ ఏమిటో ఊహకైనా అందడంలేదు. అందుకే ప్లాట్‌గా చూస్తూ వుండిపోయాడు.

అతనిని గమనించిన సత్యనారాయణరావుకి తన తప్పు ఏమిటో తెలిసింది. ఏదో ఆవేశంలో చిట్టిబాబు పేరెత్తాడుగానీ గొడవంతా అల్లుడికి తెలిస్తే వచ్చే ముప్పు ఊహించలేకకాదు.

ఇప్పటికైనా తన తప్పును సరిదిద్దుకోవాలని అల్లుడివైపు తిరిగి, "చిట్టిబాబు మా బంధువుం అబ్బాయి. ఒట్టి ఆకతాయి వెధవ. ఏదో సరదాగా ఇలా టెలిగ్రామ్ ఇచ్చి వుంటాడు" అని చెప్పాడు.

ఆయన ముఖంలో కనిపిస్తున్న కంగారుని పసి కట్టాడు వంశీ. తనకు తెలియకుండా ఏదో విషయాన్ని మామయ్య దాస్తున్నాడని గ్రహించాడు.

అంతవరకు వంశీ కరెక్టే!

•  •  •

"సుజనా! ఏమిటి నువ్వడుగుతోంది! నా ఫస్ట్‌నైట్ గురించి చెప్పాలా?"

సుజన అలా అడుగుతుందని మాలిని ఊహించ లేకపోయింది. మొదటిరాత్రి ఏం జరిగిందో చెప్పమని ఎవరూ అడగరు. తమ శోభనాన్ని గురించి మరొకరికి

చెప్పాల్సిన అవసరం కూడా రాదు. అందుకే ఆమె నమ్మలేనట్లు మరోసారి అడిగింది.

కుషన్‌కుర్చీలో గోధుమ పంటచేలు ఒదిగిపోయినట్లు ఆమె మెరిసిపోతోంది. వయసుకు మించి పెరిగిన అవయవాలను చూస్తూనే ఆమె గొప్పింటికి చెందినదానిలా అనిపిస్తుంది. ముఖ్యంగా ఆమె ఎద. పల్చటి బంగారు రేకులో పూలంచెండ్లను మడిచినట్లుంటుంది. రకరకాం పూలంచెట్లుండే నర్సరీలోకి అడుగుపెడుతూనే ఎలా ఉక్కిరిబిక్కిరవుతామో ఆమెను చూసినప్పుడు కూడా అలాంటి అనుభూతే కలుగుతుంది.

"ఆఁ"

"భోజనాలు చేసేప్పుడు సాధారణంగా రకరకాల వంటలు గురించి మాట్లాడుకుంటాం. అలా నువ్వు ఆ మూడ్‌లో వున్నావు కనుక అవే వివాలని అడుగుతున్నట్లుంది" అంది మాలిని.

"అవుననుకో"

"అయితే చెబుతాను శ్రద్ధగా విను" అంటూ చెప్పుకుపోతోంది మాలిని.

"మాది ఆత్మకూరుకు దగ్గరుండే పల్లెటూరు. డిగ్రీ వరకు చదువుకున్నాను. నేను ఒక్కదాన్నే సంతానం కనుక ఇంటర్‌నుంచి నాకు పెళ్ళి చేయాలని సంబంధాలు చూడడం మొదలుపెట్టారు.

కానీ అమ్మానాళ్ళకు ఎవరూ నచ్చేవాళ్ళు కారు. ఉద్యోగం వున్నవాడికి తోబుట్టువులు ఎక్కువనో. ఎవరూ లేనివాడికి ఉద్యోగం లేదనో- ఇలా వచ్చిన ప్రతి సంబంధాన్ని ఎగరగొట్టేసేవాళ్ళు. ఈ పెళ్ళిచూపుల గోల లేకుంటే ఎలా వుండేదాన్నో తెలియదు గానీ, పెళ్ళి ఆలోచన మొదలవడంతో తోడు కోసం మనసు యాగీ చేయడం ప్రారంభించింది. వయసు ఒక్కసారిగా చిన్నపిల్లలా అయిపోయి ఏదేదో కావాలని అల్లరిచేయడం ప్రారంభించింది. అనవసరంగానే అయినా ఒక్కొక్కసారి ఫక్కున నవ్వేదాన్ని. మరోసారి కారణం లేకుండానే దిగులుగా అయిపోయేదాన్ని. ప్రపంచాన్నంతా మడిచి గుండెల్లో కూరుకున్నట్లు వెలాకీగా వుండేదాన్ని. అంతలోనే ఏదో అయిపోయినట్లు నిశ్శబ్దంలో గడ్డ కట్టుకుపోయేదాన్ని. ఈ మార్పుల్ని అదృష్టంకొద్దీ అమ్మా నాన్న గుర్తించలేదు.

ఇలా మనసు ఊసరవెల్లిలా అయిపోయిన సమయంలో అనంత్ మా ఇంటికొచ్చాడు.

అతను మాకు దూరపుబంధువు. నెల్లూరు ఆర్టీసీ డిపోలో మంచి ఉద్యోగం. కోవూరు దగ్గర పల్లెటూరు. అతనికి సొంతంగా ఓ ట్రాక్టర్ వుండేది. మా ఊర్లో పొలం దున్నడానికని ట్రాక్టర్ పంపించాడు. డ్రైవర్ దగ్గర లెక్కలు చూసుకుని, డబ్బు తీసుకుపోవడానికి అతను మా ఊరొచ్చాడు. మేము తప్ప మరొక బంధువు లేకపోవడంతో ఇంటికొచ్చాడు.

నేనున్న పరిస్థితివల్ల కాబోలు అతనిమీద ఇష్టం కలిగింది. పైపై మెరుగులు చూసి ఇష్టపడడం ప్రేమ కాదని, అది కేవలం ఆకర్షణ అని, ప్రేమకు కావలసింది ఒకరినొకరు అర్థం చేసుకోవడమనీ అంటుంటారు. కానీ, ఇదంతా ఒట్టి దొంగమాటలనుకుంటాను.



## తరగని సెక్సీ చమక్!

'లీడర్' చిత్రంలో సుమన్, హీరోయిన్ ప్రియారామన్‌తోపాటూ ఓ పాటలో విందులేస్తోంది జయలలిత. చూపులతో, హావభావాలతో సెక్సీ చమక్కులు మెరిపించే నటి తరగని జయలలిత కెరీర్ గ్రాఫ్. మళ్ళీ నెమ్మదిగా అవకాశాల ఉపిరితో పైకి సాగుతోంది.

బెడిసిన వివాహబంధం తర్వాత, ఈ కొత్త అవకాశాలు తెచ్చిన ఆనందం నూతనోత్సాహాన్ని అందిస్తోందేమో-చాలా హుషారుగా తన సోయగాలు ప్రదర్శిస్తూ నటించేస్తోంది జయలలిత!

ఒకరికొకరు పరిచయం కావడం, ఒకర్ని ఒకరు అర్థం చేసుకోవడం, ఆ తరువాత ప్రేమించడం-ఇదంతా ఎంత నాన్సెన్స్‌గా వుంటుందో ఆలోచించు.

కొంతకాలం పరిచయంతో అర్థంచేసుకోవడం అనేదే సులభమైతే భార్యాభర్తలు ఎలా వుండాలి? కానీ అలా వుంటున్నారా? ఒకరికొకరు అర్థం కావడమన్నది ఎప్పుడూ జరగదు. మహాఅయితే రాజీపడతాం- అంతే. ఎవరి టెంపరమెంట్ వాళ్ళదే. ఎవరి అభిరుచులు వాళ్ళవే. కుటుంబం సాఫీగా సాగడానికి ఎదుటివ్యక్తి అభిరుచుల్ని గౌరవించినట్లు నటిస్తాం.

అతన్ని ఇష్టపడడానికి కారణం నేనున్న పరిస్థితి. ఎదుటివ్యక్తి గొప్పతనంకన్నా నా అవసరం నన్ను పురికొల్పింది. అందుకే మొదటిరోజు అతనిని తప్పించుకు తిరిగినదాన్ని, రెండోరోజుకల్లా అతనికి ఎదురుపడడానికి తెగ ఉత్సాహం పడిపోయాను.

అప్పుడు మా అమ్మకి కంటి ఆపరేషన్ జరగడం నాకు కలిసొచ్చింది. నేనే వడ్డించేదాన్ని. మామధ్య మాటలు కలిశాయి.

నిజంగా పని వుండింతో, లేక నా కోసమే ఆగిపోయాడో తెలియదుగానీ పదిరోజులపాటు అతను వుండిపోయాడు. చూపుల్లోకి మా అభిమానాన్ని అనువదించుకున్నాముతప్ప డైరెక్టుగా చెప్పుకోలేదు.

అతను వచ్చినప్పట్నుంచీ మా అమ్మకు ఆలోచన కలిగినట్లుంది. అతను వెళ్ళగానే నాన్నతో అమ్మ విషయం కదిపింది.

'కుర్రాడు బావున్నాడు. ఎం.ఏ. చదివాడు. ఉద్యోగం వుంది. ఒక్కడే కొడుకు. ఆస్తి బాగానే వుంది. వెళ్ళి విషయం తెలుసుకురండి'

నాన్న బయల్దేరి వెళ్ళి వచ్చాడు. ఆయన వాకిట్లోకి రాగానే అమ్మ హడావుడిగా ఎదురెళ్ళి 'పండా? కాయా?' అని అడిగింది. సారాంశం అంతా వివరంగా వినే వీలులేనంత టెన్షన్‌లో వుంది.

' పండే'

నేను కూడా తుళ్ళిపడ్డాను.

మరోసారి అతను కొత్తగా పెళ్ళిచూపులకని వచ్చాడు. రాగానే బాత్రూమ్‌కి తీసుకెళ్ళి కాళ్ళు కడుక్కోవడానికి చెంబుతో నీళ్ళిచ్చాను.

చెంబు అందుకుంటూ 'నిన్ను చూడాలనే వచ్చాను' అన్నాడు మెల్లగా. నేను సిగ్గురెక్కల్ని కట్టుకుని తూనీగే అయిపోయాను. కిచెన్‌లోకి పరిగెత్తాను.

భోజనాల సమయానికి కొంత సర్దుకున్నాను. అప్పటికీ మా అమ్మ కళ్ళకున్న కట్లు విప్పకపోవడంతో వడ్డనంతా నేనే చేశాను. సాయంకాలం అతను వెళ్ళిపోయాడు.

అన్నీ కుదిరి పెళ్ళి నిశ్చయమైంది.

ఆత్మకూరులోని ఓ సత్రంలో పెళ్ళి జరిగిపోయింది. మధ్యాహ్నం మూడుగంటలకి బయల్దేరి ఊరికొచ్చాం. మా వెంట ఓ పదిమందిదాకా బంధువులొచ్చారు. నాలుగు గంటలనుంచే వంటలు ప్రారంభమయ్యాయి. ముందు గదిలో అనంత్, చివరిగదిలో నేనూ వుండిపోయాం.

'ఈ రోజు సూర్యాస్తమయం జరగకుండా, రాత్రి రాకుండా వుంటే ఏమవుతుంది? ఫస్ట్‌నైట్ వుంటుందా? వుండదా?'లాంటి చిలిపి చిలిపి ఆలోచనల్లోనే సాయంకాలం కరిగిపోయింది.

రోజూ రాత్రి వస్తుందికానీ ఆ రాత్రి మాత్రం చాలా డిఫరెంట్‌గా వుండడం గుర్తించాను. ఆ రాత్రికి ఏదో సుగంధం వున్నట్లే వుంది. ఆ చీకట్లకు ఏదో తెలియని మెరుపు కవచంలా వున్నట్లే తోచింది. ఆ రాత్రి ముసుగుదొంగలా కాకుండా, మాకు అలసట వచ్చినప్పుడు జోలపాట పాడడానికి వచ్చిన గంధర్వుడిలానే అనిపించింది. ఆ రాత్రి ఆకాశం తారుడబ్బాలా కాకుండా చమ్కీలు పొదిగిన నీలంరాయిలా కనిపించినట్టే వుంది. గాలి కూడా కొత్తగా వీస్తోంది.

తొమ్మిది గంటల ప్రాంతాన మమ్మల్నిద్దరినీ కూర్చోబెట్టి నలుగుపెట్టారు. ముసలి ముత్తైదువలు నా కంఠానికి గంధం రాస్తున్నప్పుడు అతనే స్వయంగా చక్కిలిగింతలు పెట్టినట్లనిపించిందంటే నేనెలాంటి స్థితిలో వున్నానో ఊహించు.

చివరన ఓ ముసలామె పాటెత్తుకుంది. ఇలాంటి సమయాల్లో ఎవరో ఒకరు పాట పాడడం ఆచారం. ఎవరైనా ఓ పాట పాడండి అని మా అమ్మ అనగానే ఆమె పాటందుకుంది. గొంతులో నుంచి ముళ్ళకంపను లాగినట్లు కర్ణకఠోరంగా వుంది ఆ పాట. ఆ రోజు ఏమైనా బాగా లేదనిపించిందంటే అదే. అయితే ఆమె గొంతు అలా వుందో, లోపలికి వెళ్ళాలని నాకు తొందరగా వుండడంవల్ల అలా అనిపించిందో తెలియదు. ఎలాగైతేనేం మరో అయిదునిముషాలకి పాట ముగిసింది. నన్ను వంటగదిలోకి తీసుకెళ్ళి పాలగ్లాసు అందించారు.

(ఇంకావుంది)

# ఉబ్బస నివారిణి హైదరాబాద్ చేపమందు

**ఆంధ్ర రాష్ట్ర ప్రభుత్వం వారిచే గుర్తింపు పొంది ప్రశంసింపబడి లయన్స్, రోటరీ గవర్నర్లచే ప్రశంసాపత్రాలు, "ఎక్సలెన్సీ అవార్డు" పొందిన డాక్టర్ ఎస్.కె.వలీ గారి హైదరాబాద్ చేపమందు.**



డాక్టర్ ఎస్.కె. వలీ

సర్వ ఉబ్బస రోగులకు గత 29 సంవత్సరముల నుండియూ అపారమైన సేవచేసి రోగుల మన్ననలందుకొనుచున్న ప్రసిద్ధ డాక్టరు ఎస్.కె. వలీగారు గతంలోవలెనే ఈ సంవత్సరము కూడా మృగశిరకార్తె ప్రవేశ దినములైన 8-6-94వ తేదీ బుధవారం మరియు 9-6-94వ తేదీ గురువారంలలో ఉ. 7-00 గం.ల నుంచి రాత్రి 7-00 గంటల వరకు ఈ దిగువ కనబరచిన స్థలములలో మందు డాక్టరుగారి ద్వారాను, వారి అసిస్టెంట్‌ల ద్వారాను ఇవ్వబడును. గాన రోగులు ఈ సదవకాశమును వారివారి మంచి కొరకు వినియోగించుకొనవలసిందిగా మనవి చేయుచున్నాము.

చేపమందు చికిత్స రుసుము రూ. 55-00

అదనపు నాలుగు వారముల చికిత్స రుసుము రూ. 55-00 అదనము. వ్యాధి తీవ్రతను బట్టి మందు సూచించబడును.



డాక్టర్ ఎస్.ఎం.డి. షఫీ
ఎయిడ్స్‌లో "గోల్డ్‌మెడలిస్ట్"

## మందు ఇవ్వబడు స్థలములు

| | | ఫోన్ నెంబర్లు |
|---|---|---|
| 1. హైదరాబాద్ | : ది రాయల్ హోటల్ (హోటల్ రాజమాత), రైల్వేస్టేషన్ ఎదుట, నాంపల్లి, హైదరాబాద్ | 201000 |
| 2. ఇచ్ఛాపురం | : శ్రీ రామా లాడ్జి, హాస్పిటల్ రోడ్ | 322 |
| 3. పార్వతీపురం | : శ్రీ హరివాస్ లాడ్జి, ఆర్టీసీ కాంప్లెక్స్ వద్ద | 61354 |
| 4. శ్రీకాకుళం | : రాజా లాడ్జింగ్, జి.టి. రోడ్ | 2097 |
| 5. విజయనగరం | : హోటల్ శ్రీలక్ష్మి, ఎం.జి.రోడ్ | 3803 |
| 6. విశాఖపట్నం | : హోటల్ ఆనంద్, జగదాంబ బిల్డింగ్ | 63107 |
| 7. గుంతకల్ | : ఉమా లాడ్జి, విజయా బ్యాంక్ ఎదుట | 6655 |
| 8. అనంతపురం | : హోటల్ భీమా లాడ్జి, ఆర్టీసి బస్‌స్టాండ్ దగ్గర, శ్రీ కంఠం టాకీసు ఎదురుగా | 21531 |
| 9. వరంగల్ | : హోటల్ శాంతికృష్ణ, హెడ్‌పోస్టాఫీసు వెనుక | 25305 |
| 10. ఖమ్మం | : హోటల్ కిన్నెర, బస్‌స్టాండ్‌వద్ద | 8369 |
| 11. కొత్తగూడెం | : హోటల్ లేపాక్షి, రైల్వేస్టేషన్ దగ్గర | 2229 |
| 12. కరీంనగర్ | : లక్ష్మీ లాడ్జి, మార్కెట్ రోడ్డు | 2964 |
| 13. ఆదిలాబాద్ | : అయోధ్య లాడ్జి, అంబేడ్కర్ చౌక్ | 697 |
| 14. మెదక్ | : లావణ్య లాడ్జి, మెయిన్ రోడ్ | 576 |
| 15. మహబూబ్‌నగర్ | : అజీజియా లాడ్జి, పాత బస్‌స్టాండ్ | 2288 |
| 16. నల్గొండ | : హోటల్ మీనాక్షి, క్లాక్‌టవర్ ఎదుట | 2376 |
| 17. నిజామాబాద్ | : అశోకా లాడ్జి, స్టేషన్‌రోడ్ | 21568 |
| 18. భీమవరం | : హోటల్ సవేరా లాడ్జి, వెంకట్రామ థియేటర్ ఎదుట, మెయిన్‌రోడ్ | 4532 |
| 19. కాకినాడ | : ద్వారకా లంచ్‌హోం, మెయిన్‌రోడ్ | 73097 |
| 20. రాజమండ్రి | : శాంతినివాస్, మెయిన్‌రోడ్ | 76788 |
| 21. ఏలూరు | : వసంతమహల్, జిఎన్‌టి రోడ్ | 20090 |
| 22. మచిలీపట్నం | : హోటల్ ఆర్.ఆర్. భవన్, బస్టాండ్ ఎదుట | 3366 |
| 23. విజయవాడ | : హోటల్ మోనిక లాడ్జి, పోలీస్ కంట్రోల్ రూమ్ వెనుక | 61334 |
| 24. గుంటూరు | : శ్రీ అజంతా లాడ్జి, సరస్వతీ పిక్చర్ ప్యాలెస్ ఎదుట | 21185 |
| 25. నరసరావుపేట | : శాంతినివాస్ లాడ్జి (ఎ.సి.), మెయిన్ రోడ్ | 22906 |
| 26. మాచర్ల | : శ్రీ కామధేను లాడ్జి, మెయిన్ రోడ్ | 2219 |
| 27. ఒంగోలు | : హోటల్ పూర్ణిమ, కర్నూలు రోడ్ | 3366 |
| 28. నెల్లూరు | : రాఘవ విహార్, ఎ.సి. సుబ్బారెడ్డిగారి బిల్డింగ్ వద్ద | 6954 |
| 29. తిరుపతి | : గోకుల్ లాడ్జి, టి.టి.డి. బస్టాండ్ ఎదుట, 113 టి.పి.ఏరియా | 22254 |
| 30. చిత్తూరు | : ఎంఎస్ఆర్ లాడ్జి, హైరోడ్ | 3792 |
| 31. కడప | : బాలాజీ లాడ్జి, బాలాజీ థియేటర్ ఎదుట, మద్రాసు రోడ్ | 42111 |
| 32. కర్నూలు | : చంద్రా లాడ్జి, పార్కురోడ్ | 20739 |
| 33. నంద్యాల | : మీనాక్షి లాడ్జి, రైల్వేస్టేషన్ రోడ్ | 2909 |
| 34. ఆదోని | : న్యూ శ్రీనివాస భవన్, పి.ఎన్.రోడ్ | 2014 |
| 35. బద్వేల్ | : వలీ క్లినిక్, ఆర్టీసి బస్‌స్టాండ్ ఎదుట | 2159 |

పై సెంటర్లతోపాటు మృగశిర కార్తె ప్రవేశ దినములైన 8-6-94, 9-6-94 తేదీలలో ఒరిస్సా, మధ్యప్రదేశ్‌లలోని ముఖ్యపట్టణాలలో మా డాక్టర్ ఎస్.కె.వలీగారి హైదరాబాద్ చేపమందు ఇవ్వబడును.

గమనిక: డాక్టర్ వలీగారిని సంప్రదించదలచినవారు 8-6-94న గుంటూరు సెంటర్ (ఫోన్: 21185), 9-6-94న విజయవాడ సెంటర్ (ఫోన్: 61334) నందు కలవవచ్చు. డాక్టర్ వలీగారి కుమారుడు డాక్టర్ ఎస్.ఎం.డి. షఫీ M.D. (Ay) గోల్డ్‌మెడలిస్ట్ in aidsగారిని 8-6-94, 9-6-94 తేదీలలో హైదరాబాద్ సెంటర్ (ఫోన్: 201000) నందు కలవవచ్చు.

డాక్టర్ ఎస్.కె. వలీ (రిజిస్టర్డ్ నెం: 413), ఫోన్: 48241, పోరుమామిళ్ళ (పోస్టు), కడప జిల్లా (ఆంధ్రప్రదేశ్) పిన్: 516 193.

డాక్టర్ ఎస్.ఎం.డి. షఫీ M.D. (Ay) ఆస్త్మా స్పెషలిస్టు, ఎయిడ్స్‌లో "గోల్డ్‌మెడలిస్ట్", S/o డాక్టర్ ఎస్.కె. వలీ, వలీ క్లినిక్, బద్వేల్ - 516 227. ఫోన్: 2159, కడప జిల్లా (ఆంధ్రప్రదేశ్)

ARUNA

**ఎయిడ్స్, సుఖవ్యాధులు, షుగర్, బ్లడ్ ప్రెషర్, కీళ్ళనొప్పులు, పక్షవాతం, ఆస్త్మా, పోలియో మొదలైన దీర్ఘరోగములకు ఉత్తమ చికిత్సలకు ఎయిడ్స్‌లో గోల్డ్‌మెడలిస్ట్ డాక్టర్ ఎస్.ఎం.డి. షఫీ, S/o ఎస్.కె.వలీగారిని పై అడ్రసునందు సంప్రదించండి.**

సీరియల్



# రారా నా ఇంటిదాకా

-మేర్లపాక మురళి

మెల్లగా అడుగులో అడుగు వేసుకుంటూ బయల్దేరాను. చుట్టూ వున్న స్నేహితురాళ్ళు ఏవేవో జోక్‌లు వేస్తుంటే ఊపిరి కూడా వేడెక్కినట్లనిపించింది. సిగ్గు, భయం మధ్య శరీరం వణుకుతోంది. కనురెప్పల మధ్యపడ్డ కాలం క్షణాలై చిట్లుతోంది.

నా వెనుక ఆలీబాబా నలభై దొంగలు సినిమాలో లాగా తలుపు శబ్దంచేస్తూ మూసుకుపోయింది.

"వెల్‌కమ్ టు హెవెన్"

కళ్ళతో నవ్వడం అంటే అదే కాబోలుననిపించింది అనంత్‌ను చూస్తుంటే.

నేనూ కళ్ళతో నవ్వడానికి ప్రయత్నించాను కానీ ఏదో తెలియని సిగ్గు అడ్డంపడుతోంది.

అతనే లేచి నాకు ఎదురొచ్చాడు.

నా చేతిలోని పాలగ్లాసు తీసుకుని చేయి పట్టుకున్నాడు. పులకరింత నాలో పాలపుంతై విచ్చుకుంది.

నడిపించుకుంటూ వెళ్ళి మంచంమీద కూర్చోబెట్టాడు. మేం ఏ స్థితిలో వున్నామో చూడడానికి ఆకాశం మునికాళ్ళమీద నిలబడి చూస్తున్నట్టు అనిపించింది. అందుకే లేచివెళ్ళి కిటికీ మూసివచ్చాను.

"ఏం! అంత తొందరగా వుందా?" అనడిగాడు.

"దేనికి?"

"తెలియదా? అమ్మదొంగా?"

తెలియదన్నట్లు తల ఊపాను.

పక్కన కూర్చుని భుజంమీద చేతులేశాడు. అలవోకగా జరిగినట్లు నా కుడిభాగాన్నంతా అతనికి ఆనించాను. నా ఎదలో కొంతభాగం తగులుతున్నట్లుంది. కోరిక కళ్ళల్లో కాగడాలై లేస్తోంది.

మరికొంత అదిమాను. నరాలు చిట్లడం నాకు వినిపిస్తోంది. అతనూ నావైపు జరిగాడు. నా ఎద కుడిభాగం, అతని ఛాతీని పూర్తిగా కప్పేసింది.

ఇక ఆగలేక అతను కౌగిలించుకున్నాడు. ఒళ్ళంతా అగ్నిగుండంలా అయిపోయింది. అతని ఊపిరి నా కంఠాన్ని నాక్కుతోంది. వేళ్ళు ఎక్కడెక్కడో పియానో మీద ఆడుతున్నట్లు నర్తిస్తున్నాయి. నా పెదవులను నోట్లోకి తీసుకున్నాడు. అమృతభాండంలో వుంచిన స్ట్రానే అయింది నా నాలుక.

'నాకు వినెక్ జాకెట్లకన్నా లోనెక్ జాకెట్లంటేనే ఇష్టం' అన్నాడు.

'ఎందుకట?'

'లోనెక్ జాకెట్ అయితే ఓ సదుపాయం వుంది. అదేమిటంటే పోస్ట్‌డబ్బాలో ఉత్తరమేసినట్లు...' అని ఏం చేయచ్చో అతని చేయే చెప్పింది.

నేను నవ్వాపుకోలేకపోయాను.

'ఇప్పుడేమనిపిస్తోందో తెలుసా?'

ఏమిటన్నట్లు కళ్ళు ఎగరేశాను.

'అసలు జాకెట్టే లేకుండా వుండే మరింత బావుందనిపిస్తోంది' అనడం తరువాయి ఆ పని చేశాడు.

'స్వర్గం ముందుండే ద్వారపాలకుల చేతుల్లో వుండే డాలులాంటిది ఈ బ్రా'

నేను సిగ్గుతో కళ్ళు మూసుకున్నాను.

ఇప్పుడు నా పైభాగంలో నూలుపోగులేదు.

'పడుముకి గరిమునాభి ఎక్కడో చెప్పుకో చూద్దాం'

తల అడ్డంగా ఊపాను.

'ప్రశ్నలోనే జవాబుంది. నాభి-అదే బొడ్డు'

చీర కుచ్చిళ్ళు అతని చేతిలో చిక్కాయి. ఇక ఆ తరువాత ఏం జరగబోతుందో ఊహించేసరికి సిగ్గు ముంచుకొచ్చింది.

'లైటు' అన్నాను, కళ్ళతోనే పైకి చూపిస్తూ.

'లైటు వుండనీ-చీకట్లో అయితే నల్లగా పుడతారట పిల్లలు'

'మీలాంటివాడే లైట్ వుండాలని అలా చెప్పి

9 వంశీ, సుజనల పెళ్ళవుతుంది. శోభనం ముహూర్తం దగ్గర పడిందనగా సుజనకు 'మూడు రోజుల' ఇబ్బంది ఎదురవుతుంది. ఆ మూడు రోజులూ వీలుకాదుకనుక మరో ముహూర్తం చూస్తాడు సుజన తండ్రి. కానీ ముహూర్తానికి ముందే తమ శోభనం జరుపుకోవాలనే ప్లాన్‌లో వుంటుంటారు వంశీ, సుజనలు. అందుకు వంశీ వేసిన రెండు పథకాలూ విఫలమౌతాయి.

సుజన అభ్యర్థనమేరకు తన ఫస్ట్‌నైట్ గురించి చెప్తూంటుంది మాలిని. డిగ్రీవరకు చదువుకున్న మాలినిది ఆత్మకూరు దగ్గర్లోని ఓ పల్లెటూరు. ఓసారి మాలిని ఇంటికి వస్తాడు వాళ్ళ దూరపు బంధువు అనంత్ అతనికి ఆర్టీసీ డిపోలో ఉద్యోగం.

అతనిది కోవూరు దగ్గర పల్లెటూరు. ఆస్తిపరుడైన అనంత్‌కి ఓ ట్రాక్టర్ కూడా వుంది. ఆత్మకూరులో పొలందున్ని డబ్బులు తీసుకోవడానికి అక్కడ బంధువులెవరూ లేకపోవడంతో మాలిని ఇంటికి వస్తుండేవాడు అనంత్. అతనితో మాలిని పరిచయం ప్రేమగా మారుతుంది. తల్లిదండ్రుల అంగీకారంతో ఆత్మ కూరులోని ఓ సత్రంలో మాలినీ, అనంత్‌ల పెళ్ళవుతుంది. ఆ రోజు రాత్రి శోభనానికి అన్ని ఏర్పాట్లు సిద్ధంచేస్తారు పెళ్ళిపెద్దలు.



భార్యని బోల్తాకొట్టించి వుంటాడు'

'నాకైతే ఈ సిక్స్‌టీ ఓల్ట్ బల్బుకన్నా బార్ లైట యితే మజాగా వుంటుందేమోననిపిస్తోంది'

'వద్దు-జీరో వాల్ట్ అయితేనే థ్రిల్లింగ్‌గా వుంటుంది. మనకు మరీ అవసరమైన దానిని వెతుక్కోవడం బావుంటుందికదా'

'నాకూ ఇష్టమే. నీళ్ళ మధ్యన వున్న ఫీలింగ్ కలుగుతుంది'

అనంత్ లేచి పెద్ద లైట్ ఆర్పి, జీరో వాల్టు బల్బు వేశాడు. ట్రాన్స్‌పరెంట్ వెలుగుతో ఆ గది చీకటి నుదుటున అంటించిన స్టిక్కర్‌లా వుంది.

మరో రెండు నిముషాలకి పూర్తి నగ్నంగా వున్నాను.

అతని పెదవులు నా కళ్ళనుంచి అన్నిటినీ రాస్తు న్నాయి. అతని స్పీడ్‌నిబట్టే అతనెంత కోరికతో వున్నాడో తెలుస్తోంది.

'స్పీడ్ లిమిట్ ఓన్లీ ఫార్టీ కిలోమీటర్స్' అన్నాను.

అతను నవ్వాడుగానీ దానిని పాటించడానికి కుదర డంలేదు. శరీరం అతని వశంతప్పి చాలాసేపైంది. అతని ముఖం నా నడుంలో కూరుకుపోతోంది.

'వ్యాలీ ఆహెడ్... గో స్లో' పరవశంగా అన్నాను కిలకిలా నవ్వుతూ.

ఎప్పుడైతే నగ్నంగా మారిపోయానో ఆ క్షణం నుంచి సిగ్గు ఆవిరైపోయింది.

అతను ముందుకు దూసుకుపోతున్నాడు.

రేసుల్లో పోటీపడే గుర్రం పరుగే అయింది అతని దూకుడు. కాలం అతని ముఖంలో చెమటబిందువై నిలిచి పోయింది. గాలి మా బెడ్ చుట్టూ ప్రదక్షిణాలు కొడుతూ శోషవచ్చి పడిపోయింది.

నేనూ ద్వారపాలకుల దగ్గరికివచ్చి స్వర్గంలోకి వెళ్ళకుండా ఆగిపోయినట్లనిపించింది.

అనంత్ అలసటలో పక్కన పడుకుండిపోయాడు.

మరో అయిదు నిముషాలు గడిచే వరకు ఇద్దరం మాట్లాడుకోలేదు.

మెరుస్తున్న కళ్ళతో నావైపు తిరిగి 'పెళ్ళయింది- శోభనం కూడా జరిగిపోయింది. ఇలాంటి సమ యంలో ఎలుగెత్తి ప్రపంచానికి ఏదో చెప్పాలనిపిస్తూ వుంటుంది. నువ్వయితే ఏం చెబుతావ్?' అని అడిగాడు.

అతనన్నది నిజమే. నాకూ చెప్పాలనిపిస్తోంది. అందుకే ఏమీ మొహమాటం లేకుండా చెప్పాను.

'స్పీడ్ లిమిట్ తెలియని నీలాంటి కుర్రాడికి పడక ఎక్కేముందు బెడ్‌రూమ్‌లో ఓ అరగంటపాటు గోడ కుర్చీ శిక్ష వేయించాలి'

పాపం అనంత్ చిన్నబుచ్చుకున్నాడు. కానీ అర్థం చేసుకున్నాడు కనుక రెండో రాత్రి నుంచి ఆ శిక్ష తప్పించుకున్నాడు.

• • •

చిట్టిబాబుది మద్రాసు. సుజన చదువుకునే రోజుల్లో ఆమె ఎదురింట్లో వుండేవాడు. అతని నాన్న ఏదో బిజినెస్ చేసేవాడు. ఒక్కడే కొడుకు కావడంవల్ల అతిగారాబంగా పెరిగాడు. ఎప్పుడూ స్టైల్‌గా త్రిబుల్ ఫైవ్ సిగరెట్ల ప్యాకెట్టులా వుండేవాడు. నాగరికతంతా పాశ్చాత్యదేశాలది. ఫారిన్ సిగరెట్లూ, ఫ్రెంచి సెంట్లూ, జర్మన్ జీన్స్-ఇలా మనిషినే ఇంపోర్ట్ చేసుకున్నారేమో అన్నట్లు వుండేవాడు. అతన్ని మొదటిసారి చూసినప్పుడు కలిగే ఫీలింగ్ అది. అయిదు నిముషాలు మాట్లాడితే మాత్రం అతను 'ఎక్సెంట్రిక్' అని ఎవరూ చెప్పకపోయినా తెలిసిపోతుంది.

ఎవర్నో ఒకరిని ప్రేమించాలి అని అతను గాఢంగా అనుకునేటప్పటికి సుజన కనిపించింది. రకరకాల పువ్వులను నియిపుగా నిలబెట్టినట్టుండే ఆమెను చూడగానే అతను ప్రేమలో పడిపోయాడు.

రోజూ ఆమె కాలేజీకి వెళ్ళడానికి బయల్దేరగానే ఇతనూ తన మోటార్‌బైక్‌ని బయటికి తీసేవాడు. ఆమెను అతి స్పీడ్‌గా క్రాస్‌చేసి, హారన్ మోగించేవాడు. బస్సెక్కేవరకు బస్టాప్ ఎదురుగా వున్న టీ బంక్‌లో కూర్చుని అదేపనిగా కాఫీలు, సిగరెట్లు తాగుతూ చూపులను నిలబెట్టేవాడు.

తనను ఎవరైనా గమనిస్తున్నారేమోనని పరిశీలించే ఉత్సుకత సాధారణంగా ఎవరికైనా వుంటుంది. కానీ సుజనలాంటి ఏ కొద్దిమందో అలాంటివాటిని అధిగమించి వుంటారు. అందుకే ఆమె అతని ప్రవర్తనను గమనించలేకపోయింది.

ఆమె అలా వున్నా ఇతనేమాత్రం పట్టించుకోలేదు. మామూలు కుర్రాడయితే అంతటితో ఆపేసి వుండేవాడు. కానీ చిట్టిబాబు మాత్రం అలాకాదు. ఏదైనా సరే తనకు అందేవరకు అతను పట్టు వదలడు.

కొన్ని రోజులకి హారన్ మోగించడానికి బదులు 'హాయ్' అని వెనకనుంచి పిలవడం మొదలుపెట్టాడు.

అప్పటికి అర్థమైంది సుజనకు. అతను తమ ఎదురింట్లో వుండేవాడని తెలిసింది. అతను శ్రుతి మించకుండా కాస్తంత నిర్లక్ష్యంగా ప్రవర్తించేది. దీన్ని అతను సహించలేకపోయాడు. చిన్నప్పట్నుంచీ ఏది కోరుకున్నా క్షణంలో ముందుండేది. అదే మెంటాలిటీ అతనిలో కంటిన్యూ అయింది.

ఆమె పట్టించుకోకపోవడంతో పట్టుదల మరింతగా పెరిగింది. ఆమెను ఆకర్షించడానికి రకరకాల పద్ధతుల్ని అవలంబించాడు.

ఓ రోజు సాయంకాలం ఆమె బస్సు దిగి ఇంటికి నడిచి వెళుతుండగా మోటార్‌బైక్‌ని ఆమె ముందు ఆపి, "హలో" అన్నాడు.

ఎవరన్నట్లు కళ్ళు ఎగరేసింది.

"నేను-మీ ఇంటికెదురుగా వుండే ధర్మరాజు నాయకర్ అబ్బాయిని"

"ఎప్పుడూ చూసినట్టు గుర్తులేదే"



## గొడవలేవీ లేవు

"నాకూ, నా భర్త 'క్రిస్'కి మధ్య గొడవలేవో చెలరేగినట్లు, అందుకనే నేను మళ్లీ నటించడానికొచ్చినట్లు వదంతులు పుట్టిస్తున్నారు. ఇవన్నీ ఈర్ష్యతో పుట్టించేవి మాత్రమే! బోస్టన్‌లో మేం ఎలాంటి అభిప్రాయ భేదాలు లేకుండా కాపురం సాగిస్తున్నాం. అయితే మధ్య మధ్యలో సినిమా ఛాన్సులు తగిలినప్పుడు నటిస్తున్నాను" అనంటోంది నదియా.

అతను షాక్ తిన్నాడు.

"ఈ వీధిలో నన్ను తెలియనివారున్నారంటే ఆశ్చర్యంగానే వుంది"

"అమెరికాలో మైక్‌టైసన్, మైకేల్ జాక్సన్ అంటే ఎవరో తెలియనివాళ్ళున్నారంటే ఎంత ఆశ్చర్యం ప్రకటిస్తారో అంత ఆశ్చర్యాన్ని ప్రకటించారే"

అతను నవ్వాడు.

"మీరు చాలా బాగా మాట్లాడతారే"

"థాంక్స్-నన్ను వెళ్ళనివ్వండి"

"ఓకే-కానీ చిన్న రిక్వెస్ట్" అంటూ ఆగాడు.

"ఎస్-చెప్పండి"

"ఇదిగోండి. ఈ గులాబీ తీసుకోండి" ఎక్కడినుంచో ఇంద్రజాలికుడి లెవెల్లో ఓ గులాబీని పెరికాడు.

"నో-థాంక్స్" ముందుకు కదిలింది.

ఏమనుకున్నాడో ఏమోగానీ బైక్‌ని పక్కకి జరిపాడు. ఆమె వెళ్ళిపోయింది.

రెండో రోజు అదే విధంగా అడ్డు తగిలాడు.

ఈసారి ఆమె నవ్వలేదు. విసుగ్గా చూసింది.

"ఈ గులాబీని మీరు తీసుకోవాల్సిందే" అన్నాడు ఆమె ఫీలింగ్స్‌ని ఏమీ పట్టించుకోకుండా.

"తీసుకోనని నిన్ననే చెప్పాను"

"మీరు తీసుకోవాలి"

"బెదిరిస్తున్నావా?" ఆమెకు అతనిమీద చులకన భావం ఏర్పడడంవల్లే సంబోధన ఏకవచనంలోకి మారింది.

"అభ్యర్థన మాత్రమే"

"ఒకసారి తిరస్కరించాక, రెండోసారి చేసేది అభ్యర్థన అనిపించుకోదు"

"నేను బెదిరిస్తున్నానని అనుకుంటున్నారా?"

"నీతో నాకు మాటేమిటి-జరగండి"

"అయితే ఈ పువ్వు తీసుకోకపోతే-ఇక్కడే ఇరవై గుంజీలు తీస్తాను-అందరూ చూస్తూ వుండగానే"

ఆమె ఆశ్చర్యపోయింది. కానీ అది ముఖంలో కనపడనివ్వలేదు.

"దానివల్ల మీకు వచ్చే నష్టం ఏమీ లేదనుకుంటున్నారేమో. కానీ చాలా నష్టం కలుగుతుంది మీకు. అందరిముందూ నడిరోడ్డులో గుంజీలు తీస్తే అందరి కళ్ళలోనూ మనిద్దరం పడతాం. మనిద్దరం లవర్స్‌మనీ, నేనేదో తప్పుచేస్తే నువ్వు గుంజీలు శిక్ష విధించావనీ అనుకుంటారు. పదిమందీ అలా అనుకోవడం నాకు గర్వంగా వుంటుంది. మీకు ఇన్సల్టింగ్‌గా వుంటుంది"

మామూలమ్మాయి అయితే బెదిరిపోయేది. కానీ సుజన మరింత బ్రేవ్‌గా తయారైంది.

"గుంజీలుకాదు-బస్కీలైనా తీసుకో" అని పక్కకు తిరిగింది.

అతను తక్షణ మోటార్ బైక్ దిగి, గుంజీలు తీయడం ప్రారంభించాడు.

ఆమె ఏమీ పట్టించుకోనట్లు వెళ్లిపోయింది.

ఇంత జరిగాక కూడా అతను వదల్లేదు.

ఈసారి గులాబీకి బదులు లవ్‌లెటర్‌తో తయారయ్యాడు. అయితే ఈసారి రోడ్డుమీద కాకుండా కాలేజీలో తగిలాడు.

కాలేజీ వదిలాక ఆమె ఫ్రెండ్స్‌తో వస్తుండగా ఎదురెళ్ళి విష్‌చేశాడు.

"మీ కోసమే వచ్చాను" అన్నాడు.

ఆమె డైవర్ట్‌కాకుండా స్నేహితురాళ్ళతో మాట్లాడుతూనే వుంది. ఆమె ఫ్రెండ్స్ మాత్రం ఎవరితను అన్నట్లు చూస్తున్నారు.

అతను వాళ్ళ వెనక నడుస్తూ-సుజనా! సుజనా అని పిలుస్తున్నాడు.

"ఎవరే?" స్నేహితురాళ్ళు అడిగారు కంగారుగా.

"వాడొక ఫూల్" మెల్లగా ఇంగ్లీషులో చెప్పింది.

వాళ్ళు ఆగకపోయేసరికి అతను వడివడిగా నడిచి ముందుకొచ్చి అడ్డంగా నిలబడ్డాడు.

"ఏయ్ మిస్టర్-ఏమిటిది? ఇలా అల్లరిచేస్తే పోలీసు కంప్లైంట్ ఇవ్వవలసి వస్తుంది" ఓ అమ్మాయి తీవ్రంగా హెచ్చరించింది.

"నన్ను ఎవరూ జీవితంలో అల్లరిచేయరు-నీ పర్సనాలిటీ అలాంటిది-ఇంటికెళ్ళి ముఖం చూసుకో. నేనొచ్చింది-ఇదిగో ఈ ఏంజెల్ కోసం" అన్నాడు కసిగా ఆమెవైపు చూస్తూ.

ఆమెకు ఏడుపొక్కటే తక్కువ. అవమానం ముఖాన్ని ఎర్రగా మార్చేసింది.

"నీకు సంస్కారం లేనట్లుంది. ఎందుకలా అవమానించావ్?" సుజన కోపంతో ఊగిపోతూ ప్రశ్నించింది.

"మరి అదేమిటి పోలీసూ, సైన్యమూ అంటుంది"

"ఛీఛీ" ఆమె అసహ్యించుకుంది.

"నువ్వు అసహ్యించుకున్నా, కోపంతో ఓ దెబ్బ కొట్టినా నేనేమీ ఫీల్‌కాను. నా ప్రేమ అంత గొప్పది. ప్రేమికుడు ఇలాంటివాటికి వెరవడు. నీమీద నాకెంత ప్రేమో ఇదిగో ఈ లెటర్‌లో రాశాను. తీసుకో" అని ఓ కవర్ అందించబోయాడు.

"నువ్వు మనిషివి కావు. పశువ్వి. నాకు ఇష్టం లేదని చెప్పానుగా. ఇంకా ఎందుకు వెంటపడతావ్?"

"నువ్వు ఇది తీసుకోకపోతే-ఇదిగో మగస్టూడెంట్స్‌కి బూట్‌పాలిష్‌చేస్తా" అంటూ ఓ బూట్‌పాలిష్ డబ్బాను జేబులోంచి తీశాడు.

ఇక అతనితో ఆర్గ్యుమెంట్ అనవసరమనిపించి చకచకా ముందుకు నడిచింది. స్నేహితురాళ్ళు ఆమెను అనుసరించారు.

గేటు దాటుతూ తిరిగి చూసిన వాళ్ళకు అతను స్టూడెంట్స్‌ని పిలిచి బూట్‌పాలిష్ చేయడం కనిపించింది. ఇక లాభంలేదనుకుని ఆమె ఓసారి అతను లేనప్పుడు అతనింటికి వెళ్ళింది.

ఎదురింట్లోని అమ్మాయే కనుక అతని తల్లిదండ్రులిద్దరూ నవ్వుతూ ఆహ్వానించారు. వాళ్ళు సాంప్రదాయబద్ధంగా, సౌమ్యంగా కనిపించారు.

"ఏమిటమ్మా! ఎప్పుడూ ఇటు రానిదానివి ఇవేళ వచ్చావ్. ఏమైనా విశేషమా?" అని అడిగింది చిట్టిబాబు తల్లి శాంతాబాయి.

"మీ ఇద్దరితో మాట్లాడాల్సిన పనిపడింది. సార్ కూడా వున్నారా?"

"ఉన్నారు"

కాసేపటికి భార్యాభర్తలిద్దరూ వచ్చారు.

ముగ్గురూ డ్రాయింగ్ రూంలో కూర్చున్నాక సుజన చెప్పింది.

"మీ అబ్బాయి-అదే చిట్టిబాబు గత కొంతకాలంగా నా వెంటపడుతున్నాడు-ప్రేమిస్తున్నానంటూ తెగ



## కొత్త తీరు

'పెళ్లిపుస్తకం'లో కాస్త ముందుకొచ్చిన దివ్యవాణి, 'పెళ్ళికొడుకు'లో ఇంకా ముందుకొస్తాననుకుంది. కానీ ఆ ఆశలు నెరవేరలేదు. చిన్నాచితకా సినిమాలు చేస్తున్నా, ఇప్పుడు శరత్ డైరెక్షన్‌లో కృష్ణ హీరోగా నటిస్తున్న ఓ పెద్దచిత్రంలో అవకాశం దొరకడంతో మళ్లీ ఆశ పుంజుకుంది.

అయితే ఇది హీరోయిన్ వేషం కాదు. ఓ డాన్సర్ పాత్ర. ఓ క్లబ్‌సాంగ్‌లో, రెండు సీన్లలో నటిస్తోందిట. ఆఖరికి ఒక పాటా, రెండు సీన్లతారగా అయ్యింది. కానీ ఈ మెరుపే మెరుగైన అవకాశాల్ని, సెక్సీ ఇమేజ్‌ని ఇస్తుందేమో!

ఊదరగొట్టేస్తున్నాడు. కానీ నాకు అతనంటే ఇష్టం లేదు. ఆ మాటేచెప్పాను. సంస్కారంకల ఏ అబ్బాయి అయినా అంతటితో ఆగిపోతాడు.

కానీ మీ అబ్బాయి అల్లరిచేయడంప్రారంభించాడు. నడి వీధిలో గుంజీలు తీశాడు. మా కాలేజీలో మగ స్టూడెంట్స్‌కి బూటుపాలిష్ చేశాడు. ఇక ఇలానే కొన సాగితే నాకూ ఇబ్బందే-మీ అబ్బాయికీ ఇబ్బందే..."

అంతవరకూ ముఖంమీద నెత్తురుచుక్క లేకుండా వింటున్న వాళ్లిద్దరూ కదిలారు.

ముందుగా నాయకర్ తేరుకున్నాడు.

"వాడు ఇంతగా చెడిపోతాడనుకోలేదమ్మాయ్. ప్రేమేమిటి-నాన్సెన్స్" అన్నాడు చాలా అసహ్యంగా ముఖం పెట్టి.

"ప్రేమించడాన్ని ఏమీ తప్పుపట్టకండి. అది ఈ వయసులో సహజం. సహజమైంది ఎప్పుడూ బావుంటుంది. కానీ ప్రేమకు అనవసరంగా విశేషణాలు చేర్చడంవల్ల అదీ దేవుడి ఉనికిలాగా అనుమానాస్పదమై పోయింది. ప్రేమంటే ఆకాశంలో విరిసిన పువ్వనీ, అమరమనీ, అజరామరమనీ, అమృతమనీ-ఇలా అనవసరమైన విశేషణాలతో దానిని ఆకాశానికెత్తేశారు. విశేషణాలు చేర్చింది ఏదీ సహజంగా వుండదు. కృత్రిమంగా కనిపిస్తుంది.

ఈ కవులూ, రచయితలూ, ఆధ్యాత్మికవాదులూ అందరూ కలిసి ప్రేమని బ్రహ్మపదార్థంగా తయారు చేశారు. అందువల్లే చివరికి అంత గొప్ప అనుభవం ఎవరికీ కలగక దానిమీదే అసహ్యం పెంచుకున్నారు.

## క్రికెటర్ల 'ఫిట్‌నెస్' మోజు

ఈమధ్య క్రికెటర్లకి కూడా ఫిట్‌నెస్‌పై ఆసక్తి పెరిగింది. వివిధ వ్యాయామాలతో శరీరదారుఢ్యాన్ని మెరుగుపరుచుకుంటే, మరింత మంచి ఆటగాళ్లుగా రూపొందవచ్చని క్రికెటర్లు గుర్తించారు.

గతంలో యశ్‌పాల్ అనే ఆటగాడు విపరీతమైన శ్రమతో కూడిన వర్కవుట్లు చేయడం చూసి, "పహిల్వాన్ అవాలనుందా?" అని హేళన చేసిన దిలీప్ వెంగ్‌సర్కార్ కూడా తర్వాత ఫిట్‌నెస్ పెంచుకోవడం తనను శ్రేష్ఠమైన ఆటగాడ్ని చేసిందని ఒప్పుకున్నాడు.



సంజయ్‌మంజ్రేకర్, సచిన్‌టెండూల్కర్, కపిల్ దేవ్ ఫిట్‌నెస్ విలువ గుర్తించి రకరకాల వ్యాయామాలు చేస్తున్నారు. 'డంబెల్స్' లాంటివి ఉపయోగించి చేసే 'వెయిట్స్'పై క్రికెటర్లు బాగా మోజుపడుతున్నారు.

"గతంలో జాగింగ్, స్ట్రెచింగ్ లకి ఆదరణ ఎక్కువగా వుండేది. ఇప్పుడు బలం కోసం 'వెయిట్స్'ని మించింది లేదని భావిస్తున్నారు" అంటున్నాడు మణిందర్. అతనికి, నవజ్యోత్ సిద్ధూకి ఇంట్లో సొంత జిమ్‌లున్నాయి.

మనోజ్‌ప్రభాకర్ వ్యాయామాలకై ఢిల్లీలోని మూర్యా సోఫిటెల్ హెల్త్‌సెంటర్‌కి రోజూ వెళ్తాడు. ◆

---

ఈ కారణంచేతనే పెద్దవాళ్ళు ప్రేమని చీప్‌గా చూస్తారు. మీరూ అలానే అన్నారు.

ప్రేమెప్పుడూ నాన్సెన్స్ కాదు. కానీ ఇప్పుడొచ్చిన సమస్య ఏమిటంటే మీ అబ్బాయి మీద నాకు ప్రేమ లేదన్నా వెంటపడుతున్నాడు–అదీ"

ఆమెవైపు వాళ్లిద్దరూ పజిల్డ్‌గా చూశారు. ఇలాంటి అమ్మాయితో జాగ్రత్తగా మాట్లాడాలన్నది మాత్రం అర్థమైంది.

"ఇంతకీ ఏమంటావ్ అమ్మాయి?" తన కొడుకుని తీసిపారవేయడం ఆ తల్లికి కొంత కష్టంగానే వుంది.

"నా వెంటపడవద్దని మీ అబ్బాయికి చెప్పండి. దట్సాల్"

సుజన లేచి వచ్చేసింది.

ఆ తరువాత ఓ వారం రోజుల వరకు ఆమెకి చిట్టిబాబు కనిపించలేదు. ఇక రాడని హాయిగా ఊపిరి పీల్చుకుంది.

కానీ ఆమె అంచనా తప్పయింది.

మరుసటి రోజు బస్టాండ్‌లో సిటీబస్సు కోసం వెయిట్‌చేస్తోంది. మరో రెండు నిముషాలకు తమ రూట్ బస్సు కనిపించడంతో బస్టాప్ పేవ్‌మెంట్ నుంచి కిందకు దిగింది.

అంతలో బస్సును క్రాస్‌చేశాడు చిట్టిబాబు. ఆ స్పీడ్‌కి సుజన కళ్ళు తిరిగాయి.

అతను ఆమెకు అటువైపుగా రోడ్డుకవతలకు బైక్‌ను తీసుకెళుతుండగా స్లిప్ అయింది. అతను కిందపడడం, బస్సు వచ్చి బస్టాప్‌లో ఆగడం ఒకేసారి జరిగాయి.

ఆమె బస్సెక్కి సీట్లో కూర్చుంది.

బస్సు కదిలింది.

బైక్‌నుంచి పడడంతో అతని మోచేతులు రెండూ గోక్కుపోయాయి. రక్తం పైకి లేచింది. పడిపోయిన బైక్‌ని అలాగే వదిలేసి, చేతులైనా తుడుచుకోకుండా పరుగెత్తాడు.

రోడ్డును క్రాస్‌చేసి, పేవ్‌మెంట్ ఎక్కాడు. అక్కడ నిలబడి చేతులూపడం ప్రారంభించాడు. కింద పడడంతో మోచేతుల దగ్గర షర్టు చినిగిపోయింది. అక్కడ రక్తం తేలడం కూడా ఆమె గమనించింది.

ఆమె స్థానంలో మరో అమ్మాయి ఎవరైనా వరే ఈ సంఘటనకు కదిలిపోయేది. తనకోసం దెబ్బల్ని కూడా లెక్కచేయలేదనీ, పడిపోయిన మోటార్‌బైక్‌ని కూడా పట్టించుకోలేదనీ గర్వంగా ఫీలయ్యేది. అతను ఓ హీరోలా కనబడేవాడు.

కానీ సుజన డిఫరెంట్. అతని ప్రవర్తన ఆమెకు ఎబ్బెట్టుగా అనిపించింది. అసహజంగా అనిపించింది. అంత దెబ్బ తగిలినా అతను కేర్‌లెస్‌గా ప్రవర్తించడం వల్ల అతను ఎక్సెంట్రిక్ అని నిర్ధారించుకుంది. అలాంటివాడితో మరింత జాగ్రత్తగా వుండడం మంచిదనిపించింది. అందుకే ఆ ఏరియా అయిన సబ్ ఇన్స్‌పెక్టర్‌కి మొత్తం విషయమంతా చెప్పింది.

శరవణన్ చాలా స్ట్రిక్ట్ ఎస్.ఐ. ఆలస్యం చేయకుండా అతనికి వార్నింగ్ ఇచ్చాడు. మరికొన్ని రోజులవరకు అతనుఊరుకుండిపోయాడు గానీ తిరిగి విజృంభించాడు.

ఈలోగా ఆమె మేనత్త చనిపోవడంతో తండ్రి దగ్గరికి వచ్చేసింది. యూనివర్సిటీలో జాయినయ్యింది.

కొన్ని రోజుల తరువాత ఇల్లు ఖాళీచేసి రావడానికి సత్యనారాయణ, సుజన వెళ్ళారు.

సామాను లారీ ఎక్కించిన తరువాత బస్టాండ్‌కు బయల్దేరారు. మధ్యలో చిట్టిబాబు అడ్డుకున్నాడు. క్రౌర్యంతో బిరుసెక్కిన అతని ముఖాన్ని చూడగానే సత్యనారాయణ జడుసుకున్నాడు.

అతనెవరో, ఎందుకలా అడ్డంగా నిలబడ్డాడో తెలియక కంగారుపడ్డాడు.

"ఇక్కడినుంచి తప్పించుకు వెళ్ళావని అనుకుంటున్నావేమో. కానీ నేను అందర్లాటి అల్లాటప్పావాడ్ని కాను. నిన్ను నీడలా వెంటాడతాను. నీ అంతు చూస్తాను" చిట్టిబాబు తన కూతురికేసి చూస్తూ ఒక్కో మాటను తూటాలా పేలుస్తుంటే ఆయన బిత్తర పోయాడు. అలా ఎంత స్పీడ్‌తో అన్నాడో అంతే స్పీడ్‌తో వెళ్ళిపోయాడు.

ఏం జరిగిందో మొత్తం వింటే తప్ప అక్కడినుంచి ఒకడుగు కూడా ముందుకు వేయలేనట్లు "ఎవడమ్మా! వీడు" అని అడిగాడు.

సుజన మొత్తం సంగతంతా చెప్పింది.

తిరిగి ఇంటికి వచ్చేసినా ఆయనకు ఈ ఆందోళన వదల్లేదు. అతనొచ్చి ఏమైనా చేస్తాడేమోనన్న భయం అప్పుడప్పుడూ కదిలేది. అందుకే వంశీ సంబంధం అనుకోగానే పెళ్లికి తక్కున ఒప్పుకున్నాడు.

పెళ్లిపత్రికను ఎక్కడ సంపాదించాడో ఏమోగానీ చిట్టిబాబు పెళ్లిపత్రికమీద తన రక్తాన్ని చల్లి, దాని కింద నోట్ రాశాడు.

"ఈ పెళ్లి ఎలా జరుగుతుందో నేను చూస్తాను" అన్నది ఆ నోట్.

(ఇంకావుంది)



తుఫాన్‌లా వచ్చేగాలి. గమ్యం చేరువలో ఉంది.
4.15 బిహెచ్‌పిలో.
అన్ని విధాల అనువైనది.
భారతదేశంలోనే కాక ప్రపంచవ్యాప్తంగా 40 దేశాల్లో అమ్ముడుపోతోంది. హిరో పూక్ శ్రేణిలో సిడిఐ 65, శక్తి కూడా ఉన్నాయి.
HERO PUCH TURBO sport
గెలుపుకి సవారి
మెజస్టిక్ ఆటో లిమిటెడ్ వారి ఉత్పాదన.
భారతదేశంలో అత్యధికంగా ఎగుమతి చేయబడేది.
రెండు గేర్లు.
ఎయిరోడైనమిక్ విండ్ షీల్డ్
170 కిలోలు మోయగల శక్తి
65 సి.సి.
దృఢమైన ఎల్లాయ్ వీల్స్
TURBO sport
PUCH
కిక్ స్టార్ట్ (కావాలనుకుంటే ఆటోస్టార్ట్)
PERCEPT/D

సీరియల్



# రారా మా ఇంటిదాకా

మేర్లపాక మురళి

అంత దూరంలో వుండీ తన కూతురి పెళ్లి సంగతి గురించి తెలుసుకుని, పెళ్లిపత్రిక మీద రక్తాన్ని చల్లి, ఆ విధంగా నోట్ రాసి ఇంటికి పోస్ట్‌చేయడం చూసి సత్యనారాయణ పైప్రాణాలు పైనే పోయాయి. హడావుడిగా ఆ ఇన్విటేషన్‌ని పట్టుకుని మద్రాసు పరుగెత్తాడు. శరవణన్‌ను కలిసి ఆయన సహాయం కోరాడు.

"వాడు ఎంతకైనా తెగించేటట్లున్నాడు. పోస్టులో ఈ పెళ్లిపత్రిక వచ్చిన విషయాన్ని నేను సుజనకి కూడా చెప్పలేదు. మీరే రక్షించాలి. నా కూతురి పెళ్లి నిర్విఘ్నంగా జరిపించే బాధ్యత మీదే"

—అంటూ రెండుచేతులూ పట్టుకున్నాడు.

"అలానే అప్పా! వాడు ఇలాంటి పిల్లగాడనీ నాకూ తెరియమప్పా-నేనే వచ్చి పెళ్లిచేస్తును. ఆ తిరుడు పయ్యా వచ్చి ఏమైనా చేస్తే అక్కడే వాడి ఎముకల్ని పడమ్పుడిరే" అని శరవణన్ అభయమిచ్చాడు.

అలానే ఆయన పెళ్లికి మరో కానిస్టేబుల్‌తో వచ్చాడు. కానీ చిట్టిబాబు రాలేదు. పెళ్లి జరిగిపోయింది.

ఇప్పుడు ఇలా టెలిగ్రామ్ రావడంతో చిట్టిబాబే తమని వదలకుండా ఏడిపిస్తున్నాడేమోననుకున్నాడు. తన అల్లుడు ఫస్ట్‌నైట్ కోసం టెలిగ్రామ్ నాటకం ఆడాడని ఆయన ఊహించలేకపోయాడు. అందుకే చిట్టిబాబు మీద తన కోపాన్ని ప్రకటించాడు. తన అల్లుడికి అనుమానం కలిగించాడు.

• • •

ఆ సాయంకాలం వర్షపుజల్లు ప్రారంభమైంది. ఆకాశంలో నల్లటి మబ్బులు గింగుర్లు తిరుగుతున్నాయి. గాలి చిన్నపిల్లలా వర్షంలో తడుస్తూ కేరింతలు కొడుతున్నట్లు చిన్నగా శబ్దంచేస్తూ, చల్లగా తగుల్తోంది.

సుజన, మహిత ఇంటికి పక్కగావున్న వసారాలో మాట్లాడుకుంటున్నారు.

మహితకు ఇరవై ఎనిమిదేళ్ళుంటాయి. చాలా సెక్సీగా వుంటుంది. ఆ సెక్సీతనం ఆమె మత్తు కళ్లల్లో వుందో, పెద్దదైన కిందిపెదవిలో వుందో, ఎత్తుగా, గుండ్రంగావున్న ఎదలో వుందో, నడుం ముడతల్లో వుందో చెప్పడం కష్టం. ఆమెను చూడగానే మగవాడికి కోరికా, ఆడపిల్లకు ఈర్ష్యా పుట్టుకొస్తాయి.

"నా ఫస్ట్‌నైట్ గురించి చెప్పాలా. భలే అడిగావే. ఎప్పుడో ఏడేళ్ళయింది..." అంది ఆమె.

సుజన నవ్వుతూ మౌనంగా వుండిపోయింది. అలాంటప్పుడు మాట్లాడితే ఎదుటివ్యక్తి మూడ్ చెదిరిపోతుంది. మనసు డైవర్ట్ అయిపోతుంది.

"అయితే ఓకే" అంటూ ఆమె ఉషారుగా చెప్పడం ప్రారంభించింది.

"మాది రాపూరు దగ్గర ఓ పల్లెటూరు. మా నాన్న పెద్ద రైతు. పదెకరాలదాకా పొలం వుండేది. మా ఊర్లో పదెకరాల పొలం వుండేది కేవలం ఓ పదిమందికి మాత్రమే. పదెకరాల పొలం వుంటే పెద్ద భూస్వామి అన్నమాట.

మేం మొత్తం ముగ్గురు అక్కచెల్లెళ్లం. మగపిల్లలు లేరు. నేను చివరిదాన్ని. మా పెద్దక్క పేరు చంద్రిక. ఆమె వయసుకు రాగానే గూడూరులో రెవిన్యూ గుమాస్తాగా పనిచేసే చక్రధర్‌తో పెళ్లి ఫిక్స్‌చేశాడు నాన్న. ఇరవై అయిదువేల కట్నంతో, పది సవర్ల బంగారం పెట్టి పెళ్లి జరిపించారు.

మా అక్క అత్తగారింటికి వెళ్లింది.

ఆ సంవత్సరమూ, మరుసటి ఏడు కూడా పంటలు పండలేదు. పెళ్లికి చేసిన అప్పు వడ్డీ తిని మరింతగా బలిసింది. అది మా కుటుంబాన్నంతా తినకముందే దాన్నుంచి విముక్తి కావాలని అయిదెకరాలు అమ్మేశాడు నాన్న. అప్పు అయితే తీరిందిగానీ పెద్దరైతు స్టేటస్ నుండి మేం మామూలుపాటి రైతుస్థాయికి దిగిపోయాం. ఉన్న పొలంలోనే అమ్మా నాన్న రాత్రింబవళ్లు కష్టపడేవాళ్ళు. కానీ పండిన పంటలకు గిట్టుబాటు

**10** వంశీ సుజనల పెళ్ళవుతుంది. శోభనం ముహూర్తం దగ్గరపడిందనగా సుజనకు 'మూడు రోజుల' ఇబ్బంది ఎదురౌతుంది. ఆ మూడు రోజులూ వీలుకాదు కనుక మరో ముహూర్తం చూస్తాడు సుజన తండ్రి. అప్పటిదాకా ఆగకుండా ఆ ముహూర్తానికి ముందే తమ శోభనం జరుపుకోవాలనే ప్లాన్‌లో వుంటుంటారు వంశీ సుజనలు. అందుకు వంశీ వేసిన రెండు పథకాలూ విఫలమౌతాయి.

చిట్టిబాబుది మద్రాసు. అతను ఓ బిజినెస్‌మాన్ కొడుకు. సుజన అక్కడ చదువుకొనే రోజుల్లో వాళ్ళ ఎదురింటిలోనే వుండేవాడు. ఉన్నత కుటుంబానికి చెందిన అతను ఎవరినో ఒకరిని ప్రేమించాలనుకుంటాడు. అప్పుడు అతనికి కాలేజీకి వెళుతున్న సుజన కనబడుతుంది.

ఆమెను తన వలలో వేసుకోవాలనే విశ్వప్రయత్నం చేస్తాడు చిట్టిబాబు. కానీ అది విఫలమౌతుంది. చదువు పూర్తయి ఇంటికి తిరిగివస్తూ బస్టాండ్‌లో వున్న సుజన దగ్గరికి వస్తాడు చిట్టిబాబు. తన ప్రయత్నం విఫలమైనందుకుగాను ఆవేశంలో ఆమెను బెదిరిస్తాడు. అతని మాటలు ప్రక్కనే వున్న సుజన తండ్రి సత్యనారాయణకి ఆందోళన కలిగిస్తాయి.

ధర వుండక ఏదో బొటాబొటిగా సంసారం గడిచేది.

ఈలోగా రెండో అక్క రాధిక అరటిచెట్టులా ఎదిగింది. ఆ పిల్ల భారీ పర్సనాలిటీ కావడంవల్ల త్వరలోనే పెళ్లిచేయాలనుకున్నారు.

సంబంధాలు చూడడం మొదలుపెట్టారు. మా పక్కఊర్లోనే సంబంధం కుదిరింది.

ఆమె పెళ్లికావడం, ఆ తరువాత రెండేళ్లకు అప్పులు తీర్చడానికి మిగిలిన అయిదెకరాలూ అమ్మడం జరిగిపోయాయి. మా నాన్న రెక్కలు తప్ప ఏమీ మిగలకుండాపోయింది.

నాన్న రెండెద్దులు పట్టుకుని రాపూరులో బండి తోలడం ప్రారంభించాడు. పదెకరాల ఆసామి అయిన ఆయన కూతుర్ల పెళ్లిళ్లతో కూలీగా మారిపోయాడు. బస్సులోంచి, లారీలోంచి బస్తాలు దించి, బండిలో అంగళ్ళకు తోలేవాడు.

బస్తాకు ఒకటో, రెండో రూపాయలు వచ్చేవి. దాంతో కుటుంబం సాగేది. మా కాపురం కూడా రాపూరుకి మారింది. ఉన్న ఊర్లో కూలీకి వెళ్ళడం ఇష్టంలేక టౌన్‌కి వచ్చేశామన్నమాట.

నాకు ఇరవై అయిపోయి ఇరవై ఒకటి పెట్టింది. అమ్మకికానీ నాన్నకుగానీ నా పెళ్లిమాట ఎత్తే ధైర్యం లేకపోయింది. ఏం వుంది కాబట్టి పెళ్లిసంబంధం చూస్తారు?

రోజులు గడుస్తున్నాయి. ఓసారి మాకు దూరపు బంధువు ఒకామె ఇంటికి వచ్చింది. రాత్రి భోజనాలయ్యాక ఇంటిముందు అందరం కూర్చున్నాక ఆమె అసలు విషయం చెప్పింది.

'మహితకు పెళ్లి చేయరా ఏమిటి? పిల్ల అందంగా కుందనపు బొమ్మలా వుంది.

నా ఎరికలో ఓ సంబంధం వుంది. అది మాట్లాడదామనే ముఖ్యంగా నేనిక్కడ దిగింది'

'ఏ ఊరు?' అమ్మ ఆసక్తిగా అడిగింది.

నాన్న అయితే ఆ ఆసక్తి కూడా కనబరచలేకపోయాడు. కూతుర్ల పెళ్లిళ్లకు పదెకరాలు పోగొట్టుకున్న వ్యక్తికి ఆసక్తి ఎలా వుంటుంది?

'నాగలాపురం దగ్గర పల్లెటూరు. అబ్బాయి పదవతరగతి వరకూ చదువుకున్నాడు. వ్యవసాయం చేస్తాడు.

ఒక్కడే కొడుకు. తండ్రి లేడు. పెద్ద పెంకుటిల్లు వుంది'

అమ్మ కళ్లు మెరవడం ఆ మసకచీకట్లోనూ నేను కనిపెట్టగలిగాను.

'పొలం ఎంతుందేమిటి?'

'పదెకరాలదాకా వుంది. నేనెప్పుడు వెళ్లినా వడ్లో, రాగులో, సజ్జలో బొట్లనిండా వుంటాయి. మీరు ఊఁ అంటే చెప్పండి వాళ్ళను కదిపి చూస్తాను' అంది.

'అలాంటి సంబంధం వస్తే మాకూ సంతోషమే. కానీ మా పరిస్థితి ఇప్పుడు ఎలా వుందో తెలుసుగదా. చిల్లిగవ్వ ఇవ్వలేం.

ఏదో వున్న బంగారం పెట్టి, గుడిలోనో, సత్రంలోనో గుట్టుచప్పుడుకాకుండా పెళ్లిజరిపిస్తాం. అంత



## వాహనాల అమ్మకాలు, లాభాల్లో 'బజాజ్' పురోగతి

ద్విచక్ర, త్రిచక్ర వాహనాల తయారీలో అతి పెద్ద సంస్థ బజాజ్ ఆటో లిమిటెడ్ 1993-94లో అత్యధికంగా 9,13,000 వాహనాలను అమ్మి కొత్త రికార్డు సృష్టించింది. దీనితో ఆ సంస్థ టర్నోవరు రూ. 1,680 కోట్లకు చేరుకుంది.



వాహనాల పరిశ్రమ మొత్తానికి బజాజ్ కంపెనీ మార్కెట్ వాటా 50 శాతముంది.

ద్విచక్ర, త్రిచక్ర వాహనాల మార్కెట్‌లో అది నాయకత్వ స్థానంలో కొనసాగుతోంది. 1993-94 సంవత్సరానికి టాక్స్ పోగా ఆ సంస్థ నికరలాభాలు రికార్డుస్థాయిలో రూ. 146 కోట్లు ఆర్జించింది. అలా మనదేశంలో ప్రైవేట్ సెక్టర్‌లో అత్యంత లాభదాయకమైన కంపెనీలలో బజాజ్ ఆటో లిమిటెడ్ ఒకటయింది.

బజాజ్ ఆటో ఓ క్రమం ప్రకారం కొత్త ఉత్పత్తులను మార్కెట్‌లో ప్రవేశపెట్టడం కొనసాగిస్తోంది. అది సరికొత్తగా మనదేశంలో అత్యంత ఇంధన సామర్థ్యం కలిగిన 87 కెఎమ్‌పిఎల్, 4 స్ట్రోక్ జపనీస్ మోటార్ సైకిల్‌ని మార్కెట్‌లో ప్రవేశపెట్టటం జరిగింది.

ఇంధన సామర్థ్యం అధికంగా కలిగిన కొత్త ఇంజన్‌తో, డ్రైవింగ్ సౌలభ్యంగా వుండే కొత్త మోడల్ స్కూటర్ 'చేతక్ క్లాసిక్'ని కూడా ఆ కంపెనీ మార్కెట్ చేయనారంభించింది. 1993-94 ఆర్థికసంవత్సరంలో సాధించినదానికన్నా 1994-95లో అమ్మకాలనూ, లాభదాయకతనూ మరింత మెరుగుపరుచుకోవాలని బజాజ్ ఆటో లిమిటెడ్ ఆశిస్తోంది. ◆

కంటే మేం తూగలేం' నాన్న అప్పుడు మాట్లాడాడు.

'నువ్వు నీ స్థితి నాకు చెప్పాలా అన్నయ్యా! అదంతా నేను చూసుకుంటాలే. అమ్మాయిని చూస్తే ఎవరైనా తన్నుకుపోగలరు. లక్ష్మీకళ తాండవిస్తోంది. కట్నాలూ, కానుకలూ వద్దమ్మా. అమ్మాయి బావుండి, గుణవంతురాలైతే అంతే చాలు అని పిల్లాడి అమ్మ పదేపదే చెప్పడంవల్లే నేను ముందుండడానికి పూలు వేసుకున్నాను. నువ్వేమీ దిగులుపడవద్దు. ఆమె కల్లాకపటంలేని మనిషి. మన మహితను చూడగానే ఎగిరి గంతేస్తుందనుకో'

మా నాన్న అప్పటికి ఊపిరి పీల్చుకున్నాడు. కట్నం లేదనగానే ఆయన ఉత్సాహంగా మాట్లాడాడు. మేం పడుకునేసరికి రాత్రి పదకొండు గంటలైంది.

పది రోజులు గడిచాయో లేదో పెళ్లివారు దిగారు. పెళ్లివారంటే ఎంతోమంది లేరు. పెళ్లికొడుకూ, అతని తల్లీ, మధ్యవర్తీ వచ్చారు.

పెళ్లికొడుకుని చూడగానే నేను పులకరించిపోయాను. చాలా అందంగా వున్నాడు. ఎర్రగా, నాజూగ్గా అచ్చు సినిమా హీరోలా వున్నాడు. ఆ నూనూగు మీసాలు తీసేస్తే ఆడపిల్లలా వుంటాడనిపించింది. అంత స్మార్ట్‌గా వున్నాడు.

చదివింది పదో తరగతే అయినా ప్యాంటూ, షర్టూ టక్‌చేసుకుని స్టైల్‌గా వున్నాడు.

నేను ఎదురుపడ్డప్పుడంతా తల వంచుకున్నాడు. అతని బిడియం చూసి నేను చాటుగా నవ్వుకున్నాను. ఆడపిల్లలా సిగ్గుపడడం చూసి ఆనందించాను. అతన్ని ఏడిపించాలని మరీ మరీ ఎదురుపడ్డాను.

వాళ్ళు వెళ్ళి ఉత్తరం రాశారు. పెళ్లికూతురు నచ్చిందనీ, ఏదో ఉన్నంతలో నగలు పెట్టి, పెళ్లి జరిపిస్తే చాలని అబ్బాయి తల్లి ఉత్తరం రాసింది. మా వాళ్ళూ ఒప్పుకుంటున్నట్టు ఉత్తరం రాశారు.

మా పెళ్లి రావూరులోనే సింపుల్‌గా జరిగిపోయింది. దానికైనా నాన్న శ్రమపడాల్సివచ్చింది. పెళ్లి అయిందంటే అయిందని అనిపించేశాడు.

'పెళ్లి ఇక్కడ జరిగింది కాబట్టి మిగిలిన ముద్దూ ముచ్చటంతా మా ఊర్లో జరిపిస్తాం అన్నయ్యా' అనడిగింది మా అత్తమ్మ నాన్నని.

మరో రెండు రోజులు పెళ్లివాళ్లంటే ఎంత కష్టమో తెలిసిన నాన్న దానికి సంతోషంతో ఒప్పుకున్నాడు. దాంతో ఆ సాయంకాలమే మేము బయల్దేరి నాగలాపురం దగ్గర్లోని పల్లెటూరుకు చేరిపోయాం.

ఆ ఊరు బాగుంది. బస్ దిగి నాలుగు ఫర్లాంగులు నడిస్తే ఊర్లోకి చేరుకుంటాం. వీధంట నేను నడుస్తుంటే జనమంతా నన్ను పరిశీలించి చూశారు. ఇద్దరు ముగ్గురు అమ్మలక్కలు నాకు వినపడేటట్లే కామెంట్‌చేశారు కూడా. ఆ పొగడ్తలకు నేను గర్వంగా ఫీలయ్యాను. చిన్నపిల్లలైతే గుంపులుగా నా వెనకే నడిచారు. పల్లెటూళ్ళలో కొత్తవాళ్ళొచ్చినా, ఏదైనా వాహనం వచ్చినా పిల్లలంతా గుమికూడిపోతారు.

మా భర్త ఇల్లు వీధికి చివరలో కాస్తంత దూరంలో వుంది. ఎత్తు ప్రదేశంలో ఎర్రమట్టి ముగ్గులా అందంగా వున్న ఆ ఇల్లుని చూసి నా అంత అదృష్టవంతురాలు ప్రపంచంలో మరెవరూ వుండరనిపించింది.

వాళ్ళ ఆచారం మేరకు వసంతాలు, పూల చెండ్లు తలిమ్మా కార్యక్రమాలయ్యాకే శోభనం అనీ, ఇక ఆ రోజు వీలుకాదనీ, మరుసటి రోజు ఫస్ట్‌నైట్ అనీ తెలిసింది. ఇక ఆ సాయంకాలమంతా నేను నా ఇల్లు అంతటినీ పరిశీలిస్తూనే వుండిపోయాను.

బాగా అలిసిపోవడంవల్ల భోజనాలు కాగానే అందరమూ పడుకుండిపోయాం.

ఉదయం నిద్ర లేవగానే ఒక్కో ముచ్చటా ప్రారంభమైంది. నన్నూ, నా భర్తనూ ఊరేగింపుగా గుడి దగ్గరికి తీసుకెళ్ళారు. ఊరికి తూర్పుగా శివాలయం. దాని ముందు చిన్నగుంట. అక్కడ టెంకాయ కొట్టించి, హారతి ఇప్పించారు. తిరిగి ఊరేగింపుగా ఇంటికొచ్చాం. ఊరి జనమంతా ఇళ్లముందు నిలబడి కొత్తజంటను చూశారు.

ఇవన్నీ ఎంత బావుంటాయో! కానీ ఇప్పుడు అలా ఊరేగింపులన్నీ జరగడంలేదు. కాలంతోపాటే ఈ ముచ్చట్లన్నీ మాయమయ్యాయి. కొత్త ఊర్లో, కొత్తవ్యక్తి చిటికెన వేలు పట్టుకుని, అందరిముందూ నడవడం, సిగ్గుతో కాళ్ళు తడబడడం, జనం ఏమనుకుంటున్నారో వినాలన్న ఆత్రుతతో చెవులురిక్కించడం, కళ్ళు ఆనందంలో టపటపా కొట్టుకోవడం, మధ్యమధ్యలో పెళ్ళికొడుకు మన చిటికెన వేలును గట్టిగా అదమడం- ఇవన్నీ అద్భుతాలు. కానీ ఇప్పుడు ఇలాంటి ఆనందాలకన్నిటికీ దూరమయ్యాం.

సావుగంటలో పెళ్లి అయిందనిపించేసి, పొద్దుగుంకడం తరువాయి పడక ఎక్కించేస్తున్నారు ఇప్పుడు.

మేం ఇంటికి రాగానే వసంతాల కార్యక్రమం కోసం అన్నీ రెడీచేశారు. వీధిలో రెండు పెద్ద అండాలు పెట్టారు. వాటిల్లో నిండుగా నీళ్లు పోసి, సున్నమూ, పసుపూ కలిపారు. నీళ్ళన్నీ కాషాయం రంగులోకి మారాయి.

'ఏమీ సిగ్గుపడకు. నీళ్ళన్నీ మా అన్నయ్యమీద పోసి ఉక్కిరిబిక్కిరిచేసెయ్'

'మా బావకు మరీ బిడియం. అందుకే నువ్వు యాక్టివ్‌గా వుండి నీదే పైచేయి అనిపించుకో'

'ఆడవాళ్ళు ఎందులోనూ తగ్గరని నువ్వు నిరూపించాలి' -ఇలా నలుగురు అయిదుగురు స్త్రీలు నన్ను వసంతాల దగ్గరికి తీసుకెళుతూ ఆ రంగునీళ్ళని విజృంభించిపోయాలని చెప్పారు.

ఓ పెద్ద పాత్ర దగ్గర నన్ను నిలబెట్టారు. ఎదురుగ్గా వున్న మరో పాత్ర దగ్గర ఆయన వున్నారు.

మొదట నాకే ఛాన్స్ ఇప్పించారు స్త్రీలంతా కలిసి.

ఒకామె నాకు వసంతం నింపిన చెంబు అందించి 'కానీ' అంది. చుట్టూ బంధువులూ, ఊరి జనం పూలతడికలా నిలబడ్డారు. అంతమందిముందు ఆయన తలమీద నీళ్ళుపోయడం తగని సిగ్గనిపించింది నాకు. అందుకే కళ్ళెత్తకుండా చేతులు మాత్రమే పైకెత్తి చెంబు కుమ్మరించాను. ఆయన నాకంటే గుప్పెడు పొడుగు. అందుకే ముఖంలో పడ్డాయి నీళ్ళు.

ఇక ఆయన వంతు.

తమాషా ఏమిటంటే ఆయన నాకంటే మరింత సిగ్గుపడుతున్నాడు.

క్రీగంట చూస్తున్న నాకు వసంతంకన్నా ఆయన ముఖమే సిగ్గుతో మరింత ఎర్రగా అనిపించింది.

ఆయన రెండు అడుగుల్లో నన్ను చేరి తలమీద పోశాడు. ఎక్కడెక్కడో నా రహస్య అవయవాల్లో నీళ్ళు పాకి, ఆయన నీళ్ళకు బదులు వేళ్ళను జార్చి, అక్కడంతా రాస్తున్నట్లు గిలిగింత నన్ను ఊపింది.

నేనో చెంబు, ఆయనో చెంబు పోసుకున్నాం. చివరికి వచ్చేసరికి నా చుట్టూ చేరిన స్త్రీలంతా

'ఎత్తుకో'. మొత్తం పాత్ర అంతా కుమ్మరించు' అని అరుస్తున్నారు. ఆయనవైపు చేరిన మగవాళ్ళంతా ఆయన్నీ అలానే చేయమని ఉత్సాహపరుస్తున్నారు.

నేను పాత్రను ఎత్తుకుని మొత్తం కుమ్మరించాను. ఆయన పూర్తిగా తడిసిపోయారు.

సున్నం, పసుపూ కలిపిన నీళ్ళు కావడంతో ఆయన కళ్ళు నులుముకుంటున్నాడు.

'షేమ్‌రా శివా! ఆడవాళ్ళముందు మన మగవాళ్ళ పరువు తీశావుగదరా. ఇప్పటికన్నా అండా ఎత్తుకుని కుమ్మరించు' మగవాళ్ళు తొందర చేస్తున్నారు.

కళ్ళంతా తుడుచుకుని ఆయన నా దగ్గరికి వచ్చే సరికి స్త్రీలు నన్ను తక్కున వెనక్కి లాగారు. నీళ్ళన్నీ కిందనే ఒలికిపోయాయి.

విజయగర్వంతో స్త్రీలంతా నవ్వారు. మగవాళ్ళు శివాను పట్టుకుని హాస్యాలాడుతూ తిడుతున్నారు.

నన్ను ఇంట్లోకి తీసుకొచ్చారు.

పొడిబట్టలు కట్టుకున్నాను.

నా చారవకుస్త్రీలు నన్ను పొగుడుతూనే వున్నారు.

మధ్యాహ్నమైంది.

నన్నూ, నా భర్త దగ్గర కూర్చోబెట్టి వడ్డించారు. నా పక్క స్త్రీలూ, ఆయన పక్క మగవాళ్ళూ కూర్చున్నారు. ముందుగా వడలు వేశారు.

'కానీ తినమ్మా' శివ పక్కనున్న వ్యక్తి నన్ను తొందరచేశాడు.

'కొద్దిగా నలుపున్న వడలు తినద్దు. అందులో బొగ్గులు పెట్టారు. ఎర్రగా వున్నవాటినే తిను' నా పక్కన కూర్చున్న శివా వదిన హెచ్చరించింది.

నాలుగు వడల్లో రెండు అక్కడక్కడా నల్లగా వున్నాయి. మిగిలినవి ఎర్రగా వున్నాయి. వాటిని తుంచి తినడం ప్రారంభించాను.

ఆయన వడను తుంచి, కొరికాడో లేదో కరకర మని ఏదో విరిగిన శబ్దం వచ్చింది. అందరూ గొల్లున నవ్వారు. బొగ్గు కొరికాడని ఊహించాను.

'జాగ్రత్తగా తినమన్నాను గదరా. ఇందులోనూ మనం ఫెయిలేనే' పక్కనున్న వ్యక్తి తలపట్టుకున్నాడు.

నాకూ నవ్వాగింది కాదు.

అలా హాస్యాన్నీ, వ్యంగ్య సంభాషణల్నీ, ఛలోక్తుల్నీ నంజుకుంటూ భోజనాలు ముగించాం.

మధ్యాహ్నం అలా కునుకుతీశానో లేదో లేపేశారు. అప్పటికే తాంబూలం వేసుకున్న ఆకాశం నోరు తెరిచినట్లు సంధ్యపరుచుకుని వుంది.

మనం వసంతాలు పోసుకున్నది ఇక్కడా? ఆకాశంలోనా అని ఆ ఎర్రటి కాంతిని చూస్తూ నా భర్తని అడగాలనిపించింది.

స్నానంచేసి లైట్‌గ్రీన్ కోటా చీర కట్టుకున్నాను. ఎందుకనో విచిత్రంగా గత రెండు రోజులనుంచీ బ్రా పట్టడంలేదు. బ్రా సైజు తగ్గిందో, ఎద సైజు పెరిగిందో తెలియడంలేదు. ఏదో తంటాలుపడి బ్రా వేసుకుని జాకెట్టు వేసుకున్నాను.

లోకంలోకి వచ్చిన కొత్త అతిథిలా మసకచీకట్లు కమ్మేశాయి. పందిట్లో పెట్రొమాక్స్ లైట్ రెక్కలు లేకపోవడంతో ఎగరలేని పుష్పక విమానంలా వుంది. దాని షేప్ అలా వుంది మరి. కరెంట్ పోతే స్టాండ్ బైలా వుంటుందని దాన్ని తెచ్చారు.

పెంకుటిల్లుకు ఎదురుగ్గా ఓ చిన్న గుడిసె వుంది. వంట కార్యక్రమమంతా అక్కడే కాబోలు. వంట పాత్రలన్నీ అంగట్లో పరిచినట్లున్నాయి. మధ్యలో పెద్ద పందిరి వేశారు. అక్కడి ఓ పొడుగాటి స్టూల్ అమర్చారు. దానిమీద పూల పూల దుప్పటి పరిచారు. అటువైపు, ఇటువైపు రెండు పెద్ద దిండ్లు వుంచారు. మరికాసేపట్లో పూలచెండ్ల పుట్టం ప్రారంభమవుతుందని తెలిసింది. మధ్యలోనున్న చామంతుల చెండు పసుపుముద్దలా వుంది.

ఏడుగంటల ప్రాంతంలో నన్ను తీసుకెళ్ళి బెంచీకి ఓ వైపు కూర్చోబెట్టారు. ఆయన వచ్చి మరో చివర కూర్చున్నారు. ఊర్లోని స్త్రీలంతా మా చుట్టూ నిలుచున్నారు. వాళ్ళను చూస్తుంటే మా ఊర్లో దోబీ ఏట్లో ఆరబెట్టిన చీరలు గుర్తొచ్చాయి. అక్కడక్కడ పురుషులు తెల్లటి బట్టల్లో పూలదండ్ల మధ్యలో సంపెగల్లా కనిపించారు.

ఆయన పూలచెండును చేతిలోకి తీసుకుని నా ముందుకు విసిరాడు. నేను దాన్ని పట్టుకుని తిరిగి ఆయన మీదకి విసిరాను. ఆయన దానిని పట్టుకోలేకపోయారు. చుట్టూ వున్న స్త్రీలు చప్పట్లు చరిచారు. మగవాళ్ళు ఆయన్ను ఏదో అంటున్నారు.

రెండోసారి ఆయన చెండు విసిరాడు. అది పట్టు తప్పింది. సూటిగా నా ఎదమీద పడి, కిందకు దిగింది. మొత్తం నా ఇరవై ఏళ్ళ యవ్వనాన్ని ఒక్కసారిగా వేళ్ళతో మీటినట్లయింది. చుట్టూ వున్న వాళ్ళంతా మాయమైపోయి, ఆయన్ను గట్టిగా కౌగిలించుకోవాలన్న కోరిక నా సిగ్గును మరింత ఎరుపు చేసింది. మరో అరగంటకు ఆ కార్యక్రమం ముగిసింది.

భోజనాలయ్యాయి. బలవంతంమీద తాంబూలం వేసుకున్నాను. నా నోరు ఎలా పండిందంటే మందారాల మొగ్గల పొదిలో నాలుకను చేసినట్లనిపించింది.

తొమ్మిది గంటలకు తెల్లటి చీరలోకి మారిపోయాను. పెంకుటింట్లో శోభనం ఏర్పాటుచేశారు. పెద్ద నవారు మంచంమీద పరుపు వేశారు. దానిమీద మల్లెలు, చేమంతులు చల్లారు. వెలిగించిన అగరొత్తులు ఇల్లంతా తెల్లటిపొగ మేఘాలను సృష్టిస్తోంది.

నన్నూ, ఆయన్నీ తలుపు దగ్గర నిలబెట్టారు.

"పెళ్ళికూతురా! మీ ఆయన పేరు చెబితేనే నిన్ను లోపలికి వెళ్ళనిచ్చేది" అంది ఓ యువతి.

ఆయన పేరు చెప్పాలంటే చచ్చేంత సిగ్గేసింది. అందుకే నా నోరు పెగలలేదు.

'సిగ్గు పడడానికి ముందు ముందు చాలా ఘట్టాలున్నాయి. ఇప్పుడే వద్దు' ఆమే అంది.

అందరూ ఘొల్లున నవ్వారు.

'చెప్పమ్మా! భర్త పేరు చెప్పడానికి భయమేమిటి?' మరో ఆమె ఉత్సాహాన్నిచ్చింది.



## గీత–చీఫ్ మినిస్టర్

ఇక్కడ ఛాన్సులు తక్కువై కేరళకు వెళ్ళిన గీత ప్రస్తుతం మలయాళ సినీరంగంలో నెంబర్ వన్ స్థానాన్ని దక్కించుకుంది. ఇటీవల 'చీఫ్ మినిస్టర్ కె.ఆర్. గౌతమి' అనే మలయాళ చిత్రంలో నటించింది. కేరళ మార్క్సిస్టు పార్టీనుంచి బయట కొచ్చి కొత్తపార్టీ పెట్టిన కె.ఆర్.గౌరి (ఉపరాష్ట్రపతి కె.ఆర్. నారాయణన్‌గారి చెల్లెలు) జీవితంలోని సంఘటనల ఆధారంగా ఈ చిత్రం నిర్మించబడిందట.

"ముందస్తుగా కె.ఆర్. గౌరి గారి దగ్గర ఆశీర్వాదం తీసుకున్న తర్వాతే ఈ సినిమాలో నటించాను. ఆమె భలే కోపిష్టి అని భావించాను. కానీ ఆమె పరమ సాధువు" అని మలయాళ సినిమాలు అందించిన విజయాలతో పొంగిపోతూ చెప్తోంది గీత.

## వింత వింత ఆప్యాయత

ఆ ఇరవై ఏళ్ల యువకుడ్ని చేయి వెనక్కి విరిచి వీపుపై ఓ దెబ్బ లాగించింది డిస్కో శాంతి. అతడు



బాధగా మూలిగాడు. మరలా అతడి చెవి మెలితిప్పి పొట్టలో ఒక షాట్. ఆ కుర్రాడి ముఖం రంగులు మారింది. ఓ పట్టాన విషయం అర్థంగాక, "శాంతి! ఈ కుర్రాడేమైనా తప్పుగా కామెంట్ చేశాడా?!" అని అడిగిందే ఆలస్యం అన్నట్లు డిస్కో శాంతి, సదరు యువ బాధితుడు బిగ్గరగా నవ్వడం ప్రారంభించారు.

"లేద్సార్! వీడు చాన్నాళ్ల నుంచి నా పర్సనల్ అసిస్టెంట్. ఎంతో అణకువగలవాడు. ఏయే సందర్భాల్లో నేను ఎలా నడచుకుంటాననే విషయం వీడికి బాగా తెలుసు. అందుకే నాకు ఎప్పుడూ కోపం రాకుండా ప్రవర్తిస్తుంటాడు. అందుకే వీడంటే నాకంత అభిమానం, ఆప్యాయతలు" అని వివరించింది డిస్కో శాంతి. మొత్తానికి ఈ సుందరాంగి అభిమానాన్ని తట్టుకోవడం చాలా కష్టమేనన్నమాట.

## జుట్టు ద్వారా బైటపడే అనారోగ్యం

మనిషి జుట్టుని పరీక్షించి వారికొచ్చే వ్యాధుల సూచనలను ముందే తెలుసుకోవచ్చునంటున్నారు ఉజ్బెకిస్తానికి చెందిన కొందరు శాస్త్రవేత్తలు. డయాబెటిస్, హృద్రోగం, ఐరన్‌లోపం, ఎనీమియా, కొన్ని రకాల కేన్సర్ల లక్షణాలు జుట్టుద్వారా వెల్లడవుతాయని ఆ శాస్త్రవేత్తలు తమ రిపోర్టులో తెలిపారు. తమ పరిశోధన కోసం వారు 2000 మంది జుట్టు శాంపుల్స్ అధ్యయనం చేశారు.

జుట్టును విశ్లేషించడం ప్రజల ఆరోగ్యస్థితిగతులను తెలుసుకోవడానికి తోడ్పడుతుందని, అలా వివిధ వ్యాధులు వచ్చే రిస్క్ అధికంగా వున్నవారిని వేరుచేసి, కాలాతీతం కాకుండా రోగనిర్ధారణ చేయవచ్చుని అంటున్నారు వైద్యనిపుణులు. చైనాకి చెందిన ఓ రిపోర్టు, జుట్టులోని జింకు పరిమాణాన్ని బట్టి పిల్లల లోని వ్యాధులను గుర్తించడం వీలవుతుందని ఇటీవల తెలియజేసింది. ◆



ఇక తప్పదని మెల్లగా 'శివరావ్' అన్నాను.

'మాకు వినపడలేదోచ్' వెనుకనున్న ఎవరో అరిచారు.

'గట్టిగా చెప్పాల్సిందే' మళ్ళీ వెనుకనున్నవాళ్ళే పట్టుపట్టారు.

నోరు ఫ్రీగా తెరిచి చెప్పాను 'శివరావ్'

మళ్ళీ కొన్ని గొంతులు అరిచాయి 'వినపడలేదు'

'పోనీలెండి. ఇక పెళ్లికుమారుడ్ని తన భార్య పేరు చెప్పమనండి'

ఆయన కాస్తంత గట్టిగానే 'మహిత' అన్నారు.

'అదీ! మగవాడనిపించుకున్నావ్ మగవాళ్ళు మెచ్చుకున్నారు.

'ఇప్పుడే సర్టిఫికెట్లు ఇచ్చేయకండి. ఆ సర్టిఫికెట్ ఇవ్వవలసింది పెళ్ళికూతురు' ఎవరో అంటేస్త్రీలంతా సిగ్గుసిగ్గుగా నవ్వారు.

'ముందుంది ముసళ్ళపండగ'

'ముసళ్ళపండగ కాదు- మొగలిపూల పండగ'

'మా ఆడబడుచులాంఛనాలు చెల్లించుకుంటే ఇక మిమ్మల్ని గదిలోకి పంపిస్తాం. పాపం! మా వదినకు చాలా తొందరగా వున్నట్లుంది' నా ముందున్న అమ్మాయి ఆయన వైపు తిరిగి అంది.

పెళ్ళిలో వుండే బలమూ, బలహీనతా అదేననుకుంటా. పెళ్ళికిముందు నిషిద్ధమైనవన్నీ, ఇప్పుడు ఫ్రీగా మాట్లాడేసుకోవచ్చు. ఎవరూ తప్పుపట్టరు. పెళ్ళికిముందైతే సెక్స్ అంటేనే వేయికాళ్ళ బూచీలా భయపెడుతుంది. మనం ఏదైనా చేస్తే ఊరంతా మనల్ని ఆడిపోసుకుంటుంది. ఆ మూడుముళ్ళూ పడిపోతే అదే ఊరు మనల్ని మగవాడితో గడపమని గదిలోకి నెడుతుంది.

ఆయన జేబులోని వందరూపాయల నోటు తీసి ఆమెకిచ్చాడు.

'రైట్...రైట్' అంది నూరు రూపాయలనోటుని గుప్పెట్లో మూస్తూ.

మేము ముందుకు అడుగువేయడం, మా వెనక గడి పడిపోవడం ఒకేసారి జరిగిపోయాయి.

'శివా- లోపల గొళ్ళెం పెట్టుకో' బయటనుంచి ఎవరో పెద్దగా అరిచారు.

ఆయన కంగారుగా వెళ్ళి గొళ్ళెం పెట్టారు.

అప్పుడు చూశాను ఆయన్ని. ముఖమంతా చెమటలు పట్టేశాయి. మనిషి కూడా సన్నగా వణుకుతున్నట్లు అనిపించింది. కానీ నేను ఇదేమీ గమనించనట్టు తల వంచుకున్నాను.

ఆయన నేరుగా వెళ్లి మంచంమీద కూర్చున్నారు. నన్ను పిలుస్తాడేమోనని కొంతసేపు చూశాను. కానీ ఆయన పిలవలేదు.

కాసేపు అలానే వుండి, ఆ తరువాత మెల్లగా కదిలి, ఆయనకి దగ్గరగా వెళ్ళి నిలుచున్నాను.

ఆయన నన్ను చూసి పేలవంగా నవ్వారు. మమ్మల్ని గదిలోకి తోస్తూ బయటివాళ్ళు ఆయన్ని కంగారుపెట్టేశారు. అందుకే అలా అయిపోయారనుకున్నాను. నేను పక్కగా కూర్చుని 'మీ ఊరు, మీ ఇల్లు బావున్నాయండీ- నాకు బాగా నచ్చాయి' అన్నాను. ఆయన మౌనంగా వుండిపోయాడు.

'వాటికంటే మీరు మరింత నచ్చారు. ఆ మీసాలు తీసేస్తే అచ్చు ఆడపిల్లలా వుంటారు' అని చిన్నగా నవ్వాను.

ఈసారి ఆయన బలవంతంగా పెదవులను విప్పదీశారు.

'నేను మీకు నచ్చానా?'

తల ఆడించాడు.

'మీ బంధువులు నామీద ఏం కామెంట్ చేశారు?'

ఆయన దగ్గర్నుంచి ఏమీ సమాధానం రాలేదు.

ఆయనముఖంలోకి చూస్తూ 'మాట్లాడరేమిటి?' అంటూ రెట్టించాను.

ఆయనలో భయం స్పష్టంగా కనిపిస్తోంది.

'ఏమైంది? అలా వున్నారేమిటి?'

'కొద్దిగా తలనొప్పిగా వుంది మహితా' అదీ ఆయన మొదటిసారి నన్ను పేరుతో పిలిచింది. ఏదో ఆనందపు వీచిక అలా నా రక్తాన్ని స్పృశిస్తూ వెళ్ళినట్లనిపించింది.

'విక్స్ ఏమైనా రాయనా?'

'వద్దు- కాసేపటికి సర్దుకుంటుంది'

ఆయనకి తలనొప్పిగా వున్నప్పుడు ఏం మాట్లాడను? అందుకే మౌనంగా వుండిపోయాను.

ఇక కూర్చోవడం వీలు కాదనిపించి, ఆయన పక్కగా పడుకున్నాను. సంఘం వేసిన మంత్రంతో అన్నిరోజులూ ముడుచుకుని గుండెల్లో పడుకుండిపోయిన కోరికలన్నీ ఒక్కసారిగా నిద్రలేచాయి. వెచ్చటి ఆవిర్లు శరీరంలోంచి పుట్టుకొస్తున్నాయి. ఎద పొంగుతోంది. ఎక్కడెక్కడో ఏదో తెలియని సంచలనం నాకు మాత్రమే తెలుస్తోంది.

'ఛీ ఛీ! పాడు తలనొప్పి'నాలో నేనే అనుకున్నాను.

ఆయనకు అభిముఖంగా వున్న నేను ఈసారి ఆయనవైపు తిరిగాను. ఆయన అటువైపు తిరిగి పడుకుని వుండడంతో వీపు కనిపిస్తోంది. మెల్లగా జరిగాను. నా గుండెల్ని సుతారంగా గుచ్చాను. జైపూర్ రాజమందిరం ముందున్న గువ్వలు ఒక్కసారిగా పైకి లేచినట్లయింది. నా ఒళ్ళే పెద్ద వక్షస్థలంలా వ్యాకోచించింది.

ఆయన ఫీలింగ్స్ ఏమిటో తెలియడంలేదు.

ఏదో ఏమరుపాటుగా వేసినట్లు కుడిచేతిని ఆయన మీద వేశాను. అప్పుడు నా స్తనాలు మరింత ముందుకు ఉరికాయి. ఆ ఒత్తిడితో కోరికంతా పగిలి నా శరీరానికి చుట్టుకున్నట్లయింది.

ఏదో కావాలన్న ఆరాటం నన్ను మరింత ముందుకు తోస్తోంది. ఆయన ఇటు తిరుగుతారనుకున్నానుగానీ తిరగలేదు.

అలానే ఓ పదినిముషాలపాటు వుండిపోయాను. అలా నిశ్శబ్దంగా వుండడం చేతకావడంలేదు. అంత క్లోజ్‌గా భర్త పక్కన పడుకుని ఊరకుండడం సాధ్యమయ్యే పని కాదు.

తల్లోని మల్లెపూల దండ వెంట్రుకల బంధం నుంచి తప్పించుకుని ఎదమీదపడి నాభర్త చేయాల్సిన పని అది చేస్తోంది. నా శరీరమే పెద్ద అగ్నిగుండంగా కాలిపోతోంది. చివరికి బొడ్డులోంచి సైతం వేడి ఆవిర్లు పుట్టుకొస్తున్నాయి.

చేతిని మరింత బిగించాను.

'తలనొప్పి పోయిందా?'

'లేదు- మరింత ఎక్కువైంది'

ఆ మాటలతో నాపై చన్నీళ్ళు కుమ్మరించినట్లయింది. ఎక్కడి అవయవాలు అక్కడ గప్‌చిప్ అయిపోయాయి. అలానే కళ్ళు మూసుకున్నాను.

'ఏదో కారణంవల్ల మొదటిరోజు శోభనం జరగకపోతే చాలా మంచిది. మళ్ళెప్పుడూ మొగుడు మనల్ని వదిలి పోడు' ఎప్పుడో మా పిన్ని ఎవరితోనో అన్న మాటలు గుర్తొచ్చాయి. తొలిరేయి చప్పగా చల్లారితే ఎలా మంచిదో నాకు తెలియదు. కానీ అలాంటివాటి నన్నిటినీ లాజిక్‌తో చీల్చి చెండాడకూడదు. నమ్మకమే వాటి ప్రాతిపదిక.

'అయితే నాకూ మంచే జరుగుతుంది' అనుకుంటూ నిద్రలోకి జారిపోయాను.

**(ఇంకావుంది)**


కొత్త వెస్పా సెలెక్ట్
Select
vespa
Select
Select

# ఆయుర్దాయాన్ని పెంచే అంశాలు

ఆరోగ్యం గురించి, దీర్ఘాయువు గురించి మన పెద్దవాళ్లు ఎన్నో మార్గాలు చెప్పారు. **'శతం జీవ శరదో వర్ధమానః'** అని అధర్వవేదం చెబుతోంది. అంటే నూరేళ్లు పాటు ఆరోగ్యంగా, ఉన్నతాశయంతో జీవించమని. నూరేళ్లవరకు మానవుడు కర్మశీలుడై జీవశక్తిని సంయమనంతో ఉపయోగించాలేగానీ వృథాపరచరాదట.

శరీరాన్ని రాతివలె దృఢంగా మలచుకోవాల్సిన అవసరం వుంది. **'అశ్మానం తన్వం కృధి'** ఓర్మి, పట్టుదలలతో కూడిన శ్రమశక్తివల్ల శరీరం మరింత దృఢంగా మారుతుంది. శ్రమశక్తి ప్రభావం మానవునిపై ఎలా వుంటుందో ఇక్కడ ఇస్తున్న కొన్ని ఉదాహరణద్వారా కొంతమేరకయినా అర్థమౌతుంది.

ఒక ప్రభుత్వోద్యోగి యాభై ఏళ్లకే రిటైర్‌మెంటు తీసుకుని, ఆఫీసునుంచి బయటపడగానే పనిభారం మరచి స్వేచ్ఛగా, ఆనందంగా బ్రతకవచ్చనీ మరింత ఉల్లాసంగా, ఆరోగ్యంగా వుండవచ్చనీ భావించేవాడు. కష్టమైన రోజు వారీ పనుల్నుంచి విరామం లభిస్తుంది కనుక శేషజీవితం స్వేచ్ఛగా, ఆనందంగా గడుపవచ్చని అతని ఉద్దేశం.

రిటైరయ్యాక పెన్షన్ అందుకున్నాడు. పనిభారంనుంచి విముక్తి లభించింది. అలాగే ఆరోగ్యంతో యుద్ధం కూడా ప్రారంభమైంది. మూడు, నాలుగు రోజులు అక్కడక్కడా కూర్చుంటూ మరికొన్ని రోజులు పాత మిత్రులు, బంధువుల ఇళ్లకు తిరుగుతూ గడిపాడు.

కానీ మనసు సరిగా వుండడంలేదు. వారం, నెల, రెండు నెలలు ఇలా ఎంతకాలం పరిచయస్తులు, బంధుమిత్రుల ఇళ్లకు తిరుగుతూ గడపడం? జీవితం ఎంతో దీర్ఘమైంది. పనీపాటూ లేని జీవితం. కూర్చుని కూర్చుని అతని శరీరం రోగగ్రస్తమైంది.

కొన్ని రోజులకు అతను మంచంపట్టాడు. కొన్ని మాసాల క్రిందట ఏ మనిషైతే రోజూ ఎనిమిది గంటల్ని పనిలో తెలియకుండా దొర్లించేస్తుండేవాడో అదే మనిషి ఇప్పుడు మంచంమీద పడి డాక్టర్‌చేత నాడి చూపించుకుంటూ నిమిషాల్ని గంటల్లా లెక్క పెట్టుకుంటూ అసహనంగా ఈడుస్తున్నాడు.

మంచంమీద పడ్డ అతని ఆత్మకు పనిలేని బ్రతుకు జడమై మరికొంతకాలానికి అకాలమృత్యువాతపడాల్సి వస్తుందన్న ఆలోచన అకస్మాత్తుగా కలిగిందొక రోజు. ఏ పనీ లేకపోవడం, పనిగూర్చి ఆలోచించకపోవడం ఆత్మహత్యాసదృశమని తలపోశాడు. శరీరమున్నంత వరకు ఏదో ఒకపనిచేస్తూ జీవించాలి అన్న ఆలోచన అతనికి స్ఫురించింది.

## పునర్జీవనం

ఈ ఆలోచన రావడమే తరువాయిగా తాను అంతకుముందు పనిచేసిన పాత ఆఫీసుకి వెళ్లాడు. అదృష్టవశాత్తు దినసరి వేతనంమీద పని దొరికింది. మళ్లీ ఆఫీసుకు వెళ్ళడం మొదటి రెండు రోజులూ



**మందు మాకులకన్నా 'పని' అనేది మనిషికి పరమౌషధం! శారీరకంగా లేదా మానసికంగా ఏదో ఒక పనిచేయడంవల్ల మనిషి ఎక్కువ కాలం జీవిస్తాడు.**

**మనిషి ఎంతగా ప్రయోజనకర కార్యక్రమాల్లో పాల్గొంటే అంతగా అతను ఆరోగ్యంగా వుంటాడని చెప్పవచ్చు. ఎక్కువగా ఏ పనీ పాటూ లేకుండా కూర్చోవడం మనసు, శరీరం రెండింటికీ చెరుపు చేస్తుంది.**

కష్టమనిపించింది. ఆశ్చర్యం! నాలుగోరోజుకల్లా శరీరమనే యంత్రం పూర్వంలా పనిచేయసాగింది.

భగవంతుని లీల! అన్నట్లు తాను చేస్తున్న పనిలో నిమగ్నమయ్యాక తన వృద్ధాప్యం, జబ్బు, బలహీనత, పిరికితనపు ఆలోచనలు కనీసం కలలోకూడా రావడం మానేశాయి. పూర్వంలాగానే ఆఫీసుకు పోతూ యువకుడిలానే పనిచేస్తున్నాడు. జీతం తక్కువేగానీ దాని గురించి ఆలోచనే రావడంలేదు.

ఉదయం నుంచి సాయంత్రం వరకు పనిలో పొద్దుపోతోంది. తనలో వచ్చిన మార్పు గురించి అతని అభిప్రాయం ఇలా వ్యక్తంచేశాడొకసారి. మందు మాకులకన్నా 'పని' అనేది మనిషికి పరమౌషధం! మందులు చేయలేని లాభం పట్టుదల కలిగిన కృషిమయమైన జీవనంలో లభిస్తుంది.

కృషివల్ల జీవితం, ఆరోగ్యం అభివృద్ధి చెందుతాయి. శారీరకంగా లేదా మానసికంగా ఏదో ఒక పనిచేయడంవల్ల మనిషి ఎక్కువ కాలం జీవిస్తాడు. ఈ ప్రకృతిలో ఎక్కువకాలం జీవించే ప్రాణి ఎక్కువ పరిశ్రమచేసే జీవి మాత్రమే! ఆరోగ్యవంతమైన దీర్ఘాయుష్మంతునిగా జీవించాలంటే జీవితంలో చివరిశ్వాసవరకు మనిషిపనులు చేస్తూనే వుండాలి.

## ఎనభైయేళ్ళ వయసులో చదువు

పారిస్ నగరంలో ఒకనాటి సంగతి. జుట్టు ముగ్గి బుట్టయిన ఒక అవ్వకి 60 ఏళ్లకు ముందు వైవాహిక భేదాభిప్రాయాలవల్ల భర్త విడాకులు ఇచ్చేశాడు. ఏదైనా ఉద్యోగం కోసం తిరిగింది. ఫలితం లేకుండా పోయింది. చివరకు, చదవడంలోనూ రాయడంలోనూ ఎంతో ఆనందం వున్నట్లు గ్రహించింది. పని లేకుండా వుండకూడదన్న ఉద్దేశంతో సారబోన్ విశ్వవిద్యాలయంలో చదవడం ప్రారంభించింది ఆ వృద్ధురాలు.

ఎనభై ఏళ్ల ఆ మహిళ 1954వ సంవత్సరంలో ఆ విశ్వవిద్యాలయంలో విశిష్ట విద్యార్థిని అయ్యింది. ఆనాటికి ముగ్గురు కుమారులు, ఏడుగురు మనుమరాళ్లు, ఒక ముని మనుమరాలు. మానసికంగా ఆరోగ్యకరంగాను, దీర్ఘాయుష్మంతులుగాను జీవించడానికి గాను ఓర్పుగా పనిచేయడం అవసరం అని నమ్మింది. ఆ తరువాత కూడా ఇంగ్లీషు, జర్మన్ భాషలు నేర్చుకోడానికి విశ్వవిద్యాలయంలో చేరింది.

మనిషి మిషన్‌లా ఆగకుండా పనిచేస్తుంటే చాలా కాలం జీవిస్తాడు. మనిషి ఎంతగా ప్రయోజనకర కార్యక్రమాల్లో పాల్గొంటే అంతగా అతను ఆరోగ్యంగా వుంటాడని చెప్పవచ్చు.

విద్యార్థి అంటే విద్యనభ్యసించడంలో వున్న కష్టాన్ని భరించి ఆనందించేవాడు.

"విద్యను సాధించడమే లక్ష్యంగా గుర్తుపెట్టుకొని మిగిలిన విషయాల్ని మరిచి పోయేవాడే నిజమైన విద్యార్థి" అన్న గాంధీజీ మాటలు ఇక్కడ మనం గుర్తుంచుకోవాలి.

ఇది గుర్తుంచుకుని విద్య నభ్యసించినవారి లక్ష్యం నెరవేరుతుంది. జీవితంలో ఉన్నతమైన ఆదర్శం లేనివారి శ్రమంతా నిరర్థకం.

## 115 ఏళ్ల పోస్టుమేన్

ధన్‌బాద్‌లో 115 సంవత్సరాల వయస్సు కలిగిన పోస్టుమేన్ చాలా జీవితాన్ననుభవించి జీవించి వుండగా ఆనాటికి అదే పోస్టల్ డిపార్ట్‌మెంట్‌లో తనతోబాటు పనిచేసిన మరొక ఉద్యోగి ముందుగానే ఈ ప్రపంచాన్ని వదలి వెళ్లిపోయాడు.

ముందు పేర్కొన్న వ్యక్తి పోస్టుమేన్‌గా ఉద్యోగంచేస్తూ కాలినడకన తిరుగుతుండేవాడు. ఎంత దూరమయినా సైకిలుమీద తిరగడానికి కూడా ఇష్టపడేవాడుకాదు. లక్ష్యం లేని సోమరి జీవితమంటేఅతనికి అసహ్యం. అంత ముసలి వయసులో కూడా అతను శాంతస్వభావుడు.

అతనికి మధుపానంలాంటి అలవాట్లు లేవు. రిటైరయ్యాక కూడా ఎక్కువకాలం పెన్షను అందుకున్నాడు. నిరంతరం ఏదో ఒకపనిలో నిమగ్నమై తిరుగుతూ వుండడం వల్ల పరిపూర్ణమైన ఆరోగ్యంతో బ్రతికాడు.

ఎవరయినా అతని ఆరోగ్యంగూర్చి ప్రశ్నిస్తే అతను చెప్పేదొకటే- "నేను ఎన్నడూ తీరికగా వుండను. నిద్ర సమయం తప్ప మిగతా సమయమంతా ఏదో ఒక పనిలో నిమగ్నమై వుంటాను. అందువల్ల అనారోగ్యం దరికి చేరదు"

## ముసలివారు పనిచేయరాదా?

పాతికేళ్ల కిందట ఒక రష్యన్ వార్తాపత్రికలో ప్రచురితమైన వార్త. 158 ఏళ్ల రైతు 'మఖమూద్ ఇవా జోవ్' కృషి ప్రదర్శనలో పాల్గొన్నాడు.

సోవియట్‌లో ఆయన్ను దీర్ఘాయుష్మంతునిగాను, ధార్మిక జీవనం గడపడంలో విఖ్యాతుడుగాను ఆయన నిర్వహించిన కార్యక్రమాలకు ప్రశంసారూపంగా 1965వ సంవత్సరంలో సోవియట్ ప్రభుత్వం "ORDER OF RED BANNER OF LABOUR" అన్న బిరుదునిచ్చి సత్కరించింది. ఆయన అనుభవాలు కొన్ని ఇలా వున్నాయి :

"మనిషి శారీరకమైన, మానసికమైన శ్రమ ఏదో ఒకటి చేస్తూ వుండటంవల్ల బ్రతుకు రసమయమవుతుంది. దానివల్ల శరీరంలోని జీవాంగాలు చురుకుగా పనిచేస్తాయి. ఏ పనీ లేకుండా నిర్వ్యాపారులై కూర్చునేవారు ముందుగానే వృద్ధులవుతారు.

పారే నీరు ఎలా స్వచ్ఛంగా, తేజంగా, ఆరోగ్యకరంగా వుంటుందో అలా పనిలో నిమగ్నమయ్యేవారి శరీరంలో కండర స్నాయువులు, నాడీతంత్రులు తేజోవంతమై పనిచేయడానికి ఉత్తేజపరుస్తాయి.

జీవితమంతా యౌవన దశలోవలె శరీరాన్ని కాపాడుకోవాలనుకునేవారు తెలుసుకోవాల్సిన రహస్యం ఒకటే! వాస్తవానికి మనిషి జీవిత పరమార్థం నిరంతరం పనిలో జీవించడమే!

ముసలివారు పనిచేయరాదు, ఎక్కువగా తిరగరాదు అనేది చాలామంది వాదం. అది తప్పు! బ్రతికున్నంత కాలం శరీరం, మెదడు ఆత్మలమీద పనిభారం పెరుగుతూనే వుండాలి. ఏ పనీ పాటూ లేకుండా కూర్చోవడం మనసు, శరీరం రెండింటికీ చెరుపు చేస్తుంది. మనిషికి వయస్సు పెరిగేకొలది కార్యనిర్ణయాత్మక శీలం పెరుగుతుంది. క్రమబద్ధమైన పనిని బట్టి మనిషి ఎక్కువకాలం జీవిస్తాడు"



## పెన్షన్ తీసుకున్నాక ఏంచేయాలి?

ఒక కార్మికుడు లేదా ఒక ఉద్యోగి తన పనిలో అమితంగా కష్టపడుతున్న భావన రానీయక పరిశ్రమిస్తుంటే అతడు డెబ్బై ఏళ్ల వరకు చక్కగా జీవించగలడు. దానికి భిన్నంగా భావించేవారిలో వారి నిత్యకృత్యాల్లో స్ఫూర్తి మాయమై జీవాంకం అసమర్థమై తొందరగా చనిపోతారు.

వృద్ధాప్యం ఆవరించాక ప్రయత్నించి నెరవేర్చగల పనులను కూడా విడిచి వుచ్చే ప్రతి ఒక్కరి గతీ ఇలాగే అవుతుంది. చాలామంది ఉద్యోగులు పెన్షన్ చేతబట్టగానే బలహీనమై జబ్బుపడిపోతారు. రిటైరైనంత మాత్రాన పనీ పాటా మానకూడదు. కొన్ని తేలికైన పనులు తప్పక చేస్తుండాలి.

తోటపని, సంగీత సాహిత్యాలు,తిరగడం, యాత్రలు చేయడం, ఇంటివద్ద పశువుల్ని సాకడం, పక్షులకు చిరుధాన్యాలు తినిపించడం, స్నానంచేయడం, విశాలమైన చోట గాలిలో విహరించడం, చిన్నబిడ్డల్ని చదివించడం, వారితో ఆడుకోవడం, పూజలు చేయడం, గుడికి వెళ్తూ వుండడం, గుడిని శుభ్రం చేయడం వంటి పనులయినా చేస్తుండాలి.

## ప్రపంచమంతా కర్మమయం

నిజానికి ప్రపంచమంతా కర్మమయమే! పని లేకుండా కూర్చోవడం సాక్షాత్తూ మృత్యునీడలో వుండటమే! ఏదో ఒక పనిలో నిమగ్నమయ్యే వ్యక్తి ఆరోగ్యంగా వుంటూ శరీరాన్ని, మనసును స్వాధీనంలో వుంచుకుంటూ ఉద్వేగ, వికారరహితంగా ప్రసన్నచిత్తంతో ఉదారంగా వుంటాడు. సమగ్రంగా శ్రమించడంలోనే జీవికి ఆనందం వుంటుంది.

దీనినే శ్రీకృష్ణభగవానుడు భగవద్గీతలో-

***నహి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్య***
***కర్మకృత్***
***కార్యతే హ్యవశః కర్మసర్వః ప్రకృతిజైర్గుణైః***
***శరీర యాత్రాపి చ తేన ప్రసిద్ధమిద***
***కర్మణః***

కర్మనిష్ఠ లేకుండా ఏ వ్యక్తి అయినా క్షణమాత్ర మయినా జీవించలేడు. ప్రతి జీవికీ ప్రకృతిసహజమైన 'పని' అనేది ఏదో ఒకటి వుంటుంది. ఇతరత్రా ప్రయోజనాలు లేకపోయినా బ్రతుకు సాగించడానికయినా ప్రతివ్యక్తీ ఏదో ఒక పని చేయాలి. ప్రపంచమే కర్మమయం.

ప్రపంచచక్ర పరిభ్రమణం గమనిస్తే ప్రకృతి కార్యకలాపాల రహస్యం అర్థమౌతుంది. నియమంగా ప్రకృతి కార్యకలాపాలు ఎలా జరుగుతున్నాయో గమనించవచ్చు.

జీవుడి లక్షణం ఏమిటి? జీవ నిర్జీవ పదార్థాల మధ్య భేదం ఏమిటి? వాటి గుణ స్వభావాలేమిటి? ఏ స్వభావాల కారణంగా నిర్జీవిని జీవినుంచి వేరుచేస్తున్నారు? ఈ గుణభేదాల్ని క్షుణ్ణంగా తెలుసుకోవడం అవసరం!

***కర్మణాభి భాంతిదేవాః పరత్ర కర్మణైవేహ***
***ప్లవతే మాతరిశ్వ ।***
***అహోరాత్రే విదధన్ కర్మణైవా తంద్రితో***
***శశ్వదుదేతి సూర్యః ।***

అనగా స్వర్గలోకాన దేవగణాలు అక్షయకాంతుల్తో ఎందుకు మెరుస్తున్నాయి? వాయువు రాత్రింబవళ్లు కదులుతూ మనల్నెందుకు ఊగిస్తోంది? ఆ గాలితో మనలో స్పందన, చైతన్యం ఏల కలుగుతున్నాయి? యుగయుగాలుగా సూర్యభగవానుడు అవిరళవేగంతో రాత్రింబవళ్ళను ఎందుకు సృష్టిస్తున్నాడు? ఈ ప్రకృతి, ఈ ప్రపంచం ఎందుకు నడుస్తున్నాయి?

దీనికి జవాబు ఒకటే. 'చలనం' దీనికి కారణం. దీని అర్థం 'కర్మశీలం'.

ఈ ప్రపంచమే కర్మక్షేత్రం. సోమరులు, నిర్వ్యాపారులకు ఇక్కడ స్థానంలేదు. సుఖశాంతులు పొందడానికి ఏదో ఒకపని నెరవేరుస్తూ వుండాలి. నిత్యమూ పనిలో మునిగిపోవాలి. కర్మవీరులుగా వుండిపోవాలి.

**–ఎమ్. నాగేంద్రప్రసాద్**

సీరియల్



# రారా మా ఇంటిదాకా

-మేర్లపాక మురళి

**11** వంశీ సుజనల పెళ్ళవుతుంది. శోభనం ముహూర్తం దగ్గరపడిందనగా సుజనకు 'మూడు రోజుల' ఇబ్బంది ఎదురౌతుంది. ఆ మూడు రోజులూ వీలుకాదు కనుక మరో ముహూర్తం చూస్తాడు సుజన తండ్రి. కానీ ఆ ముహూర్తానికిముందే, తమ శోభనం జరుపుకోవాలనే ప్లాన్ లోవుంటుంటారు వంశీ సుజనలు. సుజన మద్రాసులో వుండగా ఆమెని చిట్టిబాబు ప్రేమిస్తాడు. అది విఫలమైనందుకుగాను సుజన పెళ్లికిముందు చిట్టిబాబు ప్రవర్తించిన తీరు గుర్తుకువచ్చి మరింత ఆందోళనపడి, అతనిపై కోపాన్ని ప్రకటిస్తాడు సత్యనారాయణ. అది వంశీకి అనుమానం కలిగిస్తుంది.

మహిత తన ఫస్ట్‌నైట్ విశేషాలు సుజనకి చెప్తుంటుంది. మహితకి ఇద్దరు అక్కయ్యలు. వారి పెళ్లినిమిత్తం వున్న ఆస్తి అంతా కరిగిపోయి పేదవాడవుతాడు మహిత తండ్రి. ఆ సమయంలో కట్నంలేకుండా పెళ్లిచేసుకుంటానని ముందుకువచ్చిన ఆస్తిపరుడైన ఓ అబ్బాయికి మహితనిచ్చి పెళ్లిచేస్తారు ఆమె తల్లిదండ్రులు. ఆ రోజు ఇద్దర్నీ శోభనం గదిలోకి ప్రవేశపెడతారు.

కోళ్లు కూసేప్పుడు మెలకువ వచ్చింది. పక్కకు చూస్తే ఆయన లేరు. పడకమీద నుంచి లేచి పెరట్లోకి వచ్చాను. మా అత్తమ్మ కళ్ళు సరిగా కనబడకపోయినా పొయ్యి రగలెయ్యడానికి నానా తంటాలు పడుతోంది. జడ విప్పుకుంటూ కూర్చుండిపోయాను.

కాసేపటికి బంధువులమ్మాయిలు నిద్రలేచి నా దగ్గరికి వచ్చారు.

భాను నా పక్కగా కూర్చుంటూ 'రాత్రి అదిరిందా... శరీరం కాదు-అనుభవం' అనడిగింది. చిన్నగా నవ్వాను.

ఆమెది మా ఇల్లు తరువాతి ఇల్లు. ముప్పైకి లోపే వుంటాయి.

'మల్లెపూలు వాడలేదు- చీర నలగలేదు- ఏమిటి కథ?'

నేను ఏమీ మాట్లాడలేదు.

'నీ వాలకం చూస్తుంటే ఏమీ కానట్లుంది. విశ్వరూప సందర్శనం తరువాత అర్జునుడి కళ్ళు మెరిశాయంట. అలా నీ కళ్ళు మెరవడంలేదే'

'ఊరుకో అక్కా'

'నేను ఊరుకుంటే ఊరు ఊరుకోదే. ఆరాలు తీస్తుంది. ఇంతకీ ఏమీ జరగలేదా?'

చుట్టూ వున్న ఇద్దరు ముగ్గురు ఆత్రుతతో నా సమాధానం కోసం చూస్తున్నారు.

'తలనొప్పి'

'శివరామ్‌కా-నీకా?'

'ఆయనకే'

'విక్స్ పూయకపోయావా?'

'వద్దన్నారు'

'వద్దన్నా- ఇలాంటప్పుడు ఊరకుండకూడదు. పైనపడి పూయాల్సిందే. మా ఆయనా మొదటిరోజు మౌనంగా వుంటే నేనేం చేశానో తెలుసా?'

చుట్టూ చేరినవాళ్ళు నా నుంచి భానూవైపు చూపు మరల్చారు.

'మూర్ఛరోగం వుందని చెప్పి మీదపడిపోయాను. ఆయన వేడెక్కాక లేచి కూర్చుని మూర్ఛరోగం పోయింది అన్నాను'

అందరం నవ్వుకున్నాం.

'ఈ రోజు తలనొప్పి అంటే నేను చెప్పినట్టు చెయ్. ఏం చేయాలో తరువాత చెబుతాలే అంది.

ఆమె మళ్ళీ 'నిన్ను చూస్తుంటే ఎప్పుడో చదివిన జోక్ గుర్తుకొస్తోంది' అని తను ఏదో పుస్తకంలో చదివిన జోక్ చెప్పింది.

'ఓ అబ్బాయి పెళ్లిచూపులకు వెళ్ళాడు. అమ్మాయి నచ్చింది. హుందాగా, నిండుగా, మంచి మర్యాదస్తురాలిలా కనిపించింది. ఈమె ఫస్ట్‌నైట్ అల్లరిగా, సరదాగా వుంటుందో వుండదోనన్న అనుమానం ఎందుకనో కలిగింది అతడికి.

పెళ్లిచూపులయ్యాక, తిరిగి బస్టాండ్‌కి వస్తూ మధ్యవర్తిని అడిగాడు. 'అమ్మాయి బావుంది. కానీ ఫస్ట్‌నైట్ పెర్‌ఫార్మెన్స్ మీదే అనుమానంగా వుంది. పెళ్లికిముందు ఓ రోజు నాతో గడుపుతుందేమో అడిగిచూడు'

మధ్యవర్తికి మతిపోయింది. కానీ పెళ్ళి కుదరకపోతే పర్సంటేజ్‌పోతుంది గనుక సరేనన్నాడు.

పెళ్లికూతురి దగ్గరికెళ్ళి విషయం చెప్పాడు.

వెంటనే ఆమె 'ఆయనికి అలాంటి సందేహాలు ఏమీ వద్దు. నా ఫస్ట్‌నైట్ పెర్‌ఫార్మెన్స్ అద్భుతంగా వుంటుంది. కావాలంటే మా ఎదురింటి రమేష్‌నో, చివరింటి సురేష్‌నో అడగమనండి' అంది.

మధ్యవర్తికి మరోసారి మతిపోయింది'.

నాతోపాటు అందరం నవ్వాం.

'శివరామ్‌కి అలాంటి రికార్డ్ ఏమీలేదు. బుద్ధిమంతుడు. ఆడపిల్ల కనిపిస్తే ఆమడదూరం పరుగెత్తేవాడు'

అందుకేనేమో అలా వణికిపోయాడు.

జనరల్‌గా అబ్బాయిల్లో చాలామందికి పెళ్లికి ముందే ఈ ఎక్స్‌పీరియన్స్ వుంటుంది. అలా లేదంటే అతగాడు గుడ్ బాయ్ అన్నమాట.

ఆ రోజు సాయంకాలం నేనెలా నడుచుకోవాలో భాను అరగంటసేపు చెప్పింది.

రెండో రోజు రాత్రి ప్రారంభమైంది. పేర్లు చెప్పడంగానీ, ఆడబడుచు లాంఛనాలుగానీ ఏమీలేవు. అప్పటికే బంధువులంతా వెళ్లిపోయారు. భానూనే నన్ను గది వరకు వదిలి వెళ్లిపోయింది.

నేను లోపలికి వెళ్లిన పావు గంటకు ఆయన వచ్చాడు.



'ఏమిటి ఆలస్యం?'

చొరవగా వుండమని భానూ చెప్పడంతో నేనే అడిగాను.

ఆయన చేయి పట్టుకుని మంచం దగ్గరికి పిలుచుకువచ్చాను.

ఇద్దరం కూర్చున్నాం.

'తెల్లటి బట్టల్లో మరింత బావున్నారు'

'ఈ రోజ్ కాటన్ చీర ఎలా వుంది?'

'బావుంది' ముక్తసరిగా అన్నాడు.

'ఉదయంనుంచీ నడుం అలా వాల్చలేదు' అంటూ పడుకున్నాను.

అలానే కూర్చున్న ఆయన్ని నా మీదకు గుంజాను. ఎంత టెక్నిక్‌తో లాగానంటే నా ఎద ఆయన ముఖంమీద గుద్దింది. నాకే ఒళ్లంతా తిమ్మిరెక్కింది. రక్తప్రసరణంతా ఆగినట్లయింది. మరి ఆయనకెలా వుందో అంతుబట్టలేదు.

'మీ స్వర్గం తాళాలు నా దగ్గరున్నాయి. మరి అవి ఎక్కడున్నాయో చెప్పుకోండి చూద్దాం'

ఆయన చేష్టలుడిగి కూర్చుండిపోయారు.

'ఎక్కడ ఆ తాళాలు?' అంటూ ఆయన నన్నంతా తడుముతారనుకున్నాను. ఊహూఁ. లాభంలేదు.

మరికొంతసేపు అలా మౌనంగా వుండిపోయాను. నేను లేచి కూర్చున్నాను.

'అబ్బ! జడ మరింతగా పైకి వేసింది భాను. తలంతా పట్టేసినట్లుంది' అంటూ జడ విప్పాను. మల్లెపూలను తీసి ఒళ్లో వేసుకున్నాను. వెంట్రుకలన్నీ ఊడి గాలికి పూంపొద బరువుగా కదులుతున్నట్లు ఊగుతున్నాయి.

'ఈ చీర మా ఊర్లో కొన్నాను. మూడు మూరలుంటుందని ఇచ్చాడు కొట్టువాడు. కానీ అంత వున్నట్లు లేదు. ఒంటిని చుట్టీ చుట్టనట్లుంది. కాస్త మూరలేసిపెట్టండి. నా మూర చిన్నది"

ఆయన రియాక్షన్ కోసం చూడకుండా చీర విప్పాను. రోజ్‌కలర్ చీర నా చేతుల్లో రోజాపూలదండలా ఒదిగిపోయింది.

ఇప్పుడు నా ఒంటిమీద లంగా, జాకెట్టు మాత్రమే వుంది. నా ఎద ముందుకు పొంగి, కళ్లను పీల్చేస్తోంది.

'చూశారా? ఆ టైలర్ ఎంత ఏమరపాటువాడో.

## చిన్నతమ్ముడు

సోగకళ్ల సోకులాడి రోజా 'అన్న', 'భైరవద్వీపం' హిట్లతో బలం పుంజుకుంది. మళ్లీ సొంత సినిమా వైపు అడుగులేస్తోంది.

"నేను చిన్నప్పట్నుండి మగరాయుడిలా అల్లరి చేసేదాన్ని. మా అన్నలిద్దరూ నాకు ఫ్రెండ్స్‌లాగే వుంటారు. వాళ్లిద్దరి ప్రోత్సాహం నాకు బాగా లభిస్తోంది. మా స్నేహం చూసి మా అమ్మ మా అన్నలతో 'మీ చిన్నతమ్ముడు' అంటుంది నా గురించి-" అని తన సోదరప్రేమని ప్రకటిస్తోంది. మగరాయుడిలా అల్లరి చేసిన స్ఫూర్తితోనే ఏమో, యాక్షన్‌సీన్లు చేసి చేతులు కాల్చుకుంది. అలాకాకుండా హాయిగా గ్లామర్ పండిస్తూ పోతే అందాల రోజాకి అడ్డేలేదు.



ఓ హుక్ పెట్టడం మరిచిపోయాడు' అంటూ ఎక్కడ హుక్ పెట్టలేదో చూపించాను. అంతకుముందే ఆ హుక్‌ను ఆయన చూడకుండా తెంపేశాను. అక్కడ పుక్కిలించిన చర్మం ఎర్రగా మెరుస్తోంది. జాకెట్టు తప్ప మరో ఆచ్ఛాదన లేని నా వక్షస్థలం ఆయన కళ్ళల్లో ప్రతిబింబాలై రేగుతోంది.

'హుక్‌లు లేకుండా జాకెట్టు వేసుకోవడం నాకు సుతరామూ ఇష్టముండదు' అంటూ విప్పేశాను.

ఇప్పుడు నా ఒంటిమీద కేవలం బ్రా, లంగా మాత్రమే వున్నాయి.

ఆయన గుడ్లప్పగించి చూస్తున్నాడు.

'ఈ బ్రాలో ఏదో పురుగు దూరినట్లుందండి- చూడండి' ఈసారి బ్రా కూడా తప్పించాను.

ఇరవై ఏళ్ల యవ్వనం, సోయగం పద్మాసనం వేసి కూర్చున్నట్లున్నాయి నా స్తనాలు. వీపంతా నున్నగా మెరుస్తోందనుకుంటాను. అటూ ఇటూ ఆయనవైపు కదిలి వీపు చూపించాను.

'అక్కడ దురదగా వుందండి.కాస్త గోకండి' అంటూ వీపు చూపించి నిలుచున్నాను.

వణుకుతున్న వేళ్లు మెల్లగా కదిలాయి.

గబుక్కున ముందుకు తిరిగాను.

నా ఎద ఎరుపు ఆయన ముఖంలో గీసుకుంటు న్నట్టు కమిలింది.

ఇక దొంగచాటు వ్యవహారాలు అనవసరమనిపించింది. మారు మాట్లాడకుండా ఆయన రెండు చేతుల్నీ నామీద వేసుకున్నాను. తెల్లటి లంగా పైకి ముడుచుకుపోతున్నట్లుంది.

గట్టిగా కౌగిలించుకున్నాను. నా నరాలన్నీ సుఖాన్ని ఓపలేక చిట్లాయి. రక్తమంతా పిచ్చిపట్టినట్లు పరుగులు ప్రారంభించింది. ఏవో కొన్ని అవయవాలు విస్ఫారడం తెలుస్తూనే వుంది. లోనుంచి పైకెగసిన సెగ ఆయన ఛాతీని మండిస్తోంది.

నాకైతే ఊపిరి పీల్చడం కూడా కష్టమై పోయింది.

వేసిన చేతులు అలాగే వున్నాయి. అవి కదలడం లేదు. మల్లెపూల తోటలో నడుస్తుంటే తక్కున మిన్నాగు కనిపించినట్లు అవాక్కయిపోయాను.

ఆయన నుంచి విడివడి కళ్లల్లోకి చూశాను. అవి నిరాసక్తంగా వున్నాయి.

'ఏమైంది?' కఠినంగా ప్రశ్నించాను.

'తలనొప్పి భరించలేనంత'

చప్పున చీర కట్టుకున్నాను. బ్రావేసుకుని జాకెట్టు ధరించాను.

'అయితే అలా పడుకోండి'

ఆయన పడుకున్నారు. తొందరపడి అలా రెచ్చగొట్టడం బాగోలేదనిపించింది. ఎంత తలనొప్పి లేకుంటే అంత నిస్తేజంగా వుండిపోతారు?

నేను కింద చాప వేసి పడుకున్నాను.

మూడోరోజు మా అమ్మావాళ్లు వెళ్లిపోయారు.

నేనూ, నా భర్తా, మా అత్తమ్మా మాత్రమే మిగిలాం. నేను వంట చేయడం ప్రారంభించాను.

ఆ రోజు రాత్రి ఇక పడుకోవడానికి ఉపక్రమిస్తుండగా మా ఇంటిమీద రాళ్ళు పడ్డాయి. నేను హ...పోయాను. శివరావ్ కోసం చూస్తే కనపడలేదు.

'ఏమండీ' అంటూ అరిచాను.

అప్పుడే ఆయన వీధిలోంచి వచ్చాడు.

'మన ఇంటిమీద ఎవరో రాళ్లేస్తున్నారండీ'

'అవునా?'

'ఊఁ'

'నే వెళ్లి చూస్తానుండు' అని ఆయన ఇంటి వెనుకనున్న మైదానంలోకి వెళ్లి, కాసేపటికి తిరిగి వచ్చాడు.

'ఎవరో దొంగలు' ఆయన చెప్పాడు.

నాకు భయమేసింది. ఆ ఇల్లు ఊరికి దూరంగా, కాస్తంత విసిరేసినట్లుండడంవల్ల ఆ ప్రాంతమంతా చీకటిగా, భయంకరంగా వుంది.

'భయంగా వుందండీ'

'మా ఇంటికి దొంగల బెడద ఎక్కువ. మన పెళ్లికి ముందు ఓ గొర్రెపిల్లను ఎత్తుకెళ్లారు'

'నిజమా!'

'ఊఁ నువ్వో పని చెయ్. ఇక్కడ వద్దు. భానూ వాళ్లింటికి వెళ్లి పడుకో. అక్కడ చుట్టుపక్కల ఇళ్లుంటాయి కాబట్టి భయముండదు'

'మరి మీరో?'

'నేను ఇక్కడే పడుకుంటాను. ఇక్కడ ఎవరూ లేకపోతే దొంగలుపడే అవకాశముంది'

'అలాగేనండి'

గబగబా ఓ చాపా దిండూ పట్టుకుని భానూవాళ్లింటికి పరుగెత్తాను. జరిగినదంతా ఆమెతో చెప్పాను.

'ఇద్దరం వరండాలో పడుకుందాంలే' అంది.

ఆ రాత్రి అక్కడే పడుకుని ఉదయం లేచొచ్చేశాను.

రెండో రోజూ, మూడో రోజూ కూడా రాళ్లు పడ్డాయి. రాళ్లు పడడం, చాపా దిండూ పట్టుకుని భానూవాళ్లింటికి పరుగెత్తడం సాధారణమై పోయింది. ఈ గొడవలో పడి ఫస్ట్‌నైట్ గురించి మరిచేపోయాను.

పల్లెటూళ్లలో మనకు గిట్టనివాళ్లు మన ఇళ్లపై రాళ్లు వేయడంలాంటివి చేస్తుంటారు. అందువల్ల మాకు శత్రువులెవరైనా వున్నారా అని ఆరాతీశాను. ఒక్క ఇల్లే వుంది. నా భర్తకు చిన్నాన్న అవుతాడు. దాయాదులన్నమాట. అయినా వాళ్ళు మాత్రం రోజూ రాత్రిళ్ళు మేలుకుని ఇంటిపై రాళ్ళు వేస్తుంటారా? ఏమో? ద్వేషం అలాంటిది.

సాయంకాలమైతే చాలు రాళ్ళు పడతాయేమోనన్న భయం నన్ను చుట్టుకునేది. గుడిసెకూ,

## పుండ్లు పెరగకుండా ఏంచేయాలి?

ఏదైనా జబ్బువల్ల చాలా బలహీనులైనవారు మంచానపడి, లేవలేకపోవడం సంభవిస్తుంది.

అలాంటి వారు నిత్యం మంచంపైనే వుండడంతో శరీరంపై కొన్ని ప్రాంతాలమీద ఒత్తిడి ఎక్కువై, పుండ్లు పడతాయి. సాధారణంగా అలాంటి పుండ్లు వీపుపై, పిరుదులపై వస్తాయి.



మంచానపడినవారి ఒంటిని పరిశీలిస్తే వీపుపై ఒత్తిడి కలిగే ప్రాంతాలేవో సులువుగా తెలుస్తుంది. అక్కడి చర్మం కందిపోయో, రంగు మారో, అనారోగ్యంగానో కనిపిస్తుంది. స్పిరిట్‌వాడి వారి ఒంటిపై పుండ్లు పెరగకుండా చేయవచ్చు.

1. పుండ్లు పడని ప్రాంతంపై క్రమం తప్పకుండా స్పిరిట్ రాయాలి. దాంతో చర్మం మందంగా అయి, పుండ్లు వ్యాపించకుండా నిరోధిస్తుంది.
2. ఎట్టిపరిస్థితుల్లోనూ పుండ్లుపడినచోట మాత్రం స్పిరిట్‌రాయకూడదు. దానివల్ల తీవ్రమైన మంట కలుగుతుంది.
3. పుండ్లు పడకుండా నిరోధించడానికి అర్రెట్ల పాదాలపై ఒత్తిడి కలిగేచోట్లకూడా స్పిరిట్‌రాయవచ్చు. ◆

వరండాకూ మధ్యమున్న ఖాళీ స్థలంలో వంట. అందువల్ల పొద్దు గుంకేటప్పటికి వంట పూర్తిచేసి ఇంట్లోకి వచ్చేసేదాన్ని.

ఎన్ని రోజులిలా? ఆ రాళ్ళు వేసేది ఎవరో కనుక్కుని వాళ్ళ అంతు చూడాలని నిర్ణయించుకున్నాను.

మరుసటి రోజు వంటంతా పూర్తిచేసి, అలా భానూవాళ్లింటికి వెళ్ళాను. కాసేపు పిచ్చాపాటీ వేసి వచ్చాను. నా భర్త కూడా దేవాలయం దగ్గరకి వెళ్లి వచ్చాడు. ఇద్దరం భోజనాలు ముగించాం.

'రేపు ఎగవమళ్ళో మడకలు కట్టాలి. ఎవరైనా మడక కట్టడానికి వస్తారేమో కనుక్కుని వస్తాను' అని నా భర్త తిరిగి ఊర్లోకి వెళ్లాడు.

భయంగావున్నా, నాకు నేనే ధైర్యం చెప్పుకున్నాను. తొమ్మిదిగంటలై వుంటుంది. జోరీగ శరీరం లాగా చీకటి మెరుస్తోంది. ఊర్లో అక్కడక్కడా వెలుగుతున్న దీపాలు చీకటిని నాకుతున్న వెలుతురు పురుగుల్లా వున్నాయి. గాలి గూర్ఖాలా ఊరంతా తిరుగుతోంది. పెంకుటింట్లో కూర్చుని, ఆంజనేయస్వామిని తలుచుకుంటున్నాను. రాళ్ల పడుతుండడంతో నా మొదటిరాత్రి కాస్త కొండెక్కింది.



రాళ్ళు పడుతుండగా శోభనం ఎలా జరుగుతుంది? అందుకే రాళ్ల వేస్తున్నవాళ్ళ మీద పీకలదాకా కోపం వుంది. అందుకే ఒంటరిగా వాళ్ళను పట్టుకోవాలని అన్నింటికీ ముందుగానే ప్రిపేర్ అయి కాచుకూర్చున్నాను.

మరో అరగంట గడిచింది.

రాకెట్‌లా ఓ రాయి దూసుకొచ్చి ఇంటిమీద పడింది. పెంకుల శబ్దం ఎముకలు విరిగినట్లు వినిపించింది. కళ్ళు మూసుకున్నాను. అంతలోనే మరో రాయి వచ్చి ఇళ్ళమధ్య పడింది.

రోజూ ఇలా భయంతో బిగదీసుకుపోవడంకన్నా అటో ఇటో తేల్చేసుకోవడం ఉత్తమమైన పని అనుకుంటూ మంచం మీదనుంచి లేచి నిలుచున్నాను. లేని ధైర్యాన్ని తెచ్చుకున్నాను. ఏదో తెలియని కసి నన్ను ఊపేస్తోంది.

మెల్లగా అడుగులో అడుగు వేసుకుంటూ బయటకొచ్చాను. ఇంటి చూరుకింద నక్కాను. ఈసారి వచ్చిన రాయి గుడిసెమీద పడింది. అది వచ్చిన డైరెక్షన్‌ను గమనిస్తే పెంకుటిల్లు వెనకనుంచి వేస్తారన్నది అర్థమైంది.

నా భర్త వస్తే మరింత ఈజీగా ఆ దుండగుల్ని పట్టుకోవచ్చని చూశాను. కానీ ఆయన వస్తున్న జాడ కూడా లేదు.

అంతలోనే మరో రాయి వచ్చి కిందపడి చిట్లింది. నేనిక ఆలస్యం చేయదలుచుకోలేదు.

చూరు కిందనుంచే నడిచి మా ఇంటికి కాస్తంత దూరం వెళ్లి, అక్కడినుంచి వెనకవైపు మలుపు తిరిగాను.

ఓ ముల్లు కసుక్కున కాలిలో దిగింది. రక్తం కారుతున్న స్పర్శ తెలుస్తోంది. వంగి ముల్లు లాగేశాను. కసి మరింత ఎక్కువైంది.

ముందుకు చాలా దూరం వెళ్ళి, అటునుంచి మా ఇంటి వెనకవైపుకి రావడం ప్రారంభించాను.

### 'ప్రేమ్' జంట ప్రేమ

'ప్రేమ్' హీరోహీరోయిన్లు సంజయ్‌కపూర్, టాబూ నిజజీవితంలో కూడా ప్రేమకలాపాలు సాగించారు. అయితే ఆ చిత్రం పూర్తికాకుండానే వారి ప్రేమకి ఫుల్‌స్టాప్ పడింది.

సంజయ్‌కపూర్ వెంటనే మరో ప్రియురాలిని వెతుక్కున్నాడు. టాబూ మాత్రం "నేనలా ఒకరిని ప్రేమించి, విడిపోయాక మరొకరితో ప్రేమ వ్యవహారంలోకి దిగే తరహా వ్యక్తిని కాదు" అని సీరియస్‌గా చెబుతూ, "అదీకాక, ఇప్పుడు నేను పూర్తిగా నా వృత్తిపైనే ధ్యాస నిలపాలనుకుంటున్నాను" అంటూ సినిమాల వైపు మొగ్గు చూపిస్తోంది.

కళ్ళు పొడుచుకున్నా కనిపించని కటిక చీకటి. దూరంగా నక్క ఆకలితో కాబోలు ఏడుస్తోంది.

వడివడిగా అడుగులు వేశాను.

రాళ్ళు పడుతుండడం గమనించి కాబోలు, మా ఇంటి ముందు పహార్లు చేస్తున్న కుక్క మొరుగుతోంది.

నేను తక్కున ఆగిపోయాను.

మా ఇంటికి కాస్తంతదూరంలో ఓ ఆకారం మెదులుతోంది. రక్తం ఒక్కసారిగా నా ముఖంలోకి చిమ్మింది.

ఆ ఆకారం కిందకు వంగి కుడిచేతిని సాగదీసి, ముందుకు విసిరింది. ఇంటిమీద రాయి పడ్డ చప్పుడు. నక్క పళ్లు కొరుకుతున్నట్లు వినిపించింది.

ఏదో తెలియని మొండిధైర్యం నాలో ప్రవేశించింది. చీర కుచ్చిళ్లను ఎత్తి బొడ్లో దోపుకుని పరుగెత్తాను. మరింత దగ్గరగా వెళ్ళి ఆగాను. మెల్లగా నడవడం మొదలుపెట్టాను.

కుక్కల అరుపులవల్ల నా అడుగుల చప్పుడు అతనికి వినిపించడంలేదు. మరో రాయి విసరడానికి అతను కిందకు వంగాడు.

నేను చటుక్కున ముందుకురికి అతని చేయి పట్టుకున్నాను. చటుక్కున రాయి వదిలేశాడు. తల వంచుకున్నాడు.

చెంపలు పగులకొడదామా అన్నంత పిచ్చి కోపంతో అతని ముఖాన్ని పైకి లేపాను. అప్పటికే అతనిమీద అసహ్యంతో నా నోట్లో నీళ్లు ఊరాయి.

ముఖంమీద ఉమ్మెయ్యాలని నోరు తెరిచిన నేను అలా బిగదీసుకుపోయాను. అది షాకో, ఆశ్చర్యమో, విస్మయమో–ఏదో నేను చెప్పలేను.

అతను–నా భర్త–శివరావ్.

అప్పుడు కలిగింది బాధో, నిస్సహాయతో, వేదనమో–నాకు తెలియదు. నా కళ్ళలో నీళ్ళు.

అలా ఎంతసేపు ఏడుస్తూ వుండిపోయానో తెలియదు. ఆయన మాత్రం వంచిన తల ఎత్తలేదు.

'ఎందుకిలా?' ఏడుపును కప్పబోతుతనం మింగేయడంతో అరిచినట్లు అడిగాను.

అంత గట్టిగా అరుస్తానని తెలియని అతను కొరడా దెబ్బ తగిలినట్లు చివుక్కున తల పైకెత్తాడు.

'ఏమిటిదంతా? ఎందుకు?' రెండు భుజాలు పట్టుకుని ఊపేశాను.

ఆయన ఒక్కో మాటను అప్పుడే ఉచ్ఛరిస్తున్నట్లు చెప్పాడు. 'ఏం చేయను? నువ్వు మనింట్లో కాకుండా వేరే ఇంట్లో పడుకోవాలని నిన్ను భయపెట్టడానికి నేనే రాళ్లు వేయడం మొదలుపెట్టాను. నువ్వు ఇక్కడే పడుకుంటే నాకు ఇబ్బంది.

శోభనం కావాలని అడుగుతావని భయం.

బట్టలన్నీ విప్పుతావేమోననే టెన్షన్.

నేను అందుకు పనికిరాను. పుట్టడమే అలా పుట్టాను'

నా కాళ్ళకింద భూమి చీలుకుపోతున్నట్లనిపించింది. మిన్ను విరిగి మీద పడిందంటారే అలాంటి స్థితి. మరలాంటివాడివి ఎందుకు పెళ్లిచేసుకున్నావని కూడా నాకు అడగాలనిపించలేదు.

ఏదో వైరాగ్యం లాంటిది నన్నావహించింది.



## హద్దులంటే?

"మన ఒళ్లు చూసి ఎవరో ఎంజాయ్‌చేయడం అసహ్యంగా వుంటుంది. అందుకే నేను ఎక్స్‌పోజింగ్‌కి అంగీకరించను" అంటోంది మధుబాల.

'రోజా'నే గుర్తుపెట్టుకుందేమో! మరి- 'ఫూల్ ఔర్ కాంటే'లో హిందీవాళ్ల కంటివిందుగా తన సోయగాల విందు ఆరగింపుకి పెట్టినప్పుడు ఏమయ్యాయో ఈ మాటలు? వినేవాళ్ల చెవిలో పువ్వులున్నాయని అనుకుంటేనే ఇలాంటి మాటలొస్తాయి.

అయితే- అందరిలాగే "ఎక్స్‌పోజింగ్‌కి కొన్ని హద్దులున్నాయి" అని మూసడైలాగ్ ఒకటి వినురుతోంది. ఏమిటో ఆ హద్దులు? అయినా సెన్సారు వారుండగా మన హద్దులేం పనికొస్తాయి?

ఏడుపు కూడా రాని పరిస్థితి.

ఆయన చేతులు పట్టుకుని ఇంటికి నడిపించుకొచ్చాను.

'మీరు ఇకనుంచీ పెంకుటింట్లో పడుకోండి. నేను గుడిసింట్లో పడుకుంటాను. ఇక మీరు మీ ఇంటిమీదే రాళ్లు వేసుకోనవసరంలేదు' అన్నాను"

మహిత చెప్పడం పూర్తిచేసి "అలా మా శోభనం జరక్కుండానే పోయింది" అంది ముక్తాయింపుగా.

అప్పటికే బాగా పొద్దుపోయింది. చీకటి నల్లటి పాడిలాగా రాలుతోంది.

"మరి నీకు ఇద్దరు పిల్లలుకదా" అంది సుజన ఫ్లాట్‌గా ఆమెవైపు చూస్తూ.

"నా భర్తతో శోభనం జరగలేదన్నానుగానీ మరెవరితోనూ జరగలేదని చెప్పలేదుగా" అని నవ్వింది మహిత.

మళ్లీ ఆమే "ఎన్ని రోజుల తరువాత నువ్వు ఆ దుఃఖంలోంచి తేరుకున్నావ్? ఆ ఊరొదిలి భర్తతో పాటు ఎందుకిక్కడికి వచ్చేశావ్?

నీ శోభనం ఎవరితో జరిగింది? వారానికోమారు ఎందుకు పుట్టింటికెళతావ్? అక్కడ ఎవరున్నారు? లాంటి ప్రశ్నలు వేయకు. అవన్నీ అడక్కు. ఊహించు" అంటూ పైకి లేచింది.

ఆమె ఫస్ట్‌నైట్ అంతా విన్నాక సుజనకూ దిగులుగా అనిపించింది.

మహితమీద జాలిలాంటిది కలిగింది. అయితే ఆమె దాన్ని ప్రకటించలేదు.

(ఇంకావుంది)

సీరియల్



# రారా మా ఇంటిదాకా

## మేర్లపాక మురళి


మేర్లపాక మురళి
వెదుళ్ళచెరువు-517 520
రేణిగుంట (మండలం), చిత్తూరు జిల్లా


"రేయ్ లేవరా. ఈ రోజు శ్రీకృష్ణజన్మాష్టమి" తల్లి లేపడంతో మెలకువ వచ్చింది వంశీకి. హడావుడిగా అక్కడినుంచి దొడ్లోకి దారితీశాడు.

అతను అంత హడావుడిపడిపోవడానికి కారణం శ్రీకృష్ణజన్మాష్టమి కాదు. ఆ రోజు ప్లాన్ నెంబర్ త్రీ అమలుచేయబోతున్నాడు. దానికి 'మేఘమాల' అని కోడ్‌నేమ్ కూడా పెట్టుకున్నాడు.

'మేఘమాల' సక్సెస్ అయి శోభనం జరగాలంటే చేయాల్సిన పనులు చాలా వున్నాయి. అందుకే మరో అరగంటకల్లా తయారయ్యాడు.

అప్పటికే దేవాలయం దగ్గర కోలాహలంగా వుంది. లౌడ్‌స్పీకర్‌లోంచి ఈమధ్యే రిలీజైన సినిమాల్లోని పాటలు ఊరినంతా బ్రేక్‌డాన్స్ వేయిస్తున్నాయి.

గర్భగుడి అంతా శ్రీరామచంద్రుడు ఆక్రమించుకోవడంతో భజనమందిరంలో శ్రీకృష్ణుని పటం పెట్టారు. దానినిండా పూలమాలలు వేయడంవల్ల పూల మధ్యలోంచి శ్రీకృష్ణుడు ముఖాన్ని మాత్రం బయటపెట్టి తొంగి చూస్తున్నట్లుంది. మందిరం పైన కట్టిన మామిడాకు తోరణాలు గాలికి అటూ ఇటూ ఊగుతూ, గోపికలు వయ్యారాలు పోతున్నట్లు కనిపిస్తున్నాయి. ఓ మూల చేరిన భజన బృందం హార్మోనియాన్ని ముందేసుకుని పాటలు పాడుతోంది. అయితే పాడుతున్న వ్యక్తి తప్ప మిగిలిన వాళ్లు కూడా స్పీకర్‌లోంచి వస్తున్న సినిమా పాటలనే వింటున్నారు. గుడి పూజారి తనలో తానే గొణుక్కుంటూ-కిందపడి దొర్లుతున్న పిల్లనగ్రోవిలా తిరుగుతున్నాడు.

దేవాలయం ముందు చేరిన పిల్లలు పట్టలేని ఉత్సాహంతో ఆటలు ఆడుకుంటున్నారు. వరండాలో ఓ పెద్ద అండాలో పానకం కలిపి, వచ్చినవాళ్లందరికీ ఓ గ్లాసు పానకం ఇస్తున్నాడు ఓ పూజారి. ఊరికి తూర్పున వున్న ఖాళీస్థలంలో ఉట్లు కొట్టడానికి కావాల్సిన ఏర్పాట్లు చేస్తున్నారు యువకులు.

వంశీ ముందు దేవాలయం దగ్గరికివెళ్లి ఆ తరువాత ఇంటికి వచ్చాడు. అప్పటికే టైమ్ పది గంటలైపోయింది. ఇక త్వరపడకపోతే మొత్తం ప్లాన్ అంతా పాడయిపోతుందని స్కూలు దగ్గరికి వెళ్ళాడు. స్కూలంటే అక్కడ పెద్ద భవంతులు ఏమీ లేవు. ఓ పెద్ద గది మాత్రమే వుంటుంది. దానిని టీచర్ మధ్యాహ్నం విశ్రమించడానికి, రిజిస్టర్లు గట్రా పెట్టుకోవడానికి ఉపయోగిస్తున్నాడు. తరగతులన్నీ అక్కడే వున్న పెద్ద చింతచెట్టు కింద జరుగుతాయి.

జన్మాష్టమి సందర్భంగా ఆ రోజు స్కూలుకి సెలవు. అంతకుముందురోజు సాయంకాలం టీచర్ ఊరుకి వెళ్లేప్పుడు వంశీ ఆయన్ను అడిగి తాళంచెవి తీసుకున్నాడు. ఆ రాత్రే తన శోభనానికి కావలసిన మంచం, పరుపు, రెండు దిండ్లు, ఓ దుప్పటినీ అక్కడికి చేర్చాడు.

తాళంతీసి గదిలో ఒద్దికగా అమరిన మంచాన్ని తనివితీరా చూసుకుని, అక్కడినుంచి వచ్చాడు వంశీ.

ఇంటికొచ్చి ప్యాంటూ షర్టూ వేసుకుని టౌన్‌కి బయల్దేరాడు. అదృష్టంకొద్దీ వెంటనే బస్సు దొరికింది.

బస్టాండ్‌నుంచి పదడుగుల దూరంలో కిరణ్ వీడియోషాపు. ఆ షాప్ ఓనర్‌కి కిరణ్‌తో స్నేహం లేదుగానీ ముఖపరిచయం మాత్రం వుంది.

"మాది పక్కన పల్లె-నన్ను తెలుసుగా?" వంశీ అడిగాడు.

"తెలుసు. ఏంకావాలి?"

"వీడియో కేసెట్ ప్లేయర్-విసిపి" అని అటూ ఇటూ చూసి, "దాంతోపాటు ఓ మంచి క్యాసెట్టు కూడా" అన్నాడు.

కింద అరలోంచి విసిపి తీసి పైనపెట్టాడు అతను.

"క్యాసెట్టు కూడా కావాలన్నారుగా"

వంశీకి అన్నీ సక్రమంగా అమరుతుండడంతో శోభనంలో సగం అయిపోయినట్లు ఉత్సాహం ఉరకలేసింది. దాన్ని దాచుకోవడానికి అతను ఏమీ ప్రయ

**12** వంశీ సుజనల పెళ్ళవుతుంది. శోభనం ముహూర్తం దగ్గరపడిందనగా సుజనకు 'మూడు రోజుల' ఇబ్బంది ఎదురౌతుంది. ఆ మూడు రోజులూ వీలుకాదు కనుక మరో ముహూర్తం చూస్తాడు సుజన తండ్రి. ఆ ముహూర్తానికిముందే, తమ శోభనం జరుపుకోవాలనే ప్లాన్‌లోవుంటారు వంశీ సుజనలు. వంశీ వేసిన ప్లాన్‌లో భాగంగా జరిగిన ఓ సంఘటనవల్ల చిట్టిబాబుని అనుమానించి, అతనిపై కోపాన్ని ప్రకటిస్తాడు సుజన తండ్రి. అది వంశీకి అనుమానం కలిగిస్తుంది.

తన ఫస్ట్‌నైట్ విశేషాలు సుజనకి చెప్తుంటుంది మహిత. కట్నం లేకుండా పెళ్లిచేసుకుంటానని ముందుకు వచ్చిన ఓ అబ్బాయికి మహితనిచ్చి పెళ్లిచేస్తారు ఆమె తల్లిదండ్రులు. పెళ్లిరోజు రాత్రి ఇద్దరినీ శోభనం గదిలోకి ప్రవేశపెడతారు. కానీ సెక్స్‌కి పనికిరానని తెలిసిన మహిత భర్త శివరావ్ మూడు రోజులూ తమ శోభనానికి ఆమెకి తెలియకుండా అంతరాయం కలిగిస్తాడు. అది గమనించిన మహిత ఆ విషయమై అతన్ని గట్టిగా ప్రశ్నిస్తుంది. అసలు విషయం తెలియడంతో ఆమెకి వైరాగ్యం కలుగుతుంది. ఇంతటితో తన శోభనంగురించి సుజనకి చెప్పడం పూర్తిచేస్తుంది మహిత.

త్నించలేదు. అందుకే మనిషంతా ఊగిపోతూ కుడిచేతిని కొద్దిగా లేపి బొటన వేలునూ సున్నాలా కలిపి "అద్భుతమైన క్యాసెట్-లవకుశ ఇవ్వు" అన్నాడు.

వంశీ ఎగ్జైట్‌మెంట్‌ను చూసి ముచ్చటపడుతూ కిందఅరలోంచి క్యాసెట్ తీసి ఇచ్చాడు.

దానివైపు తృప్తిగా చూస్తూ అడ్వాన్స్‌లు చెల్లించాడు. అతనికి థాంక్స్ చెప్పి, వీసీపీ, క్యాసెట్టూ తీసుకుని బయల్దేరాడు.

తిరిగి ఊరికి చేరుకునేసరికి మధ్యాహ్నం ఒంటి గంటయింది. భోజనం ముగించి, అలా కళ్ళు మూసుకున్నాడు.



ఉట్లుకొట్టే కార్యక్రమం సాయంకాలం నాలుగు గంటలకు ప్రారంభమవుతుందని దండోరా వేస్తున్నారు.

జరగబోయే ప్రతి సంఘటనా కళ్ళముందు కదులుతోంది వంశీకి. ఉట్లు ప్రారంభమయ్యే లోగా చేయాల్సిన పని ఒకటుంది. అది గుర్తురావడంతో తక్కున పడకమీద నుంచి లేచాడు.

మరో అరగంటకు ఆ పని కూడా పూర్తిచేశాడు.

మూడు గంటలకల్లా ఉట్లు దగ్గరికి చేరుకున్నాడు. అప్పటికే జనం రావడం ప్రారంభించారు.

మైదానంమధ్యలో పొడుగ్గా వుండే బలమైన గుంజనాటారు. చివరన గుడ్డమూట ఒకటి కట్టారు. అందులో అయిదువందలా పదహారు రూపాయలున్నాయి. గుంజకు బాగా నూనె పూశారు.

ఉట్లు కొట్టే వ్యక్తి దాన్నుంచి పైకిపాకి, ఆ మూటను అందుకోవాలి. ఎవరైతే అంత నునుపుగా వుండే గుంజను ఎక్కుతారో వారికి ఆ డబ్బు చెందుతుంది. ఈమధ్యలో గుంజ ఎక్కుతున్నప్పుడు నాలుగు వైపుల్లో నీళ్ళ బిందెలతో వున్నవాళ్ళు చెంబులతో నీళ్ళు తీసుకుని ఫోర్స్‌గా ముఖంమీదకు విసురుతుంటారు. ఈ నీళ్ళ తాకిడిని భరిస్తూ గుంజను ఎక్కాల్సివుంటుంది. నూనె రాసిన గుంజను ఎక్కడం కష్టసాధ్యమైన ఫీట్. అయినా సరే ఉట్లు కొట్టడానికి తను రంగంలో వున్నట్లు వంశీ తన పేరు ఇచ్చేశాడు.

రంగంలో మొత్తం నలుగురున్నారు. వంశీ సీరియల్ నెంబర్ మూడు. ఇద్దరు ట్రై చేశాక మూడో ఛాన్స్ ఇతనికొస్తుంది.

ఇతనూ ఫెయిలైతే నాలుగో వ్యక్తికి వస్తుంది.

ఎప్పుడో చిన్నప్పుడు చెట్లు ఎక్కిన అనుభవం తప్ప ఎప్పుడూ అలా గుంజలు ఎక్కిన పాపాన పోలేదు. కానీ ఇప్పుడు 'మేఘమాల' సక్సెస్ కావాలంటే అందులో తను గెలిచి తీరాలి. భారమంతా ఆ శ్రీకృష్ణుడిపైన వేసి నిశ్చింతగా వున్నాడు.

జనం కోలాహలం ఎక్కువైంది. కార్యక్రమం ప్రారంభం కావడానికి మరో పది నిముషాలు వుండనగా సత్యనారాయణ అండ్ ఫ్యామిలీ వచ్చారు. ఉట్లు కొట్టేవాళ్లలో వంశీకూడా వున్నాడని తెలిసి అందరూ కట్ట కట్టుకుని వచ్చారు. చివరికి బామ్మకూడా తయారై వచ్చింది.

వంశీని చూడగానే సుజన చేయి ఊపింది.

చూసి పలకరించకపోతే బావుండదన్నట్లు అతను వాళ్ళ దగ్గరికి వచ్చాడు. అందర్నీ పలకరించి అవీ ఇవీ మాట్లాడుకుంటూ వుండగా నిర్వాహకుల నుంచి పిలుపు వచ్చింది.

జనం అంతా చప్పట్లు చరుస్తున్నారు.

సుజనకు వెళ్ళొస్తానని చేతులూపుతూ ఏదో గుర్తొచ్చినట్లు ముఖంమీదకి వంగి "రాత్రి మీ ఇంట్లో వీడియో షో ఏర్పాటుచేశాను. అందర్నీ ముందు కూర్చోబెట్టి, నువ్వు వెనక కూర్చో. మిగిలిన నాటకమంతా నేను నడిపిస్తాను. రాత్రికే మన శోభనం" అని చెవిలో చెప్పి అక్కడినుంచి మాయమయ్యాడు.

ఇదేదో కొత్త ప్లాన్‌లా వుంది అనుకుంది సుజన.

చెంబులతో నీళ్ళు కొట్టేవాళ్ళు తమ ముందున్న పెద్ద అండాల దగ్గర రెడీగా వున్నారు.

"నెంబర్ వన్ వీరాస్వామి" సర్పంచ్ అరవడంతో గుంపుకు ముందు నిలబడ్డ ఆ వ్యక్తి ఉట్టి దగ్గరికి వచ్చాడు. పోయిన ఏడు విజేత అతనే. గొర్రెలు



## మెచ్చే పురుషుడు

"అంత అందం లేకపోయినా, వ్యాయామాలతో కండలుతిరిగిన దృఢకాయుడు- నాకు నచ్చే మగాడు. అయితే, మాంచి బాడీతోపాటూ, స్వయంగా ధనం సంపాదించేవాడైవుండాలి. ఆ మగాడు తెలుగులవం ఉట్టిపడే దుస్తులు వేసుకొంటే నాకింకా నచ్చిపోతాడు" అని పరవశంలో చెప్తోంది డిస్కోశాంతి.

మేపుకుంటూ వుంటాడు. చెట్లు ఎక్కడంలో మహా అనుభవమున్నవాడు.

నిక్కర్ మాత్రమే వేసుకుని వున్న అతను, గుంజ దగ్గరికి వెళుతుంటే జనం కేకలు, ఈలలు ప్రారంభించారు. అతను గుంజ ఎక్కడం మొదలుపెట్టాడు. నీళ్ళు చల్లేవాళ్లు తమ చేతులకు పనిపెట్టారు.

ఫోర్స్‌గా ముఖాన్ని గుద్దుకుంటున్న నీళ్ళనుకూడా లెక్కచేయకుండా వీరాస్వామి ఎక్కుతున్నాడు.

అయిదడుగులు ఎక్కాడో లేదో ఆగిపోయాడు. ఛాతీ దగ్గర్నుంచి, తొడల వరకు సడన్‌గా దురద ప్రారంభమైంది. దురదలకు తట్టుకోలేక మొత్తం శరీరాన్నంతా గుంజకేసి పామాడు. దురదలు మరింత ఎక్కువయ్యాయి. కత్తితో పైచర్మాన్ని తీసేస్తే తప్ప నవ్వలు అణగనట్లు అనిపించింది. కిందకు దిగితే ఓడిపోయినట్లేనని తెలిసిన అతను ఎంత ప్రయత్నించినా పైకి ఎక్కలేకపోతున్నాడు. దురదలు శరీరాన్ని పీక్కుతింటున్నట్లుంది.

ఇక ఆ నవ్వలను భరించలేక అతను కిందకుదూకి రెండు చేతులతోనూ గోక్కోవడం మొదలుపెట్టాడు.

జనం అతనివైపు ఎగతాళిగా చూస్తూ రకరకాల కామెంట్లు చేస్తున్నారు.

రెండో వ్యక్తి గంగరాజు. ఎలక్ట్రిసిటీ డిపార్ట్‌మెంట్‌లో దినకూలి. పోల్స్ ఎక్కడంలో అతనికి అతనే సాటి. ఈసారి గెలుపు తనదేనన్న ధీమా ఆయన ముఖంలో వేయి ఓల్టుల బల్బులా వెలుగుతోంది.

ఆయన ముందుకు వచ్చి తను వేసుకున్న ఖాకీ ప్యాంట్, చొక్కా విప్పాడు. మోకాళ్ల వరకు వున్న చారల డ్రాయర్ తప్ప మరేం లేదు.

రెట్టించిన ఉత్సాహంతో ఆయన ఎక్కడం ప్రారంభించాడు. వీరాస్వామి ఎక్కిన వరకు ఎక్కి గంగరాజు కూడా షాక్ కొట్టినట్లు ఆగిపోయాడు. ఒక చేత్తో గుంజను పట్టుకుని మరో చేత్తో ఛాతీ భాగాన్ని గోక్కుంటున్నాడు. ఆపై కిందిభాగం అందక దురద ఎక్కువై అక్కడినుంచి దబ్బున కిందపడ్డాడు.

అక్కడ ఏం వుండి దురదలు లేస్తున్నాయో జనానికి అర్థంకాలేదు.

ఎవరూ చూడకుండా రెండు గంటలప్పుడు దురదగుంట ఆకు అక్కడ పూసిన వంశీ మాత్రం ఏమీ తెలియనివాడిలా రంగం మీదకి వచ్చాడు. లాల్చీ, పైజమాలో వున్న అతను ఏమీ ఒంటిమీద నుంచి తీయలేదు. అవే తనను రక్షిస్తాయని తెలుసు.

మెల్లిగా గుంజ ఎక్కడం ప్రారంభించాడు. ఎక్కుతున్నది బాగా చదువుకున్నవాడూ, కొత్త పెళ్లికొడుకూ కావడంతో జనం ఇంకా ఎక్కువగా చప్పట్లు చరుస్తున్నారు. సుజన కూడా పట్టలేని ఉద్రేకంతో చప్పట్లు చరుస్తుంటే బామ్మ గట్టిగా విజిల్‌వేసింది. ఇది చూసిన జనం మరింతగా రెచ్చిపోయారు.

వంశీ అంతవరకూ పాకి, తాను దురదగుంటాకు పూసిన దగ్గర బాడీ తగలకుండా పైకెక్కాడు. ఇక అక్కడినుంచి అతను చకచకా పైకెక్కేశాడు.

ఆరడుగులు దాటాక నీళ్ళు కూడా పడవు గనుక అతనికేమీ ఇబ్బందిగా అనిపించలేదు.

ఉట్టిని అందుకుని కిందకు జారాడు.

చప్పట్లతో ఆ ప్రాంతమంతా మార్మోగిపోయింది.

వంశీ నేరుగా సుజన దగ్గరికి వచ్చాడు.

"శెహభాష్ అల్లుడూ" సత్యనారాయణ సంతోషంగా మెచ్చుకున్నాడు. బామ్మయితే అతని ముఖాన్ని ముద్దులతో నింపేసింది.

"ఇక చాల్లేవే" అని సుజన వెనకనుంచి లాగేవరకూ ఆమె అతని ముఖాన్ని వదల్లేదు.

సుజన అక్కయ్యలు మెచ్చుకోలుగా చూశారు.

"ఈ డబ్బుతో జన్మాష్టమి సందర్భంగా మీ ఇంట్లో వీడియో షో ఏర్పాటుచేస్తాను మామయ్యా" వంశీ చెప్పాడు. ఊరకే ఆరెంజ్‌చేస్తే డౌట్ వస్తుందనే అతను ఈ పందెంలో పాల్గొని గెలిచాడు.

"అలాగేలేవయ్యా"



## సాబూదానీ

**కావలసినవి :** నగ్గుబియ్యం 100 గ్రాములు, వేరుసెనగపప్పు 1 కప్పు, పచ్చికొబ్బరిచిప్ప 1, పచ్చిమిరపకాయలు 4, తెల్లనువ్వులు 1 స్పూన్, జీలకర్ర 1 స్పూన్, చిటికెడు పసుపు, అర స్పూన్ చక్కెర, కరివేపాకు కొంచెం, నిమ్మకాయ 1, ఉప్పు తగినంత, పోపుకు నూనె.



**చేసే విధానం :** నగ్గుబియ్యం మునిగేదాకా నీరు పోసి కనీసం 8 గంటలు నాననివ్వాలి. నీరంతా పీల్చుకుని నగ్గుబియ్యం బాగా పొడి పొడిలాడుతూ వుంటుంది. దానికి అరస్పూన్ చక్కెర చేర్చి బాగా కలపాలి. వేరుసెనగపప్పు, పచ్చిమిర్చి, తగినంత ఉప్పు వేసుకుని మిక్సీలో వేసి నీరు చేర్చకుండా పొడి పొడిగా పొడరు చేసుకోవాలి.

బాండీలో పోపుకి సరిపడా నూనెవేసి, నూనె కాగాక జీలకర్ర, నువ్వులు, కరివేపాకు వేయాలి. కొంచెం వేగనిచ్చి నగ్గుబియ్యం వేయాలి. ఓ నిముషం పాటు నగ్గుబియ్యం వేయించి వేరుసెనగపప్పు పొడి వేసి బాగా కలిసేలాగా గరిటతో కలపాలి. చివరగా కొబ్బరితురుము వేసి మళ్ళీ బాగా కలపాలి. బాండీ దింపేక నిమ్మరసం పైన చల్లాలి. వేడి వేడిగా తింటే చాలా రుచిగా వుంటుంది. చేయడమంత సులువుగా జీర్ణమవుతుందికూడా. —పాలగుమ్మి పద్మావిజయ్

వంశీ ఉక్కిరిబిక్కిరయ్యాడు. అయితే దీన్ని ఎక్స్‌ప్రెస్ చేయలేదు.

సత్యనారాయణ అక్కడినుంచి కదిలాడు.

వాళ్ళు వెళ్ళిపోయాక వంశీ వెనక్కు వెళ్ళి తను గెలిచిన డబ్బునీ వీరాస్వామికీ, గంగరాజుకీ, పోటీలో వున్న మరో వ్యక్తి రంగనాయకులుకీ సమానంగా పంచి అక్కడినుంచి బయల్దేరాడు.

గెలిచిన డబ్బులో రూపాయి అయినా తీసుకోకుండా అంతా తమకే పంచిపెట్టి వెళుతున్న అతని వైపు వాళ్ళు విస్మయంగా చూస్తూ నిలబడ్డారు.

వంశీ ఇంటికొచ్చి అటూ ఇటూ పచార్లు చేస్తున్నాడు. స్కూల్లో జరగబోయే తమ ఫస్ట్‌నైట్ అంతా సినిమా రీలులా కదులుతోంది.

ఒక్క దగ్గర వుండడం వీలుకానట్లు అక్కడినుంచి కొట్టు దగ్గరికి నడిచాడు. సిగరెట్టు కొనుక్కుని రోడ్డు దగ్గరికి వెళ్ళి తిరిగి వచ్చాడు.

టైమ్ ఏడు దాటింది.

తమ మామయ్య ఇంట్లో టీవీలో సినిమా వేస్తున్నారని ఇద్దరు ముగ్గురు అమ్మలక్కలకి చెప్పాడు. వాళ్ళు మొత్తం ఊరంతా చెబుతారని అతనికి తెలుసు.

ఆ గ్రామంలో కొంతమంది కుర్రకారు అప్పుడప్పుడూ టీవీ షోలు వేస్తుంటారు. టౌన్‌నుంచి వీసీపీ, క్యాసెట్లు తీసుకొచ్చి ఎవరింట్లోనైనా షోలు వేస్తారు. రూపాయి ఇచ్చి ఎవరైనా చూడచ్చు. జనం బాగా వస్తే ఖర్చులు పోను ఏభయ్యో, వందో మిగులుతాయి.

ఇప్పుడు ఫ్రీగా లవకుశ ప్రదర్శిస్తున్నారని తెలిసి సాయంకాలంనుంచే స్త్రీలు తయారవడం మొదలుపెట్టారు. భోజనాలు వండి పిల్లలకీ, పెద్దలకీ పెట్టి తామంత నోట్లో వేసుకుని ఎప్పుడెప్పుడు తొమ్మిదవుతుందా అని ఎదురుచూస్తున్నారు.

ఎనిమిది గంటల ప్రాంతాన వంశీ సత్యనారాయణ ఇంటికి వెళ్ళాడు. ఇంటిముందున్న లాన్‌లో కలర్ టీవీ, వీసీపీ అరేంజ్ చేశాడు.

ఉట్ల ఉత్సవంలో గెలిచి, ఆ డబ్బులో జన్మాష్టమి లాంటి పర్వదినాన భక్తిరస సినిమా చూపిస్తున్న తన అల్లుడ్ని పొగడకుండా వుండలేకపోయాడు సత్యనారాయణ. బామ్మయితే అసలు కృష్ణుడ్నే చూస్తున్నట్లు తన్మయత్వంతో అతనివైపు చూస్తోంది.

సుజనకి మెల్లమెల్లగా ప్లానేమిటో అర్థమవుతోంది.

ఇంకాసేపట్లో సినిమా ప్రారంభమవుతుంది. ఇంట్లోనివాళ్ళంతా టీవీ ముందు ఏర్పాటుచేసిన కుర్చీల్లో కూర్చుంటారు. తను మాత్రం చివరలో కూర్చుంటానని చెబుతుంది. ఊళ్లోగా వచ్చిన జనంతో లాన్ అంతా నిండిపోతుంది. అంతమంది జనం మధ్య తను వున్నదీ లేనిదీ తెలుసుకోలేరు. అంతేకాక భక్తిరస సినిమాలో లీనమై పోతారు. లవకుశ కాబట్టి తల పక్కకి తిప్పడానికైనా ఇష్టపడరు.

అబ్బాయిలు ఇలాంటి అవకాశాల కోసమే టీవీ షోలను ఏర్పాటుచేస్తుంటారని వంశీ ఎప్పుడో చెప్పగా విన్నది. అందువల్లే అంత కరెక్టుగా ఊహించింది. మరి తమ ఫస్ట్‌నైట్ ఎక్కడ జరుగుతుందో మాత్రం ఊహించలేకపోయింది.



## నయమే!

"నా ముక్కు పకోడీలా వుంటుందని వెక్కిరించారు. నేనెంత కలవరపడ్డానంటే ఓ దశలో ప్లాస్టిక సర్జరీ చేయించుకోవాలనుకున్నాను. అలా గ్లామర్ పెంచుకుని, హీరోయిన్‌గా రాణించవచ్చని భావించాను. కానీ, అలా చేయనందుకు ప్రస్తుతం సంతోషిస్తున్నాను. ఇంతకుముందు బాగోదన్నవారే, ఇప్పుడు నా ముక్కు చాలామంది ముక్కులకన్నా నయమే నంటున్నారు" అని చెప్పింది మధుబాల.

ఇటీవలి సక్సెస్‌తో తనకే కాదు, తన సహజ సౌందర్యానికి గుర్తింపు లభించినట్టు, ఇలా సంబరంగా చాటుకుంటోంది మధుబాల.

తొమ్మిదైంది.

వైర్లకు కనెక్షన్లు ఇస్తూ వంశీ సుజనవైపు చూసి రెడీనా అన్నట్లు కన్ను గీటాడు. రెడీ అన్నట్లు ఆమె కూడా తల ఎగరేసింది.

సత్యనారాయణ అండ్ ఫ్యామిలీ టీవీ ముందుగా ఒకవైపు వేసిన కుర్చీల్లో కూర్చున్నారు.

సుజనను రమ్మని పిలిచారు.

"నేను అక్కడికి వద్దులే నాన్నా! లవకుశ బోర్ సినిమా. షెనర్జ్ నెగ్గర్ సినిమావో, సిల్వెస్టర్ స్టాలోన్ సినిమావో అయితే ఫరవాలేదుగానీ పిసీ పిసీ పిసిగి పోయిన రామాయణాన్ని ఎవరు చూస్తారు? ఆయన గారు తగుదునమ్మా అని పందెంలో గెలిచి ఈ డొక్కు సినిమా చూపిస్తున్నారు. నేను చూడలేను బాబూ. లోపలికెళ్ళి పడుకుంటాను. పది నిముషాలో, పావుగంటో వెనకాల చైర్ వేసుకుని కూర్చుంటాను. ముందు కూర్చుంటే జనాన్ని తప్పించుకు రావడం కష్టం" అతికినట్లు అబద్ధాలాడడం అంటే ఇదే కాబోలు మనసులో అనుకుంది.

"అలానే" అన్నాడు సత్యనారాయణ.

అప్పటికే ఉమాకు డౌట్ వచ్చి దొడ్డితలుపును లాక్‌చేసి తాళంచెవిని బొడ్లో దోపుకొచ్చింది. వంశీ వస్తే ఆ దారినే వస్తాడని ఆమె నమ్మకం.

వంశీ క్యాసెట్ ప్లే చేశాడు.

తొలుత ఏవో అడ్వర్టైజ్‌మెంట్లు రావడం ప్రారంభించాయి. జనం అంతా సర్దుకు కూర్చున్నారు.

"నే వస్తాను మామయ్యా. ఇంకా భోజనం కూడా చేయలేదు. ఉట్లు కొట్టి ఒళ్లంతా ఒకటే నొప్పులు. వేడినీళ్ళ స్నానం చేసి పడుకుంటాను. ఈ సినిమా దాదాపు మూడు గంటలుంటుంది. పన్నెండు గంటల ప్రాంతాన వస్తాను" అని చెప్పి అక్కడినుంచి బయటికి వచ్చాడు వంశీ.

జనమంతా వ్యాపార ప్రకటనలను విసుగ్గా చూస్తున్నారు. వంశీ ఓ ఐదు నిముషాలపాటు అక్కడే తారట్లాడి జనం వెనగ్గా నడుస్తూ సుజన దగ్గరికి వచ్చాడు.

టీవీ చూస్తున్న ఆమె నడుంపై చేయి వేశాడు. వెనక్కి తిరిగి చూసింది.

ఇక వెళదాం రమ్మన్నట్లు ఎయిర్ ఇండియా మహరాజాలా స్వాగతం చెప్పాడు.

ఇద్దరూ బయటపడ్డారు. వీధంతా నిర్మానుష్యంగా వుంది. ఇళ్లలోని జనమంతా టీవీ దగ్గరికి వచ్చేస్తే ఇక వీధుల్లో ఎవరుంటారు? మిగిలిన ముసలీ ముతకా సినిమాకు వెళ్ళక అప్పటికే పడుకుండిపోయారు.

ఆకాశంలో చుక్కల కాంతి తప్ప మరో వెలుగు లేదు. వీధిలో రెండు కుక్కలు మాత్రం పరాచికాలు ఆడుకుంటున్నాయి.

"ఓ మూడు గంటలపాటు మనం ఎక్కడో వెళ్తక్కర్లేదు. ఈ టైమ్‌లో మన శోభనం ఝూమ్‌ఝూమ్‌మని ఏ ఆటంకం లేకుండా జరిగిపోతుంది" వంశీ మబ్బుల్లో తేలిపోతూ చెప్పాడు.

"ఇంతకీ ఎక్కడ?"

"స్కూల్లో"

"స్కూల్లోనా!" ఆశ్చర్యపోయింది.



## ఇద్దరు గోవిందాలు!

గోవిందా కరిష్మా ప్రేమతోపాటు, ఆమె తండ్రి రణధీర్‌కపూర్ అభిమానాన్ని సంపాదించుకున్నాడు. ఆతనీమధ్య 'ఆంఖే' సినిమా చూసి గోవిందాకి ఫోనులో కంగ్రాచ్యులేషన్స్ తెలిపాడట.

అలా తనకి పెరిగిన పాపులారిటీ గురించి గోవిందా ప్రచారం చేసుకుంటూ, ఇలా చెబుతున్నాడు. "తాగిన మైకంలో ఆ సినిమా చూశానని, అందువల్ల నేను ఇద్దరు గోవిందాల్లా కన్పించానని చెప్పాడు రణధీర్ కపూర్. మామూలుగా వున్నప్పుడు మళ్లీ ఆ సినిమా చూడాలనుకుంటున్నానన్నాడు. 'అందులో నాది డబుల్ రోలని' నేను చెప్పినప్పుడుగానీ రణధీర్‌కపూర్ అసలు సంగతి తెలుసుకోలేదు"

"ఆఁ చిన్నప్పుడు చదువు నేర్చుకున్నాం. ఇప్పుడు సరసం నేర్చుకోబోతున్నాం"

ఇద్దరూ ఒకరి చేతులు ఒకరు పట్టుకున్నారు. ఆ స్పర్శ వాళ్ళిద్దరికీ కొత్తగా వుంది. ఒకరి కోరిక ఒకరికి వేళ్ళలోంచి పాకుతున్నట్లుంది.

"అదిగో మన రొమాంటిక్ కేజల్"

స్కూలుగది కనిపిస్తోంది.

అంతలోనే తమ వెనక ఏవో హాహాకారాలు వినిపించడంతో ఇద్దరూ ఆగారు.

బాగా పరిశీలించి చూస్తే సత్యనారాయణ ఇంట్లోంచే అరుపులు వినిపిస్తున్నాయి. కేకలు గుండెల్ని చీలుస్తున్నాయి. ఎవరో రాయి విసిరితే తుట్టెలోంచి బయటపడ్డ తేనెటీగల్లా జనం గేటును తోసుకుని బయటికి పరుగెడుతున్నారు.

"ఏం జరిగింది?" సుజన కంగారుగా అడిగింది.

"అదే నాకూ తెలియడంలేదు. వెళదాం-రా" ఇద్దరూ వడివడిగా నడుస్తున్నారు.

ముందుగా పరుగెత్తుకొచ్చిన ఇద్దరి కుర్రాళ్ళను ఆపి-"ఏమైంది?" అని అడిగాడు వంశీ.

"ఏం జరిగిందా? వెళ్ళి చూడండి" ఆ కుర్రాళ్లిద్దరూ నవ్వునీ, ఆయాసాన్నీ ఆపుకుంటూ చెప్పారు.

"ఏదో జరిగింది మీ ఇంట్లో. అయితే ఆందోళన పడవలసింది కాదు. లేకుంటే వాళ్లలా నవ్వరుకదా" అన్నాడు సుజన కంగారు చూసి.

ఆమె కూడా సర్దుకుంది.

అంతలో మరో ముగ్గురు స్త్రీలు ఎదురుపడ్డారు. వాళ్లు కూడా అంతవరకు పరుగెత్తుకుంటూ వచ్చి, ఆయాసం తన్నుకురావడంతో ఆగారు.

"అదా! చెప్పేదికాదు" అంది అందులో ఒకామె. మిగిలిన ఇద్దరు కూడా అంతేనన్నట్టు తలలాడించారు.

ఇక సస్పెన్సును భరించలేక వాళ్లిద్దరూ నడకవేగం పెంచారు. గుంపులు గుంపులుగా జనం ఏదేదో మాట్లాడుకుంటూ ఎదురుపడుతున్నారు.

అంత రాత్రిపూట వాళ్లిద్దరూ ఎక్కడినుంచి వస్తున్నారోనని కూడా జనం చూడలేదంటే అంత ఇంట్రెస్ట్ అయిన విషయం ఏం జరిగిందో తెలియడం లేదు. మరో రెండు నిముషాలకి వంశీ, సుజన అక్కడికి చేరుకున్నారు.

సత్యనారాయణ గారిల్లు నిశ్శబ్దంగా వుంది. అంతకు ముందు జనంతో కిటకిటలాడిన లాన్ ఇప్పుడు బోసిగా వుంది.

టీవీలో మాత్రం బొమ్మలు కనిపిస్తున్నాయి.

వీసీపీ అయినా ఆఫ్ చేయకుండా జనం ఎందుకలా పరుగెత్తారో ఊహకైనా అందడంలేదు.

తన మామయ్య ఫ్యామిలీ అంతా ఇంట్లోకి వెళ్ళి తలుపులు బిడాయించుకున్నారన్న విషయం మాత్రం అర్థమైంది. లోపల అన్నిలైట్లూ వెలుగుతున్నాయి.

వంశీ ప్రహరీగోడకున్న గేటును దాటి లోపలికి అడుగుపెట్టాడు. అప్పటికి టీవీలో బొమ్మలు మసగ్గా కనిపిస్తున్నాయి. ఎన్టీరామారావు, అంజలీకి బదులు ఎవరో ఇంగ్లీషువాళ్ళు మాట్లాడుకుంటున్నారు.

సుజన వచ్చి వంశీకి వెనగ్గా నిలుచుంది.

సీన్ మారింది.

ఒక్కసారిగా షాక్ తిన్నట్లు ఇద్దరూ అలా గుడ్లప్పగించి చూస్తున్నారు.

ప్లే అవుతున్నది బ్లూఫిల్మ్.

ఆ షాక్‌నుంచి ముందుగా తేరుకున్నది సుజన. పరుగున వెళ్ళి కనెక్షన్ పీకేసింది.

జనం ఎందుకంత కేకలు పెడుతూ పరుగెత్తారో తెలిసింది వంశీకి. మామయ్యావాళ్ళు ఎందుకు టీవీ ఆఫ్‌చేసే స్థితిలో కూడా లేరో అర్థమైంది.

అతని తల కిందకు వాలిపోయింది.

టీవీ ఆఫ్‌కాగానే ఇంట్లోంచి ఒక్కొక్కరే బయటికి వచ్చారు.

కూతురు, అల్లుడూ ఏదో ప్లాన్‌చేసి, తమను బోల్తా కొట్టించడానికి ప్రయత్నించారని ఊహించిన సత్యనారాయణ "ఇక లోపలికి రా" అంటూ సుజనను గద్దించాడు.

ఆమె అడుగులో అడుగు వేసుకుంటూ లోపలికి నడిచింది.

"ఛీఛీ! ఈ రోజులో కుటుంబం వీధినపడింది" సత్యనారాయణ ముఖాన్నంతా వికారంగా చేసుకుని కూతురిని అనుసరించాడు.

ఇక అక్కడ ఓ క్షణం వుండలేక వంశీ వెనుతిరిగాడు. చివరన లోపలికి వెళుతున్న బామ్మ ఓ అడుగు వెనక్కి తగ్గి, వంశీ దగ్గరకి వచ్చింది.

"అబ్బాయ్! లవకుశకంటే ఇదే బావుందోయ్" అంది మెల్లగా.

**(ఇంకావుంది)**

# అమెరికాలో అపరశకుని

పూర్వం శకుని చేతిలోని పాచికలు చెప్పినట్లు వినేవట. ఎన్ని చుక్కలు కావాలంటే అన్ని చుక్కలు పడేవి. దాని మాట ఎలా వున్నా ఇప్పుడు అమెరికాలో అపరశకుని ఒకడు వున్నాడు. అతడు ఏ క్లబ్బుకి వెళ్లి ఆడినా విజయం అతనిదే. ఏ కాసినోకి వెళ్లి ఆడినా మొత్తం డబ్బు అతనిదే.

ప్రపంచంలో అతనికన్నా అదృష్టవంతుడు మరొకడు వుండడనీ, మూడు సంవత్సరాల కాలంలో 360 లక్షల డాలర్లు సంపాదించి, ప్రభుత్వానికి అత్యధిక ఇన్‌కమ్ టాక్స్ కట్టేవారిలో ఒకడిగా అయ్యాడనీ అతడి గురించి పత్రికలు తెగ రాస్తున్నాయి.

అతడు పేకాట ఆడినా, కాసినో (రాత్రి క్లబ్బులు) లలో క్రాప్ ఆడినా, ఇతర గేంబ్లింగ్ ఏది ఆడినా, ప్రత్యర్థులను చిత్తుచేసి,ఆ ఆటలలో ఆరితేరిన గేంబ్లర్స్‌నీ, కాసినోలలో మోసంచేసి ఆడే ప్రొఫెషనల్ ప్లేయర్సునీ చిత్తుగా ఓడించి వాళ్ళు సంపాదించినదంతా తన పరం చేసుకున్నాడు. అతని పేరు రఫస్ బ్లేక్.



రఫస్ బ్లేక్

## ప్రవేశంలేదు

బ్లేక్ సృష్టించిన సంచలనం అంతా ఇంతా కాదు. తలలు పండిన గేంబ్లింగ్ పండితులు కూడా మాట రాక, చేష్టలుడిగి 'ఎవరీతడు? ప్రపంచంలో కాసినోల పని పట్టాలని దిగివచ్చిన దేవదూతా?' అని తలలు పట్టుకుని కూర్చున్నారు.

మొదట్లో అతను మోసం చేస్తున్నాడనీ, తప్పుడు ఆటలు ఆడుతున్నాడనీ అనుకున్నారు. కానీ, అటువంటిదేమీ లేదని తేలింది. పైగా ప్రపంచం నలుమూలలనుండి కోటీశ్వరులు వచ్చే ఆ కాసినోలలో మోసంచేస్తే శాల్తీ వుండదు.

ముఖ్యంగా ప్రపంచంలో గేంబ్లింగ్‌కి ముఖ్య కేంద్రమైన లాస్‌వేగాస్‌లో, ఆట ఆడుతూంటే అనేక వీడియో కెమెరాలుకూడా వుంటాయి. అక్కడ మోసం చేసినా దొరికిపోతారు. అందుకే ప్రస్తుతం చేయగలిగేదేమీలేక, లాస్‌వేగాస్‌లోనూ, అట్లాంటిక్ సిటీలో వున్న కాసినోల ముందు అతని ఫోటో వేసి, అతనికి ప్రవేశం రద్దుచేసినట్టు ప్రకటించారు. అన్ని పత్రికలలో ఆ వార్త ప్రచురింపబడేలా చర్యలు తీసుకున్నారు.

## 'నాకేం తెలియదు'

రోజుకి కనీసం పదివేల డాలర్లు సంపాదించే బ్లేక్‌కి ఈ వార్త ఎంతో మనస్తాపంకలిగించింది. "నేను ఎవరినీ మోసం చేయలేదు.ఆట ఆడేటప్పుడు ఎటువంటి ట్రిక్కులు చేయలేదు. నాకు రావు కూడా. చిన్నతనంలో మేజిక్ నేర్చుకోవాలని ప్రయత్నించి విఫలమయ్యానుకూడా. అటువంటి నన్ను, ఏ పాపం చేయకుండా, ఈ విధంగా కాసినోలలో రాకుండా నిషేధించడం సబబా?" అని ప్రశ్నిస్తున్నాడు.

అయితే అతని ఆట గమనించిన ఎవరికయినా ఆశ్చర్యం కలగకమానదు. మూడు ముక్కలాటలో మూడు ఆసులూ అతనికే పడడం, రమ్మీలో రెండో రౌండు పూర్తి అయ్యేసరికే ఆట పూర్తవడం, క్రాప్ ఆటలో, పాచికలు వేసినప్పుడు అవి సరిగ్గా కావలసినన్ని చుక్కలు పడడం, అంతేకాదు ఎదుటివారు పాచికలు వేస్తున్నప్పుడు ఎన్ని చుక్కలు పడతాయో ముందుగానే చెప్పడం–చూసేవారి బుర్ర తిరిగిపోయేలా చేస్తాయి.



బ్లేక్‌ని పంపించివేయమని అల్లరిచేస్తున్న ఆటగాళ్లు

అయితే ఇక్కడ గమ్మత్తు అయిన విషయం ఏమిటంటే, అతను కూడా అందరిలాగే ఆశ్చర్యపోతాడు. అది అందరికీ ఇంకా ఆశ్చర్యం కలిగిస్తోంది.

## అతీతశక్తా?

అతని శక్తి సంగతి మొన్న ఏప్రిల్ నెలలో దాదాపు ప్రపంచంలోని అన్ని కాసినోలకీ తెలిసిపోయింది.

అతను తమ కాసినోకి వస్తాడేమోనని వాళ్లు బిక్కుబిక్కుమంటూ వున్నారు.

జర్మనీకి చెందిన విల్‌బోమ్ అనే పారాసైకాలజిస్టు, బ్లేక్‌ని ఇటీవల పరీక్ష చేసి ఆశ్చర్యపోయాడు. "ఇంతవరకు అతీంద్రియశక్తులమీద ప్రయోగాలమీద భిన్నాభిప్రాయాలు వున్నాయి.అయితే బ్లేక్ విషయంలో అందరూ ఏకీభవిస్తారు" అన్నాడు.

అతడు బ్లేక్‌ని పరీక్షచేస్తూ, రెండు పాచికలుపట్టుకుని "ఎన్ని పడతాయో చెప్పు" అని అడిగాడు.

అతడు "ఆరు" అన్నాడు.

అక్షరాలా ఆరే పడ్డాయి. అలా ఒకసారి కాదు, రెండుసార్లు కాదు అనేక పర్యాయాలు జరిగింది.

దాని గురించి పత్రికలవారితో విల్‌బోమ్ మాట్లాడుతూ–"బ్లేక్‌కి 'సైకోకైనసిస్' అనే శక్తి వుంది. దాని ద్వారా అతనికి తెలియకుండానే కళ్లతో చూసి వస్తువులలో చలనం కలిగించగలడు. ఆ శక్తిని అతను పేకముక్కలపైన, పాచికలపైన తెలియకుండా ప్రసరిస్తున్నాడు. ఆ శక్తి వున్నంతకాలం అతను అజేయుడు. అతనితో జూదమాడడంకన్నా నయాగరాజలపాతంలోదూకి చావడంమేలు"అన్నాడు.

## ఇండియా వస్తున్నాడు

ప్రస్తుతం అన్ని క్లబ్బులలో కాసినోలలో ప్రవేశం కోల్పోయిన బ్లేక్, తన భార్యాబిడ్డలతో మన దేశం వస్తున్నాడు.

మనదేశంలోని సుందర ప్రదేశాలు చూడడానికి, మన శిల్పసంపదను, అపూర్వ కట్టడాలను తిలకించడానికి జూలైలో వస్తున్నాడు.

కొందరు పత్రికా విలేఖరులు–"భారతదేశంలోనిక్లబ్బుల్లో కూడా ఆడతారా?" అని ప్రశ్నిస్తే, "ఏమో! నాకే తెలియదు" అని ముసిముసిగా నవ్వుతూ అన్నాడు. జూలై 18న బ్లేక్, ఆంధ్రప్రదేశ్ మేజిక్ అకాడమీవారు ఏర్పాటుచేయబోయే సమావేశంలో"మేజిక్-మిరకిల్స్"అనే విషయంలో ప్రసంగించడానికి అంగీకరించాడు.

–ప్రొ॥ బి.వి. పట్టాభిరామ్

17.6.94 స్వాతి సపరివార పత్రిక



# శాంతికథలు

శ్రీ శ్రీ శ్రీ విద్యాప్రకాశానందగిరిస్వాములవారు

## సుఖజీవనం

ఒకానొక పట్టణములో ఒక సంపన్నుడైన గృహస్థుడు వ్యాపారము చేసుకొనుచు జీవించుచుండెను. అతని గృహమునందు ఆధునికమైన సౌకర్యములన్నియు కలవు.



సేవకులు అతని మాటను తు.చ. తప్పకుండా పరిపాలించుచుండిరి. అతనికి ఆ ఊరిలో మంచి పేరు, ప్రఖ్యాతి గలవు. పిన్నవారు అతని ఎడల గౌరవ భావము, పెద్ద వారు ఆదరభావము, వాత్సల్యభావము కలిగియుండిరి.

ఆ ధనికునకు ఊరిలో అన్నిపరిస్థితులు అనుకూలించినవికాని ఇంటిలో అపుడపుడు అశాంతిని పొందుచుండెను. ఆ ఇంటి ఇల్లాలు భర్తను సరిగా ఆదరించెడిది కాదు. పిల్లలను క్రమశిక్షణతో పోషించక ఆమె అజాగ్రత వహించుచుండెడిది. ఇక్కారణములవలన ఆ గృహస్థునకు మనశ్శాంతి లభించకుండెను.

వారి గృహమునకు ఎదురుగనే ఒక సామాన్య కుటుంబము ఒక చిన్న గృహమునందు నివసించుచుండెను. ఆ యజమాని మధ్యతరగతికి చెందినవాడైనప్పటికి అతని భార్య అనుకూలవతిగా వుండుట వలన అతడు సుఖశాంతులతో కాలము వెళ్ళబుచ్చుచుండెను. ఆ గృహలక్ష్మి భర్తకు కావలసిన అన్ని ఏర్పాట్లను సరియైన వేళకు ఏర్పాటుచేయుచు తన పతివ్రతా ధర్మమును చక్కగా నిర్వర్తించుచుండెను. ఇంటిలోని వస్తువులను ఎప్పటికప్పుడు చక్కగా అమర్చుచు, తన పిల్లలను క్రమశిక్షణలో పెంచుచుండెను. ఇరుగుపొరుగువారితో సుహృద్భావముతో వ్యవహరించుచుండెను.

వారి గృహము వాస్తవముగా శాంతికి నిలయమై వెలయుచుండెను. వారి ఆదర్శ దాంపత్యమును ఆ వీథిలోని వారందరు మెచ్చుకొనుచుండిరి.

ఒక పర్యాయము ఆ ధనికుడు ఎదురుగా నివసించుచున్న గృహస్థుని పిలిచి, "అయ్యా! నా వద్ద కావలసినంత ధనధాన్యములు కలవు. కాని శాంతిమాత్రము లభింపకున్నది. మీరు సామాన్య కుటుంబీకులు అయినప్పటికిని, మీరు ఎంతయో ప్రసన్నముగా, శాంతముగా, నిశ్చింతగా జీవించుటకు కారణమేమిటో తెలుపుమని" పలికెను.

అపుడా వ్యక్తి, "ఓ ధనికుడుగారూ! సుఖము, శాంతి బాహ్యవస్తువులలో లేదు. దృశ్యవిషయముల ఎడల ఆసక్తిని, బాహ్యప్రవృత్తిని తగ్గించుకొని, ధర్మపూర్వకముగ, న్యాయబుద్ధితో వ్యవహరించువాడు శాంతిని బొందును.

సుఖములు కలిగినప్పుడు పొంగి పోక, దుఃఖములు కలిగినపుడు క్రుంగిపోక ఎట్టి పరిస్థితులయందును సమబుద్ధిని అలవరచుకొని, తన కర్తవ్యకర్మలను నెరవేర్చుచో మనుజుడు శాంతి సౌభాగ్యమును, స్థితప్రజ్ఞత్వమును బడయగలడు.

నేనెల్లపుడు మితభాషణము, మితాహారము, మితవ్యవహారము సలుపుచు, దైవభక్తిపరుడనై, ఇతరులకు ఉపకారమొనర్చవలెనను బుద్ధిగలవాడనై, నా శక్తికొలది దానధర్మములు చేయుచు కాలమును సద్వినియోగపరచుచున్నాను. దీనికి నా ధర్మపత్ని కూడా నాకు ఎల్లపుడు చేదోడువాదోడుగా వుండుచు ప్రశాంత జీవితమునకు, పారమార్థిక జీవితమునకు మిక్కిలి తోడ్పడుచున్నది.

పూర్వము జనకుడు మున్నగువారు రాజవ్యవహారములను సలుపుచు కూడా పరమశాంతిని అనుభవించగలిగిరి. సప్తర్షిపత్నులు వారి వారి పతిదేవుల ఎడల భక్తిప్రపత్తులు కలిగియుండి, పాతివ్రత్య ధర్మమును శీలించి లోకమునకు గొప్ప ఆదర్శవంతులైరి.

అట్టి మహనీయులయొక్క ఆచరణను, ఆదర్శముగా గైకొని తద్రీతి వ్యవహరించినచో జనులెల్లరు సుఖశాంతులతో జీవించగలరు" అని సత్సంభాషణము జరిపి అతడు కార్యార్థమై వెడలిపోయెను.

ఈ సంభాషణయంతయు ధనికుని ఇల్లాలు విని, 'అయ్యో! నేనెంత మూర్ఖముగ వ్యవహరించుచున్నాను. ఆ సత్పురుషుడు నాకు జ్ఞానోదయమును కలిగించి, నన్ను కృతార్థురాలిగా ఒనర్చెను.

నేటినుండియు నేను భగవద్భక్తి, పతిభక్తి, పతిసేవ, గృహపాలనము సక్రమమైన రీతిలో గావించుచు నా పతిదేవునకు శాంతిసుఖములను అందించెదను' అని నిశ్చయించుకొని తదనుసారముగా ప్రవర్తించసాగెను.

క్రమముగా ఆ గృహమునందు శాంతిసుఖములు వెల్లివిరియసాగెను.

**నీతి :** వాచా బోధకంటెను, అనుష్ఠానములో కూడిన బోధవలన జనులలో గొప్ప మార్పు వచ్చును. సజ్జనులు, శ్రేష్ఠులు అయినవారు ఏ రీతిని వ్యవహరించెదరో, వారిని చూచి తక్కినవారు కూడా అదే రీతిని నడచుకొనుచు గొప్ప శ్రేయస్సును బడయుదురు.

కనుక మానవుడు శాంతిసంపాదనకు, సుఖజీవనమునకు గాను ఆదర్శవంతుల మార్గమున నడుచుచు, ధర్మప్రవర్తన, భగవద్భక్తి, స్వధర్మాచరణ కలిగియుండి, కర్తవ్యపాలన గావించవలెను.

ఆత్మశ్రేయస్సుకు, సమాజశ్రేయస్సుకు, దేశశ్రేయస్సుకు స్వధర్మపాలనమే ముఖ్యహేతువు అయియున్నది. దైవభక్తిని పెంపొందింపజేసుకొనుచు, చిత్తశుద్ధికి వలసిన ఆధ్యాత్మిక సాధనలను చక్కగా అభ్యసించుచు మానవుడు తన జీవితమును శాంతిమయముగ ఒనర్చుకొని ధన్యుడు కావలెను.



స్వాతి సపరివార పత్రిక 17.6.94



# శాంతి కథలు

## శ్రీ శ్రీ శ్రీ విద్యాప్రకాశానందగిరిస్వాములవారు

## సర్వసాక్షి

పూర్వమొకానొక ఊరునందు ఒక రైతుకు పెక్కు మామిడితోటలు గలవు. వాటివలన వచ్చు ఆదాయము వలన అతడు శ్రీమంతుడయ్యెను. అతని తోటలలోని మామిడిపండ్లు మధురముగ యుండును. అపుడపుడు చిన్నపిల్లలు వచ్చి యజమానిని "అయ్యా! మీ తోటలోని పండ్లు చాల బాగుండును. వాటిని రుచిచూడవలెనను అభిలాష యున్నది. కనుక మాకు ఒక్కొక్కరికి ఒక్కొక్కటి ఒసంగుడు" అని అడుగుచుండిరి.

ఉదారస్వభావుడు, కరుణాహృదయుడగు ఆ యజమాని తన సేవకులను పిలిచి కొన్ని రుచికరములైన పండ్లను తెప్పించి ఆ బాలబాలికలకు సంతోషముతో నొసంగుచుండెను. ఆ పిల్లలు వాటిని ఆరగించుచు ఆనందించుచుండగ అతడు కూడ ఎంతయో సంతృప్తిని బొందుచుండెను.

ఒక పర్యాయము ఆతని మామిడితోటలలో పండ్లు విరివిగా కాసియుండెను. ఇంతకు పూర్వము ఎన్నడూ లేనంతగా పండ్ల దిగుబడి ఈసారి మిక్కుటముగ వుండెను. వాటిని చూచి ఆ రైతు తనలో ఇట్లనుకొనెను.

'దైవానుగ్రహము వలన ఈసారి మామిడిపండ్లు పుష్కలముగ పండినవి. ప్రతి సంవత్సరముకంటెను ఈ సంవత్సరము నాకు ఎక్కువ ఆదాయము రాగలదు. కావున ఈ పండ్లలో కొన్నిటిని నా బంధువులకు, సాధు సత్పురుషులకు, ఇరుగు పొరుగువారికి, ప్రక్క ఊరిలోని నా స్నేహితులకు పంపెదను. ఈ మధురఫలములను సేవించి వారు ఎంతయో తృప్తి నొందెదరు. తోటి జనుల ఆనందమే నా ఆనందము. భగవత్ప్రీత్యర్థమై ఇక్కార్యమును నేను తక్షణమే నిర్వహించెదను'

ఈ ప్రకారముగ భావించి ఆ రైతు సేవకులద్వారా బండిపై కొన్ని మధురఫలములను స్వగృహమునకు తెప్పించెను. మరునాడతడు చుట్టుప్రక్కలవారికి, సాధు పుంగవులకు, చిన్నపిల్లలకు వాటిని పంచిపెట్టెను.

అనంతరమాతడు ప్రక్కపట్టణములోని తన ప్రాణ స్నేహితునకు ఆ మధురఫలములను పంపదలచి ముందుగ ఒక చీటిని ఇట్లు వ్రాసెను.

"ప్రాణమిత్రమా! ఈ చీటి తెచ్చు సేవకుని వెంట 50 మామిడిపండ్లను బుట్టలో పెట్టి పంపుచున్నాను. వీటిని లెక్క చూచుకొని స్వీకరించగలరు"

తదుపరి అతడు తన సేవకులలో ఒకనిని పిలిచి, "ఓయీ! ఈ బుట్టలోని పండ్లను ప్రక్క ఊరిలోగల నా మిత్రునకు ఇచ్చి రమ్ము" అని ఆదేశించి పండ్ల బుట్టను, చీటిని అతనికొసంగెను.

ఆ సేవకుడు చీటిని జాగ్రత్తగ జేబులో దాచుకొని పండ్లబుట్టను గైకొని పొరుగూరికి పయనమైపోసాగెను.

అతనికి చదువు వంటబట్టనందున చిన్నప్పటి నుండి రైతుయొక్క తోటలలో పనిచేయుచు జీవితమును గడుపుచుండెను. తోటలో పనిచేయునపుడు ఎవరూ చూడకుండ మామిడిపండ్లను తిను దురలవాటు అతనికి గలదు. అతడు తన జీవితకాలములో ఇప్పటికి ఎన్నియో ఫలములను ఆరగించియుండెను. అయినను అతనికి ఏ మాత్రము తృప్తి కలుగలేదు.



అందువలన అతడు బుట్టలోని పండ్లపై తన దృష్టిని సారించెను. ఆకర్షణీయములుగ వున్న ఆ పండ్లను చూచి అతనికి వాటిని స్వాహా చేయవలెనను తలంపు కలుగసాగెను. మార్గమధ్యమున నిర్జనప్రాంతమునందు అతడు బుట్టను నేలపై పెట్టి, దానిలోని పండునొకదానిని తినబోయెను. అంతలో అతనికి తన జేబులో వున్న చీటీ గుర్తుకువచ్చెను. కొంచెము వివేకము లోపించిన ఆ సేవకుడు తనలో ఇట్లు ఆలోచించసాగెను.

'నేను పండ్లు తినుటను ఈ చీటి చూచినచో ఇది తన గుట్టును బయటపెట్టగలదు. కనుక దానిని మట్టిలో దాచి పండ్లను ఆరగించిన పిదప తిరిగి జేబులో పెట్టుకొనిపోయెదను. అపుడు నేను చేసిన పని ఎవరికిని తెలియదు'

పిమ్మట అతడు చీటిని నేలలో దాచిపెట్టి, బుట్టలోని రెండు మామిడిపండ్లను తినుచు, "ఆహా! ఎంత రుచికరముగ ఉన్నవి. ఎంత రసాస్వాదముగ వున్నవి" అని మురిసిపోవసాగెను. కొంతసేపటికి ఆ రెండు పండ్లయొక్క అంతుచూచి ఆ మూర్ఖసేవకుడు మట్టిలో దాచిపెట్టిన చీటిని గైకొని, బుట్టను తలపై విడుకొని ముందుకు కొనసాగెను. సాయంకాలముగు సరికి అతడు పొరుగూరు చేరి రైతుయొక్క మిత్రుని గృహమునకు పోయి, "అయ్యా! మా యజమాని గారు ఈ పండ్ల బుట్టను, చీటిని తమరికి ఒసంగిరమ్మనిరి" అని పలికి వాటిని ఇచ్చివేసెను.

చీటిని చదువుకొని ఆ మిత్రుడు బుట్టలోని పండ్లను లెక్కపెట్టించెను. కానీ రెండు పండ్లు తక్కువగ వుండెను. ఆ విషయమై అతడు సేవకుని ప్రశ్నించగా, "అయ్యా! నాకేమీ తెలియదు. నేనేమీ వాటిని తినలేదు" అని అబద్ధమాడెను.

వెంటనే మిత్రుడు సేవకుని-"ఓయీ! నీవు అసత్యము పలుకుచున్నావు. ఈ చీటిలో '50 పండ్లు పంపబడుచున్నవి' అని కలదు. ఇపుడు రెండు తగ్గినవి. నిజము చెప్పుము" అని కొంచెము కఠినముగా, మందలించి అడిగెను.

అత్తరి ఆ సేవకుడు తన తప్పిదము బయటపడినందులకు భయపడుచు-

"అయ్యా! దారిలో నేను పండ్లను తినునపుడు ఈ చీటిని దాచియుంచితినే! ఆ విషయము చీటి మీకెట్లు తెలిపినది?" అని నుడివెను.

దానికా మిత్రుడు, "ఓరీ మూర్ఖుడా! ఎంతటి తెలివిహీనుడవురా నీవు. చీటిని దాచిన మాత్రమున అది నిజము తెలుపకపోవునా?" నీవు చేసిన పనిని సర్వసాక్షియగు దైవము చూచుచునే యున్నాడు. ఇకమీదట దొంగబుద్ధిని మానుకొని సచ్ఛీలుడవై వర్తింపుము" అని హెచ్చరించి పంపివేసెను.

**నీతి : కథలోని మూర్ఖసేవకునివలె ప్రపంచములో అజ్ఞానులు తాము చేయు పనులను ఎవరును గమనించుటలేదని తలంచుచు దుష్ప్రవర్తన కలిగియుండుచున్నారు. సర్వాంతర్యామియగు భగవానుడు జీవరాసుల హృదయములందే నివసించుచు ప్రాణులు చేయు కార్యములన్నిటిని సాక్షిగ వీక్షించుచున్నారు.**

**కనుక జనులు విశ్వాసపరులగు పరమాత్మ తమ యందే యుండుచు తాము ఒనరించు పాపపుణ్యములను రెండిటిని తటస్థునివలె, సాక్షిగ గాంచుచున్నారని యెంచి పాపకార్యములను ఆచరించక, వాటిని ప్రోత్సహించక, పుణ్యకార్యతత్పరులై పరోపకారనిరతులై వర్తించవలెను. అపుడే మనుజాలకు పూర్ణసుఖము, శాంతి లభించగలవు.**

సీరియల్



# రారా నా ఇంటిదాకా

-మేర్లపాక మురళి

'మేఘమాల' అలా ఫ్లాప్‌కావడంతో మరింత ఆరాటపడిపోతున్నాడు వంశీ. అపజయాలన్నీ పట్టుదలను పెంచుతున్నాయి. మరో ప్లాన్‌కోసం తెగ ఆలోచిస్తున్నాడు. లవకుశకు బదులు బ్లూఫిల్మ్ ప్లే కావడానికి అతని అత్యుత్సాహమే కారణం.

ఆ రోజు వీడియో షాప్‌లో అతను బొటనవేలునీ, చూపుడువేలునీ సున్నాలా చుట్టి 'లవకుశ క్యాసెట్ ఇవ్వు-అదిరిపోవాలి' అని అడగడం కొంపముంచింది. అలా వేళ్లను సున్నాలాచుడితే బ్లూఫిల్మ్ అని అర్థం.

"మీరు అలా వేళ్ళను ముడిచి లవకుశ ఇవ్వమంటే బ్లూఫిల్మ్ అనుకున్నాను. అది బ్లూఫిల్మ్‌కి కోడ్‌భాష. ఈ షాప్‌కు వచ్చేవాళ్ళు బ్లూఫిల్మ్ కోసం ఆ విధంగా అడగమని నేనే చెప్పాను. వేళ్ళు ముడవకుండా అడిగితే నిజమైన క్యాసెట్‌లే ఇస్తాం. వేళ్ళు ముడిచి భక్తిరసమైన సినిమా పేర్లు చెబితే బ్లూఫిల్మ్‌లు ఇస్తాం. బ్లూఫిల్మ్ క్యాసెట్‌లకంతా దేవుళ్ళ సినిమాల కోడ్ పెట్టాం-వేశ్యలకు పతివ్రతల పేర్లు పెట్టినట్లు" అని అతి వివరంగా చెప్పాడు షాప్ ఓనర్ కిరణ్.

వంశీ తల పట్టుకున్నాడు. వీసీపీని మరికొన్ని రోజులు వుంచుకుంటానని చెప్పి, కొన్ని ఇంగ్లీషు సినిమాలు తెచ్చుకున్నాడు. ఆ రోజునుంచి రోజు కొకటి చొప్పున వేసుకుని చూస్తున్నాడు. సినిమా చూస్తున్నా అతని మనసు అక్కడ లగ్నంకావడంలేదు. మరో ప్లాన్ కోసమే బుర్రంతా పెనుగులాడుతోంది.

ఇంటి దగ్గర ఏమీ తోచకపోతే సిగరెట్ కాల్చుకోవడానికి రచ్చ దగ్గరకొచ్చాడు. అంతకుముందే కానన్ సిరీస్‌లో వచ్చిన కానన్ అండ్ ది డెస్ట్రాయర్ సినిమాను వీడియోలో చూశాడు.

నల్లటి బరిశెలాగా వుండే నీగ్రోపిల్ల నటనను మననం చేసుకుంటూ నిలుచున్నాడు.

అప్పుడు పదకొండు గంటలు కావడంవల్ల ఎండ తీక్షణంగా వుంది. ఎండ అలా వుండడంవల్లే మర్రిచెట్టు నీడ మరింత చల్లగా వుంది.

సిగరెట్ చివరలో వుండగా మోపెడ్‌లో ఓ వ్యక్తి రచ్చ దగ్గరికి వచ్చాడు.

"ఇక్కడ వంశీ అనే వ్యక్తి ఇల్లెక్కడ?" అని అడిగాడు.

"నేనే-ఎవరు మీరు?" దగ్గరికి వస్తూ ప్రశ్నించాడు.

"రాకెట్ కొరియర్ సర్వీసునుంచి వస్తున్నాను. మీకు ఓ పార్శిల్ వుంది. డెలివరీ కోసం వచ్చాను"

తనకు కొరియర్‌సర్వీసులో పార్శిల్ వచ్చిందంటే ఆశ్చర్యపోయాడు అతను.

"ఇవ్వండి"

వచ్చిన వ్యక్తి వంశీ దగ్గర సంతకం తీసుకుని, ఓ అట్టపెట్టెలాంటిదిచ్చాడు.

వంశీ దానిని తీసుకుని ఇంటికి వచ్చాడు. ఫ్రం అడ్రస్‌లేదు. బ్లేడ్‌తో ప్లాస్టిక్ పైలని కట్‌చేసి, విప్పాడు.

ఓ వీడియో క్యాసెట్ వుంది.

దాన్ని చూసి అతను విస్మయం చెందాడు. వీడియో క్యాసెట్ ఎవరు పంపారో, అందులో ఏం వుందో అర్థంకాలేదు.

వీసీపీ తన దగ్గర వుంచుకోవడం మంచిదైందని అనుకుంటూ ఇంగ్లీషు క్యాసెట్ బయటికి తీశాడు. పార్శిల్‌లో వచ్చిన క్యాసెట్‌ను పెట్టి ప్లే చేశాడు.

కొన్ని క్షణాలకు బొమ్మలు రావడం ప్రారంభించాయి. అతను పరిసరాలన్నింటినీ మరిచిపోయి చూస్తున్నాడు. క్యాసెట్ ముందుకు పోతున్నకొద్దీ అతని మెదడు మొద్దుబారుతోంది. కాళ్ళూ, చేతులూ తిమ్మిరెక్కి, తనకు అనస్థీషియా ఇచ్చినట్లు అయిపోతున్నాడు. కళ్లు ఆర్పడం కూడా మరిచిపోయాడు.

సుజన, మరో యువకుడు చెట్టాపట్టాలేసుకుని ఓ ఖరీదైన హోటల్‌కి వెళ్ళడం దగ్గర్నుంచి, ఇద్దరూ ఓ గదిలోకి ప్రవేశించడంవరకూ క్యాసెట్ చూపిస్తోంది.

తలంతా తిరుగుతున్నట్లనిపించి, బలవంతంమీద అక్కడినుంచి లేచి స్విచ్ ఆఫ్ చేశాడు. టేబుల్‌మీదున్న జగ్‌లోంచి నీళ్ళు తాగి తిరిగి క్యాసెట్ ప్లే చేశాడు.

సుజన ఆ యువకుడివైపు చూసి మత్తుగా నవ్వింది. కాట్‌పై సగం పడుకుని, నడుం పైభాగాన్ని పైకి లేపి రారమ్మన్నట్లు చేయి అందించింది.

**13** వంశీ సుజనల పెళ్ళవుతుంది. శోభనం ముహూర్తం దగ్గరపడిందనగా సుజనకు 'మూడు రోజుల' ఇబ్బంది ఎదురౌతుంది. ఆ మూడు రోజులూ వీలుకాదు కనుక మరో ముహూర్తం చూస్తాడు సుజన తండ్రి. ఆ ముహూర్తానికిముందే, తమ శోభనం జరుపుకోవాలనే ప్లాన్‌లోవుంటుంటారు వంశీ సుజనలు. అందుకు వంశీ వేసిన రెండు ప్లాన్‌లూ విఫలమౌతాయి.

'శ్రీకృష్ణజన్మాష్టమి' రోజున తన ప్లాన్ నెంబర్ త్రీని అమలులో పెడతాడు వంశీ. స్కూల్‌లోని గదిలో తమ శోభనం జరుపుకోవాలనేదే ఆ ప్లాన్. దేవాలయంలో జరిగిన కృష్ణాష్టమి ఉత్సవాలలో భాగంగా ఆ రోజు సాయంత్రం ఉట్టికొట్టే కార్యక్రమంలో పాల్గొని తెలివిగా విజయం సాధిస్తాడు. ఆ విజయం సందర్భంగా ఆ రాత్రి సుజన ఇంట్లో 'లవకుశ' వీడియో సినిమా చూపించడానికని చుట్టుపక్కల అందరినీ ఆహ్వానిస్తాడు.

అందరూ సినిమా చూడడానికి సిద్ధమౌతారు. కానీ వంశీ చేసిన ఓ పొరపాటువల్ల అది బ్లూఫిల్మ్ అవడంతో అందరూ లేచి వెళ్లిపోతుంటారు. ఆ సమయంలో అక్కడికివచ్చిన వంశీ సుజనలను చూసిన సత్యనారాయణకు వంశీ ప్లాన్ అర్థమౌతుంది.

అప్పటికే షర్ట్ తీసేసిన అతను తెంరేగిపోతున్న కోరికలా ఆమెమీద పడ్డాడు.

ముద్దులు, వేడి నిట్టూర్పులు, బిగికౌగిలిలూ ప్రారంభమయ్యాయి. వంశీ మరింత ముందుకి వంగి, పరిశీలించి చూస్తున్నాడు.

నో డౌట్-ఆమె సుజనే. అవే కళ్ళు,అదే ముక్కు, అదే చిరునవ్వు, అవే పెదవులు-ఆమే-సందేహంలేదు.

ఎవరో తనను బంధించి చెవుల్లో కరిగించిన సీసం పోస్తున్నట్లు, కళ్లల్లో కారంపొడి చల్లుతున్నట్లు అతను గిలగిల్లాడిపోయాడు.

ఆ యువకుడ్ని తనివితీరా కౌగిలించుకుని సుజన ముద్దులతో నింపేస్తోంది. సైడ్ యాంగిల్‌లోంచికూడా ఆమె కళ్ళల్లో పడగవిప్పిన కోరిక మరింత స్పష్టంగా తెలుస్తోంది. ఆ యువకుడు ఆమె బట్టల్ని ఒక్కొక్కటి విప్పుతున్నాడు. ఆమె సిగ్గుపడడంలేదు. పైపెచ్చు అతన్ని రెచ్చగొడుతోంది.

తన భార్యతో మరో యువకుడు జరిపిన రొమాన్స్‌ను వీడియోలో చూసి భరించడం మానవమాత్రుడికి సాధ్యంకాదు. అది భయంకరమైన అనుభవం. ప్రస్తుతం వంశీ ఆ స్థితిని అనుభవిస్తున్నాడు.

•    •    •

డాబా మెట్లెక్కుతోంది వైదేహి.

ఆమెకు ఇరవై ఎనిమిదేళ్లుంటాయి. చాలా అందమైన ముఖం. అందానికి మించిన వినయం ఆమెకు హుందాతనాన్ని తెచ్చిపెట్టింది.

ఆ సాయంకాలంపూట నీట్‌గా తయారైన ఆమెను చూడడం కూడా గొప్ప అనుభవం.

తబలా మీదుండే తెల్లటి నల్లటి గుర్తుల్లా వుండే కళ్లు, పిల్లనగ్రోవిని బోర్లించిపెట్టినట్లుండే ముక్కు, వాయులీనాల్లాంటి పెదవులు, డ్రమ్‌లా వుండే కంఠం, అటు ఇటు రెండు నగారాలను పెట్టినట్లుండే వక్షస్థలం, వీణ పైభాగంలా వుండే నడుము, చుట్టూ గజ్జెలు కట్టిన డప్పులాంటి బొడ్డు- మొత్తం ఆమే ఓ సంగీత వాయిద్యాల కొలువులా వుంటుంది. ఆమెను ముట్టుకుంటేనే సంగీతవాయిద్యాలన్నీ ఒక్కసారిగా మోగుతాయని ఎందుకనో అనిపిస్తుంది.

ఆమె మెట్లన్నీ ఎక్కి, డాబామీదకు చేరుకోగానే సుజన ఎదురొచ్చి సాదరంగా ఆహ్వానించింది.

"రా వైదేహి! నీ కోసమే చూస్తున్నా"

ఆమె చిర్నవ్వు నవ్వుతూ వెనకే నడిచింది.

పిట్టగోడకు దగ్గరగా ఆపాటికే వేసున్న రెండు కుర్చీల్లో కూర్చున్నారు.

"చాలా రోజులైంది నీతో మాట్లాడి. కొత్త పెళ్లికూతుర్నిగదా పనేంలేదు. అందుకే సరదాగా నీతో కబుర్లు చెబుదామని పిలిచాను" సుజన ఫ్లాస్కులోని కాఫీ ఓ కప్పులో పోసి అందిస్తూ చెప్పింది.

"ఎలావుంది పెళ్ళి? మొత్తానికి ప్రేమించినవాడ్ని పెళ్లిచేసుకున్నావ్. ఇలాంటి పెళ్లిళ్లే బెస్ట్. ఎవరో ముక్కూమొహం తెలియనివాడ్ని చేసుకోవడంకన్నా, మనకు బాగా తెలిసినవాడ్ని, మనం నచ్చినవాడ్ని చేసుకోవడం ఉత్తమం. ఆఫ్‌కోర్స్ కొన్ని పెళ్లిళ్ల ఇలాంటివీ ఫెయిలైనా మన తప్పుకు మనమే బాధ్యులం అవుతాం. కనీసం పశ్చాత్తాపం అయినా పడొచ్చు. అదే అరేంజ్డ్ పెళ్లిళ్లలో అయితే ఆ అవకాశం కూడా వుండదు" కాఫీ సిప్‌చేయడానికి ఆగింది వైదేహి.

"మన పెళ్లి మన ఇష్టం. బతకడం కూడా ఒక కళే. వయసొచ్చిన ప్రతి ఆడపిల్లా, ప్రతిమగవాడూ పెళ్ళికోసం అమ్మానాన్నలవైపు చూస్తుంటారు. జాతరలో రంగుటద్దాల్లో వుంచిన తినుబండారాలను చూసి కొనివ్వమని అమ్మవైపు చూస్తున్న పిల్లల్లాగా"

"నిజమే- ఆ మాత్రం వ్యక్తిత్వంలేకపోవడంవల్లే మన లైఫ్ స్టయిలే మారిపోతుంది. ఇది భయంకరమైన నిజం. అందుకే చాలామంది తమకు ఇష్టంలేని రంగాలలో వుండిపోతారు. నటికావాలనుకున్న పిల్ల బ్యాంక్‌లో గుమస్తా అవుతుంది. ఐపిఎస్ కావాలనుకున్న అమ్మాయి హోమ్‌గార్డ్ పెళ్లామవుతుంది. ఇంటర్‌లో ఏ సబ్జెక్ట్ తీసుకోవాలో కూడా తల్లిదండ్రులే నిర్ణయిస్తారు. ఇలా చెడిపోయిన జీవితాలు చాలా. అందులో నేనూ ఒకదాన్ని" ఏదో బాధలాంటి ఫీలింగ్ ఆమె కంఠాన్ని కెలికింది.

"ఏం జరిగింది? పెళ్లయిన నెలరోజులకే పుట్టింటికి చేరిపోయావు. అసలు ఫస్ట్‌నైట్‌నే మీ ఇద్దరిమధ్యా ఏవో గొడవలు ప్రారంభమయ్యాయని ఎవరో చెప్పుకుంటుంటే విన్నాను"

"ఆఁ ఆ రోజునే కదా స్త్రీకి మగవాడి రాక్షసత్వమో,



రొమాంటిసిజమో తెలిసేది. నా విషాదం చెప్పే ముందు మన ఊర్లోనే జరిగిన ఓ సంఘటన చెబుతాను. నా గొడవ బాగా అర్థంకావడానికి ఇది ఉపయోగపడుతుంది" అంటూ వైదేహి చెప్పడం ప్రారంభించింది.

"పక్కవీధిలో కాశీపతి అనే వ్యక్తి కాపురముంటు న్నాడు. వీధిచివర ఇల్లు. స్పిన్నింగ్ మిల్లులో పని చేస్తుంటాడు. నూలుకండెలాగా సన్నగా, బక్కపలచగా వుంటాడు. ముప్పై ఏళ్ళకు మించవు.

రెండేళ్ళక్రితం వివాహమైంది. ఒక కూతురు. అత్తిల్లు గూడూరుదగ్గర పల్లెటూరు అన్నంబాకం. తుఫాను రావడంతో అత్త చనిపోయింది. మరదలు పిల్ల వుండేది. తల్లి చనిపోవడంతో వున్నదేదో అమ్ము కుని అక్కింటికి వచ్చేసింది. పదిహేడేళ్ల వయసులో విరబూసిన ముద్దబంతిలా వుండేది. తల్లిని పోగొట్టు కుని తన పంచన చేరిన చెల్లెల్ని అక్క బాగా చూసు కునేది. ఆమె తెచ్చిన డబ్బుతో ఎకరం పొలం కొన్నారు. ఆ ఎకరం అమ్మి చెల్లెలి పెళ్లి చేసెయ్యా లని అక్క ఉబలాటపడిపోతుండేది.

రోజులు గడుస్తున్నాయి. ఆమె వచ్చి సంవత్సరం పైగానే అయింది.

జొన్నకండెలా వుండే అమ్మాయి సెద్దకంకిలా సన్నగా అయిపోవడం ప్రారంభించింది.

సడెన్‌గా తన చెల్లెలు అలా ఎందుకు తగ్గిపోతూ వుందో అర్థంకావడంలేదు అక్కకి.

'ఏమిటే ప్రియంవదా! అలా అయిపోతున్నావ్. ఒంట్లో బాగాలేదా? ఏదైనా నలతగా వుంటే చెప్పు. డాక్టర్ దగ్గరికి వెళదాం' అక్క ఆప్యాయంగా దగ్గర కూర్చుని అడిగింది.

ఆమె ఏమీ లేదన్నట్లు తల అడ్డంగా ఊపుతుందే తప్ప తన సమస్య చెప్పదు.

గత నెలలో ఆమెకి పీరియడ్స్ రాలేదన్న విషయం గుర్తుంది అక్కకి. ఈ నెలలో అయినా అవుతుంది లెమ్మని ఊరుకుందితప్ప చెల్లెల్ని ఏమీ అడగలేదు. ఆ నెలా రాలేదు. ఏదో అనుమానం పీకింది.

చెల్లెల్ని దగ్గరపెట్టుకుని కారణం ఏమిటో అడిగింది. మౌనంగా వుండిపోయిన ఆమెని గద్దించింది. భయ పెట్టింది. బుజ్జగించింది.

చివరికి ప్రియంవద నోరు తెరిచింది.

'గత రెండు నెలలుగా పీరియడ్స్ రావడంలేదక్కా' అంటూ చెప్పి, ఏడుపు అందుకుంది.

నవనాడులూ కుంగిపోయాయి అక్కకి. కళ్లు బైర్లుకమ్మాయి. చాలాసేపటివరకు ఆ షాక్‌నుంచి తేరుకోలేకపోయింది.

హడావుడిగా బయల్దేరి టౌన్‌లోని డాక్టర్ దగ్గరికి తీసుకెళ్ళింది. డాక్టర్ అన్ని పరీక్షలూచేసి 'గర్భవతి' అని తేల్చి చెప్పింది.

చెల్లెలికంటే ఎక్కువగా డాక్టర్ దగ్గరే ఏడ్చేసింది అక్క. చెల్లెల్ని తీసుకుని ఇంటికి వచ్చింది.

దీనికి కారణం ఎవరో చెప్పమని ఎంత అడిగినా ప్రియంవద చెప్పడంలేదు. బెదిరించినా లాభంలేక పోయింది. బుజ్జగించినా ఫలితం లేకపోయింది. ఏడుపులూ, కేకలూ విని పక్కింటివాళ్లు వచ్చారు. వాళ్లూ దగ్గర బంధువులేగనుక తమకు వచ్చిన కష్టం గురించి చెప్పుకుంది అక్క.

అప్పటికి సాయంకాలం ఆరుగంటలైంది. శీతా కాలం కావడంతో చీకట్లు ముసురుకుంటున్నాయి.

అందరూ రోడ్లో చేరారు.

అంతలో కాశీపతి కూడా మిల్లునుంచి వచ్చాడు. తమ ఇంటి రోడ్లో పక్కింటివాళ్లు వుండడం, అందరి ముఖాల్లోనూ బాధ కదులుతుండడంతో ఏం జరిగిందో నని కంగారుగా లోపలికి వచ్చాడు.

"ఏం జరిగింది?" అడిగాడు కాశీపతి.

అత్త వరసయ్యే ఆమె సన్నటి ఎక్కిళ్లమధ్య విషయం చెప్పింది.

అగ్గుల్ని తొక్కినట్లయిపోయాడు కాశీపతి.

'ఎవడు వాడు? నా మరదల్ని నలుగురిముందూ నిలబెట్టిన ఆ నీచుడెవడు? వాడెవడో కనుక్కోండి. నరికి నలగంగమ్మకు ప్రసాదంగా పెట్టేస్తాను' అంటూ ఎంతో ఆవేశంగా ఊగిపోయాడు.

'వాడెవడో ఎంత అడిగినా చెప్పడంలేదు నాయనా! నువ్వడిగితే అయినా చెబుతుందేమో కనుక్కో'

మరదలువైపు తిరిగి 'చెప్పు. నిన్ను మోసం చేసిన దుర్మార్గుడెవరో చెప్పు. వాడ్ని చంపి పేగులు మెళ్లో వేసుకుని నరసింహస్వామిలాగా వీథుల్లో తిరుగు తాను' అని ఫోర్స్‌గా ముందుకెళ్లి ప్రియంవద ముందు నిటారుగా నిలబడ్డాడు.

ఆమె ఏడుస్తోందేతప్ప నోరు విప్పలేదు. కాశీపతి ఉగ్రుడైపోయాడు. తన మరదల్ని గర్భవతిగా చేసిన వాడ్ని బూతులు తిడుతున్నాడు.

కోపంతో చిందులు తొక్కుతున్నాడు.

ఏడుగంటలైంది. చీకటి మరింతగా చుట్టూ అల్లు కుంటోంది. అక్కకి అసహనం ఎక్కువైంది.

'ఇదిగో చివరిసారి అడుగుతున్నాను. వాడెవడో చెప్పు. లేదంటే ఇలానే ఇంట్లోకి వెళ్లి కిరసనాయిల్ పోసుకుని నిప్పంటించుకుంటాను' అని ఎంత వేగంగా అందో, అంతే వేగంతో పైకి లేచింది.

దాంతో ప్రియంవద భయపడిపోయింది.

'అలా భయంతో అల్లల్లాడిపోవద్దు. వాడెవడో చెప్పు. వాడికి ఈ భూమ్మీద నూకలు చెల్లిపోయాయి గనుకే వాడికి ఈ దుర్బుద్ధి పుట్టింది. ఈ రోజు వాడి రక్తం కళ్లజూస్తాను' కాశీపతి బుసకొడుతున్నా, ఎవరూ అతని వైపు చూడడంలేదు. ప్రియంవద ఏం చెబు తుందోనని ఆసక్తిగా చూస్తున్నారు.

ఆమె మెల్లగా నోరువిప్పి 'బావ' అంది.

అప్పుడు పిడుగులే కురిశాయో, అగ్గులే వర్షిం చాయో తెలియదుగానీ అందరూ శిలాప్రతిమల్లా బిగుసుకుపోయారు.

'ఎవరూ!' అక్క మరోసారి వినడానికని అడిగింది.

'బావే'. ఆ రెండు అక్షరాలూ పలికి ఏడుస్తోంది.

ఎట్టి పరిస్థితులలోనూ తన పేరు చెప్పదని ధీమాగా వున్న కాశీపతి కుదేలైపోయాడు. తేలుకుట్టిన దొంగలా అక్కడినుంచి మెల్లగా జారుకోబోయాడు.

అప్పుడు లేచింది ఆమె. సివంగిలా దూకి అతని కడుపుమీద బలంగా తన్నింది.

భార్య తన్నడంతో కాశీపతి సిగ్గుతో చచ్చిపో యాడు. ఏడ్వాలో, తిరిగి భార్యను కొట్టాలో, తను కాదని దబాయించాలో తెలియని అయోమయస్థితిలో అలాగే వుండిపోయాడు.

అప్పటికీ ఆమె ఆవేశం చల్లారలేదు. అతని చొక్కా ముందుభాగాన్ని ఒడిసి పట్టుకుని 'ఇప్పుడు తన్నింది మా చెల్లెల్ని చెరిచినందుకు కాదు. అదిగో ఏమీ తెలియని అమాయకుడిలా నటించావే- అందుకు



## కొత్త తడి అందాలు

కొత్త కుర్ర హీరోయిన్ సురభి 'అల్లరోడు'లో బాత్రూం స్నానాల సన్నివేశంలో, తడిసిన ఒంటి తళతళలు చూపిస్తోంది.

అభ్యంతరాల్లేని చొరవా, సొగసూ వున్నాక భవిష్య త్తుకి ఢోకా ఏముంది? గిలిగింతలుపెట్టే ఆ సరస శృంగార సన్నివేశాన్ని సురభి బాగా పండించిందట. 'అల్లరోడు' చిత్రం తర్వాత మరో గ్లామర్‌స్టార్‌గా మిలమిలలాడిపోతుందేమో!

## చికెన్ చాప్స్

**కావలసినవి :** చికెన్ (బోన్స్ లేకుండా) అరకేజీ, ఎగ్స్-2, నిమ్మకాయ-1, బ్రెడ్ స్లైసెస్-10, సెనగ పిండి-1 కప్పు, మసాలాపొడి-2 టీస్పూన్స్, మిరియాం పొడి-2 టీ స్పూన్స్, కారం-2 టీ స్పూన్స్, నూనె-సావుకిలో, సరిపడే ఉప్పు.



**చేసే విధానం :** ఒక వెడల్పు గిన్నెలో ఎగ్స్‌వేసి బాగా గిలకొట్టాలి. ఇందులో మిరియాలపొడి, కారం, మసాలాపొడి, నిమ్మరసం, ఉప్పు వేయాలి. బాగా కలపాలి. వేరే పాత్రలో బ్రెడ్‌ను మెత్తగా పొడిచేసి వేయాలి. సెనగపిండిని వేసి కలపాలి. (నీళ్లతో తడప కూడదు పొడిపొడిగా వుండాలి.) చికెన్ ముక్కల్ని ఒక్కొక్కటి తీసుకొని ఎగ్ పేస్టులో ముంచి, బ్రెడ్ పొడిలో పొర్లించి, ముక్కమీద పిండిని అదిమి నూనెలో వేయించాలి. ఈ వంటకం వెరైటీగా వుండి చాలా రుచిగా వుంటుంది.

—టి. సుజాత

నిన్ను తన్నింది. కడుపుచేసి మగవాడు అనిపించుకునే ముందు, కడుపులో కల్మషంలేకుండా ప్రవర్తించి మనిషని అనిపించుకో" అని నోట్లోని చెమ్మనంతా నాలుకమీదకు తెచ్చుకుని ఉమ్మింది"

సుజన మధ్యలో అడ్డుతగిలి "చాలా మంచి పని చేసింది" అంది.

"మగవాళ్లు ఎలా వుంటారో అన్నదాన్ని చెప్పడానికే ఈ సంఘటన గురించి వివరించాను. రాజేష్-వాడు నా భర్త. కాశీపతి వాడికంటే ఎన్నో రెట్లు మేలు. అంతా తొలినుంచీ, నా ఫస్ట్‌నైట్ వరకూ చెబుతాను" అంటూ తిరిగి ప్రారంభించింది వైదేహి.

"అమ్మానాన్నకు నేను ఒక్కదాన్నే సంతానం. నాకు పదేళ్లు వచ్చేటప్పటికి అమ్మ క్యాన్సర్‌తో చచ్చిపోయింది. నేనూ, నాన్నా మిగిలాం.

ఈ షాక్ నాకంటే మా నాన్నను ఎక్కువగా కుంగదీసింది. మేం ఒంటరివాళ్లం అయిపోయినట్లు భావించేవాడు. దాంతో చుట్టాంమీద మమకారం ఎక్కువైంది. మా అమ్మ చనిపోయిన తరువాత మా పెద్దమ్మవాళ్లింటికి మకాం మార్చేశాం.

ఆ ఇంట్లో మా పెద్దమ్మా, పెద్దనాన్నలతోపాటు, వాళ్ల కూతురూ, కొడుకూ వుండేవాళ్లు. ఎప్పుడో విడిపోయిన నాన్నా, పెదనాన్నా తిరిగి ఉమ్మడి కుటుంబంగా తయారయ్యారు.

మా పెదనాన్న కూతురిపేరు సువర్చల. ఇద్దరం దాదాపు ఒకే ఈడువాళ్లం. ఇద్దరం డిగ్రీ కంప్లీట్‌చేశాం. ఇక ఆగితే ఎంఏ చదువుతామని మేం యాగీ చేస్తే

## విజయోత్సాహం

గౌతమికి ఇప్పుడు అంతగా తమిళ చిత్రాల్లేవు. తెలుగులో 'అన్న' హిట్టయ్యింది. దీంతో తెలుగు చిత్రాల్లో మరిన్ని అవకాశాలొస్తాయని చూస్తోంది ఈ నాజూకు ఒయ్యారాల నవలామణి.

మన తెలుగు నటికి మన సినిమాల్లో అవకాశాలివ్వడం సమంజసమే. గౌతమిలో వున్న అద్భుత లావణ్యం, అనుపమ నటన తెలుగు సినిమాల్లో నయనానందం కలిగిస్తే అంతకన్నా కావల్సిందేమిటి? 'అన్న' విజయం గౌతమికి కొత్త బలాన్నిచ్చింది.



మని పెళ్లిసంబంధాలు చూడడం మొదలుపెట్టారు.

తర్జనభర్జనలు జరిగాక నన్ను మా మేనమామకు ఇవ్వాలని నిర్ణయించారు. మా అమ్మ చనిపోయినప్పట్నుంచీ మా ఇంటికీ, మా అమ్మ పుట్టింటికీ సంబంధాలు తెగిపోయాయి. నన్ను ఆ ఇంట్లో ఇచ్చి తిరిగి సంబంధాలు ఏర్పరుచుకోవాలని మా పెదనాన్న భావించాడు. అంతేకాకుండా నేను ఒక్కదాన్నే కాబట్టి ఆస్తి మరొకరికి పోకుండా అయినవాళ్లకే పోతే మంచిదని కూడా అందరూ అనుకున్నారు. మా మేనమామ రాజేష్ దగ్గరికి స్వయంగా పెదనాన్నే వెళ్లాడు.

ఎందుకనోగానీ ఈ సంబంధం నాకిష్టంలేకపోయింది. మా ఇద్దరిమధ్యా దాదాపు పదేళ్ల వయోభేదం వుండడంకూడా ఒక కారణమనుకుంటాను.

ఇదే విషయం చెబితే మా పెద్దమ్మ నామీద విరుచుకుపడింది. 'ఓసీ పిచ్చిమొహమా! పదేళ్లు అన్నది ఓ సమస్యేకాదు. మీ తాతకీ, మీ అవ్వకీ ఇరవై ఏళ్లు తేడా. ఇక నాకూ, మీ పెదనాన్నకూ పన్నెండేళ్లు తేడా. మేమంతా కాపురాలు చేయలేదూ, పిల్లల్ని కనలేదూ! అందువల్ల ఇలాంటి శంకలేం మనసులో పెట్టుకోకు. మీ ఆస్తి మరొకరు ఎందుకు తినడం? మీ మామే అయితే మన ఆస్తి మనవాళ్లే తిన్నారన్న తృప్తి మిగులుతుంది' అంది.

ఆస్తి పరాయివాళ్లకు పోకుండా ఈ సంబంధం చేస్తున్నారుగానీ నాకూ, అతనికీ ఈడూజోడూ కుదురుతుంది అనిగానీ, అతను మంచివాడు అనిగానీ ఆలోచించడంలేదు మావాళ్లు.

ఇదేదో ఆస్తులను కలిపే ప్రక్రియగా కనిపించిందే తప్ప పరిణయంలా అనిపించడంలేదు.

పెదనాన్న వచ్చిన పదిహేను రోజులకి రాజేష్ వచ్చాడు. ముప్పై, ముప్పైఅయిదుకి మధ్య వుంటుంది వయసు. బ్యాంక్‌లో క్లర్క్‌గా చేస్తున్నాడు. అతనూ ఒక్కడే కొడుకు కావడంతో ఇంటిదగ్గరే

వుంటున్నాడు. రోజూ బ్యాంక్‌కి వెళ్లి, వస్తుంటాడు.

ఎందుకనో అతన్ని చూడడంతోనే నాకు సదభిప్రాయం కలగలేదు. దాదాపు పదేళ్ల తరువాత మొదటిసారి చూడడంవల్లనుకుంటాను. పరాయివాడుగా అనిపించాడేగానీ మా అమ్మ తమ్ముడిలా ఆత్మీయంగా కనిపించలేదు.

ఆ తరువాత కూడా ఈ పెళ్లి చేసుకోవడానికి నసిగానుగానీ నా అభిప్రాయాల్ని ఎవరూ పట్టించుకోలేదు. పెళ్లి ఫిక్సయిపోయింది.

అమ్మావాళ్ళ కుటుంబంలో తిరిగి నా పెళ్ళితో లింకె పడుతుండడం మా నాన్నకు గొప్ప ఆనందాన్ని ఇచ్చింది. ఒంటరివాడినన్న ఫీలింగ్ ఆయనలో పోయింది. తనవాళ్ళు వున్నారన్న భరోసా కలిగింది.

నాకంటే నాన్న ఎక్కువ సంతోషించాడు.

పెళ్ళి జరిగిపోయింది.

సాయంకాలం సత్రంనుంచి ఇంటికొచ్చాం.

బాగా అలసిపోవడంవల్ల మంచంమీద వాలిపోయాను. నిద్ర పట్టేసింది.

అరగంట గడిచిందోలేదో పెద్దమ్మ వచ్చి లేపింది.

'ఇప్పుడు నిద్రేమిటే! లేచి స్నానం చెయ్' అంటూ పురమాయించింది.

'రాత్రికి ఎలానూ నిద్ర వుండదు పాపం. నిద్రపోనీ' పక్కింటి పిన్ని పరాచికాలాడింది.

ఆ మాటలు వింటుంటే నా యవ్వనం ఒక్కసారిగా మేల్కొన్నట్లయింది. తీయతీయగా ఒళ్లు సలపడం ప్రారంభించింది. చుక్కలలోకం నా కళ్ల ముందు వేలాడుతున్నట్లుంది. పూలతోటని కొప్పులో ముడిచినట్లనిపించింది. నీలం సముద్రాంతో నా వక్షస్థలాన్ని కప్పుకున్నట్లు తోచింది.

అగ్నిపర్వతాన్ని మంత్రంచేత చల్లబరిచి బొడ్లో దోపుకున్నట్లు తోచింది.

పెళ్లయ్యేవరకు నేను ఎప్పుడూ సెక్స్‌ను గురించి ఆలోచించలేదు. చదువుతప్ప మరో ధ్యాసలేకుండా గడిపాను. ఎప్పుడైనా బాధ కలిగినప్పుడో, సంతోషం వేసినప్పుడో అమ్మ గుర్తొచ్చేది. అంతేతప్ప మగతోడు కావాలనిపించలేదు.

కానీ ఇప్పుడు పరిస్థితి వేరుగా వుంది. అతను తన పంచెకు, నా చీరకొంగుకు ముడేస్తున్నప్పుడు మన్మథుడు బాణాలన్నిటినీ నా మీదకు ఎక్కుపెట్టాడు. తలమీద చేయి ఆనించి, మంత్రాలు చదువుతున్నప్పుడు జయంతుడు కసిగా దోసెడు పారిజాతాలను నా ముఖంమీదకు విసిరాడు. తలంబ్రాలు పోస్తూ ఆయన చేతులు నా భుజాలకు రాసుకున్నప్పుడు నలకూబరుడు నన్ను అమాంతం చల్లటి నదిలోకి తోశాడు. హోమంచుట్టూ తిరగడానికి ఆయన నా చిటికెనవేలు పట్టుకున్నప్పుడు చంద్రుడు వెన్నెలంతటినీ నా తలమీదకు కుమ్మరించాడు.

నిజం చెప్పద్దూ! పెళ్లిపీటలమీదనుంచే ఏదో కావాలన్న ఆరాటం మొదలైంది నాలో.

ఇదీ అని చెప్పలేని ఆ స్థితిని నా శరీరమే చెప్పగలదు. మరో శరీరానికే అర్థం కాగలదు.



**విలన్ హీరో**

విలన్ చరణ్‌రాజ్‌కి హీరోపాత్రలమీద మోజుంది. "గతంలో హీరోగా చేశాను. సక్సెస్ సాధించాను. ఇప్పుడు కూడా అవకాశాలొస్తే చేస్తాను. కానీ హీరో పాత్రలే చేస్తాననను" అంటున్నాడు.

ఇప్పటికి ఎనిమిది భాషల చిత్రాల్లో నటించానని సగర్వంగా చెప్తున్న చరణ్‌రాజ్, దక్షిణాది భాషలన్నిటితో పాటూ హిందీ, బెంగాలీల్లో నటించాడు. "నేను మాస్ ఆర్టిస్టుని. కన్నడంలో హీరోగా ఎన్నో డాన్సులు కూడా చేశాను" అని తన హీరోయిజాన్ని గురించి గొప్పగా వివరిస్తున్నాడు.

పడకమీదనుంచి లేచాను. సువర్ణం నన్ను తీసుకుని దొడ్లోకెళ్ళింది. ఆమెకి ఇటీవలే పెళ్లయిపోయింది. మా అక్కతోపాటు అత్తమ్మ వరసయ్యే వసంత కూడా వచ్చింది.

నా తలకు షాంపూ రాస్తూ వసంత శోభనం రాత్రి ఎలా ప్రవర్తించాలో ఏకరువు పెట్టింది.

'ఆయన ఏం చేస్తున్నా అబ్జెక్షన్ చెప్పకు. సిగ్గుతో మెలికలు తిరిగిపోకు. మరీ ఎక్కువ సిగ్గు నటిస్తే రసవాహిని కాస్త రసాభాసవుతుంది. అన్నీ ఆయనకే వదిలిపెట్టెయ్యకు. నువ్వూ సహకరించు.

ఒక్క మాటలో చెప్పాలంటే నోరుతప్ప మిగిలిన అవయవాలన్నీ పనిచేయాలి' అని చెప్పింది ముసిముసి నవ్వులమధ్య.

షాంపూవల్ల కళ్ళు మూసుకున్నానుగానీ మాటల్ని కలుపుతున్న నవ్వుని గమనిస్తూనే వున్నాను.

నేను పాటించాల్సిన మిగిలిన జాగ్రత్తలేమిటో కూడా వసంతత్త వచ్చిరాగా మరీ విడమరిచి చెప్పింది.

నేను విననట్టు తల వంచుకుని వుండిపోయాను.

తెల్లటిచీర, జాకెట్టు కట్టుకున్నాను. పెటీకోట్, బ్రాకూడా తెల్లటివే వేసుకున్నాను.

ఎనిమిదిగంటలకు లైట్‌గా భోజనం చేశాను. బయట పిండారబోసినట్లు వెన్నెల. మా కోసం లోకమంతా తెల్లటి బెడ్‌షీట్ కప్పినట్లుంది.

ముందుండే రూమ్‌లో శోభనం ఏర్పాటు చేస్తున్నట్లు అనిపించింది అక్కడ హడావుడి చూస్తే.

వెన్నెల ఇంత అద్భుతంగా వుంటే రూమ్‌లో- ఆ ఉక్కలో శోభనం ఏమిటో నాకు అర్థంకాలేదు. నా మనసంతా డాబామీదుంది. వసంతత్తని పిలిచాను. 'ఆ రూమ్‌లో వద్దు- డాబా మీద వెన్నెల' అన్నాను ఒక్కోమాటను సిగ్గు చట్రంలో బిగిస్తూ.

ఆమె నవ్వుకుంటూ వెళ్ళిపోయింది.

మరో అయిదు నిమిషాలకు పరుపూ, దిండ్లూ డాబా ఎక్కడం చూశాను.

వెన్నెల్లో పడుకోవడం అంత ఇష్టం నాకు.

తొమ్మిది గంటలకి భోజనాలు ముగిశాయి. మరో గంటపాటు ఒట్టి హడావుడితోనే గడిచిపోయింది.

పదిగంటల ప్రాంతాన పాలగ్లాసుతో నన్ను మెట్ల దగ్గర వదిలిపెట్టింది వసంతత్త.

'శోభనంలో చిటికెడు సిగ్గేస్తేనే అందం. అలాగని సంచీడు సిగ్గు కుమ్మరించావనుకో పాకం చెడుతుంది' అంది చివరి హెచ్చరిక చేస్తూ.

నేను ఆ మాటలకు మరింత సిగ్గుపడి తల పూర్తిగా వంచేసుకుని మెట్లెక్కడం ప్రారంభించాను.

ఆ మెట్లు సరాసరి స్వర్గానికి వేసినట్లు అనిపించడం నాకేం కావాలో తెలియజేస్తోంది.

డాబామీదకు చేరుకున్నాను.

వెన్నెల నా చుట్టూ పరుచుకున్నట్లయింది. సిగ్గు బరువుకు మూసుకుపోతున్న కనురెప్పలను బలవంతంగా పైకి లేపాను.

ఓ మూలగా పరుపు- దానిమీద రాజేష్ కనిపించారు.

ఇందుకే కాబోలు మొదటి సమాగమాన్ని అంత అద్భుతంగా వర్ణించారు కవులు అనుకుంటూ అక్కడే ఆగిపోయాను.

'వెన్నెల్లో శోభనం అరేంజ్ చేయమన్నదాని- అంత సిగ్గుపడడం విచిత్రంగా వుందే'

ఆయనకి ఆ విషయం తెలిసిపోవడం సిగ్గు మరింత ఎక్కువయ్యే ఇబ్బంది. అందుకే మరింత తత్తరపాటుకి గురయ్యాను. ఎలా తెలిసిందబ్బా!

'రా'

మెల్లగా అడుగులో అడుగు వేసుకుంటూ వెళ్లాను.

'కూర్చో'

నేను అలాగే నిలబడ్డాను.

అతను సగం లేచి నా చేయి అందుకుని కిందకు గుంజాడు. పాలగ్లాసు పడిపోకుండా బ్యాలెన్స్ చేసుకోవడం కష్టమైపోయింది. కొద్దిగా పాలు కిందకు చిందాయి. సర్దుకుని కూర్చున్నాను.

పాలసముద్రంలో లక్ష్మీకూడా అంత హొయలుగా కూర్చుని వుండదు. అంత వయ్యారంగా, స్త్రీత్వం నాకు చిన్నప్పట్నుంచీ నేర్పించిన హొయలంతా ఒలకబోశాను.

'మరదలుపిల్లంటే ఏమిటో అనుకున్నాను. గుత్తి వంకాయలా ఊరిస్తోంది'

ఎందుకనో ఆ ఉపమానం నాకు నచ్చలేదు.

పాలగ్లాసు అందించాను.

అతను నాలుగు సిప్పులు తాగి, నాకిచ్చాడు.

మొదటిసారి ఎంగిలి తాగడం, తమాషా ఏమిటంటే ఇబ్బందిగా అనిపించలేదు.

నేను కొద్దిగా తాగి పక్కన పెట్టాను.

అవి పాలో, అమృతమో నేను ఖచ్చితంగా చెప్పలేకపోయాను.

**(ఇంకావుంది)**


తన ప్రియుడ్ని
ఏ ప్రమాదాలు కబళించాయో?
ఏ వ్యూహాలు బంధించాయో?
ఏ దూరాలకి వెళ్ళాడో?
ఏ తీరాలకి చేరాడో?
వెతికేందుకు వెంటవచ్చేవారు లేరు!
సాయపడేందుకు చెంతకొచ్చేవారు లేరు!
అయినా-
ఆమె అన్వేషణ ఆగలేదు!
ప్రేమించే హృదయానికి పిరికితనం వుండదు!
సహాయాలు లేకున్నా సాహసమే తోడుగా
ప్రియునికోసం ప్రియురాలి
అడ్వెంచరస్ ప్రయాణం
ఆకునూరి హాసన్
సీరియల్
అతడికోసం
వచ్చేసంచికలోనే ప్రారంభం

# ప్రియాంకా గాంధీ యూత్ కాంగ్రెస్ అధ్యక్షురాలు కానున్నదా?

న్యూస్ లెటర్
ఎస్. వెంకట నారాయణ



మాజీప్రధాని రాజీవ్‌గాంధీ, ఇటలీలో జన్మించిన ఆయన సతీమణి సోనియాల తనయ, అందాలరాశి ప్రియాంకాగాంధీని యూత్ కాంగ్రెస్ తదుపరి అధ్యక్షురాలిగా చేయాలని భారత పాలకపక్షమైన కాంగ్రెస్ పార్టీ యువత విభాగం, యూత్ కాంగ్రెస్‌లోని పలువర్గాలు విశ్వప్రయత్నాలు చేస్తున్నాయి.

చాలామంది కాంగ్రెస్ వాదులుకూడా ఆ అభిప్రాయాన్నే వ్యక్తంచేశారు.

వారిలో కొందరు: మాజీ యూత్ కాంగ్రెస్ అధ్యక్షుడు రమేష్ చెన్నితల; హర్యానా ముఖ్యమంత్రి భజన్‌లాల్ ఆశ్రితుడు, రాష్ట్ర కాంగ్రెస్ ప్రజాప్రతినిధి అయిన సుభాష్ చౌదురి; మానవ వనరుల అభివృద్ధి మంత్రి అర్జున్‌సింగ్ సహచరుడు హరున్ యూసుఫ్.

ప్రధానమంత్రి పి.వి. నరసింహారావు మంత్రి మండలిలో క్రీడలు, యువత వ్యవహారాల సహాయమంత్రి అయిన ముకుల్‌వాస్నిక్ 22 ఏళ్ళ ప్రియాంకాగాంధీ అంతర్యం గ్రహించే ఉద్దేశంతో, జూన్ 6వ తేదీన ఆమెను కలుసుకుని ఆ విషయం ప్రస్తావించినట్టు వినికిడి.

ఎలాంటి హామీకి ప్రియాంకాగాంధీ ఖచ్చితంగా బద్ధురాలు అయిన సూచన లేవీ గోచరించడంలేదు. వాస్నిక్‌తో ముక్తసరిగా ఆమె అన్నమాటలు: "నేను రాజకీయాల్లో చేరదలచినట్లయితే, మీకు కబురు పెడ్తాను."

1947లో ప్రథమ ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ స్థాపించిన రాజకీయ వంశానికి చెందిన మూడుతరాలకు 'సేవలు' అందించడంద్వారా వర్ధిల్లిన కాంగ్రెస్ వాదులకు ఆ అనిశ్చిత వ్యాఖ్యే పరమానందం కలిగించింది. ప్రియాంకాగాంధీ ఇచ్చిన ఆ మార్మిక సమాధానం కాంగ్రెస్ పార్టీ వర్గాల్లో కార్చిచ్చులా వ్యాపించింది. కాంగ్రెస్ ఉన్నత వ్యవస్థలో ఆ ముగ్ధ యువతి ఏ స్థాయిలో స్థానం స్వీకరించాలో అన్న విషయమై కాంగ్రెస్‌వాదులప్పుడే తీవ్రంగా చర్చిస్తున్నట్టు తెలుస్తోంది.



"నేను రాజకీయాల్లో చేరదలచినట్లయితే, మీకు కబురు పెడ్తాను." ప్రియాంకాగాంధీ ఇచ్చిన ఈ మార్మిక సమాధానం కాంగ్రెస్ పార్టీ వర్గాల్లో కార్చిచ్చులా వ్యాపించింది. కాంగ్రెస్ ఉన్నత వ్యవస్థలో ఆ ముగ్ధయువతి ఏ స్థాయిలో స్థానం స్వీకరించాలో అన్న విషయమై కాంగ్రెస్‌వాదులప్పుడే తీవ్రంగా చర్చిస్తున్నట్టు తెలుస్తోంది. దివంగతుడైన ఆమె తండ్రి నియోజకవర్గమైన ఉత్తరప్రదేశ్‌లోని అమేథీనుంచి ఎన్నికల్లో గెలిచి ఆమె పార్లమెంట్‌లోకి ప్రవేశిస్తుందని మరికొందరి ఆశ.

తన పేరు ప్రకటించడం ఇష్టంలేని ఒక కాంగ్రెస్ ఎం.పి. ఒక వార్తాపత్రికకిలా చెప్పాడు: "ఆమె తండ్రిలాగే ప్రియాంక కూడా అఖిలభారత కాంగ్రెస్ కమిటీ(ఏ.ఐ.సి.సి.) ప్రధాన కార్యదర్శికన్నా తక్కువ పదవి స్వీకరించకూడదు" దివంగతుడైన ఆమె తండ్రి నియోజకవర్గమైన ఉత్తర ప్రదేశ్‌లోని అమేథీ నుంచి ఎన్నికల్లో గెలిచి ఆమె పార్లమెంట్‌లోకి ప్రవేశిస్తుందని మరికొందరి ఆశ.

ప్రియాంకాగాంధీ తండ్రి రాజీవ్‌గాంధీ, ఆమె నానమ్మ ఇందిరాగాంధీ, ఆమె ముత్తాత జవహర్‌లాల్ నెహ్రూ అందరూ కలిసి భారతదేశాన్ని 37 ఏళ్ళపాటు పాలించారు. 1964లో నెహ్రూ సహజమరణం చెందగా, 1984 అక్టోబర్ 31న శ్రీమతి గాంధీ తన

సిక్కు భద్రతా సంరక్షకులు ఇద్దరి చేతుల్లో కాల్పులకు గురై మరణించింది.

ఆమె తర్వాత ప్రధానిఅయిన రాజీవ్‌గాంధీ, 1991 మే 21 రాత్రి, మద్రాసుకు సమీపాన వున్న శ్రీ పెరుంబుదూర్‌లో జరిగిన ఎన్నికల సభలో, శ్రీలంక మహిళా 'సూయిసైడ్ బాంబర్' చేత హత్యగావించబడ్డాడు.

రాజీవ్‌గాంధీ మరణానంతరం వితంతువైన ఆయన సతీమణి సోనియాను తమ పార్టీకి అధ్యక్షత వహించమని కృతజ్ఞతాభరితమైన కాంగ్రెస్ పార్టీ ఆహ్వానించింది. కానీ ఆ ఆహ్వానాన్ని ఆమె మర్యాదపూర్వకంగా తిరస్కరించడంతో, పార్టీ అధ్యక్ష పదవిచేపట్టేందుకు నరసింహారావుగారికి మార్గం సుగమమైంది. 1991 నాటి సార్వత్రిక ఎన్నికల్లో కాంగ్రెస్ పార్టీ ఏకైక పెద్ద పార్టీగా అవతరించడంతో, రావుగారు ప్రధాని పదవిని కూడా చేపట్టారు.

1991 అక్టోబర్‌లో, సోనియా గాంధీని ఆమె భర్త పార్లమెంటరీ నియోజకవర్గం అమేథి నుంచి పోటీ చేయమని పార్టీ అభ్యర్థించింది. మరోసారి ఆ సూచనని ఆమె తిరస్కరించింది. ఆమె రాజకీయాలను ఏవగించుకుంటుంది. తన భర్త రాజకీయాల్లోకి దిగడాన్ని ఆమె గట్టిగా వ్యతిరేకించిందనేది జగమెరిగిన సత్యం.

హతురాలైన తన తల్లి స్థానంలో ఆయన ప్రధాని కావడాన్ని నిరోధించాలని ఆమె ప్రయత్నించింది, దీనంగా రోదించింది. ఆయన ప్రాణానికి ముప్పు వాటిల్లవచ్చనే భీతే అందుక్కారణం.

అయితే ఆమెది అరణ్యరోదనమైంది. కానీ, తదుపరి సంఘటనలు ఆమె భయాలెంత వాస్తవమైనవో నిరూపించాయి.

జూన్ 10వ తేదీన ఢిల్లీలో జరిగిన ఏ.ఐ.సి.సి. సమావేశానికి నరసింహారావుగారి వ్యక్తిగత ఆహ్వానాన్ని పురస్కరించుకుని ఆమె హాజరయినప్పుడు కాంగ్రెస్ వాదులు గంగవెర్రులెత్తి పోయారు. రావుగారు, ఇతర నాయకులతోబాటు వేదికమీద ఆమెను ఆసీనురాలిని చేయవలసిందని కొందరు పట్టుబట్టారుకూడా.

కానీ, ప్రముఖ కాంగ్రెస్ మహిళల సరసన కూర్చున్న స్థానంలో తనకు సౌకర్యంగానే వుందని చెబుతూ, వేదికమీదకు వెళ్ళేందుకు ఆమె నిరాకరించింది. ఇక వార్తాపత్రికలైతే దారుణంగా వెర్రి ఆవేశంతో వూగిపోయాయి. మరుసటిరోజు తమ మొదటి పుటల్లో ఏ.ఐ.సి.సి.కి హాజరైన ఆమె ఛాయాచిత్రాల్ని విస్తృతంగా ప్రచురించాయి. దాంతోబాటు ఆమె రాజకీయాల్లో ప్రవేశిస్తుందా లేదా అన్న విషయమై ఊహాగానాలతో నిండిన రిపోర్టులనూ ప్రచురించాయి.

1989లో కాంగ్రెస్‌ను త్యజించిన రెండు ప్రధాన ఉత్తరాది రాష్ట్రాలైన ఉత్తరప్రదేశ్, బీహార్‌లకు చెందిన కాంగ్రెస్‌వాదులైతే శ్రీమతి సోనియాగాంధీ రాజకీయాల్లో ప్రవేశించి, 1996లో జరుగనున్న ఎన్నికల్లో తమ పార్టీని గెలిపించగలదని తీవ్రంగా ఆశిస్తున్నారు.

ఉత్తరప్రదేశ్‌కు చెందిన ఒక సీనియర్ పార్టీ నాయకుడి ఆశాభావం : "సోనియాగాంధీ పార్టీ అధ్యక్ష పదవిని చేపట్టాలని నిర్ణయించుకునే అవకాశాన్ని కొట్టిపారేయలేము. ఆమె అలా తలచుకుంటే, ఆమెనెవరూ ఆపలేరు. ఆ విధంగా జరిగిన పక్షాన పాకిస్తాన్‌లో జరిగిన వ్యవహారం ఇక్కడ పునరావృతం కావచ్చు. అంటే, అక్కడ శ్రీమతి నస్రత్‌భుట్టో పాకిస్తాన్ పీపుల్ పార్టీ(పి.పి.పి.)కి అధ్యక్షురాలైతే, ఆమె కుమార్తె శ్రీమతి బేనజీర్‌భుట్టో ఆ దేశపు ప్రధాని అయింది గదా!" కానీ పలువురు పరిశీలకులు ఈ 'అయితే గియితే' మాటల్ని ఊహాగానంగానే పరిగణిస్తున్నారు.

ప్రియాంక అన్న రాహుల్‌గాంధీకి కూడా రాజకీయాలపట్ల ఆసక్తి లేదు.

నాలుగు దశాబ్దాలపాటు నెహ్రూవంశీయుల ఎన్నికల్లో గెలిచే ఆకర్షణశక్తి ఆసరాతో వర్ధిల్లిన కాంగ్రెస్ వాదులు ప్రియాంకను బరిలోకి లాగడానికి ఇంతకుపూర్వం ఒకసారి ప్రయత్నించారు. రెండేళ్ళ క్రితం పట్టపగ్గాల్లేని ఉత్సాహంతో నిండిన పార్టీవాదులు ఒక అడుగు ముందుకువేసి ఆమెను ఆగ్రానుంచి ఉత్తర ప్రదేశ్ కాంగ్రెస్ కమిటీ (యు.పి.సి.సి.)కి ఏకగ్రీవంగా ఎన్నుకున్నారు. ఈ చర్య శ్రీమతి సోనియాని అమితంగా చికాకుపరిచింది. ప్రియాంక ఇంకా కాలేజీలో చదువు సాగిస్తోందనీ, ఆమెకి ఎలాంటి రాజకీయ ఆశలు, ఆశయాలు లేవనీ సోనియా వారికి స్పష్టంగా చెప్పింది. ఏమైనా అది అదను కాదని తెలియజేసినట్టే.



అయినా, ప్రియాంకకు రాజకీయాలపట్ల మనసుందని పలు భారతీయుల నమ్మిక. ఆమె హుందాతనం, నిశ్చలమనస్తత్వం ఆమె నానమ్మ ఇందిరాగాంధీని గుర్తుకు తెస్తాయంటారు వారు.

అయితే సిక్కు తీవ్రవాదుల 'హిట్‌లిస్ట్'లో ఆ కుటుంబం నమోదైవుంది. తమ ఆలయాల్లో అత్యంత పవిత్రమైనదిగా వారు భావించే స్వర్ణాలయం మీద దాడి చేయవలసిందిగా భారత సైన్యాన్ని 1984 జూన్‌లో ఇందిరాగాంధీ ఆదేశించి, తద్వారా తమకు చేసిన తీవ్ర 'అవమానానికి' ప్రతీకార చర్యగా, శ్రీమతి ఇందిరాగాంధీ కుటుంబమంతటినీ తుడిచిపెట్టగలమని సిక్కు తీవ్రవాదులు హెచ్చరించారు.

దేశంలో ఎవ్వరికీ లేనంత కట్టుదిట్టంగా ఆ కుటుంబానికి భద్రత ఏర్పాటుచేయబడింది. సోనియా గాంధీ, రాహుల్, ప్రియాంకలకు 24 గంటలూ 'బ్లాక్ క్యాట్స్'గా పిలువబడే 'స్పెషల్ ప్రొటెక్షన్ గ్రూప్' (యస్.పి.జి.- ప్రత్యేక రక్షణ బృందం) సభ్యులు రక్షణనిస్తుంటారు. ఇందిరాగాంధీ హత్యానంతరం, ప్రధానిగా ఆమె వారసుడైన రాజీవ్‌గాంధీ ప్రత్యేకరక్షణ నిమిత్తమే 'ఎస్.పి.జి.' 1985లో ఏర్పాటు చేయబడింది.

1989 సార్వత్రిక ఎన్నికల్లో రాజీవ్ ఓడిపోయి, ప్రధాని పదవి కోల్పోయాక ఆయనకు 'ఎస్.పి. జి.' రక్షణ ఉపసంహరించబడింది. దాంతో పెద్ద ఎత్తున వివాదం చెలరేగింది. కట్టుదిట్టమైన భద్రత లేమివల్లనే ఆయన ఒక హంతకురాలి చేతుల్లో తన ప్రాణాలు పోగొట్టుకున్నాడని పలువురు కాంగ్రెస్‌వాదులు నమ్ముతున్నారు. ఆ తర్వాత, మాజీ ప్రధానులు, వారి కుటుంబసభ్యులకుకూడా 'ఎస్.పి.జి.' భద్రత కల్పించేటట్టు చట్టాన్ని మార్చడం జరిగింది.

# కాముని పున్నమి

## ఆరవేటి శ్రీనివాసులు

కాముని పున్నమి వచ్చిందంటే చాలు కన్నెలం వాగుకోనలో వెంగళరెడ్డిగారి బంగళా సముద్రాడిన పిల్లలా వెన్నెట్లో స్నానం చేస్తూ ఆ రేయి ఎంత మురిసిపోతుందో మాటల్లో చెప్పలేం.

బొంబాయి నుండి ముఖర్జీ. ఢిల్లీ నుండి రాజాజగన్నాథ్. మద్రాసు నుండి డాక్టర్ మురారి ఎన్ని పనులున్నా మానుకొని ఆ రోజు నల్లమల కొండల్లోని కన్నెలవాగుకోన అటవీబంగళాలో వెంగళరెడ్డిని కలిసి వేడుకలు జరుపుకొని తీరాల్సిందే. ఆ బంగళా బ్రిటిష్ వారినుండి రెడ్డిగారి తండ్రి కొన్నారు. ఈ వేడుకలు ఈనాటివి కావు. ఇరవై అయిదు సంవత్సరాలుగా అవిఘ్నంగా సాగుతున్న సంబరం అది.

వెంగళరెడ్డితోసహా తక్కిన ముగ్గురూ కూడా నాలుగు పదులు దాటి లేలేత ముదిమిలో అడుగు పెడుతున్నవారే. కలిసి చదువుకున్ననాటి స్నేహం కాలంతోపాటే కలిసివస్తూ సంవత్సరానికి ఒకసారి దేశంలో ఏ మూలవున్నా కాముని పున్నానికి అనివర్సరీ చేసుకొంటుంది ఆ అడవిలో.

ఇంకా సాయంకాలం కాలేదు. జాజిపందిరికింద బంగళాకి కొంచెం ఎడంగా రాజాజగన్నాథ్, మురారి, ముఖర్జీ, వెంగళరెడ్డి చాలా సీరియస్‌గా పేకముక్కల్లో పడిపోయారు. వెంగళరెడ్డికి పేకలు సరిగ్గా పడడం లేదేమో విసుగొచ్చింది."నేను ఆడనయ్యా" అని లేచాడు వెంగళరెడ్డి.

"అదేం కుదరదు...డబ్బులు కట్టి మరీ వెళ్ళు" రాజాజగన్నాథ్ అన్నాడు.

"చిత్తం! రాజాగారి ఆజ్ఞ కాదనగలమా?" వెంగళరెడ్డి నవ్వుతూ రెండు వంద రూపాయల కాగితాలు రెపరెపలాడేవి అక్కడ విసిరేసి బంగళాలోకి వంటగది వైపు నడిచాడు.

"మస్తాన్!" రెడ్డి పిలిచాడు వంటగదిలోంచి వస్తున్న మసాలా ఘుమఘుమలు పీలుస్తూ.

"దొరా!" మస్తాన్ వచ్చాడు.

"ఐటమ్స్ అన్నీ రెడీ అయ్యాయా?"

"అయ్యాయి దొరా!"

ఇంతలో ఓ పెద్ద కారు వచ్చి బంగళా ముందు ఆగేసరికి మిత్రులంతా ఆ వైపు చూశారు.

మోహిని కారులోంచి కాలు కిందమోపింది.ఆమె అందం చూసి కళ్ళు చెదిరాయి అందరికీ.

వెంగళరెడ్డికి చిరుమందహాసంతో చేతులు ముకుళించి నమస్కరించింది.

"నమస్తే...రండి...ప్రయాణం కులాసాగా జరిగింది కదా" అన్నాడు వెంగళరెడ్డి.

"మీ దయవల్ల" అంది ఆమె.వెంటవచ్చిన వాయిద్య బృందం కారుదిగి రెడ్డికి నమస్కరించి పనిమనుషుల వెంట బంగళాలోకి వెళ్ళారు.

"రండి. మా మిత్రుల్ని పరిచయం చేస్తాను"

"వీడు రాజా జగన్నాథ్...భారతదేశాన్ని ఏలే ప్రయత్నంలో వున్నాడు" అన్నాడు రెడ్డి.

"నమస్తే" అన్నాడు రాజాజగన్నాథ్.

"వీడు మురారి...డాక్టర్. ఆడను మగగా, మగను ఆడగా చేయగల దిట్ట" అన్నాడు రెడ్డి.

అంతా గంగంమని నవ్వారు.

"వీడు ముఖర్జీ. పురాతత్వ శాస్త్రజ్ఞుడు. రాళ్ళు రప్పలు, కోటలు కందకాలు వీడి రాజ్యాలు" అన్నాడు వెంగళరెడ్డి.

"అవును రెడ్డిగారూ! ముఖర్జీగారిని గురించి చెబుతుంటే జ్ఞాపకం వచ్చింది. ఆ మధ్య మీరు మద్రాసుకు వచ్చినప్పుడు ఒక అపురూపమైన నర్తకి శిల్పం కలెక్ట్ చేశామని అన్నారు" అంది మోహిని.

"ఓహ్! సారీ! ఆ విషయం మరచేపోయాను. మా మిత్రులకు కూడా చూపలేదు. పదండి... ఈ కోనలో బంగళా తోటలోనే దేవగన్నేరు చెట్టుదగ్గర వుంచాను

"మోహినిగారూ! ఈ రాత్రి మీ నృత్యం ఈ శిల్పం కాస్ట్యూమ్స్‌తో ఇవ్వాలిసుమా!"

"మీ అభిరుచికి జోహార్ రాజాగారూ! అయినా ఈ శిల్పంలోని కాస్ట్యూమ్ మాదిరేకాకున్నా దాదాపు ఇదే అలంకరణతో నా నృత్యం మిమ్మల్ని సంతృప్తి పరచగలదనే నా విశ్వాసం" మోహినీ కళ్ళలోని చెప్పలేని విశ్వాసం ప్లస్ చిలిపితనం రాజా జగన్నాథ్‌ని క్షణకాలం ఆలోచనల్లో పడవేశాయి.

సాయంకాలం కొద్దిగా గడచింది. లోయలో నెమ్మదిగా చీకట్లు ముసురుకుంటున్నాయి.

బంగళాలో దీపాలు వెలిగించారు.

బంగళా ముందరి తోటలో తీర్చిదిద్దిన అలంకరణతో దేశవిదేశీమద్యాల సీసాలు ఆ ప్రక్కనే అమరికగా తిండిపదార్థాలు ఏర్పాటుచేశారు.

"ఇక ఆలస్యమెందుకు? రంగం సిద్ధమయింది. కానిద్దాం" అన్నాడు రాజాజగన్నాథ్.

"ప్రారంభించండి" అన్నాడు రెడ్డి.

"మిస్ మోహిని ప్రారంభిస్తుంది. ఏమంటారు మోహిని గారూ" అడిగాడు రాజాజగన్నాథ్.

మోహిని నవ్వింది.

"నాకేం అభ్యంతరం లేదు.కానీ నాట్యంలో అడుగు తడబడితే తప్పు నాది కాదు"నవ్వుతూ అంది మోహిని.

"మరేం ఫర్వాలేదు. మృదంగిస్టుకి నాలుగు రౌండ్లు ఇచ్చామంటే తాళం దానంతట అదే సర్దుకొంటుంది"

దాన్ని. ఒరేయ్! ముఖర్జీ నువ్వు దాన్ని తప్పక చూడాలి" అన్నాడు రెడ్డి.

అంతా నడిచారు. దేవగన్నేరు పూలు రాలి ఆ ప్రదేశం తివాచీపరచినట్లుంది. వాటి మధ్యన నృత్య భంగిమలో అపురూపశిల్పం. కన్నుచెదరే సౌందర్యంతో, ఒళ్ళు పులకరించే సోయగంతో మనిషి కదలివచ్చి అక్కడ ఆ భంగిమలో నిలిచిందా అన్నట్లుంది ఆ నర్తకి శిల్పం.

అంతా ఆ శిల్పాన్ని చూసి తాకి అద్భుతమన్నారు.

"రెడ్డీ! ఈ శిల్పం దాదాపు ఏడువందల సంవత్సరాలకాలం నాటిది అయివుండవచ్చు. ఎలా కొట్టేశావు దీన్ని?" అడిగాడు ముఖర్జీ.

"ఎద్దుల కనుమగుహల్లో చూసి పశువుల పిల్లలు చెప్పారు. మనం జాతీయం చేసుకున్నాము" అన్నాడు వెంగళరెడ్డి.

"నీ ఫ్రెండును కాబట్టి నేనేమీ చేయలేకపోతున్నాను. ఇంకెవరికీ చెప్పకు. గవర్నమెంటుకి తెలిస్తే దీన్ని ఇక్కడ వుంచరు. పైగా దీని విలువ లక్షల్లో వుంటుంది" అన్నాడు ముఖర్జీ.

"అట్నే నీక్కాబట్టి నిజం చెప్పాను. ఎవరైనా అడిగితే దీని శిల్పిని నేనే అననూ?" అన్నాడు రెడ్డి.

అంతా నవ్వారు.

రాజాజగన్నాథ్ మోహినితో అన్నాడు.

అన్నాడు మురారి. అంతా నవ్వుకున్నారు.

పార్టీ ప్రారంభమయింది.

రెండు మూడు రౌండ్లు ముగిశాయి.

"మోహిని గారూ! మీరు బాగా వెనుకబడ్డారు. మరో రౌండు" అన్నాడు రాజాజగన్నాథ్.

"ఇంక చాలు బాబూ! ఇదే నాకు టూమచ్...కంపెనీ ఇవ్వాలనుకున్నా...ఇచ్చా...ఇక నేను వెళ్ళి నాట్యానికి సిద్ధమయివస్తా" అంది మోహిని మత్తుగా.

"ష్యూర్! కానీ మోహినీ...గారూ...మనం చూసిన షిల్పం ఎలా వుందో అలా మీరు..." రాజాజగన్నాథ్ మత్తుతో మాట్లాడలేకపోయాడు.

"అవును...అవును..." మురారి అన్నాడు.

చిలిపిగా నవ్వింది మోహిని. కన్నెలవాగు వెన్నెలవాగయింది. పండువెన్నెట్లో ఆమె పలువరస ముక్కుకున్న అమెరికన్ డైమండ్ బేసరీని వెక్కిరించింది. మత్తుగా తన్ను తాను మరచి పైటచెరగుజారిన సంగతి కూడా గమనించక అలాగే బంగళాలోకి నడిచి వెళ్ళింది మోహిని.

"వెంగళ్!మోహిని అందం ఎంతో గొప్పదిసుమా!" అన్నాడు రాజాజగన్నాథ్.

"ఇప్పుడా తెలుసుకున్నావ్?" అన్నాడు రెడ్డి.

"సరే...మరో రౌండు...చికెన్ బ్రహ్మాండం" అన్నాడు మురారి.

సమయం గడచింది. దూరంగా అడవిపొదల నుండి రాత్రిపక్షులు విచిత్రమైన ధ్వనులు చేస్తున్నాయి. మందు బాగా దట్టించిన దొరలు దాదాపు ఈ లోకాన్నే మరిచే స్థితిలో జంత్రగాత్ర సమ్మేళనంతో మోహినీనాట్యం ప్రారంభమయింది.

కూచిపూడి, భరతనాట్యం, కథక్ ఒకటేమిటి? అన్నీ కలబోసిన కదంబం అది. మోహినీనాట్యానికి పరవశుడయి రాజా జగన్నాథ్ తన మెడలోని వజ్రాలహారం మోహిని మెడలో స్వయంగా గౌరవంగా అలంకరించాడు. అంతా చప్పట్లు చరిచారు. అలసిపోయిన మోహిని అందరికి నమస్కరించి బంగళాలోకి వెళ్ళింది

"ఇంస్ట్రుమెంట్స్ ప్లేయర్స్! మీ కోసం బంగళాలో కోరిన మందు వుంది. తీసుకోండి... విందుకూడా" అన్నాడు రెడ్డి.

బంగళా ముందు వెన్నెట్లో నలుగురు మిత్రులు మందుకొడుతూ అలాగే వుండిపోయారు. అర్ధరాత్రయింది. అంతా తాగి ఊగుతున్న స్థితి అది.

"ఎంగ్రలెడ్డీ! నాకు...మోహిని ఖావాలి" అన్నాడు రాజాజగన్నాథ్ హఠాత్తుగా.

"తప్పు బ్రదర్!" అన్నాడు రెడ్డి.

"రాజా! మనం ఇరవై అయిదు సంవత్సరాలుగా కాముని పున్నమి రోజున ఇక్కడ కలిసి ఎంజాయ్ చేస్తున్నాం. ఎందరో కళాకారుల్ని పిలిపించాం...గౌరవించాం...ఆనందించాం...కానీ ఎప్పుడూ మనం మిస్ బిహేవ్ చేయలేదు" అన్నాడు మురారి.

రాజాజగన్నాథ్ నవ్వాడు.

"ట్వంటీఫయివ్ యియర్స్...అంటే దీనికి స్పెషాలిటీ వుందన్నమాట. మోహిని అందం, నాట్యం నన్ను పిచ్చివాడ్ని చేశాయి. అందుకే టూ లాక్స్ విలువయిన వజ్రాలహారం ఆమెమెడలో వేశాను" అన్నాడు రాజా జగన్నాథ్ మత్తులో తేలిపోతూ.

"రెండులక్షలతో మోహినిని కొట్టేద్దామనుకున్నావా రాజా" అన్నాడు రెడ్డి.

"రెండు లక్షలేమిటి? రెండుకోట్లిస్తాను... మోహినిని పర్మనెంట్‌గా నా దగ్గరే వుంచుకుంటాను" అన్నాడు రాజా జగన్నాథ్.

"నోర్ముయ్యి రాజా! ఆమె అల్లాటప్పా ఆడది గాదు. నేషనల్ ఆర్టిస్ట్. ఫేమస్ క్రికెట్ ప్లేయర్‌తో పెళ్ళికూడా నిశ్చయమయింది" అన్నాడు రెడ్డి.

"సారీ బ్రదర్స్! ఈ నైట్ ఆమె లేకుండా...ఐ కెనాట్ స్లీప్! నేను ఆమెను కన్విన్సు చేసుకుంటాను" అని జగన్నాథ్ తూలుతూ బంగళాలోకి వెళ్ళాడు.

"మనం ఊరకుంటే లాభం లేదు. పదండి. వెంటే వుందాం. శృతి మించితే మనం అదుపు చేద్దాం" అన్నాడు ముఖర్జి.

అంతా వెళ్ళారు బంగళాలోకి.

"మిస్! మోహినీ...ప్లీజ్ ఓపన్ ద డోర్" జగన్నాథ్ మోహిని గది తలుపు మృదువుగా తట్టాడు.

కాసేపట్లో తలుపులు తెరుచుకున్నాయి. పలుచటి నైట్‌గౌన్‌లో చెదిరిన కురులతో...ముడిపడిన కనుబొమలతో...బిగిసిన పెదిమలతో మోహిని చిరాకుతో జగన్నాథ్‌ని ప్రశ్నార్థకంగా చూసింది.

"మోహినీ!... అయ్... నీడ్... యూ... నువ్వు నాకు... ఈ రాత్రికి..."

మోహిని ముఖం రంగుమారిపోయింది.

"రాజాగారూ! మీరు గౌరవనీయులనుకున్నాను. సారీ...వెళ్ళండి...ప్రొద్దున మాట్లాడుకుందాం" అని మోహిని తలుపువేయబోయింది.

రాజాజగన్నాథ్ తలుపును వేయనీయకుండా చేతులు అడ్డుపెట్టాడు.

"నో...అలా అనకు...నీ నాట్యం అద్భుతం! నీ అందం నా నరాల్ని లాగేసింది" అన్నాడు.

"మీరు కలకన్నారా? నేనసలు నాట్యం చేయందే" మోహిని అంది.

"నో...మీరు అద్భుతంగా వెన్నెట్లో నాట్యం చేశారు. నేను వజ్రాలహారం మీ మెడలో స్వయంగా అలంకరించాను" అన్నాడు రాజాజగన్నాథ్.



"మీకు కైపు ఎక్కువయింది. వజ్రాలహారం మీరివ్వడమేమిటి? నేను తీసుకోడమేమిటి?" చిరాకుగా అంది మోహిని.

"నేను ఇచ్చాను...కావాలంటే మా వాళ్ళని అడగండి...మీ వాళ్ళనీ అడగండి!" అన్నాడు రాజా.

అక్కడే వున్న మిత్రులూ వాళ్ళని కలిశారు.

"అవును మోహినిగారూ! రాజా చెప్పేది వాస్తవం. మీ నాట్యానికి పరవశించి రాజా వజ్రాలహారం ఇచ్చాడు" వెంగళరెడ్డి అన్నాడు.

"మీకంతా పిచ్చిపట్టింది. మీరిచ్చిన ఫారిన్ విస్కీ తీసుకొన్నాక నా గదికి వచ్చిపడిపోయాను. కేవలం పాటకచేరి చేయమని మా వాళ్ళని పంపాను. అంతే" అంది మోహిని.

"మరయితే నాట్యం చేసింది ఎవరు?" ముఖర్జి ప్రశ్నించాడు.

"అవును ఎవరు???" మురారి ఆశ్చర్యంగా అడిగాడు.

"వెంగళరెడ్డి! టార్చి వుందా?" అడిగాడు ముఖర్జీ.

"ఇదిగో" అని పెన్‌టార్చి ఇచ్చాడు రెడ్డి.

ముఖర్జీ ముఖం గంభీరమయిపోయింది. "అంతా నా వెంటరండి" అని దాదాపు పరుగులాంటి నడకతో ముఖర్జి తోటలోకి నడిచాడు. అంతా ఆయన్ని అనుసరించారు. ముఖర్జి నేరుగా దేవగన్నేరు చెట్టు వద్దకు నడిచాడు. పిండి ఆరబోసినట్లు వెన్నెల. ఆ వెన్నెట్లో తెల్లని శిల్పం... మనిషిలా...

ముఖర్జి వెన్నెల వెలుగుకి అదనంగా టార్చిని శిల్పం మీదకు ఫోకస్ చేశాడు. కళ్ళు చెదరేలా మెరిసిపోతున్న వజ్రాలహారం నర్తకి శిల్పం మెడలో... అందరి మత్తు దెబ్బకి దిగిపోయింది.

రాజాజగన్నాథ్ వజ్రాలహారం కోసం చేయి ముందుకు చాచబోయాడు.

ముఖర్జీ "స్టాప్" అని పెనుకేకవేశాడు. కన్నెంవాగు కోన ఒక్కసారిగా ఉలిక్కిపడింది.

ముఖర్జి మెల్లిగా అన్నాడు–"నేనెక్కడో పుస్తకాల్లో చదివినట్లు గుర్తు. కాముని పున్నమిరోజున కొన్ని శిల్పాలు జీవం పోసుకుంటాయని"

రాజాజగన్నాథ్ తాపీగా అన్నాడు "వచ్చే కాముని పున్నానికి నేను తప్పక రావాలి" అని.

సీరియల్

# రాత్రి నా ఇంటిదాకా

మేర్లపాక మురళి

'డిగ్రీ ఎక్కడ చేశావ్?'

చెప్పాను.

'కోఎడ్యుకేషన్ కాలేజీనా?'

అవునన్నట్లు తల ఊపాను.

'అందుకే కాబోలు వెన్నెల టేస్ట్ అంతా తెలిసుంది'

ఆ వాక్యం అర్థం ఏమిటో నాకు బోధపడలేదు.

'మౌనం అర్ధాంగీకారం అంటారు'

దానికి ఔననాలో, కాదనాలో తెలియడంలేదు.

మౌనంగా వుండిపోయాను.

చందమామ ఆకాశం సిగలో మల్లెపూలచెండులా వుంది. గాలి ఆవేశ రహితంగా, మెల్లగా వీస్తోంది.

ఆయన ముందుకు వంగి నన్ను మీదకు లాక్కు న్నాడు. అప్పుడు ఏయే అవయవాలు అతనికి రాసు కున్నాయో తెలియదుగానీ, నరాలన్నీ కొత్తగా రియాక్ట్ కావడం తెలిసింది.

గట్టిగా కౌగలించుకున్నాడు.

రక్తప్రసరణ ఆగిపోయింది. గుండెవేగం హెచ్చింది. ఎంతగా అణచివేస్తే, అంతగా తిరగబడుతున్న అవ యవాలను అదుపుచేయడం నా వల్ల కావడంలేదు.

అప్పటికే నా ఎద వెన్నెల్లో మరింత నునుపు తేలుతోంది. జాకెట్టు ఇక నావల్ల కాదంటూ చేతులెత్తేసింది. ఎదసంపదలు సగం బయటపడి విజయగర్వంతో పొంగుతున్నాయి. ఎలాస్టిక్‌బ్రా సాగి, చివరి స్థాయిలోవుంది. పెట్టీ కోట్ నలిగిపోయి, మరింత పొట్టి దైపోయింది. తెల్లచీర వెన్నెల్లో రేకుల్ని విప్పారించిన కలువ పూవులా వుంది. ఒంటిమీద మరొక్షణం నిలవమని బట్టలన్నీ చివరిసారి హెచ్చరిస్తున్నాయి.

బుగ్గమీద పెట్టుకున్న ముద్దు మొత్తం పాకి శరీరా న్నంతా బుగ్గలా చేసేసింది.

ఆయన నా ఎదమీదకు వంగి, ముఖాన్ని అక్కడ గుచ్చాడు. అంతకాలం శరీరపు ముద్దల్లా అనిపించిన అవి ఆ క్షణంలో ఓ మధురమైన అనుభూతిని తమలో దాచుకుని, అప్పుడు విస్ఫోటానికి గురైనట్లు ఒళ్ళంతా గమ్మత్తుగా కదిలింది.

ఇంకాస్త కిందకు దిగి నడుంమడతలమీద పెదవు లతో సుతారంగా నొక్కాడు. అంతకాలం పైబరువుంకీ, కింది బరువుంకీ మధ్య నలిగిపోయిన ఆ భాగం మరింత ఒత్తిడికిలోనై తుపానులో చిక్కుకున్న పూల తీగలా అల్లల్లాడింది.

ఆయన ముఖం కిందకు పాకింది. బొడ్లో నాలు కతో తడిచేశాడు. తేనె దొన్నెలో పంచామృతాన్ని పోసి జుర్రుకున్నట్లనిపించింది.

ఇంకాస్త కిందకు దిగుతున్న అతని తలను పట్టు కున్నాను. మరి కాస్త ఆలస్యం చేస్తే నరాలు చిట్లు తాయేమోనన్న భయమే అది.

ఈ ప్రమాదాన్ని అతనూ పసికట్టినట్లున్నాడు. అంతటితో ఆగి పక్కన సర్దుకుని పడుకున్నాడు.

అతను దూరంగా వున్నా అతని ఆవేశం నాకు చాలా విధాలుగా తెలుస్తూనే వుంది. ఏమీ మాట్లాడ కుండా నన్ను తక్కున లాక్కున్నాడు.

అంతవరకు మా రొమాన్స్ చూసి సిగ్గుతో వుండలా చుట్టుకుపోయిన చీర అక్కడినుంచి జారిపోయింది. అనుభూతిజల్లులలో తడిసి, కుంచించుకుపోయిన పెట్టీకోట్ తనలో తనే ముడుక్కుంది. జాకెట్టు బంధాలన్నీ తెంచుకుని విముక్తి సాధించింది. బ్రా ఇక సాగడానికి వీలులేకపోవడంతో ఫట్‌మని తెగింది.

చందమామ నన్ను చూడలేక కాబోలు మబ్బులలో ముఖం దాచుకుంది.

అతను తమకంతో నన్ను అల్లుకుపోతున్నాడు.

అది సుఖం కోసం పెనుగు లాటో, ఆనందానికై అన్వేషణో, అనుభవం కోసం పడే తపనో, అనుభూతి కోసం చేసే తపస్సో నాకు తెలియదు.

**14** వంశీ సుజనల పెళ్ళవుతుంది. శోభనం రోజున సుజనకు మూడురోజుల ఇబ్బంది కలుగుతుంది. అప్పుడు వీలుకాదుకనుక మరో ముహూర్తం నిర్ణయిస్తాడు సుజన తండ్రి. కానీ ఆ ముహూర్తానికి ముందే తమ శోభనం జరుపుకోవాలనుకుంటారు వారు. దానికై వంశీ చేసిన మూడు ప్రయత్నాలు విఫలమవుతాయి. ఓ రోజు వంశీకి ఎక్కడినుండో ఓ వీడియో క్యాసెట్ అందుతుంది. ఆ క్యాసెట్ ప్లే చేసిన వంశీ, అందులో తన భార్య సుజన వేరే మరో యువకునితో శృంగారంలో పాల్గొనడం చూసి గిలగిల్లాడిపోతాడు.

సుజన మిత్రురాలు వైదేహి తన వైవాహిక జీవితం గురించి చెప్తుంటుంది. చిన్నప్పుడే తల్లిని కోల్పోయిన వైదేహి ని తీసుకొని అన్న దగ్గరికి చేరుతాడు వైదేహి తండ్రి. వైదేహి తల్లి చనిపోయిన తరువాత తెగిపోయిన సంబంధాల్ని ఏర్పరచుకోవాలని వైదేహి ని ఆమె మేనమామ రాజేష్‌కిచ్చి వివాహంచేస్తారు. మొదట ఇష్టంలేకపోయినా పెద్దల బలవంతం మీద ఒప్పుకుంటుంది. శోభనం నాటిరాత్రి రాజేష్ చెంత చేరుతుంది వైదేహి.



నా శరీరం అతని చేష్టలకుతప్ప మరో చర్యకు రెస్పాండ్ అయ్యే స్థితిలోలేదు.

నేను గట్టిగా కౌగిలించుకున్నాను.

అతను నాలో కలిసిపోతున్నాడు.

ఆ మాధుర్యాన్నంతటినీ నా ప్రతి అణువుతో అనుభవించాలని కాబోలు కళ్లు మూసుకున్నాను.

'చుట్టూ చీకటిగా వున్నా సెక్స్‌లో ఆడపిల్ల కళ్లెం దుకు మూసుకుంటుందో తెలుసా?' అని అడిగాడు.

ఏమీ మాట్లాడాలనిపించని స్థితిలో వున్న నేను తెలియదన్నట్లు తల అడ్డంగా ఊపాను. ఆ తరువాత టైమ్‌తో పనిలేకపోయింది. అయిదునిమిషాలే అయ్యిందో, పావుగంటే గడిచిందో, గంటే కరిగి పోయిందో నాకు స్పృహలో లేదు.

అంతవరకు తెలియని ఒక గొప్ప అనుభవంతో నా శరీరం నాకే కొత్తగా అనిపించింది. ఈ శరీరానికి ఇంత అద్భుతంగా సుఖపడడం కూడా తెలుసా అని బోలెడంత ఆశ్చర్యపోయాను.

పక్కనే పడుకున్న అతని ముఖంమీద స్వేదం ముత్యాల్లా మెరుస్తోంది. ఒక్కొక్కటిగా బట్టలన్నీ వేసుకున్నాను. పైటతో అద్దాను.

లేచి ఫ్లాస్కులోని పాలను గ్లాసులో పోసి అందించాను. అతను లేచి కూర్చున్నాడు.

అతన్ని ఆరాధనతో చూస్తూ వుండిపోయాను.

పాలు తాగి గ్లాసు కిందపెట్టాడు.

అతనిలో ఆందోళనలాంటి ఫీలింగ్.

'మీ క్లాసులో ఎంతమంది అబ్బాయిలుండేవాళ్లు?'

అతను వేసిన ప్రశ్న నాకు బొత్తిగా నచ్చలేదు. అలాంటప్పుడు అడగాల్సిన ప్రశ్న కాదు.

కానీ సమాధానం చెప్పకతప్పదు.

'ముప్పైరెండుమంది'

'చాలా కరెక్టుగాచెప్పావే!'అది అభినందనలా లేదు.

'వాళ్ళలో ఎవరంటే నీకు ఇష్టం?'

ఓ క్షణంపాటు ఉలిక్కిపడ్డాను.

'ఒకరని ప్రత్యేకంగా ఇష్టమేమీలేదు'

'అలాకాదు. మూడేళ్లపాటు కలిసివున్నారుకదా. ఒకరిమీద ప్రత్యేకమైన అభిమానం అంటూ వుండ కుండా వుంటుందా?'

ఆలోచించాను. మిమిక్రీచేసే రేవంత్ అంటే ఆడపిల్లలకి ఇష్టంగా వుండేది. సరదాగా, ఎప్పుడూ నవ్విస్తూవుండే అతనంటే నాకూ అభిమానముండేది. అందుకే అతని పేరు చెప్పాను.

'లవ్వా?'

అదిరిపడ్డాను. ఫస్ట్‌నైట్‌న భర్త అలా అడగడం ఊహించలేని పరిణామం.

కాదన్నట్లు తల అడ్డంగా తిప్పాను.

'లేదులే- నువ్వు అబద్ధాలు చెబుతున్నావ్. అతనంటే నీకు చాలా ప్రేమ'

ఏదో చెడులోందని నాకనిపిస్తోంది. అందుకే 'నో...నో' అంటూ మొహం వాల్చుకున్నాను.

'ఈ కాలంలో డిగ్రీ చదివిన పిల్లకి లవ్ ఎఫైర్ లేదంటే నేను చచ్చినా నమ్మను. మీ క్లాస్‌మేట్ కాక పోతే ఈ ఊర్లో ఎవరైనా...' అంటూ ఆగాడు.

## ఆమని ఆశలు



'హలో బ్రదర్‌'లో ఒక పాటలో కనిపించిన ఆమని- "అలా ఒక్క పాటలోనైనా నాగార్జునగారితో నటించిన అవకాశం వచ్చినందుకు ఎంతో ఆనందించాను. నాగార్జునగారి సరసన పూర్తి హీరోయిన్‌గా నటించే అవకాశం కోసం ఎదురుచూస్తున్నాను" అని ఆశాభావంతో అంటోంది.

ఉత్తమనటి అయినా, ఒళ్లంతా అందాలున్నా ఇంతవరకు ఎక్కువమంది అగ్రహీరోలతో నటించలేక పోయానన్న ఆమని ఆశలు త్వరలో నెరవేరుతాయనే ఆశిద్దాం. తమిళంలో విజయ్‌కాంత్ సరసన చక్కగా అందాలు ప్రదర్శించిన ఈ అందగత్తె తన నిరభ్యంతర వైఖరిని ఏనాడో తెలియజేసింది.

మరో గ్లామర్ స్టార్‌గా ఎదగదగ్గ సొగసులున్న నటి ఆమని అనడంలో సందేహం లేదు.

నన్ను ఆటపట్టించడానికి అడుగుతున్నాడేమో అనుకుంటూ మొహాన్ని పరిశీలించాను.

చాలా సీరియస్‌గా వున్నాడు.

అంతకుముందు కలిగిన అనుభూతి అంతా అసహ్యంగా అనిపిస్తోంది.

ఏదో వేదన, భయం నా గుండెల్లో దూరాయి.

'ఎవరో చెప్పు?'

అతన్ని ఏంచేయాలో నాకు అర్థంకావడంలేదు.

'పెళ్ళికి ముందు ఏమీ లేకుండా వుండడం ఇంపాజిబుల్. అందునా నీలాంటి అందగత్తెను ఎవరూ ఏమీ చేయకుండా వుండడం అసంభవం. అందులోనూ నాకు ప్రూఫ్ దొరికింది'

నేను నిశ్చేష్టురాలై చూస్తున్నాను.

'బుజువులులేకుండా నేను మాట్లాడను. నాదగ్గర రెండు బుజువులున్నాయి. ఫస్ట్‌నైట్‌న భార్య కన్యో కాదో తేల్చుకోవడానికి రెండు ఆధారాలున్నాయి. ఆ రెండూ నాకు కనబడలేదు. అందుకే ఖచ్చితంగా నువ్వు కన్యకావని చెప్పగలుగుతున్నాను. పెళ్ళికి ముందే నీకు ఈ అనుభవం వుందన్నది తేలిపోయిన విషయం. ఇక తెలియాల్సింది అతను ఎవరా అని!'

అంతవరకు చేతిలోవున్న మల్లెపూల దండ తాచుపాములా మారిపోయి, కాటేయడానికి పడగవిప్పినట్లు వాడి మొహం నల్లగా మారిపోయివుంది.

అలా చేష్టలుడిగి చూస్తుండిపోయాను.

'పూర్వం కొన్ని తెగల్లో ఫస్ట్‌నైట్ అయిపోయిన రెండోరోజు ఉదయం కొత్త దంపతులు శోభనం రోజున తాము ఉపయోగించిన దుప్పటిని ఇంటి ముందు ఆరవేసేవారట. దాన్నిచూసి పెళ్ళికూతురు కన్యో, కాదో జనం గ్రహించేవారట.

మనం ఉపయోగించిన బెడ్‌షీట్ వేసినప్పుడు ఎలా వుందో ఇప్పుడూ అలానే వుంది. దీన్ని చూసి చెప్పెయ్యొచ్చు నువ్వు కన్నెపిల్ల కావని'

అప్పుడొచ్చింది నాకు ఏడుపు. మొత్తం నరాలన్నీ పగిలిపోతాయేమోనన్నంతగా ఏడ్చాను.

'వాడెవడో చెప్పేశావంటే సరిపోతుంది. మీ క్లాస్‌మేటా? లేకపోతే మీ కుర్రలెక్చరరా? ఎదురింటి వాడా? పక్కింటిఅబ్బాయా? ఎవడు?'

కళ్ళలోకి చూస్తూ గుచ్చిగుచ్చి అడుగుతున్నాడు. అప్పటికే తెల్లారిపోయినట్లు కోడి కూసింది. ఏడుపును కడుపులోకి తోసేసి లేచి నిలుచున్నాను. ఇక అక్కడ వుండడం భరించలేకపోయాను.

మెట్లు దిగుతూ పైకి చూశాను. మబ్బుల మధ్యన పాకుతున్న చందమామ రెక్కలు తెగిన సీతాకోకచిలుకలా వుంది. ఆ పురుగు కాటుకి ఆకాశం నల్లగా మారిపోయినట్లు తోస్తోంది.

రెండోరోజు ఉదయం వాడికి- అదే నా భర్తకు కనబడకుండా తప్పించుకుని తిరిగాను. కానీ వాడి చూపుల్నుంచి తప్పించుకోలేకపోయాను. అనుమానంతోనూ, సంశయంతోనూ, సందేహంతోనూ ఆ కళ్ళు ఊకలు పీకి కాల్చిన డేగల్లా వున్నాయి.

ఎవరైనా పసికడతారేమోనని మామూలుగా వుండడానికి చాలా ప్రయత్నించాను.

మధ్యాహ్నం భోజనాలయ్యాక పడుకున్నాను.

నిద్ర లేచేటప్పటికి సాయంకాలం అయిపోయింది.

'ఈ రోజు మేం చెప్పక్కర్లేదులే. నీ అంతట నువ్వే తయారవుతావు. ఆరాటం అలాంటిది. పగలే లేకుండా రాత్రే వుంటే బావుండునని అనుకునే పెళ్లి కూతురివి నువ్వు' అని వసంతత్త పరాచికాలాడింది.

కానీ ఆమెకు తెలియదు చీకట్లు పడేకొద్దీ నా మనసు కనలి కనలి ఏడుస్తోందని.

వాడితో రాత్రి గడపాల్సి రావడం ఎంత నరకమో నాకొక్కదానికే తెలుసు. దీన్నుంచి ఎలా తప్పించుకోవాలో తెలియడంలేదు.

తొమ్మిదిగంటల ప్రాంతాన మిద్దెమెట్లెక్కాను. మడుగులోని మొసలిలా నడుంవాల్చి చూస్తున్నాడు.

'రండి! రండి! వైదేహి గారూ! ది గ్రేట్ లవర్'

వాడి నాలుకను కోసెయ్యాలనిపించింది.

వాడు కూర్చోమంటే కూర్చోవడమేమిటని నేనే ముందుగానే కూర్చున్నాను.

లైట్ ఎల్లో చీరలో నేను నిజంగా దేవతలానే వున్నాను. అప్పుడే పుట్టిన చందమామ తెలుపు, ఎరుపు మిశ్రమంలా వుంది. టైమ్ గడిచేకొద్దీ తెలుపు డామినేట్ చేస్తోంది. గాలి చల్లగానే తగుల్తున్నా, దాన్ని గుర్తించలేకపోతున్నాను.

'ఊఁ ఈ రోజైనా వాడెవడో చెబుతావా?'

మొదలైందన్నమాట. ఇక ప్రతిరాత్రీ ఇదే తంతు కాబోలు అనుకున్నాను.

'నేను దేన్నైనా అనుమానిస్తే అది గన్‌షాట్‌గా నిజమై తీరాల్సిందే. నువ్వు కన్య కావని ఖచ్చితంగా చెప్పగలను. ఇప్పుడు ప్రశ్న నువ్వు అనాఘ్రాత పుష్పానివా? కావా? అన్నది కాదు. నిన్ను చిలక్కొట్టుడు కొట్టిన వాడెవడో కావాలి. దట్సాల్'

నాకు లేని లవర్‌ని ఎక్కణ్ణుంచి తేగలను? అయినా ఈ హింస ఎన్నాళ్ళు?

'వాడెవడో చెప్పేయ్. ఎన్నిసార్లు? ఎక్కడ మీరు పడకసుఖం పంచుకున్నారో చెప్పేసెయ్. నిజం చెప్పావనుకో- నేనేమీ చేయను'

నన్ను దోషిగా నిలబెట్టాలని వాడు పడే తాపత్రయాన్ని చూసి నవ్వొచ్చింది. ఏంచేయనని ఇప్పుడంటున్నాడుగానీ నేను పెళ్ళికిముందే మరొకరితో తిరిగానని తెలిసిన మరుక్షణం దారుణంగా రియాక్ట్ అవుతాడని తెలుసు.

'ప్రామిస్. నిన్నేం చేయను' వాడు నా తలమీద చేయిపెట్టాడు.

ఇప్పుడు నేను అవునని అంటే వాడి అహం సంతృప్తి చెందుతుంది. తన అంచనాలు ఎప్పుడూ

## మానసికారోగ్యాన్నిచ్చే పళ్లు



తమ ఆహారంలో పళ్లు, కూరగాయలు ఎక్కువగా తీసుకునే మహిళలు మానసికంగా తక్కినవారికన్నా ఆరోగ్యంగా వుంటారని వేల్స్‌లోని యూనివర్సిటీ కాలేజీ ఆఫ్ స్వాన్సీ చేసిన పరిశోధనలో వెల్లడైంది.

ఆ యూనివర్సిటీలో సైకాలజీలో రీడర్ అయిన డా॥ డేవిడ్ బెంటన్, "మా సర్వేలో, అధికంగా పళ్లు, కూరగాయలు తినే మహిళలు ఆందోళనకీ, నిస్పృహకీ లోనవడం అరుదని తేలింది", అంటున్నాడు. వాటిద్వారా అందే విటమిన్లు, ఖనిజలవణాలూ ఎక్కువ కావడంతో వారి మానసికారోగ్యం మెరుగ్గా వుండి వుంటుందని చెప్పాడాయన.

అంతేకాక, వాటిపై వారికున్న మంచి అభిప్రాయంతో కొందరు మహిళలు చక్కగా వుండాలనే ప్రయత్నంలో కూడా పళ్లు, కూరగాయల్ని ఎక్కువగా తినడం జరుగుతుంటుందన్నాడాయన. ◆

తప్పుకాలేదని రొమ్ము విరుచుకుని నాకే చెబుతాడు. తనొక్కడే సెక్స్ గ్రంథాలు చదివి దొంగను పట్టేసే నని చంకలు గుద్దుకుంటాడు.

ఎదుటివ్యక్తి ఏమై పోయినా ఫరవాలేదు తన 'అహం' సాటిస్‌ఫై కావాలి.

ఇక ఆ తరువాత నన్ను శిక్షించడం మొదలుపెడ తాడు. ముద్దు పెట్టుకుని 'వాడికన్నా నేనే బాగా ముద్దు పెట్టుకుంటాననుకుంటా' అని అడుగుతాడు.

అలా మాటలతో సాడిటీ, సాడిటీ శాడిస్టిక్ ప్లెజర్‌ని పొందుతాడు. ఈ వికారాలన్నిటికీ నేను ఓ ఇన్‌స్ట్రుమెంట్ కావాలి- అంతే. ఎక్కడో చీప్ పుస్తకాల్లో చదివి నేను కన్యను కానని నిర్ధారించుకుని నామీద స్వారీ చేయడం మొదలుపెట్టాడు.

శిక్ష వేయాలంటే దోషిగా ముద్ర వేయాలి. అదీ వాడిప్పుడు చేస్తోంది.

సిగరెట్‌మీద సిగరెట్ తగలేస్తున్నాడు. 'వాడెవడో చెప్పాకే- మనమధ్య ఏదైనా- అప్పటివరకు నువ్వక్కడ- నేనిక్కడ' అన్నాడు కొంతసేపయ్యాక.

దాన్ని వాడు శిక్ష అనుకున్నాడుగానీ నాకు మాత్రం గొప్ప రిలీఫ్‌నిచ్చింది. అలాంటి నీచుడితో మంచాన్ని పంచుకోవడానికి శరీరం ఎలా ఒప్పుకోగలుగుతుంది? సెక్స్ విజ్ఞానంతో కుళ్లిపోయినవాడికి ఈ విషయం బోధపడకపోవడం నా అదృష్టమే. దుప్పటిని తీసుకుని కొద్దిదూరంలో పడుకున్నాను.

నడినెత్తిమీది చంద్రుడు కళ్లకు కనిపించడంలేదు.

పీడకలలమధ్య తెల్లారింది.

నేను కిందకి దిగి వచ్చేశాను.

మూడోరాత్రి అతను చివరిసారి హెచ్చరించి పడుకున్నాడు. మూడురాత్రులూ అయిపోయాక నేను వాడితో అత్తగారింటికి బయల్దేరాను. వాడితో పోవడమంటే కాటికిపోవడమే. కూతురి పెళ్లయిందని సంతోషించే మా నాన్న కోసమే నేను బయల్దేరాను.

నాతోపాటు పెద్దమ్మా, సువర్చలా, వసంతత్తా వచ్చారు. రెండురోజులుండి వాళ్ళు వచ్చేయడంతో నేను బోనులో చిక్కుకుపోయాను.

మా అమ్మమ్మ చాలా వృద్ధురాలు. కళ్ళు కనిపించవు. సరిగా వినిపించదు కూడా. ఎప్పుడూ మంచంలోనే పడుకుని వుంటుంది. కోడలై వచ్చిన మనవరాలిని చూడడానికి కూడా లేవలేకపోయింది. పడుకునే కళ్లను విప్పి బోసినవ్వు నవ్వింది.

అమ్మమ్మని అమ్మ బతికున్న రోజుల్లో చూశాను. మళ్ళీ ఇదే చూడడం.

పాత పెంకుటిల్లు అది. విశాలంగానే వుంటుంది. హాలు కాకుండా రెండు పెద్ద గదులున్నాయి.

నేను రావడంతో పనిమనిషి రంగమ్మ ఓ గదిని శుభ్రంచేసి మంచాలు గట్రా వేసింది.

నేను మాట్లాడడానికి మిగిలిన ఏకైక తోడు ఆమె.

రెండురోజుల్లోనే మేం ఇద్దరం మంచి స్నేహితురాళ్లం అయిపోయాం.

వాడు రోజూ బ్యాంక్‌కి వెళ్ళి వస్తున్నాడు.

ఎనిమిదోరోజో, తొమ్మిదోరోజో నా నగలు అడిగాడు. 'డబ్బుతో అవసరమొచ్చింది. బ్యాంక్‌లో




## భారీహంగులు

'మహేష్‌భట్ డైరెక్షన్‌లో భారీ తెలుగుచిత్రం' అనే కొత్తదనానికి శ్రీకారం చుట్టాడు నిర్మాత కె.ఎస్. రామారావు. 'క్రిమినల్' పేరుతో రాబోయే ఈ చిత్రంలో రమ్యకృష్ణ నాగార్జునతో నటిస్తోంది.

అంతేకాకుండా- హింది సినిమాల్లో అభ్యంతరాల్లేని అందాల ప్రదర్శనతో అల్లల్లాడిస్తున్న మనీషా కొయిరాలా ఇందులో మరో నాయిక. ఇంకేముంది మాంచి మాంచి మసాలా చిత్రంగా మెగాహిట్ సాధించడానికి అన్నిహంగులూ వున్నాయి.

కుదవపెట్టి తరువాత ఇచ్చేస్తాను'

'కట్నం డబ్బు అరవైవేలు ఏమయ్యాయి?' అని నేను అడగలేదు.

వాడు ఎలాంటివాడో తెలియడంవల్ల ఆ ప్రశ్న అనవసరమనుకున్నాను.

నగలన్నీ విప్పుతుంటే వాడు 'చాలు' అనలేదు. బొందారం చైనూ, కమ్మలూ తప్ప మిగిలినవన్నీ ఇచ్చేశాను. వాడి సంగతి తెలుసుకాబోలు రంగమ్మ బోసిగావున్న నన్ను చూసి ఆశ్చర్యపోలేదు.

'ఆయన్ని నువ్వే అదుపులో పెట్టాలమ్మా' అని మాత్రం అంది.

వీటి మధ్య రాత్రుల్లో నా ప్రియుడు ఎవడో చెప్పమని పోరుతూనే వున్నాడు.

మౌనంగా భరిస్తూనే వున్నాను.

పదహారు రోజుల పండక్కి రమ్మని నాన్న ఉత్తరం రాశాడు. ఆరోగ్యం బాగా లేకపోవడంవల్ల రాలేకపోతున్నట్లు క్షమాపణలు కోరాడు.

ఆరోగ్యం మరీ బాగాలేకపోతే తప్ప నాన్న రాకుండా వుండడు. నాకు ఆందోళన ఎక్కువైంది.

మరుసటిరోజు వాడు వచ్చినా రాకపోయినా వెళ్లడానికి నిశ్చయించుకున్నాను.

ఆ రాత్రి యథాప్రకారం నేను కింద చాపమీద పడుకున్నాను. మంచం మడుగులో ముసలి తాంబూలం వేసుకుంటోంది. రంగమ్మ హాల్లో పడుకుని అప్పటికే నిద్రపోయింది.

'ఏం రాశాడు మీ నాన్న?' ముసలి నోరువిప్పింది. తాంబూలంతో కలిపిన విస్కీ వాసన గుప్పుమంది.

'పదహారు రోజుల పండక్కి రమ్మని రాశాడు. ఆరోగ్యం బాగాలేక రాలేకపోయాడట'

'వెళుతున్నావా?'

'ఆఁ'

'ఒంటరిగానేనా?'

నేను జవాబు చెప్పలేదు.

'ఆఫీసుకు టెలిగ్రామ్‌కూడా వచ్చింది. గుండె నొప్పి వచ్చిందటగా'

ఎవరో నా రక్తనాళాల్ని గుచ్చి బయటికి తీస్తున్నట్లు విలవిల్లాడిపోయాను.

'రేపు ఉదయం పంపిస్తాను. నేను రానులే ఆ రోగిష్టివాడ్ని చూసేందుకు. అయితే ఒక షరతు. నువ్వు ఎవడితో గడిపావో చెప్పాలి. చెప్పలేదనుకో. ఊరికి కట్. పంపించను. నీ రోగిష్టి నాన్న చచ్చిపోయినా పంపను. గొలుసులేసి కట్టేస్తాను. మరీ యాగీ చేశావనుకో- ఇదిగో ఈ యాసిడ్ ముఖంమీద పోస్తాను' అని దిండుకింద దాచివుంచిన ఒక సీసా బయటికి తీసి తిరిగి పెట్టేశాడు.

మళ్ళీ వాడే 'నేను వద్దన్నా నువ్వు వెళతావులే. పాపం నీ ప్రియుడు విరహంతో వేగిపోతుంటాడు. నువ్వెళ్ళి వాడ్ని ఒళ్ళో పడుకోబెట్టి బుజ్జగించాలి- లాలించాలి- ముద్దులతో నింపెయ్యాలి- ఇంతకీ ఎవడు వాడు? మీ క్లాస్‌మేటా? మీ ఊరి అబ్బాయా? ఎవడు...?' అన్నాడు.

నేను ఒక్కసారిగా బరస్ట్ అయిపోయాను. కోపం కట్టలు తెంచుకుంది. ఆవేశంతో ఊగిపోయాను.

'స్టుపిడ్- బాస్టర్డ్- చెబుతున్నాను విను- నా ప్రియుడు పేరేకదా నీక్కావలసింది. కానీ ఒక్కడితో కాదు నేను గడిపింది- మొత్తం నా క్లాస్‌మేట్స్ ముప్పైరెండుమందితోనూ, ప్లస్ మా ఊర్లోని పదహారు మంది యువకులతోనూ సెక్స్ అనుభవాల్ని పంచుకున్నాను. నీ భాషలో చెప్పాలంటే నలభైఎనిమిది



## తారల పన్నుబకాయిలు

మెగాస్టార్లు అమితాబ్‌బచ్చన్, రాజేష్‌ఖన్నాల ఇన్‌కంటాక్స్ బకాయిలుకూడా చాలా భారీగానే వున్నాయి. వారు గత ఏడాది చివరికి ఆదాయం పన్ను రూపేణా ఒక్కొక్కరూ కోటిరూపాయలపైనే బాకీపడ్డారు.

అమితాబ్‌బచ్చన్ చెల్లించవలసిన పన్ను 3 కోట్ల సంతొమ్మిది లక్షల రూపాయలు కాగా, రాజేష్‌ఖన్నా బకాయిపడిన మొత్తం కోటి రూపాయలకి కొంచెం పైనే. ఈ సందర్భంలో అత్యధిక మొత్తాలలో పన్ను ఎగవేతలు జరగకుండా జాగ్రత్తపడాలని ఆర్థికమంత్రి మన్‌మోహన్‌సింగ్ అభిప్రాయపడినట్టు వార్త.



# సాధారణ సెక్స్ సందేహాలకు సమాధానాలు



■ అధికంగా హస్తప్రయోగం చేస్తే అంగం బలహీనమవుతుందని అనుకోవడం అపోహ.

■ హస్తప్రయోగంవల్ల మొటిమలు రావడం, నపుంసకత్వం కలగడం, కళ్లచుట్టూ నలుపు రావడం, కండరాలు క్షీణించడం, బుగ్గలు గుంటలు అవడం జరగదు. బలహీనం అవడానికి వేరే కారణాలేగాని హస్తప్రయోగం కారణం కాదు.

■ వంద రక్తపుబొట్లు కలిస్తే ఒక వీర్యంబొట్టు తయారవుతుందని అనుకోవడం తప్పు. రక్తం వీర్యంగా మారదు. వీర్యం ఏమాత్రం విలువైనది కాదు.

■ వీర్యంలో వీర్యకణాలు లేకపోయినా, తక్కువ వున్నా సెక్సు తృప్తిలో, సెక్సు సామర్థ్యంలో తేడా ఏ మాత్రమూ వుండదు. వీర్యంలో వీర్యకణాలు లేకపోతే పుంసత్వం లేనట్లు కాదు.

■ వీర్యం రంగుకీ, సెక్సులో కలిగే తృప్తికీ, పుట్టే బిడ్డల రంగుకీ సంబంధం లేదు. చిన్నతనంలో వీర్యం తెల్లగా వుంటే వయస్సు పెరుగుతున్నకొద్దీ వీర్యం లేత పసుపు రంగుకి మారుతుంది. వీర్యరాశి కూడా తగ్గుతుంది.

■ వీర్యం చిక్కగా వుంటే సెక్సు సామర్థ్యం బాగా వున్నట్లు లేకపోతే లేనట్లు అనుకోవడం తప్పు.

■ వీర్యనష్టం కలగకుండా నిరోధించుకోవడం వల్ల, బ్రహ్మచర్యం అవలంబించడంవల్ల ఆరోగ్యం బాగుపడటం, ఆయుష్షు పెరగడమంటూ వుండదు.

■ వ్యాయామం చేసేవారు కూడా మామూలుగానే సెక్సులో పాల్గొనవచ్చు. సెక్సులో పాల్గోవడంవల్ల కండబలం చేకూరదనుకోవడం అపోహ.

■ మూత్రంతో వీర్యం పోవడం జబ్బు కాదు. దానివల్ల



నీరసించడం, అనారోగ్యం కలగడం జరగదు.

■ రతిలో స్త్రీకి తృప్తి అనిపించడానికి, పురుషాంగ పరిమాణం ఎక్కువగా వుండటానికి సంబంధం లేదు. మామూలు సమయంలో ఏ పరిమాణంలో వున్నా, స్తంభించిన పురుషాంగం మాత్రం అందరికీ దాదాపు ఒకటే పరిమాణంలో వుంటుంది.

■ అంగం తగినంత గట్టిపడకపోవడానికి, రతి మధ్యలో మెత్తబడటానికి హస్తప్రయోగం, వీర్యనష్టం కారణం కాదు. మనసులో భయం, ఆందోళన, తొందర కొంత కారణమైతే, ఆత్మవిశ్వాసం లేకపోవడం, న్యూనతాభావం, కొత్తఅంటే బెంకు ఇంకో కారణం.

■ ఉత్తేజిత్పక లేహ్యంలాంటి మందులతో లైంగిక సామర్థ్యం పెరగదు. లైంగికసామర్థ్యం మనసుమీద ఆధారపడి వుంటుంది. మందు వాడితే సామర్థ్యం పెరుగుతుందనే నమ్మకం సెక్సుని పెంచుతుంది.

■ పురుషులు కుటుంబనియంత్రణ ఆపరేషను చేయించుకుంటే సెక్సుసామర్థ్యం తగ్గదు. నపుంసకత్వం రాదు. ఎటువంటి అనారోగ్యం కలగదు.

■ ముట్లు ఎండిపోయినా సెక్సు కోరికలు, సెక్సు సామర్థ్యం మామూలుగానే వుంటాయి.

■ పుట్టబోయే బిడ్డ ఆడా, మగా అనేది స్త్రీమీద ఆధారపడిలేదు. మగవానిలో వుండే వీర్యకణాల మీదే ఆడబిడ్డ, మగబిడ్డ పుట్టడం ఆధారపడివుంది.

■ ఉప్పు కారం ఎక్కువ తింటే సెక్సు ఎక్కువ వుంటుందనుకోవడం తప్పు. అవి తినకపోయినా సెక్సు సామర్థ్యం ఒకటేలాగా వుంటుంది.

■ తీసుకున్న ఆహారంలోని సారం వీర్యంగా మారుతుందనుకోవడం అపోహ. వీర్యరాశిలో ఒక శాతమే వీర్యకణాంరాశి. తక్కినదంతా ద్రవమే. ఇది ఆహార సారం నుంచి తయారవదు. చేపలకి చెరువులో నీరు తోడ్పడినట్టే వీర్యంలో ద్రవం వీర్యకణాలకి తోడ్పడుతుంది. —డా॥ జి. సమరం

సార్లు నా కన్యత్వాన్ని కోల్పోయాను. ఎస్- ఐ యామ్ నాట్ ఎ వర్జిన్- అందుకే నువ్వు కోరుకున్నట్లు పడకమీద 'పెయిన్' అంటూ అల్లాడిపోలేదు. బ్లాంకెట్ రక్తంతో తడిసి ముద్దయిపోలేదు- చాలా - వాళ్ల పేర్లన్నీ చెప్పాలా' అంటూ ముందుకు సివంగిలా దూకి దిండుకింది యాసిడ్ బాటిల్ చేతుల్లోకి తీసుకున్నాను. అపరమహంకాళిలా వూగిపోతున్న నన్ను చూసి ఎంతో కొంత ఖంగుతిన్నాడు.

చేష్టలుడిగి చూస్తున్నాడు.

'ఐ యామ్ గోయింగ్- ఇంకెప్పుడూ ఇక్కడికి రాను. మన ఆస్తి మనవాళ్లే తినాలని పెళ్లిళ్లు చేసే పెద్దలు వున్నంతకాలం నీలాంటివాడికి వచ్చిన కొదవేం లేదు. అందుకే నువ్వు నెలతిరక్కుండా రెండో పెళ్ళి చేసుకుంటావు. అప్పుడూ నువ్వు ఇలాగే నీ ప్రియుడు ఎవరో చెప్పమని పెళ్ళికూతుర్ని వేధిస్తావ్. కానీ ఆ ప్రశ్న నువ్వు వేయకుండా నేను చేస్తాను' అని సీసా మూత తెరిచాను.

వాడి దవడలమధ్య వేళ్ళతో అదిమాను. తాంబూలం నోరు ఎర్రగా తెరుచుకుంది. సీసాలోని యాసిడ్‌ని నాలుకమీద కుమ్మరించాను.

మందుమీద వుండడంతో నన్ను ప్రతిఘటించలేకపోయాడు. నాలుకమీద పడిన యాసిడ్ మండి, పొగలై పొంగింది. ఏం జరిగిందో వాడు గ్రహించేలోపే జరగాల్సింది జరిగిపోయింది. వాడి నాలుక కాలిపోయింది. మాట్లాడడానికి ప్రయత్నించాడుగానీ శబ్దాలు తప్ప మాటలు బయటికి రావడంలేదు.'

పైకి లేవకుండా అలాగే అదిమి పట్టుకున్నాను.

వాడి అరుపుతో రంగమ్మ లేచినట్లుంది.

ఇక ఆలస్యం చేయకూడదని అక్కడినుంచి బయటికి పరిగెత్తి గొళ్ళెంపెట్టాను.

వాడు లేచివచ్చి తలుపును బాదుతున్నాడు.

ఏం జరిగిందో అర్థంకాని రంగమ్మ బొమ్మలా నిలబడి చూస్తోంది.

'రంగమ్మా! వాడికి సరైన శాస్తి చేశాను. రా! వెళదాం. నన్ను బస్టాండ్ దగ్గర వదిలిపెట్టు' అన్నాను.

నేను ఏ స్థితిలో వున్నానో గ్రహించింది. వెంటనే వెళ్ళి మరో గదిలోవున్న నా సూట్‌కేస్‌ను తెచ్చింది.

వాడు తలుపు కొడుతూనే వున్నాడు.

ఇద్దరం బయటపడ్డాం.

చీకటి కొండచిలువ చర్మంలా చారలు చారలుగా భయంకరంగా వుంది.

•  •  •

వైదేహి చెప్పడం పూర్తిచేసింది. సుజన అలా చూస్తోందే తప్ప మాట్లాడలేకపోయింది...

బ్రిటన్‌లో వర్జిన్ టెస్టులు జరిగినా, ఎయిర్‌హోస్టెస్‌లు పెళ్ళిళ్ళు చేసుకోకూడదని ఆంక్షలు పెట్టినా, రాజేష్ లాంటి వాళ్ళు రక్తపరీక్షలకు సిద్ధపడ్డా కారణం ఒక్కటే- పురుష దురహంకారం.

వైదేహి ముక్తాయింపుగా అంది- "పెళ్ళికి కులం కావాలి. మతం కావాలి. ఆస్తికావాలి, అంతస్తు కావాలి. జాతకాలు, పేరుబలాలు కావాలి. చుట్టాలు పక్కాలు కావాలి. అక్కర్లేంది ఒక్కటే. అది మనసులు కలవడం"

ఇక వెళ్లొస్తానని కళ్ళతోనే చెప్పి ఆమె అక్కడ్నించి బయల్దేరింది. ఆ కళ్ళల్లో సన్నటి నీటిపొరను గమనించింది సుజన.

•  •  •

రాజుపాళెంలో ధర్మరాజు తిరుణాల.

ఊరు ఊరంతా కళకళలాడుతోంది.

ప్రతి ఇల్లూ కొత్తగా కొట్టిన సున్నంతో పావురాళ్ళ గూడులా వుంది. పచ్చటి ఆకుల్ని కప్పుకున్న పందిళ్ళు ఊరి మధ్యలో పంటపొలాలు మొలిచినట్లున్నాయి. ఇళ్ళముందు పెట్టిన రంగురంగుల ముగ్గులు నవరత్నాల కుప్పల్లా వున్నాయి. వీధులన్నీ శుభ్రంగా భూదేవి పాపటబిళ్ళల్లా మెరుస్తున్నాయి.

ఆ ఊర్లోని హడావుడి చెప్పనలవికాకుండా వుంది.

ధర్మరాజు తిరుణాల ప్రారంభమై అప్పటికి ఏడు రోజులైంది. ప్రతిసంవత్సరం ఆ ఊర్లో తప్పనిసరిగా ఈ తిరుణాల జరుగుతుంది.

భారతంలోని ముఖ్యఘట్టాలను రోజుకొకటి చొప్పున ప్రదర్శించడానికి నెల్లూరు నుంచి కళాకారులను తెప్పిస్తారు. వాళ్ళు వేషాలు కట్టి పద్యాలూ, పాటలూ పాడుతూ భారతాన్ని ప్రదర్శిస్తారు.

ఊరికి ఉత్తరంవైపున్న ధర్మరాజు గుడి ప్రాంగణమే వారికి రంగస్థలం. ఆ రోజు ప్రదర్శించబడేది గోగ్రహణం.

(ఇంకావుంది)

# సంయోగం దుర్లభం అవడానికి భయం మూలమా?

కొందరు స్త్రీలకి జననేంద్రియాలు సక్రమంగానే వుంటాయి. అయినా సంయోగం కుదరనే కుదరదు. ఎంత ఫోర్సు చేసినా అంగప్రవేశం జరగనే జరగదు. స్త్రీ సెక్సుకి సహకరించినట్లే వుంటుందికానీ శరీరం మాత్రం సహకరించదు. దానితో సంభోగం జరగనే జరగదు. ఇటువంటి పరిస్థితిని 'వజినిస్మస్' అంటారు.

వజినిస్మస్ పరిస్థితికి మూలం మనసు. మనసులో అంతర్లీనంగా సెక్స్ యాక్ట్ గురించి భయం వుంటే సెక్సుచేయబోయేసరికల్లా యోని దగ్గర వుండే కండరాలు బిగదీసుకుపోతాయి. దానితో అంగప్రవేశం జరగదు.

విచిత్రమేమిటంటే ఇటువంటి స్త్రీలలో సెక్సు అంటే ఇష్టమే వుంటుంది. కానీ దానికి పది రెట్లు సెక్సు అంటే భయం వుంటుంది. అలా వుందని వారికి కూడా తెలియదు.

సాధారణంగా బాల్యంలో, కౌమారంలో వాళ్లకి తెలియకుండానే సెక్సు గురించి భయం కలుగుతుంది. భయం కలిగిన విషయాన్ని పైకి మరిచిపోయినా, అంతర్లీనంగా మనసు పొరల్లో చోటు చేసుకుంటుంది. అలా వుందని వారికి తెలియనే తెలియదు.

ఇటువంటి ఏంత భయానికి వారి బాల్యంలో, కౌమారంలో ఎవరైనా వారి మీద లైంగిక అత్యాచారం జరిపి వుండవచ్చు లేదా తోటి వయసు వారితో సెక్సులో పాల్గొనబోయి నొప్పి అనిపించి భయపడవచ్చు. లేదా సెక్సు చాలా బాధాకరమైన విషయమని విని మనసుకు పట్టించుకోవచ్చు. అదే చివరికి వజినిస్మస్‌కి దారి తీస్తుంది.

ఇలా వుండగా కొందరు స్త్రీలు కొంత కాలం సెక్సులో చక్కగా పాల్గొంటారు. వారిలో ఆకస్మాత్తుగా అంగప్రవేశం దుర్లభం అవుతుంది. ఎంత ప్రయత్నించినా అంగప్రవేశంజరగదు. దీనిని సెకండరీ వజినిస్మస్ అంటారు.



యోని చీరుకుపోవడం, పుండుపడటం వల్ల సంభోగం బాధ అనిపించి, సంభోగమంటేనే మనసులో ఒక రకమైన భయం ఏర్పడుతుంది. యోని దగ్గర పుండు మానిపోయినా సంభోగం మాత్రం కుదరదు. ఆ భయం తెలియకుండా వెంటాడుతుంది.

వజినిస్మస్ పరిస్థితి వున్న స్త్రీలు చాలావరకు న్యూరోటిక్ అవుతారు. వారిలో భయం, కంగారు వుంటాయి.

వజినిస్మస్‌వల్ల అంగప్రవేశం కుదరనప్పుడు యోని రంధ్రం చిన్నదిగా వుందనో, కన్నెపొర యోని రంధ్రాన్ని మూసి వుంచిందనో, పురుషాంగ పరిమాణం పెద్దదనో అపోహ చెందుతారు. వైద్యపరీక్షచేస్తే ఇవన్నీ నిజంకాదని స్పష్టంగా తేలిపోతుంది.

వజినిస్మస్ వున్నప్పుడు ఆ స్త్రీలకి పి.వి. చేయడం కూడా కుదరదు. డాక్టరు తన వేళ్లని యోనిమార్గంలోకి పోనిచ్చి పరీక్ష చేయలేకపోతారు.

ఇటువంటి స్త్రీలలో పూర్తి మత్తు ఇచ్చి పరీక్షచేయవలసి వుంటుంది. పూర్తి మత్తు ఇచ్చినప్పుడే తేలికగా వేళ్లు యోనిలోకి పోనివ్వబడతాయి. యోని ద్వారం చాలా లూజుగా వుంటుంది. తెలివిగా వున్నప్పుడు అలాగే పరీక్ష చేయాలంటే కుదరదు.

వజినిస్మస్ స్త్రీకి సైకోథెరపీ అవసరం. ఆమెలో వున్న భయాన్ని తెలుసుకుని తొలగించడానికి కృషిచేయాలి. చాలామంది స్త్రీలలో ఆ భయం ఎందుకో, ఏమిటో తెలియదు. వీరికి తగిన ధైర్యం ఇచ్చి రిలాక్సేషను టెక్నిక్ ప్రాక్టీసు చేయిస్తే చాలావరకు వజినిస్మస్ తొలగిపోతుంది.

అలాగే స్వయంగా వజినిస్మస్‌ని తొలగించుకోవడానికి మార్గం చెప్పాలి. దానికి వారు చేయవలసిన పద్ధతి ఒకటి వుంది. వారు ఒంటరిగా ఒక గదిలో చేరి ఒంటిమీద బట్టలు పూర్తిగా తీసివేయాలి. నేలమీద ఒక పెద్ద అద్దం పెట్టి దానికి ఎదురుగా కూర్చోవాలి. ఆ అద్దంలో తమ యోనిని చూసుకోగలగాలి. తన వేలుని యోని ద్వారంలోకి నిదానంగా పోనివ్వాలి.

కొద్ది రోజులు అలా చేసిన తరువాత వేలుని మొత్తం యోని మార్గంలోకి పోనివ్వాలి. అలా దశలవారీగా చేయడంతో భయం, సంకోచం తొలగుతూ ఆత్మవిశ్వాసం పెంపొందుతుంది. ఒక వేలుని పూర్తిగా పోనివ్వగలిగిన తరువాత రెండు వేళ్లని పోనివ్వడానికి ప్రయత్నించాలి.

ఇలా వేళ్లని తేలికగా పోనివ్వడానికి సబ్బునీ, వేజలైన్‌నీ, జైలోకైన్ జెల్లీనీ ఉపయోగించవచ్చు.

వేళ్లని యోని మార్గంలోకి పోనిస్తున్నప్పుడు అద్దంలో స్పష్టంగా చూడాలి. దానితో చాలావరకు తమ మీద నమ్మకం ఏర్పడుతుంది. అలా కొంత కాలం చేసిన తరువాత డాక్టరు చెప్పినట్లు వెడల్పుగా వుండే డైలేటార్స్ యోనిలోకి పోనివ్వాలి.

ధైర్యం ఇచ్చినా వజినిస్మస్ వున్న కొందరు స్త్రీలు స్వయంగా ఇలా చేయలేకపోతారు. అటువంటి స్త్రీలకి పూర్తి మత్తు ఇచ్చి యోనిలో వెడల్పాటి డైలాటార్‌ని వుంచాలి. పూర్తి తెలివి వచ్చిన తరువాత అందులో వుంచిన డైలాటార్‌ని చూసి అంగప్రవేశానికి యోని ఏమాత్రం చిన్నదికాదని విషయజ్ఞానాన్ని ఇవ్వాలి. కొన్ని రోజులపాటు తమంతట తాము వివిధ పరిమాణాల్లో డైలాటార్స్ వాడేటట్లు శిక్షణ ఇవ్వాలి.

ఈ రకంగా వారిలో తమ మీద నమ్మకం కుదురుతుంది. భయం తొలగుతుంది. ఆపైన భర్త ఆమె ఎడల ఆప్యాయంగా వుంటూ స్టెప్ బై స్టెప్ సంయోగంలో పాల్గొనాలి.

వజినిస్మస్‌ని ప్రేమతో చక్కదిద్దవలసిందేతప్ప ఫోర్సుతో చక్కదిద్దేదికాదు. ఇందుకు భర్త సహనం, సహకారం అత్యంత అవసరం.

కోండి. త్వరలో మామూలు అవుతారు. శాశ్వతంగా నష్టమేదో జరిగిందని భయపడకండి.

ఆ భయం, ఆందోళన వల్ల నరాలు కోలుకున్నా, అంగం స్తంభించకుండా పోతుంది. అందుకని మనసుని ప్రశాంతంగా వుంచుకోండి.

సి. హెచ్. కె. కదిరి

■ *జ్వరం వస్తే బ్రెడ్డే తినాలా?*

● జ్వరం వస్తే బ్రెడ్ తినాలని అనుకుంటారు. ఇష్టం లేకపోయినా కష్టపడుతూ తింటారు. కానీ అలా తిననవసరంలేదు. జ్వరం వచ్చినప్పుడు కొందరికి వికారం, వాంతులు వుంటాయి. అప్పుడేమీ తినబుద్ధి కాదు. అటువంటప్పుడు పళ్లరసం, గ్లూకోజు, కొబ్బరినీళ్లు, పాలు, కాఫీవంటివి తీసుకోవాలి. వికారం లేకపోతే, ఆకలి వుంటే తేలికగా అరిగే ఆహారం భుజించవచ్చు.

## జ్వరం వున్నా వరి అన్నం తినవచ్చు.

జ్వరం వున్నా వరి అన్నం తినవచ్చు.

జ్వరంగా వున్నప్పుడు జీర్ణగ్రంధులు సక్రమంగా పనిచేయవు. అందుకని అన్నం బాగా నమిలి మింగడమో, మెత్తగా వండిన అన్నం తినడమో చేయాలి. లేదా అన్నంలో మజ్జిగ వేసి మెత్తగా నలిపి తీసుకోవాలి. అన్నం పిసికి పిప్పి తీయనవసరంలేదు.

జ్వరం ఉన్నప్పుడు లంఖణం చేయనవసరంలేదు. లంఖణం చేయడంకూడా తప్పు. జ్వరంగా వున్నప్పుడు శరీరంలో అధికంగా కేలరీలు ఖర్చు అవుతాయి. అందుకని అన్నం తప్పక తినాలి. లేకపోతే నీరసపడతారు. కోలుకోవడం కూడా ఆలస్యమవుతుంది.

టైఫాయిడ్‌వంటి జ్వరాల్లో తప్ప తక్కిన జ్వరాలన్నింటిలో ఆకలి అనిపిస్తే కూరగాయలతో మామూలుగా భోజనం చేయవచ్చు.

జ్వరం వస్తే అన్నం విషం అవుతుందనే అపోహ వుంది. అది అపోహే తప్ప నిజంకాదు. అలాగే వేయించిన బియ్యం జావచేసి తీసుకోవాలనుకుంటారు. బియ్యం వేయించనవసరంలేదు. మామూలుగానే వండి తీసుకోవచ్చు.

సీరియల్



# రారా నా ఇంటిదాకా

-మేర్లపాక మురళి

అప్పుడు సాయంకాలం అయిదు గంటలైంది. సూర్యుడు ఈ తిరుణాళ్ళను చూడకుండా వెళ్ళడానికి ఇష్టంలేనట్లు పడమటి కొండలను పట్టుకుని వేలాడుతున్నాడు.

గయుడులాంటివాడు లోకంమీద తాంబూలం ఎంగిలి ఊసినట్లు సంధ్య ఎర్రగా అలుముకుంది. చరిత్రకంతా తనే ఏకైకసాక్షిఅయిన గర్వంతో, ఈ కథంతా తనకు తెలుసునన్న గర్వంతో గాలి అదో విధంగా వీస్తోంది.

ధర్మరాజు గుడి దగ్గర అప్పటికే కోలాహలం ప్రారంభమైంది. గుంజలకు కట్టిన బార్‌లైట్లు అప్పుడే వెలిగి లేతవెలుగు పూలల్లా వున్నాయి. గుడి పైభాగాన వున్న లౌడ్‌స్పీకర్లు ఇనుపడేగల్లా కనపడుతున్నాయి.

గుడి ఆవరణంతా నీళ్ళు చల్లడంవల్ల మట్టివాసన గమ్మత్తుగా తగులుతోంది.

అంతకుముందు గంట క్రితమే అర్జునుడు, ఉత్తర కుమారుడు వేషాల్లో వున్నవాళ్ళు ఎద్దులబండి ఎక్కి వీధుల్లో తిరుగుతున్నారు. గోగ్రహణానికి బయల్దేరారన్నమాట. పద్యాలు,పాటలతో అదరగొడ్తున్నారు.

బండి తమ బంధువుల ఇల్లు దాటగానే సత్యనారాయణరావు, ఆయన ముగ్గురు కుమార్తెలూ, అన్నపూర్ణమ్మ, బామ్మ గుడి దగ్గరికి బయల్దేరారు. గోగ్రహణం ఘట్టం పూర్తయ్యేది అక్కడే.

వాళ్ళు గోగ్రహణాన్ని చూడడానికే ఆ రోజు రాజాపాళెం వచ్చారు. బంధువులు అంతకుముందే ఆహ్వానిస్తూ ఉత్తరం రాయడంవల్ల అక్కడ దిగారు.

సుజనకు ఆ ఊర్లో ఇద్దరు ముగ్గురు స్నేహితురాళ్ళున్నారు. తను వాళ్లిళ్లకు వెళ్లి గుడి దగ్గరకు వస్తానని చెప్పి ఉదయమే వెళ్ళిపోయింది.

సాయంకాలపు టిఫిన్లు గట్రా ముగించి, కాఫీ తాగి బంధువులతో కలిసి సత్యనారాయణరావు కుటుంబమంతా బయల్దేరింది.

"సుజన అక్కడికి వస్తుందా?" అన్నపూర్ణమ్మ భర్తను అడిగింది.

"ఈ ఊరికి వస్తే అది మన చేతులకి దొరకదు. సాయంకాలం గుడి దగ్గరకు వస్తానని చెప్పిందికాబట్టి వస్తుంది. ఇక ఆ తరువాత మనతోబాటే వుండి పోతుంది" చెప్పాడు ఆయన.

"ఇంతకీ తిరిగి మన ప్రయాణమెప్పుడు? రేపు ఉదయమేనా?"

"ఆఁ. ఫస్ట్‌బస్‌కి వెళదాం"

వాళ్ళ వెనక నడుస్తున్న ముగ్గురు సోదరీమణులూ తమ చెల్లెలి గురించి మాట్లాడుకుంటున్నారు.

"మొత్తానికి మరిదిగారు ఇంతవరకూ ఛాలెంజ్‌లో నెగ్గలేదు. మరొక్క పది రోజులే గడువుంది"

"ఏదో ఐడియాలు వేస్తున్నాడుగానీ-ఫలించడం లేదు" పెద్దక్క ఉమ సానుభూతిగా అంది.

"మొన్నటికి మొన్న వీడియో ఐడియా అలా తిరగబడిందిగానీ లేకుంటే ఆ ముచ్చటకాస్తా అయిపోయి మనం ఓడిపోయేవాళ్ళం" రమ గండం గడిచినట్టు ఫీలవుతూ చెప్పింది.

"అది గుర్తుచేయకు. ఆ సీన్లు గుర్తొస్తేనే డోకొస్తుంది. ఇంతకీ వాటిని ఎలా చూస్తారో ఏమో పాడు" మూడో అమ్మాయి హేమ జుగుప్సనంతా కళ్లలో కూరుకుని చెప్పింది.

"ఆ యావ వున్నవాళ్ళు చూస్తారు. అంతెందుకు మీ బావ కూడా నాతో అలాంటి కేసెట్ తెచ్చి చూద్దాం అన్నాడు. నేను అంత ఎత్తు ఎగిరి కొప్పడేసరికి ఆ ఊసు ఎత్తడంలేదు. ఇంతవరకు తను అలాంటి కేసెట్లు చూళ్లేదని అన్నాడుగానీ నాకు నమ్మకంలేదు. చూసే వుంటాడు"

"ఛీఛీ" రమ అసహ్యించుకుంది.

"మన మరిది నిజంగానే 'లవకుశ' వేసి తను భార్యతో శోభనం జరిపించుకోవాలనుకున్నాడుగానీ కుదరలేదు. ఎక్కడో పొరబాటు జరిగింది"

"ఇంతకీ సుజన ఈ ఊర్లో ఫ్రెండ్స్ ఇంటికే వెళ్ళిందా?" ఉమ అనుమానంగా అడిగింది.

**15** పెద్దల అంగీకారంతో వంశీ, సుజనల పెళ్లవుతుంది. శోభన ముహూర్తం దగ్గరపడిందనగా సుజనకు మూడు రోజుల ఇబ్బంది ఎదురవుతుంది. అందుకని మరో ముహూర్తం నిర్ణయిస్తాడు సుజన తండ్రి. కానీ ఆ ముహూర్తానికి ముందే శోభనం జరుపుకోవడానికి వంశీ చేసిన మూడు ప్రయత్నాలు విఫలమవుతాయి.ఓ రోజున వంశీకి ఎక్కడినుండో ఓ వీడియో కేసెట్ అందుతుంది.దానిలో తన భార్య సుజన మరో యువకునితో శృంగారంలో పాల్గొనడం చూసి తట్టుకోలేకపోతాడు.

సుజన మిత్రురాలు వైదేహి తన వైవాహిక జీవితం గురించి చెప్తుంటుంది. చిన్నతనంలోనే తల్లిని కోల్పోయిన వైదేహిని, ఆమె మేనమామ రాజేష్‌కిచ్చి వివాహంచేస్తారు.శోభనంరోజున తన చెంతకు చేరిన వైదేహిని అనుభవించి, తర్వాత ఆమె కన్యాత్వంగురించి చెడుగా మాట్లాడి,అవమానిస్తాడు. కాపురానికి వెళ్లిన వైదేహిని ప్రతిరోజూ ఆమె ప్రియుడు ఎవరో చెప్పమని వేధిస్తుంటాడు రాజేష్. పదహారు రోజుల పండుగకి పుట్టింటికి వెళదామన్న వైదేహితో అసభ్యంగా మాట్లాడి, యాసిడ్ మొహంమీద పోస్తానంటాడు. దాంతో విసిగిన వైదేహి, భర్తని ఎదిరించి పుట్టింటికి బయలుదేరుతుంది.

"ఆఁ. పదకొండు గంటలకి మధు కూడా వెళ్లి దింపి వచ్చాడు"

"వంశీ కూడా ఈ ఊరు రానట్టే. మనం వచ్చే టప్పుడు రచ్చబండ దగ్గిరున్నాడు"

"ఏమైనా మనం జాగ్రత్తగా వుండాలి. ఛాలెంజ్‌లో నెగ్గాలి. సుజనను ఇకనుంచీ మనం ఒక్క క్షణం వదల కూడదు. రాత్రి తన ఫ్రెండ్స్ ఇంటికే వెళతానని అన్నా మనం ఒప్పుకోకూడదు. కాదూ కూడదూ అంటే మనం కూడా వెళదాం"



"ఇంతకీ తన ఫ్రెండ్స్ ఇళ్లెక్కడో తెలుసా?"

"తెలియదు. ఉదయం వెళ్లిన ఇల్లయితే మధుకి తెలుసు. మిగిలిన ఇద్దరి ఫ్రెండ్స్ ఇళ్లు తెలియవు"

"ఈ రోజు రాత్రి వాళ్లిద్దరూ కలిసే వీలు లేదులే. ఒకవేళ వంశీ ఈ ఊరు వచ్చినా మనల్ని కలుసుకో లేడు. మన బంధువుల ఇల్లు అతనికి తెలియదు"

వాళ్లు అలా మాటల్లోనే వుండగా గుడి వచ్చేసింది. ఇసుకవేస్తే రాలనంత జనం.

గుడి చుట్టూ మానవహారంలా గుంపులు గుంపులుగా నిలబడి వున్నారు.

ఊరేగింపుగా వెళ్లిన అర్జునుడూ, ఉత్తర కుమారుడూ ఇంకా రాలేదు.

గుడికి చేరడానికి చాలాముందే సుజన తల్లిదండ్రుల్ని కలుసుకుంది.

"జాగ్రత్తమ్మా! జనంలో తప్పిపోయేవు. మన బంధువుల ఇంటికి ఎలా వెళ్ళాలో తెలుసా?" సత్యనారాయణ కూతురి తల నిమురుతూ అడిగాడు.

"తెలియదు నాన్నా! మా ఫ్రెండ్స్ ఇళ్లయితే తెలుసు. మన బంధువుల ఇంటికి అక్కయ్యలు వచ్చేవారుగానీ నేను ఇదేకదా మొదటిసారి రావడం"

"అందుకేనమ్మా! మమ్మల్ని వదలకు"

"అలాగే నాన్నా" ఆమె అక్కయ్యలతో కలిసి మాటల్లోపడింది.

అందరూ వెళ్లి ఓ గుట్టమీద నిలుచున్నారు. అక్కడి నుంచి గుడి ఆవరణ స్పష్టంగా కనిపిస్తోంది.

పెద్ద కొండ ముంగిట ఆ గుడి కట్టారు. గుడిచుట్టూ చిన్న చిన్న గుట్టలు చాలానే వున్నాయి. గుట్టలంటే గుట్టలు కూడా కావు. పెద్ద పెద్ద బండరాళ్ళు.

వాళ్ళు నిలుచున్నచోట కూడా జనం బాగానే వున్నారు. అంతలో అర్జునుడూ, ఉత్తరకుమారుడూ వచ్చారు. జనం ఉత్సాహంతో కేరింతలు కొట్టారు.

బృహన్నల, ఉత్తరకుమారుడు బండి దిగారు. పద్యాలు అందుకున్నారు.

కురుసైన్యంపైకి బృహన్నల బాణాలు వదులుతు న్నాడు. భయంతో అతని వెనక నక్కిన ఉత్తర కుమారుడు అప్పుడప్పుడూ తల బయటపెట్టి చూస్తున్నాడు. ఇక మిగిలింది గోవులను మళ్ళించడం.

చీకట్లు ముదిరేకొద్దీ బార్‌లైట్లు మరింత పట్టు దలతో వెలుగుతున్నాయి. అక్కడ పగల్లా వుంది.

ఇందుకోసమే ఊర్లోంచి తోలుకొచ్చి, కొండ మొదట్లో వుంచిన పశువులను గుడివైపు తోలారు పశువుల కాపరులు.

మొత్తం ఇరవైదాకా వున్నాయి. అన్నీ దూడలే. అవి చెంగుచెంగున దూకుతున్నాయి.

బృహన్నల, ఉత్తరుడు వేషాల్లోవున్నవాళ్ళు గుడి ద్వారం దగ్గర్నుంచి బయటకొచ్చి అవతలవైపు తోలడం మొదలుపెట్టారు. జనాన్నంతా చుట్టుకొని వాటిని ఊర్లోకి తరిమివేయడంతో ఆ ఘట్టం పూర్తవు తుంది. జనాన్ని చూడడం బాగా అలవాటైన దూడలు ఏమాత్రం కంగారు లేకుండా మెల్లగా కదులుతున్నాయి.

సరిగ్గా ఆ సమయంలో వాటిముందు టపాసులు పేలడం ప్రారంభించాయి.

దాదాపు అయిదు మీటర్ల వుండే టపాసుల సరం పెద్ద శబ్దంతో పేలుతున్నాయి.

దూడ ఒకటి ఆ శబ్దాలకు బెదిరి జనంవైపు దూసుకుపోయింది. జనంలో కలకలం.

దూడ మీదకు వస్తుందన్న ఉద్దేశంతో అక్కడున్న జనం పక్కకు పరుగెత్తారు.

ఆ తరువాత వున్నవారికి ఏం జరుగుతూ వుందో తెలియడంలేదు. కానీ పరుగెత్తారు.

దాంతో జనం కకావికలమై పోయారు.

కొంతమంది వచ్చి మీదపడడంతో రాబోతున్న అపాయాన్ని సత్యనారాయణ పసిగట్టాడు.

అంతవరకు భార్య చేయి పట్టుకుని వున్న ఆయన తక్కున ఆమెను వదిలి, తల్లి చేతిని పట్టుకున్నాడు.

పరుగులాంటి నడకతో ముందుకి ఉరికాడు.

"కమాన్ బేబీస్. జనం వచ్చి మీదపడతారు" అని పెద్దగా అరిచాడు.

అప్పటికే జనం దూసుకొచ్చేస్తున్నారు. ఏం జరుగుతూ వుందో ఎవరికీ తెలియని గందరగోళం. టపాసులు ఎడతెరిపి లేకుండా పేలుతూనే వున్నాయి.

అవి టపాసులు అని తెలియని జనం వీధుల్లో పరుగెడుతున్నారు.

సత్యనారాయణ తల్లి చేతిని వదలకుండా మిగిలిన వాళ్ళు వస్తున్నారో లేదో చూసుకుంటూ నడుస్తూనే వున్నాడు. మరో పది నిముషాలకు ఆయన బంధువుల ఇంటికి చేరుకున్నాడు.

వీధి వసారాలో నిలబడి మిగిలినవాళ్ళకోసం చూస్తున్నాడు.

ఒక్కొక్కరే తన కుటుంబ సభ్యులు వస్తున్నారు. తొలుత అన్నపూర్ణమ్మ ఆయాసంతో వచ్చి భర్తను చూసి రిలాక్సింగ్‌గా నవ్వింది.

మరో అయిదు నిముషాలకు ముగ్గురు కూతుర్లూ వచ్చారు. రాని ఒక్క కూతురికోసం ఆయన ఆందో ళనతో చూస్తూ అక్కడే నిలబడ్డాడు.

• • •

తిరుణాళ్ళ జనంలో కలిసిపోయిన గణేష్ దాదా మాటిమాటికీ ఫోటోవంకా, ఆమెవంకా చూస్తున్నాడు.

అతను ఆ టౌన్‌కు చెందినవాడే. నిజం దాదా కాక పోయినా 'దాదా' అని పిలుచుకోవడం అంటే ఇష్టం. తన ధైర్యసాహసాల్ని గురించి గొప్పలు చెప్పుకోవ డం అతని హాబీ. తనను చూస్తే టౌనంతా హడల్ అనీ, పోలీసులే సెల్యూట్ కొడతారని చెబుతుంటాడు. తనకు ఎమ్మెల్యే క్లోజ్ ఫ్రెండ్ అనీ, ఎంపీ ఏ ఫంక్షన్‌కైనా తనని పిలుస్తాడనీ డంబాలు పలుకుతుంటాడు.

అతని విషయం తెలిసినవాళ్ళెవరూ అతనితో అయిదు నిముషాలకంటే ఎక్కువ మాట్లాడడానికి ఇష్టపడరు. అప్పటికే తన దాదాగిరీ ఎలాంటిదో చెబుతూ సగం మెదడు తినేస్తాడు.

తనేమిటో తనకు తెలుసు కనుక మాటలవరకే వుంటాడుగానీ ఎక్కడా చేతల్లోకి దిగడు. గొప్పలు చెప్పుకుంటూ వుంటాడేగానీ ఇంతవరకూ ఒక్కరి తోనూ పేచీకి దిగి ఎరగడు.

వంశీ టౌన్‌కెళ్ళినప్పుడంతా ఇతనితోనే కాలక్షే పం చేస్తుంటాడు. దాంతో మంచి స్నేహితుడయ్యాడు.

రెండు రోజుల క్రితం వంశీ ఒక ఫోటో ఇచ్చి ఈమెను కిడ్నాప్ చేయాలంటే షాక్ తిన్నాడు. అప్పటికే చెమటలు పట్టేశాయి భయంతో.

"నిజం కిడ్నాప్‌కాదు గణేష్‌దాదా. ఉత్తుత్తి కిడ్నాపే. ఆమె ఎవరో కాదు–నా భార్యే" అని మొదలుపెట్టి తమ ఛాలెంజ్ గురించి వివరించాడు.

"టపాసులు పెట్టాక జనం చెల్లాచెదురవుతారు. ఈ సమయంలో నువ్వు ఆమెని పట్టుకుని కార్లోకి ఎక్కించెయ్. కార్లో కూర్చోగానే మన ప్లాన్ చెప్పు. కామ్‌గా అయిపోతుంది. చేయి పట్టుకునేటప్పుడే చెవిలో మెల్లగా నా పేరు చెప్పు. తనే వచ్చి కారు ఎక్కేస్తుంది. సరేనా?"

అన్ని రోజులూ తనో దాదా అని చెప్పుకుని, ఇప్పుడు వెనక్కి తగ్గితే తన పరువు పోతుందనీ, స్వయానా భార్యనే ఉత్తుత్తి కిడ్నాప్‌చేయమని అంటు న్నాడనీ గ్రహించిన గణేష్ దాదా ఒప్పుకున్నాడు.

తనతోపాటు ఒక శిష్యుడ్ని వేసుకుని కారు తీసు కెళ్ళి గుడి వెనకభాగాన చెట్లచాటున పార్క్‌చేశాడు. శిష్యుడ్ని టపాసులు కాల్చమన్నాడు.

జనం చెల్లాచెదురుకాగానే ఫోటోలోవున్న సుజన చేయి పట్టుకున్నాడు.



## గర్వాలులేని గొప్పనటుడు

"బాలకృష్ణ మనసు చాలా గొప్పది. సినిమా కథంతా తానే డామినేట్ చేయాలని ఏనాడూ అను కోడు. మంచి చిత్రంకోసం తపనపడతాడు. గర్వాలూ, భేషజాలూ ఆయనలో లేవు.

ఆయన నటిస్తున్న 'బొబ్బిలి సింహం' గొప్ప చిత్రం. ఇందులో బాలయ్యను చూస్తుంటే అచ్చం వాళ్ల నాన్నగారిని చూసినట్టే అనిపిస్తుంది. ఇందులో గొప్ప నటుడిగా బాలకృష్ణ మరో మారు నిరూపించు కున్నాడు"– అని శారద బాలకృష్ణని మెచ్చుకుంటూ అభినందిస్తోంది.



## 70 సార్లు పెళ్ళాడిన మహిళ

అమెరికాలోని అలబామాలో నివసించే ఏభై ఏళ్ళ యాలిస్ గోర్లే 'ప్రపంచంలో అత్యధికంగా పెళ్ళిళ్ళు చేసుకున్న మగువ'గా పేరు తెచ్చుకున్నా, ప్రస్తుతం ఒంటరిజీవితమే గడుపుతోంది. పదిహేనేళ్ళ వయసులో మొదటిపెళ్ళి చేసుకున్న ఆమె, 35 సంవత్సరాల కాలంలో 70 మందిని, అంటే సగటున ఏడాదికి ఇద్దరిని పెళ్లాడింది.

"నా భర్తలలో కొందరు దుర్మార్గులున్నా చాలా మంది మంచివాళ్లే. అయితే వారి అవలక్షణాలకి నాకు ఒళ్లుమండి, వారి దురలవాట్లను సహించలేక విడాకులు తీసుకోవడం జరిగింది" అంటోంది 'వెయిట్రెస్'గా పనిచేస్తున్న యాలిస్.

యాలిస్‌కి మొదటిపెళ్లిద్వారా 1960లో ఒకరు, మూడోపెళ్లిలో మరో ఇద్దరు సంతానం కలిగారు.

ఎందరినో పెళ్లాడి విడాకులు తీసుకున్నా యాలిస్ తాను మళ్ళీ పెళ్లాడి, జీవితాంతం కాపురం చేయగల వ్యక్తి ఎక్కడో వుండి వుంటాడనే నమ్ముతోంది. "ఏహో కొన్ని వైఫల్యాలు ఎదురైనంత మాత్రాన నేనీ విషయంలో నిరాశపడను" అంటోందామె. ◆

ఆమె షాక్ తిని, భీతితో అతనివైపు చూసింది.

"వంశీ" అన్నాడు మెల్లగా.

"వంశీ..." ఆమె ఏదో అడగబోతూ వుండగానే అప్పటికే కంగారుతో వణుకుతున్న అతను ఆమె నోరును సుతారంగా చేతుల్తో మూసి ముందుకి లాగాడు.

ఆమెను కారు దగ్గరికి తీసుకొచ్చి డోర్ తెరిచి లోపలికి తోశాడు.

"వంశీ..." ఆమె మాటలు అతనికి వినిపించడం లేదు. ఎంత ఉత్తుత్తి కిడ్నాప్ అయినా కిడ్నాప్ అంటే కిడ్నాపే. అందుకే ఎంత ధైర్యంగా వుందామనుకుంటున్నా వీలుపడడంలేదు. భయంలాంటి ఫీలింగ్ అతని బలహీనమైన గుండెను మరింత బలహీనంగా చేస్తోంది. శిష్యుడు వచ్చి డ్రైవింగ్ సీట్లో కూర్చున్నాక అతనూ ఆమె పక్క వెనక సీట్లో కూర్చున్నాడు.

"వంశీ ఎక్కడున్నాడు? నన్ను ఎక్కడికి తీసుకెళుతున్నారు?" ఆమె మాటలకి విసుగొచ్చింది.

భయంభయంగా ఆమె అడుగుతుంటే బీపీ రైజ్ అయిపోతున్నట్లనిపించి–"కాసేపు మాట్లాడకుండా కూర్చుంటారా? ఇది ఉత్తుత్తి కిడ్నాపింగే. మిమ్మల్ని వంశీ మీ ఊరి పొలిమేరల్లో వున్న మామిడితోటలోని ఫార్మ్‌హౌస్‌కి తీసుకురమ్మన్నాడు" అని చెప్పి ముఖానికున్న చెమటను తుడుచుకున్నాడు.

"అదీ...అదీ..." ఆమె ఏదో మాట్లాడితే తనకూ అనవసరంగా భయం కలుగుతుందని, తనని తాను రక్షించుకునే ప్రయత్నంలో ఆమె నోటిని మళ్లీ చేతుల్తో మూశాడు. అయితే ఈసారి మాత్రం బలంగా.



## చిగురిస్తున్న ఆశలు

'అబ్బా–ఇది ఏమి వానా?' అంటూ తడిసి తన్మయంగా నటించిన వాణీవిశ్వనాథ్, ఆ దెబ్బతో పేద్ద గ్లామర్‌స్టార్ అయిపోతుందనుకున్నారంతా–ఆమెతో సహా! కానీ మళ్లీ వెనకపడిపోయింది.

ఈ స్థితిలో 'తోడికోడళ్లు' హిట్ ఊరటనిచ్చింది. 'గ్యాంగ్‌మాస్టర్' విడుదల కాబోతోంది. ఇందులో డా॥ రాజశేఖర్‌తో నటించిన వాణీ, ఆకర్షణీయంగా వేడి వేడిగా నటించిందట. దీంతోనైనా ఆమె ఆశలు ఫలిస్తాయేమో చూడాలి.

కారు దాదాపు పది కిలోమీటర్లు పరుగెత్తి మామిడితోటలోకి దారితీసింది.

• • •

వంశీ సాయంకాలం ఆరుగంటలనుంచే తయారవడం మొదలుపెట్టాడు.

శుభ్రంగా అరగంటపాటు స్నానం చేశాడు. పట్టు పంచె, తెల్లటి జుబ్బా తొడుక్కున్నాడు. సెంట్ స్ప్రే చేసుకున్నాడు. ముఖానికి బాగానే పౌడర్ పట్టించాడు. తనూ, సుజన తినడానికి చపాతీలూ, వేరుశనగ పప్పు పచ్చడి తల్లిదగ్గిర తయారుచేయించి క్యారియర్‌లో సర్దుకున్నాడు. ఓ సంచీలో మల్లెపూల దండల్నీ, స్వీట్‌ప్యాకెట్సీ, అగరుబత్తీల్నీ పెట్టుకున్నాడు. స్లిప్పర్స్ తొడుక్కుని మామిడితోటకు బయల్దేరాడు.

ఆ మామిడితోట అతనిదే. అందులో పాతకాలం నాటి సున్నపుమిద్దె ఒకటుంది. అక్కడక్కడా పెచ్చులు ఊడిపోయినప్పటికీ స్ట్రాంగైన బిల్డింగ్ అది. మామిడితోటను చూసుకునే ఓ జంట అందులో వుంటుంది.

అంతక్రితం రోజే ఆ జంటకు డబ్బులిచ్చి వాళ్ళ ఊరికి పంపించేశాడు. రెండు రోజులవరకు తిరిగి రావద్దన్నాడు.

ధర్మరాజు తిరుణాళ్ళలో ఒకానొక ముఖ్యమైన ఘట్టం గోగ్రహణం. ప్రతి సంవత్సరం సత్యనారాయణ తన కుటుంబ సభ్యులతో తిరుణాళ్ళకి వెళతాడని తెలుసు. అందుకే తను సీన్‌లో లేకుండా ప్లాన్‌ని పకడ్బందీగా తయారుచేసుకున్నాడు.

దాదాకాని దాదా గణేష్‌కి మొత్తం పనినంతా అప్పగించాడు. ఫార్మ్‌హౌస్ తాళం కూడా ముందురోజే అతనికిచ్చాడు.

ఈ ప్లాన్‌కి వంశీ పెట్టుకున్న పేరు 'బందరులడ్డు'. బందరులడ్డు సక్సెస్ అయి, బందరులడ్డులాంటి



**పోతే పోనీ...**

"నా గురించి 'ఆమె తాగుబోతు, షూటింగ్‌కి టైముకి రాక నిర్మాతల్ని ఇబ్బందిపెడుతుంది' లాంటి రకరకాల పుకార్లు పుట్టటంవల్ల, నాకు అవకాశమివ్వాలనుకున్న చాలామంది వెనకాడారు. అందువల్ల నేనెన్నో ఛాన్సులు పోగొట్టుకున్నాను.

అయితే ఆయా సినిమాలలో నటించనందుకు నిజానికి నాకిప్పుడు సంతోషంగా వుంది. పుకార్లకే అంత విలువిచ్చారంటే ఆ నిర్మాతల ఆలోచనా ధోరణి సరిగ్గా లేదన్నమాటేకదా! అలాంటివాళ్ళ సినిమాలలో నటిస్తే ఎన్నితిప్పలు పడవలసివచ్చేదో!" అంటోంది మనీషా కొయిరాలా.

సుజనతో మరో అరగంటకు శోధనం ఖాయమని ఎందుకనో అనిపిస్తోంది అతనికి.

సాయంకాలంనుంచీ ఎడమకన్ను అదేపనిగా కొట్టుకుంటోంది. మరి ఇది శుభసూచకమో, అశుభసూచకమో ఖచ్చితంగా తెలియదు.

ఈపాటికి గణేష్‌దాదా సుజనను కార్లో తీసుకొచ్చేసి వుంటాడు. జనంలో పడి తన చిన్న కూతురు తప్పిపోయిందని మామయ్య అనుకుంటారే తప్ప ఇలా తను తీసుకొచ్చేసి వుంటానని ఊహించలేరు. తమ బంధువుల ఇంటికి దారి తెలీక, ఫ్రెండ్స్ ఇళ్ళకు వెళ్ళుంటుందని అనుకుంటారు. సుజన చిన్నపిల్ల కాదు కనుక కంగారుపడే అవకాశం లేదు.

ఏ తెల్లవారుఝామునో, తిరిగి సుజనను రాజుపాలెంలో వదిలేస్తే సరిపోతుంది. తనకు బంధువుల ఇల్లు తెలుసుగనుక అక్కడికి కొద్ది దూరంలో దిగబెట్టేస్తే వెళ్ళిపోతుంది. రాత్రంతా ఫ్రెండ్ ఇంట్లో వున్నాననీ, అతికష్టంమీద ఇల్లు కనిపెట్టాననీ సుజన అంటే ఇక ఏం మాట్లాడలేరు. దాంతో తన శోధనం సుఖాంతం అయిపోతుంది.

ఇలా ఊహించిన వంశీకి మరింత ఉత్సాహం వచ్చింది. నడకవేగం హెచ్చించాడు. తోటలోకి మలుపు తిరిగాడో లేదో ఓ ఆకారం ఎదురొచ్చింది. అంత చీకట్లోనూ ఒకరినొకరు గుర్తుపట్టగలిగారు.

"నువ్వేనా?" వంశీ తొందరతొందరగా అడిగాడు.

"ఆఁ - ఈ గణేష్‌దాదా అంటే తమాషా అనుకున్నావా? అందుకే ఎమ్మెల్యే అంటూ వుంటాడు. నీలాంటివాడు ఒక్కడుంటే ఏకబిగిన మూడు నియోజకవర్గాల్లో గెలిచెయ్యొచ్చు అని. లోపలుంది మీ ఆవిడ. ఎందుకైనా మంచిదని తాళంవేసి తీసుకొచ్చాను. ఇదిగో తాళంచెవి" గణేష్‌దాదా చేయి ముందుకు తోశాడు.

వంశీ తాళంచెవిని తీసుకున్నాడు.

"చాలా థాంక్స్ దాదా. రేపు వచ్చి ప్రతిఫలాన్ని ద్రవరూపంలో ఇచ్చుకుంటాలే"

"దానిదేముందిలే భయ్యా. ఈ రోజు ఎంపీ పార్టీకి పిలిచాడు. నాతో పార్టీ చేసుకోవడమంటే భలే సరదాలే. కానీ కిడ్నాపింగ్ వుందని చెప్పి వచ్చేశాను"

"మన ఎంపీకి నీ కంపెనీ సరదాగానే వుంటుందిలే. తలలో ఏదైనా వుంటే తెలుస్తుంది ఆ బాధ" శిష్యుడు జోక్ కట్‌చేశాడు. కానీ గణేష్‌దాదా పట్టించుకోలేదు.

"ఓకే భయ్యా! వస్తాం! లాస్ట్‌బస్‌కి వెళతాం. కారును ఉదయం మెకానిక్ షెడ్‌కి ఇచ్చేయ్"

"అలానే"

గణేష్‌దాదా, అతని శిష్యుడూ వెళ్ళిపోయారు.

వంశీ సంచిలోని మల్లెపూలని ఓసారి వాసన చూసి ముందుకి కదిలాడు.

తోట మధ్యలోని ఆ ఇల్లు వెన్నెలతో వెల్లవేసినట్లుంది. హాలు మధ్యలో వున్న పాలబల్బ్ కిటికీల్లోంచి కూడా వెలుగును బయటికి చిమ్ముతోంది.

వంశీ దాన్ని సమీపిస్తున్నకొద్దీ మన్మథుడే స్వయంగా వచ్చి తనకు చక్కలిగింతలు పెడుతున్నట్లు అదోలా ఫీలయిపోతున్నాడు.

తాళంచెవితో తాళం తీసి తలుపుని వెనక్కి తోశాడు. హాలు మధ్యలో వున్న వ్యక్తిని చూసి చిన్న జర్క్ ఇచ్చాడు. రక్తమంతా తలలోకి చిమ్మింది.

అలా ద్వారం దగ్గరే నిలబడిపోయాడు.

ఆమె-సుజన పెద్దక్కయ్య-ఉమ.

• • •

'బందరులడ్డు' అని ముద్దుగా పిలుచుకున్న ప్లాన్ ఫెయిలవడంతో బుర్రంతా బ్లాంక్ అయిపోయింది వంశీకి. మరో ఐడియా వచ్చేలోపు తనకు పోస్టులో వచ్చిన కేసెట్ విషయం తేల్చేయాలనుకున్నాడు.

తమ పెళ్లయిన తరువాత మద్రాసు కిల్‌పాక్ సబ్ ఇన్‌స్పెక్టర్ శరవణన్ తిరిగి వెళుతూ చెప్పిన మాటలనూ-తను దొంగ టెలిగ్రాం ఇచ్చినప్పుడు మామయ్య చిట్టిబాబే ఇదంతా చేసుంటాడని అనుమానించడం-వీటన్నిటినీ కలిపి ఆలోచించాడు. సుజన వెనుకనున్న చిట్టిబాబుది మద్రాసు అనీ, ఈ కేసెట్టూ అతనే పంపించి వుంటాడని నిర్ధారించుకున్నాడు.

చిట్టిబాబు అనే ఈ కుర్రాడు సుజనతో ప్రేమలో పడి వుంటాడు. సుజన తిరస్కరించి వుంటుంది. దాంతో పగబట్టి వుంటాడు. తమ కుటుంబంలో కలతలు రేపడానికి ఈ కేసెట్ తయారుచేసి పంపించి ఉంటాడు. వన్‌సైడ్ లవ్‌లోనే పగ, ప్రతీకారం పుడతాయి. ప్రేమ రెండువైపులనుంచీ వుంటే ఏ ప్రేమికుడూ తన ప్రేయసి కష్టాలపాలవ్వాలని కోరుకోడు. భగవంతుడు కనిపించిన తరువాత ప్రాపంచిక విషయాలకు అందుడైపోయినట్లు ప్రేమించినవాడు పగ, ప్రతీకారాలకు అతీతుడవుతాడు. అందువల్ల చిట్టిబాబు డెస్పరేట్ అయి, ఆ స్థితిలో ఇంతటి సాహసానికి ఒడిగట్టి వుంటాడని వంశీ కరెక్టుగానే ఊహించాడు.

ఇంతటితో దీనికి ఫుల్‌స్టాప్ పెట్టాలని నిర్ణయించుకోవడంవల్లే మద్రాసుకు బయల్దేరాడు.

మద్రాసులో దిగి, మంచి హోటల్‌లో గది తీసుకున్నాడు. స్నానం, భోజనం ముగించిన తరువాత పోలీసుస్టేషన్‌కి ఫోన్‌చేశాడు. శరవణన్ దొరికాడు. తనను తాను పరిచయం చేసుకున్నాడు.

"ఎన్నా మాప్పిళే? ఎప్పువందాచ్చి?" అని అర్థమయ్యిందో లేదోనని "ఎప్పుడుడా వస్తివి?" అని చండాలపు తెలుగులో అడిగాడు.

"ఉదయమే వచ్చాను సార్. మీతో చిన్నపని వుంది"

"ఇప్పుడే డ్యూటీకి వస్తిని. నీదా ఇక్కడికి వచ్చేయి"

"అలానే సార్. మరో పావుగంటలో అక్కడికి వచ్చేస్తాను" ప్యాంటూ, షర్టూ మార్చుకుని పోలీసు స్టేషన్‌కి వెళ్ళాడు వంశీ.

ముందే ఫోన్ చేయడంవల్ల గుర్తుపట్టి ఆహ్వానించాడు శరవణన్.

ఓ పోలీసు కానిస్టేబుల్‌తో కాఫీ పట్రమ్మనిచెప్పి- "మీ మామయ్య బాగా వున్నాడా?" అని అడిగాడు.

"బావున్నారండీ. ఆయనకి తెలియదు. నేనిక్కడికి వస్తున్నట్లు"

ఏదో జరిగిందని పోలీసు బుర్రకి తట్టింది.

"ఎన్నా ఆచ్చి మాప్పిళై?" సందేహంగా అడిగాడు.

పోస్టులో తనకు కేసెట్ వచ్చిన విషయమూ, అందులో ఏం వున్నదీ చెప్పాడు.

"కేసెట్ తెస్తివా?"

"ఆఁ"

కేసెట్ తీసుకుని మరో గదిలోకి దారితీశాడు శరవణన్. అక్కడున్న వీసీఆర్‌లో కేసెట్ పెట్టి ప్లే చేశాడు. అంతా చూసి, తిరిగి గదిలోకి వచ్చాడు. ఆయన ముఖంలో ఆందోళన కొట్టొచ్చినట్లు కనిపిస్తోంది.

"ఇదంతా ఆ బాస్టర్డ్ పనే. అయితే కేసెట్‌లో వున్నది వాడుకాదు. కానీ దీన్ని నమ్మవద్దు నువ్వు. అంద పొన్ను మంచిపిల్ల"

"నేను నమ్మడంలేదు సార్. సుజన ఎలాంటి అమ్మాయో నాకు తెలుసు. తను చేసిన పనిని ధైర్యంగా ఒప్పేసుకోగలదు. సమయం రాక చిట్టిబాబు గురించి చెప్పలేదుగానీ లేకుంటే చెప్పేది. ఇప్పుడు సడన్‌గా ఆమెను అడగడం ఇష్టంలేకపోయింది. అందువల్లే అతని గురించి తెలుసుకోవడానికి స్వయంగా మీ దగ్గిరికి వచ్చాను" అన్నాడు వంశీ.

"నువ్వు రొంబా నయ్యా. నిన్ను మొదటిసారి చూసినప్పుడే జంటిల్‌మాన్ అనుకున్నాను" శరవణన్ రిలీఫ్‌గా అన్నాడు.

కాసేపాగి చిట్టిబాబు, సుజనకు మధ్య నడిచిందంతా చెప్పి- "చివరికి ఆ బాస్టర్డ్ నువ్వెలా కల్యాణం చేసుకుంటావో చూస్తానని సుజనను బెదిరించాడు. వాడు పెళ్లి పందిట్లో ఏదైనా రభస చేస్తాడేమోనని నేను వచ్చాను. కానీ వాడు రాలేదు"

-అని ముగించాడు.

**(ఇంకావుంది)**

# రోమాన్స్‌కి సమయం దొరకని సుందరి



ఏ నటికైనా ఓ సూపర్‌హిట్ చిత్రంలో నటిస్తే చాలు. అవకాశాలు ఇట్టే వస్తాయి. కొత్త నటి ఇంద్రాణీబెనర్జీ విషయంలో అదే జరిగింది. అందమైన ముఖం, చక్కటి శరీరసౌష్టవంతో నాజూకుగా వుండే ఇంద్రాణీబెనర్జీ రెండవ నాయిక పాత్ర పోషించిన 'దలాల్' పెద్ద హిట్ అయింది. ఇప్పుడామె అయిదు చిత్రాల షూటింగ్స్‌లో తీరికలేకుండా వుంది. మరికొన్ని ఆఫర్లు వున్నాయి.

కలకత్తాలో పుట్టి పెరిగిన ఇంద్రాణీబెనర్జీ డిగ్రీదాకా చదువుకుంది. ఆమెకి నటన, నృత్యాలపై ఆసక్తివున్నా నటనని వృత్తిగా స్వీకరించాలనుకోలేదు. అయితే 'స్టార్‌డస్ట్' సినిమా పత్రిక యాక్టింగ్ అకాడమీ పెట్టి, కొత్తవారిని చేర్చుకుంటున్నట్టు ప్రకటించినప్పుడు, ఆమెకి చేరాలనే ఆసక్తి కలిగింది. పోటీని తట్టుకుని అందులో ఎంపిక కావడంతో అప్పుడు ఇంద్రాణీబెనర్జీ నటిగా రాణించాలని నిర్ణయించుకుంది.

నటనలో శిక్షణ పూర్తయిన వెంటనే 'దలాల్' తర్వాత ఇతర సినిమాల్లో త్వరగా ఛాన్సుల పంట పండించుకున్న ఇంద్రాణీ, "నేను నటనలో ఎంతగా నిమగ్నమవుతానంటే, తోటి నటులతో రొమాన్స్ గురించి ఆలోచించడానికీ, వారి ఆకర్షణలో పడడానికీ నాకు సమయమే దొరకదు" అని చెప్పుకుంటోంది.

"ఇవాళ ఒకరితో ఖుషీగా తిరిగి మర్చిపోయి, రేపు మరొకరితో కులికే తత్వానికి నేను వ్యతిరేకిని" అంటోందామె. "ఒకవేళ నేనిక్కడ రాణించకపోతే కలకత్తా తిరిగెళ్లిపోతాను. అక్కడ బెంగాలీ సినిమాల్లో స్థిరపడతాను" అని చెబుతోంది ఇంద్రాణీబెనర్జీ.

# అరెస్ట్ చేసినప్పుడు మన హక్కులు

మనది ప్రజాస్వామ్యదేశం. స్వాతంత్ర్యం, వ్యక్తి స్వేచ్ఛ, సమానత్వాల ప్రాతిపదికపై ప్రజలు తమ రాజ్యాంగాన్ని రచించుకున్నారు. న్యాయపరిపాలన, సామాజిక న్యాయం కల్పించడానికి ప్రజల వాక్స్వాతంత్ర్యం, వ్యక్తిగత స్వేచ్ఛవంటి ప్రాథమిక హక్కులకి భంగం వాటిల్లకుండా రక్షించడానికి, అరాచకశక్తులనుండి వ్యక్తిని కాపాడడానికి, శాంతిభద్రతలను సంరక్షించడానికి న్యాయస్థానాలు, చట్టాలు, పోలీసుయంత్రాంగం ఏర్పర్చుకున్నాం. కానీ నేడు సామాన్యుడికి న్యాయం అతి ఖరీదైన వ్యవహారంగా మారిపోయింది.

## అరెస్ట్ ఎలాచేస్తారు?

చట్టప్రకారం ఒక పోలీసు ఆఫీసర్ వారెంట్‌తోగానీ, వారెంట్ లేకుండాగానీ మీ దగ్గరకొచ్చి "యూ ఆర్ అండర్ అరెస్ట్" అని మిమ్మల్ని అరెస్ట్ చెయ్యవచ్చు. కానీ మిమ్మల్నెందుకు అరెస్ట్ చేశారో తెలపకుండా, కోర్టులో హాజరు పరచకుండా, ఒక స్టేషన్‌నుండి ఇంకో స్టేషన్‌కి తరలిస్తూ రోజులతరబడి మీ బంధువులకుగానీ, స్నేహితులకుగానీ మీ ఆచూకీ తెలియనివ్వక పోవడం చట్టవిరుద్ధం. పోలీసులకు అలా చేసే అధికారం ఏ చట్టం కల్పించలేదు.

## ముద్దాయంటే ఎవరు?

ఎవరినైనా పోలీసులుఅరెస్ట్‌చేసినా లేక వారిమీద ఏ న్యాయస్థానంలోనైనా క్రిమినల్ కేస్ ట్రయిల్ పెండింగ్‌లోవున్నా,వారిని 'ముద్దాయి' అంటారు.

## ముందస్తు బెయిలు హక్కు

చాలాసార్లు వ్యాపారంలో సంభవించే గొడవలవల్లగానీ, లేక రాజకీయ విభేదాల కారణంగాగానీ భాగస్వాముల్ని లేక ప్రత్యర్థుల్ని, వారేనేరం చేయకపోయినా, లేక వారు చేసింది సివిల్‌కోర్టు పరిధిలో పరిష్కారం పొందవలసినదయినా తరచుగా వారిని క్రిమినల్ కేసుల్లో ఇరికిస్తుంటారు.

అటువంటి పరిస్థితుల్లో మీరు చిక్కుకుంటే సెషన్స్‌కోర్టులోగానీ, హైకోర్టులో గానీ ముందస్తు (యాంటిసిపేటరి) బెయిలు కోసం దరఖాస్తు చేసుకునే హక్కు మీకుంది. కోర్టు మీకు ఆ బెయిలు మంజూరు చేయొచ్చు. ఆ తర్వాత పోలీసులు మిమ్మల్ని అరెస్ట్‌చేసిన పక్షంలో కోర్టు మంజూరు చేసిన బెయిలు ఆర్డర్ ప్రకారం కావలసిన స్వంత పూచీకత్తుపై మిమ్మల్ని పోలీసులు విడిచిపెట్టాలి. (సెక్షన్ 438 సి.ఆర్.పి.సి.)

## కారణం అడిగే హక్కు

ఒక పోలీసు ఆఫీసర్ లేక మరెవరైనా ఒక వ్యక్తిని వారెంట్ లేకుండా అరెస్ట్‌చేసినప్పుడు, వెంటనే ఏ కారణాలవలన అరెస్ట్ చేస్తున్నారో, నేరానికి సంబంధించిన పూర్తి వివరాలతో సహా ఆ వ్యక్తికి తెలపాలి.

ముద్దాయిపై ఆరోపించబడిన నేరం నాన్-బెయిలబుల్ కాకపోతే పోలీసు ఆఫీసర్ "బెయిల్ తీసుకొని విడుదల కావచ్చని" ముద్దాయికి తెలిపి అతని తరపున జామీన్‌దారులనుకూడా ఏర్పాటు చేయొచ్చు. (సెక్షన్ 50 సి.ఆర్.పి.సి.)



**నేడు సామాన్యుడికి న్యాయం అతి ఖరీదైన వ్యవహారంగా మారిపోయింది. వ్యక్తి స్వేచ్ఛ ప్రతి పౌరుడికి రాజ్యాంగం ప్రసాదించిన ప్రాథమిక హక్కు. ప్రభుత్వంగానీ పోలీసులుగానీ ప్రాథమిక హక్కుల్ని అతిక్రమించడం నేరం. పోలీసులు ప్రజాసేవకులు మాత్రమే. నేరస్థుల్ని విచారించి శిక్షించే అధికారం, బాధ్యత న్యాయస్థానాలదే తప్ప పోలీసులది కాదు.**

## ఇరవైనాలుగు గంటలలో మేజిస్ట్రేట్ ముందు...

అరెస్టయి పోలీసు కస్టడీలో వున్న ప్రతి ముద్దాయిని ఆలస్యం చేయకుండా ఇరవై నాలుగ్గంటలలో అతి చేరువలో వున్న మేజిస్ట్రేట్ ముందు హాజరు పరచాలి. మేజిస్ట్రేట్ అనుమతి లేకుండా ఏ ముద్దాయినీ ఇరవైనాలుగ్గంటలకంటే ఎక్కువసేపు పోలీసులు తమ కస్టడీలో వుంచకూడదని ఆర్టికల్ 22(2)ద్వారా భారత రాజ్యాంగం నిర్దేశిస్తోంది.

చట్టపరమైన ఈ అంశం నుండి తప్పించుకోవడానికి పోలీసులు ముద్దాయిని ఒక స్టేషన్ నుండి ఇంకో స్టేషన్‌కి తరలిస్తూ, ముద్దాయిని శారీరకంగా హింసిస్తూ-ముద్దాయి తప్పించుకున్నాడని, ఇంకా దొరకలేదని ముద్దాయి బంధువుల్నీ, న్యాయస్థానాల్నీ తప్పుదారి పట్టిస్తుంటారు.

అటువంటి పరిస్థితుల్లో ముద్దాయి భార్యాపిల్లలుగానీ, స్నేహితులుగానీ ముద్దాయిని కోర్టు ముందు వెంటనే హాజరుపరచాలని మేజిస్ట్రేట్ కోర్టులో పిటిషన్ దాఖలుచేయవచ్చు.

ముద్దాయిని పోలీసులు దాచినచోటు గనక ఖచ్చితంగా తెలిస్తే, సెర్చ్ పిటిషన్‌వేసి సెక్షన్ 97 సి.ఆర్.పి.సి.ప్రకారం సెర్చ్ వారెంట్‌కూడా పొందవచ్చు. అప్పటికీ పోలీసులు ప్రతిస్పందించకపోతే ముద్దాయితరపువారు హైకోర్టుని ఆశ్రయించి హెబియస్ కార్పస్ రిట్‌పిటిషన్ దాఖలు చేయవచ్చు.

## వైద్యపరీక్షలు చేయించుకునే హక్కు

పోలీసులు ముద్దాయిల్ని కొట్టడం, హింసించడం మనకు తెలుసు. కానీ చట్టంలో ఎక్కడాకూడా పోలీసులకు ఆ అధికారంలేదు. అందుకే చట్టం ముద్దాయికి వైద్యపరీక్షలు చేయించుకునే హక్కు కల్పించింది. పోలీసుల హింస కారణంగాగానీ, మరేవిధంగాగానీ ముద్దాయి శరీరంపై ఏర్పడిన గాయాల పరీక్ష నిమిత్తం, కోర్టువారిని ముద్దాయి కోరిన ప్రకారం, ఎవరైనా రిజిస్టర్డ్ మెడికల్ ప్రాక్టీషనర్ దగ్గరకు ముద్దాయిని వైద్యపరీక్షలకై పంపించవచ్చు.

తనపై ఆరోపించబడిన నేరం తను చేయలేదనడానికి, లేదా తనని హింసించడం జరిగిందన్నదానికి సాక్ష్యాధారాలకై, లేక మరే ఇతర కారణంగాగానీ, తన శరీరంపై ఏర్పడిన గాయాల కారణాల నిర్ధారణకుగానీ ముద్దాయికి వైద్య పరీక్షలు చేయించుకునే హక్కు సి.ఆర్.పి.సి. సెక్షన్ 54 కల్పిస్తుంది.

## బెయిల్ పొందే హక్కు

నేరాలు రెండు రకాలు. బెయిలు దొరికేవి (బెయిలబుల్), బెయిలు దొరకనివి (నాన్ బెయిలబుల్).



స్వాతి సపరివార పత్రిక 15.7.94

బెయిల్ దొరకని నేరం ఆరోపించబడిన ముద్దాయి (కూడా), అరెస్ట్ అయినా లేక తానుగా కోర్టుముందు లొంగిపోయినా కోర్టు అతనికి కొన్ని ప్రత్యేక పరిస్థితుల్లో బెయిల్ మంజూరు చేయవచ్చు. కానీ అతనే నేరం చేసినట్లు కోర్టువారు నమ్మినా, ఆరోపించిన నేరానికి తగు శిక్ష యావజ్జీవ కారాగారం లేదా మరణ శిక్ష అయినప్పుడు బెయిలు దొరకదు. ముద్దాయిది పదహారు సంవత్సరాలకంటే చిన్న వయసు అయినా, ముద్దాయి స్త్రీ, లేదా మానసిక శారీరక రుగ్మతలతో వున్న వ్యక్తి అయినా వారికి కోర్టువారు సి.ఆర్.పి.సి. సెక్షన్ 437 ప్రకారం బెయిల్ ఇవ్వవచ్చు.

## కోర్టులో డిఫెన్స్

**ము**ద్దాయి తను అరెస్ట్‌కావచ్చునని తెలుసుకున్నా, లేక అరెస్టయిన తర్వాతగానీ, లేక కేసు ఏ దశలో వున్నా కోర్టులో తన తరఫున వాదించడానికి లాయర్‌ని పెట్టుకునే హక్కు సెక్షన్ 303 సి.ఆర్.పి.సి. కల్పిస్తుంది.

మన రాజ్యాంగంలో ఆర్టికల్ 22 నిర్దేశించిన ప్రకారం ఏ వ్యక్తినికూడా అతనెందుకు అరెస్టయ్యాడో తెలియనీయకుండా కస్టడీలో వుంచకూడదు. లేక అతను ఎన్నుకున్న లాయర్‌ని సంప్రదించడానికి తన తరఫున డిఫెన్స్ చేయడానికిగల హక్కుని నిరాకరించకూడదు.

కానీ రాజ్యాంగం ప్రసాదించిన ఈ హక్కుని పోలీసులు చాలాసార్లు కాలరాస్తుంటారు. ముద్దాయిని ఎందుకు అరెస్ట్‌చేశారో చెప్పరు; తన తరఫు లాయర్‌ని గానీ బంధువుల్నిగానీ కలవనివ్వరు. అలాంటి సమయంలో హైకోర్టులో పిటిషన్ వేసి కోర్టు ఆర్డర్‌ద్వారా ముద్దాయితో తన లాయర్ కలుసుకోవచ్చు.

అటువంటి భేటీ పోలీసుల దృష్టిపథంలో వుండేటట్లు వుండాలిగానీ వాళ్ళు వినేంత దగ్గరగా వుండనక్కరలేదు. పోలీసులకు ఈ సంభాషణ వినే అధికారం లేదు. 1871, 8, బొంబాయి, బి.సి.ఆర్. క్రిమినల్ 126 (158)

## నేరంలో ఇరికింపచేసే జవాబులను నిరాకరించే హక్కు

ఎవిడన్స్ ఏక్ట్ సెక్షన్ 25 ప్రకారం పోలీసు ఆఫీసర్ ముందు ముద్దాయి నేరాన్ని అంగీకరిస్తే దానిని ముద్దాయికి వ్యతిరేకంగా రుజువుపరిచే సాక్ష్యంగా అనుమతించబడదు.

'నేనే ఈ హత్యను చేశాను' అని నేరాన్ని ముద్దాయి అంగీకరించినా అది సాక్ష్యంగా ఉపయోగపడదు. ఈ విషయంలో 1978 నందినీ శతపథి కేసులో సుప్రీమ్ కోర్టు తీర్పు ముఖ్యమైనది.

ముద్దాయికి తనని నేరంలో ఇరికింపజేసే ప్రశ్నలకి జవాబు నిరాకరించే హక్కుని చట్టం కల్పించింది. అయితే తనకు తానుగా నేరం ఒప్పుకున్నట్లు మేజిస్ట్రేట్ ముందు వాంఙ్మూలం రికార్డుచేయిస్తే, ఆ అంగీకారాన్ని తీసుకొని ముద్దాయికి వ్యతిరేక సాక్ష్యంగా ఉపయోగించవచ్చు అని సి.ఆర్.పి.సి. సెక్షన్ 164 తెలుపుతుంది.

## తిరిగి అరెస్ట్ చేయవచ్చా?

ప్రభుత్వం ఏదో ఒక సాకుతో పోలీసులకి లెక్కలేనన్ని అధికారాలను కట్టబెడుతుంది. నేరస్థుల్ని శిక్షించడానికి కోర్టులున్నాయన్నది విస్మరించి కొన్ని సమయాల్లో ఆ బాధ్యతలను పోలీసులే నిర్వహిస్తున్నారు. యాంటిసిపేటరీ బెయిలు కోర్టు మంజూరు చేసినా పోలీసులు కొన్ని సమయాల్లో ధిక్కరిస్తుంటారు. బెయిలు దొరికినా పోలీసులు మరో కేసు బనాయించి ముద్దాయిల్ని అరెస్ట్‌చేస్తారు.

కానీ 1983 ఉదయచంద్ వెర్సస్ షేక్ మోహ్మ కేసులో సుప్రీమ్‌కోర్టు ఇలా తీర్పిచ్చింది : "ఏ వ్యక్తికైనా ఒకసారి బెయిలు మంజూరు అయితే, ఆ వ్యక్తిని తిరిగి అరెస్ట్ చేయాలంటే ఆ వ్యక్తికి మరికొన్ని నేరాలతో సంబంధం వుందని కోర్టువారికి తెలియజేయకుండా, బెయిలు మీద విడుదలైన వ్యక్తిని పోలీసులు వెంటనే తిరిగి అరెస్ట్ చేయలేరు.



అలాంటి నేరాలు ఆపాదించవల్సివుంటే బెయిల్ మంజూరయ్యే ముందరే కోర్టువారికి పోలీసులు ఆ నేరాలగురించి తెలియజేయాలి.

## వైజ్ఞానిక పరిశోధన

**ము**ద్దాయిలలో అమాయకులుండొచ్చు. అసలైన నేరస్థులుండచ్చు. వారిని న్యాయస్థానంలో ముద్దాయిలుగా నిలబెట్టేముందు, వారి నేరాలపై పోలీసులు వైజ్ఞానిక పద్ధతులలో పరిశోధన చేయాలేతప్ప, ముద్దాయిల్ని హింసించడం, థర్డ్ డిగ్రీవంటి పద్ధతులద్వారా నేరాల్ని అంగీకరింపజేయడంవలన ప్రయోజనం శూన్యమే కాకుండా అది మన రాజ్యాంగ సూత్రాలకి, పౌరహక్కులకు విరుద్ధం. నేరం కూడా.

పోలీసులు పెట్టే చిత్రహింసలు ఎంత దారుణంగా వుంటాయో తెలియజెప్పే ఉదాహరణ : కొన్ని సంవత్సరాల క్రితం ఒక సీనియర్ పోలీసు ఆఫీసర్ యాంటిసిపేటరీ బెయిల్ కోసం దరఖాస్తు చేస్తూ 'తను అరెస్ట్ అయిన పక్షంలో పోలీసులు కొట్టే దెబ్బలకి పూర్తిగా వికలాంగుడుగా మిగలొచ్చని, లేదా మరణించవచ్చు' అని భయపడుతున్నట్లు తన దరఖాస్తులో రాసుకోవడం పరిశీలిస్తే పోలీసుల హింస మన దేశంలో ఏ దశలో వుందో ఊహించవచ్చు.

పోలీసులు అమాయకులపై లాఠీలు ఝళిపించడం మాని, రాజ్యాంగాన్ని, చట్టాల్ని గౌరవించడం, నేరనిరూపణలో వైజ్ఞానిక పద్ధతులను అమలు చేయడంవంటివి పాటిస్తే, సామాన్య ప్రజలలో పోలీసులంటే ఏర్పడిన భయం తొలగి గౌరవం పెరుగుతుంది.

## న్యాయస్థానాల పాత్ర

**వ్య**క్తి స్వేచ్ఛ ప్రతి పౌరుడికి రాజ్యాంగం ప్రసాదించిన ప్రాథమిక హక్కు. ప్రభుత్వంగానీ పోలీసులుగానీ ప్రాథమిక హక్కుల్ని అతిక్రమించడం నేరం. రాజ్యాంగ సూత్రాల్ని, ప్రాథమిక హక్కుల్ని, చట్టాల్ని సక్రమంగా అమలుపరచడం ప్రభుత్వ బాధ్యత అయితే, వాటి నెవరైనా అతిక్రమించిన పక్షంలో విచారించి, దోషులను శిక్షించే బాధ్యత న్యాయస్థానాలది.

ఈ వ్యవస్థలో పోలీసులు ప్రజాసేవకులు మాత్రమే. నేరస్థుల్ని విచారించి, శిక్షించే అధికారం, బాధ్యత న్యాయస్థానాలదే తప్ప పోలీసులది ఎంతమాత్రమూ కాదు.

ఆధునిక సమాజంలో, చట్టసభల లక్ష్యం, ప్రభుత్వ యంత్రాంగాల లక్ష్యం, న్యాయవ్యవస్థల లక్ష్యం–'సామాజిక న్యాయం' (SOCIAL JUSTICE) సాధించడం మాత్రమే.

ఎక్స్ ఛీఫ్ జస్టిస్ పి.యన్. భగవతి ఒక చారిత్రాత్మకమైన తీర్పులో ఇలా అన్నారు : "భారత రాజ్యాంగంలో ఆర్టికల్ 21 కల్పించిన వ్యక్తి స్వేచ్ఛని చట్టపరమైన సూత్రాలకు అనుగుణంగా తప్ప, మరే విధంగానూ భంగం కలిగించకూడదు. కోర్టుల్లో కేసులు శీఘ్రగతిని పరిష్కారం కాకపోయినా అది రాజ్యాంగం కల్పించిన వ్యక్తి స్వేచ్ఛహక్కుకి భంగం కలిగించినట్లే లెక్క. అందుకే ఉచిత న్యాయసేవలను పేదవారికి, వెనుకబడినవారికి అందించడం ప్రభుత్వ బాధ్యత. అది రాజ్యాంగం సూత్రీకరించిన ఆర్టికల్ 21కి అనుగుణంగా వుంది" అని వ్యాఖ్యానించారు.

అందుకే ప్రభుత్వం, పోలీసులు, న్యాయాధికారులు, ఇతర పౌరులు కూడా పరిపాలనాయంత్రాంగం, న్యాయయంత్రాంగాలద్వారా ప్రతి ఒక్కరికీ సమానంగా సామాజికన్యాయం కల్పించగలిగితే ప్రజాస్వామ్యం మన దేశంలో సుస్థిరమవుతుంది.

**–జి. మహేష్, అడ్వకేట్**

సీరియల్



# రార్కా మా ఇంటిదాకా

మేర్లపాక మురళి

"తను ఇష్టపడ్డ అమ్మాయి తనను ప్రేమించలేదంటేనే మగవాడి అహం దెబ్బతింటుంది. ఆపైన తమ సంస్కారాన్నిబట్టి రియాక్షన్ వుంటుంది. కొందరు ఆ అమ్మాయి మంచిది కాదని ప్రచారంచేస్తారు. మరి కొందరు ట్రాక్ మార్చేసి, మరో అమ్మాయిని ప్రేమించడంలో మునిగిపోతారు. ఇలా రకరకాలు. ఇద్దరూ ప్రేమించేసుకుని, పరిస్థితులవల్ల విడిపోతే అదో రకమైన బాధ.

అలాంటప్పుడు ఆ అమ్మాయి మీద అబ్బాయి కక్షపెంచుకోకపోయినా పిచ్చి పిచ్చి వేషాలు వేస్తాడు. బార్‌లో తాగుతూ తనను ఆ అమ్మాయి ఎంత గొప్పగా ప్రేమించిందో చెప్పుకుంటూ ఏడుస్తాడు.

ఇంకొందరు పర్మినెంట్‌గా ప్రేయసికి బదులు షుందును ఆశ్రయిస్తారు. మరికొందరు చాలా చిత్రంగా ప్రవర్తిస్తుంటారు. దీనికి ఉదాహరణగా మా ఫ్రెండ్ హరీష్ తన ప్రేయసి ఫస్ట్‌నైట్ రోజున ఏంచేశాడో చెబుతాను" అన్నాడు వంశీ.

"సొల్లుబూ మాప్పిళ్లై. లవ్ అన్నా రొంబా ఇష్టం నాకు" అని ఉత్సాహంగా అన్నాడు శరవణన్.

వంశీ కాస్తంత ముందుకు వంగి చెబుతున్నాడు.

• • •

వంశీ అప్పుడు డిగ్రీ ఫైనలియర్‌లో వుండేవాడు. ఆర్ట్సుకాలేజి హాస్టల్‌లో వుండేవాడు. అతని రూమ్మేటు హరీష్. ఇద్దరూ మంచి వయసులో వుండడంతో ప్రపంచమంతా తమదే అన్నట్టు ప్రవర్తించేవాళ్ళు. రాత్రనకా, పగలనకా బజార్లవెంబడి తిరిగేవాళ్ళు.

రోజూ రాత్రి పదిగంటల ప్రాంతాన హాస్టల్‌నుంచి కాఫీ తాగడానికి బజారుకు బయల్దేరేవారు. అంత రాత్రిపూట, ఎవరూ లేని నిశ్శబ్దంలో నడుస్తూ సెక్స్ ఫాంటసీలలో తేలిపోయేవాడు హరీష్.

'ఇప్పుడు మనం నడుస్తున్నామా! అంతలో అదిగో ఆ ఇంటి డాబా మీది తలుపు తెరుచుకుంటుంది. మనం ఇదంతా చూడకుండా వెళుతుంటాం. ఎవరో మనల్ని పిలుస్తున్నట్లు చప్పట్లు వినపడుతాయి. వెనక్కి తిరిగి తలపైకెత్తుతాం. స్ట్రీట్‌లైట్ వెలుగుల్లో ఓ ఆంటీ కనిపిస్తుంది. ఆంటీ అంటే ఆంటీ కాదులే. వివాహిత అనుకో. ముప్పై ఏళ్ళుంటాయి. ట్రాన్స్ పరెంట్ నైటీలో లోపలి అందాలన్నీ కనిపిస్తుంటాయి. అందంగా. అంతకంటే సెక్సీగా డెబవార్ సెంటర్ స్ప్రెడ్‌లా వుంటుంది. మనం దగ్గరికి వెళతాం.

'లోపలికి రండి. మావారు క్యాంప్‌కెళ్ళారు. వారం రోజులదాకారారు. ఒంటరిగా వుండాలంటే నాకు చాలా భయంగా వుంది' అంటుంది. అప్పుడు మనిద్దరం వెళతాం. ఇక ఆ పైన ఏంజరుగుతుందో ఊహించుకో"

ఇలా చెప్పేవాడు హరీష్. ఈ మాటలు వింటూ వుంటే వంశీకి ఒళ్ళంతా వేడెక్కిపోయేది.

ఇటువంటివాటినే మార్చి మార్చి చెప్పేవాడు. అలాంటి హరీష్, ఓ రోజు ఇంజనీరింగ్ స్టాఫ్ కాలనీకి వెళ్ళాడు. అక్కడ అతని మామయ్య వుంటున్నాడు. చాలా సంవత్సరాలవరకు అతని కుటుంబానికీ, అతని మామయ్య కుటుంబానికీ ఏవో మనస్పర్థలు వుండేవి. తిరిగి ఇటీవలే ఒకరికొకరు కలుసుకుంటున్నారు. ఆ రోజు మామయ్య పెద్దకూతురి బిడ్డ బారసాల. తాము రావడానికి వీలుకావడంలేదని నువ్వెళ్ళి వచ్చేయి అని ఇంటినుంచి లెటర్‌వస్తే బయల్దేరి వెళ్ళాడు. అదే మొదటిసారి వెళ్ళడం.

వెళ్ళగానే ఓ అమ్మాయి వచ్చి 'రా బావా' అని నవ్వును ముఖంనిండా పులుముకుని ఆహ్వానించింది.

సంక్రాంతి పండుగనాడు పెద్దింటి ముందువేసిన రంగులముగ్గులా వుండే ఆ అమ్మాయినిచూసి హరీష్ లవ్ ఎట్ ఫస్ట్‌సైట్ అంటారే అలా ఫీలయ్యాడు. ఇక అక్కడ వున్నంతసేపూ ఆమెకే కళ్ళను తగిలించేశాడు.

ఆమె పేరు నీహారిక.

డిగ్రీ రెండో సంవత్సరం చదువుతుంది.

లవ్‌లో పడినప్పట్నుంచీ హరీష్ స్టైలే మారిపోయింది. తిరునాళ్ళలా సందడిగా వుండేవాడు కర్యూ

**16** వంశీ, సుజనల పెళ్ళవుతుంది. శోభనం రోజున సుజనకు మూడురోజుల ఇబ్బంది ఎదురవుతుంది. అందుకని మరో ముహూర్తం నిర్ణయిస్తాడు సుజన తండ్రి. ఆ ముహూర్తానికి ముందే శోభనం జరుపుకోవాలని వంశీ చేసిన మూడు ప్రయత్నాలూ విఫలమవుతాయి. ఈలోగా వంశీకి ఎక్కడినుండో ఓ వీడియో క్యాసెట్ అందుతుంది. దానిలో తన భార్య సుజన ఓ యువకునితో శృంగారంలో పాల్గొనడం చూసి గిలగిల్లాడుతాడు.

నాలుగో ప్రయత్నంగా రాజాహోటెల్లో జరిగే ధర్మరాజా తిరునాళ్ళలో ముఖ్యఘట్టమైన గోగ్రహణం జరిగే రోజున వంశీ తన ప్లాన్ అమలుచేస్తాడు గణేష్‌దాదా సహకారంతో.

సుజనను కిడ్నాప్‌చేసి వంశీకి చెందిన మామిడితోటలోని ఇంటికిచేరుస్తాడు గణేష్‌దాదా. తీరా వంశీ అక్కడికి వెళ్ళి గణేష్ తీసుకొచ్చిన వ్యక్తిని చూసి దిమ్మెరపోతాడు. ఆమె సుజన పెద్దఅక్క ఉమ.

ఈ ప్లాన్‌కూడా ఫెయిలవడంతో ఏమీ తోచక తనకు పోస్టులో వచ్చిన క్యాసెట్ విషయం తేల్చడానికి మద్రాసు వెళ్తాడు వంశీ. అక్కడ పోలీస్ ఇన్‌స్పెక్టర్ శరవణన్‌ని కలిసి తనకు పోస్టులో అందిన క్యాసెట్ గురించి చెప్తాడు.

వీధిలా నిశ్శబ్దంగా అయిపోయాడు. సెక్స్ ఫాంటసీలు లేవు. చదువు లేదు-సంధ్యలేదు.

ఎప్పుడూ నీహారిక ధ్యాసే. ఆమె కాలేజీకి వెళ్ళేప్పుడు, వచ్చేప్పుడు బస్టాండ్‌లో కాపు కాసేవాడు. ఏ రోజైనా ఆమె నిలబడి ఒక మాట మాట్లాడితే ఆ మాటనే గాయత్రిజపంలా మననం చేసుకునేవాడు.

అతను తను కనపడ్డప్పుడు నర్వస్‌గా ఫీల్‌కావడం, మాట్లాడేప్పుడు తడబడడం, తన ఆజ్ఞలను నెరవేర్చడానికే వున్నట్లు నిలుచోవడం అన్నీ పసిగట్టింది.

ఆమె కూడ అతని ఆకర్షణలో పడిపోయింది. మూడు సినిమాలు, ఆరు లవ్‌లెటర్స్‌తో ఒక సంవత్సరం హేపీగా గడిచిపోయింది.

వీళ్ళ ప్రేమ వ్యవహారం ఇళ్ళల్లో తెలిసిపోయింది. రెండుపక్షాలవారూ వీరి పెళ్ళికి ససేమిరా అన్నారు. ఎంత ఒత్తిడి తెచ్చినా లాభం లేకపోయింది. ఆమెకి మరో సంబంధం చూడడం మొదలుపెట్టారు.

హరీష్ భగ్నప్రేమికుడైపోయాడు. గడ్డం పెరిగింది. చదువు పూర్తిగా అటకెక్కింది. ప్యాంట్ జిప్ ఊడిపోయి వున్నా, చొక్కా బొత్తాం ఊడిపోయినా గుర్తించే స్థితిలో లేడు. నీహారికకి పెళ్ళి ఫిక్సయిపోయింది.

'రేయ్! నేను పెళ్ళి చేసుకోలేకపోయినా నీహారికను పెళ్లికూతురి అలంకరణలో చూడాలని వుందిరా' అని వంశీ దగ్గర బాధపడిపోయాడు.

'ఒద్దురా! నువ్వు అక్కడికి వెళ్ళకు. మీ మామయ్య అసలే చండశాసనుడు'

'మరి ఎలారా?'

'ఏంచేయడం? ప్రాప్తం అంతేననుకోవాలి'

హరీష్ వెళ్లకనే నీహారిక పెళ్ళి జరిగిపోయింది. తిరుచానూరులో పెళ్ళి. ఆ సాయంకాలం దంపతులు ఇంటికి తిరిగి వచ్చేశారు.

ఆ రోజంతా భోజనం లేకపోవడం వల్ల మరీ నీరసపడిపోయాడు హరీష్. క్షణానికోసారి 'రేయ్ వంశీ! ఈపాటికి నలుగుపెట్టేసి వుంటారుకదరా', 'ఈసమయానికి మంగళసూత్ర ధారణ అయిపోయి వుంటుందికదరా' అంటూ అక్కడ జరిగే ప్రతి సన్నివేశాన్నీ కళ్ళముందుకు తెచ్చుకునేవాడు.



వంశీకి ఇదంతా విసుగనిపించినా భరించక తప్పలేదు.

ఆ రాత్రే నీహారిక ఫస్ట్‌నైట్.

'ఇంటికి వెళ్లైనా తనని చూసి వస్తారా?' సాయంకాలంకాగానే మిత్రుడ్ని అడిగాడు హరీష్.

'ఈ రాత్రి ఆమె శోభనం. ఇప్పుడెందుకు అక్కడికి? మంచికో చెడ్డకో ఆమెకు వేరొక వ్యక్తితో వివాహం జరిగిపోయింది'

'లేదురా! చివరిసారి చూసి వచ్చేస్తానురా' చిన్న పిల్లాడిలా కళ్ళల్లో నీళ్ళు కుక్కుకుని అడుగుతున్న అతనిని ఆపడానికి మనసొప్పడంలేదు వంశీకి.

'సరేరా! వెళ్ళి ఓసారి చూసి వచ్చెయ్' అన్నాడు.

దానికే ఆనందపడిపోయాడు అతను. ముఖం కడుక్కుని బయల్దేరాడు.

అతను వెళ్ళేసరికి పెళ్ళిల్లు హడావుడిగా వుంది. ఎక్కువమంది లేకపోయినా వున్నవాళ్ళే అటూ ఇటూ తిరుగుతూ బిజీగా కనిపించారు.

అతన్ని మొదట చూసింది నీహారిక అక్కయ్య.

'రారా హరీష్! పెళ్ళిలో ఎక్కడా కనపడలేదే' అంటూ గేటు తీసింది.

ఏం చెబుతాడు అతను? తను ప్రాణప్రదంగా నీహారికను ప్రేమించాననీ, ఆమె తనకు దక్కకుండా పోయే ఆ కార్యక్రమానికి హాజరుకాలేకపోయాననీ కన్నీళ్ళతో తప్ప మాటల్లో చెప్పలేడు.

అందుకే జీవంలేని నవ్వు నవ్వాడు.

అతన్ని చూడగానే నీహారిక తండ్రిమాత్రం నొసలు చిట్లించాడు. మాట్లాడకపోతే బావుండదని 'ఇప్పుడే వచ్చావా?' అని ముక్తసరిగా అడిగాడు.

తలూపి హాల్లో వున్న కుర్చీలో కూర్చున్నాడు.

అతని కళ్ళు ఆమెకోసం వెదుకుతున్నాయిగానీ ఆమె కనపడడంలేదు.

అంతలో నీహారిక అక్కయ్య ఒక వ్యక్తిని తీసుకొచ్చి 'నీహారిక భర్త సురేష్‌కుమార్' అని పరిచయం చేసింది.

అతన్ని ఆపాదమస్తకం పరిశీలిస్తూ తనతో బేరీజు వేసుకున్నాడు.

ఏ విధంగా చూసినా అతను తనతో తూగలేడని అనిపించింది.

అతను ఏదో మాట్లాడుతున్నా ఇబ్బందిగా జవాబులు చెబుతున్నాడు.

మాటల్లో వుండగానే చీకటిపడిపోయింది.

'భోజనాలకు లేవండి' ఎవరో పిలుస్తున్నారు.

అక్కడ భోజనం చేయడం ఇష్టంలేకపోయినా నీహారికను చూడాలన్న బలమైన కోరిక హరీష్‌ను అక్కడినుండి లేవనివ్వలేదు.

ఏదో తిన్నానంటే తిన్నాననిపించి లేచాడు.



## వరించిన అదృష్టం

అందాల తారామణి ఆమని గ్లామర్ తారగా ఎదిగేందుకు ఆసక్తి చూపుతున్నా, 'ఉత్తమ నటి' ఇమేజ్ కూడా వరించింది. ఇప్పుడు కళాతపస్వి కె. విశ్వనాథ్ డైరెక్షన్‌లో కమల్‌హాసన్‌తో నటించే అవకాశం ఆమనికే దక్కింది. దాంతో ఇంకా మురిసిపోతోంది.

ఆమని అసలు పేరు 'మంజుల'. ముద్దుపేరు- 'మంజు'. ఈ కన్నడసుందరి బెంగుళూరులో పుట్టినా, తెలుగు నటిగా బాగా గుర్తింపు పొందింది. ఇంటర్మీడియట్ చదువుకున్న ఆమనికి, డాన్సంటే ప్రాణమట. గాసిప్స్ ఎన్ని విన్నా 'ఈ చెవిలో విని ఆ చెవిలో వదిలేసే తత్వం నాది' అంటోంది ధీమాగా.

తొమ్మిదిగంటలైనా ఆమె కనిపించలేదు. మరో అరగంటకు శోభనం కార్యక్రమం ప్రారంభమైంది. అతను హాల్లోనే కుర్చీకి అతుక్కుపోయాడు.

సురేష్‌కుమార్ తెల్లటి బట్టల్లో, అంతకంటే తెల్లనైన నవ్వుతో హాల్లో అటూ ఇటూ తిరుగుతున్నాడు.

వెనకద్వారం దగ్గర అలికిడైతే చటుక్కున అటు తల తిప్పాడు హరీష్.

చుట్టూ నలుగురైదుగురు స్త్రీలు వస్తుంటే లోనికి అడుగుపెడుతోంది నీహారిక.

తెల్లటిచీరలో అచ్చు రతీదేవిలా వున్న ఆమెను చూస్తూనే అనాలోచితంగా ఠక్కున కుర్చీలోంచి పైకి లేచాడు అతను.

మెడలో పొడవాటి నెక్లెస్, దాంతోపాటు పెద్ద పసుపుదారం, పాపిటమధ్య బంగారు జలపాతంలా వున్న పాపిటబిళ్ళ-ఆమె అక్కడక్కడ బంగారు పూత పూసిన వెండిబొమ్మలా వుంది.

పెళ్ళికొడుకునూ, పెళ్ళికూతుర్నీ నిలబెట్టి దిష్టి తీశారు. పెళ్ళికొడుకు హాల్లోంచి శోభనం గదిలోకి నడిచాడు. నీహారికను స్త్రీలు ఆ గది ద్వారం దగ్గరికి తీసుకెళ్ళారు. ఇక ఆమె లోనికి అడుగుపెట్టబోయేంతలో జరిగింది ఆ సంఘటన.

హాల్లో ఓ మూల నిలుచున్న హరీష్ దబ్బున కింద పడిపోయాడు. నీరసంవల్లో, తన ప్రేయసి పర్మినెంట్‌గా మరొకరిపరం అయిపోతూ వుందన్న బాధవల్లో తెలియదుగానీ అతను స్పృహతప్పాడు.

ఎవరో కిందపడ్డట్టనిపించి వెనక్కి తిరిగిన నీహారికకు అతను కనిపించాడు.

అంతవరకు ఆమె అతన్ని గుర్తించలేదు.

పెళ్ళాడిన వ్యక్తితో గడపడానికి శోభనం గదిలోకి అడుగుపెట్టబోతున్న సమయంలో ప్రియుడు స్పృహతప్పి కిందపడిపోతే ఓ అమ్మాయి తట్టుకోగలదా? కానీ ఏంచేయగలదు? మౌనంగా రోదించడంతప్ప.

ఏం జరిగిందో అర్థంకావడానికి అందరికీ కొంత సమయం పట్టింది. అందరూ అతని చుట్టూమూగారు.

నీహారిక తండ్రి వంటగదిలోకి పరిగెత్తి జగ్‌తో నీళ్ళుతెచ్చి ముఖంమీద చల్లాడు.

ఈ హడావుడికి పెళ్ళికొడుకు గదిలోంచి వచ్చాడు.

పెళ్ళికూతురికి స్వయానా బావ అయిన వ్యక్తి ఆ సమయంలో అలా స్పృహతప్పిపడిపోవడం అతనిలో చిన్న అనుమానాన్ని రేపింది.

పక్కింటి వ్యక్తిని పురమాయించి హరీష్‌ను హాస్పిటల్‌కి తీసుకువెళ్ళే ఏర్పాట్లుచేశాడు నీహారిక తండ్రి.

'ఎందుకలా పడిపోయాడు?' పెళ్ళికొడుకు తన మామయ్యని అడిగాడు.

'తల తిరిగుంటుంది' ఆయన చాలా క్యాజువల్‌గా సమాధానం చెప్పాడు.

'అతను ఎందుకలా పడిపోయాడో నాకు తెలుసు' అని అందరికి వినిపించేలా గట్టిగా అరిచి తమ ప్రేమ కథంతా చెప్పాలనిపించింది నీహారికకు.

కానీ పడకటింట్లో తన కోసం ఎదురుచూస్తున్న భర్త- తనను చూసి ఏదో బాధ కదిలి స్పృహతప్పిన



ప్రియుడు-వీటిమధ్య నలిగిపోయింది ఆమె.

నోటంట మాట రాలేదు.

బలిపశువులాగా బెదిరిన కళ్ళతో, చెదిరిన కలలతో మెల్లగా పడకటింట్లోకి అడుగుపెట్టింది.

• • •

"రొంబా ఇంట్రస్టింగ్ ఫస్టనైట్ స్టోరీ చెప్పావయ్యా మాప్పిళే" శరవణన్ చాలా ఫీలయిపోతూ చెప్పాడు.

"ప్రేయసి తనకు దక్కకపోతే బాధపడతారు తప్ప ఆమెకి హాని చేయాలనుకునేవాళ్ళు తక్కువ. కానీ వన్‌సైడ్‌లవ్‌లో అయితేనే ద్వేషించడం మొదలు పెడతారు. చిట్టిబాబులాంటివాడు అంతటితో ఆగకుండా కక్ష పెంచుకుంటాడు.

అందులో భాగంగానే ఈ క్యాసెట్ నాకు పంపించాడు. కానీ ఇందులో వున్నది సుజన కాదు. అది నాకు స్పష్టంగా తెలుసు. అయితే ముఖం మాత్రం సుజనదే. 'అలా ఎలా మేనేజ్ చేశాడో నాకు అర్థం కావడంలేదు" వంశీ తన సందేహాన్ని చెప్పాడు.

శరవణన్ ఏదో ఐడియా తట్టినట్లు వేగంగా కదిలి దూరంగా వున్న ఫోన్‌ని దగ్గరికి లాక్కున్నాడు. ఏదో నెంబర్ తిప్పాడు.

"హలో-హలో"

"........."

"శరవణన్-ఎస్.ఐ"

"........"

"వణక్కం" అని తమిళంలో మాట్లాడాడు.

వంశీకి ఒక్క ముక్కకూడా అర్థంకాలేదు.

మరో రెండు నిముషాలపాటు మాట్లాడి శరవణన్ ఫోను పెట్టేశాడు.

"ఇప్పుడు అంతా క్లియర్‌గా అర్థమైంది మాప్పిళే. ఇప్పుడు నాన్‌కదా ఫోన్‌చేసింది కంప్యూటర్ సెంటర్‌కి. ఇలాంటి ఫేక్ కాసెట్ ఎట్లా తయారుచేసి, జనాన్ని మోసం చేయవచ్చునో చెప్పినారు.

వేరే ఒక అమ్మాయి, చిట్టిబాబు కలిసి ఈ కేసెట్‌ను తీసుకున్నారు. హొటల్‌కి వెళ్ళినట్లు, గదిలో రొమాన్సు జరిపినట్టు షూట్ చేశారు. ఆ తరువాత కంప్యూటర్‌సాయంతో సుజన ఫోటోని ఆ అమ్మాయి ముఖం స్థానంలో ఎక్స్‌పోజ్ చేయించారు. అంటే ఛాతీ వేరే అమ్మాయిది. ముఖం మాత్రం సుజనది. అంటే సుజన ఫోటోదన్నమాట" శరవణన్ గొప్ప రహస్యం చెప్పినట్లు రిలాక్స్‌గా ఫీలయ్యాడు.

మొత్తం అర్థమైంది వంశీకి. సైన్స్ పెరిగేకొద్దీ మనిషి మరింత వికృతంగా తయారవుతున్నాడనడానికి ఇది మంచి ఉదాహరణ.

కంప్యూటర్ సాయంతో లేని మనిషిని ఉన్నట్లు చూపించవచ్చన్నమాట. టెక్నాలజీని ఇంత నీచానికి వాడాడన్న చిట్టిబాబుమీద అతనికి విపరీతమైన కోపం వచ్చింది. కానీ తమాయించుకున్నాడు.

"ఆ బాస్టర్డ్‌ని ఇప్పుడా స్టేషన్‌కి లాక్కొచ్చి లాకప్‌లో పడేస్తాను. ఎన్ని కేసులున్నాయో అన్నీపెట్టి అంతు తేలుస్తాను" అన్నాడు శరవణన్.

"వాడు కోలుకోలేని విధంగా దెబ్బకొట్టడానికి ఓ

### కాపాడిన ఇమేజ్

"నాకున్న 'సెక్సీ ఇమేజ్' వృత్తిపరంగా ఏర్పరుచుకున్నది. దానికీ, నా వ్యక్తిగత జీవితానికీ సంబంధంలేదు.

ఈ ఇమేజ్ లేకపోతే నాకు ఏడుపుగొట్టు హీరోయిన్ పాత్రలే దక్కేవేమో! ఎందుకంటే, మొదటి నుంచీ నా ముఖంలో పరిపక్వత కనబడుతుందంటున్నారు. అందువల్ల నన్ను అమీర్‌ఖాన్, సల్మాన్‌ఖాన్‌లకి తల్లిగా నటించమనేవారేమో కూడా! నిర్మాతలకి అటువంటి ఆలోచన కలగకుండా నా ఇమేజ్ నన్ను కాపాడింది" అంటోంది షీబా.



మంచి ప్లాన్ వుంది సార్. అలా ప్రొసీడ్ అవుదాం"

"ఎన్నాప్పా అది?"

చిట్టిబాబుకి ఎలా షాక్‌ట్రీట్‌మెంట్ ఇవ్వాలో వివరించాడు వంశీ. మొత్తం విన్నాక శరవణన్ "అద్భుతంగా వుందప్పా. దీంతో వాడి తలతిరుగుతుంది. జీవితంలో ఎప్పుడూ ఇలాంటి వెధవ ఆలోచనలు చేయడు. అలానే చేస్తాం మాప్పిళే" అని వంశీవైపు అడ్మయిరింగ్‌గా చూశాడు.

"థాంక్యూ సార్"

"అవును మాప్పిళే. నీకు ఇంకా ఫస్టనైట్ జరగలేదుకదా. మరి బాడీ సుజనదికాదని ఎలా చెప్పగలిగావ్?" శరవణన్ తన సందేహాన్ని బయటపెట్టాడు.

"కాసెట్‌లోని అమ్మాయి చెస్ట్‌మీద-ఎడంపక్కన పెద్ద పుట్టుమచ్చ వుంది. సుజనకు అలా లేదు. ఇది ఎలా తెలుసంటే..." అని ఆగి "ఫస్టనైట్ జరక్కపోయినా అక్కడివరకు తెలుసు. మేము లవర్స్‌కదా. సమయం చిక్కినప్పుడు అంతవరకు అలో చేసేది" చెప్పి సిగ్గుతో తలదించుకున్నాడు వంశీ.

• • •

సుజన, లాంప శివాలయానికి బయల్దేరారు.

ఆ రోజు సాయంకాలం సుజన లాలసను ఆహ్వానించింది. ఇంట్లో బోరుగా వుండడంవల్లా, వంశీ కనిపిస్తాడేమోనన్న ఆశవల్లా శివాలయం వరకు వెళ్ళాలని నిర్ణయించుకుంది. లాలస రాగానే బయల్దేరారు.

వీధిలో నడుస్తుంటే ఎవరెవరో కనిపిస్తున్నారుగానీ వంశీ మాత్రం కనపడడంలేదు. ఎక్కడికెళ్ళాడో కూడా ఆమె ఊహించలేకపోతోంది.

కిడ్నాప్ ప్లాన్ అందరికీ తెలిసిపోయింది. అక్కయ్య లంతా ఆట పట్టించారు. గడువు కూడా అయిపోతూ వుంది. ఛాలెంజ్‌లో నెగ్గడేమోనన్న అనుమానంకూడా మొదలైంది. కిడ్నాప్ ప్లాన్ బెడిసికొట్టడంతో ఉత్సాహం తగ్గింది. ఉన్న కొద్దిరోజుల్లో వంశీ మరో ప్లాన్ వేస్తాడో లేదో కూడా తెలియడంలేదు.

తను పందెంలో ఓడిపోవడాన్ని తలుచుకుంటేనే కళ్ళల్లో నీళ్ళు తిరుగుతున్నాయి.

"ఏమిటి సుజనా అంత డీప్‌గా ఆలోచిస్తున్నావ్? మాట్లాడాలని పిలిచి మౌనవ్రతం పాటిస్తున్నావే"

లాలస అడగడంతో ఆలోచనల్లోంచి మెల్లగా తెప్పరిల్లింది సుజన.

లాలసకు ముప్పై ఏళ్ళుంటాయి. బాగా కత్తిరించుకున్న జుట్టు ఆకారంలో అనాసపండులా వుంటుంది. కళ్ళు నేరేడుపళ్ళలా మెరుస్తుంటాయి. పెదవులు దొండపండ్లయితే, బుగ్గలు కమలాఫలాల్లా కనిపిస్తుంటాయి. ఆమె వక్షస్థలం ద్రాక్షపళ్ళ గుత్తులైతే, బొడ్డు చెర్రీస్‌పండులా ఎర్రగా వుంటుంది. దూరంనుంచి చూస్తే ఆమే ఒక పళ్ళబుట్టలా అనిపిస్తుంది.

"మా వంశీ కనిపిస్తాడేమోనని చూస్తున్నా. అంత తప్ప మరేం లేదు" సంజాయిషీలా చెప్పి చిన్నగా నవ్వింది సుజన.

"కొత్తపెళ్ళికూతురైపోతివి. అందునా ముద్దూ ముచ్చటా ఇంకా తీరలేదాయె. శోభనం జరిగిపోతే సగం జీవితం తెలిసిపోయినట్లే. శోభనంరోజే తన భవిష్యత్తు ఎలా వుంటుందో తెలిసిపోతుంది స్త్రీకి. కొందరికైతే ఆ రోజులోనే జీవితం ముగిసిపోతుంది. మా మంజులకైతే ఫస్టనైట్ రోజునే పారాణిని తుడిచెయ్యాల్సి వచ్చింది"

### ఇంటి ప్రోత్సాహం

"నటి ఎదగాలంటే ఇంటి వాతావరణం చాలా ముఖ్యం. ఇంట్లో ప్రోత్సాహకరమైన పరిస్థితులు వుంటే చక్కగా ముందడుగు వెయ్యగలం. ఆ విషయంలో నేను అదృష్టవంతురాల్ని. డాక్టర్లుగా ఉన్నత హోదాలో వున్న మా అమ్మానాన్నా నన్నెంతో ప్రోత్సహించారు. వారితోపాటు మా తమ్ముడుకూడా. అందరం మనసు విప్పి చర్చించుకోవడమేకాక, వారి సూచనలు, సలహాలు నాకు కొత్త శక్తినిస్తుంటాయి.

'ఎదుటివారు చేసిన మంచిని మరచిపోకు. వాళ్ళలోపాలుమాత్రం మరిచిపో' అని మా నాన్న చెప్పిన సూక్తి ఇప్పటికీ మరచిపోలేను" అంటోంది, 'అన్న' విజయంతో ఆశలు పెరిగిన 'గౌతమి'.



సుజిన ఒక్క క్షణం ఆగింది.

"ఫస్ట్‌నైట్ రోజున భర్త చనిపోయాడా?" తన బాధనూ, ఆశ్చర్యాన్ని ప్రకటించింది.

"ఆఁ కానీ అది మామూలు చావు కాదు" అంది లాలస.

"మరి?"

"అదో పెద్ద విషాదంలే"

"ఏం జరిగిందో చెప్పవా?"

"చెబుతాను"

తిరిగి ఇద్దరూ నడుస్తుండగా లాలస. చెబుతోంది.

"మంజుల అని నా స్నేహితురాలుండేది. ఆపిల్ల పక్కన పసుపుకొమ్ము పెడితే వెలవెలబోయేది.

అంతలా బంగారుఛాయతో మెరిసిపోయేది. డిగ్రీవరకు చదువుకుంది. మధ్యతరగతి కుటుంబం.

మంచి పెళ్ళిసంబంధమే కుదిరింది. పెళ్ళికొడుకు పేరు స్వరూప్. ఫుడ్ కార్పొరేషన్‌లో ఏదో ఉద్యోగం. మొదటిసారి చూడగానే మెత్తటివాడు అనిపిస్తాడు. కట్నం దగ్గరగానీ, మర్యాదల విషయంలోగానీ, లాంఛనాల విషయంలోగానీ ఏమీ పేచీలు పెట్టలేదు.

పెళ్ళికూతురి ఇంట్లోనే పెళ్ళి. తెల్లవారుజామున ముహూర్తం కావడంతో బంధువులంతా ఉదయం పది గంటలకంతా వెళ్ళిపోయారు. ఇక మిగిలింది కొద్దిమంది మాత్రమే.

పెళ్ళి ఇల్లు ఎలా వుండాలో అలానే వుంది ఇల్లు. అందరూ ఆనందం కీ ఇస్తే నవ్వుతున్నట్లే హడావుడిగా వున్నారు. మంజుల ఇద్దరు తమ్ముళ్ళయితే మరీ మితిమీరిపోయారు. నిన్నటివరకు ఏమీ కాకపోయినా ఉదయం ఆ మూడుముళ్ళూ వేసి తమ ఇంట్లో అతి ముఖ్యుడైపోయిన స్వరూప్‌ను చూస్తుంటే వాళ్ళ అభిమానం ఆగడంలేదు. దాన్నంతా తమ అల్లరితో, సరదాలతో తెలియజేస్తున్నారు.

పెద్దవాడు టెన్త్‌క్లాస్, రెండోవాడు నైన్త్‌క్లాస్. ఒకరికొకరు జోడీ అయిపోయి బావని అల్లరి పట్టిస్తున్నారు. అతని జుట్టుని వెనక్కిలాగడం, తమ అక్కయ్య రమ్మంటూ వుందని ఊరకనే చెప్పడం, ఆయన ఎక్కడికి అంటే ఏప్రిల్‌ఫూల్ అని ఎగతాళి చేయడం, తమ అక్కయ్య ఇమ్మందని ఒట్టి తెల్లపేపర్ల ఉండ ఇవ్వడం చేస్తున్నారు. స్వరూప్ ప్రతిసారీ బేలపోతున్నాడు. అంత అమాయకుడు అతను.

ఓ మూల నలుగురు పేకాట ఆడుతున్నారు. తమ అరచేతుల్లోనే స్వర్గం వున్నట్లు పేకముక్కల వైపు కాక మరోవైపుకి చూడడంలేదు వాళ్ళు.

సాయంకాలంనుంచే శోభనం హడావుడి ప్రారంభమైంది. మంజుల తమ్ముళ్ళు టౌన్ నుంచి రెండు బుట్టలతో పూలు తెప్పించారు. గదిలో వేసిన పట్టెమంచానికి కర్రలు పెట్టి పూలపందిరి వేశారు. కనకాంబరాలు, మల్లెపూలతో ఆ గదే ఒక పట్టెమంచంలా ఎంతో అందంగా వుంది.

భోజనాలు ప్రారంభమయ్యాయి.

మంజుల తమ్ముళ్ళ అల్లరి ఎక్కువైంది. అతను ఎటో చూస్తున్నప్పుడు ముందున్న విస్తరితీసి దాచిపెట్టారు. నీళ్ళ గ్లాసు మాయంచేసి దాని స్థానే పన్నీరుపోసిన గ్లాస్ పెట్టారు. అతనికి తెలియకుండా వడలను విస్తట్లో వేశారు. అతను ఒక వడ తినగానే మరో రెండు వడలు ప్రత్యక్షమవుతున్నాయి. మేమంతా వాళ్ళ అల్లరిని బాగా ఎంజాయ్ చేస్తున్నాం.

తొమ్మిది గంటల ప్రాంతాన పురోహితుడు వచ్చాడు. ఏవేవో మంత్రాలు చదివాక గ్రీన్‌సిగ్నల్ ఇచ్చి వెళ్ళిపోయాడు.

అప్పటికి మంజుల అలంకరణ కూడా పూర్తయింది. తెల్లటి చీరలో ఆమె గంధర్వకన్యలా తళతళ మెరిసిపోతోంది. మెడలోని పసుపుతాడు కూడా ఆమెకు ఎనలేని అందాన్నిచ్చింది.

ఆ తాడు బంగారు ఆభరణంలానే అనిపించిందంటే ఆమె ఎంత చక్కగా వుందో ఊహించు.

పెళ్ళికొడుకు గదిలోకి వెళ్ళాడు. స్త్రీలంతా కలిసి మంజులను తీసుకొస్తున్నారు.

అప్పుడు వినిపించాయి కేకలు. హృదయాన్ని కోస్తున్న అరుపులు విని అందరూ జడుసుకున్నారు. పేకాటరాయుళ్ళు సైతం అక్కడికి దూసుకొచ్చారు. ఏం జరిగిందో తెలియకపోయినా ఇద్దరు ముగ్గురుస్త్రీలు ఏడవడం మొదలుపెట్టారు.

అరుపులు వినిపిస్తున్నది శోభనం గదిలోంచి. అందరం అక్కడికి పరిగెత్తాం. అక్కడి దృశ్యం చూడగానే ఏదో ఘోరం జరిగినట్లనిపించింది. పెళ్లి కొడుకు కిందపడిపోయి వున్నాడు.

అటు ఇటు మంజుల తమ్ముళ్ళు పెద్దగా ఏడుస్తూ అతనిని లేవమన్నట్లు కుదుపుతున్నారు.

అతనెందుకు పడిపోయాడోనన్న ప్రశ్న అందరి ముఖాల్లోనూ చిన్న కొక్కెంలా వేలాడుతోంది.

అందరం స్వరూప్ చుట్టూ గుమిగూడాం. మా చిన్నాన్న కంగారుగా అతని నాడిని పరిశీలించి 'నీళ్ళు తీసుకు రండి' అని అరిచాడు.

ఇద్దరు ముగ్గురు హడావుడిగా వంటగదిలోకి పరిగెత్తారు.

మా వెనక నిలుచున్న మంజులయితే గాలివానలో చిక్కుకుపోయిన చిన్నపడవలా అయిపోయింది. ఆమె అంతలా వణికిపోతోంది.

అతని ముఖాన నీళ్లు చిలకరించారు.

అందరి ముఖాల్లోనూ ఆందోళన అరచేతిమందాన పేరుకుపోయింది.

అతనిలో చలనం లేదు.

'డాక్టర్‌కి కబురు పంపండి' ఎవరో అరిచారు.

మంజుల తమ్ముళ్ళ దుఃఖం చెప్పనలవి కాలేదు. ఎక్కిళ్ళుపెట్టి ఏడుస్తూ అతనిని కుదుపుతున్నారు.

ఎవరూ రాకముందునుంచే వాళ్ళిద్దరూ శోభనం గదిలో ఎందుకున్నారోనన్న ప్రశ్న నాలో మొదలైంది. మేం వచ్చేటప్పటికే వాళ్ళిద్దరూ అక్కడే వున్నారు. నాకొచ్చిన అనుమానం మా చిన్నాన్నకు కూడా కలిగినట్లుంది. ఆయన ప్రతిసారి వాళ్ళిద్దరివంకా చూస్తున్నాడు. వాళ్ళు బావ ఏమైపోయాడోనన్న కంగారువల్ల ఏమీ గుర్తించడంలేదు.

అంతలో డాక్టర్ వచ్చాడు.

'ఏమైంది?' అంటూ కిందకు వంగి స్టెత్‌తో పరీక్షిస్తున్నాడు. అటూ ఇటూ దానిని జరిపి 'ప్చ్' అంటూ పెదవులు ఆడించాడు.

'ఏమిటి డాక్టర్?' మా చిన్నాన్న అడిగాడు.

'గుండాగిపోయింది. చనిపోయాడు'

అప్పుడు మంజుల వేసిన కేకతో ఇల్లే కదిలిందో, భూమే కంపించిందో, ఆకాశమే ఊడిపడిందో నాకు తెలియదు.

**(ఇంకావుంది)**



## పులిని దత్తతచేసుకున్న స్టెఫీగ్రాఫ్

జంతుసంరక్షణకి అవసరమైన నిధులకోసం లండన్ జూ ఓ వినూత్న పథకాన్ని రూపొందించింది. అక్కడి అధికారులు, కొందరు ప్రముఖులు తమ జూలోని వివిధ జంతువుల్ని దత్తతచేసుకునేటట్టు చేస్తున్నారు.

ఇటీవల 'వింబుల్డన్ ఛాంపియన్ షిప్' పోటీకి లండన్ వెళ్లిన ప్రముఖ క్రీడాకారిణి స్టెఫీగ్రాఫ్ జూని సందర్శించింది. సరిగ్గా అప్పుడే 'జంతువుల్ని దత్తత చేసుకునేవారం' కావడంతో ఆమె ఓ పులిని దత్తతచేసుకుంది. ఇకనుంచీ దాని పోషణ, ఇతర ఖర్చులకవసరమైన డబ్బంతా ఆమే అందజేస్తుంది. ఆ పులి పేరు మైరా. అది సుమత్రాలో పుట్టి పెరిగింది.

వన్యప్రాణి సంరక్షణకోసం కృషి జరుగుతున్న మనదేశంలో కూడా కొత్త పథకాల అవసరముంది. అటు జంతువులకీ మేలు చేకూర్చే, ఇటు మనుషుల్లోనూ జీవకారుణ్యాన్ని పెంచే ఇలాంటి పథకాలను అనుసరించడం అవశ్యకం! ◆


కొన్ని పదార్థాలు కాలాన్ని బట్టి
అత్యమూల్యమైనవిగా వృద్ధి చెందుతాయి.
స్వచ్ఛమైన, సహజమైన
చందనపు తైలం, చందనపు వృక్షాల
చెగు నుండి తీయబడినది. శతాబ్దాలుగా
అపురూపమైన సౌందర్యీకరణ లక్షణాలకు
విశ్వసింపబడుతున్నది. ప్రతి మైసూర్ స్యాండల్ సబ్బుబిళ్ళ
గుణాన్ని అభివృద్ధి చేస్తుంది. మీ ముఖాన్ని
స్పర్శించడానికై దాన్ని పోషించండి, ప్రకాశించనీయండి.
కాలాన్ని బట్టి ఎక్కువ విలువైందిగా రూపొందే సౌందర్య
రహస్యం
మైసూర్ స్యాండల్ సబ్బు
75 సంవత్సరాలుగా నిరంతర మీ సౌందర్య రక్షణ
Mysore Sandal Soap
GOVT. SOAP FACTORY BANGALORE
MYSORE Sandal SOAP
FROM THE HOUSE OF MYSORE SANDAL SOAP
కర్ణాటక సోప్స్ మరియు డిటర్జంట్స్ లిమిటెడ్, బెంగుళూరు - 55

MASS/KSDL/94

సీరియల్

# రారా మా ఇంటిదాకా



-మేర్లపాక మురళి

మంజుల అమ్మ అయితే ఫెయింటైపడిపోయింది. ఆమె తండ్రి కుప్పకూలిపోయి చేతుల్ని ముఖానికి అడ్డంపెట్టుకున్నాడు. తమ్ముళ్ళిద్దరూ బావపై పడిపోయి రోదిస్తున్నారు.

'ఇంతకీ ఏమైంది?' డాక్టర్ అందరివైపు చూస్తూ అడిగాడు. దానికి సమాధానం ఎవరి దగ్గరాలేదు. గదిలో ఏం జరిగిందో ఎవరికి తెలుసు?

ఏడుపు మధ్య మంజుల పెద్ద తమ్ముడు చెప్పాడు, 'మావల్లే చచ్చిపోయాడు డాక్టర్! బావని ఆటపట్టించాలని మేం ముందే అటకమీద ఎక్కిదాక్కున్నాం. బావ గదిలోకి అడుగుపెట్టి, మంచం దగ్గరికి రాగానే నల్లటి మఫ్లర్‌లను ముఖాలకు అడ్డంగా కట్టుకున్న మేం ఒక్కసారిగా ఆయన ముందుకిదూకాం. అంతే. బావ కిందపడిపోయాడు'

'భయంతో సడన్‌గా గుండె ఆగిపోయుంటుంది' డాక్టర్ చెప్పాడు.

మేమంతా శవం చుట్టూ మూగాం"

లాలస చెప్పడం పూర్తిచేసి,అప్పటి దుఃఖం మరోమారు కదలడంతో కన్నీళ్ళు తుడుచుకుంది.

"ఓ చిన్నతమాషా ఎంత పెద్దవిషాదాన్ని తెచ్చిందో"" సుజన స్వగతంలా అంది.

ఇద్దరూ ఇక ఏమీ మాట్లాడుకోలేకపోయారు. ఆ సంఘటన తాలూకు బాధ గొంతుకు అడ్డం పడుతోంది. ఇద్దరూ శివాలయం చేరుకున్నారు.

చేతులెత్తి మొక్కుతున్న మునుల్లాగా చెట్లు, శివుడ్ని అభిషేకం చేయాలని ఉవ్విళ్ళూరుతున్నట్లు అలలై సాగుతున్న నీటి కొలనూ, మంత్రాలను చదువుతున్నట్లు అరుస్తున్న పిట్టలూ, అప్పుడు స్నానంచేసి గుడికి వచ్చినట్లు చల్లగా తగులుతున్న గాలి- ఆ వాతావరణం వాళ్ళిద్దరినీ సేదతీరుస్తున్నట్లుంది. ఇద్దరూ తిరిగి మామూలైపోయారు.

"ఆ ఇసుకలో కూర్చుందామా?"ముందుగా సుజన ప్రపోజ్ చేసింది.

"అలాగే"

ఇద్దరూ ఇసుకలో కూర్చున్నారు.

"శోభనం రోజున నేను చెప్పిన విషాదాలే కాదు. తమాషాలు కూడా జరుగుతుంటాయి" లాలస పెదవుల మీదకి నవ్వు తెచ్చుకుంటూ అంది.

ఏదైనా ఒక విషయంమీద చర్చ జరుగుతుంటే అందరూ తమకు తెలిసిన విషయాలన్నిటినీ చెప్పడానికి ఉబలాటపడతారు. ప్రస్తుతం లాలస పరిస్థితి కూడా అదే. శోభనం టాపిక్ రావడంతో తాను విన్నవీ, కన్నవీ చెప్పాలని తొందరపడిపోతూ వుంది.

"శోభనం రాత్రంటే అన్ని రసాల సమ్మేళనపు ముద్ద. శృంగారమే కాదు-అన్ని రసాలూ వుంటాయి."

తమాషా అంటున్నావు అదేమిటో చెప్పు"

"సుమతి అని మా చుట్టాలమ్మాయి వుండేది. వాళ్ళ నాన్న మరీ సోమరిపోతు. చేస్తున్న ఉద్యోగాన్ని వదిలిపెట్టి ఇంట్లో కూర్చుండిపోయాడు. సంసారం అంటే ఎలానో లాక్కురావచ్చుగానీ, మిగిలిన అవసరాలు తీరడం కష్టమై పోయింది. ఆమె తల్లి పూసలు కుట్టి, వచ్చిన డబ్బుతో సంసారం నడిపేది.

సుమతి తొమ్మిదో తరగతితోనే చదువును అటకెక్కించేసింది. డబ్బు అవసరం చాలానే వుండేది. తిలకం సీసా కూడా కొనలేని స్థితి. ఇదిగో-ఇలాంటి పరిస్థితుల్లో డబ్బు ఎలా సంపాదించాలో తెలుసుకుంది. దీనికి ఆమె వదిన ప్రోత్సాహం వుండేది.

పెళ్ళినాటికి ఆమె పేర ముప్పైవేల రూపాయలు బ్యాంక్‌లో వున్నాయి. నిజానికి పెళ్ళిచేసుకోవాలని ఆమెకి ఏ కోశానా లేదు.కానీ పెళ్ళి తప్పనిసరనీ, ఇక నుంచి జీవన విధానం మార్చుకోమనీ వదిన మరీ మరీ సలహా ఇవ్వడంతో సరేనంది. సొంతంగా ఆటో నడుపుకునే వ్యక్తితో పెళ్ళి జరిగింది.

ఫస్ట్‌నైట్- గదిలోకి పంపించే ముందు సుమతితో వాళ్ళ వదిన 'ఈ మగవాళ్ళు స్వార్థపరులు. తాము ఎంత చెడిపోయివున్నా, తన భార్య మాత్రం అనాఘ్రాత

**17** పెద్దల అంగీకారంతో వంశీ, సుజనల పెళ్ళవుతుంది. శోభన ముహూర్తం దగ్గర పడిందనగా సుజనకు మూడురోజుల ఇబ్బంది కలుగుతుంది. ఇక అప్పుడు వీలుకాదు కనుక వేరే ముహూర్తం నిర్ణయిస్తాడు సుజన తండ్రి. కాని ఆ ముహూర్తానికి ముందే శోభనం జరుపుకోవాలని వంశీ చేసిన నాలుగు ప్రయత్నాలు విఫలమవుతాయి.

వంశీకి ఎక్కడినుండో ఓ వీడియో క్యాసెట్ అందుతుంది. దానిలో తన భార్య సుజన ఓ యువకునితో శృంగారంలో పాల్గొనడం చూసి తట్టుకోలేకపోతాడు. క్యాసెట్ విషయమై ఆచూకీ తీయడానికి మద్రాసు వెళ్ళి అక్కడ పోలీస్ ఇన్‌స్పెక్టర్ శరవణన్‌ని కలుస్తాడు. శరవణన్ ఎవరికో ఫోన్ చేసి ఫేక్ క్యాసెట్లు ఎలా చేస్తారో కనుక్కుని వంశీకి చెప్తాడు. క్యాసెట్ గొడవకంతటికీ కారణమైన చిట్టిబాబును ఎలా శిక్షించాలో చెప్తాడు వంశీ.

సుజన, లాలస శివాలయానికి బయల్దేరుతారు. దారిలో తన ఫ్రెండ్ మంజుల ఫస్ట్‌నైట్‌న జరిగిన విషాద సంఘటన గురించి చెప్తుంటుంది లాలస.



పుష్పంలా వుండాలని కోరుకుం
టారు. అందుకే నువ్వు కాస్త నటించు'
అని హితబోధ చేసింది.

తలవూపి గదిలోకి అడుగుపెట్టింది సుమతి.

'తలుపు దగ్గరే నిలబడిపోయావేం? సిగ్గా?'
మురిపెంగా అడుగుతూ ముందుకు వచ్చాడు
పెళ్ళికొడుకు.

ఆమె ఏమీ మాట్లాడలేదు. మరింత సిగ్గుతో తలను వాల్చే
సింది. అతను మెల్లగా చేయి పట్టుకున్నాడు. మొత్తం ఒళ్లంతా
చిన్న జర్క్ ఇచ్చినట్లు కదిలింది.

సుతారంగా చేయి విడిపించుకుంది. భుజంమీద చేయి వేసి మంచం
దగ్గరికి నడిపించుకు వెళ్లాడు. 'కూర్చో'

ఆమె అలానే నిలబడి వుండడంతో మళ్లీ అతనే 'కూర్చో' అన్నాడు.
మంచం అంచుమీద కూర్చుని పాలు అందించింది. అతను పాలు
కాసిన్ని తాగి గ్లాసు ఇస్తూ 'మిగిలినవి నువ్వు తాగు' అన్నాడు.

'ఈ పాలా? నేను తాగను. ఇంతవరకు ఎంగిలిపాలు తాగలేదు'
చిన్నగా చెప్పింది.

అతనిలో జీవకళ మరింత పెచ్చింది.

'పరవాలేదు-తాగు'

అతని చేతిలోని పాలగ్లాసు తీసుకుని ఓ సిప్‌చేసి 'మీ కోసం తాగాను'
అంది సిగ్గుపడుతూ నెమ్మదిగా.



'థ్యాంక్స్' అని మళ్ళీ సంభాషణను పొడిగించాడు.

'పెళ్ళిచూపుల్లో నిన్ను చూసింది మొదలు నిద్రరాలేదు. ఎప్పుడెప్పుడు మూడు ముహూర్తాపడి నిన్ను ఆక్రమించుకుందామనే ఆరాటమంతా. ఎప్పుడైనా ఆదమరిచి నిద్రపోతే కలలో నువ్వే'

'నేనా? ఆశ్చర్యంగా వుందే. అమ్మాయికి ప్రియుడు తప్ప పరపురుషుడు కలలోకి రాడట. అబ్బాయింకైతే ప్రేయసితప్ప మిగిలిన స్త్రీలే కలలోకి వస్తారట'

అతను గతుక్కుమన్నాడు. అలాంటి స్టేట్‌మెంట్లు వినడం అతనికి కొత్త.

'నీకెలా తెలుసు ఇవన్నీ?'

'ఏదో ఒక సందర్భంలో మా వదిన చెప్పింది'

అప్పటికి కుదుటపడ్డాడు. పక్కన కూర్చోవడం వల్ల ఆమె స్పర్శ అతనిలో సెగల్ని రేపుతోంది. ఫర్నెస్ పక్కన కూర్చొన్నట్లుంది. ఇక ఆగలేకపోయాడు. ఆమె మీదకి వంగి ముద్దు పెట్టుకున్నాడు.

ఆమె గబుక్కున బుగ్గ దొరక్కుండా ముఖాన్ని పక్కకి తిప్పుకుని సిగ్గుల మొగ్గయ్యింది.

'నాకో ముద్దు పెట్టవా?' అతను అభ్యర్థించాడు.

ఆమె రెండు చేతులతోనూ ముఖాన్ని కప్పుకుంది. అయితే ఆమె వేళ్ళ సందుల్లోంచి సిగ్గు ప్రసరిస్తూనే వుంది. ఆమె అలా సిగ్గుపడడాన్ని చూస్తుంటే ఆమెకి ఏ మాత్రం అనుభవంలేదని నిర్ధారించుకున్నాడు.

చేతుల్ని కిందకు లాగాడు. మరో మారు ముద్దు పెట్టుకున్నాడు-అయితే ఈసారి పెదవులమీద.

అందులోని అనుభూతిని ఆనందిస్తున్నట్లు ముఖాన్నంతా వెలిగించినా 'ఛీఛీ-ఎంగిలి' అంది.

ముద్దు పెట్టుకోవడాన్ని ఎంగిలంటున్న ఆమెను తృప్తిగా చూసుకున్నాడు.

ఇక ఆగలేక మెల్లగా పడుకోబెట్టాడు. కానీ ఆమె వెంటనే స్ప్రింగ్‌లా పైకి లేచింది.

అలా లేచినప్పుడు ఆమె ఎద అతనివేళ్ళ కొసన తగిలి,అతనిలో నిప్పును రాజేసింది. అతను తిరిగి పడుకోబెట్టాడు. ఆమె పైకి లేచింది. ఈసారి వేళ్ళన్నీ ఆమె ఎద స్పర్శకు జివ్వుమన్నాయి.

ఇలా రెండు మూడుసార్లు పైకిలేచి, ఆ పైన అలసటతో పడుకుండిపోయింది. పక్కనుంచి ఆమె మీదకు వాలాడు. వక్షస్థలంలో ముఖాన్ని గుచ్చాడు. సముద్రకెరటం ఒక్కసారిగా పైకిలేచి ఝుల్లున కొట్టినట్లు ఉక్కిరిబిక్కిరయ్యాడు.

చీర పైట పక్కకి తొలిగింది. రౌండ్‌నెక్ జాకెట్టు పైభాగాన కనిపిస్తున్న ఆ భాగం నెలవంకను అక్కడ తగిలించుకున్నట్లుంది.ఆ నునుపుకీ, మెరుపుకీ అతని తల తిరిగింది. ఆ భాగాన్ని స్పృశించాలన్న కోరికతో ఆ ప్రయత్నం చేశాడు. ఆమె అతని చేతుల్ని, విదిలించికొట్టి, పైటను సర్దుకుంది.

అలా చేసినందుకు అతను ఏమీ ఫీల్ కాలేదు. పైపెచ్చు ఎంతో ఖుషీ అయిపోయాడు.

తాను అలా చేసినందుకు నొచ్చుకున్నట్లుగా 'సారీ! భయంగా వుంది' అందామె.

'మొదట్లో అంతే' అని మళ్ళీ నెలవంకను పట్టుకోవడానికి మేఘంలా వాలాడు. ఈసారి ఆమె చేతుల్ని విదిల్చికొట్టలేదు. కానీ చేతుల్ని అడ్డం పెట్టింది. సందు చేసుకుని అతని చేతులు కదుల్తున్నాయి.

చాలా కష్టపడి జాకెట్ మొదటి హుక్‌ని పట్టుకున్నాడు. హుక్‌లన్నీ తొలగుతుంటే ఆమె ఎద శుక్లపక్షమే అయింది. పూర్ణచంద్రుడు ద్విపాత్రాభినయం చేస్తున్నట్లున్న ఆమె వక్షద్వయంమీద ముఖం ఆన్చి, పైపైకి పాకుతున్నాడు. అప్పుడు ఆమె ఎద కృష్ణపక్షమే అయింది. ఆ భాగాన్నంతా అతని ఛాతీ మూసివేసింది. అమావాస్య చీకటి ఆకాశంలా వున్న అతని ఛాతీ ఒత్తిడిని తాళలేక అటూ ఇటూ కదిలింది.

ముఖాన్నంతా ముద్దులతో ముంచేస్తుంటే నిస్సహాయంగా ముఖంపెట్టింది. అతని కుడిచేయి కిందకు దిగి బొడ్డును తడుముతోంది. చక్కిలిగింతలు కలిగి ఆమె నడుమును అదిరించింది.సడలిన చేతిని మళ్ళీ యథాస్థానంలోకినెట్టాడు.

అతను మరింత కిందకు దిగి చీర కుచ్చిళ్ళను పట్టుకున్నాడు. అయితే ఆ పట్టుకోవడంలో అతను అరచేతిని బాగా ముందుకి పోనిచ్చాడు.

ఆమె ఇబ్బందిగా కదిలి, అతన్ని తోసివేయడానికి ప్రయత్నించింది. అతను ముసిముసిగా నవ్వుకుంటూ మరింతగా బిగుసుకుపోయాడు.

కుచ్చిళ్ళను గబుక్కున పైకి లాగాడు.ఆమె అంతే వేగంతో ముఖాన్ని పక్కకు తిప్పుకుంది. పెంపుడు జంతువుని మొదటిసారి మచ్చిక చేసుకున్నంతగా అతను ఫీలైపోతున్నాడు.

చీరముడి వీడిపోయింది. ఆమె సిగ్గుతో చచ్చిపోయింది. తనతోనే వుంటానన్న నేస్తం మోసంచేసి మధ్యలోనే చేతిని వదిలేసినట్లు ఆమె తన చీరవైపు చూస్తుంటే అతను విజయగర్వంతో నవ్వాడు.

బంగారు ఇసుకమైదానంలో తనొక్కడే వున్నట్లు అతను కళ్ళను మరింత విప్పదీశాడు. అతని కళ్ళు నగ్నత్వాన్ని తాగుతూ కైపెక్కాయి.

ఆమె మూడంకెలో తన శరీరాన్ని మడిచింది.

అతను చేతులతో ఆ అంకెను చెరిపేసి ఒకటిని చేశాడు.నిలువుగా సాగిన ఆమె మీద పూర్తిగా వాలాడు.

ముందుకి దూసుకొస్తున్న అతన్ని చూసి ఆమె కెవ్వున అరవబోయింది. ఆ శబ్దం పెదవులు దాటి రాకుండా జాగ్రత్తపడ్డాడు. తన పెదవులతో ఆమె పెదవులను మూశాడు.

ఆమె గింజుకుపోయింది. తోసెయ్యాలని ప్రయత్నించింది. ముఖంమీద గోళ్ళతో రక్కింది. ఛాతీమీద గుద్దింది. ఇంత చేస్తున్నా అతను మాత్రం చిన్నపిల్లాడు కొయ్యగుర్రంమీద ఆడుకుంటున్నట్టే వున్నాడు.

మధ్యలో ఆమె ఎందుకనోగానీ గట్టిగా కేకపెట్టింది. ఆమె పెదవులు బాధనంతా వ్యక్తం చేయడానికి ఏవో శబ్దాలను చేస్తున్నాయి. ఈ అవస్థ అంతా ఎప్పుడు కలుగుతుందో తెలిసిన అతను ఆమెను అనునయిస్తూ 'మొదటిసారి ఇదంతా తప్పదు' అని అంటూనే

## ఎవర్‌గ్రీన్ హీరో!

ధర్మేంద్రకి ప్రస్తుతం 20 సినిమా ఆఫర్లున్నాయి. కానీ బాలీవుడ్‌లో కొత్త నిబంధనల ప్రకారం ఏ హీరో 12కి మించి సినిమాలు ఒప్పుకోకూడదు.

అది ధర్మేంద్రకి సమస్యగా మారిందని తెలిసిన వారు, "క్యారెక్టర్ యాక్టర్‌గా అయితే ఎన్ని సినిమాలు ఒప్పుకున్నా కాదనరు" అని సలహా ఇస్తే, ధర్మేంద్రకి ఒళ్లుమండిపోయి, కళ్లెర్రజేశాడు.

గుండెపై చరుచుకుంటూ, "నేను ఎవర్‌గ్రీన్ హీరోని! ఎప్పుడూ హీరోగానే వుంటాను"అని గొంతు పెంచుకుంటూ మరీ చెప్పాడు ధర్మేంద్ర.

## గుండెపోటు రిస్క్‌ని పెంచే కోపం

శాంతంగా వున్నవారికన్నా ఆగ్రహంతో మండిపడేవారికి గుండెపోటు ప్రమాదం రెట్టింపని, హార్వార్డ్ మెడికల్ స్కూల్‌కి చెందిన పరిశోధకులు చెబుతున్నారు. "మనసుకి నచ్చనిది సంభవించినప్పుడు ప్రశాంతంగా వుండడానికి ప్రయత్నిస్తే గుండెపోటు వచ్చే రిస్క్‌ని తగ్గించుకోవచ్చు" అని ఆ బృందం నాయకుడు ముర్రేమిటిల్‌మన్ చెప్పాడు.

గుండెపోటు వచ్చినా ప్రమాదం నుంచి బైటపడిన 1,122 మంది పురుషుల్నీ, 501 మంది స్త్రీలనీ అధ్యయనంచేశాక, "ఇరువురిలోనూ వారికి కోపం వచ్చిన తర్వాత 2 గంటలవరకూ గుండెపోటు ప్రమాదం 2-3 రెట్లు ఎక్కువ"వని కనుగొన్నారు



పరిశోధకులు. దాన్ని తప్పించుకోవడానికి, కోపాన్ని నిగ్రహించుకోలేమని అన్పించిన వెంటనే హృద్రోగులు 'ఆస్పిరిన్' మాత్ర తీసుకోవాలని సూచించారు. ◆

వున్నాడు. ఆమె బాధనంతా పళ్ళమధ్య బిగించింది. కళ్ళల్లో నీళ్ళు ఊరడం కూడా తెలుస్తూనే వుంది.

మరో అయిదు నిముషాలకి గ్రీష్మంలో శీతల పవనం తాకినట్లు ఆమె రిలీఫ్‌గా ఫీలయ్యింది.

అతను ఆమె పక్కన వున్నాడు.

'అద్భుతం-ఏం కావాలన్నా కోరుకో ఇస్తాను' అన్నాడు ఆమెవైపు చూస్తూ.

అంతవరకు ఎంతో అద్భుతంగా నటించిన ఆమె, అదంతా ఆ క్షణంలో ఒక్కసారి మరిచిపోయి 'వంద రూపాయలు ఎక్కువివ్వు' అంది.

అంతే! అతను ఫ్రీజ్ అయిపోయాడు.

తన తప్పు తెలిసిన ఆమె నాలుక కరుచుకుంది. కానీ అప్పటికే జరగాల్సిన అనర్థం జరిగిపోయింది"

లాలస చెప్పేందంతా విని నవ్వులోంది సుజన.

"పాపం గురుడు షాకైపోయి వుంటాడు. అంత వరకు తను పెళ్ళి చేసుకుంది కన్య అని మురిసిపో తున్న అతను, ఆమె చివరి మాటలు విని ఎలా అయి పోయి వుంటాడో ఊహిస్తుంటే నవ్వొస్తోంది"

"ఆ-మగాడు ఎప్పుడూ అంతే. తనకు లేనిశీలం స్త్రీకి వుండాలంటాడు" లాలస కసిగా అంది.

ఆమె మళ్ళీ "సుమతి సంఘటనకూ, నా ఫస్ట్ నైట్‌కూ చాలా పోలికలున్నాయి. అయితే నాది రివర్స్ కేసు. అంతే తేడా" అంది.

"రివర్సా? ఎలా?" సుజన ఆసక్తిగా అడిగింది.

"అదంతా పెద్ద కథ" అంటూ లాలస తన శోభ నాన్ని గురించి చెప్పడం ప్రారంభించింది.

"నువ్వు ఎప్పుడూ ఊర్లో లేకపోవడంవల్ల మా కుటుంబ విషయాలు ఏమీ తెలిసుండవు. అందుకే మొదటినుంచీ వివరంగా చెబుతాను.

మాది పిచ్చాటూరు దగ్గర శివగిరి. మా నాన్న పిచ్చాటూరు పిడబ్ల్యుడీలో ఉద్యోగం చేసేవాడు. ఇద్దరు అన్నయ్యలు, ఒక అక్కయ్య తరువాత చిన్న దాన్ని నేను. ఓ మోస్తరు కుటుంబం. అక్కయ్య పెళ్ళినాటికి వచ్చిన పి.ఎఫ్.తో దాని పెళ్ళి ఎలానో చేశారు. ఇక మిగిలింది నేనొక్కదాన్నే. అన్నయ్య లిద్దరూ పెళ్ళిళ్ళు చేసుకుని తిరుపతిలో చేరిపోయారు.

ఇంటర్‌తో నా చదువాగి పోయింది. నా వివాహమూ జరిపించి, ఏదో పించను డబ్బుతో కాలం వెళ్ళబుచ్చా లని నాన్న అభిప్రాయం. దాంతో సంబంధాలు చూడ డం మొదలుపెట్టారు.

చాలా సంబంధాల తరు వాత చివరికి ఓ సంబంధం కుదిరింది. అబ్బాయికి తల్లి దండ్రీలేరు. ఉన్నదిఅన్నయ్య మాత్రమే. ఆయనా వేరేగానే వుంటున్నాడు అదే ఊర్లో. పెళ్ళికొడుకుతో పాటు అతని అన్నయ్యా, వదినా నన్ను చూడడానికి వచ్చారు.

పెళ్ళికొడుకు చూడడా నికి బాగానే వున్నాడు. పేరు కిషోర్. ఊర్లో చిన్న రైస్ మిల్లుంది. అన్నదమ్ములిద్ద రికీ అందులో భాగముంది. మిల్లు నిర్వహణంతా అన్న య్యదే. వచ్చే లాభాల్లో చెరి సగం పంచుకుంటారు. ఎక రం పొలం కూడా వుంది.

నాన్నకు అన్నివిధాలా ఈ సంబంధం నచ్చింది. కట్నం కూడా పెద్దగా అడగలేదు. ఇష్టం వచ్చినంత బంగారం పెట్టి పెళ్ళి చేసెయ్యమన్నారు. డబ్బు అడగకపోవడంతో నాన్న హాయిగా ఫీలయ్యాడు.

పదిహేను సవర్లలో రకరకాల ఆభరణాలు చేయిం చుకున్నాను. పెళ్ళి మా ఊర్లోనే జరిపించాడు నాన్న.

పెళ్ళిలో ఒక స్త్రీ నన్ను ఆకర్షించింది. ఆమెకు ముప్పై ఏళ్ళుంటాయి. సన్నగా, నాజూగ్గా వుంది. కొద్దిగా మేకప్ ఎక్కువై ఆమె నా దృష్టిలో పడలేదు. పెళ్ళికొడుకుతో మరీ క్లోజ్‌గా వుండడంవల్లే ఆమెనే చాలాసార్లు చూస్తూ వుండిపోయాను.

మంగళసూత్రధారణ అయిపోయాక మా అక్క య్యను అడిగాను 'ఎవరామె?'

'పెళ్ళికొడుక్కి పిన్ని వరసవుతుందట. దూరపు బంధువులే. పేరు మాధవి.

ఒకే లోగిలిలో ఇద్దరి ఇళ్ళూ' అని తనకు తెలిసి నంతవరకు ఆమె వివరాలు చెప్పింది అక్కయ్య.

మధ్యాహ్నం విందు ముగిశాక చాలామంది బంధు వులు వెళ్ళిపోయారు.

'శోభనం పెళ్ళికొడుకింట్లో చేయడం మా ఆచా రం. నాలుగు గంటలకి వెళ్ళిపోతాం' అతని పిన్ని చెబు తోంది మా నాన్నకి. నేను వాళ్ళకి కాస్త దూరంలో వుండి వాళ్ళ మాటలు వింటున్నాను.

'మా ఇంట్లోనే చేయడం మా ఆచారం' నాన్న చెప్పాడు-అంతలో అందరూ అక్కడ గుమిగూడారు. చాలాసేపు తర్జన భర్జనలు జరిగాక చివరికి పెళ్లికొడుకు ఇంటికి బయల్దేరడానికే నిర్ణయం తీసుకున్నారు.

సాయంకాలం మూడు గంటలకి ఓ మెటాడోర్ వ్యాన్‌లో బయల్దేరాం.

అప్పుడు నా వెంట మా అత్తగారింటికి మా అక్కయ్యా, ఇద్దరు వదినలూ, పెద్దన్నయ్యా వచ్చారు.

నేను ఊహించిన దానికంటే బావుంది నేను మెట్టిన ఇల్లు. పాత డాబా ఇల్లు అది. రెండు పోర్షన్లుగా వుంది. అందులోని ఒక పోర్షన్ నా భర్తది. రెండోది ఆయన పిన్నిది. రెండు పోర్షన్లకూ కలిపి ఒకే లోగిలి. నా భర్త అన్నయ్య అదే ఊర్లో వేరే ఇంట్లో వుంటున్నాడు.

'ఆయనేనట మీవారి పిన్ని భర్త' అని చూపించింది మా అక్కయ్య. వెర్రిబాగులోడిలా వున్నాడు ఆయన.

## మాలా శ్రీ డ్రస్‌లు



'స్లిమ్‌గా వుండే అందాలకన్నా, పుష్టిగా పుష్కలంగా సొష్టవంగా వున్న సౌందర్యమే దక్షిణాదిలో గ్లామర్' అని ఆ మధ్య ఓ తమిళ పుష్టి నటి ఉవాచ! అందు కేనేమో మాలా శ్రీకూడా గ్లామర్‌స్టార్‌గా వెలుగులోంది.

తన అందాలని అందంగా చూపించే అనువైన డ్రస్‌ని ఆమే డిజైన్ చేసుకుంటూంటుందిట.

"ఏది అందమైన డ్రస్? అనేదానికన్నా మనకి ఏ డ్రస్ అందంగా వుంటుంది? అనేది ముఖ్యం" -అని ఓ డ్రస్ సూక్తిని పలికింది.

విదేశీ మ్యాగజైన్లు, విదేశీ టి.వీ.ప్రసారాలు చూసి, కొత్త కొత్త ఫ్యాషన్లు తెలుసుకుని, వాటికి సొంత తెలివితేటలు జోడించి సరికొత్త డ్రస్ డిజైన్‌లు తయారుచేస్తుందిట ఈ బంగారువన్నెల సింగారి.

## దీదార్‌గంజ్ యక్షిణి

**1917** లో దీదార్‌గంజ్‌లో గంగానది ఒడ్డున భూమిలో కొంతమేరకు కూరుకుపోయిన రాతి విగ్రహాన్ని ఓ పురాతత్వశాస్త్రవేత్త కనుగొన్నాడు. అప్పటిదాకా అక్కడి రజకులు దాన్ని బట్టలుతికే బండగా ఉపయోగిస్తున్నారు.

దాన్ని భూమిలోంచి వెలికితీసి చూసిన పురాతత్వశాఖవారు ఆశ్చర్యపోయారు. అది అందంగా చెక్కిన యక్షిణి విగ్రహం. ఎన్నో ఏళ్లుగా వీపుమీద బట్టలు ఉతకడంవల్ల విగ్రహం ఎడమచేయి విరిగిపోయింది. ముఖంపై, నడుం పైభాగానా పెచ్చులూడాయి.

ఆ యక్షిణి విగ్రహాన్ని శుభ్రంచేసి పాట్నా మ్యూజియమ్‌లో ప్రదర్శనకు పెట్టారు. దాన్ని ఎన్నోసార్లు విదేశాలలో ప్రదర్శించారుకూడా. 'దీదార్‌గంజ్ యక్షిణి'గా వ్యవహరిస్తున్న ఆ విగ్రహం మౌర్యకాలం నాటిదని చరిత్ర పుస్తకాలద్వారా తెలిసింది. ◆



నేను నమ్మశక్యంకానట్టు చూశాను. 'ఆయన మొదటి భార్య చనిపోయాక ఈమెను చేసుకున్నాడట. పిల్లల్లేరు. ఈమె పేరు ఏమిటో తెలుసా? మాధవి. ఈ వయసులో అంత షోకులేమిటో!' అని మూతి మూడు వంకర్లు తిప్పింది మా అక్కయ్య.

'పోనీలేవే. ఆమెకి మాత్రం ఎంతుంటుంది వయసు? ముప్పై ఏళ్ళుంటాయేమో. భర్త ముసలివాడైనంత మాత్రాన అలంకరించుకోకూడదా'

ఆ తరువాత మా అక్కయ్య ఏమీ మాట్లాడలేదు.

ఒకే ఇంట్లో రెండు కాపురాలు వుండడం నాకు మాత్రం బాగానే వుంది. మాధవి తోడూ నీడగా వుంటుందని సంబరపడ్డాను.

మేం మాటల్లో వుండగానే చీకట్లుపడ్డాయి. వదిన, అక్కయ్య కలిసి నన్ను అలంకరించారు.

భోజనాలయ్యాక శోభనం కార్యక్రమం ప్రారంభమైంది. ఎందుకనో మా వారు డల్‌గా కనిపించారు. పెళ్ళిలో అలిసిపోయారని సర్దిచెప్పుకున్నాను.

మా పోర్షన్‌లో చిన్న హాలూ, వంటగదీ, ఓ పెద్ద గదీ వున్నాయి. పెద్దగదిలో శోభనం ఏర్పాటుచేశారు.

కొంతసేపు సరదా పట్టించాక నన్నుల్ని గదిలోకి తోశారు. విచిత్రమేమిటంటే ఈ తంతు జరుగుతున్నంతసేపూ మాధవి కనిపించలేదు.

లోపలికెళ్ళగానే 'గొళ్ళెం పెట్టు' అన్నారు ఆయన. అదే మొదట మాట్లాడిన మాట.

గొళ్ళెం పెట్టాను. ఆయన చరచరా నడిచి మంచంమీద కూర్చున్నారు. నేను నేలచూపులు చూస్తూ ద్వారం దగ్గరే నిలబడిపోయాను.

'పద్మ, కింద చాపవేసి పడుకో. ఈ రోజు బాగా తలనొప్పిగా వుంది' అన్నారు.

మనసు చివుక్కుమంది. అంతవరకు దేదీప్యమానంగా వెలిగిన బల్బులు ఒక్కసారిగా ఆరిపోయి చీకటిలో చిక్కుకుపోయినట్లు అనిపించింది.

నాకు నేనే తమాయించుకున్నాను. ఓ మూలవున్న చాపా, దిండూ తీసుకుని మంచం పక్కన పరుచుకున్నాను. ఆయన అటు తిరిగి పడుకుని వున్నారు.

మెల్లగా చాపమీద కూర్చున్నాను. పడుకోవాలో, అలానే కొంతసేపు కూర్చోవాలో తెలియడంలేదు.

చిన్నగా దగ్గాను. ఆయనలో చలనంలేదు. నిద్రపోయారనుకుని నేనూ పడుకున్నాను.

ఎప్పుడో చిన్నప్పుడు అమ్మానాన్న ఊరెళితే ఇలా ఒంటరిగా పడుకుని ఏడ్చాను. అది గుర్తొచ్చింది ఆ సమయంలో. ఏదో తెలియని వెలితి ఊపిరి ఆడనివ్వడంలేదు. గుండెలమీద బలంగా నొక్కుతున్నట్లు అనిపించింది.

ఎప్పుడో తెల్లవారుఝామున కళ్ళు మూతలు పడ్డాయి. నిద్రలేచి చూస్తే పడకపైన ఆయన లేరు.

పడకమీదనుంచి లేచి, అన్నీ మడిచిపెట్టి దొడ్లోకెళ్ళాను. అక్కడ జామచెట్టుకింద మాధవి, ఆయనా మాట్లాడుకుంటున్నారు.

అప్పటికే మాధవి ఫ్రెష్‌గా తయారైవుంది. వర్షంలో తడిసిన బొండుమల్లిలా అందంగా, అంతకంటే సెక్సీగా వుంది. అసూయలాంటిది కలిగింది నాలో.

నన్ను చూసి నవ్వి ఏదో అంటోంది. ఆయన ముఖం చాటుచేశారు. మరి నవ్వారో, ఏమైనా అన్నారో నాకు తెలియదు. అక్కడినుంచి తిరిగివచ్చాను.

మరో రెండు రాత్రులూ మా శోభనం జరగలేదు. నేను గదిలోకి వెళ్ళడం తరువాయి ఆయన అటు తిరిగి పడుకుంటున్నారు. మొదటిరాత్రి తలనొప్పని చెప్పారు కానీ ఆ తరువాత ఆ మాట కూడా లేదు.

మా అక్కయ్య, వదినలు అడిగితే శోభనం జరిగిందని చెప్పాను. అంతకంటే సిగ్గువిడిచి ఎలా చెప్పగలను? ఆయన ఎందుకలా ప్రవర్తిస్తున్నారో నాకు అంతుపట్టడంలేదు. ఏదో మిస్టరీ మామధ్య అడ్డుగోడైలేచింది. నాలుగోరోజు మా వాళ్ళంతా వెళ్ళిపోయారు.

మావాళ్ళు అటు బస్సుకు వెళ్ళారో లేదో మాధవి, ఆయన టౌన్‌కి బయల్దేరారు.

'ఇంటికి సరుకులు తీసుకుని సాయంకాలం బస్సుకి వచ్చేస్తాం' మాధవి నాతో చెప్పింది.

రెండో బస్సుకి ఇద్దరూ వెళ్ళిపోయారు. మాధవి భర్త పొలం వెళ్ళాడు. ఆయన రాత్రితప్ప ఎప్పుడూ కనిపించడు. ఉదయం నిద్ర లేవగానే పొలం వెళతాడు. ఇక చీకటిపడ్డాకే ఇంటికి రావడం.

ఇంట్లో ఒంటరిగా వున్నాను. ఏంచేయాలో తోచక పాత మాగజైన్ వుంటే తిరగేస్తూ కూర్చున్నాను.

ఒక అరగంట గడిచాక అనసూయ వచ్చింది.



మా తోటికోడలు-కిషోర్ అన్న భార్య.

సాదరంగా ఆహ్వానించాను. ఆమెను చూడడం ఆత్మీయురాల్ని చూస్తున్నట్లుంది.

అవీ ఇవీ మాట్లాడాక అసలు విషయంలోకి వచ్చింది ఆమె. 'మా మరిది బాగా చూసుకుంటు న్నాడా?' అడిగింది.

ఔనూ, కాదూ అన్నట్లు తల ఆడించాను.

'అతను కాపురం చేస్తానన్నా, ఆమె చేయనివ్వదు. అదే ఆ టక్కులాడి-మాధవి-వాళ్ళిద్దరికీ ఆ సంబంధం వుంది' రహస్యం కాబట్టి గొంతు తగ్గించి చెప్పింది.

నా మీద పిడుగులే పడ్డాయో, నాకింద భూమి చీలిందో తెలియదుగానీ అంతు తెలియని అగాధంలో పడిపోయినట్లనిపించింది. గుండెల్లో ఎగిసిన మంట కళ్ళల్లో కాగడాలై లేచింది.

'నీ జీవితం ఎలా వుంటుందోనని నాకు భయంగా వుంది' జాలిగా అంది అనసూయ.

నా మీద సానుభూతి ప్రకటిస్తున్న ఈ స్త్రీ, పిల్ల కావాలని మా ఇంటికి పెళ్ళికొడుకుతో పాటు వచ్చింది. నూరు అబద్ధాలాడైనా సరే ఒక పెళ్ళి చెయ్యాలన్న చిన్న వాక్యాన్ని అడ్డం పెట్టుకుని ఎంతమంది జీవితాల్ని నాశనం చేస్తున్నారో వీళ్ళు.

ఆమె గొంతు పిసికి చంపెయ్యాలన్నంత కోపం వచ్చింది. తమాయించుకున్నాను.

'మరి నువ్వు అతన్ని ఆమె నుంచి ఎలా దూరం చేస్తావో-నీ కాపురాన్ని ఎలా నిలబెట్టుకుంటావో నాకైతే తెలియదుగానీ, నువ్వు దీన్ని సాధించి మా మరిదిని దారిలో పెట్టాలి. ఊర్లో తలెత్తుకుని తిరగ లేకపోతున్నాం' అని అసలు విషయం చెప్పింది.

అదీ సంగతి. ఇదంతా నా మీద ప్రేమతో చెప్పింది కాదు. ఆమె మరిది అక్రమసంబంధం మాన్పించి, ఊర్లో ఆమెకీ, ఆమె భర్తకీ తలవంపులు లేకుండా చేయాలన్నమాట. వాళ్ళ సమస్యను పెళ్ళి పేరుతో నాకు బదిలీ చేశారు. మనుషులు ఎంతగా దిగజారిపోతారో మొదటిసారి నాకర్థమైంది. బహుశా వీళ్ళే బలవంతంమీద అతనిని పెళ్ళికి ఒప్పించి వుంటారు.

ఎవరి ఉద్దేశాలు ఏవైనా మొత్తానికి బలైంది మాత్రం నేను. వెంటనే అతన్ని విడిచిపెట్టి పుట్టింటికి వచ్చెయ్యాలనిపించింది. కానీ తక్కున ఆ ఆలోచన మానుకున్నాను. అంతలో మా ఎదురింటి హంస గుర్తొచ్చింది.

హంసది మా ఎదురిల్లే. అప్పులకు తట్టుకోలేక భర్త ఆత్మహత్య చేసుకోవడంతో పుట్టింటికి చేరిపోయింది. పెళ్ళయి సంవత్సరం దాటకుండానే ఇంటికి వచ్చేసిన కూతుర్ని చూసి ముసలి తల్లి భోరుభోరున ఏడుస్తుంటే ఊళ్ళోని కుర్రకారు మాత్రం ఆమెను చూసి లొట్టలేయడం ప్రారంభించింది.

ఉదయం నిద్రలేచింది మొదలు పొద్దుపోయేవరకు మగవాళ్ళంతా ఆమె ఇంటి ఎదురుగ్గా చేరిపోయి, బాతాఖానీ వేసేవాళ్లు. తెల్లబెల్లంలా బ్రహ్మాండంగా వుండే హంసను వలలో వేసుకోవడానికి ఎవరికి వారు ట్రైచేయడం మొదలుపెట్టారు.

కొందరైతే ఆమె ఇంటి చూరే అయిపోయారు. మరికొందరు ఆమె ఇంటి దడిలా అయిపోయారు. ఇరవైనాలుగు గంటలూ ఎవరో ఒకరు ఆమె ఇంటి ముందు తచ్చాడ్డం మొదలుపెట్టారు.

కొందరు రాయబారాలు పంపారు. మరికొందరు ప్రేమలేఖలు రాశారు.

ఇంకొందరు ఖరీదైన కానుకలు పంపారు.

అందర్నీ ఆమె వ్యతిరేకించింది. తనకు అలాంటి ఉద్దేశం లేదని కొందరికి బుజ్జగించి చెప్పింది. కొందరిని భయపెట్టింది. ఇంకొందర్ని కోపపడింది. కానీ ఎవరూ ఆమె గోడుని పట్టించుకోలేదు.

తాము రంగంలోంచి తప్పుకుంటే ఇంకెవరినైనా పడుతుందేమోనన్న అనుమానంతో, ఈర్ష్యతో ఎవరూ తమ ప్రయత్నాలను మానుకోలేదు. అందరూ కలిసి ఆమెని హింసించడం ప్రారంభించారు. కన్నీళ్లతో ప్రార్థించినా, కోపంతో బుసలుకొట్టినా తన వెంట పడడం మానుకోని మగవాళ్ళను చూస్తుంటే మొత్తం మగజాతి అంటేనే అసహ్యం వేసింది. కాస్తంత మన శ్శాంతిగా బతకనివ్వనివాళ్లమీద కసిపుట్టుకొచ్చింది.

ఓ రోజు యథాప్రకారం తెల్లవారింది. ఆమె కోసం ప్రయత్నిస్తున్నవాళ్ళంతా ఏదో మిషమీద ఆమె ఇంటి ఎదురుగ్గా గుమిగూడి మాటల్లో పడ్డారు. అలా మూగినవాళ్ళల్లో అరవై ఏళ్ల వయసునుంచి, పదమూడేళ్ల పిల్లవాడివరకూ వున్నారు.

కొంత పొద్దెక్కింది. ఆమెకోసం అందరూ దొంగ చూపులు చూస్తున్నారు. ఎవరికీ కనిపించడంలేదు. ఏమైందోనన్న ప్రశ్న అందరి ముఖాల్లోనూ కదలాడుతోంది. తొమ్మిది గంటల ప్రాంతాన ఆమె బయటికొచ్చింది. బయటున్న మగవాళ్ళంతా అలా బిగుసుకుపోయి చూస్తున్నారు.

నున్నటి గుండు-కాషాయం చీరా, రవికా-చేతిలో పెద్ద పళ్లెం, అందులో కొబ్బరికాయ, పూలు-సన్యాసిని అయిపోయిన ఆమెను అలా గుడ్లప్పగించి చూస్తున్నారు.

(ఇంకావుంది)

## మాధురీకి తీసిపోని సుకన్య

సుకన్యలో విలక్షణమైన ఆకర్షణ, అందం వున్నాయి. ఈమధ్య ఆమె తన అక్కకోసం విదేశాలకు వెళ్ళింది. ఆ సమయంలో, ఆమెకు పెళ్లయ్యిందనే వార్తని కొందరు ప్రచారం చేశారు.

తిరిగొచ్చాక ఈ విషయం తెలిసి, వెంటనే ప్రెస్ మీట్ పెట్టి 'అదంతా అబద్ధం' అని తల్లి తేల్చి చెప్పింది.

"నేనింకా ఎవర్నీ ప్రేమించలేదు. పెళ్లి ఆలోచనే లేదు. ఇప్పట్లో పెళ్లి ప్రసక్తే లేదు. నటిగా ఇంకా ఎంతో సాధించాలి. ఆ తరువాతే పెళ్లి. అదీ పెద్దలు కుదిర్చినదే. ప్రస్తుతం నాలుగు తమిళ చిత్రాలు, ఒక తెలుగు చిత్రం చేస్తున్నాను" అంది సుకన్య.

'ఖల్‌నాయక్'కి తెలుగు 'ఖైదీ నెంబర్ వన్'లో 'చోళీకే పీఛే...' పాట స్థానంలో 'పైపైనక ఏవుందమ్మో, పైపైనక ఏవుంది! రైకెనక ఏవుందమ్మో, రైకెనక ఏవుంది!" అనే పాట సన్నివేశంలో మాధురీ దీక్షిత్‌కి తీసిపోని విధంగా ప్రతిభ కనబరుస్తూ డాన్స్ చేసిందిట, ఈ లావణ్యరాశి.



# అంతరం

ఆకాశపు తూరుపు అంచులో వెలుగు కిరణం పురుడు పోసుకునేకంటే ముందే బామ్మ నిద్దురలేస్తుంది.

తన గది, అరుగూ, వాకిలీ ఊడ్చి వాకిట్లో నీళ్ళు చల్లి, స్నానంచేసి పూజగదిలో కూచుని సుప్రభాతం చదువుతూన్న సమయంలో పాలవేకువ భూమిపైకి నెమ్మది నెమ్మదిగా జారుతుంది.

ఎంతటి చలికాలంలో అయినా బామ్మ దిన చర్యలో మార్పు వుండదు. డిశంబరు నెలలో శరీరాన్ని గడ్డకట్టించే చలికి భయపడి ఉలెన్ దుప్పటి ముసుగేసుకుని పడుకుంటానా?... ఎప్పుడో తెల్లవారు ఝామున మూత్రంవస్తోందని గజగజ వణుక్కుంటూ బయటకు వస్తే అంత చలిలోనూ వాకిలి ఊడుస్తూనో, బావి దగ్గర స్నానంచేస్తూనో, పుష్పాపచయం గావిస్తూనో కనిపిస్తుంది బామ్మ.

చలిని మరిచిపోయి అలా నిలబడి బామ్మనే చూస్తూ వుంటే వెన్నెలంత చల్లగా నవ్వి బొగ్గులకుంపటి వెలిగించి చలికాచుకొమ్మని ముందుకు జరుపుతుంది.

ఎంతటి విపత్తు వచ్చిపడినా ప్రభాతపూజలు చేయకుండా వుండలేదు.

బామ్మలోని భక్తికన్నా ఆమెలోని చిత్తశుద్ధి, క్రమశిక్షణ నన్ను ఆశ్చర్యచకితుణ్ణి చేస్తాయి.

## బెజ్జారపు వినోద్ కుమార్

బామ్మ తనకన్నా ఎక్కువగా మమ్మల్ని ప్రేమిస్తుందనేది నిర్వివాదాంశం. అయినప్పటికీ మాకు బామ్మమీద అయిష్టత ఏర్పడడానికి కారణం ఒకే ఒక్క విషయం. ఆ విషయం మానసికంగా మాకెన్నో బాధల్ని కలిగించి ఆమెపైన అసహ్యాన్ని పెంచాయి.

• • •

ముక్కిపోయిన పాత చింతకాయ పచ్చడి బామ్మ భావాలకు ప్రతిరూపం.

పబ్లిక్ టాప్‌లో నీళ్ళను ముట్టుకోదామె. స్నానానికి-పూజకు, మడివంటకు అన్నింటికీ బావినీళ్ళే వాడుతుంది. అదికూడా చేదిన ప్రతిసారి నాలుగు చేదల నీళ్ళు బావి చుట్టూరా కుమ్మరించిగానీ వాడదు. పొరపాటున బావిలో ఏదైనా కోడి ఈకో, పిట్టపిల్లో, గుడ్డపేలికో ఎగిరొచ్చి పడిందనుకోండి. వారం పది రోజులవరకూ ఆ బావినీళ్ళు ముట్టదు.

అలా అని నల్లానీళ్ళతో రాజీపడుతుందనుకునేరు సుమా... పక్కవీధిలో వుండే పరమేశ్వరశాస్త్రి గారింటి నుండి నీళ్ళు తెచ్చుకుంటుంది. అలా ఆమె నీళ్లకు వెళ్ళిందంటే చుట్టుపక్కలవాళ్లంతా తమతమ పనుల్ని వదిలేసి గుమ్మంలో నిలబడతారు. లోలోపల ఏవో మంత్రాలు జపిస్తూ బిందెలోంచి నీళ్ళు తీసి దారి పొడుగునా చిలకరిస్తూ వస్తూంటే చూసి తరించాల్సిందేనని చాలామంది చెప్తూంటారు...

అలా దారిపొడుగునా నీళ్ళు చిలకరిస్తూ ఇంటికి వచ్చేసరికల్లా నీళ్ళన్నీ అయిపోయి అడుక్కి కొన్ని మిగిలి వుంటాయి. అలా వస్తూండగా ఎవరయినా తుమ్మడమో, కానివారు ఎదురుకావడమో జరిగిందనుకోండి ఆ నీళ్ళను అక్కడే కుమ్మరిస్తుంది.

అలా ఎన్నిసార్లయినా తిరుగుతుందికానీ కుమ్మరించడం మటుకు మానదు.

అన్యమతస్థులుగానీ, ఇతర కులస్థులుగానీ మా ఇంటికి వస్తే వారి రాకతోపాటే బామ్మ సణుగుడు కూడా ప్రారంభమవుతుంది.

పెద్దన్నయ్య ఇంజనీరు, చిన్నన్నయ్య లాయరు. బామ్మ బాధ భరించలేక రాత్రయ్యేవరకూ ఆఫీసులోనే వుండిపోయేవాడు పెద్దన్నయ్య. రెండో అన్నయ్య అయితే బయటే ఆఫీసు తెరిచాడు. ఎందుకంటే ఆయన కోసం వచ్చిన కాంట్రాక్టర్లు, ఈయన కోసం వచ్చే క్లయింట్లు మా ఇంటినుండి పారిపోయిన సందర్భాలు లెక్కలేనన్ని.

ఈ విషయంలో అన్నయ్యలు బామ్మతో ఎన్నిసార్లు మొరపెట్టుకున్నా ఎన్ని తిట్లు తిట్టినా ఆమె ముఖంలో మాత్రం ఎలాంటి భావాలు కనిపించక ప్రశాంతంగా వుండేది. అది ఆమె ప్రత్యేకత. అంతకు మించి బామ్మను ఇంకేమీ చేయకపోవడానికి కారణం నాన్నమీద మాకున్న భయమూ, గౌరవమూ.

నా పరిస్థితి అయితే మరీ దారుణం.

కాలేజీలో మా బామ్మ గురించి అందరికీ తెలుసు. (దానికి కారణం పక్కవీధిలో వుండే ఖాన్‌గారి రెండో కూతురు జుబేదాయే అని నా తీవ్ర అనుమానం. ఆమె నా క్లాస్‌మేట్...) కాలేజిలో ఎవడయినా కాస్తంత చాదస్తంగా ప్రవర్తిస్తే 'రమణగాడి బామ్మ' అనేది వాడి నిక్‌నేమ్ అయి కూచుండేది.

ఇదిలా వుండగా మా సహనాన్ని హద్దులు దాటించే సంఘటన జరిగింది ఓ రోజు సాయంకాలం...

పూజకోసమని బావిలో నీళ్ళు తోడుకుంటూన్న బామ్మకు 'టప్'మన్న చప్పుడు వినిపించింది.

ఏంటా అని బామ్మ వెనుతిరిగి చూసేంతలో బురదతో మురికిగా వున్న రబ్బరుబంతి ఒకటి గోడ మీదుగా ఎగిరివచ్చి తీగమీద ఆరేసివున్న తెల్లని మడి చీరను ముద్దుపెట్టుకుని, అక్కడ గుండ్రని మరకను ముద్రించి ఆ తరువాత కిందనే వున్న పూజబుట్టలో పడి అందులోని సామాగ్రినంతా నేలపై పరిచేసి జర జరా ఓ మూలకు వెళ్లి బుద్ధిగా కూచుంది.

అరికాలిమంట నెత్తికెక్కిందామెకు. దానికి కారకులెవరో చూసి నాలుగు దులుపుదామని అడుగులు వేయబోయేంతలో ఆమెకేమీ శ్రమ కలిగించడం ఇష్టంలేనట్లు సదరు బంతి తాలూకు కుర్రాడు బంతి కోసం సుడిగాలిలా లోపలికి వచ్చాడు.

వాడు పక్కవీధిలోని కరీంఖాన్‌గారి అయిదో పుత్రరత్నం. బామ్మను చూడగానే తన మురికి చొక్కాతో నోటినుండి కారుతూన్న చొంగని తుడుచుకుని నిర్మలమైన పసినవ్వు నవ్వాడు.

బామ్మ శరీరం వణికింది.

తట్టుకోలేకపోయిందామె. కోపంతో మెదడు దిమ్మతిరిగిపోగా పక్కనేవున్న కర్ర అందుకుని ముందుకు ఉరికింది. బామ్మ రౌద్రాకారం చూసి వాడు పరుగు లంకించుకున్నాడు. విక్రమార్కుడి తోబుట్టువులా తానూ వాడి వెంట వీధిలోకి పరుగెత్తింది బామ్మ. వాడు గద్దె ఎక్కితే తానూ ఎక్కి వాడి వెంటే పరుగెడుతూ చార్లీచాప్లిన్ సినిమాలోని సీన్‌ని సృష్టించింది. వాడు విజయవంతంగా బామ్మను తప్పించుకుని తన ఇంటిలోకి దూరిపోయాడు.

ఖాన్ ఇంటిలోనికి దూరలేక నిస్సహాయతతో ఖాన్ ఇంటిముందర నిలబడి ఖాన్‌ను అతని అటు ఏడుతరాల్ని, ఇటు ఏడు తరాల్ని దిక్కులేనన్ని శాపనార్థాలూ పెట్టి తిరిగి మా ఇంటిముందర వాకిట్లో నిలబడి భోరున ఏడుస్తూ మళ్ళీ తిట్టడం మొదలెట్టింది. కొద్ది క్షణాల్లోనే వీది వీధంతా మా ఇంటి ముందర పోగయ్యింది.

సాయంకాలం నాన్న, అన్నయ్యలు ఇంటికి వచ్చేసరికల్లా ఇంటిముందర పెద్ద గుంపు. దూరంనుండి చూస్తే, మా వాకిట్లో వీధిభాగోతం నడుస్తూన్నట్టు మా బామ్మ ప్రధాన పాత్రధారిణిగా శివతాండవం చేస్తూంటే ఆడియన్స్ అంతా ఈలలు వేస్తూ చప్పట్లు కొడుతూన్నట్లు కనిపించసాగింది.

ఆ రోజు రాత్రి బామ్మమీద విరుచుకుపడ్డారు అన్నయ్యలిద్దరూ...

"ప్రపంచంలో నీకు తప్ప ఇంకెవరికీ మడీ ఆచారాలు లేవనా మిడిసిపాటు? అసలేంటే నీ గొప్ప..." అలా తిడుతూనే వుండిపోయాడు పెద్దన్నయ్య.

"నీకు బుద్ధిలేదే నాయనమ్మా... ఇంత చదువులు చదివీ నీ మూలంగా నలుగురిలో తలెత్తుకు తిరగలేకపోతూన్నాం. మేం రోజంతా అన్ని కులాలవారితోనూ, అన్ని మతస్థులతోనూ కలిసి తిరుగుతాం... మరి మమ్మల్ని మాత్రం ఎలా భరించగలుగుతూన్నావ్..." రెండో అన్నయ్యకు ఆవేశం రావాలేగానీ ఆయనను ఆపడం ఎవరితరమూ కాదు.

"నిజమే... మొన్న కరీంఖాన్ కూతురు జుబేదాను ఏమో అన్నావటగా. కాలేజిలో నా పరువు పోయింది తెల్సా" అన్నాను నేను కూడా.

పది రోజుల క్రితం నాకు కాలేజిలో జరిగిన అవమానాన్ని ఎలా మర్చిపోగలను నేను.

ఒక అరగంటసేపు అన్నయ్యల నోట్లోంచి తిట్లు ధారాళంగా వెలువడుతూనే వున్నా, బామ్మ ముఖం నిండా అదే ప్రశాంతత... అదే భావరాహిత్యం.

మూర్తి బలైపోతున్నాడనీ!'

అయితే అక్కకూడా వాళ్ళమ్మలాగే ఆఖరి కూతురి పెళ్లి చేసేసి ఇంకా ఆరుమాసాలు సర్వీసుండగానే చనిపోయింది. సర్వీసులో వుండగానే చనిపోవడంచేత సుమారు 'లకారం' వచ్చిందని నారాయణమూర్తి రాశాడు. ఆఖరి కొడుకు టెన్త్ పదిసార్లు తప్పి వుంటాడు. వాడికి ప్రభుత్వం ఉద్యోగం ఇచ్చిందనీ నారాయణమూర్తి రాయగా తెలిసింది.

"ఏంటి మావయ్యా! ఆలోచిస్తున్నావ్?" అన్న




నారాయణమూర్తి మాటలకు తేరుకొని, "అయితే నారాయణ మూర్తీ! అమ్మ డబ్బేం చేశారు?" అన్నాను.

"వాళ్ళే పంచేసుకున్నారు. తమ్ముళ్ల మాకు ఆధారం ఏమీ లేదు మాకు న్యాయం చేయమన్నారు. బావలు మాకప్పుడు కట్నాలే ఇవ్వలేదన్నారు. సరే పంచుకోమన్నా. పెన్షను నాన్న పేర్నొస్తోంది. అదీ తమ్ముడే తీసుకుంటాడు. అప్పుడప్పుడు నాన్న చెల్లెళ్ళకిస్తూ-తిక్కపుడితే ఎవరికీ ఇవ్వననీ తనే తీసుకుంటాడు" అన్నాడు.

"మరీ ఖర్చంతా?"

"నేనే పెట్టుకున్నాను. అమ్మకి ఆత్మశాంతి కలగాలి. నువ్వే చెప్పు మామయ్యా. అమ్మకి కష్టాలే కానీ, సుఖం అన్నది తెలుసా? అందుకే ఖర్చంతా నేనే మీద వేసుకున్నాను" అన్నాడు రుద్ధకంఠంతో.

"అవునుకానీ వచ్చినవాళ్ళందరికీ బట్టలేమిటి? గోదానం, హిరణ్యదానం అని అంత ఖర్చేమిటి? మీ అమ్మ నువ్వు బాధపడితే అసలు శాంతించదు తెలుసా?" దెబ్బలాడినట్లు అన్నాను.

ఈలోగా-

ఆవుతో కుస్తీలు పడుతున్నారు. ఎంత ప్రయత్నించినా ఆవు బ్రాహ్మల వెనక వెళ్లటంలేదు. "దూడకోసం భయపడుతున్నదేమో దాని ముందు పెట్టండి దూడని" అని ఒకరన్నారు. దూడను ముందు పెట్టారు. అయినా అది వెళ్ళినట్లే వెళ్ళి వెనుదిరిగిపోతోంది.

"ముందు గడ్డిపట్టుకు నడవండి చూదాం" చుట్టాల్లో ఒకరి సలహా.

గడ్డి ముందు పట్టుకెళ్తోంటే కొంతవరకూ వెళ్ళి ఒక మెట్టు దిగి మళ్ళీ తిరిగిపోయింది.

ఈలోగా చిన్న చిన్న చినుకులు. నేల తడితడిగా అయి గట్టిగా అడుగేస్తే జారుతోంది.

"నాణమూతీ! ఇలారా! ఇంకా మీ అమ్మకేం ఇవ్వాలో. గోమాత వెళ్లటంలేదు" అన్నాడో పెద్దాయన.

"మీ అమ్మకేం కోరిక మిగిలిందో?" ఇంకొకరు.

మా బావని ఉద్దేశించి-"ఏమండోయ్! మీ ఆవిడ సంగతి మీరే చూస్కోండి!" ఇంకొకరు.

నారాయణమూర్తి కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు. "అమ్మా! మావయ్య వచ్చాడు. చూడు" అన్నాడు గోమాత తలను నాకేసి తిప్పి. అది విసిరికొట్టింది. నారాయణమూర్తి పడిపోయాడు.

"అమ్మా! నాకు గుర్తున్నంతవరకూ తక్కువేం చేయలేదు నీకు. చెప్పమ్మా. నాలో దోషముంటే క్షమించు. నీ పాదాలు పట్టుకుంటాను" గోమాత పాదాల దగ్గర మోకరిల్లాడు. అది వెనక్కి పారిపోయింది.

అక్కడున్నవారు రకరకాల సలహాలిచ్చారు. అవి దానం చెయ్యాలి. ఇవి దానంచెయ్యాలీ అన్నారు. గోవుమీద మరో అయిదొందలో, వెయ్యో పెట్టమన్నారు. అరెకరమో, ఎకరమో భూదానం చెయ్యమన్నారు. నారాయణమూర్తి అన్నిటికీ ఒప్పుకునేలా కనిపించేసరికి నేను జోక్యంచేసుకోక తప్పలేదు. పరిస్థితినంతా సమీక్షించాను. ఆవు గడప దిగి ఎందుకెళ్ళటంలేదా ఆలోచించాను.

అప్పటికే నారాయణమూర్తి పీకవరకూ అప్పు చేశాడు. వీళ్ళంతా తలోరకంగా ఆలోచించి, ఉచిత సలహాలిస్తున్నారు. అక్కడున్నవాళ్ళందర్నీ ఒకప్పుడు అక్క అసహ్యించుకునేది. అక్కని వీళ్ళంతా తలో రకంగా పీక్కుతిన్నవాళ్ళే!

ఎందుకు గోవు మెట్లు దిగి వెళ్ళడంలేదో అర్థం కాలేదు. గోవు గడప దిగి రోడ్డుమీదికెళ్ళాలంటే ఇరవై మెట్లు దిగాలి. అవి చిన్నచిన్నవి. ఒక పక్క పెద్ద నుయ్యి లోతుగా కనిపిస్తోంది. మరో పక్క గొయ్యిలా వుంది. దిగేందుకు దానికి భయం వేస్తోందో ఏమో?

"నారాయణా! ఆ తుండు ఇలా తే!" అన్నాను.

గోవుని గట్టిగా పట్టుకోమన్నాను. దాని కొమ్ముల మీదనుండి కళ్ళు కనిపించకుండా తుండుగుడ్డ గట్టిగా కట్టేశాను. కన్నె పట్టుకుని ముందొకరు జాగర్తగా దిగండన్నాను. ఒక మెట్టు దిగింది గోవు. మళ్ళీ వెనకడుగు వేయబోయింది. అందరూ నన్నెకసెక్కం చెయ్యడానికి సిద్ధంగా వున్నారు.

నేను దాని పృష్ఠభాగాన్ని ముందుకు తోశాను. అది ఒక్క దూకు కిందకి దూకింది.

కన్ని పట్టుకున్న పంతులు పుచ్చకాయలా మెట్లమీదనుండి దొర్లి కిందపడ్డాడు. గోవు మాత్రం రోడ్డుమీద చతికిలపడింది. నేను గోవుకి కట్టిన గంతలు విప్పాను.

గోవు నాలుగు కాళ్ళతో కుదురుగా నిలబడింది. ముందున్న దాని దూడని తనివితీరా నాకడం మొదలెట్టింది. గోవు గడపదిగిన సంతోషంతో తగిలిన దెబ్బని ఖాతరుచేయక పంతులుగారు గడప దిగి గోవు మెడలో కన్ని అందుకుని ముందుకు నడిచారు. "వస్తా బాబూ!" అని రెండు చేతులూ జోడించి.

గోవు కరుణించింది. గోమాత దయ చూపింది. చకచకా నడుచుకుంటూ పంతులుగారి వెనక వెళ్తోంది.

"ఏదయినా వాళ్ళ తమ్ముడు చెప్పాడు కాబట్టి వింది" అన్నారంతా.

మరి నాకా సమయంలో ఆ ఆలోచనే రాకపోతే మా నారాయణమూర్తిచేత ఆ మూర్ఖశిఖామణులు ఇంకెంత ఖర్చు చేయించేసేవారో?

సీరియల్



# రార్రా మా ఇంటిదాకా

మేర్లపాక మురళి

హంస గుడికెళ్లి ఇంటికి వచ్చేటప్పటికి అక్కడ ఎవరూ లేరు. ఎంతో రిలీఫ్‌గా ఫీలయింది. మగవాళ్లమీదున్న కసిని అలా తీర్చుకుంది. ఒంటరిగా వున్న తను ప్రశాంతంగా బతకడానికి ఆమె నెలకోసారి గుండు గీయించుకొనేది.కాషాయం వదలలేదు.

హంస గుర్తొచ్చేసరికి పుట్టింటికి వెళ్లాలన్న ఆలోచన మానుకున్నాను. కాకుల్లాగా మీదపడి పెరుక్కుతినాలని చూసే మగవాళ్ళు, తన కూతురు బతుకు ఇలా అయిందని ప్రతినిత్యం కళ్ళల్లో నీళ్ళు కుక్కుకునే తల్లీ దండ్రీ కదలాడడంతో వాడ్ని వదలాలన్న ఆలోచన మానుకున్నాను.

ఇక మిగిలింది వాడ్ని నావైపు తిప్పుకోవడం. అలాంటి నీచుడి కోసం మరో స్త్రీతో పోటీపడడం అంటేనే అసహ్యంవేసింది. కానీ తప్పదు.

సమయం కోసం చూస్తున్నాను.

సాయంకాలం వచ్చారు కిషోర్, మాధవి. అంత కాలం బందింపబడి ఒక్కసారిగా స్వేచ్ఛను పొందినట్లు వెలిగిపోతున్నారు.

నేను వాళ్ళను చూసి, ఎలాంటి భావననూ వ్యక్తం చేయకుండా మౌనంగా వుండిపోయాను.

ఆ రాత్రి గదిలోకి వెళ్ళగానే అటు తిరిగి పడుకున్న ఆయన కనిపించాడు. ఇప్పుడు తలనొప్పి అని కూడా చెప్పడంలేదు. నేను బలంగానే నిట్టూరుస్తూ కింద చాపమీద పడుకున్నాను. బాగా అలిసిపోయానేమో నిద్రపట్టేసింది.

ఎందుకనో ఒకవేళప్పుడు మెలకువ వచ్చింది.

పక్కకు తిరిగి చూస్తే ఆయన మంచంమీద లేరు. ఎక్కడికెళ్ళినట్లు?

పడకమీదనుంచి లేచి మెల్లగా తలుపు తెరిచాను. ఎదురుగ్గా మాధవి ఇంట్లోంచి గుసగుసలు విన్పిస్తున్నాయి.అక్కడికి నడిచాను.

కిటికీ రెక్కను పక్కకు తొలగించాను.

లోపలి దృశ్యం నేను ఊహించిందే.మాధవి ఒంటిమీద నూలుపోగు లేదు. భారీ పర్సనాలిటీ కావడంతో మంచాన్నంతా ఆక్రమించుకుని మగవాడికి ఛాలెంజింగ్‌గా వుంది. నగ్నత్వం అంత ఎరోటిక్‌గా వుంటుందని తెలియడం అదే మొదటిసారి నాకు. శరీరంమీద పాలతో ఎవరో మర్దించినట్టు జీరోవాట్స్ బల్బు వెలుగులో ఆమె తెల్లగా మెరిసిపోతోంది.

ఒంటిపై బట్టలు లేకపోవడంవల్ల ఆమె అవయవాలు మరింత స్పష్టంగా, బలంగా, విశాలంగా కనిపిస్తున్నాయి. వాడు గుటకలు మింగుతూ చూస్తున్నాడు.

మాధవి ఏదో అంది. వాడిలో మరింత తమకం రేగింది. ఇక అక్కడ వుండలేకపోయాను.

తిరిగి వచ్చేశాను.

ఆ రాత్రంతా నిద్రపట్టుంటే ఒట్టు. మొత్తం పథకం అంతా సిద్ధంచేసుకున్నాను. వాడ్ని నావైపు తిప్పుకోవాలంటే నేను మాధవితో పోటీపడడం తప్పనిసరి. మంచంలో వాడ్ని మాధవికన్నా రంజింపచేయగలిగితే నేను గెలిచినట్లే. మాధవినుంచి వాడ్ని దూరం చేయడానికి మరో మార్గంలేదు నాకు.

ఇలా జరుగుతుందేమోనన్న అనుమానం మాధవికి కూడా వున్నట్లుంది. నేనూ, వాడు ఏకాంతంగా కలుసుకుంటామేమోనని మమ్మల్ని ఇరవైనాలుగు గంటలూ గమనించేది.

నేను దొడ్లోకెళ్లినా, సాయంకాలం డాబామీదకు చేరినా నన్ను అనుసరించేది. ఎప్పుడైనా మధ్యాహ్నం నేను వాడు పడుకున్న గదిలోకి వెళ్ళి పడుకుంటే అటూ ఇటూ బయట తచ్చాడుతుండేది.

మేమిద్దరం ఎప్పుడైనా మాట్లాడుకోవడాన్ని చూస్తే తన అసహనాన్నంతా పాత్రలను విసిరేసో, భర్త సాకు మీద తిడుతూనో వ్యక్తపరిచేది. అంత కచ్చబోతుతనాన్ని ప్రదర్శించేది.

ఇది ఎంత దూరం వెళ్ళిందంటే రాత్రుల్లో మా

**18** వంశీ, సుజనల పెళ్లవుతుంది. శోభనం రోజున సుజనకు మూడు రోజుల ఇబ్బంది కలుగుతుంది. అందుకని ఆమె తండ్రి వేరే ముహూర్తం నిర్ణయిస్తాడు. కానీ ఆ ముహూర్తానికి ముందే శోభనం జరుపుకోవాలని వంశీ చేసిన నాలుగు ప్రయత్నాలు విఫలమవుతాయి.

వంశీకి ఎక్కడినుండో ఓ వీడియో క్యాసెట్ అందుతుంది. దానిలో తన భార్య సుజన ఓ యువకునితో శృంగారంలో పాల్గొనడం చూసిన వంశీ గిలగిల్లాడుతాడు. క్యాసెట్ విషయమై ఆచూకీ తీయడానికి మద్రాసు వెళ్ళి, ఇన్‌స్పెక్టర్ శరవణన్‌ని కలుసుకుంటాడు. శరవణన్ ఎవరికో ఫోన్ చేసి ఫేక్ క్యాసెట్లు ఎలా చేస్తారో కనుక్కుని వంశీకి చెప్తాడు. విట్టిబాబును ఎలా శిక్షించాలో చెప్తాడు వంశీ.

సుజన, లాలన శివాలయానికి బయల్దేరుతారు. దారిలో తన ఫ్రెండ్ మంజుల ఫస్ట్‌నైట్‌న జరిగిన విషాదసంఘటన గురించి చెప్పి, విషాదాలే కాదు తమాషాలుకూడా జరుగుతాయని తమ బంధువుల అమ్మాయి సుమతిగురించి చెప్తుంది. తరువాత సుమతి సంఘటనకు వ్యతిరేకంగా జరిగిన తన ఫస్ట్‌నైట్ గురించి చెప్తూ తమ ఎదురింటి హంస విషయం చెప్తుంది.

రూమ్‌లో మా ఇద్దరి మధ్యా పడుకుండిపోయేది.

అలా జరుగుతుందని ఎవరైనా చెప్పుంటే నేను నమ్మేదాన్ని కాను. కానీ స్వయంగా చూస్తుండడం వల్ల నమ్మకుండా ఎలా వుండగలను?

రాత్రి పాత్రలన్నీ సర్ది గదిలోకి వెళ్ళేసరికి మాధవి అక్కడ చాపమీద పడుకుని కనిపించేది. వాడు మంచం మీద అటూ ఇటూ కదులుతుండేవాడు.

వాళ్ళిద్దరి మధ్యకూ వెళ్ళి అలా గదిలో పడుకోవడం అసహ్యంగా వుండేది. కానీ నేను వెళ్ళకపోతే వాళ్లిద్దరూ అలా దూరదూరంగా పడుకునేవరకే ఆగరని తెలుసు. అందుకే విధిలేక నేనూ ఆ గదిలోనే చాప పరుచుకుని పడుకునేదాన్ని.

నాకు దగ్గరవుతాడేమోనని మాధవి. ఆమెను ఆక్రమించుకుంటాడేమోనని నేనూ ఒకరికొకరు కాపలా వుండేవాళ్ళమన్నమాట. ముగ్గురం ఒకరికొకరు మాటలు లేకుండా ఒకే గదిలో పడుకోవడం ఎంత నరకమో ఆలోచించు. కానీ తప్పదు. నా కాపురం నాకు ముఖ్యం. తన ప్రియుడు మాధవికి ముఖ్యం.

నా భర్తమీద ఏమిటా అధికారం అని మాధవిని తినేసేటట్లు చూసేదానిని నేను. మా ఇద్దరి మధ్యా నువ్వెందుకు వచ్చావని నన్ను అసహ్యంగా చూసేది ఆమె. ఒకరికి భర్త కావాలి. మరొకరికి ప్రియుడు కావాలి.

ఎవరూ ఎవరికీ దక్కకుండా అలా ముగ్గురం రాత్రంతా మేల్కొని. ఎప్పుడో నిద్రపోయేవాళ్లం. ఇలా ఎంత కాలం?

అట్లాంటి నీచుడి కోసం ఓ స్త్రీతో ఆ విషయంలో పోటీపడడం నాకు బొత్తిగా ఇష్టంలేదు.

కానీ వాడు నా భర్త. నా జీవితం వాడితో ముడిపడిపోయింది. ఆ ముడులను మరింతగా బిగించుకోవడమే ప్రస్తుతం నా కర్తవ్యం.

ఎందుకనో మాధవి మీద నాకు కోపం రాలేదు. అరవై ఏళ్ళ వయసులో మాధవిలాంటి అమ్మాయిని పెళ్లి చేసుకోవడం ఆ వెర్రిబాగులోడి తప్పు. మాధవి స్థానంలో ఎవరున్నా అలానే ప్రవర్తిస్తారు.

ఆడపిల్ల తప్పులకు కూడా మగవాడే బాధ్యుడని నేను బలంగా నమ్ముతాను.

రెండో రోజు ఉదయం పది గంటలప్పుడు కిషోర్ గదిలో వున్నాడు. కాఫీ తీసుకుని లోపలికెళ్లాను.

'నేను ఊరెళ్ళిపోతున్నాను'

వాడికి పొలమారింది.

'నేను ఊరెళ్ళిపోతున్నాను' మరోసారి చెప్పాను.

వాడికి వెంటనే ఏం సమాధానం చెప్పాలో తోచలేదు.

'ఇంకెందుకు ఇక్కడ?' అన్నాను.

వాడు లేచి వెళ్ళిపోయాడు.

వాడ్ని కదిలించడానికి ఆ డోస్ చాలనుకున్నాను.

మధ్యాహ్నం భోజనానికి కూడా రాలేదు.

సాయంకాలం నాలుగు గంటలకు కాబోలు వచ్చాడు. మాధవి కూడా ఉదయంనుంచీ ఇంట్లో లేదు. పొలం వెళ్లింది.



## రిషీ గొప్పలు!

రిషికపూర్‌కి సొంత డబ్బా కొట్టుకోవడానికి ఈమధ్య ఓ కొత్త కారణం దొరికింది.

"నేనే వారి తొలి హీరోగా 22 మంది హీరోయిన్లు బాలీవుడ్‌లో అడుగు పెట్టారు.

సుష్మితాసేన్‌కి కూడా నావల్లనే అదృష్టం వరించింది. నేను ఈ ఏడాది తొలిసారిగా మిస్ ఇండియా పోటీకి జడ్జీగా వున్నాను. ఆమె మిస్ ఇండియా కావడమేగాక, మిస్ యూనివర్స్ కిరీటాన్ని గెలుపొందిన తొలి భారతీయురాలైంది. ఇదంతా నా రికార్డుగా, నా పేరుని గిన్నెస్ బుక్‌లో ఎక్కించాల్సిందే!" అని అంటున్నాడు రిషికపూర్.



నా విషయమై సంప్రదించడానికి ఆమె కూడా లేకపోవడంతో వాడికి ఏమీతోచక పిచ్చిపట్టినవాడిలా అటూ ఇటూ తిరుగుతున్నాడు.

నేను వంటపనిలో మునిగిపోయాను.

చీకట్లుపడ్డాయి. అమావాస్య రోజులు కాబోలు చీకటి దట్టంగా వుంది. వండిన పదార్థాలన్నీ దొడ్లోంచి ఇంట్లోకి తీసుకొచ్చాను.

ఎక్కడా అలికిడిలేదు.

మాధవి భర్త బయట తిన్నెమీద కూర్చుని దగ్గుతున్నాడు. అంటే మాధవికూడా వచ్చిందన్నమాట.

అయితే ఎక్కడికెళ్లారు వీళ్లిద్దరూ?

ఇల్లంతా తిరిగానుగానీ ఎక్కడా కనపడలేదు.

ఇక మిగిలింది డాబా.

మెల్లగా మెట్లెక్కాను.

సగం మెట్ల దగ్గిరికి వెళ్ళానో లేదో మాటలు వినిపించాయి. బాగా వంగి మరో నాలుగు మెట్లెక్కాను.

ఇప్పుడు స్పష్టంగా విన్పిస్తున్నాయి మాటలు.

'ఉదయం ఇంటికెళ్లిపోతానంది. అది ఇంత తొందరగా బరితెగిస్తుందని అనుకోలేదు. నాకైతే కాళ్ళూ చేతులూ ఆడలేదనుకో' వాడు అంటున్నాడు.

'మన విషయం పసిగట్టే వుంటుంది. పుట్టింటికి తరిమెయ్. పీడా వదులుతుంది. నీకిష్టం లేకుండా బలవంతంగా ఈ పెళ్లి చేసిన మీ అన్నయ్యకు బుద్ధి వస్తుంది' మాధవి కసిగా అంది.

'నాకూ అది ఇష్టమనుకో. కానీ ఊరు ఊరంతా ఏమనుకుంటుంది? పరువు పోతుంది. అదీగాక ప్రస్తుతం కాలాలు కూడా మారిపోయాయి. దాని తండ్రి పోలీసు రిపోర్ట్ ఇస్తే నేను తగులుకుపోతాను'

మాధవి ఆలోచనలో పడ్డట్టు మౌనం.

'ఏంచేయాలో నాకు తోచడంలేదు'

'నీకు పెళ్లిచేయాలని మీ అన్నయ్య అంటే ఎందుకు ఒద్దన్నానో ఇప్పుడైనా అర్థమైందా?'

'జరిగిపోయిందాని గురించి ఇప్పుడు వగచి ఏం లాభం? జరగాల్సిందాన్ని గురించి ఆలోచిద్దాం'

ఇలా చాలాసేపు చర్చించుకున్న తరువాత చివరికి వాడు అన్నాడు–'శోభనం గొడవ ఏదో కానిచ్చేస్తాను. దాని కడుపులో ఓ కాయ కాస్తే ఇక పుట్టింటికి వెళతానని అనదు. పిల్లాడు పుట్టాక అది ఎక్కడికి వెళుతుంది? కుక్కలా కాపలా వుంటుంది'

నాక్కావలసింది కూడా అదే.

మాధవి ఒప్పుకోలేదు. అది అభిమానమో, ఈర్ష్యో, ఫస్ట్‌నైట్ జరిగాక తనను చులకన చేస్తాడేమోనన్న భయమో తెలియదు. ససేమిరా వీలుకాదంది.

మరో అరగంటకు వాడు కన్విన్స్ చేయగలిగాడు. అతికష్టంమీద ఒప్పుకుంది. 'నేను సరేనన్నాను గదా అని దాంతో తైతక్కలాడుతూ వున్నావంటే ఊరు

## ములక్కాడల కూటు

**కావలసినవి:** పావుకిలో కందిపప్పు, 6 ములక్కాడలు, మసాలా దినుసులు.



**చేసేవిధానం:** ముందుగా కందిపప్పు కుక్కరులో మెత్తగా ఉడకబెట్టాలి. దానిలో ములక్కాడ ముక్కలు వేయాలి. నిమ్మకాయంత చింతపండులో రసంతీసి వేయాలి. తగినంత ఉప్పు, చిటికెడు పసుపువేసి ముక్కలు మెత్తబడేవరకు ఉడికించాలి.

కప్పు సెనగపప్పు, అందులో సగం ధనియాలు, 10 ఎండుమిర్చి, స్పూన్ మిరియాలు, అరస్పూన్ జీలకర్ర, అరస్పూన్ మెంతులు, ఎండుకొబ్బరి లేదా పచ్చికొబ్బరి తురుము కొద్దిగా ఇవన్నీ దోరగా వేయించి, మిక్సీలో గ్రైండ్‌చేసి ఆ పొడరు ఉడుకుతున్న కూటులో వేసి రెండు పొంగులు వచ్చాక కరివేపాకు కూడా వేసి మరోసారి ఉడికించి దింపుకోవాలి. ఈ కూటు ఘుమఘుమలాడుతూ చాలా రుచిగా వుంటుంది. అన్నంలోకి, చపాతీకి కూడా పనికివస్తుంది.

–కె. రామతులసి

కోను. ఏదో కలిశావంటే కలిశానన్న స్థాయిలోనే వుండాలి' అంటూ షరతులు పెట్టింది.

వాడు తల ఊపాడు.

నేను మెట్లు దిగి కిందకు వచ్చేశాను.

రాత్రి భోజనాలయ్యాక ఎవరికీ తెలియకుండా దొంగచాటుగా స్నానం చేశాను. లైట్‌గా ఒళ్లంతా పౌడర్ రాసుకున్నాను. మల్లెపూలు కాస్త ఎక్కువగానే తలలో తురుముకున్నాను. నీలం కాటన్ చీరమీద అదే రంగు జాకెట్టు వేసుకున్నాను.

వాళ్ళ మాటలు నేను విన్నానన్న డౌట్ రాకుండా అన్ని జాగ్రత్తలు తీసుకుంటూనే అందంగా తయారయ్యాను. తొమ్మిది గంటలకి గదిలోకి వెళ్ళాను. చాప పరుచుకుని పడుకున్నాను.

వాడు మరో అరగంటకి లోపలికి వచ్చాడు.

మంచంమీద కూర్చుని ఏమీ తోచక అసహనంగా అటూ ఇటూ కదులుతున్నాడు.

'తలనొప్పా?' అనడిగాను నవ్వుతూ.

'లేదు...లేదు' నేను అలా అడిగేసరికి కంగారుపడ్డాడు.

మాధవితో పోటీపడి గెలవాలి. ఆమెని వీడినుంచి దూరంచేసి నా కాపురాన్ని నిలబెట్టుకోవాలి. ఇదంతా అసహ్యంగా వున్నా తప్పదు మరి. విజృంభించాలి.

అందుకే సహజమైన సిగ్గుని వదిలేశాను. జాణతనాన్ని నేర్చుకున్నాను.

అలా కూర్చునే చేతులు రెండూ పైకెత్తి ఒళ్ళు విరుచుకున్నాను. అప్పుడు పైట కిందకు లాక్కుపోయి నా స్తనాలు వాడి కళ్ళల్లో డైనమైట్లయి పేలాయి. మందారాల పొడితో చేసినట్లుండే బొడ్డు కనిపించీ, కనిపించకుండా ఊరించింది.

నేను పైట సర్దుకునే ప్రయత్నమేమీ చేయలేదు. నిజానికి నాలో అద్భుతంగా వుండే పార్టు కూడా అదే. పెళ్లికాక ముందు నేను వీధిలో నడుస్తుంటే యువకులు ఆబగా అక్కడ చూడడం నాకు తెలుసు. అవి తుపాను హెచ్చరిక కేంద్రాల్లా భయపెడతాయి. భయాన్ని కూడా నవరసాల్లో ఒకటిగా ఎందుకు చేర్చారో అలాంటప్పుడే అర్థమవుతుందనుకుంటా.

'అబ్బ! ఏదో పురుగు పడిందండీ' అంటూ కంగారుగా పైకి లేచి చీరకుచ్చిళ్ళను పెరికి దులుపుకున్నాను. అతనిలో కోరిక రాజుకోవడానికి చీర మడతలతో విసురుతున్నట్లే వుంది.

'పోయిందండీ' అంటూ కూర్చున్నాను. అయితే చీరకుచ్చిళ్లను తిరిగి దోపుకోలేదు. వాటిని అలా ఒళ్లో వేసుకున్నానంతే.

పైన ఏ ఆచ్ఛాదనా లేకపోవడంతో ఇరవై ఏళ్ల యవ్వనాన్ని పూలపొట్లంలా కట్టినట్లున్న నా ఎద అతనిలో వాంఛను రేకెత్తిస్తోంది.

'ఈ జాకెట్టుకు అయిదు హుక్‌లున్నాయి. వీటిని ఒకేసారి తెంపగలరా? పందెం కడదామా? మీరు తెంపలేరని నేను బెట్ కడతాను. పందెం ఏమిటో తెలుసా? ఈ రాత్రికి ఇక జాకెట్టు తొడుక్కోను'

ఇలాంటి ఛాలెంజ్‌లకి మగవాడు ఖచ్చితంగా ఒప్పుకుంటాడని తెలుసు. తన పశుబలాన్ని నిరూపించుకునే ఛాన్స్ వదులుకోడు.

'బ్రై చేయండి చూద్దాం' ముందుకు జరిగాను.
ఇప్పుడు మరింత దగ్గరగా నా ఎద.

పూర్ణకుంభాల్లా అవి.

వాడు జాకెట్టు మొదట్లో చేయి చొప్పించి బలంగా లాగాడు.

యవ్వనాన్ని బంధించిన సంకెళ్ళు తెగినట్లు అవి ఊడిపోయాయి.

'భలే బలం మీకు'

ఆ కాంప్లిమెంట్‌కు వాడి ముఖం విప్పారింది.

'పందెం ప్రకారం ఇక జాకెట్టు వేసుకోను' అంటూ జాకెట్టును విప్పేశాను. పాలమీగడలాంటి బ్రా బుద్ధిగా నా ఒంటిని అంటిపెట్టుకుని వుంది.

'ఈ బ్రా సైజెంతో చెప్పగలరా? ఈ విషయాల్లో మీరు కళాకారులని మాధవి చెప్పిందిలెండి. మీరంత రసికులంటకదా. మీరు కరెక్టు సైజు గనుక చెబితే బ్రా కూడా వేసుకోను' అన్నాను.

అలాంటప్పుడు మాధవి పేరెత్తితే వాడు మరింత ఉద్రేకపడతాడని నాకు తెలుసు.

వాడేదో సైజు చెప్పాడు.

నిజానికి నా బ్రా ఆ సైజుది కాదు. కానీ నా లక్ష్యం నెరవేరాలంటే వాడ్ని పొగడక తప్పదు.

'కరెక్టుగా చెప్పారే. అందుకే మాధవక్క మిమ్మల్ని పొగుడుతుంటుంది' అన్నాను నేను.

వాడు గర్వంగా నవ్వాడు.

'ఇందులోనైనా మీరు ఓడిపోయుంటే బ్రా తీసే బాధ తప్పిండేది' అని వగరుస్తూ బ్రా విప్పాను.



### ఇంక ఇక్కడే!

బొంబాయిలో తనకి పరిచయమైన రామ్ గోపాల్ వర్మ ప్రోత్సహించి, తెలుగులో అవకాశమిచ్చాక, క్రమంగా మరిన్ని ఆఫర్లు పొంది నిలదొక్కుకుంటోంది, కులుకువయ్యారాల సురభి.

కుష్బూని చూసి ఇన్స్‌పైరైపోయిన సురభి, ఆమె లాగే ఇక్కడో వెలుగు వెలిగిపోదామని వచ్చిందిట. మలయాళంలో కూడా నటించిన సురభికి తెలుగు ఫీల్డు చాలా నచ్చిందిట. "ఇక్కడంతా టైం ప్రకారం, క్రమశిక్షణతో పనిచేస్తారు" అని మెచ్చుకుంటోంది.

ఇంక ఇక్కడే సెటిలైపోతుందేమో- "తెలుగు చక్కగా మాట్లాడగలుగుతున్నాను. రాయడంకూడా నేర్చుకుంటున్నాను" అంటోంది.

వాడి కళ్లు సాగడం నేను గమనించాను.

'ఈ చీర ఖరీదు ఎంతో చెప్పగలరా? బట్టల సెలక్షన్‌లో మీతో పోటీపడడం కష్టమటకదా. మూడు అడుగుల దూరంనుంచిచూసే బట్టల మన్నిక ఎంతో, వాటి ఖరీదు ఎంతో కూడా చెప్పగలరటకదా'

'ఎవరు చెప్పారు?'

వాడు మాట్లాడుతున్నా, వాడి చూపులు మాత్రం చనుమొనలకు వేలాడుతున్నాయి.

'మాధవక్కయ్య'

వాడు మరింత ఖుషీ అయిపోయాడు.

'మరి పందెం?'

'ఏమిటో మీరే చెప్పండి'

'ఈ రాత్రికి చీర కట్టుకోకూడదు'

'అమ్మో!' అని కళ్లను చారడేసి చేసి-'తప్పదు కదా-సరేలెండి' అన్నాను.

'అయిదొందలు' చెప్పాడు.

'ఏడ్చావులే. ఈ చీర ఖరీదు కేవలం వంద రూపాయలే' అని నిజం చెప్పి వాడెంత ఫూలో తెలియజెప్పాలనిపించింది. కానీ నా లక్ష్యం వేరు.

'భలే చెప్పారే' అని 'నా ఖర్మకొద్దీ మీరు ఇంత కరెక్టుగా చెప్పాలా?' అంటూ చీర విప్పేశాను.

సముద్రం మొత్తం నా కాళ్లను చుట్టేసినట్లు కాళ్ల దగ్గరికి నీలంచీర జారిపోయింది.

లంగా తప్ప మరేం లేదు నా ఒంటిమీద.

వాడు ఉద్రేకపడడం తెలుస్తూనే వుంది.

ఇంకాసేపు అలానే చూస్తే కళ్ళు పేలిపోతాయేమో నన్నట్లు చూస్తున్నాడు.

'చలిగా వుందండీ-కాస్త జరగరూ-నేనూ మంచం మీదకి వచ్చేస్తాను' అన్నాను మెలయలంతా మాటలతో కుమ్మరిస్తున్నట్లు.

వాడు పక్కకు జరిగాడు.

నేను లేచి మంచంమీద వాడిపక్కన కూర్చున్నాను.

వాడి ఊపిరి వదలడం వెచ్చగా తగుల్తోంది. కోరికతో కాలిపోతున్న శరీరంనుండి లేస్తున్న సెగలు నన్ను చుట్టుకుంటున్నాయి.

వాడికి ఎప్పుడెప్పుడా అని వుంది. కానీ చేయి మీద వేయడానికి జంకుతున్నాడు.

'దేనికైనా సరే కౌంట్‌డౌన్ అనేది ఒకటుంటుంది. అలానే నేనూ కౌంట్‌డౌన్ మొదలుపెడతాను.

నేను పది నుంచి జీరో వరకు సంఖ్యల్ని చెబుతుంటాను. మీరు ఒక్కో సంఖ్యకు ఒక్కో దగ్గర ముద్దుపెట్టుకుంటారు. నేను జీరో దగ్గరికి వచ్చేసరికి మీరు ఎక్కడ ముద్దు పెట్టుకోవాల్సివస్తుందో తెలుసా?' అన్నాను.

'ఎక్కడ?' అడిగాడు వాడు.

'నేను చెప్పను. జీరో వచ్చేటప్పటికి మీ పెదవులకే తెలిసిపోతుంది' అన్నాను.

వాడు సరేననలేదు. ఇంకా ఏదో బిడియం వాడ్ని వెనక్కి లాగుతోంది. ఈ కౌంట్‌డౌన్‌తో అన్నీ ఎగిరిపోతాయని నాకు తెలుసు.

'కౌంట్ డౌన్ పదినుంచి మొదలవుతుంది. నేను పది అనగానే మీరు నా తలమీద పెదవులతో స్పృశిస్తారు. తొమ్మిది అనగానే నా నుదురు మీద ముద్దు పెట్టుకుంటారు. పైనుంచి కిందకన్నమాట'

పక్కన పడుకున్నాను.

'టెన్' అని కళ్లు మూసుకున్నాను.

అతను ముద్దుపెట్టుకోలేదు. కళ్ళు తెరిచి విస్మయంతో చూశాను. తల అటు తిప్పుకున్నాడు.

'నేను రేపు ఉదయం ఊరెళ్లిపోతున్నాను' అన్నాను సడన్‌గా గొంతు మార్చి.

నిశ్శబ్దంగా నావైపు తిరిగాడు.

ఈ అస్త్రం బాగా పనిచేస్తూ వుందే అనుకున్నాను.

'టెన్'

తలమీద వెంట్రుకలను పెదవులతో తాకాడు.

'నైన్-అలానే కిందకు-ఈసారి నుదురు'

నోటితో అక్కడ అద్దాడు.

'ఎయిట్'

ఈసారి ముక్కుమీద.

'సెవెన్'

పెదవుల తడి అతని నోటికి తగిలింది.

'సిక్స్'

కంఠంమీద పళ్లతో గుచ్చాడు.

'ఫైవ్'

నా ఎదనుంచి పెదవులను తీసివేయడం వీలైంది కాదు. ఆ స్పర్శ అతనిలో ఇంద్రచాపాలను ఆవిష్క-



## కోపమొస్తే?

"ఏదైనా క్రమంతప్పి, అస్తవ్యస్తంగా వుండడం నాకు నచ్చదు. నౌకర్లు ఇల్లుని సరిగ్గా సర్దివుంచకపోతే నాకు కోపమొచ్చి, వారిని కేకలేస్తాను. అప్పుడు కోపాన్ని నిగ్రహించుకోవడం నావల్లకాదు.

కానీ ఇప్పుడు ప్రశాంతంగా వుండడం నేర్చుకుంటున్నాను. అలా వుండమని మా డాక్టర్ సలహా. బ్లడ్ ప్రెషర్ పేషెంటుని కావడంవల్ల మనసుని కంట్రోల్ చేసుకోకపోతే నా ఆరోగ్యం పాడవుతుంది. అందుకే కోపమొచ్చేలావుంటే వందవరకూ లెక్కపెట్టటమో, కారులో ఎక్కడికైనా దూరంగా వెళ్లటమో చేస్తున్నాను" అంటూ ఒకనాటి 'డ్రీమ్‌గర్ల్' హేమమాలిని ఈమధ్య ఎవరు కలిసినా తన పరిస్థితి ఏకరువుపెడుతోంది.

రిస్తుంటే ఆ మెరుపంతా కళ్ళల్లో కనిపిస్తోంది.

'ఫోర్' అని రెండుసార్లు అన్నా అతని పెదవులు ఊడి రావడంలేదు.

'ఫోర్' కాస్తంత గట్టిగా అరిచాను.

విధిలేక నడుం మీదకి జారాడు.

'త్రీ'

బొడ్డును అతని నాలుక తొలుస్తోంది.

'టూ'

ఈసారీ లాభంలేకపోయింది.

'టూ' మరోసారి అన్నాను.

నడుం మడతలమీద ముఖం ఆన్చాడు.

'వన్'

పొత్తికడుపు అతని నోటిమధ్య ఇరుక్కుపోయింది.

నేను మౌనంగా వుండిపోయాను.

'జీరో' అతనే అన్నాడు.

ఇక అక్కడినుంచి అతను లేవలేదు.

నేనూ కౌంట్‌డౌన్ పూర్తయిందని చెప్పలేదు.

ఎన్ని నిముషాలయ్యాయో గుర్తులేదు.

నేను పక్కకి తిరిగే వరకు అతనికి మాత్రం కాలం ఎంత గడిచిందో తెలియలేదు.

అతన్ని అలానే అదిమిపట్టి కాలు మీద వేశాను.

లంగా, బ్రా కలిసి నా శరీరంమీద ఒకేసారి కుట్ర పన్నినట్టుగా విడిపోయాయి.

పాపం శరీరం ఒంటరిగా పోరాటానికి సిద్ధమై పోయి.

అతన్ని కప్పుకోవాలని ప్రయత్నించింది.

నేనే పైన చేరినా అతను లేవలేదు.

నా వెనక పైకప్పుకు వేలాడుతున్న బల్బు అతని కళ్ళల్లో వెలుగు పొగలై లేస్తోంది.

'బ్యాటిల్ షిప్ ఇన్ యాక్షన్' అన్నాను కళ్లతో నావైపు చూడమన్నట్లు.

అట్లతద్దప్పుడు ఓ అమ్మాయి ఊయల ఎక్కి వుంటే దానిని ఊపడం ఎంత ఉపయోగపడుతుందో నాకప్పుడు తెలిసింది.

ఎదురుగ్గా వున్న గులాబ్‌జామ్‌ని తినే శ్రమ లేకుండానే, దాని తీపి నాలుకకు తగులుతున్నట్లు అతను సుఖపడుతున్నాడు.

ఆ క్షణమే అర్థమైంది నేను గెలిచానని.

ఇక రెండో రోజునుంచీ వాడు నా వెనక తిరిగే కుక్కే అయిపోయాడు. నా పైట తగిలితే చాలు పడకగదివైపు చూసేవాడు.

అంతవరకు ఏమీ అనుభవం లేని నేను అంత జాణతనంగా ఎలా ప్రవర్తించానో నాకు ఇప్పటికీ అర్థంకాదు. అవసరం అలాంటిది కాబోలు.

మాధవి ఆ తరువాత ప్రయత్నించిందిగానీ ఫలితం దక్కలేదు. వాడు నాకు బానిసే అయిపోయాడు.

ఆమెను బాధపెట్టడం ఇష్టంలేకే వున్నదంతా అమ్ముకుని ఈ ఊరికి వచ్చేశాం"

లాంప చెప్పడం పూర్తిచేసింది.

సుజన ఏమీ మాట్లాడలేదు. మొత్తం పరిస్థితులన్నీ టినీ విశ్లేషించుకుంటోంది.

టైమ్ అయిందని హెచ్చరించడానికన్నట్లు గుడిలో ఎవరో మంగళహారతి పాడుతున్నారు.

వాళ్లిద్దరూ ఇంటికి బయల్దేరారు.

• • •

తలుపును ఎవరో దబదబా బాదుతుంటే మెలకువ వచ్చింది చిట్టిబాబుకి.

తలంతా భారంగా వుంది. రాత్రి తాగిన మందు ఇంకా దిగనట్టు మెదడంతా మొద్దుబారిపోయింది. మందుకు తోకలా వుండే హాంగోవర్ అంటే అతనికి అసహ్యం. అందుకే తాగేప్పుడు లిమిట్‌గా తాగాలనుకుంటాడు. కానీ తాగిన ప్రతిసారీ ఆవేశాన్ని అణచుకోలేక పీకలదాకా తాగేస్తుంటాడు.

ఈమధ్య హాంగోవర్ మునుపటిలా రాకపోయినా ఏదో ఇబ్బందిగా వున్న ఫీలింగ్ మాత్రం పోలేదు.

కాలింగ్‌బెల్ మోగించకుండా అలా తలుపును బాదేది నిరంజన్ ఒక్కడే. అతను మెడికల్ రిప్రజెంటేటివ్. ఆంధ్రాలోని నెల్లూరు, ఒంగోలు జిల్లాలలో తిరిగి మద్రాసు వస్తుంటాడు. చిట్టిబాబుకి మంచి ఫ్రెండ్. ఇప్పుడొచ్చింది కూడా అతనేనని అనుకుంటూ మొలకు లుంగీ చుట్టుకుని వచ్చి తలుపు తెరిచాడు.

ఎదురుగ్గా కనిపిస్తున్నవాళ్ళను చూసి ఒక్కసారిగా చిన్న జర్క్ ఇచ్చాడు అతను.

"చిట్టిబాబు ఇరుక్కానా?" అని అడిగాడు శరవణన్.

**(ఇంకావుంది)**

# తెలుగు వనితల వ్యాపార విజయం

తామ సబలలమని తెలుసుకుని వివిధ రంగాల్లో అడుగిడుతున్న మహిళలు, స్వయంకృషితో తామూ రాణించగలమని నిరూపిస్తున్నారు. కఠిన పరిశ్రమ, పట్టుదల, అంకితభావం, సహనం ఏదేమైనా వెనుకంజవేయని స్వభావం కలిగినవారు నేడు విజయపథంలో ప్రయాణిస్తున్నారు. విజయసోపానాలు అధిరోహిస్తున్నారు.

అలా మన రాష్ట్రంలో మహిళా పారిశ్రామికవేత్తలుగా విజయాన్ని సొంతం చేసుకున్నవారు- కె.అన్న పూర్ణ, ఆర్. సీత.

ఇద్దరూ హైదరాబాద్‌కి చెందినవారే. భిన్నమైన మార్గాల్లో వారి పురోగమనం తక్కిన వనితలకి స్ఫూర్తి కలిగించేదిగా వుంటుంది.

## అరుదైన పరిశ్రమ

అన్నపూర్ణ హైదరాబాద్‌కి 25 కిలోమీటర్ల దూరంలోని చర్లపల్లిలో 'పాలిరెథేన్ ఫూసోల్' (అడుగుభాగం) వుండే పాదరక్షల్ని తయారుచేసే 'విధాత ప్లాస్టిక్స్' యూనిట్‌ని నెలకొల్పింది. మన రాష్ట్రంలో అలాంటి యూనిట్లలో అదే మొదటిది. మనదేశంలో అలాంటివి మొత్తం అయిదే వున్నాయి.

"ఈ యూనిట్‌ని స్థాపించడానికి నాకు దాదాపు మూడేళ్లు పట్టింది. మార్కెట్ సర్వే చేయడం, తగిన ముడి పదార్థం ఎక్కడ దొరికేదీ తెలుసుకోవడం, సాంకేతిక సమాచారాన్ని సేకరించడం–వీటికే చాలా సమయం అవసరమైంది" అని చెప్పింది అన్నపూర్ణ.



కె. అన్నపూర్ణ

## జాప్యం జరిగినా...

ముందుగా–మద్రాసు, బొంబాయిల్లో అలాంటి పాదరక్షలు తయారుచేసే కర్మాగారాలకు వెళ్లి చూసిందామె. కావలసిన సమాచారం, చిరునామాలకై ఆమె లైబ్రరీలకి కూడా వెళ్లి వెదికింది. వివిధ సమస్యల కారణంగా 'విధాత ప్లాస్టిక్స్'ని స్థాపించడంలో జాప్యం జరిగింది. కానీ, చివరికి స్టేట్ ఫైనాన్స్ కార్పొరేషన్ నుంచి ఆమె కోరిన లోను మొత్తం మంజూరయింది.

అలా ఆమె 90 లక్షలరూపాయిలతో యూనిట్‌ని ప్రారంభించింది. వర్కింగ్ కేపిటల్ అందులోనే కలిపి వుంది.

## సవాళ్లను ఎదుర్కొనే సంకల్పం

"ఎలాంటి అవాంతరాలు ఎదురైనా వెనుకంజవేయకూడదని నేను మొదట్లోనే నిర్ణయించుకున్నాను. అసలు టీచింగ్‌కన్నా ఎక్కువగా సవాళ్లను ఎదుర్కొనేది ఏదైనా చేయాలనే సంకల్పంతో నేను లెక్చరర్ ఉద్యోగం మానేశాను. నేను పెద్ద రిస్క్ తీసుకుంటున్నానని మా కుటుంబంలోని వారనుకున్నారు. వారు ఇందుకు నన్ను ప్రోత్సహించకపోయినా అవసరమైనప్పుడు తగు సహాయమందించారు" అంటుంది అన్నపూర్ణ.

"నాకు బాగా అవసరమైనప్పుడు ఫారిన్ ఎక్స్ఛేంజ్ దొరకలేదు. 1991 మార్చి తర్వాత ఫారిన్ ఎక్స్ఛేంజ్ నిబంధనలు, ఇతర ఆర్థిక కారణాలతో లేనిపోని సమస్యలు కలిగాయి" అని చెప్పింది అన్నపూర్ణ.

ఏదెలా వున్నా తన ప్రాజెక్టు పూర్తయ్యేటట్టు చేయగలిగిందామె.

## ఉపకరించిన అంశాలు

మద్రాసులో ఐ.ఐ.టి చదివిన ఆమె సోదరుడు ప్రస్తుతం విదేశాల్లో స్థిర నివాసమేర్పరుచుకున్నాడు. ఏ యంత్రాలు అవసరమో, ఆ పాదరక్షల తయారీ పద్ధతులేమిటో తెలుసుకోవడంలో ఆమెకి సహాయపడింది అతనే. బంధువులు వివిధ వ్యాపారాల్లో వుండడం, తన తండ్రి ప్రభుత్వోద్యోగి కావడం తనకు కొంత ఉపకరించినట్టు ఒప్పుకుంటుంది అన్నపూర్ణ.

## ముందంజవేసే ధీమా

"డబ్బుని సరిగ్గా ఉపయోగించడం తెలిస్తే, ఎవరికి వారు తమ పరిచయాల ఆధారంగా ఏదో ఒక పరిశ్రమను స్థాపించవచ్చు"నంటోంది అన్నపూర్ణ.

అసాధారణమైన 'ఫూ సోల్' పాదరక్షల తయారీతో తాను అభివృద్ధిపథంలో ముందంజవేయగలననే ధీమా అన్నపూర్ణకి వుంది.

## విజయవంతమైన సూపర్ మార్కెట్

హైదరాబాద్‌లో ఇండస్ట్రియల్ ఏరియా కుకట్ పల్లిలో 'కేన్నా సూపర్ మార్కెట్'ని విజయవంతంగా నడుపుతోంది ఆర్. సీత. ప్రారంభించి రెండేళ్లు దాటిన ఆ సూపర్‌మార్కెట్‌లో అమ్మకాలు నెలకి 4లక్షల రూపాయిలకిపైనే వుంటాయి.



ఆర్. సీత

విజయం అంత తేలికగా స్వంతంకాలేదామెకి. పెళ్ళయి విడాకులు తీసుకున్న సీత, "విడాకుల తర్వాత నేను మానసికంగా, ఆర్థికంగా ఇబ్బందుల్లో కూరుకుపోకూడదనే ఆలోచనతో నాకు తోచిన ఈ వ్యాపారాన్ని చేపట్టాను" అని చెప్పింది.

## అన్నిపనులూ సులువే

నేడు సూపర్‌మార్కెట్‌లో 15 మంది ఉద్యోగులున్నారు. "ఇప్పుడు నేను సంతోషంగావున్నాను. పనిభారం ఎక్కువగానేవున్నా, నాకిప్పుడు అన్నిపనులూ సులువుగానే కనిపిస్తున్నాయి. ఉదయం ఆరునుంచీ రాత్రి పదకొండు వరకూ నాకు పనితో తీరికుండదు. ప్రతిరోజూ రాసే ఎకౌంట్సు నేనే చూసుకుంటాను. లెడ్జర్లను మాత్రం ఓ ఎకౌంటెంట్ వారానికోసారి పూర్తిచేస్తాడు" అని చెప్పింది సీత.

"పనంతా నాకు నేనుగా చేసుకుపోతాను. మొదట్లో నాకు మా నాన్నగారు సహాయపడేవారు" అని చెప్పిందామె.

కన్సల్టెంట్స్‌ద్వారా ఆమె ప్రాజెక్ట్ రిపోర్ట్ తయారు చేయించింది. అది సబ్మిట్‌చేసి స్టేట్‌బ్యాంక్ ఆఫ్ ఇండియా మహిళా పారిశ్రామికవేత్తలకి ఇచ్చే లోను సంపాదించి, సూపర్ మార్కెట్‌ను ప్రారంభించింది.

## ఉద్యోగుల్లో మార్పు

"మొట్టమొదట్లో నేను చాలా సమస్యలు ఎదుర్కొన్నాను. ఇప్పుడు నా ఉద్యోగులు నావద్దే స్థిరంగా పనిచేస్తున్నారు. గతంలో వాళ్లు ఓ వేళకి వచ్చేవారు కాదు. జీతం తీసుకున్నాక పదిహేనురోజులదాకా ఎగ్గొట్టేవారు. ఇప్పుడు వారిలో మార్పు వచ్చింది. శ్రద్ధగా పనిచేయడం పెరిగింది" అని చెప్పింది సీత.

"భవిష్యత్తులో ఈ నగరంలో ఎన్నో డిపార్ట్‌మెంటల్ స్టోర్లను సమర్థవంతంగా నడపాలని నా ఆశ" అంటోందామె.

–ఆర్. కె. వసంతకుమారి

# పని తక్కువ - ఫలితం ఎక్కువ

కీలకమైన, అధికార హోదాలో ఉద్యోగాలు చేసేవారికి కాలంతో పోటీపడడం పెద్ద సమస్య. అందువల్ల వారు ఆఫీసులో ఎక్కువ గంటలు పనిచేస్తారు. వారాంత దినాల్లోకూడా పనిచేయడం, సెలవులు తగ్గించుకుని మరీ పనిచేయడం జరుగుతుంటుంది.

దాంతో వారికి పనే ప్రపంచమై, జీవితంలో సరదాలు కరువవుతాయి. కుటుంబ జీవితం, బంధుమిత్రులతో సంబంధాలు దెబ్బతింటాయి. దీనికి తోడు కొందరు మానసిక ఒత్తిడి తెచ్చే జబ్బులకి గురవుతారు.

వారికి తరచుగా తలనొప్పి, బ్లడ్‌ప్రెషర్, అల్సర్లు, అజీర్తి, గుండె పోటు లాంటివి రావచ్చు.



## కాలం ఎలా వృథా అవుతుంది?

మీరు పనిచేసే విధానం, కాలాన్ని సరిగ్గా ఉపయోగించుకోకపోవడమే ఈ సమస్యలన్నిటికీ మూలమని గ్రహించి ఆయా విషయాల్లో తగిన మార్పు చేర్పులు చేసుకోవాలి.

సాధారణంగా కింది కారణాలవల్ల సమయం వృధా అవుతుంది.

- పని గురించి ఓ పథకం తయారు చేసుకోకపోవడం, ఏ పని ముందో, ఏ పని వెనుకో నిర్ణయించుకోకపోవడం.
- అవసరమైన నిర్ణయాలు ముందుగా తీసుకోకపోవడం, వాయిదా వేయడం.
- పనుల్ని ఇతరులకి చెప్పే గుణం లేకుండా, అన్నీ స్వయంగా చేయాలనుకోవడం.
- ఏ పని ముఖ్యమైనదో, ఏది అత్యవసరంగా చేయాలో వెంటనే తేల్చుకోలేకపోవడం.
- 'నేను మాత్రమే బాగా చేయగల'ననే ఓ రకమైన భ్రమలో వుండడం.
- ఒకసారి ఒకే పనిపై మనసు నిమగ్నంచేసి, దానిని పూర్తిచేయకుండా ఓ పనిని చేస్తూ మధ్యలో వదిలేసి మరోపని చేయడం.

## ఖాళీ టేబిల్–ఓపెన్ మైండ్

అధికారి టేబిల్‌మీద ముఖ్యమైన కాగితాలు, ఫైళ్ళలాంటివి పోగుపడివుండడం, అతను అలసట చెందిన ముఖంతో వుండడం ఇతరులని ఆకర్షించే అంశం కాదు. తీరిక లేకుండా, అలా అని సరిగ్గా ఏ పనీ చేయకుండా గడపడమూ గొప్ప విషయం కాదు. 'మంచి అధికారి టేబిల్ ఖాళీగా వుండాలి. అతను కొత్త ఆలోచనల్ని వెంటనే ఆహ్వానించి, ఇముడ్చుకోగల ఓపెన్‌మైండ్ కలిగివుండా'లనేది మేనేజ్‌మెంట్ నిపుణులు చెప్పేమాట.

అధికారి అన్ని పనుల్నీ సవ్యంగా, ప్రయాస లేకుండా పూర్తి చేయాలంటే కాలాన్ని సరిగ్గా ఉపయోగించడం తెలిసివుండాలి. అధికారులుగా విజయవంతమైనవారందరిలోనూ సక్సెస్ సూత్రంగా ఈ అంశం తప్పకుండా చోటుచేసుకుంటుంది. అయితే అనుభవజ్ఞులైన, విజయవంతమైన అధికారులు పాటించిన టెక్నిక్‌లలో టైమ్ మేనేజ్‌మెంట్‌కి సంబంధించి ఈ పది మార్గాలున్నాయి.

### 1. లక్ష్యాలను స్పష్టంగా తేల్చుకోవాలి

దీర్ఘకాలంలో సాధించే లక్ష్యాలు కొన్ని వుంటాయి. మరికొన్నిటిని కొంతకాలానికే సాధించగలం. మీ లక్ష్యం ఏదైనా వాస్తవికంగా వుండేటట్టు చూసుకోవాలి. ఆ లక్ష్యాలకు సంబంధించిన కార్యకలాపాలపై కొంత కాలాన్నీ, కృషినీ కేటాయించాలి. వాటికి సంబంధంలేని, అనవసరమైన పనుల్లో మీ కాలం వృధా అవుతున్నప్పుడు మీ లక్ష్యాలను గుర్తుచేసుకుని మనసు మళ్ళించుకోవాలి. మీరు చేస్తున్న ఉద్యోగాన్ని త్వరలో మానే ఉద్దేశం మీకు లేకపోతే మీ లక్ష్యాలు



**ఆఫీసులో పని ప్రారంభించేముందు ఆ రోజు ఏ పనులు చేయాలో ప్లాన్ చేసుకోవాలి. ఎవరెవరిని కలవాలో, ఆ రోజుకి ఏది ముఖ్యమైన పనో, మామూలుగా చేసే పనేమిటో తేల్చుకోవాలి.**

**ఏ స్వల్ప దోషమూ లేకుండా మీరు చేసిన పని చాలా పరిపూర్ణంగా వుండాలని తపిస్తే, దానికోసం అమూల్యమైన కాలాన్ని వెచ్చించాల్సి వస్తుంది.**



మీ సంస్థకి, మీ బాస్‌కి అనుగుణంగా వుండేటట్టు చూసుకోవాలి.

**2. రోజులో ఏ యే పనులు చేయాలో నిర్ణయించుకోవాలి**

ఆఫీసులో పని ప్రారంభించేముందు గానీ, వీలైనంత త్వరగాగానీ ఆ రోజు ఏ పనులు చేయవలసిందీ ప్లాన్ చేసుకోవాలి. ఎవరెవరిని కలవాలో, ఆ రోజుకి ఏది ముఖ్యమైన పనో, మామూలుగా చేయవలసిన పనేమిటో తెల్సుకుని, దాని ప్రకారమే చేసుకుపోవాలి. దేనికెంత సమయం అవసరమైతే అంత కేటాయించాలి. మధ్యలో అనుకోని పనులవల్ల మీ షెడ్యూల్‌కి భంగం కలగవచ్చు కాబట్టి అవసరమైన సమయానికి మరికొన్ని నిముషాలని కలుపుకోవాలి. దానివల్ల మీ ప్రణాళిక పూర్తిగా అటూ ఇటూ కావడం జరగదు.



**3. అత్యవసరమైన పనుల్లోపడి ముఖ్యమైన వాటిని నిర్లక్ష్యం చేయకూడదు**

అభివృద్ధి, స్ట్రాటజీలు, ప్లానింగ్ లాంటి ముఖ్యమైన విషయాలపై వెంటనే దృష్టి పెట్టాల్సిన అవసరం వుండదు. వెంటనే చేయవలసిన పనుల్లో నిమగ్నమై ఆ ముఖ్యవిషయాలను మర్నాటికి, తర్వాతి వారానికి, తర్వాతి నెలకి- అలా వాయిదాలేసుకుంటూపోవడం జరుగుతుంది. కానీ మంచి ఫలితాలకి దోహదం చేసేది ఆ ముఖ్యమైన విషయాలే. భవిష్యత్తులో ఎదురుకాబోయే సంక్షోభం, ఒత్తిడులను తగ్గించేవీ అవే. అందువల్ల అత్యవసరంగా చేయవలసిన పనుల్ని చేస్తూ, ముఖ్యవిషయాలను పూర్తిగా నిర్లక్ష్యం చేయకుండా తగిన జాగ్రత్తపడాలి.

**4. ప్రత్యేకమైన పనులను గుర్తించాలి**

ఎక్కువ కష్టమైన, ప్రత్యేకమైనవిగా భావించే పనులేవో- వాటిని పాకెట్‌సైజు కార్డు మీదో, డైరీలోనో రాయాలి. వాటిలో ముఖ్యమైనవేవో, వెంటనే చేయాల్సినవేవో గుర్తించడానికి వీలుగా వేర్వేరు ఇంకు పెన్నులతో రాయాలి. అలా రాయడంవల్ల మీ మనసుపై ఒత్తిడి తొలగిపోతుంది. అప్పుడే ఆ పనుల గురించి సరిగ్గా ఆలోచించగలరు.

మీరోజువారీ పనుల గురించి ప్రణాళిక వేసుకునేటప్పుడు ఆ లిస్టుని పరిశీలించి వాటికి కూడా మీ పనుల్లో స్థానం కల్పించాలి. వాటిల్లో పూర్తయిన పనులను కొట్టేసి, కొత్తగా చేయదలచుకున్నవాటిని రాయాలి.

**5. వెంటనే తేల్చుకోవాలి**

ఏదైనా విషయంలో నిర్ణయం తీసుకోవలసివచ్చినప్పుడు, అది మీ దృష్టికి వచ్చిన వెంటనే తేల్చుకోవడం అలవాటు చేసుకోవాలి. తర్వాత నిర్ణయించుకుందాంలే అనుకోవద్దు. ఆలస్యం కావడంవల్ల మెరుగైన నిర్ణయాలు తీసుకోవడమనేది అరుదు. పైగా అది మరో సమస్యగా మారే అవకాశముంది.

**6. పనుల్లో చంచల మనస్తత్వం కూడదు**

ఓ పనిని మధ్యలో ఆపేసి మరో పనికి ఉపక్రమించకూడదు. ఒకసారి ఒకే పనిచేయడంలో సంపూర్ణంగా నిమగ్నమవాలి. అది పూర్తయిన తర్వాతే మరోపని మొదలుపెట్టాలి.

**7. మీరు ఉత్తమంగా చేయగలరుగానీ అన్నీ చేయలేరు**

పనులన్నీ మీపైనే వేసుకోకుండా సహాయకులకి అప్పగించడం నేర్చుకోవాలి. ఇతరులు చేయగలిగిన, చేయాల్సిన పనులను మీరు చేయవద్దు.

పనులని అలా ఇతరులకి అప్పగించాలంటే ధైర్యం, నమ్మకం వుండాలి. 'అతను చేయగలడా? అతను సరిగ్గా చేయక మరింత పని పెరిగేటట్టుచేస్తే? అతను చేయగలిగితే ఇక్కడ నా అవసరమేమిటి?' లాంటి భయాలు మీకుంటే వాటిని అధిగమించి, పనిని ఇతరులతో పంచుకోండి.

ఇతరులకి చెప్పిన పనికి తగు తర్ఫీదునివ్వటానికి మీరు కొంత సమయం కేటాయించాలని గుర్తుంచుకోండి. అతను మొదటిసారి కనుక సరిగ్గా పని పూర్తిచేయకపోవచ్చు. మీరైనా అంతేకదా! అందుకని కొంచెం సహనం వహించాలి.

**8. వెంటనే పనిలో చొరబడాలి**

ఆఫీసులో ప్రవేశించి మీ సీటులో కూర్చున్న వెంటనే పని మొదలుపెట్టాలి. రాత్రి హాజరైన పార్టీ, క్రీడలు, సినిమాలు, ఇతర విషయాల గురించి కబుర్లు చెప్పుకోవడాన్ని లంచ్‌టైమ్‌కి వాయిదా వేయండి. వెంటనే పనులు మొదలుపెడితే లంచ్‌టైమ్‌కల్లా పూర్తయిన పనిని చూసి మీరే ఆశ్చర్యపడతారు. అసలు సమయానికి ఓ అరగంట ముందుగా ఆఫీసుకి చేరుకున్నా ఎంతో ఎక్కువ పనిచేయవచ్చు.

**9. అన్నీ ఒక్కసారే!**

బాస్‌ని కలిసినప్పుడు ఆయన దృష్టికి తీసుకువెళ్ళాల్సిన అంశాలను, సలహా తీసుకోవలసిన విషయాలను ఒక్కసారే ఆయనముందుంచడం అలవాటు చేసుకోవాలి. దానివల్ల అవి త్వరగా పరిష్కారమయ్యే వీలుంటుంది. మీ విచక్షణను ఉపయోగించి ఎప్పుడు ఎన్ని విషయాలను ఆయనముందుంచాలో తేల్చుకోవాలి. మీ సహాయకులతో కూడా ఇలాగే వ్యవహరిస్తే, మాటిమాటికీ పిలవడం ద్వారా వారి కాలాన్ని వృథాచేయడం జరగదు.

**10. నిరంతరం పరిపూర్ణత కోసం తపించకూడదు**

ఏ స్వల్పదోషమూ లేకుండా మీరు చేసిన పని చాలా పరిపూర్ణంగా వుండాలని నిరంతరం తపిస్తే, దానికోసం అమూల్యమైన కాలాన్ని చాలా వెచ్చించాల్సివస్తుంది. అది సంపన్నులు, పదవీవిరమణ చేసినవారికుండాల్సిన లక్షణమని భావించి, దాని గురించి పట్టించుకోకుండా, మీ విధుల్ని వీలైనంత బాగా నిర్వహించడానికి ప్రయత్నించాలి. అది మరింత ఆచరణీయమైన పద్ధతి. దానివల్ల మీకు మరింత సమయం కలిసొస్తుంది.



ఈ పది సూత్రాలనూ ఆచరిస్తే తేడా ఏమిటో, మీరు చేయాలనుకున్న పనులన్నీ ఎలా పూర్తి చేయగలరో మీకే అనుభవమవుతుంది.

—ఎల్. రాఘవరావు

సీరియల్



# రారా నా ఇంటిదాకా

**- మేర్లపాక మురళి**

ఆయన ఫుల్‌గా పోలీసు డ్రస్‌లో వున్నాడు. క్యాప్ కూడా చేతుల్లోకి తీసుకోలేదు. చేతుల్లోని చిన్న లాఠీని అటూ ఇటూ తిప్పుతు న్నాడు. ఆయన వెనక మరో నలుగురు కానిస్టేబుల్స్ వున్నారు.

చిట్టిబాబుకి చెమటలు పట్టాయి. హాంగోవర్ డేగలా ఎగిరిపోయింది. దానిస్థానే భయం రాబందులా వచ్చి వాలింది.

"నేనే...నేనే" కంగారుగా చెప్పాడు.

"యు ఆర్ అండర్ అరెస్ట్" మరో మాట మాట్లాడకుండా శరవణన్ తనవెనక్కి చేయిచాచాడు. కానిస్టేబుల్ బేడీలను ఆయన చేతుల్లో వుంచాడు.

"ఎందుకు సార్?" గొంతు తడారిపోతుంటే ఎంతో శక్తిని కూడగట్టుకుని అడిగాడు చిట్టిబాబు.

"నిరంజన్‌ని మర్డర్‌చేసినందుకు"

చిట్టిబాబు కళ్ళు ఒక్కసారిగా గిర్రున తిరిగాయి. గుండెల్లోని భయం ఒళ్ళంతా పాకింది. మనిషి తూలి ముందుకు పడబోయి నిలదొక్కుకున్నాడు.

"మర్డరా?"

"అమా-నేత్తి రాత్రి ఆయన నెల్లూరునుండి మద్రాసుకు వచ్చినాడు. నువ్వూ, ఆయనా కలిసి తాగారు. అప్పురం నువు అతన్ని మర్డర్‌చేశావని రిపోర్ట్‌దా అందినది. అందుకప్పా నిన్ను అరెస్టు చేస్తావుండాం"

"సార్-ఇదంతా అబద్ధంసార్. వాడ్ని చూసి పది రోజులైంది సార్. నిన్న నేను అతన్ని చూడలేదు. అతనితో డ్రింక్ తీసుకోలేదు" చిట్టిబాబు అరిచాడు. తాను రాత్రి ఎక్కడవున్నాడో, ఏ ఫ్రెండ్‌తో తాగాడో అదే టోన్‌లో చెప్పాడు.

అంతా విన్నాక చెప్పాడు శరవణన్. "నువ్వు ఎంత అరిచినా లాభం లేదప్పా. నువ్వే ఈ మర్డర్ చేశావని మా దగ్గర బలమైన ప్రూఫ్ వుందప్పా"

ఇంక ఏం చెప్పాలో తోచలేదు చిట్టిబాబుకి. పోలీసులతో వ్యవహారం ఎంత దారుణంగా వుంటుందో తెలుసు. ఇక ఖండించి లాభంలేదు. తనను ఎవరో ఈ హత్యలో ఇరికించారని తెలుస్తూనే వుంది. అయితే ఇది ఎవరిపనో అర్థంకాలేదు. నిరంజన్ శత్రువులెవరో హత్యచేసి, దీనిని తనమీదకి నెట్టేసి వుంటారని అనిపించింది. సమయానికి అమ్మా నాన్న ఇంట్లో లేకపోవడం అంత బాధలోనూ ఊరట కలిగించింది. వాళ్ళు వారం రోజుల క్రితం దక్షిణదేశ యాత్రని వెళ్లారు. మరో వారం రోజులవరకూ రారు.

తను ఈ హత్య చేయలేదు. కానీ పోలీసుల్ని ఎలా నమ్మించాలో తెలియడంలేదు అతనికి. శరవణన్ ఒకసారి సుజన విషయంలో వార్నింగ్ ఇవ్వడం గుర్తొచ్చింది. ఆ కక్షకొద్దీ తనను పోలీసు స్టేషన్‌లో ఏం చేస్తాడోనన్న భయం పుట్టుకొచ్చింది. కానీ ఏమీ చేయలేని నిస్సహాయత.

"వెళ్ళి ఫేస్‌వాష్ పుణ్ణిట్‌వా. మేందా వెయిట్‌చేస్తా వుంటుము" అన్నాడు శరవణన్.

హత్యచేశావని పోలీసులు ఇంటికొచ్చిన సమయంలో కాలకృత్యాలు తీర్చుకోగలమా? అదే సందేహంతో లోపలికెళ్ళాడు చిట్టిబాబు.

ఏం చేస్తున్నా ఈ హత్యనుంచి ఎలా తప్పించుకోగలనా అనే ఆలోచించాడు.

పోలీసుల దగ్గరున్న ప్రూఫ్ ఏమిటో ఎంత ఊహించినా తట్టడంలేదు. దానిమీదే ఈ కేసు నిలుస్తుందా లేదా అన్నది ఆధారపడి వుంటుంది.

మరో పది నిముషాలకు తయారయ్యాడు అతను. గదినుంచి బయటికి రాగానే శరవణన్ బేడీలు వేశాడు.

బయటనుంచి జీపు హారన్ వినిపిస్తోంది.

మౌనంగా పోలీసుల వెంట నడిచాడు. అప్పటికే ఆ వీధిలోని చాలామంది ప్రహరీగోడలకు తమ తలల్ని తగిలించారు. సైలెన్సర్ తీసేసి వీధిలో స్పీడ్‌గా మోటార్ బైక్ నడిపే అతనికి బేడీలు వేయడం చాలా మందికి ఆనందాన్ని కలుగజేసింది. ఆ ఆనందాన్ని వాళ్ళు దాచుకోకుండా ప్రదర్శించడాన్ని చూస్తుంటే

**19** వంశీ, సుజనల శోభనం రోజున సుజనకు మూడురోజుల ఇబ్బంది కలుగుతుంది. అందుకని వేరే ముహూర్తం నిర్ణయిస్తాడు సుజన తండ్రి. కానీ ఆ ముహూర్తానికి ముందే శోభనం జరుపుకోవాలని వంశీ చేసిన నాలుగు ప్రయత్నాలూ విఫలమౌతాయి.

వంశీకి ఎక్కడినుండో ఓ వీడియో క్యాసెట్ అందుతుంది. దానిలో తన భార్య సుజన ఓ యువకునితో శృంగారంలో పాల్గొనడం చూసి తట్టుకోలేకపోతాడు. క్యాసెట్ విషయమై ఆమాకే తీయడానికి మద్రాసు వెళ్ళి ఇన్‌స్పెక్టర్ శరవణన్‌ని కలుసుకుంటాడు. క్యాసెట్ గొడవకంతటికీ కారణం చిట్టిబాబు అని తెలుసుకుంటాడు. చిట్టిబాబును ఎలా శిక్షించాలో చెప్తాడు వంశీ.

లాలన, సుజన శివాలయానికి బయల్దేరుతారు. దారిలో తన స్నేహితురాళ్లైన మంజుల, సుమతిల షస్టినెట్ గురించి చెప్తుంది లాలన. తరువాత తన శోభనంగురించి వివరిస్తూ తనభర్త కిషోర్‌ను మాధవి బారినుండి ఎలా తప్పించి తన దారిలోకి తెచ్చుకుందీ చెప్తుంది. ఓ రోజు పొద్దున్నే చిట్టిబాబు ఇంటికి వెళ్ళి అతని గది తలుపులు దబదబా కొడ్తాడు శరవణన్. తలుపులు తెరిచిన చిట్టిబాబు ఎదురుగా పోలీసులను చూసి ఖంగుతింటాడు.



మరింతగా కిందకు తల వాల్చేశాడు అతను.

జీపు బయల్దేరింది.

వార్తాపత్రికల్లో తను చదివిన లాకప్‌డెత్‌లన్నీ గుర్తొచ్చాయి. కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. జీవితంలో మొదటిసారి అతనికి ఏడుపొచ్చింది.

మరో పది నిముషాలకు జీపు పోలీసుస్టేషన్ ముందాగింది.

"రేయ్! దిగరా!" ఓ కానిస్టేబుల్ అరిచాడు.

ముందు ముందు జరగబోయే మర్యాదలకు అది నాందిలా అనిపించింది చిట్టిబాబుకి. తన జీవితం ఇంతటితో ఆఖరనిపించింది.

మెల్లిగా జీపునుంచి దిగాడు. స్టేషన్‌ద్వారం దగ్గర ఇద్దరు పోలీసులు తుపాకీలతో నిలుచుని వుండడం చూస్తుంటే అతనికి ప్రాణాలు పైనే పోయాయి.

"నడువ్! నడువ్" ఇందాకటి కానిస్టేబుల్ ముల్లు కర్రతో పొడిచినట్లు అరిచాడు.

శరవణన్ అప్పటికే జీపు దిగి స్టేషన్ లోపలికి వెళ్ళిపోయాడు.

చిట్టిబాబు ముందుకి నడిచాడు.

ద్వారం దగ్గరున్న పోలీసులు అతన్ని చూడగానే "ఏమిటి కేసు?" అని అడిగారు.

"మర్డర్" వెనక నడుస్తున్న ఓ కానిస్టేబుల్ చెప్పాడు.

ఆ మాటలు వింటుంటే వణుకు ప్రారంభమైంది చిట్టిబాబుకి. ఒళ్ళంతా అప్పటికే చెమటతో ముద్దయిపోయింది. అడుగుగు తడబడ్డాయి.

తన ముందు నిలుచున్న అతన్ని ఎగాదిగా చూసి "సెల్‌లో పడేయండి" అన్నాడు శరవణన్.

కానిస్టేబుళ్ళు అతని భుజాల్ని ఒడిసి పట్టుకుని లాగారు. లోనికి తీసుకెళ్ళి బట్టలన్నీ విప్పదీశారు. మొలతాడు కట్‌చేశారు. డ్రాయర్ మాత్రం వుంచారు.

సెల్ తలుపులు తెరిచి లోనికి నెట్టి తాళంవేశారు. అయిదు అడుగుల పొడవు. నాలుగు అడుగుల వెడల్పుతో వున్న ఆ గదిలో మరెవరూ లేరు. దుర్వాసన ముక్కుపుటాల్ని బద్దలుచేస్తోంది.

గబ్బిలమో. గుడ్లగూబో ఓ మూలన అరుస్తోంది. పరట్లు కిందా మీదా తిరుగుతున్నాయి. చీమలు శరీరం కోసం ఆవురావురుమంటూ తిరుగుతున్నాయి.

చిట్టిబాబు ఊచల్ని పట్టుకుని నిలబడిపోయాడు. అతను ఇప్పటికీ ఏడుపు ఆపలేదు.

చిట్టిబాబులాంటివాళ్ళు అంతే. తనకంటే ఎదుటి వ్యక్తి బలహీనుడని తెలిస్తే చెలరేగిపోతారు. వాళ్ళని హింసిస్తూ తాము రాక్షస ఆనందాన్ని అనుభవిస్తారు. అదే ఎదుటివ్యక్తి తనకంటే బలవంతుడని తెలిస్తే కుదేలుపడిపోతారు. ఏడుస్తారు. భయంతో వణికి పోతారు. చిట్టిబాబుకి దుఃఖం ఆగడంలేదు.

అంతలో ఓ లావుపాటి కానిస్టేబుల్ అక్కడికి వచ్చాడు. అతను అచ్చం యమభటుడిలా వున్నాడు. పెద్ద పొట్ట. ఒళ్ళంతా వెంట్రుకలు. ఎర్రటి కళ్ళు- చూడడానికే భయంగొలుపుతున్నాడు.

అతను తలుపు తెరిచి లోపలికి నడిచాడు. చిట్టి బాబు అతనివైపే గుడ్లప్పగించి చూస్తూ ఓ మూలన నిలబడ్డాడు. అతను ఎదురుగా నిలబడి తన కుడిచేతి నున్న లాఠీని ఎడమచేతిలోకి మార్చుకున్నాడు. తిరిగి దానిని కుడిచేతిలోకి తీసుకుని-"చెప్పరా! ఎందుకు చేశావీ మర్డర్ని?" అని హుంకరించాడు.

చిట్టిబాబు దభేలున అతని కాళ్ళమీద పడ్డాడు. "సార్! ఈ మర్డర్ నేను చేయలేదు. నాకేమీ తెలియదు సార్" దీనంగా చెప్పాడు.

కానిస్టేబుల్ మరి మాట్లాడలేదు. కాళ్ళమీద పడి మోకాళ్ళమీద లేచిన అతని కడుపులో బలంకొద్దీ తన్నాడు. పేగులన్నీ పగిలిపోయినట్లు గిలగిల్లాడిపో యాడు. "అమ్మా!" అన్న కేక అప్రయత్నంగా వెలు వడింది. అలానే వెనక్కి తూలి కిందపడ్డాడు.

కానిస్టేబుల్ ఒకడుగు ముందుకువేసి అతని జుట్టు పట్టుకుని పైకి లేపాడు. తలలో సూదులు గుచ్చి, తరువాత తాపీగా తీస్తున్నట్లు విలవిల్లాడిపోయాడు.

పూర్తిగా పైకి లేపి చెంపమీద చరిచాడు. రంపంతో లాగినట్లు బుగ్గ మండింది.

లాఠీని అలానే ఎడమచేతిలో పట్టుకుని కుడిచేతిని పిడికిలిగా మార్చి తిరిగి కడుపులో గుద్దాడు. మొత్తం జీర్ణవ్యవస్థ అంతా కదిలినట్లనిపించింది చిట్టిబాబుకి. ఈసారి అమ్మా అని కూడా అరవలేకపోయాడు. బాధ కళ్ళల్లో సుళ్ళు తిరుగుతోంది.

ఇక కొట్టవద్దని కళ్ళనీళ్ళ మధ్య అర్థించాడు.

కానిస్టేబుల్ ఇదేమీ గమనించలేదు. ఉన్మాదం తలకెక్కినవాడిలా ఊగిపోతున్నాడు. ఇక చేతులు లాభంలేదని లాఠీకి పని చెప్పాడు. వేళ్ళమీద, కాలి ముల్లమీద కసికొద్దీ బాదాడు. చిట్టిబాబు మూలుగు తున్నాడు. అంతకంటే పెద్ద శబ్దాలు చేయడానికి శరీరం సహకరించడంలేదు.

అతను క్షణక్షణానికి కుంగిపోతున్నాడు. చివరి సారన్నట్లు కానిస్టేబుల్ శక్తినంతా చేతుల్లోకి తెచ్చు కుని వీపుమీద మోదుతున్నాడు. చిట్టిబాబుకి కళ్ళు బైర్లు కమ్మాయి. ఆ వెంటనే స్పృహతప్పాడు. అలసి పోయిన కానిస్టేబుల్ కూడా ఆగాడు.



చల్లటి నీళ్ళు మొహంమీద పడేటప్పటికి స్పృహ వచ్చింది చిట్టిబాబుకి. ఒళ్ళంతా పచ్చిపుండులా వుంది. రక్తం శరీరంమీదకి ఉబ్బడంవల్ల అక్కడక్కడా ఎర్రటి గీతలు తేలాయి.

"ఎస్.ఐ.గారు రమ్మంటున్నారు" కానిస్టేబుల్ మాటలు లీలగా వినిపించాయి.

లేవడానికి ప్రయత్నించాడుగానీ వీలయ్యింది కాదు. గోడను ఆసరాగా చేసుకుని బలవంతంమీద పైకి లేచాడు. నడుస్తుంటే ఎముకలు విరిగిపోయినట్లు బాధ కలుక్కుమంటోంది. ఎస్.ఐ.కెదురుగా వెళ్ళి నిలుచున్నాడు చిట్టిబాబు.

"ఇప్పటికైనా ఏం జరిగిందో చెప్పు తంబీ! నిరంజన్ని ఎందుకు చంపావ్?" శరవణన్ అడిగాడు.

భోరున ఏడ్చేశాడు చిట్టిబాబు. కళ్ళనీళ్ళతో తన మీద పడిన నేరాన్ని కడిగేసుకోవాలన్నంతగా ఏడ్చాడు.

"అది ఎన్నాప్పా? నేను అడిగినదానికి ఏడుపు జవాబు కాదే" శరవణన్ అన్నాడు.

"సార్! ఎందుకు నన్నిలా హింసిస్తారు? నాకేమీ తెలియదు. నిన్న రాత్రి నేను సుధాకర్ రూమ్లో వున్నాను. అక్కడినుంచి నేరుగా ఇంటికొచ్చేశాను. కావాలంటే సుధాకర్ని విచారించండి సార్. ఇందుకు సాక్ష్యం అతనే" చిట్టిబాబు ఏడుస్తూ చెప్పాడు.

"మా దగ్గరా అంతకంటే బలమైన సాక్ష్యం వున్న దప్పా. నువ్వు కావాలంటే చూపిస్తాను"

"ఏమిటి సార్ అది?"

"రాప్పా-చూపిస్తాను" అని శరవణన్ పైకి లేచాడు. ఎదురుగా వున్న మరో రూమ్లోకి నడిచాడు. కానిస్టే బుల్ చిట్టిబాబుని కూడా ఆయన వెనకే తీసుకెళ్లాడు.

ఆ గదంతా చీకటిగా వుంది. పలచటి వెలుగులో అక్కడో వ్యక్తి వున్నట్టు తెలిసింది చిట్టిబాబుకి.

"ముదుగా-ప్లేది కేసెట్" అన్నాడు శరవణన్ కుర్చీలో సర్దుకుని కూర్చుంటూ.

రెండు మూడు బటన్లు నొక్కినట్లు శబ్దాలు అయ్యాక టి.వి.లో చిత్రం ప్రారంభమైంది.

చిట్టిబాబు ఆటే చూస్తున్నాడు.

ఒక్కో దృశ్యం తరువాత మరో దృశ్యం రంగుల్లో కనిపిస్తోంది. ఓ గదిలో ఇద్దరు యువకులు కూర్చుని ఏదో మాట్లాడుకుంటున్నారు. వాళ్ళ పెదవులు కదులుతున్నాయిగానీ మాటలు వినపడటంలేదు. వీడియో తప్ప ఆడియో లేదు.

ఈసారి ముఖాలు మరింత క్లోజప్‌లో కనిపిస్తున్నాయి. చిట్టిబాబు ఉలిక్కిపడ్డాడు. ఆశ్చర్యం, భయం బాకుల్లా దిగబడ్డాయి గుండెల్లో.

ఆ ఇద్దరిలో ఒకరు తనైతే, మరొకరు నిరంజన్.

దృశ్యం మారింది.

ఇద్దరి ముందూ విస్కీ బాటిల్, గ్లాసులున్నాయి. తన గ్లాసుల్లో విస్కీ నింపాడు. చీర్స్ తరువాత తాగడం ప్రారంభమైంది. మధ్య మధ్య నవ్వులూ, మాటలూ. పెదవుల కదలికలను బట్టే అన్నీ తెలుస్తున్నాయి.

తను ఎందుకో సడన్‌గా మారిపోయాడు. ముఖమంతా ఎర్రగా తయారైంది. నిరంజన్ ఆవేశంతో ఊగిపోతున్నాడు. తను ఒక్కసారిగా పైకి లేచి, జేబులోంచి కత్తి తీసి పొడిచాడు. దెబ్బ బాగా తగిలిందేమో అతను కిందపడిపోయాడు. రక్తం కొళాయి తిప్పినట్లు కారుతోంది. ఆ రక్తం స్క్రీన్ దాటి తనమీదకు ఉరుకుతున్నట్లు భయపడిపోయాడు చిట్టిబాబు.

"స్టాపిట్" గట్టిగా అరిచాడు.

శరవణన్ తక్షణం తల తిప్పి చూశాడు.

"స్టాప్ దట్ కేసెట్"

కేసెట్ ఆగిపోయింది.

చిట్టిబాబు విపరీతంగా ఆవేశపడిపోతున్నాడు. అతనికి వ్యవహారం అంతా అర్థమైంది.

"సార్! అది ఫేక్ కేసెట్ సార్. ఎవరో దానిని తయారుచేసి పంపించారు"

"తయారుచేశారా! అయితే అది నిజమైన కేసెట్ కాదా? సొల్లు" అన్నాడు శరవణన్.

"ఆమా సార్. అదంతా అబద్ధం. ఎవరో ఈ హత్య చేసి నా మీదకు నెట్టడానికి ఈ ప్లాన్ చేశారు సార్" చిట్టిబాబు గొంతు చించుకుంటున్నాడు.

"ప్లానా?" శరవణన్ విషయం తనకేమీ అర్థం కానట్లు ముఖం పెట్టాడు.

"ఖచ్చితంగా ప్లానే. నిరంజన్‌తో ఎవరో ఓ యువకుడు తాగాడు. ముందు వేసుకున్న పథకం ప్రకారం అదంతా వీడియో తీశారు. కంప్యూటర్ లాబ్‌లో ఆ యువకుడి ముఖం స్థానంలోనే నా ముఖాన్ని సూపర్ ఇంపోజ్ చేశారు. అంటే ముఖం నాదే. కానీ బాడీమాత్రం నాదికాదు. కానీ కేసెట్ చూస్తే ఆ యువకుడు నేనేనని అనుకుంటారు. కంప్యూటర్‌వల్ల ఇటీవల సాధ్యమైన టెక్నిక్ సార్ ఇది" ఏడుస్తూ చెప్పాడు చిట్టిబాబు.

"నో-నాకు నమ్మిక కలగడంలేదప్పా" శరవణన్ పెదవి విరిచాడు.

ఆయన్ని ఎలా నమ్మించాలో అర్థంకావడంలేదు. కానీ ఆయన నమ్మకపోతే తను సెల్‌లోనే చచ్చిపోవడం ఖాయం. ఆ భయంతో చిట్టిబాబు విచక్షణా జ్ఞానాన్ని కోల్పోయాడు.

"సార్! దీనికి నేనే రుజువు చూపిస్తాను. నేను ఇటీవలే ఇలాంటి ఫేక్ కేసెట్ తయారుచేశాను"



## బాలీవుడ్ పార్టీలు

హిందీ సినీరంగంలో గ్రాండ్‌గా పార్టీలివ్వడంలో ఒకప్పుడు రాజ్‌కపూర్ ప్రసిద్ధుడు. ఇప్పుడు నిర్మాత-దర్శకుడు సుభాష్‌ఘాయ్ ఇచ్చే పార్టీల గురించి గొప్పగా చెప్పుకుంటారు. సాధారణంగా ఆ పార్టీలను ఫైవ్‌స్టార్ హోటళ్లలో ఏర్పాటుచేస్తారు. 500 మందికి ఇచ్చే పార్టీకి రూ.2 లక్షలు అవుతుంది.

నటుడు చుంకీపాండే లానిచ్చే పార్టీలకన్నా వాటిలో పిసినారితనం చూపే తీరుకే పేరువడ్డాడు. ఖరీదైన విదేశీ విస్కీసీసాల్లో, చౌకగా దొరికే మద్యం నింపి సరఫరాచేసే తెలివితేటలు అతనివి!



## తెలుగింటి పడుచు

చీరకట్టి ఇల్లాలి తరహాగా నటిస్తూనే. ఏ పాట లోనో. మెరుపులా వానలో తడిసి వయ్యారాలన్నీ పుష్కలంగా ప్రదర్శించే చమక్కు ఆమనిలో వుంది.

తెలుగుతనం ఉట్టిపడే చక్కని అందం వుండడంతో బాపు. కె. విశ్వనాథ్‌లాంటి దర్శకుల చిత్రాల్లోకూడా అవకాశం పొందుతోంది. అయినా. తెలుగుతనానికి భిన్నంగా 'కన్నెపిట్టరో- కన్నుకొట్టరో' (హలో బ్రదర్)లాంటి పాటల్లో చిన్ని చిన్ని డ్రస్సులు. మరి కొన్ని చిత్రాల్లో స్విమ్‌సూట్‌లు. ఒళ్లుచూపించే వస్త్రాలు ధరిస్తూనే పాటుపడుతోంది.

డైరెక్టర్ యస్వీ కృష్ణారెడ్డి 'శుభలగ్నం'లో ఆమనికి హీరోయిన్ పాత్ర ఇవ్వడంతో కొత్త హుషారుతో వుంది. అయితే ఇదికూడా గృహిణిపాత్రే.

ఉద్వేగంలో అసలు రహస్యం చెప్పేశాడు.

"నువ్వా?"

"అవును సార్"

"ఏం కేసెట్టప్పా అది?"

"ఓ అమ్మాయితో నేను గడిపినట్లు తయారు చేసిన కేసెట్ సార్..." హత్యకేసునుంచి బయటపడా లన్న ఆత్రుతలో మరో తప్పు చేయడానికి సిద్ధపడి పోయాడు. ఈ విషయం చెప్పడంవల్ల ఎదురయ్యే కాన్సిక్వెన్స్‌ను గురించి ఆలోచించలేకపోయాడు. అందుకే తను సుజనతో గడిపినట్లు తీసిన వీడియో కేసెట్ గురించి చెప్పుకుపోతున్నాడు "మీకు ఆ అమ్మాయి తెలుసు సార్. నేను అల్లరి చేస్తున్నట్లు రిపోర్ట్ కూడా ఇచ్చారు.

ఆమెలా వుండే మరో అమ్మాయితో. ఓ హోటల్‌లో గడిపాను. దాన్నంతా వీడియో తీశాను. ఆ తరువాత ఆమె ముఖం స్థానంలో సుజన ముఖాన్ని సూపర్ ఇంపోజ్ చేయించాను"

"ఆ కేసెట్ ఇదేనేమో చూడప్పా" శరవణన్ చాలా కూల్‌గా చిట్టిబాబుతో చెప్పి. ముందుకు తిరిగి "మురుగా! ప్లే చెయ్" అన్నాడు.

చిట్టిబాబు అంత షాక్‌కు ఎప్పుడూ గురికాలేదు. తను హత్యచేశానని చెప్పి నప్పుడు కూడా భయపడ్డాడుగానీ ఇంతగా చలించిపోలేదు.

కేసెట్ ప్లే అవుతోంది.

సుజనను తను అనుభవించినట్లు తీసి. ఆమె భర్తకు పంపిన కేసెట్ అదేనని క్షణంలో అర్థమైంది.

అప్పుడు తెలిసింది అతనికి తను చేసిన తప్పు. ఒక కేసునుంచి తప్పించు కోవడానికి మరో కేసులో ఇరుక్కుపోయి నట్లనిపించి గింజుకుపోయాడు. భయం భయంగా ఎస్.ఐ.వైపు చూశాడు.

అప్పుడే గదిలోని లైట్లన్నీ వెలిగాయి.

వెలగంది చిట్టిబాబు ముఖం ఒక్కటే.

శరవణన్ చేతిలోని టేప్‌రికార్డర్‌ను చూస్తూనే తనెంతగా ట్రాప్‌లో పడిపోయిందో తెలిసింది చిట్టి బాబుకి. కానీ ఇక అప్పుడేం చేయగలడు? జరగాల్సిన ఘోరం జరిగిపోయింది.

"చూడప్పా-నీ పేరు ఎన్నా? ఆఁ చిట్టిబాబూ! ఈ కేసెట్ ఎలా తయారుచేశావో. ఎందుకు చేశావో నీ నోటంట చెప్పించడానికే ఇంద హత్య చేశావని చెప్పామప్పా. నీ ఫ్రెండ్ నిరంజన్ రొంబా మంచివాడు. విషయం చెప్పగానే ఒప్పుకున్నాడు. నీ వేలితో నీ కళ్ళను పొడవడానికే ఇంత నాటకం ప్లే చేయాల్సి వచ్చిందప్పా. ఓ అమ్మాయి జీవితాన్ని నాశనంచేయ డానికి నువ్వు పన్నిన కుట్రకు ఏం శిక్ష వేయాలో జడ్జి నిర్ణయిస్తాడు"

శరవణన్ పైకి లేచాడు.

చిట్టిబాబుకి మొత్తం జైలంతా కళ్ళముందు కది లింది. అతనిలో పశ్చాత్తాపం మొదలైంది.

• • •

సుజన, అనుపమ నడుస్తున్నారు.

అనుపమకు ఇరవై ఏడేళ్ళుంటాయి. ఆమె ఏ ప్రాంతానికి చెందిందో కొత్తవాళ్ళు ఊహించలేరు.

ఆమె పట్టుచీర కడితే తమిళనాడు ముత్తైదువులా. చుడీదార్ తొడుక్కుంటే బొంబాయి ఫ్యాషన్ ప్రపం చపు మహారాణిలా. సల్వార్‌కమీజ్ వేసుకుంటే కాశ్మీరీ ముగ్ధలా. పైట లేకుండా చీర చుట్టుకుంటే మలయాళీ ప్రౌఢలా. పావడా. ఓణీలో పదహారణాల తెలుగింటి ఆడబడుచులా. కాటన్ దుస్తుల్లో బెంగాలీ వనితలా అనిపిస్తుంది.

మరి బట్టల్లేనప్పుడు ఎలా వుంటుందో ఊహించే సాహసం ఎవరూ చేయరు. ఎర్రగా. పొడవుగా. భారీగా వుండే ఆమె పర్సనాలిటీ ఊహలకి అందదు.

ఇంతచేసీ ఆమెది ఆంధ్రదేశమే. కావలి పక్కన పల్లెటూరు. డిగ్రీవరకు చదువుకుంది.

తనకు మంచి అనిపించింది చేసే ధైర్యమూ. తెగువా వుండడంవల్ల అనుపమ మరింత అందంగా. ఆకర్షణీయంగా కనిపిస్తుంది.

ఆ సాయంకాలంపూట ఆమె. సుజనతో కలిసి అలా వాకింగ్‌కి బయల్దేరింది.

"నడుస్తూ రోడ్డువరకూ వెళదామా. ఎక్కడికీ వెళ్ళకపోవడంవల్ల చాలా బోర్ కొడుతోంది" అంది సుజన వీధి మలుపు తిరుగుతూ.

"వైనాట్- వెళదాం"

ఇద్దరూ మెల్లగా మాటల్లోకి దిగారు.

"అమ్మాయిల దగ్గర ఫస్ట్‌నైట్‌ల గురించి చెప్పించుకుంటున్నావట.ఏమిటి సంగతి?"అడిగింది అనుపమ.

"తెలుసుకుందామని. ఏ సంఘటన నైనా సరే. సడన్‌గా పుట్టుకురాదు. దానికి ముందూ. వెనకా వుంటాయి. అదిగో అవి తెలుసుకుందామని"

"తెలుసుకుని ఏంచేస్తావ్?"

"అమ్మాయిల సమస్యలని విశ్లేషిస్తూ ఓ థీసిస్ రాస్తాను"

"అలానే రాయి. మరి అందులో నీ ఫస్ట్‌నైటూ వుంటుందా?"

"డెఫినెట్‌గా వుంటుంది. మా నాన్నకు జాతకాలూ వగైరాల మీద నమ్మకం మూలాన మా ఫస్ట్‌నైట్. పెళ్లయి ఇన్ని రోజులైనా జరగలేదు. శోభనం మా ఇద్ద రిదే అయినా దీనికి ఎంతమంది అనుమతి కావాలో చూడు. ముహూర్తాలూగట్రా

## ఎయిర్‌హోస్టెస్-చిరుగుల దుపట్టా

ఇటీవల బొంబాయినుంచి జెడ్డా వెళ్లాల్సిన ఎయిర్‌ఇండియా విమానంలో. తమకి స్వాగతం చెబుతూ పానీయాలు అందించిన ఎయిర్‌హోస్టెస్‌ని చూసి ఫస్ట్‌క్లాస్ ప్రయాణీకులు ఆశ్చర్యంలో నోళ్లు తెరిచారు. ఎందుకంటే. ఆమె ధరించిన కుర్తాపై కప్పుకున్న దుపట్టాకి చిరుగులున్నాయి. పైగా ఆ ఎయిర్ హోస్టెస్ అదేమీ పట్టించుకోనట్లు చిరునవ్వులతో విమానమంతా తిరుగుతోంది.



ఆమె ఒక్కరే కాదు! ఇతర ఎయిర్‌హోస్టెస్‌లు కూడా చెదిరిన జుట్టుతో కొందరు. కుట్లూడిన హేండ్‌బ్యాగ్‌లతో కొందరూ డ్యూటీకి వచ్చారు. ఆ విధంగా ఎయిర్ ఇండియా తమకి నాణ్యమైన యూనిఫారమ్‌లు ఇవ్వడంలో చేస్తున్న జాప్యానికి ఆరోజు ఎయిర్‌హోస్టెస్‌లు నిరసన తెలిపారు. అలాంటి సిబ్బందితో ఆ ఇంటర్నేషనల్ ఫ్లైట్‌ని నడపాలా వద్దా అని అధికారులు తర్జనభర్జనలు పడడంవల్ల విమానం బయలుదేరడానికి గంటపైనే ఆలస్యమైంది. ◆

ఎంత ప్రభావం కలిగిస్తాయో ఆలోచించు"

"అదేదో సామెత వుంది. అన్నీ చూసుకుని శోభనం జరిపిస్తే కుక్కపిల్ల పుట్టిందట. ఈ పెద్దవాళ్ల అన్నీ సక్రమంగా చేసినట్టు, పద్ధతి ప్రకారం పోతున్నట్లు పోజు కొడతారుగానీ, తమ పనులవల్ల ఎలాంటి ఫలితాలు సాధించామో తెలుసుకోరు. ఒకవేళ తెలిసినా మంచి జరిగితే అంతా తమ ప్రతిభేనంటారు. లేకుంటే అంతా ఖర్మ అని తప్పుని అవతలకి నెట్టేస్తారు. పెద్దలంత అమాయకులూ, ఎస్కేపిస్టులూ ఎవరూ వుండరు. దీనికి మంచి ఉదాహరణ నా ఫ్రెండ్ నవనీత" అనుపమ అంతవరకు చెప్పి ఆగింది.

"నవనీత ఎవరు? ఏం జరిగింది?" ఎంతో సుజన ఉత్సుకతతో అడిగింది.

"చెబుతాను. వెరీ ఇంట్రెస్టింగ్..." అని ప్రారంభించింది అనుపమ.

"కావలి పక్కన పల్లెటూరు మాది. మా ఇంటికెదురుగ్గా ధర్మారావు కుటుంబం వుండేది. ఆయన కూతురే నవనీత. అందంగా, అద్భుతంగా వుండేది. మా వయసే. కానీ ఎందుకనో ఆ పిల్లకు సెక్స్ అంటే విపరీతమైన భయం వుండేది. కారణం ఆమెకు తెలియదుగానీ నేను కొంత ఊహించాను.

మా ఊర్లోనే రంగనాయకి అనే ఆమె వుండేది. నవనీత ఇంటిపక్కనే ఇల్లు. చాలా వింత కేరెక్టర్. ప్రసవం అప్పుడు నానా యాగీ చేసేది. నొప్పులు భరించలేక ఇల్లు తూట్లుపడేటట్లు అరిచేది. తనకింత



బాధ కలిగించిన భర్తను బండబూతులు తిట్టేది.

'అమ్మో! అయ్యో! నా వల్లకాదు తల్లో. నేను చచ్చిపోతున్నాను తల్లో. వాడు వినకుండా నా పక్కన దూరి ఇంత ఘోరం చేశాడు తల్లో. వాడ్ని పులులు పెరక్క తిననూ, వాడ్ని పాములు కాటెయ్యనూ. అమ్మో...తల్లో...ఒద్దంటే ఈ బట్టా బిడ్డ పుట్టుకొచ్చేస్త వుండాడో దేవుడో...' ఇలా సాగేది ఆమె తిట్ల దండకం. ఇలా అంటూనే ఆమె ఎనిమిది మందిని కన్నది. చివరికొచ్చేసరికి నలభై ఏళ్లకే అరవై ఏళ్ల ముసల్దానిలా అయిపోయింది. కళ్ళల్లో తప్ప

**మామూలుగా...**

"ఓ కొత్త వ్యక్తి పరిచయమైనప్పుడు నేను రిజర్వ్‌డుగానే వుంటాను. వాళ్లు కొన్నిసార్లు కలిసిన తర్వాతగానీ నేను మామూలుగా మాట్లాడలేను.

వారి కంపెనీలో ఎప్పుడైతే సౌకర్యంగా అనిపించిందో, అప్పటినుంచీ కలుపుగోలుగా వుంటాను. మామూలుగా మాట్లాడేస్తాను" అంటోంది తరగని అందాల మాధురీదీక్షిత్.

అందాలను గుట్టుగా వుంచే మాధురి మాటల ధోరణిలోనూ ఆదే సూత్రాన్ని పాటిస్తుందన్నమాట!

జీవం మరెక్కడా వుండనట్లు పాలిపోయింది.

ఆమెను చూస్తుండడంవల్లనూ, ఆమె ప్రసూతి వైరాగ్యాన్ని వినడంవల్లనూ అనుకుంటా నవనీత మగవాళ్ళంటేనే భయపడిపోయేది. కానీ ఇవన్నీ ఆమె తల్లిదండ్రులకి తెలియదు. పెళ్లి వద్దంటే చిన్నపిల్ల అలా అంటూ వుందని అనుకునేవారు.

ఆమె వద్దంటున్నా వినకుండా పెళ్లి జరిపించేశారు. పెళ్లికొడుకు పేరు సుధాకర్. చిత్రగుంటలో ఏదో ఉద్యోగం అన్నారు.

పెళ్లి జరిగిన మరుసటి రోజు నవనీత భర్తతో కలిసి కాపురానికి వెళ్లింది.

చిత్రగుంటలో పెళ్లికొడుకు ఇంట్లో శోభనం...

**(ఇంకావుంది)**

# స్వాతి ప్రతిష్ఠకి పాఠకుల హర్షం

స్వాతి సపరివార పత్రికకి ఏ గుర్తింపు లభించినా, ఏ విజయం సిద్ధించినా వెంటనే ఆనందంతో ప్రతిస్పందించే పాఠకదేవుళ్లు వుండడం మా అదృష్టం. ప్రధాని పి.వి. నరసింహారావు గారితో మూడుమార్లు విదేశీ పర్యటనకు ప్రత్యేక ఆహ్వానం పొందడం స్వాతి సపరివార పత్రికకు లభించిన ఒక సువర్ణావకాశం.

1994 జూన్ 29 నుండి జూలై 2వ తేదీవరకు, ప్రధాని పి.వి. నరసింహారావు గారు జరిపిన రష్యా పర్యటనలో, వారి వెంట స్వాతి సపరివార పత్రిక ఎడిటర్‌గా నేను పాల్గొనడం ఒక గొప్ప అనుభూతి. అభినందనల వర్షంతో ధన్యుల్ని చేస్తున్న పాఠకదేవుళ్లకు మనసారా సవినయంగా నమస్కరిస్తున్నాను.

వేమూరి బలరాం

☆ మన ప్రధాని శ్రీ పి.వి. నరసింహారావు గారితో మన మిత్రదేశం రష్యా పర్యటనకు స్వాతి సంపాదకులు వెళ్లడం, స్వాతి పాఠకులుగా మాకూ ఎంతో ఆనందదాయకం. మీకు లభించిన ఈ అవకాశానికి తెలుగువాడిగా గర్వపడుతున్నాను. పర్యటన వివరాలను చక్కని వ్యాసరూపంలో సమగ్రంగా అందించారు.

-అల్లూరు అర్జునరాజు, తణుకు

☆ "ప్రధాని పి.వి.తో నా రష్యా పర్యటన" స్పెషల్ ఫీచర్‌వల్ల...మన ప్రధాని సాధించిన ఘనత, నేటి రష్యా పరిస్థితులు స్పష్టంగా తెలిశాయి.

ముఖ్యంగా–మన ప్రధాని పి.వి.తో కలిసి మీరు పర్యటించడం...మాకెంతో గర్వకారణం. ఇంతకు ముందు కూడా మీరు ప్రధాని పి.వి.తో విదేశాలు పర్యటించారు. ఒక తెలుగు వారపత్రిక ఎడిటర్‌గా ఇంతటి గొప్ప ఘనత, పేరుప్రఖ్యాతులు సాధించడం... మీకే సాధ్యం అయ్యింది. దీని వెనుక వున్నవి మీ పట్టుదల, సామర్థ్యం, తెలివితేటలు, దీక్షలే. భవిష్యత్తులో ఇంతకంటే గొప్ప గొప్ప ఆహ్వానాలు, గౌరవ పురస్కారాలు పొందాలని, అందుకు తగిన శక్తిసామర్థ్యాలు, తెలివితేటలు–ఆ భగవంతుడు మీకు ఇంకా ఇంకా ప్రసాదించాలని కోరుకుంటున్నాను.

-వి. గోపాలకృష్ణ, పెనుగొండ

☆ రష్యా గురించి మేము ఇంతవరకూ విన్నవి అసమగ్రమైన సమాచారాలే. మీ పర్యటన వివరాలు చదివాక నేటి రష్యా స్థితిగతులు గోచరమయ్యాయి. మంచి ఇన్‌ఫర్‌మేటివ్‌గా అందించారు.

-జి. అరవింద్, శ్రీకాకుళం

☆ ప్రధానితో ముచ్చటగా మూడవసారి మీ విదేశీ పర్యటనతో, మరే తెలుగు పత్రికకు లభించని గౌరవాన్ని పొందారు. రష్యా పర్యటనపై మీరందించిన 'మాస్కో డిక్లరేషన్–రష్యా, భారతదేశాలమధ్య వున్న స్నేహసంబంధాలను, వారి జీవనవిధానాన్ని, నాడు–నేడు వున్న రష్యా జీవనశైలిని మాకళ్ళముందుంచింది. ప్రధానితో మీ రష్యా పర్యటన మా 'స్వాతి' కీర్తికిరీటంలో మరో ఆణిముత్యం. మరే పత్రికకు లభించని అత్యున్నత గౌరవం. -ముక్కెన సురేష్‌బాబు, వీరన్నపాలెం

☆ ఎడిటర్ గారి చేతినుండి జాలువారిన 'రష్యాపర్యటన' రచన విపులంగా చదివి చాలా సంతోషించాం. కృషి, పట్టుదల, నిజాయితీలతో కూడిన మూర్తిమత్వం గౌరవనీయులైన శ్రీ పి.వి.గారిలో వుంది. వారితో కలిసి విదేశీపర్యటన చేయడం స్వాతికి ఘనమైన గుర్తింపు.

ఇలాంటి ఘనవిజయాలు సాధిస్తున్న మీ మేధా సంపత్తికి హృదయపూర్వక అభినందనలు చెప్పుకుంటున్నాం. -పి.వి. రమణకుమార్, చిలకలూరిపేట

☆ 'చారిత్రాత్మకమైన మాస్కో డిక్లరేషన్' స్పెషల్ ఫీచర్‌లో ఒకప్పటి ద్వితీయాగ్రరాజ్యమైన రష్యాలో నెలకొనివున్న ప్రస్తుత సాంఘిక, రాజకీయ పరిస్థితులను గూర్చి, రష్యా–ఇండియాల మధ్య చిరకాలం నుంచి వున్న రాజకీయ, ఆర్థిక, సైనిక, మైత్రీ సంబంధాలను మరింత బలపర్చేందుకు దోహదపడిన పి.వి. గారి పర్యటన గూర్చి, ఎడిటర్ గారు చాలా చాలా చక్కగా తెలియపర్చారు.

-కె. రవి, సాంబాబు, అజయ్, పోణంగి

☆ ప్రధానమంత్రితో మీ రష్యా యాత్ర ఆర్టికల్ చదివాక రష్యాను గూర్చి చాలా విషయాలు తెలుసుకోగలిగాం. అక్కడి ప్రస్తుత పరిస్థితులను గ్రహించాక చాలా బాధ కలగడమే కాదు..."ఏ దేశ చరిత్ర చూసినా ఏమున్నది గర్వకారణం?" అన్న పాత ప్రశ్న పదేపదే స్ఫురణకు వచ్చింది.

మాఫియా యుగం ఆరంభం అయ్యాక "స్వాతంత్ర్యం!" అనే పదానికే అర్థం మారిపోతోందేమో? స్త్రీలవరకూ ఎందుకు...పురుషులకే...నిశరాత్రే కాదు పట్టపగలే రక్షణ కరువవుతున్న రోజులు సంప్రాప్తమై పోతున్నాయి.

ఏది ఏమయినా మంచి ఆర్టికల్ అందించినందుకు ధన్యులం. -టి.ఎస్.ఎ. కృష్ణమూర్తి, మదనపల్లె

☆ ప్రధానితో విదేశయానం దిగ్విజయంగా పూర్తిచేసుకొని వచ్చి, ఈవారం ఆ విశేషాల్ని తన విలువైనభాషలో పొదిగి నిర్మలమైన భావంతో అమర్చి పాఠకులకు అందించిన మా ఎడిటర్ బలరామ్ గారికి, రష్యా చుట్టి వచ్చినందుకు ప్రత్యేక అభినందనలు అర్పిస్తున్నాను.

రష్యావంటి దేశాలకు వెళ్లేముందు ఎంతో ప్రచారం చేసుకుంటారెవరైనా! సొంతడబ్బులతో వెళ్లినా ఎంతో గొప్పగా సొంతడబ్బా వాయించుకుంటారెంతోమంది! దేశప్రధానితో వెళ్తే వాళ్లనింక పట్టుకోలేం! అటువంటి కాలంలో ప్రధానితో మీ పర్యటన గురించి ఒక్క కాలంలోనయినా పాఠకులకు ముందుగా తెలుపకుండా ఎంతో గోప్యంగా రష్యా వెళ్లి వచ్చారు. ఈ పర్యాయమే కాదు, గత రెండుసార్లుకూడా మీరు ప్రధానితో పర్యటన విషయం, పర్యటన ముగిసేకే తెలియజేశారు.

మీరు ఈ వారం అందించిన "చారిత్రాత్మకమైన మాస్కో డిక్లరేషన్" స్పెషల్ ఫీచర్‌లో నేటి రష్యా గురించి, గోర్బచేవ్ గురించి తెలిపిన ఆశ్చర్యకర విషయాల్ని చాలా ఆసక్తికరంగా చదివాం.

మన ప్రధానమంత్రితో మీ పర్యటన విషయాలలో మీ గురించి అతి తక్కువ తెల్పుకోవడంద్వారా మీ నిరాడంబరత కనబడుతోంది. మా అభిమాన స్వాతికి ఇంత గొప్ప అవకాశాలు వస్తున్నందుకు స్వాతి రీడర్స్‌గా మేం గర్వపడ్తున్నాం. తెలుగు పత్రికా ప్రపంచం అంతా గర్వపడవలసిన విషయం.

-ఎ.వి. సోమయాజులు, గొల్లప్రోలు

☆ ప్రధాని పి.వి.తో రష్యా పర్యటన సందర్భంగా ప్రచురించిన వ్యాసం మాకు తెలియని ఎన్నో విశేషాలను అందించడమేకాక "క్రెమ్లిన్" దృశ్యాలను స్వాతి ద్వారా మేము చూసే అదృష్టం కలిగించింది. విశిష్టమైన పరిశీలనతో వున్న ఈ వ్యాసం విస్తృతమైన పరిజ్ఞానాన్ని అందించింది. -ఆర్. సత్యనారాయణ, ఇస్కపల్లి

☆ 'ప్రధాని పి.వి.తో నా రష్యా పర్యటన' వ్యాసం మమ్మల్నెంతో ఆనందింపజేసింది. స్వాతిద్వారా ప్రధాని విదేశీ పర్యటన విశేషాలను, ఆ దేశ స్థితిగతులను మేము తెలుసుకోగలిగినందుకు చాలా ఆనందంగా వుంది. ఎక్కడా తెలియనంత లోతైన సమాచారం, అవగాహన ఈ వ్యాసంద్వారా అవగతమయ్యాయి.

-బి. రాధామాధురి, తిరుపతి

☆ స్పెషల్ ఫీచర్ 'చారిత్రాత్మకమైన మాస్కో డిక్లరేషన్'–ప్రధానితో మీ రష్యా పర్యటన విశేషాలు నేటి రష్యాజీవితం, సావియర్ టవర్, క్రెమ్లిన్ దృశ్యాలు, రష్యా అధ్యక్షుని భవనం మొదలైన ఫోటోలతో సహా చక్కగా వివరించారు. ఎంతో సమాచారం తెలుసుకోగలిగాం. -ఎ. దయాకర్, రాంపూర్

☆ స్వాతి ఎడిటర్ గారు మన ప్రధానితో రష్యా పర్యటనకు వెళ్లడం, ఆ పర్యటనలో సాధించిన ఘన విజయాలను, నేటి రష్యా స్థితిని చాలా వివరంగా వర్ణించినందుకు ఎంతో ఆనందిస్తున్నాం.

-కె.వి. సర్వేశ్వర, కుత్‌బుల్లాపూర్

☆ 'ప్రధానితో నా రష్యా పర్యటన'లో రష్యా విషయాలను, రష్యా–భారత్ సంబంధాలను చక్కటి మాటలతో సవ్యంగా విశదపరచారు. స్వాతి సపరివార పత్రికకి లభిస్తున్న ప్రతిష్ఠ మమ్మల్ని ఆనందపరవశుల్ని చేస్తోంది. -వై. సుధాకర్ రెడ్డి, ఐతరాజుపల్లి

సీరియల్



# రారా మా ఇంటిదాకా

మేర్లపాక మురళి

నవనీతను బాగా అలంకరించి గదిలోకి తోశారు. లోపలికి వెళ్ళడం తోనే వణికిపోయింది. పెద్ద గాలికి చిగురుటాకులా వణికిపోతున్న ఆమెను చూసి అతను ఖంగుతిన్నాడు.

కొంతసేపటికి తమాయించుకుని దగ్గరికి వెళ్లాడు.

ఆమె దూరంగా జరిగింది. చొరవగా చేయి పట్టుకున్నాడు. ఏదో విషప్పురుగు మీదపడ్డట్టు విదిలించికొట్టింది.

అతనికి అర్థంకాలేదు. 'సిగ్గా?' అనునయంగా అడిగాడు.

కాదన్నట్లు తల ఊపింది.

'మరి భయమా?'

అవునన్నట్లు తిరిగి తల ఊపింది.

అలా చెప్పేసరికి ఏంచేయాలో అతనికి తోచలేదు. అతను భర్తేగానీ భూతవైద్యుడు కాదుకదా.

కొంతసేపు ఫ్రెండ్లీగా మాట్లాడి, తరువాత ట్రై చేయచ్చని అనుకుని మాట్లాడడం మొదలు పెట్టాడు.

చక్కగా మాట్లాడింది ఆమెకూడా.

గంటయ్యాక మాట్లాడుతూనే చేయి తగిలించాడు. ఆమె వెంటనే రియాక్టయిపోయింది.

'మీరు నన్ను ముట్టుకుంటే వెళ్ళిపోతాను. నాకు భయం' అంది ఏడుపుముఖం పెట్టి.

అతను మళ్ళీ బొమ్మలా అయిపోయాడు.

కొత్త అమ్మాయితో ఎంతసేపు మాట్లాడగలడు? ఇక ఈ రోజుకి శోభనయోగం లేదని స్థిమితపడి నిద్రకు ఉపక్రమించాడు.

రెండో రాత్రీ అంతే. బాగానే మాట్లాడుతుందిగానీ చేయి పడితే ఖస్సుమనేది.

మూడో రాత్రి మరింత పట్టుదలతో ట్రై చేశాడు.

'భయం ఎందుకు నవా? మొదట ఏదోలా వున్నా చివరికొచ్చేసరికి అద్భుతం. ఒక్క రోజు రుచి చూశా వంటే రేపటినుంచే ఆరు కాగానే నువ్వే తలుపు వేసే స్తావ్' అంటూ బుజ్జగించాడు.

'నాకు అదంతా తెలియదు. నాకు భయం అంతే' అంది నవనీత.

అతను ఎంతో కన్విన్స్‌చేశాడుగానీ ఎంతమాత్రం ఫలితం కనిపించలేదు.

కొంత ఫోర్స్ ఉపయోగించాడుగానీ ఆమె ఏడుపు లంకించుకుంది. భయపడి వదిలేశాడు.

నాలుగో రోజు బంధువులంతా బయల్దేరారు.

నవనీత తల్లీ తండ్రీ కూడా అన్నీ సర్దుకున్నారు.

అతనికి ఎవరూ లేరు. కొత్తకాపురం గనుక ఎవరో ఒకరు తోడు వుంటే బావుంటుందనీ, కొన్ని రోజుల పాటు తమ కూతురు నవనీతకు సాయంగా వుండమనీ వాళ్ళు సరోజను అడిగారు.

సరోజది కూడా మా ఊరే. ముప్పై ఏళ్ళుంటాయి. భర్త గుజరాత్‌లోని ఓడరేవులో పనిచేస్తున్నాడు. రెండు నెలలకో, మూడు నెలలకోసారి వచ్చి వెళుతుంటాడు. ఇక్కడే వేరే ఉద్యోగం దొరికితే అక్కడ మానేసి వచ్చెయ్యాలని అనుకుంటూ వుండడంవల్ల అక్కడికి భార్యను తీసుకుపోలేదు. భర్త దగ్గర లేకపోవడం సరోజకు ఒకవిధంగా వెలితే.

'ఎక్కడో దూరంగా ఉద్యోగం చేసేవాడ్ని మాత్రం కట్టుకోకూడదు. భర్త దూరంగా వుండే స్త్రీ బతుకు చక్కెర ఫ్యాక్టరీలాంటిది. సగం రోజులు క్రష్షింగ్ వుంటే, మరి సగం రోజులు తాళం తగిలించేస్తారు' అనేది.

ఆమెకి ఇంకా పిల్లల్లేరు. బంధువుల్లో ఆమెకొక్క దానికే ఓ నాలుగురోజులపాటు పరాయి ఇంట్లో వుండే వెసులుబాటు వుండడంవల్ల ఆమెను అడిగారు.

సరేనని ఒప్పుకుంది సరోజ.

మిగిలినవాళ్ళంతా వచ్చేశారు.

పెళ్లికొడుకూ, పెళ్లికూతురూ, సరోజా మిగిలారు.

ఉదయం లేవగానే సుధాకర్ శుభ్రంగా డ్రెస్‌అప్ అయి ఉద్యోగానికి వెళ్ళిపోయేవాడు. సరోజ, నవనీతా కలిసి వంటచేస్తూ కబుర్లలోకి దిగేవారు.

సాయంకాలం ఆరు గంటలకి అతను తిరిగి వచ్చే

**20** వంశీకి ఎక్కడినుండో ఓ వీడియో క్యాసెట్ అందుతుంది. దానిలో తన భార్య సుజన ఓ యువకునితో శృంగారంలో పాల్గొనడం చూసి గిలగిల్లాడిపోతాడు. క్యాసెట్ విషయం కనుక్కుందామని మద్రాసు వెళ్ళి ఇన్‌స్పెక్టర్ శరవణన్‌ని కలుసుకుంటాడు.

ఓ రోజు పొద్దున్నే చిట్టిబాబు ఇంటికి వెళ్ళి అతణ్ణి అరెస్టుచేస్తాడు శరవణన్. నిరంజన్‌ని హత్య చేసినందుకుగాను అరెస్టు చేసినట్లు చెప్పి, చిట్టిబాబును జైలులో బాగా హింసిస్తారు. హత్యచేసినదానికి ఆధారంగా ఓ క్యాసెట్‌ను చూపిస్తారు. అది ఫేక్‌క్యాసెట్ అని, దానికి రుజువుగా సుజన విషయంలో తనో క్యాసెట్ తయారుచేసిన ఉదంతం చెప్తాడు చిట్టిబాబు.

సుజన తన ఫ్రెండ్ అనుపమతో కలిసి ఊరి బయటకు షికారుకు బయల్దేరుతుంది. మాటల మధ్యలో 'అమ్మాయిల ఫస్ట్‌నైట్'ల గురించి చెప్పించుకుంటున్న కారణం అడుగుతుంది అనుపమ. దానికి జవాబిస్తుంది సుజన. తన తండ్రికున్న జాతకాలపిచ్చి గురించి సుజన చెప్పుంటే, పెద్దవాళ్ళ వాదస్తం వల్ల నాశనమైన తన ఫ్రెండ్ నవనీత జీవితం గురించి చెప్పుంటుంది అనుపమ.

వాడు. ముగ్గురూ కలిసి కాఫీలు తాగుతూ, అవీ ఇవీ లోకాభి రామాయణం మాట్లాడుకునేవాళ్ళు.

రాత్రి తొమ్మిదింటికి కొత్తజంట తమ గదిలోకి వెళ్ళేవారు. హాల్లో ఒంటరిగా మిగిలిపోయేది సరోజ.

రెండు మూడు రోజులు నిద్రపోయిందిగానీ ఆ తరువాత ఎంత ప్రయత్నించినా నిద్రపట్టలేదామెకి.

గదిలో జరిగేదంతా ఊహించుకునేది. నవనీత, సుధాకర్ కలిసి అనుభవించే స్వర్గసుఖాలన్నీ కళ్ళ ముందు కదలాడేవి. దాంతో ఒక రకమైన ఉద్రేకానికి లోనయ్యేది. శరీరంమీదున్న బట్టలే బరువుగా తోచేవి. శరీరమంతా ఆరాటంతో కదిలిపోయేది. సుఖంకోసం అవయవాలన్నీ నోళ్ళు తెరుచుకునేవి.

బయట ఇలా ఆమె అవస్థపడుతుంటే లోపల గదిలో అతను అందుకు అంగీకరించమని



అర్థించడం, నవనీత రిజెక్ట్ చేయడం జరుగుతుండేది.

ఇలా కొన్ని రోజులు గడిచాయి.

ఓ రోజు యథాప్రకారం సుధాకర్ క్యారియర్ తీసుకుని ఉద్యోగానికి వెళ్ళిపోయాడు.

భోజనాలయ్యాక అలా ఊరంతా తిరిగి వద్దామని సరోజ, నవనీతా బయల్దేరారు. బజార్లన్నీ తిరిగి, తమకు కావాల్సిన వస్తువులు కొనుక్కుని సాయంకాలం అయిదుగంటల ప్రాంతాన ఇంటికి బయల్దేరారు.

ఓ సినిమాహాలు వున్న వీధిలో నడుస్తుండగా అప్పుడే సినిమా వదిలారు. జనం వెళ్ళడానికి గేట్లు తెరిచారు. ఈ చప్పుళ్ళకు సరోజ అటు చూసింది.

ముఖానికున్న చెమటను తుడుచుకుంటూ హాల్లోంచి వస్తున్న సుధాకర్ కనిపించాడు.

అక్కడ అతన్ని చూసిన ఆమెకి ఏదో అనుమానం వేసింది. అందుకే ఈ విషయాన్ని నవనీతకి చెప్పలేదు.

ఇద్దరూ ఇంటికి చేరుకున్నారు.

మరో గంటకి సుధాకర్ వచ్చాడు.

సుధాకర్ పెరట్లోకి స్నానానికి వెళ్ళినప్పుడు, అతని వెనకే సరోజ కూడా వెళ్ళింది.

## సినీపరిశ్రమకి దక్కిన మాలా శ్రీ

మనకున్న మంచి ప్రతిభావంతమైన గ్లామర్ తార మాలా శ్రీ. ఇటీవల ఆమె, తన కాబోయే భర్త కన్నడ హీరో సునీల్‌తో కారులో ప్రయాణిస్తుండగా ఘోరమైన యాక్సిడెంట్‌కి గురయ్యింది. అయితే అందులో సునీల్‌వర్మ మరణించడం బాధాకరమైన విషయం. కారు డ్రైవరు కూడా మరణించాడు.

ఓ మ్యూజికల్ నైట్ ప్రోగ్రాం నుండి తిరిగి వస్తూండగా ఈ ప్రమాదం కర్నాటకలోని చిత్రదుర్గ సమీపంలో జరిగింది.

తెలుగు పరిశ్రమ ఓ అందాల మంచినటిని దక్కించుకుందన్న తృప్తి మిగిలేలా,మాలా శ్రీమాత్రం ప్రమాదంలో గాయపడి ప్రాణాలతో మిగిలింది.



మాలా శ్రీలాంటి టాలెంటెడ్ ఆర్టిస్టుని దక్కించుకున్నందుకు సినీపరిశ్రమని అభినందిస్తూ, కాబోయే భర్తను కోల్పోయిన మాలా శ్రీకి ప్రగాఢసంతాపం అందజేస్తున్నారు సినీప్రముఖులు.

'మీ జాబ్ కష్టంగా వుంటుందా! బాగా అలిసి పోయారే' అంటూ ప్రారంభించింది.

అతను కంగారుపడడాన్ని ఆమె కనిపెట్టింది.

'ఆఁ .ఒత్తిడి బాగానే వుంటుంది. ఉద్యోగం అంటేనే టెన్షన్‌కదా' అన్నాడు ఒక్కో మాటను పేరుస్తూ.

'ఇంతకీ ఏమిటి మీ జాబ్?'

ఆమె ఊహించినట్టే అతను వెంటనే జవాబు చెప్పలేకపోయాడు.

'లోకోషెడ్‌లో' అంటూ నీళ్ళు నమిలి-'ఎలక్ట్రీషియన్' అని గుర్తొచ్చినట్టు చెప్పాడు.

'ఈ రోజు మరీ కష్టపడ్డట్టున్నారు'

'ఆఁ. ఉదయం వెళ్ళినప్పట్నుంచీ సాయంకాలం వరకూ పనే'అన్నాడు.

అదిగో అక్కడే అతను దొరికిపోయాడు.

ఆమెకి మొత్తం అర్థమైంది.

అతనికి దగ్గరగా వెళ్ళి-'నిజం చెప్పు. నువ్వు నిజంగా పనిచేస్తున్నావా? ఈ రోజు నేను లోకోషెడ్‌కు వెళ్ళాను. సుధాకర్ అనే పేరున్న వ్యక్తే లేడన్నారు' అని చీకట్లో ఓ బాణం వదిలింది.

సడన్‌గా ఆమె ఏకవచనంలోకి దిగేసరికి అతను మరింత కంగారుపడిపోయాడు. ఆమె ముందుకు ఉరికి-'ప్లీజ్! ఈ విషయం నవనీతకు చెప్పకు' అంటూ ఆమె రెండుచేతులూ పట్టుకున్నాడు.

'ఎందుకలా అబద్ధంచెప్పావ్? ఇప్పుడు ఆ పిల్ల బతుకేంగాను?' కోపంగా అంది సరోజ.

'ఇందులో నా పొరబాటు ఏమీలేదు. ఇంతకు ముందు లోకోషెడ్‌లోనే ఎన్.ఎం.ఆర్.గా పనిచేసే వాడ్ని. పెళ్లికి ముందు తీసేశారు. అప్పటికే పెళ్లి ఫిక్సయిపోయింది. మధ్యవర్తితో చెప్పాను.

ఇప్పుడు చెబితే పెళ్లి ఆగిపోతుందనీ, చెప్పక పోవడమే ఉత్తమమనీ అన్నాడు.

దాంతో మెదలకుండా వుండిపోయాను. మరో జాబ్ కోసం ప్రయత్నిస్తున్నాను. నన్ను అర్థంచేసుకోండి' అంటూ ఏడుపులోకి దిగాడు.

'పెళ్లంటే నూరేళ్ల పంట. సంబంధం చూడడమంటే చాలా గమనించాలి. అటు ఏడు తరాలనూ, ఇటు ఏడు తరాలనూ వాకబు చేయాలి అంటూ డంబాలు పలికే పెద్దలు చేసే పెళ్లిళ్లు ఇలానే తగలడతాయి. లేకుంటే పిల్లవాడు ఏంచేస్తున్నాడో, అతను చెబుతున్నవన్నీ నిజాలో, అబద్ధాలో అని కూడా చూడకుండా ఇలా పిల్లల్ని బలిపశువులుగా చేసేస్తున్నారు తల్లిదండ్రులు'

'అయ్యో! మీరు అలా అనకండి. నేనంతటి క్రూరుణ్ణి గాను. మోసకారిని అంతకంటే గాను' అని అతను ఆమె కాళ్ళా వేళ్ళా పడ్డాడు.

ఏదో పొరబాటు జరిగిందే తప్ప కుర్రాడు అమాయకుడేననీ, మంచివాడేననీ ఆమె పసిగట్టింది.

'అయితే ఈ విషయం నవనీతకు తెలియకుండా వుండాలంటే నా కోరిక నువ్వు తీర్చాలి' అని అతి స్పష్టంగా చెబుతూ అతన్ని వాటేసుకుంది.

తన తప్పుకు అంతటి తీయటి శిక్ష పడుతుందని ఊహించని అతను ఉబ్బితబ్బిబ్బయిపోయాడు.

గది లోపల వాళ్ళిద్దరి రాసలీలలు ఊహించుకుంటూ అతని మీద మోహం పెంచుకున్న ఆమె ఆ రాత్రే అతనిలో కలిసిపోయింది.

ఇవన్నీ చాలా రోజులు దాగవుకదా.

నవనీతకు తెలిసిపోయింది.

కాపురం చక్కబెట్టి తిరిగి రావాల్సిన సరోజ అక్కడే ఆగిపోయింది. కలకాలం కాపురం చేయాల్సిన నవనీత పర్మనెంట్‌గా పుట్టింటికి చేరిపోయింది"

అనుపమ చెప్పడం పూర్తిచేసేసరికి ఇద్దరూ రోడ్డు చేరుకున్నారు. రోడ్డుకు అవతల వెళ్ళే ఏటి ఒడ్డున ఇసుకలో కూర్చున్నారు.

"పాపం నవనీత. అందరూ కలిసి ఆమెను ముంచేశారు. ఈ పెద్దవాళ్ళకు బుద్ధి వుంటే కొత్తజంటకు తోడుగా వుండమని వయసులో వున్న అమ్మాయిని వుంచుతారా? తల్లిదండ్రుల తెలివితక్కువతనానికి ఆమె జీవితం నాశనమై పోయిందికదా" సుజన ఎంతో సానుభూతి ప్రకటించింది.

"ఈ పెళ్లిళ్ల పేర-సాంప్రదాయాల పేర-ఎన్ని జీవితాలు ఇలా నరకకూపాలుగా తయారవుతున్నాయో తెలుసా? లెక్కకట్టలేం. ఒకరో, ఇద్దరో కుటుంబ బంధనాలన్నీ తెంచుకుని బయటపడుతున్నారు. అయితే అలా చేయడానికి ఎంతో సాహసం కావాలి. కఠినమైన వాస్తవాల్ని అటు పిల్లలుగానీ, ఇటు పెద్దలు గానీ గుర్తించడంలేదు. అందుకే ఇద్దరి మధ్యా చాలా గేప్ పేరుకుపోతోంది. ఇందుకు ఉదాహరణ నేనే"

"అందరం భ్రమల్లోనే వుంటూ తమ అనుభవాలనే నిజం అని గుడ్డిగా నమ్ముతున్నాం. అందుకే పిల్లలకీ, పెద్దలకీ పొసగడంలేదు" సుజన అనుపమ అన్నదానిని బలపరిచింది.

"కుటుంబ బంధనాల్ని వదులుకోవడానికి చాలా తెగించాను నేను. ఒకరిదగ్గర తాళి కట్టించుకున్న నేను మరుసటి రోజు రాత్రి మరో వ్యక్తితో శోభనం జరిపించుకున్నాను" అన్నది అనుపమ.

ఒడ్డున వున్న కొంగలు ఒక్కసారిగా పైకి లేచాయి.

సుజన అనుపమవైపు ఎంతో ఆశ్చర్యంగా అలాగే చూస్తుండిపోయింది.

"నీకు మొత్తం-జరిగినదంతా చెబుతాను"



## శ్రేష్ఠమైన నువ్వులనూనె

అనాదిగా మనవారు వంటకాల తయారీకి వాడిన నువ్వుల నూనెను మించిన ఔషధం మరొకటి లేదని భారతీయ వైద్యులు స్పష్టంచేశారు.

ప్రస్తుతం మనదేశంలో పదిలక్షలమంది తీవ్రమైన గుండెజబ్బులతో బాధపడుతుండగా ప్రభుత్వపరంగా పూర్తిస్థాయి గుండెజబ్బుల చికిత్సాకేంద్రాలు 38 మాత్రమే వున్నాయి. చికిత్సాకేంద్రాలు పెరగాలని కోరుకునే బదులు, గుండెజబ్బు వున్నవారు తమ ఆహారపు అలవాట్లు మార్చుకుని ఆరోగ్యవంతంగా తయారవడం మంచిది.

నువ్వులనూనె వంటలకు వాడిన కాలంలో గుండెజబ్బులనేవి భారతీయులకు తెలియదు. ఆహారం, నిద్ర, శారీరక శ్రమకూడా ఒక క్రమపద్ధతిలో వుండేవి. అలవాట్లమార్పు,నువ్వులనూనెవాడకం మానేయడం మనం చేసిన పొరపాట్లు.

మనిషి శరీరానికి రోజుకు ఆరు లేదా ఏడుస్పూన్లకు మించిన నూనె అవసరంలేదని, ఒక్కొక్కస్పూన్‌లో వుండే 5 గ్రాముల కొవ్వు సరిపోతుందని వైద్యులు అన్నారు. నువ్వులనూనె ఖరీదును భరించలేనివారు 'ధారా' వంటి వనస్పతినూనెను వాడవచ్చును. ◆

అనుపమ తన ఫ్లాష్‌బ్యాక్‌ను చెప్పడం ప్రారంభించింది.

"మా అమ్మా నాన్నలకు ఇద్దరు సంతానం. నేనూ, మా అన్నయ్యా. ఊర్లో కలిగిన కుటుంబాల్లో మాదీ ఒకటి. అన్నయ్య ఇంటర్ వరకు చదివాడు. అప్పటికే వాడు రెండుసార్లు ఇంటర్ తప్పడంవల్ల అంతటితో ఆపేశాడు. నాన్నతో పాటు వ్యవసాయం చేసేవాడు.

నేను ఇంటర్ పాసై డిగ్రీలో చేరాను. రోజూ బస్సులో కావలి కాలేజీకి వెళ్ళి తిరిగొచ్చేదాన్ని.

డిగ్రీ సెకండ్ ఇయర్‌లో వుండగా నాకు గౌతమ్‌తో పరిచయమైంది.

మా ఇల్లు వీధికి ఉత్తరంగా వుండేది. మా ఇంటి ముందు మూడిళ్ళ లోగిలి వుండేది. అందరం బంధువులమే కనుక సాధారణంగా రోజులో ఎక్కువభాగం నేను అక్కడ గడిపేదాన్ని. మూడిళ్ళు ఒకే లోగిలిలో వుండడంవల్ల చాలా కోలాహలంగా వుండేది. కాలక్షేపానికి కొదవుండేదికాదు.

ఆ ఇళ్ళల్లోని ఒక ఇంట్లో అరుణ వుండేది. ఆమె నాకు అన్నయ్య వరసయ్యే చిరంజీవి భార్య. ఆమె నాకంటే అయిదేళ్ళు పెద్దది. సరదాగా వుండేది. సాయంకాలం కాలేజీనుంచి ఇంటికి రావడం తరువాయి అరుణ దగ్గరికి పరిగెత్తేదాన్ని.

మేము ఇద్దరం ముందు వరండాలో కూర్చుని కబుర్లాడుకునేవాళ్లం.

ఆమె చిన్నాన్న కొడుకే గౌతమ్. అతనిది ప్రకాశం జిల్లా సింగరాయకొండ దగ్గర్లోని పల్లెటూరు. కావలి పి.జి. సెంటర్లో ఎం.కాం. ప్రీవియస్‌లో చేరాడు. తన అక్కయ్య అరుణ దగ్గరికి ప్రతి ఆదివారం వచ్చేవాడు.

మొదటిసారి వచ్చినప్పుడు అరుణ నాకు అతన్ని పరిచయం చేసింది.

'వీడు మా చిన్నాన్న కొడుకు. పేరు గౌతమ్. ఎం.కాం. చేస్తున్నాడు'

నేను అతనివైపు పరిశీలించి చూశాను.

ఎర్రగా, అందంగా వున్నాడు. కళ్ళలో చిలిపితనం వల్ల మరింత లవ్లీగా అనిపించాడు. నిజానికి ఓ అబ్బాయిని అంతగా పరిశీలించడం అదే మొదటిసారి. మొత్తానికి నేను గుర్తించలేదుగానీ నాలో ఏదో స్పందన బయల్దేరింది. అదీ ఇదీ అని చెప్పలేని పరిస్థితి.

అతను ఇంట్లో వుండగా అక్కడికి వెళ్ళడం బావుండదనిపించి రెండు మూడు ఆదివారాలపాటు వెళ్లలేదు.

నేను అక్కడికి వెళ్ళలేకపోతున్నాననే దిగులువల్ల అతన్ని గురించే ఆలోచించే పరిస్థితిలో పడిపోయాను.

మరుసటి ఆదివారం కూడా అతను వచ్చాడు. నేను ఇంట్లోనే వుండిపోయాను.

పదిగంటల ప్రాంతాన చిరంజీవి చెల్లెలు వచ్చింది. ఆ పిల్లకు ఏడేళ్ళుంటాయి.

'అక్కా! నిన్ను గౌతమ్ అన్నయ్య రమ్మంటున్నాడు' అని చెప్పింది.

అయినా వెంటనే బయల్దేరలేదు నేను. వెళ్ళాలా వద్దా అని ఆలోచనలో పడ్డాను. వెళ్ళాలనే కోర్కెను ఎంత అణుచుకుందామన్నా లాభంలేకపోయింది.

పావుగంట తరువాత బయల్దేరి వెళ్ళాను.

ఇంట్లో అతను తప్ప ఎవరూ లేరు.

'కబురుపెట్టిందే రాణీగారు రారా ఏమిటి?' నాట

### జంట విజయాలు

'నెంబర్ వన్'లో లతా శ్రీ సరసన రాఘవ నటించాడు. ఆ జంటకి కూడా అది సెంటిమెంట్ అయ్యిందేమో. హిట్‌జంటగా వరుసగా నటిస్తున్నారు.

పైగా-"మేమిద్దరం తోటి నటీనటులమే కాదు. మంచి ఫ్యామిలీ ఫ్రెండ్స్ కూడా. మేమిద్దరం ఒకేసారి మద్రాసు నుండి హైదరాబాద్‌కి షిఫ్టయ్యాం. ఇక్కడికొచ్చాక చాలా మంచి అవకాశాలొస్తున్నాయి. కలిసి కొన్ని, విడిగా కొన్ని చిత్రాల్లో నటిస్తున్నాం" అంటున్నారీ విజయాల జంట.



## డొంక తిరుగుడు

ఎక్స్‌పోజింగ్‌కి అభ్యంతరాలులేని శిల్పా శెట్టి, "మా ఇంట్లోవాళ్లు, స్నేహితులు సినీపరిశ్రమ చెడ్డదని భావి స్తారు. కానీ మంచివాళ్లూ, చెడ్డవాళ్లూ ఎక్కడైనా వుం టారు. మంచిగా వుండడం, చెడుగా మారడం మనపైనే ఆధారపడి వుంటుంది. చెడుగా వుండేటట్టయితే, ఎక్కడ వున్నా అలాగే వుండొచ్చు! దానికోసం ఇక్క డికే రానక్కరలేదని నా ఉద్దేశం" అని మంచి చెడుల గురించి విడమరిచి చెబుతోంది.

"నేను మంచిదాన్ని" అని చెప్పుకోవడానికి ఇదంతా డొంక తిరుగుడన్నమాట!



కీయంగా అని, అంతలోనే సీరియస్ అయిపోయి- 'ఆదివారం ఎప్పుడౌతుందా నిన్ను చూద్దామా అనే నా ధ్యాసంతా. వచ్చి ఇంతసేపైనా నువ్వు కనపడక పోతే గిలగిల్లాడిపోయాను' అన్నాడు.

ఓ అబ్బాయి నాకోసం పడికాపులు కాస్తున్నాడని వినడం అదే మొదలు నాకు. ఏదో అయిపోతోంది. మనసంతా మరో కొత్తపుంకింతను అనుభవించింది. అందుకే ప్రేమలో విచక్షణ, జ్ఞానం, తెలివి లోపిస్తా యనుకుంటాను. అంతవరకు లేని కొత్త అనుభవం ఎదురైనప్పుడు స్త్రీకానీ, పురుషుడుకానీ మరేదీ ఆలో చించకుండా దానికి ఈల్డ్ అయిపోతాడు. అందుకే స్త్రీపురుష సంబంధాల్లో కులం, మతం, ప్రాంతం, భాష, ఆస్తి, అంతస్తు-ఇవన్నీ మూలపడిపోతాయి.

అంతవరకు చదువుతప్ప మరే ఇతర ఆలోచన లేని నేను అదిగో ఆ క్షణంనుంచీ కొత్త ఆకర్షణకి లొంగిపోయాను.

తలుపుమీద వేళ్ళతో రాస్తూ వుండిపోయాను.

ఆ మాటలు పూర్తిచేశాక ఇక అక్కడ వుండలేక పోయాడు. ఒళ్ళంతా చెమటలు పట్టేశాయి. ఇలా చెప్పడం అతనికి కొత్తేనని నేను గ్రహించాను.

కొంతసేపు అక్కడే వుండి, కాస్త స్థిమితపడ్డాక ఇంటికి వచ్చేశాను.

కానీ ఇంట్లో వుండలేకపోయాను. బయటకొస్తే నా కళ్ళు నాకు తెలియకుండానే అటు తిరిగిపోతు న్నాయి. నా కాళ్ళు అటు పోవడానికి లాగుతున్నాయి. మనసు అతన్ని చూడాలని గుంజాటోంది.

ఏదో కొత్తభూతం నన్నావహించింది.

సాయంకాలం ఎప్పుడౌతుందా అని నిముషాలు లెక్కపెట్టుకుంటూ కూర్చుండిపోయాను. మూడు గంటలనుంచే తయారవడం మొదలుపెట్టాను.

ప్రేమ అంటేనే సెల్ఫ్ ఐడెంటిటీ అనుకుంటాను. మనల్ని మనం గుర్తించడమే ప్రేమంటే. నన్ను నేనుగా ఫీల్‌కావడం అదే మొదలు.

ఎప్పుడూ లేనిది మూడుసార్లు ముఖానికి సోప్ రాసుకున్నాను. అంత దట్టంగానూ కాకుండా, అంత లైట్‌గానూ కాకుండా పౌడర్ రాసుకున్నాను.

నుదుటన కాస్తంత పెద్దదిగా తిలకం దిద్దుకున్నాను. జడ వేసుకుని చివర ఏమీ పెట్టకుండా వెంట్రుక లను అలా వదిలేశాను.

ఎవరైనా పరిశీలించి చూస్తే నేను డిఫరెంట్‌గా అలం కరించుకున్నానని కనిపెట్టేటట్లు తయారయ్యాను.

ఆరుగంటల సమయంలో అరుణ ఇంటికి వెళ్ళాను. గౌతమ్ చిరంజీవి చెల్లెలికి పాఠాలు చెబుతున్నాడు. చిరంజీవి తప్ప మిగిలిన అందరూ వున్నారు.

అతను నన్ను చూసి నవ్వాడు.

నా చుట్టూ వంద ఫ్లోరోసెంట్ దీపాలు ఒక్క సారిగా వెలిగినట్లనిపించింది.

అతను తిరిగి పాఠం చెప్పడంలో మునిగిపోయాడు. నేను అరుణ పక్కగా పొయ్యి దగ్గర కూర్చున్నాను.

'గుండెలోని భాగాలు ఏవీ?' అతను చిరంజీవి చెల్లెలు లక్ష్మిని అడిగాడు.

'సిరలూ, ధమనులూ...' ఆ పిల్ల ఏదో చెబుతోంది.

నేను అడ్డంపడి 'ప్రేమలూ' అన్నాను.

అతను ఉలిక్కిపడ్డట్టు ఠక్కున ముఖం పైకెత్తి నావైపు అదోలా చూశాడు.

నేను తల తిప్పుకున్నాను.

అరుణ ఏం అనుకుంటుందోనన్న భయమన్నా లేకపోయింది నాకు.

ఆ తరువాత అతను పాఠం చెప్పలేకపోయాడు. క్షణానికి ఓ మారు నావైపు చూడడం-అనవసరంగా నవ్వడం-ప్రతిసారీ కొత్తగా చూసినట్లు ముఖం పెట్ట డం-దీంతోనే సరిపోయింది.

చీకట్లు పడడంతో లైట్లు వెలిగాయి-చీకటి ముఖాన వెల్ల వేసినట్లు వెలుగు పరుచుకుంది.

నేనూ అరుణతో ఏదో మాట్లాడుతున్నానుగానీ ఒకదానికొకటి పొంతన లేదు.

మా అమ్మావాళ్ళూ పిలిచేవరకూ ఆ రాత్రి నేను ఇంటికి వెళ్లలేదు.

తొమ్మిది ప్రాంతాన ఇంటికి వెళ్ళి భోజనం చేశాను. గదిలో పడుకున్నానేగానీ శరీరమంతా నా మీద కుట్ర జరుపుతున్నట్లు నిద్ర రాలేదు. అవయవా లన్నీ దాడి ప్రారంభించినట్లు ఏదోగా వుంది. ఎద మీద పైట నిలబడడంలేదు.

తలకింద వుండాల్సిన తలగడ పక్కన చేరింది.

ఎప్పుడో తెల్లవారుజామున నిద్రపోయాను.

రెండు వారాలు గడిచిపోయాయి.

మూడో శనివారం సాయంకాలం గౌతమ్ వచ్చాడు.

నేను పరుగెత్తుకు వెళ్ళాను.

ఇప్పుడు మేం ఇద్దరం బాగానే మాట్లాడుతున్నాం. ఎదురెదురుగ్గా కూర్చుని అలా మాట్లాడడం ఎంత బావుంటుందో మాటల్లో చెప్పలేను.

లైట్లు వెలిగాక 'దాయాలు ఆడదామా?' అని ప్రపోజ్ చేశాడు గౌతమ్.

ఆ ఇంట్లో పాచికలు ఆడడం మామూలే.

సరేనన్నాను.

దాయాల ఆటకు అన్నీ సిద్ధంచేశాను.

అరుణ వంటలో బిజీగా వుంది.

'పందెం ఏమిటి?' అతను చిన్నగా అడిగాడు పాచి కల్ని చేతుల్లోకి తీసుకుని.

నేనేమీ చెప్పలేదు.

'ముద్దు' అతను ఎంత మెల్లిగా అన్నా అది విస్ఫోట నంలా వినిపించింది. జలదరింపులాంటిది కరెంట్‌లా ఒళ్ళంతా పాకింది.

'ఓడినవాళ్ళు గెలిచినవాళ్ళకి పెట్టాలి'

అప్పుడూ ఏమీ మాట్లాడలేకపోయాను.

నా జవాబును ఆశించకుండా పాచికల్ని వేశాడు.

మరోగంట గడిచింది.

ప్రేయసీ ప్రియులకు తొలిరోజుల్లో పాచికలు ఆడడంకంటే అద్భుతమైన ఆట మరొకటి వుండ దనుకుంటాను.

పాచికల్ని ఎదుటివ్యక్తికి వేశాక మనం చేయి చాస్తాం. అలా చాచినప్పుడు అరచేయో, వేళ్ల కొసలో ఖచ్చి తంగా తగులుతాయి.

తొలిఘట్టంలో వున్న స్త్రీ పురుషులకి ఆ స్పర్శ ఎంత తీయగా వుంటుందో చెప్పలేను.

అందుకే ఈ స్టేజీలో వున్న లవర్స్ ఖచ్చితంగా పాచికలు ఆడితీరాల్సిందే.

చివరికి నేనే గెలిచాను.

కానీ పందెం ప్రకారం ముద్దుపెట్టమని గౌతమ్‌ని ఎలా అడగగలను?

పైపెచ్చు ఆ ప్రమాదంనుంచి తప్పించుకోవడా నికి వడివడిగా బయటికి అడుగులు వేశాను.

మా ఇంటికీ, అరుణవాళ్ళింటికీ మధ్య చీకటిగావుం టుంది. అక్కడికి అతను పరుగెత్తుకుంటూ వచ్చాడు.

నా ముందుకు వచ్చి, ఆగి, నన్ను రెండు చేతుల్తో పట్టుకుని పెదవులమీద గాఢంగా చుంబించాడు.

దేవుళ్ళ పెళ్లిళ్లు జరుగుతూ వుంటే దేవతలు ఆకా శంనుంచి పూలజల్లు కురిపిస్తారే- అలా ఫీలయ్యాను.

జీవితంలో మొదటి ముద్దు.

ఆ క్షణంలో నేనేమైపోయానో నేనెప్పటికి చెప్ప లేను. రక్తం గడ్డకట్టుకుపోయిందో, హార్ట్ బీటింగ్స్ ఆగిపోయాయో, కళ్లు చూడడం మానేశాయో, శ్వాస నిలిచిపోయిందో నాకు తెలియదు.

అలా నిలబడిపోయాను. పెదవుల్లో మొదలైన్నతిపి శరీరమంతా పాకుతోంది. **(ఇంకావుంది)**

సీరియల్



# రారా మా ఇంటిదాకా

## మేర్లపాక మురళి

"మేమిద్దరం రూమ్‌లోకెళ్ళాం. చాలాసేపు కబుర్లాడుకున్నాం. పక్కపక్కనే పడుకోవడంవల్ల కాబోలు మా రెండు శరీరాలు కొత్త అనుభవం కోసం తొందరపెడుతున్నాయి. గౌతమ్ భుజంమీద చేయివేసి మీదకు లాక్కున్నాను. పైట తీసేసి అతని తలను వక్షస్థలంకేసి అదుముకున్నాను.

నిజం చెప్పద్దూ నాకేమీ సిగ్గనిపించలేదు. సిగ్గు సహజలక్షణంకాదని నా అనుమానం. సిగ్గును కలగజేసే ఎంజైములుగానీ, జీన్స్‌గానీ లేవుకదా.

సిగ్గనేది సంఘం బలవంతంగా స్త్రీలకు నేర్పించిన గుణం. నువ్వుస్త్రీవి, తలవంచుకో, సిగ్గు అభినయించు అని చిన్నప్పట్నుంచీ పెద్దవాళ్ళు చెప్పగా, చెప్పగా, సిగ్గుపడడం అనేదాన్ని మన సహజలక్షణంగా భావించే స్థితికి చేరుకున్నామని నా నమ్మకం.

అతను మరింతగా ముఖాన్ని నా గుండెల మీద అదిమిపట్టి వుంచాడు. నా ఎద అంతగా పొంగుతుందని నాకు అప్పటివరకూ తెలియదు. ఏటికి వరదొచ్చి గట్టును కోసేసినట్లు జాకెట్‌కి ఒరుసుకుంటున్నాయి. వాటి బాధ చూడలేక హుక్‌లు విప్పాను.

అంతకాలం ఖైదులోవుండి ఒక్కసారిగా స్వేచ్ఛను పొందినట్లు అవి బయటికి ఉరికాయి.

పాపం బ్రా తెల్లముఖం వేసుకుని కనిపించింది. ఇక వాటిని బహిర్గతం కాకుండా అదిమిపెట్టడం తన వల్ల కాదన్నట్లు అది అంటున్నట్లే అనిపించింది. నడుముభాగాన్ని కాస్తంత పైకిలేపి చేతుల్ని వీపుకిందకు పోనిచ్చి ఎలాస్టిక్ తప్పించాను.

బ్రా ఊడిపోయింది.

అతను వాటి నునుపుకీ, మెరుపుకీ తట్టుకోలేనట్లు ముఖాన్ని అదిమాడు. అతను ఎంతగా అదుముతుంటే అవి అంతగా పొంగుతున్నాయి. నాకు ఆ సమయంలో న్యూటన్స్ థర్డ్ లా గుర్తొచ్చింది.

జాకెట్టునీ, బ్రానీ తప్పించాను. బంగారు రంగు సముద్రం అనేది ఒకటుంటే, దాని ఒడ్డు బహుశా అలా వుంటుందేమోనన్నట్టు వుంది నా పై భాగం. నువ్వు చూడాల్సిన భాగాలు చాలా వున్నాయని నా చేతుల తోనే చెబుతూ ముఖాన్ని కిందకు తోశాను.

అతని ముఖం కూడా ఎక్కువై పోయేంత సన్నటి నడుం. సూర్యుడికి భయపడ్డ రాత్రి అక్కడ దాక్కుందేమోననిపించేటట్లు చీకటిబిలంలా లోతైన బొడ్డు. అతని వేళ్ళు ఏం చేస్తున్నాయో తెలియవుగానీ ఏదో తెలియని మత్తు అక్కడినుంచి ప్రకంపనాలై లేస్తోంది. అతను గొప్ప మంత్రగాడై నన్ను వశపరుచుకోవడానికి మంత్రాలు చదువుతున్నట్లు పెదవులు ఆడుతున్నాయి. అంత చిన్న బొడ్డు అంత పెద్ద శరీరాన్ని లొంగదీసుకోవడం చిత్రం కాకపోతే మరేమిటి?

వక్షస్థలానికీ, జఘనానికీ మధ్యవేసిన పూలవంతెనలాంటి సన్నటి నడుంనుంచి అతను కిందకు దిగాడు. నడుమును పరిహసించడానికన్నట్లు అక్కడినుంచి లావణ్యం మెలికలు తిరిగి ఏవేవో ఒంపులకు లోనై చివరికి జన్మరహస్యం తెలుసుకోవడానికి స్థిరపడిపోయింది.

చివరన ఎక్కడో వున్న గీతను కలపడానికన్నట్లు అతను నా నడుం నుంచి సరళరేఖను గీస్తున్నాడు.

ఇక ఆగలేక అతన్ని మరింత గట్టిగా పొదివి పట్టుకున్నాను. ఆ తరువాత కాలం స్తంభించిపోయింది. అస్తిత్వాన్ని కోల్పోవడమంటే అదే. ఏవీ గుర్తురాని ఆ స్థితిని ఏంఅనాలో నాకు తెలియదు. శరీరాన్ని అంటుకుని వున్న ఆత్మలు సుఖించే మధురఘట్టం అది.

మాకు కాదు-సుఖానికి ఊపిరి ఆడడంలేదు.

అలా నా ఫస్ట్‌నైట్ గడిచిపోయింది.

తెల్లవారుఝామున అతనన్నాడు 'మనం ప్రస్తుతానికి ఎక్కడైనా కొన్ని రోజులుందాం. వేడితగ్గాక మనం పెళ్ళిచేసుకున్నట్టు ఇళ్ళకు ఉత్తరాలు రాద్దాం. అంత వరకు చీరాలలో వుందాం. అక్కడ నాకో ఫ్రెండ్ వున్నాడు. సిగరెట్ల డీలర్-త్వరగా తయారవ్'

మరో అరగంటకు ఇద్దరం బయల్దేరాం. కావలి బస్టాండ్ చేరుకున్నాం. డైలీ పేపర్ కొందామని గౌతమ్‌ని వదిలి బుక్‌స్టాల్‌కు వెళ్ళాను. ఏదో సినిమా మ్యాగజైన్ కొంటున్న అరుణ కనపడింది. ఆమెను అక్కడ చూడ

**22** సుజన ఫ్రెండ్ అనుపమ తన ఫస్ట్‌నైట్ గురించి చెప్తూ, గౌతమ్‌తో తనకు పరిచయమైన పరిస్థితులను వివరిస్తుంటుంది.

పాచికలాటలో ప్రారంభమైన వారి పరిచయం క్రమంగావృద్ధిచెంది కాలేజీ మానేసి షికార్లు చేసే వరకు వస్తుంది. గౌతమ్‌ను పెళ్లాడాలనుకుంటున్నట్లు తల్లికి చెప్తుంది అనుపమ. ఇది తెలిసిన అనుపమ తండ్రి ఆమెకు పెళ్లిప్రయత్నాలు చేస్తాడు.

పెళ్లిచూపులయింతర్వాత ఇంట్లోనుండి పారిపోవాలని అనుపమ చేసిన ప్రయత్నం విఫలమవుతుంది. ఇక అప్పటినుండి అనుపమ తల్లి, అన్నయ్య ఆమెను కాపలా కాస్తుంటారు. చివరకు ఆమె తండ్రి నిర్ణయించిన వరునితో అనుపమ పెళ్లి జరుగుతుంది. పెళ్లైన తర్వాత తల్లిదండ్రులకు అనుమానం రాకుండా ప్రవర్తిస్తుంది అనుపమ. ఫస్ట్ నైట్ రోజు రాత్రి పెళ్లికొడుకుతో కలిసి భోజనం చేసింతర్వాత, ఇంకో గంటలో శోభనం ముహూర్తం అనగా ఇంట్లో నుండి పారిపోతుంది అనుపమ.

ఆ రాత్రిపూట ఒంటరిగా లారీ ఎక్కి కావలి బస్టాండులో దిగుతుంది ఆమె. తన కోసం వేచివున్న గౌతమ్‌ని కలుస్తుంది. ఆ రోజు రాత్రి పదకొండు గంటలకు వారి పెళ్లి జరుగుతుంది.

డం ఎంత ఆశ్చర్యం వేసిందో, అంత ఆనందం పొందాను. ఇంట్లో విశేషాలు తెలుస్తాయి మరి.

'అరుణక్కా' అని పిలిచాను.

వెనక్కి తిరిగి చూసిన అరుణ కూడా ఖంగుతింది.

'నువ్వా!'

'ఆఁనేనే'

'శోభనం రోజున పారిపోయిన అమ్మాయివి నువ్వే నాకు తెలిసినంతవరకూ.
ఎక్కడికి వెళ్ళావ్?'

మొత్తం చెప్పాను.

'గౌతమ్ దగ్గరికే వెళ్ళుంటావని ఊహించాను. ఈ పని ఆ మూడుముళ్ళూ పడకముందు చేసుండాల్సింది'

'నేనూ ఎంతగానో ట్రై చేశాను. కానీ వీలెందికాదు. చూపుల్ని తుపాకుల్లా చేసి నన్ను హమేషా కాపలా కాస్తుంటే ఎలా పారిపోవడం?'

'పెళ్ళికొడుకు ముఖంమీద నెత్తురుచుక్కలేదు. ఫస్ట్‌నైట్‌కోసం సెంట్ రాసుకుంటున్నప్పుడు ఎవరో చెప్పారట పెళ్ళికూతురు లేచిపోయిందని'

'తరువాత?'

'తరువాత ఏముంది? ఇక ఒక్కక్షణం కూడా వుండలేదు. మగపెళ్ళివారంతా ఆ రాత్రే వ్యాన్‌లో వెళ్ళిపోయారు' అంది అరుణ.

'అమ్మావాళ్ళు ఏమంటున్నారు?'

'మీ అమ్మ మటుకు బాగా ఏడుస్తోంది. మీ నాన్న కథ తెలియందేముంది. నీమీద కారాలు మిరియాలు నూరుతున్నాడు. మొత్తానికి ఫస్ట్‌నైట్‌న పారిపోయివచ్చి



పెద్ద సంచలనమే సృష్టించావ్'

'ఏంచేయను? ఈ పెళ్లి ఒద్దు మొర్రో అంటే వినకపోతిరి. ఒకర్ని ప్రేమించి మరొకర్ని పెళ్ళి చేసుకోవడానికి మనసెలా ఒప్పుతుంది'

'గౌతమ్ ఎక్కడ?'

'అదిగో- అక్కడ నిలుచున్నాడు. ఇంతకీ నువ్వెక్కడికి బయల్దేరావక్కా?'

'వ్యవసాయంకోసం డబ్బులడగడానికి మా అమ్మావాళ్ళ ఇంటికి వెళుతున్నాను' అంది అరుణ.

'లగేజీ చాలావుందే' అని అడిగాను ఆమె చేతనున్న సంచిని చూస్తూ.

'ఆఁ నీ స్వీట్లే ఇవి-జిలేబీలు'

'నా స్వీట్లా?'

'ఆఁ నిన్ను అత్తగారింటికి పంపుతూ పెట్టాల్సిన సారెకోసం తయారుచేశారు మీ అమ్మావాళ్ళు. నువ్విటు వచ్చేశావ్‌గదా. ఏం చేస్తారిక వాటిని? కేజీ ఇరవైరూపాయల లెక్కన కావాలన్నవాళ్ళకి ఇచ్చారు.

## మరోమారు హీరో



ఈమధ్య అమెరికా తిరిగొచ్చిన బాబూమోహన్, అమెరికాలోని తెలుగువాళ్లకి తనంటే అభిమానమని చాటుతున్నాడు. అమెరికా వెళ్లొచ్చిన అందరిలాగే, ఈ కమెడియన్ కూడా అమెరికాలోని రోడ్లని తెగ మెచ్చుకుంటున్నాడు. "వీలైతే అమెరికాలోనే సెటిల్ కావాలనుంది" అని కూడా ఆశ బయటపెట్టాడు.

"సుందరవదనా సుబ్బలక్ష్మి మొగుడా" ఫ్లాపయినా, 'తిండిపోతు-తిరుగుబోతు'లో మళ్లీ హీరోగా నటిస్తున్నాడు బాబూమోహన్. "సుందరవదనా... ఫెయిల్‌తో అనేకరకాలుగా విమర్శించేవారికి ఈ చిత్రమే సరైన జవాబిస్తుంది" అంటున్న బాబూమోహన్, తన డాన్స్‌కి, ఫైట్స్‌కి ప్రేక్షకుల రెస్పాన్స్ బాగుంటోందని కూడా చెప్తున్నాడు. ఈ కొత్త సినిమా చాలా గొప్పగా రూపుదిద్దుకుంటోందిట.

నేనూ రెండు కేజీలు కొన్నాను'

'స్వీట్స్ అమ్ముకున్నారా?' ఇంత విషాదంలోనూ మా అమ్మవాళ్ళు స్వీట్స్ అమ్ముకున్నారంటే నాకు చాలా బాధేసింది. ఆ మాటే అన్నాను.

'స్వీట్స్ అమ్ముకున్నారంటే ఎందుకంత ఆశ్చర్యపోతావ్? నువ్వు వెళ్ళిపోయినప్పుడు ప్రేమ ఎంతటి సాహసాన్నైనా చేయిస్తుందంటే మీ అమ్మ కూడా ఇలాగే ఆశ్చర్యపోయింది. స్వీట్స్ అమ్ముకున్నారంటే నువ్వూ ఆశ్చర్యపోయావ్. నీ పరిస్థితిలో మరో అమ్మాయి వున్నా, మీ అమ్మస్థానంలో మరో ఇల్లాలు వున్నా అదే విధంగా ప్రవర్తిస్తారు.

కానీ ఈ విషయం అందరం మరిచిపోతాం. ఎదుటివాళ్ళ ప్రవర్తనను తప్పుపట్టి మనమేదో అధికులమని సంతృప్తిపడతాం. కఠినమైన వాస్తవాలను మనం ఎప్పుడూ అంగీకరించలేం' అంది.

నాకేదో జ్ఞానోదయం అయినట్లనిపించింది. స్వీట్స్ అమ్ముకోగానే నా మీద ప్రేమలేనట్లు ఫీలయ్యాను. అలాగే నేను వచ్చేసినప్పుడు నాకు వాళ్ళ మీద ప్రేమ లేనట్లు అనుకుంటారు. కానీ ఇది తప్పు. అరుణ చెప్పింది కూడా అదే.

అరుణకు చెప్పి గౌతమ్ దగ్గరికి వచ్చాను. బస్సు రెడీగా వుంది. ఇద్దరం ఎక్కేశాం"

అనుపమ చెప్పడం పూర్తిచేసి, రియాక్షన్ కోసం సుజనవైపు చూసింది.

• • •

రాత్రి తొమ్మిదిగంటలు. వెలుతురుపిట్టలు వాలిన మహావృక్షంలా వుంది మద్రాసు నగరం.

కీల్‌పాక్‌లోని ఒకానొక అపార్ట్‌మెంట్ వరండాలో కూర్చున్నారు శరవణన్, వంశీ.

ఆ రోజు మద్రాసుకు రమ్మని శరవణన్ టెలిగ్రామ్ ఇవ్వడంతో వచ్చాడు వంశీ. సాయంకాలం ఆరు గంటలకు స్టేషన్‌కి వెళితే అక్కడ అయిదు నిముషాలపాటు కూడా కూర్చోనివ్వలేదు శరవణన్.

"మా పొండాటి ఊర్లో లేదప్పా! పుట్టింటికిదా వెళ్ళింది. నీతో కూర్చుని సిట్టింగ్ వేద్దామనే ఉద్దేశంతో టెలిగ్రామ్ ఇచ్చాను. వుంటికి పోదాం వా" అంటూ ఆయన వంశీని లేవదీశాడు.

దారిలో కావలసినవన్నీ కొన్నాడు. ఎనిమిది గంటల ప్రాంతాన ఇల్లు చేరుకున్నారు. స్నానాలవీ ముగించి ఫ్రెష్‌గా పార్టీ ప్రారంభించారు.

"నువు చెప్పిన ఐడియానే ఫాలో అయితినప్పా! రొంబా సక్సెస్. ఆ చిట్టిబాబుకి బాగా కోటింగ్ కూడా ఇస్తిని. వాడిప్పుడు మన స్టేషన్‌లోనే ఊచలు లెక్కపెడితాదా వున్నాడు. నిన్ననేకదా అరెస్ట్‌చేస్తిని. నాళికి కోర్టులోదా ప్రొడ్యూజ్ చేస్తును"

"వార్నింగ్ ఇచ్చి వదిలెయ్యాల్సింది సార్"

"అలాంటివాళ్ళకు వార్నింగ్‌లు పనిచేయవప్పా. సీరియస్ డోస్ ఇస్తే తప్ప బుద్ధిరాదు. అందుకే కేసు బుక్‌చేస్తిని" అన్నాడు శరవణన్.

"ఇంతకీ నిజం ఒప్పుకున్నాడా?"

"ఆఁ నీ ఐడియా మేరకు వాడి ఫ్రెండ్ ఒకడ్ని పట్టుకుని దీనికి ఒప్పించాను. ఆ ఫ్రెండ్‌ని మరొకడు హత్యచేసినట్టు వీడియో తీయిస్తిని. అప్పరం వాడి ముఖాన్ని కంప్యూటర్ లాబ్‌లో సూపర్ ఇంపోజ్ చేయిస్తిని"

"బాగా భయపడి వుంటాడే"

"ఆఁ మనిషి వణికిపోయాడు. నువ్వు ఇచ్చిన కేసెట్ ప్లే చేసినప్పుడు వాడి ముఖాన్ని చూసితీరాల్సిందే. తను ఆ కేసెట్‌ని ఎలా చేశాడో చెబుతున్నప్పుడు టేప్‌చేస్తిని. వాడి టెక్నిక్ వాడికే రివర్స్ అయింది. కంప్యూటర్లవల్ల వచ్చిన రొంబా మార్పులు తనకు తప్ప మరొకరికి తెలియవని వాడు భ్రమపడడంవల్లే ఆ కేసెట్ తీసి నీకు పంపించాడు. నీ సంస్కారంగానీ, నీ తెలివితేటలుగానీ వాడికి పురియాదు.

ఆ కేసెట్‌ని చూస్తూనే నువు సుజనను వదిలేస్తావని వాడు డ్రీమ్ చేశాడు. నీ స్థానంలో మరొకరుంటే అలాగే జరిగుండేదేమో. అందుకే వాడ్ని క్షమించి వదిలిపెట్టలేకపోయాను. కేసు బుక్‌చేశాను" చిట్టిబాబు మీద ఏర్పడ్డ అసహ్యాన్ని డైల్యూట్ చేయడానికే అన్నట్లు ఆయన గ్లాసు ఎత్తి మొత్తం తాగేశాడు.

కళ్ళు ఎర్రగా అయ్యాయి. ఇక ఆ టాపిక్ వదిలెయ్యకపోతే తను మరింత ఆవేశానికి గురవుతానని అనిపించి "మాప్పిళే! ఇంతకీ నీ ఫస్ట్‌నైట్ అయిందా లేదా?" అని అడిగాడు.

"లేదు సార్! రేపు రాత్రితో నిషిద్ధకాలం అయిపోతుంది. ఎల్లుండి రాత్రికే మా శోభనం. కానీ మా మామయ్యకు శాస్త్రాల పిచ్చి మరీ ఎక్కువ. ఆయనకు ఏదైనా కొత్త అవాంతరం తట్టి పోస్ట్‌పోన్ చేసినా ఆశ్చర్యపడక్కర్లేదు" అన్నాడు వంశీ.

"మీ మామయ్యకు ఎందుకంత పిచ్చి?"

"ఏం చెప్పమంటారు! ఎప్పుడో గురికుదిరి వుంటుంది. అదలా కంటిన్యూ అయిపోయింది. అయితే ఆ గురి పిచ్చిగా రూపాంతరం చెందడంవల్ల మేం ఘోరంగా బలైపోయాం. పెళ్ళి జరిగి నెలవుతున్నా ఘోటక బ్రహ్మచారిగా గడుపుతున్నాను. ఆయన పిచ్చిలోకి మమ్మల్ని కూడా లాగాలని ప్రయత్నిస్తున్నారు. ఇది మరీ తల నొప్పిగా తయారైంది.

ఈ పెద్దవాళ్ళంతా ఇంతేననుకుంటా. తమ ఇష్టాయిష్టాలను పిల్లలమీద రుద్దాలనుకుంటారు. పెద్దల దౌష్ట్యానికి గురయ్యేది పిల్లలే కదా.

తండ్రివల్ల మా ఫ్రెండ్ శంకర్ అనే అతను శోభనం రోజున అభాసుపాలవడమేగాక జీవితంలో చాలా నష్టపోయాడు"

శరవణన్‌కి కుతూహలం ఎక్కువైంది. "ఎవరప్పా అంద శంకరం? ఏం జరిగిందో సొల్లప్పా! ఆ మధ్య నువు చెప్పిన ఫస్ట్‌నైట్ స్టోరీ రొంబా ఎక్స్‌లెంట్‌గా వుందప్పా" అన్నాడు.

వంశీ ఓ సిప్‌వేసి, సిగరెట్ వెలిగించాడు. శరవణన్ దీక్షగా వినడం ప్రారంభించాడు. అంత కాన్‌సన్‌ట్రేట్ చేయకపోతే ఆ తెలుగు

## అతిపెద్ద హనుమద్విగ్రహం



సాధారణంగా హనుమంతుడి విగ్రహాలు ఎక్కడ చూసినా పెద్దవిగానే కనిపిస్తాయి. అయితే మన దేశంలో అతి పెద్ద హనుమంతుడి విగ్రహం రూర్కెలాలోని 'హనుమాన్ వాటిక' అనే దేవాలయ సముదాయంలో వుంది. అక్కడి విగ్రహం ఎత్తు 75 అడుగులు.

ఆ దేవాలయ సముదాయంలో జగన్నాథుడు, రాముడు, గణేశుడు, సోమనాథేశ్వరుడు, లక్ష్మీదేవి, వైష్ణవీదేవి, విమలాదేవిల ఆలయాలున్నాయి. అవన్నీ వివిధ భక్తులిచ్చిన విరాళాలతో నిర్మించినవేనట. ఒకచోటే దేవుళ్లు అందరూ కొలువుదీరినట్టు ఆ దేవాలయ సముదాయాన్ని నిర్మించాలనే ఆలోచన ఒరిస్సా రాష్ట్ర పరిశ్రమల మంత్రి దిలీప్‌రే‌ది. ఆతడు చైర్మన్‌గా వున్న జై హనుమాన్ ట్రస్ట్ ఆ సముదాయ నిర్మాణాన్ని చేపట్టి పూర్తిచేసింది. ◆

సరిగ్గా అర్థంకాదని తెలుసు.

వంశీ మధ్య మధ్య సిప్‌వేస్తూ చెబుతున్నాడు.

• • •

అతని పేరు శంకర్. పుట్టడమే దురదృష్టాన్ని వెంట పెట్టుకుని వచ్చినట్లున్నాడు.

తల్లి అతనికి ఎనిమిదేళ్ళు రాగానే చనిపోయింది. ఇక మిగిలింది అతని తండ్రి సుబ్బరామయ్య.

ఆయనిది చాలా పెక్యులర్ కేరక్టర్. అందర్నీ డామినేట్ చేయాలన్న మనస్తత్వం. ఇలాంటి వక్ర బుద్ధుల్ని బయట ప్రదర్శించే వీలుండదు గనుక ఇంట్లో చూపించేవాడు. భార్యని చాలా చులకనగా మాట్లాడేవాడు. ఆమె ఎందుకూ పనికిరానిదనీ, ఆమెకు ఏమీ చేతకాదనీ తిట్టిపోసేవాడు.

ఇది ఎంత ఘోరంగా తయారైందంటే ఆమె ఆయన ముందు నోరు విప్పడానికి భయపడేది. ఎదురుపడడానికి జంకేది. ఇలా ఆయనతో పడీపడీ మరణించింది. ఇక మిగిలింది కొడుకు. వాడిమీద తన ప్రతాపం చూపించడం మొదలుపెట్టాడు.

'చొక్కా బటన్ ఏమైంది? నువ్వు ఎందుకూ పనికి రావు. నీలాంటి కొరగాని కొడుకు వున్నా ఒకటే, లేక పోయినా ఒకటే. ఏమిటా ఏడుపుగొట్టు ముఖం? నీ లాంటి వాడికి తండ్రి అని చెప్పుకోవడమే సిగ్గుచేటు. రేపట్నుంచి స్కూల్లో బటన్‌లు తెంచుకునివస్తే వీపు చీరేస్తాను. ఛీఛీ-వెధవపీనుగ' దాపురించాడు ఇంట్లో' ఇలా సాగేది ఆయన దండకం.

శాపనార్థాలే కాదు విపరీతంగా కొట్టేవాడు కూడా.

## అందాలరాశి బెట్టు

విదేశాల్లో నివసిస్తున్న భారతీయ యువతుల్లో అందగత్తెను నిర్ణయించే 'మిస్ ఇండియా వరల్డ్‌వైడ్' పోటీ ఈసారి బొంబాయిలో జరిగింది. అందులో కెనడా నుంచి వచ్చిన నందినీ సింగ్ విజేత అయింది.

'బానల్లై మధుచంద్రికె' అనే కన్నడచిత్రం ద్వారా గతంలోనే సినీరంగంలో ప్రవేశించిన నందినీ సింగ్, 'ప్లాట్‌ఫారమ్' అనే హిందీ సినిమాలోనూ నటించింది. "ఎక్స్‌పోజింగ్ ఇష్టంలేక కొన్ని సినిమాలు వదులుకున్నాను. అందుకు నాకేమీ పశ్చాత్తాపం లేదు. 'సెక్స్ సింబల్' అనిపించుకోవడం నాకిష్టంలే"దని బెట్టు ప్రదర్శిస్తోందా అందాలరాశి.



కాఫీ తాగేప్పుడు ఓ చుక్క కింద ఒలికినాసరే కొడుకు మీద ఒంటికాలిపై లేచేవాడు.

'ఇన్నేళ్లొచ్చాయ్- కాఫీ తాగడం తెలియదా! నీలాంటివాడి తలమీద రూపాయిపెట్టి వేలం వేస్తే అర్ధరూపాయికి కూడా ఎవడూ కొనడు. తిననూ, తాగనూ కూడా తెలియని వెధవ్వి. ఎందుకు పని కొస్తావ్? జాతరలో బలి ఇచ్చేస్తే పీడా వదిలిపోతుంది' అంటూ చావబాదేవాడు.

ఆ లేతమనసులో ఆయన వాలకం చెడ్డముద్ర వేసింది. తండ్రి చెప్పినట్లు తను ఎందుకూ పనికి రాడేమోనన్న అనుమానం మొదలైంది.

దాంతో ఇన్ఫీరియారిటీ కాంప్లెక్స్ ఏర్పడింది. తనకంటే అందరూ చలాకీగా, తెలివిగా కనిపించే వారు. తను ఎందుకూ పనికి రానన్న భావన మొదలైంది. దాంతో తోటిపిల్లలతో కలవ లేకపోయాడు. ఒంటరితనం అలవాటైంది.

దీనిని కూడా సహించలేక పోయాడు సుబ్బరామయ్య. 'ఎప్పుడూ ఎందుకలా ముంగిలా వుంటావ్? అయినా నీలాంటివాడితో ఎవరూ జత కట్టరు. ఆ తలలో బంక మన్ను కాకుండా కాస్తంతైనా మెదడు వుంటే ఎవరైనా స్నేహం చేస్తారు. తమరికి లేనిది అదేకదా' అంటూ చావకొట్టేవాడు.

తండ్రిని ఎదిరించలేక తనలో తనే కుమిలిపోయేవాడు. తల్లి వుంటే ఓదార్చేది. అక్కున చేర్చుకుని కన్నీళ్ళు తుడిచేది. అతని ఒంటరితనాన్ని దిష్టి తీసేసినట్లు తీసేసేది. కానీ ఇప్పుడు ఆమె లేదు. ఓదార్చే దిక్కు లేక అతను నిశ్శబ్దంగా తనలో తనే మదనపడి పోయేవాడు.

తండ్రి ఎదురుపడడమే వణికిపోయేవాడు. కళ్ళల్లో నీళ్లు తిరిగేవి. నాలుక తడబడేది. వెన్నులోంచి మొదలైన చలి ఒంటిని ఐస్‌గడ్డలా మార్చేసేది.

ఇలాంటప్పుడు కూడా ఆయన ఊరకుండేవాడు కాదు. మరింత రెచ్చిపోయేవాడు. 'ఏమిటలా వణికిపోతున్నావ్? నేనేమైనా రాక్షసుడ్నా? పిరికిపందకు మనుషులు కూడా రాక్షసుల్లా కనపడతారు కాబోలు. నీలాంటివాడ్ని ఎడారిలో వదిలిపెట్టి క్రూరమృగాల్ని మీదకు ఉసిగొల్పాలి. కర్రముక్క గుచ్చుకున్నా తాచుపాము కాటేసిందని హడలి చచ్చే రకానివి నువ్వు. నీలాంటి పనికిమాలిన వెధవ భూమికి భారం. ప్రపంచంలో పనికిరానిది ఏదైనా వుంటే అది నువ్వే'

దీంతో మరింత కుంచించుకుపోయేవాడు. భూమి పగిలి తనను మింగేస్తే బావుండునన్నట్టు తల కిందకు వాల్చేసేవాడు. కన్నీళ్ళకు కళ్ళలోపలే ఆనకట్ట వేసేవాడు. ఏడ్చే వీలు కూడా లేకపోవడంతో ఆ బాధ గుండెల్లోనే ఘనీభవించింది. దీంతో కొత్త కొత్త కాంప్లెక్స్‌లు బయల్దేరాయి.

మనుషులంటే భయపడేవాడు. ఇల్లు వదిలి వీధిలోకి రావాలంటే జంకేవాడు. ఎక్కడైనా గుంపుగా జనం వుంటే ఒళ్ళంతా చెమటలు పట్టేసేవి. కాళ్ళు వణికేవి. అడుగు ముందుకు పడేదికాదు. గుంపంతా తన కోసమే కాచుకుని వున్నట్లూ, తను కనపడగానే వాళ్ళంతా తనమీదపడిపోతారేమోనని భ్రమించేవాడు.

మనసే కాదు శరీరమూ పెరగలేదు శంకర్‌కి. ఇరవై అయిదేళ్ళు వచ్చినా అయిదడుగులకు మించలేక పోయాడు. సన్నగా, ముడిచిపెట్టిన గొడుగులా వుండేవాడు. జీవకళ ముఖంలోనే కాదు కళ్ళల్లో కూడా కనిపించేది కాదు.

ఎలాగో ఓలా మొత్తానికి డిగ్రీ పూర్తయిందనిపించాడు. సుబ్బరామయ్య కొడుక్కి తన ఆఫీసులోనే చిన్న ఉద్యోగం ఇప్పించాడు.

ఇన్ని రోజులూ ఆడదిక్కులేని సంసారం కాబట్టి ఇల్లు కూడా అలానే వుండేది. జిహ్వకు సరైన రుచి కూడా అందేది కాదు. కొడుకు చేతివంట మొహం మొత్తింది. దీంతో కోడల్ని తెచ్చుకోవాలన్న ఆత్రుత ఎక్కువ కావడంతో కొడుక్కి పెళ్ళిసంబంధాలు చూడడం మొదలుపెట్టాడు సుబ్బరామయ్య" వంశీ చెప్పసాగాడు.

(ఇంకావుంది)

# పెళ్ళిసంత

గుజరాత్‌లో పెళ్ళికూతురే స్వయంగా తనకు నచ్చినవాడిని ఎన్నుకునే స్వయంవర అవకాశం వుంటే బీహారు రాష్ట్రంలో ప్రతి ఏటా జరిగే సంతలో తమకు తగిన అల్లుడిని వెతుక్కునే అవకాశం తల్లిదండ్రులకి వుంది. సౌరత్‌సభ పేరుతో మధుబని జిల్లాలోని సౌరత్ గ్రామంలో ఏటా వైశాఖమాసంలో ఈ పెళ్ళిసంత జరుగుతుంది.

నిజానికి ఇది పెళ్ళిసంతగా ఆరంభం కాలేదు. మైథిలీ ప్రాంతాన్ని పాలించిన రాజా హరిసింగ్ దేవ్‌కి అప్పటి సమాజంలో వైదికధర్మంపట్ల ఆదరణ, వైదిక విలువలు తగ్గిపోవడం ఎంతో లోటుతో కూడిన విచారం కలిగించింది.

మైథిలీరాజ్యంలో వున్న వేదపండితులందరిని పిలిపించి వేదసభలను, వైదికధర్మప్రచార సమావేశాన్ని, పాండిత్యప్రదర్శనలను ఏర్పాటు చేయడం మొదలుపెట్టారు. అలా ప్రతి సంవత్సరం వైశాఖమాసంలో రాజాహరిసింగ్ నిర్వహించే పండితసభలకు పలుప్రాంతాలనుండి ఎందరెందరో బ్రాహ్మణులు వచ్చేవారు.

ఆ విధంగా మైథిలీ ప్రాంతానికి వస్తున్న బ్రాహ్మణుల గోత్ర, కుటుంబ పుట్టుపూర్వోత్తరాలను చిట్టాగా తయారుచేసేందుకు కొందరిని నియమించారు. వారిని 'పుంజికార్లు' అని పిలిచేవారు.

అలా పాండిత్య ప్రదర్శన ముగించిన బ్రాహ్మణులు తీరిక సమయంలో పిచ్చాపాటి, కుటుంబ, యోగక్షేమాల గురించి ముచ్చటించుకునేవారు. ఆ సందర్భంగా వివాహం కావాల్సిన ఆడపిల్లల గురించి ఒకరు ప్రస్తావించగా తగిన వరుడు ఎవరి కుటుంబంలో



వున్నది మరొకరు సూచించేవారు. ఆ సూచించిన కుటుంబం ఇంటిపేరు, ఇంటిపెద్దపేరు చెబితే 'పుంజికారుడు' ఆ కుటుంబ చరిత్రనంతా వివరించేవాడు. దాని ప్రకారం ఆ కుటుంబంలోకి అమ్మాయిని ఇవ్వవచ్చో లేదో నిర్ణయించుకునేవారు.

రాజాహరిసింగ్ అధ్వర్యంలో పండితసభలుగా ఆరంభమైనా, రాజరికాలు నశించడంతో పండితసభలు ఆగిపోయి కేవలం ఆ సమావేశం పెళ్ళిసంతగా మిగిలిపోయింది. నేటికీ బీహార్, ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్, నేపాల్‌లలో వున్న మైథిలీ బ్రాహ్మణ కుటుంబాలవారు తగిన వరుడిని ఎంచుకునేందుకు వైశాఖమాసంలో సౌరత్ గ్రామానికి వస్తారు.

అయితే మైథిలీ ప్రాంతంలోని ఈ పెళ్ళిసంతకు క్రమంగా ఆదరణ తగ్గిపోతున్నది. గతంలో లక్షల సంఖ్యలో బ్రాహ్మణులు పెద్ద ఎత్తున ఈ సౌరత్ సభకు హాజరయ్యేవారు. వేలాది వివాహాలు నిశ్చయమయ్యేవి. కానీ నేడు సౌరత్ సభకు వచ్చేవారి సంఖ్య పదివేలకు మించడంలేదు.

సౌరత్‌సభ నిరాదరణకు కారణం నవనాగరికత అంటున్నారు. గతంలో కులం, గోత్రం, గుణం చూసి అమ్మాయినిచ్చేవారు. కుటుంబచరిత్రకు ఎక్కువ ప్రాధాన్యత వుండేది.

ప్రస్తుతం వాటిని వదిలేసి కేవలం పెళ్లికొడుకు ఆర్థికస్థితికే ప్రాముఖ్యతనిస్తున్నారని వయసు మళ్ళిన మైథిలి బ్రాహ్మణులు వాపోతున్నారు. వ్యక్తిగత ఆర్థికస్థితిని అంచనా వేసేందుకు సౌరత్ సభకు రానవసరంలేదుకదా!

వివాహంలో వరకట్నం పాత్ర పెరగటాన్ని మరో కారణంగా పేర్కొంటున్నారు. వరకట్నపు బేరసారాలకు సౌరత్‌సభ వ్యతిరేకం కాబట్టి వరకట్నపు ఆలోచన కలవారు దీనికి రావటంలేదు.

---

సీరియల్



# రారా నా ఇంటిదాకా

-మేర్లపాక మురళి

23 అనుపమ తన ఫస్ట్‌నైట్ గురించి సుజనతో చెప్తూ, గౌతమ్‌తో తనకు పరిచయమైన పరిస్థితులు వివరిస్తుంటుంది. పెళ్ళిచూపులైన తరువాత ఇంట్లోనుంచి పారిపోవాలని అనుపమచేసిన ప్రయత్నం విఫలమవుతుంది. తరువాత బలవంతంమీద నిర్ణయించిన వరుడితో అనుపమ పెళ్లవుతుంది.
ఫస్ట్‌నైట్ రోజున ఎంతో హుషారుగా, తల్లిదండ్రులకి అనుమానం రాకుండా గడిపిన అనుపమ, ఆ రాత్రి ఇంకో గంటలో శోభనం ముహూర్తం అనగా ఇంట్లోంచి పారిపోతుంది. ఆ రాత్రి ఒంటరిగా లారీలో ప్రయాణించి కావలి చేరుకుని గౌతమ్‌ని కలుస్తుంది. తరువాత వారి పెళ్ళి జరుగుతుంది.
ఓరోజు శరవణన్ టెలిగ్రామ్ ఇచ్చి వంశీని మద్రాసు పిలిపించుకుంటాడు. చిట్టిబాబు నేరం ఒప్పుకున్నాడని వంశీకి చెప్తాడు శరవణన్. తన ఫస్ట్‌నైట్ గురించి అడిగిన ఆయనకు, తన మామ గారికున్న శాస్త్రిలపిచ్చి గురించి చెప్తూ పెద్దవాళ్ళ చాదస్తాల కారణంగా తన ఫ్రెండ్ శంకరం జీవితం ఎలా నాశనమైందో చెప్తుంటాడు వంశీ. శంకరం సుబ్బరామయ్యకు ఒక్కగానొక్క కొడుకు. చిన్నప్పుడే తల్లి చనిపోతే కొడుకును కట్టుబాట్లతో పెంచుతూ ప్రతి చిన్నవిషయానికి దండిస్తుంటాడు.

“చివరికి ఓ సంబంధం సెటిలైంది. పెళ్ళికూతురు పేరు దేవిక. పదవ తరగతి వరకూ చదువుకుంది. పెళ్ళికుదిరేనాటికి ఆమె వయసు ఇరవై పైనే. అందంగా, సెక్సీగా వుండేది.

ముఖ్యంగా ఆమె కళ్ళు. కళ్ళకు మాత్రమే నిషా ఎక్కినట్లు అవి ఎంతో మత్తుగా, డ్రీమ్‌గా వుండేవి. స్థాయి తక్కువైన ఈ సంబంధానికి ఒప్పుకున్నారుగానీ లేకుంటే శంకర్‌ని చేసుకొనేవాళ్ళు కాదు. ఆమె తండ్రి వడ్రంగి. బొటాబొటిగా సాగే సంసారం.

పెళ్ళి ఓ చిన్న సత్రంలో జరిపించారు. వివాహానికి వచ్చిన అంత మంది ఆహుతుల్ని చూసి జడుసుకున్నాడు శంకర్. గుబులు గుబులుగా వుంది. ఏవో అర్థంపర్థంలేని భయాలు అతన్ని చుట్టుముట్టాయి.

కానీ ఎక్కడో అతనికి దేవికంటే ఆకర్షణ కలిగింది. శరీరం వేడిని పీల్చుకుంటోంది. కొత్త శంకర్ పుట్టినట్లు అతనికే అనిపిస్తోంది.

పెళ్ళిలో ఆమె చేయి తగలడం, శరీరం రాసుకోవడం గమ్మత్తుగా వుంది. జీవితంలో మొదటిసారి ఆనందం పెదవులమీద విచ్చుకుంటోంది. శరీరం విప్పారడం తెలుస్తూనే వుంది. ఈ కొత్త అనుభవంలో అతనికి పూర్వపు భయాలు గుర్తుకురావడంలేదు. పెళ్ళిపందిట్లో వున్న జనం గురించి పట్టడంలేదు. యవ్వనం మెల్లమెల్లగా మేల్కొంటోంది.

తన కోసం ఒక కొత్త వ్యక్తి వచ్చిందన్న భరోసా అతనికి చాలా కాన్ఫిడెన్స్‌ని కలిగిస్తోంది. తను ఒంటరి కాదన్న భావన ఆత్మవిశ్వాసాన్ని తట్టి లేపుతోంది.

ఆ కొద్దిక్షణాల్లోనే అతను ఓ కొత్తవ్యక్తిని ఆవిష్కరించుకోగలిగాడు. ఆ కొత్తవ్యక్తి తనే.

పెళ్ళి జరిగిపోయింది. ఆమె తనకు చెందిందన్న తృప్తి మనసును పరుగులు తీయిస్తోంది. తండ్రి ఒకడున్నాడన్న విషయమే మరిచిపోయాడు.

సాయంకాలం నాలుగు గంటలప్రాంతాన సత్రం ఖాళీ చేశారు. కొత్తదంపతులు, శంకర్ తండ్రి సుబ్బరామయ్య, మరికొంతమంది బంధువులు పెళ్ళికూతురింటికి బయల్దేరారు.

బస్సులు మారి ఆ ఊరికి చేరుకునేసరికి సాయంకాలం ఆరు గంటలైంది. అప్పటికే చందమామ తూర్పు ఆకాశం మీద వెన్నెల ధూపం వేస్తోంది. నీలం రంగు ఆకాశం నిశ్చలంగా వుంది.

శంకర్‌కు కలలు ప్రారంభమయ్యాయి. నిజానికి అలాంటి ఆలోచనలు కలగడం కూడా మొదటిసారి. తను, దేవిక కలిసి విహరిస్తున్నట్టే అతను మాటిమాటికీ మబ్బుల వంక చూస్తున్నాడు.

వీళ్ళు వెళ్ళిన తరువాత అక్కడ వంటలు చేయడం ప్రారంభించారు. అందరి భోజనాలు అయ్యేటప్పటికి పది దాటింది.

శంకర్‌కి తొందరగా వుంది. ఆమెతో మాట్లాడాలని మనసు పీకుతోంది. ఇంతకాలం స్నేహానికి ముఖం వాచిపోయిన అతనికి ఆమె ఆత్మీయంగా కనిపిస్తోంది. మాట్లాడడం మరిచిపోయిన అతనికి తనివితీరా మాట్లాడాలని వుంది. అభిమానాలకి దూరంగా, అవమానాలను దిగమింగుతూ బతికిన అతను ఆమెను అల్లుకుపోవడానికి ఉవ్విళ్ళూరుతున్నాడు.

పెళ్ళిపీటలమీద తనవంక అభిమానంగా చూసిన ఆమె అతని దృష్టిలో దేవతలా కనిపిస్తోంది.

పదిన్నరకు శోభనం తంతు ప్రారంభమైంది. శంకర్‌కి కొత్తపంచె, షర్టూ ఇచ్చారు. ఓ గదిలోకి వెళ్ళి మార్చుకొచ్చాడు. పెళ్ళికూతురుకూడా డ్రస్ అప్ అవుతున్నట్లు సమాచారం తెలిపింది. తనని గదిలోకి వెళ్ళమని చెప్పారు. అతను ఇక గదిలోకి పోబోతుండగా వెనకనుంచి తండ్రి కంఠం వినిపించడంతో తక్కున ఆగాడు.

అప్పుడు గుర్తొచ్చింది అతనికి తను తండ్రిని పూర్తిగా మరిచిపోయిన విషయం.

వెనక్కి తిరిగి మెల్లగా వరండాలోకి నడిచాడు.

అక్కడ సుబ్బరామయ్య తప్ప ఎవరూలేరు. హాల్లో ఎవరి హడావుడిలో వాళ్ళున్నారు.

వరండాలో జీరోబల్బు వుండడంవల్ల ఆజానుబాహుడైన సుబ్బరామయ్య మరింత భయంకరంగా శంకర్ కంటికి కనిపిస్తున్నాడు.

శంకర్ మళ్ళీ యథాస్థితిలోకి వచ్చేశాడు.

అంతవరకు ఎక్కడో దాక్కున్న భయం ఒళ్ళు జాడించినట్లు వణికిపోతున్నాడు.

"ఎక్కడికిరా?" సుబ్బరామయ్య అదిలించినట్లు ప్రశ్నించాడు. ఇలాంటి అర్థం పర్థంలేని ప్రశ్నలు వేసి కొడుకును కంగారుపెట్టడం ఆయనకి మొదటినుంచీ అలవాటు. లేకుంటే కొత్త పెళ్ళికొడుకు అప్పుడు శోభనం గదిలోకితప్ప శ్మశానంలోకి వెళతాడా?

"ఎందుకలా మూగెద్దులా నిలబడతావ్? ఎక్కడికి తగలెడుతున్నావో. చెప్పు"

మరింతకంగారుపడిపోయాడు శంకర్.

"ఏమిటా జుట్టు? ఎందుకలా పిర బోసుకున్నావ్? దువ్వుకుంటే గది లోకి దూరడం ఆలస్యమౌతుందని అలా వదిలేశావా? లేకుంటే దువ్వుకోవడం మరిచిపోయావా? నువ్వు మరిచిపోయే వుంటావు. నువ్వు ఎందుకూ పనికిరావని తెలుసు. నీ చేతకానితనం నీ పెళ్ళానికికూడా తెలియాలా? వెళ్ళి దువ్వుకుని తగలడు" అని గద్దించాడు.



శంకర్‌కి తన మీద తనకే అపనమ్మకం బయల్దేరింది. అంతకుముందున్న ఆత్మవిశ్వాసం చల్లారిపోయింది. ఆత్మీయంగా అనిపించిన భార్య ఇక కాసేపట్లో తనకు 'చేతకానివాడు' అన్న సర్టిఫికేట్ ఇవ్వడానికి సిద్ధంగా వున్నట్లు తోచింది.

ఒక్కసారిగా తన శరీరాన్ని ఐస్ ముక్కలకింద వేసేసినట్లు చల్లబడిపోయాడు. ఆ సమయంలో తండ్రి తిట్టడంతో బాగా కదిలిపోయాడు.

గదిలోకి వెళ్ళి తల దువ్వుకున్నాడు. అద్దంలో తన ముఖానికి బదులు తండ్రి ముఖమే కనిపించేంతగా అతను జడుసుకున్నాడు.

తల దువ్వుకోకపోవడంలాంటి తప్పులు ఇంకా ఏమైనా చేశానా అని పైనుంచి కిందకు ఓ నూరు చూసుకున్నాడు. ఎలాంటి పొరబాట్లు లేకపోయినప్పటికీ ఏదో జంకు బయల్దేరింది అతనిలో.

అలాంటప్పుడు కూడా తండ్రి దగ్గర చీవాట్లు తిన్నానన్న బాధ అతన్ని కుదిపేస్తోంది.

ఎవరో పిలుస్తుంటే గదిలోంచి బయటపడ్డాడు. హాల్లో అక్కడక్కడా కూర్చుని తాంబూలాలు వేసుకుంటున్న బంధువులను చూడగానే మునుపటిలా కంగారుపడ్డాడు. ఒళ్ళంతా చెమటలు పట్టాయి.

ఎవరో ఒకతను అతనిని గది దగ్గరికి తీసుకెళ్ళి వదిలిపెట్టాడు. జనం నుంచి తప్పించుకోవడానికి గదిలోకి దూరాడు శంకర్.

అతన్ని చూడగానే మంచానికి ఓ వారగా నిలుచున్న దేవిక అటూ ఇటూ కదిలింది.

అక్కడ ఆమెను ఊహించలేని అతను కొద్దిగా షాక్ తిన్నాడు. 'నువ్వు ఎందుకూ పనికిరావ్' అని తండ్రి ఎప్పుడూ అనే మాటలు చెవుల్లో మార్మోగుతున్నాయి. తను పనికిరాడని గాఢంగా నమ్మేస్థితికి

## కాజోల్ కల్పన

ఓ షూటింగ్ మధ్యలో ఓ గ్లాసులోని పానీయాన్ని కాజోల్ ఆత్రంగా తాగడం గమనించి, ఏమిటని అడిగితే- "ఒడ్కా (మద్యం) నేను తాగకుండా వుండలేను. పనిచేయలేను. అందుకే మధ్య మధ్యలో కొద్దిగా పుచ్చుకుంటున్నాను. పదహారేళ్ళప్పుడే నేను తాగుడు మొదలెట్టాను. స్మోకింగ్ కూడా అప్పుడే అలవాటయింది. సిగరెట్లు రోజుకి పది ప్యాకెట్లు ఊదేస్తాను తెలుసా?" అని గడగడా చెప్పేసింది.

ఇంతకీ అది ఓ శీతలపానీయమే! కాజోల్ సరదాకి అలా కల్పించి చెప్పడం విన్నవారికి-

"ఇతరుల కంటబడకుండా స్టీలుగ్లాసుల్లో ఏదో తాగుతూ 'థమ్సప్' అని చెప్పే తారలకన్నా కాజోల్ చాలా నయమే!" అన్పించింది.



వచ్చేశాడు అతను. తల దువ్వుకోకపోవడంతో తండ్రి అరవడం గుర్తొచ్చింది.

అలానే నిలబడిపోయి వెర్రిచూపులు చూస్తున్న అతన్ని తదేకంగా చూస్తోంది ఆమె.

ఏమీ అర్థం కావడంలేదు. తనను గమనించాడో లేదోనని చిన్నగా దగ్గింది.

అతను మరింత భయపడ్డాడు. తండ్రిలాగే ఈమె కూడా తనను పనికిమాలినవాడికింద జమకడుతుందన్న భావన అతన్ని టెన్షన్‌కి గురిచేస్తోంది. అతని శరీరం మరింతగా కుంచించుకుపోయింది.

అతను మామూలుగా లేడని గుర్తించింది దేవిక. పెళ్ళిపీటలమీద చక్కగా వున్న అతనికి అంతలో ఏమైందో అర్థంకావడంలేదు.

ఇక లాభంలేదని తనే దగ్గరికి వెళ్ళింది.

అతను మరింతగా భయపడుతున్నాడు. అతని కళ్ళు అదో విధంగా వుండడం గమనించింది.

ఏమీ మాట్లాడకుండా మంచం దగ్గరికి తీసుకువెళ్ళడానికి చేయి పట్టుకుంది. ఆమె స్పర్శ వేడిని రేపాల్సిందిపోయి చల్లగా తగిలింది అతనికి. చలికాలం ఆరుబయట నిలుచున్నట్లు అయిపోయాడు.

ఆమె ఇవేమీ గమనించలేదు. మంచం దగ్గరికి తీసుకెళ్ళి కూర్చోబెట్టింది.

'ఇదిగోండి పాలు' గ్లాసును అందించింది. కొత్తగా భార్యాభర్తలైన వాళ్ళమధ్య సంభాషణపాగి, చేరువ కావడానికే శోభనం గదిలో పాలూ, పళ్ళూ పెడతారేమోననిపించింది ఆమెకి.

గ్లాసు తీసుకునేప్పుడు అతని చేతులు వణకడం చూసింది. బహుశా ఆడపిల్ల కొత్త కాబోలు అనుకుంది. చిన్నప్పట్నుంచీ తల్లి కూడా లేకపోవడంతో స్త్రీలతో మాట్లాడే అవకాశంలేదు కాబోలు అని సర్ది చెప్పుకుంది.

అతను పాలు గటగటా తాగేశాడు.

మరిక ఏంచేయాలో పాలుపోలేదు ఆమెకి. కాలి బొటనవేలును నేలకు రాస్తూ వుండిపోయింది.

ఇక తరువాత జరగబోయే దానిని ఊహించుకుంటుంటే ఒళ్ళంతా పొంగుతోంది ఆమెకి.

పైట జారేటట్లు కావాలనే కదిలింది. కాటన్ చీర పైట అంత సులభంగా కిందకు జారడంలేదు. రెండు సార్లు ప్రయత్నించి, చివరికి మూడోసారి సక్సెస్ అయింది. కుడిభాగం ఇప్పుడు స్పష్టంగా కనిపిస్తోంది. చందమామమీదనున్న మేఘాన్ని గాలి చటుక్కున లాగేసినట్లు వక్షస్థలం బయటపడింది.

యవ్వనం సుడులై లేస్తున్నట్లున్న ఆ భాగాన్ని చూడగానే అతను మరింత భయపడ్డాడు. చేతిని ఉపయోగించకనే పైటను పూర్తిగా తొలగించింది.

ఆమె బాగా పొడగరి. పైట లేకపోవడంతో ఆమె ఇంకా పొడవుగా తెలుస్తోంది. తను పొట్టిగా వున్నదానికి తండ్రి పదేపదే తిట్టడం అతని కళ్ళముందు కదిలింది. ఇన్ఫీరియార్‌గా ఫీలయ్యాడు. అంత అందాన్ని ఏం చేసుకోవాలో తెలియడంలేదు. మీదకి దూకుతున్న గజ్జెల గుర్రాన్నిచూసి జడుసుకుంటున్నట్లు వెనక్కివాలి, చేతులపట్టుమీద శరీరాన్ని ఆపాడు.

ఆమెకి కోరిక ఎక్కువవుతోంది. చిన్నప్పట్నుంచీ చదివిన పుస్తకాలూ, చూసిన సినిమాలూ-వాటిలోని రొమాంటిక్ సన్నివేశాలూ కళ్ళముందు కదులుతున్నాయి. కోరిక ఇక్కడా అక్కడా అని కాకుండా శరీరం మొత్తాన్ని ముందుకునెడుతోంది.

ఎంతసేపటికీ అతనిలో చలనం కలగకపోవడంతో ఆమె అతని దృష్టిని ఆకర్షించడానికి పైటను వేసుకుని, మళ్ళీ జార్చింది.

ఒళ్ళు విరుచుకునే నెపంమీద తన ముందుభాగాన్నంతా అతని ముందుకు తోసింది. వెన్నముద్దల్లాంటి ఆమె స్తనాలు అతనికళ్ళల్లో గుచ్చుకున్నాయి.

యుద్ధంముందు పూరించే శంఖంలాంటి బొడ్డును ఆమె అందుకే కనిపించేటట్టు జాగ్రత్త వహించింది.

తల దువ్వుకోకుండా వస్తున్న తనని పిలిచి తండ్రి చీవాట్లు పెట్టిన సంఘటనే అతని ముందు

## ఎన్‌ఫీల్డ్ స్పాన్సర్ చేస్తున్న మద్రాసు-బర్మింగ్‌హామ్ బుల్లెట్ యాత్ర




మూడు దశాబ్దాలకు పైగా 350 సిసి-18 బిహెచ్‌పి బుల్లెట్ మోటార్‌సైకిల్‌ని తయారుచేస్తున్న 'ది ఎన్‌ఫీల్డ్ ఇండియా లిమిటెడ్'(మద్రాసు) గత సంవత్సరం 500 సిసి-22 బిహెచ్‌పి బుల్లెట్‌ని మార్కెట్‌లో ప్రవేశపెట్టింది. భారతదేశంలోనేకాక విదేశీమార్కెట్‌లో కూడా దాని అమ్మకాలు బాగా వున్నాయి. వాటికితోడు అధికశక్తి సామర్థ్యాలుగల 535 సిసి-30 బిహెచ్‌పి, 624 సిసి-36 బిహెచ్‌పి సూపర్ బైక్‌లను మార్కెట్‌లో ప్రవేశపెట్టేందుకు ఎన్‌ఫీల్డ్ పథకాలు వేస్తోంది.

ఎన్‌ఫీల్డ్ సంస్థ ముగ్గురు బ్రిటిష్ సాహసవంతులు మద్రాసునుంచి, యునైటెడ్ కింగ్‌డమ్‌లోని బర్మింగ్ హామ్‌కి 500 సిసి ఎన్‌ఫీల్డ్ బుల్లెట్లపై చేసే సాహస యాత్రను స్పాన్సర్‌చేస్తోంది.

'ఆన్ టాప్ ఆఫ్ ది వరల్డ్ ఇన్ 80 డేస్' పేరుతో సాగే ఆ యాత్రలో బ్రిటిష్ యువకులు 15 దేశాల సరిహద్దులు దాటి 80 రోజుల్లో బర్మింగ్‌హామ్‌లోని రెడ్‌డిచ్‌కి చేరుకుంటారు. బుల్లెట్‌ని కనిపెట్టిన ప్రదేశం అదే!

మద్రాసులో జూలై 30న బయలుదేరిన ఆ సాహసయాత్ర బృందానికి 23 ఏళ్ల డగ్లస్ హేన్సెన్-ల్యూన్ నాయకత్వం వహిస్తున్నాడు. మార్గనిర్దేశం చేసేది మండీ పాచెట్ అనే యువతి కాగా, మూడో సభ్యుడు క్రిస్‌స్మిత్.

ఎన్‌ఫీల్డ్ తయారుచేసే మోటారుసైకిళ్ళు అంతర్జాతీయ ప్రమాణాల్లో వుండేలా చేసేందుకు ఆటోమోటివ్ డిజైన్‌లో ప్రపంచంలో అగ్రస్థానంలోవున్న ఆస్ట్రియాకిచెందిన ఎవిఎల్ సంస్థతో రూ.4 కోట్లతో ఒప్పందం కుదుర్చుకుంది. ఎన్‌ఫీల్డ్‌వారి కొత్త 535 సిసి, 624 సిసి మోటార్‌సైకిళ్ళు స్విస్‌కి చెందిన నిపుణుడు ఎఫ్.డబ్ల్యూ. ఎగ్లి రూపొందించిన డిజైన్ ఆధారంగా అత్యాధునిక సాంకేతిక విధానంతో తయారుచేయబడతాయి. ◆

కదులుతోంది. తండ్రి గుర్తొచ్చినప్పుడల్లా ఆయన మామూలుగా తనను తిట్టడం చెవుల్లో వినిపిస్తోంది. తను ఎందుకూ పనికిరాడేమోనన్న అనుమానం ఇప్పుడు నగ్నసత్యంలా అనిపిస్తోంది. దాంతో అతను మరింత కుదేలైపోతున్నాడు. అందుకే ఆ తరువాత ఆమె ఏంచేసినా అతను ముట్టుకోలేకపోయాడు.

ఇలా మూడురోజులు గడిచాయి.

దేవిక భర్తతోపాటు అత్తగారింటికి వచ్చింది. తన స్వంత ఇంట్లో ప్రతీదీ మరీ మరీ స్పష్టంగా గుర్తుకొస్తుండడంతో శంకర్ మరింత ముడుచుకుపోయాడు. అందులోనూ సుబ్బరామయ్య వీలైనప్పుడల్లా కొడుకును తిడుతూనే వున్నాడు.

తన భర్త శారీరకంగా బాగానే వున్నాడనీ, మానసికంగానే సరిగా లేడని గ్రహించింది దేవిక.

అతనలా తయారుకావడానికి సుబ్బరామయ్యే కారణమని కూడా తెలుసుకుంది.

అందుకే తండ్రిని ఎదిరించమని చెప్పింది. తనను సుఖపెట్టి, అతన్నీ సుఖపడమని తనకు చేతనైనంతగా రెచ్చగొట్టింది దేవిక.

కానీ రెండూ వీల్లేకపోయింది.

దాంతో ఇక భరించలేక ఆ వీధిలోనే వున్న ఓ కుర్రవాడితో లేచిపోయింది.

తన ప్రభావం కొడుకుమీద ఎంత దుష్పలితాలను కలుగచేసిందో తెలుసుకోలేని సుబ్బరామయ్య,కోడలు మరో యువకుడితో లేచిపోయిన రోజున తీవ్రమైన టెన్షన్ ఫీలై పక్షవాతానికి గురయ్యాడు. మంచంమీద నుంచి కదలలేని ఆయన్ని చూసి శంకర్ ధైర్యం పుంజుకున్నాడు. మునుపటి భయం పోయింది.

నిస్సహాయంగా పడిపోయిన ఆయనపై కసి బయల్దేరింది. మందులు తేవడం మానేశాడు. అదే విషయం సుబ్బరామయ్య అడిగితే 'ఏంచేయను? మీరేగా నన్ను పనికిమాలినవాడినని తిట్టేవాళ్ళు.

నిజం కూడా అదే. తండ్రి పక్షవాతంతో మంచంలో పడుంటే డాక్టర్కి చూపించలేని, మందులు కొనివ్వలేని అసమర్థుడైన కొడుకుని నేను' అని ఆయన పాఠం ఆయనకే ఒప్పజెప్పడం ప్రారంభించాడు.

అలా తండ్రిని ఎదిరించాడు. తన కసినంతా తీర్చుకుంటూ వుండడంతో విచిత్రంగా అతనిలో ఇన్ఫీరియారిటీ కాంప్లెక్స్ పోయింది. మనిషి బలంగా, ఆకర్షణీయంగా తయారయ్యాడు.

ఆడపిల్లను చూస్తే కోరిక అతన్ని నిటారుగా నిలబెట్టేది. కానీ అప్పటికే ఆలస్యమై పోయింది. దేవిక ఆ కుర్రాడితో సెటిలైపోయింది"

వంశీ చెప్పడం పూర్తిచేసి శరవణన్ రియాక్షన్ కోసం చూశాడు. ఇది గ్రహించిన ఆయన "సుబ్బరామయ్యకు శంకర్ మంచి శాస్తి చేశాడు. భార్య దగ్గర ఓడిపోయిన అతను-ఆ ఓటమికి కారణమైన తండ్రి మీద పగ సాధించి గెలిచాడు.

ఇందుకు అందరయ్యాని అప్రిషియేట్ చేయాలో, భార్యను పోగొట్టుకున్నందుకు సానుభూతి తెలియజేయాలో పురియడం లేదప్పా" అన్నాడు.



## సురభి ఎదుగుదల

సురభి బొంబాయి అమ్మాయి అని చెప్పినా, ఎవరూ నమ్మరు. కారణం- అక్కడ ఆమె రాణించక పోవడం, ఇక్కడ వరసగా నటించడం.

మోడరన్ డ్రస్సులతో మోజులు పుట్టేలా నటిస్తూనే, తెలుగుతనం ఉట్టిపడే చీరకట్టులోనూ మెప్పిస్తోంది. 'పల్నాటి పౌరుషం' సినిమా హిట్‌తో ఇంకా ఉత్సాహం పుంజుకుంది. ప్రస్తుతం ఇప్పుడు 'అల్లరోడు', 'అడవిదొర'-లాంటి చిత్రాల్లో మంచి బలమైన హీరోయిన్ పాత్రలు పోషిస్తోంది.

నగ్మలా మరో ఉత్తరాదినటి, తెలుగులో వరస చిత్రాలతో స్థిరపడుతోంది. గులాబీరంగు సొయగాలు, సొష్టవాలు పుష్కలంగా వుండడంతో గ్లామర్ స్టార్‌గా స్థిరపడతానన్న నమ్మకం ఆమెలో దృఢంగా వుంది.

మాటల్లోనే వాళ్ళు మరో రౌండ్ కూడా పూర్తి చేయడంతో నిషా కూడా ఎక్కువైంది. మాటలు విస్కీలో తడిసి ఎంతో బరువెక్కినట్లు భారంగా నోట్లోంచి జారుతున్నాయి.

"అందుకే ఈ పెద్దవాళ్ళంటే నాకసహ్యం. పిల్లల మీద తమ ఐడియాలనే రుద్దాలని ప్రయత్నిస్తారే తప్ప స్వేచ్ఛగా పెరగనివ్వరు. చాలామంది మగవాళ్ళు తమ అధికారాన్నంతా ఇంట్లో ప్రదర్శిస్తుంటారు. ఒక మగవాడి దౌర్జన్యానికి, దౌర్బల్యానికి ముందుగా బలయ్యేది అతని భార్యాపిల్లలే.

మా మామనే తీసుకోండి. అతని శాస్త్రం పిచ్చంతా ఇంట్లోవాళ్ళమీద రుద్దుతుంటాడు. ఆ ఇంట్లో బాగా పాతదైన ఓ పెద్ద కొయ్యపెట్టె వుంది. దాన్నిండా ఈ పుస్తకాలే. ఈ శతాబ్దపు పంచాంగాలన్నీ ఆయన దగ్గరున్నాయి. మాయలఫకీరు ప్రాణం చిలకలో వున్నట్లు ఆయన ప్రాణం ఆ కొయ్యపెట్టెలో వుంది.

ఊరికి బయల్దేరాలనుకోండి- వెంటనే ఆయన ఆ పెట్టె తెరిచి ఓ పుస్తకం తీస్తాడు. దాన్ని అటూ ఇటూ తిప్పి, గంటసేపు ఏవో లెక్కలువేసి గ్రహం చలనం బాగా లేదనీ, ప్రయాణం వద్దనీ చెబుతాడు. దాంతో బయల్దేరిన ఇంటిల్లిపాదీ ఉసూరుమంటూ అలంకరణలన్నీ తీసివేసి, నిరాశను ఒంటినిండా కప్పుకుని మూల కూర్చుండిపోతారు.

వాస్తు బాగాలేదని ఆయన వంటగదిని ఇప్పటికి ఎన్నిసార్లు కొట్టి కట్టారో లెక్కలేదు. ఆ పెట్టెను వదిలించుకుంటే తప్ప ఆయన పిచ్చి తగ్గదు"

"వాస్తు కూడా బాగా నమ్ముతాడా?"

"చిన్నగా అడుగుతారేమిటి! ఆయన వాస్తు దగ్గర్నుంచి, గ్రహస్థితి వరకు నమ్ముతాడు. అంతేకాదు తు.చ. తప్పకుండా ఆచరిస్తాడు. ఆచరించమని మిగిలినవాళ్ళని శాసిస్తాడు కూడా"

"అందుకేనేమో నప్పా వీలైనంత త్వరలో బ్రహ్మానందం మహరాజ్‌ని పంపించమని రెండు మూడుసార్లు లెటర్ రాశాడు" అన్నాడు శరవణన్.

"బ్రహ్మానంద మహరాజ్ ఎవరు?"

"ఆయన ఒక తాంత్రికుడు. మద్రాసులోనే వుంటాడు. ఆయన చేయని విద్యంటూ లేదు. ఆయన గురించి విన్నాడేమో ఎలాగో ఆయన్ని ఒప్పించి తమ ఇంటికి పంపమని రాశాడు"

శరవణన్ చెప్పిన విషయం వింటుంటే వంశీకి తళుక్కున ఓ ఆలోచన మెరిసింది. ఒక దెబ్బకు రెండు పిట్టలు అనుకున్నాడు.

రేపు రాత్రితో తమ ఛాలెంజ్ గడువు ముగుస్తుంది. ఆ మరుసటిరోజు రాత్రి తన మామయ్య ఫస్ట్‌నైట్ అరేంజ్ చేస్తాడు. అంటే సుజన పందెంలో గెలవాలంటే రేపు రాత్రికి అన్ అఫీషియల్ శోభనం జరిగిపోవాలి.

అలా జరిగితేనే సుజన తన అక్కయ్యలతో వేసిన పందెంలో నెగ్గుతుంది.

లేకుంటే ఓడిపోతుంది.

సో- రేపు రాత్రికి సుజనను కలుసుకోవాలి అనుకుంటూ కొత్త పథకం అల్లుకున్నాడు. అంత గొప్ప ఐడియా తట్టినందుకు తనను తనే అభినందించుకున్నాడు.

"సార్! మీరో సహాయం చేయాలి" అంత సడన్‌గా వంశీ కళ్ళు మెరవడాన్ని అయోమయంగా చూస్తూ "ఏమిటప్పా అది?" అని అడిగాడు శరవణన్.

"మహరాజ్ రేపు మధ్యాహ్నానికి ఇంటికి వస్తున్నాడని మా మామయ్యకు మీరు టెలిగ్రామ్ ఇవ్వాలి సార్" అన్నాడు వంశీ.

"ఎందుకప్పా?"

"అదంతా పెద్ద కథలే సార్. ఇంతకీ మీరు టెలిగ్రామ్ ఇస్తున్నారా? లేదా?"

"అయ్యోయ్యో! ఎంతమాట... ఎంతమాట... ఇప్పుడే ఇచ్చేస్తానప్పా"

వంశీ మరింత ఖుషీగా ఇంకో రౌండ్ పూర్తిచేశాడు.

• • •

ఉదయం లేచింది మొదలు దిగులు దిగులుగా వుంది సుజనకు. ఆ రోజు రాత్రితో గడువు ముగుస్తుంది. తన భర్తంత రొమాంటిక్ పర్సనాలిటీ మరొకరు లేరని ఢంకా బజాయించి చెప్పి, ముహూర్తానికి ముందే శోభనం జరిపించుకుంటామని పందెం కాసింది. ఇప్పుడేమో వంశీ పత్తాలేడు. ఎక్కడికెళ్ళాడో కూడా తెలియడంలేదు.

గతంలో వేసిన పథకాలన్నీ ఫెయిలవడంతో ముఖం చాటేశాడేమోనన్న అనుమానం కలుగుతోంది.

పందెంలో ఓడిపోతే ఏంచేయాలో గడువు ముగిసిన మరుక్షణం చెబుతానన్నారు సోదరీమణులు. పందెంలో ఓడిపోతే వాళ్ళు ఏం అడుగుతారోనని రకరకాలుగా ఊహించింది.

వాళ్ళు ఏమైనా అడగవచ్చు. గుంజీలు తీయమని కోరవచ్చు. తన భర్తకు తను చెంపదెబ్బలు వేయాలని ఆదేశించవచ్చు. లేకుంటే హనీమూన్‌కు తమను కూడా తీసుకెళ్ళమని అనవచ్చు. ఏం చెప్పినా చేయక తప్పదు.

(ఇంకావుంది)

## సీరియల్



# రార్వా ఇంటిదాకా

### మేర్లపాక మురళి

ఇలా ఆలోచిస్తుంటే తను ఓటమి అంచులమీద నిలబడినట్లు అనిపిస్తోంది. పందెంలో గెలవకపోతేపోనీ, కనీసం మనిషైనా కనిపిస్తే ఇంత ఆదుర్దా వుండదు. అప్పటికే రెండుసార్లు సుబ్బుల్ని ఇంటికి పంపించింది. మద్రాసు వెళ్ళాడని కబురొచ్చింది.

ఒకపక్క గడువు ముగుస్తుంటే ఇంకోపక్క మద్రాసు వెళ్ళాల్సిన అవసరం ఏమొచ్చిందో అర్థంకాక వంశీమీద కోపం వచ్చింది. కోపం ప్రకటించడానికి కూడా మనిషి కనపడడాయె. ఆమె అలా దిగులు దిగులుగా వుండడం ఆమె అక్కయ్యలకు ఎంతో ఉత్సాహాన్నిస్తోంది. తాము పందెంలో గెలవడం ఖాయమని ఆమె ముఖాన్ని చూస్తూనే తెలుస్తోంది. ఆమెను ఇంకాస్త ఉడికించడానికి ముగ్గురూ ఆమె దగ్గరకు చేరారు.

"ఏమిటే అలా వున్నావ్?" ఉమ తెచ్చిపెట్టుకున్న బాధతో అడిగింది.

"యుద్ధభూమిలో ఓడిపోతున్న రాజును తలుచుకుంటూ రాణి దిగులుగాకాక సంతోషంగా వుంటుందా?" రెండో అక్క మరికాస్త ఉడికించింది.

"అంటే సుజన ఓటమిని ఒప్పేసుకున్నట్లా?" చిన్నక్కయ్య అడిగింది.

"ఓడిపోతున్నట్లు ప్రత్యేకించి చెప్పాలా? దాని ముఖం చూస్తే తెలియడంలేదూ?" పెద్దక్క ఉమ సాగదీస్తూ చెప్పింది.

"కానీ ఈ రోజు రాత్రి వరకు గడువుందిగా?" అంది సుజన.

"ఇన్నిరోజులూ చేతకానిమనిషికి ఈ రోజు ఏమైనా మన్మథుడు వాలతాడా? అతను వేసే పుచ్చు ఐడియాలు ఏమీ పని చేయడంలేదు"

"మరి ఈ రాత్రి అయినా గట్టి ఐడియావేసి సుజనను అవమానాం నుండి గట్టెక్కిస్తాడంటావా?"

"ఆ ఆశలేం పెట్టుకోకు. ఆయనగారు మద్రాసు ఉడాయించాడట. రేపు రాత్రి అసలు ముహూర్తంకదా. ఆ పాటికైనా వస్తాడో? ఓడిపోయిన ముఖాన్ని భార్యకు చూపించలేక ఎగ్గొట్టేస్తాడో? ఎవరికి తెలుసు?" ఉమ అలా అన్నా వంశీ ఇక రాడన్న ధ్వని వుంది ఆమె మాట్లాడుతున్న మాటల్లో.

"షేమ్... షేమ్... షేమ్" ముగ్గురూ చిన్నగా చేతులు తడుతూ అన్నారు.

సుజనకు రోషం వచ్చింది. "ఇప్పుడే ఎందుకలా మిడిసిపడతారు. ఇంకా ఈ రాత్రి వుందికదా. ఏమైనా జరగచ్చు" అంది ఉక్రోషంగా.

"అది నీ భ్రమే. ఏమైనా జరగచ్చేమోగానీ- నీ శోధనం మాత్రం జరగదు" హేమ ఖచ్చితంగా అంది.

"చూద్దాంలే" అని ముగ్గురూ వెళ్ళిపోయారు

సుజన ఒంటరిగా మిగిలిపోయింది.

అప్పుడామె పశువుల కొట్టాంలో చైర్ వేసుకుని కూర్చుని వుండడంవల్ల ఇంట్లో ధ్వనులేమీ వినపడడం లేదు. వర్షాకాలం కాబట్టి సూర్యుడు మబ్బుం మాటున పచార్లు చేస్తున్నాడు. చలిచలిగా వాతావరణమంతా ఎగ్జైటింగ్‌గా వుంది. కానీ వంశీ లేడన్న ఆలోచన ఆ ఉత్సాహంమీద నీళ్ళు కుమ్మరిస్తోంది.

ఇలానే వుంటే ఆలోచనలు తనను పీక్కుతింటాయేమోనని పించి మౌనికను అర్జంటుగా రమ్మని సుబ్బులుతో కబురు పంపింది.

ఇంట్లోకెళ్ళి రెండు కప్పులూ, కాఫీ పోసుకుని ఫ్లాస్కూ తీసుకుని వచ్చింది.

మరికాసేపటికి మౌనిక అక్కడికి చేరుకుంది.

ఆమె వయస్సు సుమారు ఇరవై ఆరేళ్ళుంటాయి.

మిడ్ వింటర్‌లో సైబీరియాలో చలిమంట కనిపించినట్లు, థార్ ఎడారిలో మండివేసవిలో ఒయాసిస్ ఎదురైనట్లు- ఆమెను చూస్తూనే రెండు రకాల భావనలు కలుగుతాయి. ఎంత ఆత్మీయంగా అనిపిస్తుందో, అదే క్షణంలో అంత దూరంగానూ కనిపిస్తుంది. ఎంతగా పూజించాలని

**24** ఓ రోజు శరవణన్ అర్జంటు టెలిగ్రాం ఇచ్చి వంశీని మద్రాసుపిలిపించుకుంటాడు. తన ఫస్ట్‌నైట్ గురించి అడిగిన శరవణన్‌కి, తన మామగారికున్న శాస్త్రాలపై పిచ్చి గురించి చెప్పి, పెద్దవాళ్ళ మూర్ఖత్వాల కారణంగా పిల్లల జీవితాలు బలైపోతున్నాయని అందుకు ఉదాహరణగా తన ఫ్రెండ్ శంకరం గురించి చెప్తుంటాడు.

శంకరానికి పెళ్ళవుతుంది. కాపురానికొచ్చిన దేవిక భర్త చేతకానితనాన్ని భరించలేక వాడుండే వీధిలోని ఓ కుర్రాడితో లేచిపోతుంది. ఈ సంఘటనకు తట్టుకోలేని శంకరం తండ్రి పక్షవాతానికి గురవుతాడు. నిస్సహాయంగా మంచంలో పడివున్న తండ్రిపై తన కసితీర్చుకుంటాడు శంకరం. అలా అతని కథ చెప్తాడు వంశీ.

'బ్రహ్మానంద మహరాజ్' అనే స్వామిని పంపమని సత్యనారాయణ చెప్పినట్లుగా వంశీకి చెప్తాడు శరవణన్. ఆ మాటలు విన్న వంశీ మరో ప్లాన్ వేసి, ఆయన వాళ్ళ ఊరు వస్తున్నట్లు టెలిగ్రాం ఇవ్వమంటాడు శరవణన్‌ని.



పిస్తుందో. అదే క్షణంలో మీదపడిపో వాలనిపిస్తుంది.

ఆమె పర్సనాలిటీ అలాం టిది. ఎంత అందంగా కనిపి స్తుందో, అంత సెక్సీగానూ తోస్తుంది. ఇలా రెండు రకాలైన ఫీలింగ్స్‌ని కలగచేసేవాళ్ళు చాలా అరుదు. అందుకే ఆమెను చూసిన ఏ మగాడికైనా ఆమెతో ఎక్కడో-ఊటీలోనో. గోవాలోనో ఒంటరిగా గడపాలనిపిస్తుంది.

కానీ ఆమె వివాహిత కావడంతో ఆ ఊర్లోని చాలామంది అబ్బాయిలు అలా ఊహలకే పరి మితమై పోతున్నారు.

ఆమె భర్త శ్రీనాధ్ ఎలక్ట్రానిక్స్ ఇంజనీర్. పక్క నున్న టౌన్‌లో ఓ ప్రైవేటు కంపెనీలో ఉద్యోగం చేస్తున్నాడు. ఆమె ఎం.ఏ. ఇంగ్లీషు లిట్ చేసింది.

"కమాన్ మౌనికా! హౌ ఆర్ యు?" అంటూ ఆప్యాయంగా ఆహ్వానించింది సుజన.

"వెరీ ఫైన్-పొద్దునే కబురు పెట్టేవేమిటి? నువ్వంటే కొత్త పెళ్ళికూతురువి గనుక పనులు చేయక్కర్లేదు. నేను మాసిపోయిన పెళ్ళికూతుర్ని. పనులు చేయక తప్పదు. ఊఁ ఏమిటి విశేషాలు?"

"బోర్ కొడుతోంటే కబుర్లు చెప్పుకుందామని రమ్మన్నాను దట్సాల్"

"ఇలా ఊహించే మధ్యాహ్నం వంటంతా మా అత్తమ్మను ఒప్పించి వచ్చాను. ఆయన డ్యూటీకి వెళ్ళిపోయారు. ఇక నో ప్రాబ్లమ్. నాకూ బోర్‌కొడు తోంది కాబట్టి మనం కబుర్లలో మునిగి తేలచ్చు" అంటూ మౌనిక ఎదురుగా వున్న కుర్చీలో తీరుబడిగా కూర్చుంది.

"చాలా మంచిపని చేశావ్. మనం ఎంత సేపైనా మాట్లాడుకోవచ్చు"

"రేపు రాత్రి మీ శోభనం అటకదా. మా పక్కింటి కాంతం చెప్పింది. మీరిద్దరూ లవర్స్‌కదా. ఇంకా మీకు ఫస్ట్‌నైట్ ఏమిటి? లవర్స్ కానీ మేమే ఫస్ట్‌నైట్‌ని పెళ్లికి ముందే ముగించేసుకున్నాం. పెళ్లి అయ్యాక ఏర్పాటుచేసిన ఫస్ట్‌నైట్ మాకు సెకండ్‌నైట్" అంటూ సిగ్గుపడింది మౌనిక.

"పెళ్లికి ముందే ఫస్ట్‌నైటా! మీరిద్దరూ లవర్స్ కాకుండా అదెలా సాధ్యమైంది?" ఆశ్చర్యపోతూ ప్రశ్నించింది సుజన.

"అదంతా ఓ తమాషా"

"చెప్పవా?"

"ఫస్ట్‌నైట్ గురించా! నావల్ల కాదు బాబూ" మౌనిక

## ఆ చోట సోకు

'కోకా రైకా కలవని చోట సోకు బాగుంది' అని ఆమధ్య ఓ పాట వచ్చింది. ఆ చోట సోకుని మంచి గ్లామర్ పాయింట్‌గా చూపించడంలో పెద్దపెద్ద దర్శకులు కృతకృత్యులయ్యారు.

ఇప్పుడొస్తున్న తారలంతా ఆ మార్గాన్ని అనుసరిస్తున్నారు. 'బొబ్బిలిసింహం'లో రోజా కొంచెం హై మోతాదులో బాహుమూలల్నీ, ఉబికిన ఒంపుల్నీ, లోతైన నాభినీ ప్రదర్శిస్తోంది. ఇంత హాటుహాటుగా ఆమె ఎప్పుడూ కనిపించలేదట.

ఇక రంభ కూడా తన సినిమాల్లో ఆ సోయగాల్ని కనువిందుచేయమంది. రమ్యకృష్ణ గురించి మరి చెప్పనవసరంలేదు. ఆమె గ్లామర్‌లో నాభీ ప్రదర్శన ఓ పెద్ద ప్లస్‌పాయింట్. కనుక ఆ విషయంలో ఎప్పుడూ మిస్‌కాకుండా జాగ్రత్తపడుతోంది.



ఈ సెక్సీ గ్లామర్ హిందీనుండి తెలుగులోకి దిగుమతైనా, ఇక్కడ ప్రత్యేకతల్ని సంతరించుకుంది.

మరింత సిగ్గుపడింది. అప్పుడామె ముఖం మందారం పువ్వుకి ఎర్రటిరంగు వేసినట్లుంది.

"ప్లీజ్! చెప్పవూ?"

మౌనిక మెత్తపడింది.

మరో పది నిముషాలు అర్థించాక చెప్పడానికి ఒప్పుకుంది. మొదట్లో సిగ్గుపడ్డా ఆ తరువాత దాటి గానే కొనసాగించింది.

"మాది సుళ్లూరుపేట టౌన్. మా నాన్న చెక్ పోస్టులో తనిఖీ అధికారి. అమ్మానాన్నలకు ముగ్గురు సంతానం. మొదట మా అన్నయ్య. వాడు డాక్టర్. విజయవాడలో డాక్టర్‌గా పోస్టింగ్ రావడంతో అక్కడే పెళ్లిచేసుకుని సెటిలైపోయాడు.

రెండోది మా అక్కయ్య. దానిని మద్రాసులో ఇచ్చాం. మా బావ స్ప్రిక్ ఎరువుల ఫ్యాక్టరీలో పర్సనల్ మేనేజర్. ఇక ఇంట్లో మిగిలింది అమ్మానాన్నలతో పాటు నేనొక్కదాన్నే.

నేను ఎం.ఏ. కంప్లీట్ చేశాను. ఎంఫిల్ చేద్దామనివున్నా వీలులేకపోయింది.

'పెళ్లి చేసేస్తాను. ఆ తరువాత నువ్వు చదువుకుంటావో, కాపురమే చేసుకుంటావో నీ ఇష్టం' అన్నాడు నాన్న. ఆయన ఏదైనా పట్టుబడితే నెగ్గే వరకు నిద్రపోడు. ఆయన నైజం తెలిసినదాన్ని కనుక ఇక మాట్లాడలేకపోయాను.

నాకూ పెళ్లిచేసుకోవాలన్న కోరిక పుట్టింది. ఎన్ని రోజులని ఊరకనే వుండడం? ఇరవై రెండేళ్ళ యవ్వనం రాత్రిపూట మారాం చేయడం మొదలు పెట్టింది. ఒక్కో రోజు నిద్రకూడా వచ్చేది కాదు. ఏదో ఆలోచిస్తూ తోడున్నాడేమోనని పక్కంతా చేయి పెట్టి తడిమేదాన్ని. తలగడ తలకింద కాకుండా ఎదమీద వుండేది. అల్లరిచేసే పరువం నోరు నొక్కెయ్యడానికి బ్లాంకెట్‌తో అవస్థపడేదాన్ని.

ఈ కారణాలవల్ల నాన్నఅలాఅనడంతో చదువుకు ఫుల్‌స్టాప్ పెట్టేశాను.

మొదటి సంబంధమే సెటిలైంది. మా ఊరు ఎస్.ఐ. ఈ సంబంధం చెప్పాడు. అబ్బాయి రావడం, నన్ను చూడడం జరిగిపోయాయి.

శ్రీనాథ్‌ను ఇష్టపడని ఆడపిల్ల వుండదనుకుంటాను. సన్నగా వున్నా చక్కటి ఫీచర్స్‌తో వుంటాడు. అందునా ఇంజనీర్ ఉద్యోగం చేస్తున్నవాడు. కాబట్టి ఓకే అనేశాను అమ్మానాన్నలతో.

ఎభై వేలు క్యాషూ, పాతిక తులాల బంగారం, పెళ్లి చేయించేటట్లు నాన్న ఒప్పుకున్నాడు. అబ్బాయి తల్లిదండ్రులు కూడా దీనికి ఓకే అనడంతో పెళ్లి ఫిక్సయిపోయింది. అయితే నిశ్చయతాంబూలాలు మాత్రం జరగలేదు. పెళ్లిరోజే ఆ తంతూ ముగిద్దామని, రెండు ఖర్చులూ వేస్ట్ అనీ నాన్న అనడంతో వాళ్ళూ సరేనన్నారు.

అబ్బాయివాళ్ళు వెళ్ళిపోయారు.

పెళ్లి మరో రెండు నెలల్లోగా చేస్తానని, ముహూర్తం చూసుకున్నాక లెటర్ రాస్తాననీ నాన్న చెప్పారు.

రెండు నెలలు చాలా లాంగ్ అనిపించింది నాకు. ముహూర్తం త్వరగా కుదిరుంటే బావుండేదని అనుకున్నాను. పెళ్లిచూపుల్లో ఆ అయిదు నిముషాల్లో చూసిన రూపం ఏం గుర్తుంటుంది? కానీ శ్రీనాథ్‌ని పదేపదే కళ్ళముందుకు తెచ్చుకునేదాన్ని.

నెలన్నర తరువాత మంచి ముహూర్తం వుందని, ఆ రోజుకి పెళ్లి ఫిక్స్‌చేస్తానని, సుళ్లూరుపేటలోనే వున్న సత్రంలో పెళ్లి జరిపిస్తానని నాన్న శ్రీనాథ్ తండ్రికి ఉత్తరం రాశాడు.

వారం రోజుల తరువాత అక్కడినుంచి ఉత్తరం వచ్చింది. డేటు ఓకేననీ, అయితే పెళ్లి సుళ్లూరుపేటలో కాకుండా తమ ఊర్లో జరిపించాలనీ, తమ బంధువర్గం అంత దూరం రావడం కష్టమనీ శ్రీనాథ్ తండ్రి అందులో రాశాడు.

ఈ ఉత్తరం చూడగానే నాన్నకు కోపం వచ్చింది. 'పెళ్లి ఇక్కడ కాకుండా అక్కడ చేయాలట. బంధువులు రావడానికి కష్టమట. మనకు లేరా బంధువులు? మగపెళ్లివాళ్ళ కోర్కెలకు హద్దూ అదుపూ వుండడం లేదు. పెళ్లి చేస్తానని ఒప్పుకుంటే, ఇక్కడ కాదు అక్కడంటే ఎలా వుంటుందో చెప్పు.

ఇది మన స్వంత ఊరు గనుక నలుగురు పలుకుతారు. పనులు చేయడం సులభం. అక్కడ పెళ్లి చేయడమంటే మాటలా? ఇక్కడినుంచి ముప్పై మూడూ అక్కడికి తీసుకెళ్ళడం ఎంత రిస్కు? అక్కడ పెళ్లి చేయడం నావల్ల కాదని రాసేస్తాను' అని నాన్న ఖచ్చితంగా చెప్పేశాడు అమ్మతో.

ఆ విధంగానే లెటర్ రాశాడు. మా నాన్న చెప్పింది సబబుగానే వున్నట్లు నాకు అనిపించింది.

మరో వారానికి అక్కడినుంచి ఉత్తరం వచ్చింది. ఎలాగో సర్దుకుని పెళ్లి అక్కడే చేయమని రాశాడు శ్రీనాథ్ తండ్రి.

తనవల్ల కాదని నాన్న తిరిగి ఉత్తరం రాశాడు. ఆ తరువాత అక్కడినుంచి జవాబు రాలేదు.

పెళ్లి జరిగే స్థలంమీద ఇరుపక్షాలకూ ఇంత పట్టుదల ఏమిటో నాకు అర్థంకాలేదు.

తమ బంధువులు రావడానికి ఇబ్బందని వాళ్ళూ, అక్కడ చేయడం తనకు కష్టమని నాన్నా బిగదీసుకున్నారు. మధ్యలో మేమిద్దరం ఏమైపోతామన్న ధ్యాస ఎవరికీ పట్టడం లేదు. ఈ విషయాలన్నీ శ్రీనాథ్‌కి తెలుసా? లేదో?

అన్నీ కుదిరి, పెళ్లికొడుకు మీద కలలు కనడం ప్రారంభించాక ఇలా బెడిసికొట్టడం బాధాకరమైన పరిణామం. ఇక అక్కడినుంచి ఉత్తరం రాకపోతే పెళ్లి



## చేతి ఎముక విరిగితే...

తీవ్రమైన దెబ్బలవల్ల చేతి ఎముక విరిగి, మోచేయిని మడవడం బాధాకరంగా వుంటే, వారిని కింద పడుకోబెట్టాలి. ఆ చేతిని శరీరానికి తిన్నగా వుంచి, శరీరానికి కలిపి కట్టు కట్టాలి.

చేయి మడవడం వీలైతే ఇలా చేయాలి–

1. చంకకింద ఓ అట్టనో, మందపాటి బట్టనో ఆధారంగా పెట్టాలి. ముంజేతిని మరో భుజానికి ఆనుకునేలా వుంచాలి.
2. చేయి అలాగే వుండేటట్టు పొడవాటి గుడ్డతో కట్టు కట్టి భుజంపై ముడివేయాలి.
3. చేయి ఛాతీని ఆనుకుని నిశ్చలంగా వుండేటట్టు మరో కట్టు కట్టి డాక్టరును సంప్రదించాలి. ◆

కేన్సిల్ చేస్తానని నాన్న అమ్మతో అనడం నేను విన్నాను. నాకు కంగారు మొదలైంది. ఎవరో ఒకరు పట్టు సడలిస్తే ప్రాబ్లమ్ లేకపోవును.

నాన్నది ఏమీ తప్పులేదనిపించింది.

ఈ రోజుల్లో పెళ్లిచేయడమంటే మాటలు కాదు. పరాయి ఊర్లో పెళ్లిచేసి, మెప్పించడం అంత సులభం కాదు. మరి శ్రీనాథ్ తండ్రికి ఇవన్నీ చెప్పి, ఆయన ఒప్పుకునేట్లు ఎలా చేయడం?

ఇలా ఆలోచిస్తున్న నాకు ఓ ఐడియా తట్టింది. ప్రాబ్లమ్ అంతా వివరించి, తండ్రిని ఒప్పించమని శ్రీనాథ్‌నే అడగాలనిపించింది. అందరికీ ఇష్టం కలిగాక చిన్న కారణంచేత పెళ్లి ఆగిపోవడం ఎంత బాధాకరమో చెప్పాలనిపించింది.

అందుకే శ్రీనాథ్‌ని ఓసారి ఇక్కడకువచ్చి వెళ్ళమని ఉత్తరం రాయాలనుకున్నాను. అతను వస్తే అక్కడి విషయాలు కూడా తెలుస్తాయి.

నేనైతే అక్కడికి వెళ్ళడం కుదరదు కనుక అతన్నే ఇక్కడికి రమ్మనడం సబబుగా తోచింది. ఇక్కడికి వచ్చాక ఎలానో ఓలా మేనేజ్‌చేసి, మాట్లాడుకోవచ్చు.

కానీ పెళ్లిచూపుల్లో తప్ప మరే పరిచయం లేని అతనికి ఉత్తరం ఎలా రాయడం? ఇలా మీనమేషాలు లెక్కిస్తే లాభంలేదనిపించి శ్రీనాథ్‌కి ఉత్తరం రాయడానికే డిసైడ్ చేసుకున్నాను.

'ఓసారి రండి. మీతో మాట్లాడాలి' అని రెండు వాక్యాలు రాసి ఉత్తరాన్ని ఆఫీసు అడ్రస్‌కి పోస్ట్‌చేశాను.

ఉత్తరం రాసింది మొదలు, అతను వచ్చాక ఏ విషయాలు మాట్లాడాలో రిహార్సల్స్ చేసుకుంటూ వుండిపోయాను. అతను రాడేమోనన్న అనుమానం కూడా నాలో లేకపోలేదు.

రెండు మూడు రోజులు ఎదురుచూశానుగానీ ఆ తరువాత అంత గాఢంగా పట్టించుకోలేదు.

ఉత్తరం రాసి వారం రోజులైనా అతను రాలేదు.

ఆ రోజు ఆకాశమంతా మబ్బుపట్టి వుంది. బంగాళాఖాతంలో తుపాను లేచిందని టీవీలో చెప్పారు. వర్షం రాలేదుగానీ వచ్చే సూచనలు కనిపిస్తున్నాయి.

తడ పక్కనున్న ఓ పల్లెటూర్లో మా మేనమామ వుంటున్నారు.ఆయనతో ఏదో విషయాలు మాట్లాడి వస్తామని అమ్మానాన్నా ఉదయం వెళ్ళారు. సాయంకాలానికల్లా తిరిగి వచ్చేస్తామని చెప్పారు.మధ్యాహ్నం భోజనం ముగించి, అలా పడుకున్నాను.

చిన్నగా వర్షం మొదలైంది. కిటికీలోంచి వర్షాన్ని చూస్తూ నిద్రలోకి జారిపోయాను.

ఎవరో తలుపు తడుతున్నట్లనిపించి మెలకువ వచ్చింది. అమ్మానాన్నా వచ్చారని గబుక్కున మంచం దిగి వచ్చి తలుపు తీశాను.

బాగా తడిసి ముద్దయిపోయి ఎదురుగా నిలుచున్న అతన్ని తేలికగానే పోల్చుకోగలిగాను. అతను శ్రీనాథ్.

తుపాను బయటకాదు–నా గుండెల్లో అనిపించింది. అంత సంచలనం నాలో.

ఏమీ మాట్లాడకుండా పక్కకి తొలిగాను, లోపలికి రమ్మన్నట్లు.

(ఇంకావుంది)








రాళ్లు పొదిగిన ఆకర్షణీయమైన నెక్లెస్



వివిధ డిజైన్ల చెయిన్లు, ఉంగరాలు



అందమైన పతకాల చెయిన్లు, బ్రాస్‌లెట్,
చెవిదిద్దులు, వాచీలు, ఉంగరాలు



ఆకర్షణీయమైన హారం



అందమైన
ఉంగరాలు



# సుఖ సంసారం

డా॥ జి. సమరం

పి. యస్. ఆర్. పాట్నా

■ నా వయసు 40 సంవత్సరాలు. ఇద్దరు పిల్లలు. క్రిందటి సంవత్సరం మా ఆవిడకి అబార్షనుకూడా చేయించాను. ఇక పిల్లలు వద్దనుకున్నాం.

ఆపరేషన్ అంటే ఇద్దరికీ భయమే. కండోమ్ వాడితే నాకు తృప్తి వుండడంలేదు. అందుకని అప్పుడప్పుడు కండోమ్ లాగేసి నేరుగా పాల్గొంటాను. దానితో ఆమె సంభోగం అంటేనే భయపడుతోంది ఎక్కడ గర్భం వస్తుందోనని. ఏంచేయాలి? సెక్సులో పాల్గొనకుండా సెక్సు సుఖం పొందే పద్ధతి వుందా?

● కుటుంబ నియంత్రణ ఆపరేషను గురించి భయపడడం అనవసరం. ఇద్దరిలో ఎవరో ఒకరు ఆపరేషను చేయించుకోండి. ఇక సెక్సులో పాల్గొనకుండా సెక్సులో పాల్గొన్నంత తృప్తి పొందాలంటే 'ఫోర్ ప్లే' తోనే సెక్సుని ఆపివేయాలి.

అయితే ఫోర్ ప్లేతో ఉద్రిక్తత చెందిన మనసు సెక్సులో పాల్గొనడానికి పోర్పుచేసే ప్రమాదం వుంది. అలా పాల్గొనకుండా మనస్సుని అదుపుచేసుకుని కేవలం బాహ్యప్రేరణకే పరిమితమైతే కూడా స్త్రీ పురుషులిద్దరికీ భావప్రాప్తి లభించే అవకాశం వుంది. అయినా కొంత అసంతృప్తి మిగిలే వుంటుంది.

బి. ఆర్. చింతలపూడి

■ నా వయసు 18 సంవత్సరాలు. రొమ్ములు చాలా పెద్దవిగా వుంటాయి. అంతేకాకుండా బరువుకి క్రిందికి జారివుంటాయి. అలా జారి కనబడకుండా బ్రా వేస్తే పైకి కనబడరాయి. ఈ పరిస్థితివల్ల నాకు ఎంతో డెలికేట్‌గా వుంటోంది. నా తోటి అమ్మాయిలతో కలవాలన్నా సిగ్గుగా వుంటోంది. కొందరైతే నన్ను ఆటపట్టించి నామీద సెక్సు జోకులు కూడా వేస్తున్నారు. చాలా ఎక్కువగా వున్న వక్షోజాల పరిమాణం తగ్గడానికి మందులేమైనా వున్నాయా? జారిపోయి కనబడుతున్న వక్షోజాలు సరైన పొజిషన్‌లో వుండటానికి ఎక్సర్‌సైజులు ఏమిటో కూడా రాయండి.

● కొందరికి వక్షోజాలు చాలా పెద్దవిగా వుంటాయి. మందుల ద్వారా అవి చిన్నవి అవడం జరగదు. వక్షోజాలలో కండరాలు వుండవు. వ్యాయామం చేసినా అవి గట్టిపడడం, జారకుండా వుండడం జరగదు.

వక్షోజాలు మామూలుకంటే చాలా పెద్దవిగా వుండి వికారంగా కనబడుతున్నప్పుడు సర్జరీచేసి అం

## వక్షోజాల పరిమాణం తగ్గేదెలా?

దులో నుంచి కొంత టిస్యూని తీసివేసి సహజమైన పరిమాణంలో అందంగా తీర్చిదిద్దవచ్చు. మీరు దిగులు చెందకుండా డాక్టర్‌ని సంప్రదించండి.

ఆర్. పి. మద్రాసు

■ వీర్యం మింగడంవల్ల స్త్రీకి గర్భం వచ్చే అవకాశం వుందా?

● అంగచూషణ సమయంలో వీర్యం స్ఖలింపబడి మింగడంవల్ల గర్భం రాదు. యోని మార్గంలో వీర్యం స్ఖలిస్తేనే గర్భం వస్తుంది.

ఎ. కె. కర్నూలు

■ నాకు పెళ్లైంది. భర్తలో ఏమాత్రం సుఖంలేదు. అందుకని అప్పుడప్పుడూ పరాయి పురుషులతో సెక్సు సుఖం పొందుతూ వుంటాను. అయితే అందులోనూ తృప్తి కనిపించడంలేదు. అసలు అవకాశం దొరికేదే తక్కువ. అదికూడ కొద్ది నిమిషాలు. వెంటనే పని ముగించేయడం.

ఆ కొద్ది నిమిషాల్లో నాకు సుఖం అనిపించదు. కానీ నాతోవున్న ఆ పురుషులకి సుఖం కలిగిందని అంటారు. నాకు మాత్రం ఎక్కడికో పోయి ఓ రోజంతా వారితో గడిపితే తప్ప తృప్తి కలగదని అనిపిస్తుంది. కానీ అది కుదిరేది కాదు. నేను పొందలేని సుఖం పురుషులు ఎలా పొందగలుగుతున్నారు? నేనుకూడా క్షణాల్లో పూర్తితృప్తి పొందే మార్గం ఏమిటి?

● పురుషునికి వీర్యస్ఖలనంలో పూర్తి తృప్తి. హాయి అందుతాయి. సాధారణంగా పురుషునిలాగా స్త్రీ త్వరగా ఉద్రిక్తత చెందదు. వీణని శ్రుతి పెట్టినట్లే ఆమె శరీరంలోని వివిధ కామకేంద్రాలని పురుషుడు ప్రేరేపించి, మనసుని పులకింపజేసి, ఆపైన సంయోగంలో పాల్గొంటే స్త్రీ పూర్తి తృప్తిని, హాయిని పొందుతుంది.

అందుకోసం పరిసరాలు భయరహితంగా వుండాలి. మనసులో కంగారు, గాభరాకి చోటు లేకుండా వుండాలి. ప్రతీ ప్రేరణతో కామోద్రేకం క్లైమాక్సుకి చేరాలి. అప్పుడే సంయోగం థ్రిల్‌ని ఇస్తుంది. దీనికంతటికీ కొంత సమయం కావాలి.

అందుకే గాభరాగా ముగించే సెక్సు మీకు తృప్తిని ఇవ్వడంలేదు. దీనికి తోడు భయం భయంగా, గాభరాగా సెక్సులో పాల్గొనడం కూడా సెక్సు థ్రిల్ పొందడంలో కొంత అవరోధం అవుతోంది. పరాయివాళ్లతో సెక్సులో పాల్గొన్నప్పుడు పురుషులలో అంగస్తంభన వైఫల్యాలు, స్త్రీలలో థ్రిల్ కలగకపోవడాలు సామాన్యంగా జరిగే విషయమే. అంతేతప్ప సెక్సుపరంగా వారిలో లోపం వుండటం ఎంతమాత్రంకాదు.

జె. జె. దర్శి

■ నా పురుషాంగానికి పూర్వచర్మం ఎక్కువగా వుంది. రతిలో పాల్గొన్నప్పుడు శిశ్నం వెనక్కి పోక ముందుకే ముద్దగా వుండి అసంతృప్తి కలుగుతోంది. అంగప్రవేశం సమయంలో చర్మాన్ని శిశ్నం వెనుకకి లాగి ప్రవేశం జరిపినా మళ్ళీ ముందుకు వచ్చి రతిలో అసంతృప్తి కలుగుతోంది. ఏంచేయాలి?

● సాధారణంగా అంగం స్తంభించినప్పుడు పురుషాంగం పూర్వచర్మం శిశ్నం వెనుకకి వెళ్లిపోతుంది.

## తామర వదలడమెలా?

తామర అనేది ఒకవిధమైన ఫంగసు వ్యాధి. ఈ వ్యాధి తలలో రావచ్చు, ముఖం, చంకలు, గజ్జలు, కాళ్లు, వేలిప్రేళ్ళు ఎక్కడైనా రావచ్చు. తామర రావడానికి ప్రధానంగా చెమట అతిగావట్టడం, గాలి ఆడకపోవడం, శుభ్రత పాటించకపోవడం కారణం.

కొందరికి వేలిగోళ్ళకి తామర వస్తుంది. దానిని తామర అని గుర్తించక పిప్పిగోళ్ళు అనుకుంటారు. పైపై పూతలు ఏవేవో రాస్తారు. చిట్కావైద్యాలు చేస్తారు. గోళ్ళకి వచ్చిన తామర వెంటనే తగ్గదు. నెలలు తరబడి చికిత్స చేయించుకోవాలి.

కొందరికి తొడలసందున, చంకల్లో చర్మం నల్లగా తయారై దురదవుడుతుంది. స్త్రీలలో నడుము దగ్గర నల్లగా తయారవడం, దురద అనిపించడం సహజం. నడుము దగ్గర చీరని గట్టిగా కట్టుకోవడం, చెమట అధికంగా పట్టడం ఇందుకు కారణం.

గాలి ఆడే నూలుదుస్తులు, వదులు దుస్తులు వాడే వారికి తామర రావడం తక్కువ.

తామర అంటువ్యాధి. ఆ వ్యాధి వున్నవారు వాడిన దుస్తులు, టవల్స్ మరొకరు వాడితే వారికి ఈ వ్యాధి సంక్రమిస్తుంది. అందుకని తామర వున్నవారు తమ దుస్తులని వేరుగా వాడుకోవాలి.

తామర తగ్గడానికి గ్రిసోఫల్విన్ బిళ్ళలు ఉదయం–2, రాత్రి–2 చొప్పున నెలా రెండునెలలు వాడాలి. లేదా 'గ్రిస్–ఒడి' బిళ్లలు రోజుకి ఒకటి చొప్పున నెలరోజులు వాడాలి. లేదా డెర్మోనార్మ్ క్యాప్సూల్స్ ఉదయం–1, రాత్రి–1 చొప్పున నెలా రెండునెలలు వాడాలి. తామర మొండిగావుంటే 'కీటోకోల్' టాబ్లెట్లు రోజుకి ఒకటి చొప్పున నెలరోజులు వాడాలి. గోళ్లకి తామర వస్తే తగ్గేవరకు కొన్నినెలలు వాడాలి.

కొందరికి ముఖం, ఛాతీ, వీపు, శరీరంలో ఇతర చోట్ల శోభి వస్తుంది. శోభికూడా ఒకవిధమైన ఫంగసు వ్యాధి. ఇది తగ్గడానికి 'జోల్' సెల్యూషన్ రోజుకి రెండుసార్లు రాయాలి. శుభ్రత పాటించాలి.

వ్రేళ్ళ సందున పాచినట్లు అవడంకూడా ఒకవిధమైన తామరే. దీనికి చేతులు, కాళ్ళు పొడిగా వుంచుకోవడం, వ్రేళ్ళసందున 'జోల్' ఆయింటుమెంటు రాయడం చేయాలి.

# బహిష్టుకిముందు స్త్రీలలో కలిగే వింతబాధలు–చికిత్స

చాలామంది స్త్రీలలో బహిష్టు స్రావం కనబడటానికి వారం–పదిరోజులు ముందునుంచి శారీరకంగా, మానసికంగా కొంత తేడా వస్తుంది. కొందరిలో ఈ తేడా కొద్దిపాటిగా వుంటే మరికొందరిలో విపరీతంగా వుంటుంది. 80 శాతం స్త్రీలల్లో కొద్దో గొప్పో బహిష్టుకి ముందు తేడా కనబడుతుంది. ఈ తేడాని 'ప్రిమెనుస్ట్రివల్ టెన్షన్' అంటారు.

ప్రిమెనుస్ట్రివల్ టెన్షన్ ఏర్పడే స్త్రీలలో ఆ రోజుల్లో చిరాకు, కోపం పెరుగుతాయి. ఆవేశం, ఉద్రేకం ఎక్కువ స్థాయిలో వుండి తేలికగా అదుపు అవకుండా వుంటాయి. కంగారు, గాభరా పెరుగుతాయి. గుండెదడ, నీరసం వుంటాయి. తలనొప్పి ఇబ్బంది పెడుతుంది.

పిచ్చికోపం పెరిగి ఎదుటివాళ్లమీద విజృంభించడం, కొట్టడం, పొడవడం కూడా కొందరిలో కనబడుతుంది. హత్యలుచేసే స్త్రీలని పరిశీలిస్తే ఆ సమయంలో వారిలో ప్రిమెనుస్ట్రివల్ టెన్షను వుందని తేలింది.

బుతుస్రావం రావడానికి ముందు స్త్రీలలో కనబడే ఈ విలక్షణ లక్షణాలకి తోడు వారిలో ఆకలి పెరగడం, కడుపులో, నడుములో ఏదో బాధ అనిపించడం వుంటాయి.

కొందరు స్త్రీలకి ఆ రోజుల్లో మూత్రం మాటిమాటికీ వస్తుంది. మరికొందరికి మలబద్ధకం సమస్య తలెత్తుతుంది.

అది అలా వుండగా కొందరు స్త్రీలలో రొమ్ములు బరువెక్కుతాయి. బాధ అనిపిస్తాయి. కడుపు, ముఖం, పాదాలు ఉబ్బుగా మారుతాయి. దీనికి కారణం ఆ రోజుల్లో ఒంటికి అధికంగా నీరు చేరడమే.



ఒంటికి నీరు చేరడంవల్ల బహిష్టుకి ముందు 2–3 పౌన్లు బరువు పెరుగుతారు. ఆసమయంలో 10పౌన్లు బరువు పెరిగేస్త్రీలు కూడా వున్నారు. బహిష్టు స్రావం ప్రారంభంకాగానే నీరు తగ్గిపోయి మామూలుబరువుకి వచ్చేస్తారు.

మైగ్రేన్ తలనొప్పి వున్నవారికి బహిష్టు ముందు ఎక్కువ అవుతుంది. వింత ఏమిటంటే మైగ్రేన్ తలనొప్పితో బాధపడే ఎందరో స్త్రీలు గర్భిణీగా వున్నప్పుడు ఆ తలనొప్పి లేకుండా అవుతారు. గర్భిణికి ప్రిమెనుస్ట్రివల్ టెన్షను లేకపోవడమే కారణం.

ప్రిమెనుస్ట్రివల్ టెన్షన్ వున్నవారు ఆ రోజుల్లో డల్‌గా మారడమే కాకుండా మతిమరుపుతోబాధపడతారు. త్వరగా ఏదీ గుర్తురాదు. త్వరగా మరచిపోవడం జరుగుతుంది. ఆలోచనలన్నీ గందరగోళంగా, స్పష్టత లేకుండా వుంటాయి. ఆఫీసరుకి ప్రిమెనుస్ట్రివల్ టెన్షను వుంటే, ఇబ్బందులపాలు కావలసివస్తుంది.

ప్రిమెనుస్ట్రివల్ టెన్షను వున్న ప్రతీ స్త్రీలో పైన చెప్పిన లక్షణాలన్నీ వుండాలని ఎక్కడా లేదు. అలాగే అవి ఎక్కువ మోతాదులో కనబడాలనీ లేదు. ఇటువంటివారికి ఎటువంటి చికిత్సా అవసరం లేదు.

సాధారణంగా ప్రిమెనుస్ట్రివల్ టెన్షన్ బహిష్టు కనబడగానేగాని, కనబడిన రెండురోజుల్లోగాని పూర్తిగా తగ్గిపోయి మామూలు స్థితికి వచ్చేస్తారు.

కొందరిలో బహిష్టుకి ముందు ఈస్ట్రోజన్ హార్మోన్ అధికం అవడంవల్ల ప్రిమెనుస్ట్రివల్ టెన్షన్ డెవలప్ అయితే మరికొందరిలో ప్రొజెస్టరోన్, ఎడ్రినల్ కార్టినల్ స్టిరాయిడ్స్ అధికం అవడంవల్ల బాధలు తలెత్తుతాయి. అందుకని మూలకారణంబట్టి ప్రిమెనుస్ట్రివల్ టెన్షన్ వున్న స్త్రీలకి కొందరికి ప్రొజెస్టరోన్‌గాని, ఈస్ట్రోజన్ గాని, బీ6 గాని ఇవ్వడంతో రిలీఫ్ రావడం వుంటుంది.

ఒంటికినీరు చేరడం, రొమ్ములు బరువు అనిపించడం ప్రొజెస్టరోన్ బిళ్ళలు వాడడంతో కంట్రోలు అవుతాయి. 'డెఫ్స్టోన్' బిళ్ళలుగానీ, 'ప్రిమోలత్–యన్' బిళ్ళలుగానీ బహిష్టుస్రావం కనబడిన 16వ రోజునుంచి 10 రోజులు ఉదయం–1, రాత్రి–1 వాడాలి. ఇలా ప్రతీనెలా వాడాలి. ఈ బిళ్ళలు వాడితే రొమ్ములు బరువు, కాళ్ళకి నీరుచేరడం, చికాకు, కోపం చాలావరకు కంట్రోలు అవుతాయి.

బీ6 కూడా బహిష్టుముందు వచ్చే బాధని తగ్గిస్తుంది. ఇది ఎటువంటి హార్మోను కాదు. బీ6 కి సంబంధించిన 'పెరికాంటిన్' బిళ్ళలు రోజుకి ఒకటి చొప్పున బహిష్టు స్రావం కనబడిన 16వ రోజునుంచి 10 రోజులు వాడాలి. దీనివల్లకూడా ప్రిమెనుస్ట్రివల్ టెన్షన్ తగ్గుతుంది.

రొమ్ములు బరువు అనిపించేవారు, ఒంటికినీరుచేరేవారు ఆ రోజుల్లో ఉప్పు తగ్గించి తీసుకోవాలి. మంచినీళ్లు కూడా తక్కువ త్రాగాలి.

ప్రిమెనుస్ట్రివల్ టెన్షను పరిస్థితి వున్నవారికి చిరాకు, కోపం, ఆవేశం, ఉద్రేకం ఎక్కువ అవడం సహజం. మామూలుగానే కోపం, చిరాకు వుండేవారికి ఆ రోజుల్లో మరింత ఎక్కువ అవుతాయి. అందుకని పక్కన వున్నవాళ్ళు వాళ్ళని సానుభూతిగా అర్థం చేసుకోవాలి. ప్రిమెనుస్ట్రివల్ టెన్షనుకి మందులు వాడుతూ ట్రాంక్విలైజర్స్ కూడా వాడితే మానసిక పరిస్థితి ప్రశాంతంగా వుంటుంది.

కొందరికి చేతితో వెనుకకి లాగితే శిశ్నం వెనుకకే వుంటుంది. రతి సమయంలో శిశ్నం బయటకి వుంటే స్పందనలు చక్కగా కలిగి తృప్తి అనిపిస్తుంది.

కొందరికి మాత్రమే పురుషాంగ పూర్వచర్మం ఎక్కువగా వుండి అటువంటి తృప్తిగా ఆటంకంగా మారుతుంది. ఇటువంటివారు సున్తీ చేయించుకోవడం ఒక్కటే మార్గం. మీరు డాక్టరుకి చూపించుకుని సున్తీ చేయించుకోండి. మీ సమస్య తీరిపోతుంది.

యస్. హెచ్. — హైదరాబాద్

■ *నేను ఒక అబ్బాయితో శారీరకంగా మూడుసార్లు కలిశాను. గర్భం వస్తుందేమోనని భయంగా వుంది. గర్భం పోవడానికి మందుబిళ్లలు ఏవి వాడాలి?*

● రావలసిన తేదీకి బహిష్టు రాకపోతే గర్భం కారణం కావచ్చు. అందుకని మీ మూత్రాన్ని 'ప్రెగ్‌కలర్' టెస్టు చేయించండి. ఈ టెస్టుద్వారా మీకు గర్భం వచ్చిందీ లేనిదీ తెలుస్తుంది. కొందరికి గర్భం రాకుండానే బహిష్టులు ఆగుతాయి. అటువంటప్పుడు హార్మోను బిళ్లలు వాడితే బహిష్టు వచ్చేస్తుంది.

గర్భమే అయితే బిళ్లలతో పోదు. గర్భం వస్తే డి అండ్ సి చేయించుకోవడం ఒక్కటే మార్గం. మీ విషయంలో డాక్టరుకి చూపించుకోండి.

బి.సి.ఆర్. — కరీంనగర్

## వీర్యరాశిమీద సెక్సు సామర్థ్యం ఆధారపడదు.

■ *వీర్యం తక్కువ విడుదలైతే వారిలో సెక్సు సామర్థ్యం కూడా తగ్గిపోతుందా? వీర్యరాశిబట్టే సెక్సు సామర్థ్యం ఆధారపడి వుంటుందా?*

● వీర్యం తక్కువ విడుదలైనా, ఎక్కువ విడుదలైనా సెక్సు సామర్థ్యం ఒకటేలాగా వుంటుంది. వీర్యం తక్కువ విడుదలయ్యేవారిలో సెక్సు తక్కువ వుండదు. అందుకని వీర్యరాశి తగ్గిపోతే సెక్సు సామర్థ్యం తగ్గిపోతుందని భయపడనవసరంలేదు.

ఇ.వి. — కడప

■ *నాకు సుఖవ్యాధి వచ్చింది. మందులు వాడాను. అయినా మళ్ళీ మళ్ళీ వ్యాధి కనబడుతోంది. సుఖవ్యాధి ఒకసారి వస్తే తగ్గే అవకాశం లేదా?*

● సుఖవ్యాధి తగ్గకపోవడం వుండదు. హెర్పిస్ సింప్లెక్స్ వంటి వైరస్ వ్యాధులు తాత్కాలికంగా తగ్గి మళ్ళీ రావడం జరుగుతూ వుంటుంది. ప్రస్తుతానికి వైరస్ వ్యాధులకి సరైన మందులు లేవు. హెర్పిస్ సింప్లెక్స్ వ్యాధి తరచుగా కనబడుతూ వుంటే సున్తీ చేయించుకోండి. ఎసైక్లోవిరాన్ మందులు వాడండి. పూర్తిగా తగ్గిపోయే అవకాశంవుంది. ఈ వ్యాధి ప్రమాదం చేయదు. భయం అనవసరం.

సీరియల్



# రారా మా ఇంటిదాకా

-మేర్లపాక మురళి

అతను లోపలికి నడిచి, ఆ తరువాత ఏం చేయాలో తెలియక హాల్లో నిలబడిపోయాడు.

నేనైతే మరీ ఘోరం– ద్వారం దగ్గరే వుండిపోయాను.

నా వాలకం చూసి అతనే దేనికోసమో అటూ ఇటూ కళ్ళతోనే వెదుకుతున్నాడు. అప్పుడు స్పృహలోకి వచ్చాను నేను. పరుగున వెళ్ళి టవల్ తీసుకొచ్చి అందించాను.

'థాంక్స్' అన్నాడు శ్రీనాథ్.

అప్పటికి నా జంకు తీరింది.

'మన మధ్య థాంక్స్‌లూ, సారీలు వద్దు' అన్నాను.

నేనంత ఫాస్ట్‌గా మాట్లాడేసరికి తడబడ్డాడు.

బలవంతంగా నవ్వాడు.

తల తుడుచుకున్న తరువాత మా నాన్న లుంగీ, మా అన్నయ్య షర్టూ తీసుకొచ్చి ఇచ్చాను. లుంగీ కొత్తదేగానీ షర్టు మరీ పాతది. కానీ అంతకంటే గత్యంతరంలేదు మరి.

అతను ఓ గదిలోకి వెళ్లి బట్టలు మార్చుకొచ్చాడు.

నేను అంతలో కాఫీ పెట్టి, రెండు కప్పుల్లో తీసుకొచ్చాను. ఒకటి అతనికి అందించి, ఇంకొకటి నేనుంచుకున్నాను. ఇద్దరం కాఫీ తాగడం మొదలుపెట్టాం.

'అమ్మా నాన్న లేరా?' చాలాసేపట్నుంచీ అడగాలనుకుంటున్న ప్రశ్న అది.

'లేరు. తడకు వెళ్ళారు. మరికాసేపట్లో వచ్చేస్తారు'

అప్పటికి ఇద్దరం సర్దుకున్నాం.

ఫ్రీగా మాట్లాడుకుంటున్నాం.

నేనెందుకు లెటర్ రాయాల్సి వచ్చిందో, ప్రాబ్లం ఏమిటో చెప్పాను.

'నాకు నిజంగా తెలియదు. నీ లెటర్ చూసి ఏమోననుకున్నాను. ఇంత చిన్న సమస్య అనుకోలేదు. అమ్మావాళ్ళు కూడా చెప్పలేదు' అన్నాడు.

'మీ దగ్గర్నుంచి లెటర్ రాకపోతే మరో సంబంధం చూసుకొమ్మని లెటర్ రాస్తానన్నారు నాన్న. నాకు దిగులేసింది. ఇంత చిన్న సమస్యవల్ల పెళ్లి ఆగిపోవడం ఇష్టంలేకపోయింది. మీకు చెబితే మీరు మీ నాన్నకు నచ్చచెబుతారనే లెటర్ రాశాను'

'తప్పకుండా. మా నాన్న కూడా మహాగట్టిపిండం. తను పట్టిన కుందేలుకి మూడే కాళ్లు అనే రకం. బంధువులంటే ఆయనకి మహాప్రీతి. అందరూ రావడానికి అనుకూలంగా వుంటుందని అక్కడ చేయమని అంటున్నారు కాబోలు' అన్నాడు శ్రీనాథ్.

'కానీ మావైపునుంచి కూడా ఆలోచించాలికదా'

'అవునవును. నాన్నకు నేను చెబుతానులెండి'

'థాంక్స్'

'మీరేకదా మన మధ్య థాంక్స్ వద్దంది. తిరిగి మీరే థాంక్స్ చెబుతున్నారు' అన్నాడు.

చప్పున సిగ్గేసింది నాకు.

'సారీ' అన్నాను.

'అదికూడా వద్దన్నట్టు గుర్తే'

ఇంకేంచెప్పాలో తెలీక నవ్వుతూ వుండిపోయాను. మరో పది నిముషాలకి అతను బయల్దేరాడు.

బయట వర్షం బలంగా పడుతోంది. సాయంకాలం ఆరుగంటలే అయినా చీకట్లు కమ్మేశాయి.

ఆ రాత్రికి అతన్ని వుండమనాలో, వెళ్ళిపొమ్మనాలో నాకు తెలియడంలేదు.

'ఉండండి–బస్సెప్పుడో కనుక్కుంటాను' అని బస్టాండ్ దగ్గరున్న ఓ హోటల్‌కి ఫోన్‌చేశాను.

'బస్సులు వెళ్ళడంలేదట. ముందున్న ఏరు పొంగుతూ వుందట. ట్రాఫిక్ జామ్ అయిపోయిందట. వాగు ఇప్పుడల్లా తగ్గేటట్టు లేదంటున్నారు' అని చెప్పాను మౌత్‌పీస్ దగ్గర చేయి అడ్డంపెట్టుకుని.

'ఇప్పుడెలా?' అతను ఆందోళనపడ్డాడు.

**25** 'బ్రహ్మానంద మహరాజ్' అనే స్వామీజీని తన వద్దకు పంపమని సత్యనారాయణ తనకు చెప్పినట్లుగా అంటాడు శరవణన్. ఆ మాటలు విన్న వంశీ, తమ శోభనం జరుపుకోవడానికి మరో ప్లాను వేసి, ఆ స్వామీజీ వాళ్ళ ఊరు వస్తున్నట్లుగా టెలిగ్రాం ఇవ్వమంటాడు శరవణన్‌ని.

శోభనం ముహూర్తానికి ఇంకొక్క రోజు గడువుందనగా, వంశీ కనబడకపోవడంతో సుజనను ఆటలు పట్టిస్తుంటారు ఆమె అక్కయ్యలు.

కాలక్షేపానికై సుజన తన ఫ్రెండ్ మౌనికకు కబురు చేస్తుంది. వారి సంభాషణలో సుజన ఫస్ట్‌నైట్ గురించి అడుగుతుంది మౌనిక. తనకు పెండ్లి కాకముందే ఫస్ట్‌నైట్ జరిగిందని, తరువాత జరిగింది సెకండ్ నైటని చెపుతుంది మౌనిక.

మౌనికను తన ఫస్ట్‌నైట్ గురించి చెప్పమని అడుగుతుంది సుజన. శ్రీనాథ్‌తో పెళ్ళి సంబంధం సెటిలై, ముహూర్తం నిశ్చయం కావడం, తరువాత పెళ్ళి ఎక్కడ జరపాలన్న విషయంలో పెద్దవాళ్ళ పట్టుదలలు, తను శ్రీనాథ్‌కు ఉత్తరం రాయడం అంతా చెప్తూ, ఓ తుపాను రోజు, తన తల్లిదండ్రి ఇంట్లో లేని సమయంలో, శ్రీనాథ్ తమ ఇంటికి వచ్చాడని చెపుతుంది మౌనిక.

వరకు అన్ని విషయాలూ దొర్లుతున్నాయి.

అమ్మానాన్నకు కలిపి మొత్తం నలుగురికి వంట చేశాను.

వర్షం ఆగకుండా కురుస్తోంది. గాలి కూడా ఎక్కువైంది. నిలువెల్లా తడిసిపోతున్న ఇల్లు గుండెలు బాదుకుంటున్నట్లు తలుపులు, కిటికీలు కొట్టుకుంటున్నాయి. నేను లేచి అన్నీ బంద్‌చేశాను.

టైమ్ ఎనిమిదికి పైగా అయింది. ఇక ఆ వర్షంలో అమ్మావాళ్లు రారేమోనన్న సందేహం వచ్చింది.

వాళ్ళు రాకపోతే మేమిద్దరమే అన్న భావన గుబులు పుట్టిస్తోంది.

అమ్మావాళ్ళు వస్తే ఏం చెప్పాలో



ఫోన్‌లో మరోసారి అడిగినా అదే జవాబు వచ్చింది.

ఫోన్ పెట్టేసి-'మరి ఏం చేస్తారు? ఉండి రేపు ఉదయం వెళ్ళండి. ఇప్పుడు రైళ్లు కూడా లేవనుకుంటాను' అన్నాను.

'అలా బస్టాండ్‌కి వెళ్లి ఏమైనా మార్గం వుందేమో చూస్తాను' అని బయల్దేరాడు. నేను అడ్డు చెప్పలేదు.

మరో అరగంటకు తిరిగి వచ్చాడు.

ఏరు ఉధృతంగా ప్రవహిస్తోందని చెప్పాడు.

నేను వంట ప్రారంభించాను.

ఇప్పుడు మరింత ఫ్రీగా మాట్లాడుకుంటున్నాం. కొత్త మనుషులమన్న ధ్యాస కూడా పోయింది. చదువుల దగ్గర్నుంచి, అభిమాన హీరో హీరోయిన్ల

## సన్నాయి గొడవ

'పుదుప్పట్టి పొణ్ణుత్తాయి' అనే తమిళ సినిమాలో మన ఊరు మాజీనటి సన్నాయి వాద్య కళాకారిణిగా నటించింది. అదేమీ చిత్రమో! ఆ సినిమా ముగిసిన వెంటనే రాధికకు సంగీతంపై ఎక్కడలేని మక్కువ పుట్టుకొచ్చింది. ఇంకేముంది! ఇల్లంతా రకరకాలైన వాయిద్యాలతో నింపేసి, అభినవ ఏకలవ్యరాలిలా స్వంతంగా ప్రాక్టీస్‌కూడా మొదలెట్టింది.

అదేమని అడిగితే మాత్రం, "మనసు తీరని బాధకు గురైనప్పుడు సంగీతం ఎంతో సహాయకారిగా వుంటుంది" అంటూ కర్ణభేరులు విరిగిపోయేంత శబ్దంతో సన్నాయి వాయించి మరీ చెప్తోంది. ఇకపై రాధిక ఇంటిపక్కవాళ్లను ఆ తుంబురుడే సేదతీర్చాలి!

ఏమైనా- 'పల్నాటి పౌరుషం'తో మళ్లీ రాధికలో ఉత్సాహం రాజుకుంది.



ముందే నిర్ణయించుకున్నాం. ఆఫీసు పనిమీద వచ్చానని, చూసి వెళదామని ఇటొచ్చినట్లుతను చెప్పేటట్లు అనుకున్నాం. అమ్మావాళ్ళు వస్తే ప్రమాదం లేదు. రాకపోతేనే తంటా.

వాళ్ళు ఎప్పుడొస్తారో తెలియదు గనుక భోజనానికి లేవమన్నాను. నేనూ భోంచేస్తే తను భోంచేస్తానన్నాడు. ఇద్దరం ఆ కార్యక్రమాన్ని ముగించాం.

తుపాను ప్రభావం చాలా ఎక్కువగా వున్నట్లుంది. ఆకాశం తూట్లుపడ్డట్టు వర్షం భోరున కురుస్తోంది.

సడన్‌గా లైట్లన్నీ డిమ్ అయ్యాయి. సింగిల్ ఫేస్‌లో కరెంట్ వస్తున్నట్లుంది. ట్యూబ్‌లైట్లు వెలగడంలేదు. మిగిలిన లైట్లు ఎర్రటి గీతల్లా మండుతున్నాయి. ఛాయామాత్రంగా తప్ప ఏమీ కనపడడం లేదు. హాల్లో తప్ప మిగిలిన లైట్లూ, ఫ్రిజ్ ఆఫ్‌చేశాను.

లైట్లు లేకపోవడంతో ఏదో అర్థంకాని సంచలనం నాలో. అతని పరిస్థితి కూడా అంతే. నేనేదో అడగడం, అతనేదో చెప్పడంవల్ల ఇద్దరమూ మామూలుగా లేమన్న విషయం అర్థమైంది.

అంతా కొత్తకొత్తగా, మత్తుమత్తుగా, గమ్మత్తుగా వుంది. ఇలాంటివన్నీ అనుభవించాలే తప్ప మాటల్లోకి అనువదించడం కష్టం.

ఉరుములు, మెరుపులవల్ల రాత్రి మరింత భయానకంగా వుంది. చిట్టచీకటి చుట్టూ చుట్టుకుంటోంది.

సింగిల్ ఫేస్ కరెంట్ కూడా పోయింది.

ఏమీ కనిపించడంలేదు.

'దేవుడి గదిలో బ్యాటరీ వుంది. తెస్తానుండండి' అంటూ లేచాను.

'ఈ చీకట్లో ఏం వెదుకుతారులెండి- నా జేబులో మ్యాచ్‌బాక్స్ వుంది. పట్టుకొస్తాను' అన్నాడు.

అతన్ని ఇబ్బందిపెట్టడం ఇష్టంలేక నేను లేచాను.

రెండు అడుగులు వేశానో లేదో ఇద్దరం బలంగా గుద్దుకున్నాం. అతను ముందుకు వెళ్ళడానికి చేతులు చాచి అడుగువేశాడు. ఆ చేతులు ఖచ్చితంగా నా ఎదమీద పడ్డాయి. నాలో మెరుపు మెరిసినట్లయింది. నా చేతులూ అతని భుజంమీద పడ్డాయి.

ఆ తరువాత ఏం జరిగిందో చెప్పలేను. నేను ముందు కదిలానో, అతను ముందు కదిలాడో తెలియదు. ఇద్దరం ఎదురెదురుగా నిలబడి కౌగలించుకున్నాం. ఇక ఆ తరువాత మా మధ్య బిడియం నలిగిపోయింది. సిగ్గు చితికిపోయింది. లజ్జ మాయమైంది. మామూలు భేషజాలు పటాపంచలయ్యాయి.

ఇద్దరం ఒకరికొకరు గాఢంగా హత్తుకుపోయాం. ఏదైనాసరే అతను ప్రారంభించగానే దానిని క్షణంలో పూర్తిచేస్తున్నాను నేను. అతని పెదవులు ముద్దుకోసం అలా వంగడం తరువాయి నా పెదవులు అతని నోట్లో నానిపోయాయి. పైట పట్టుకోగానే నేను పూర్తిగా జార్చాను.

జాకెట్‌కున్న మొదటి హుక్ విప్పేలోపున నేను మిగిలిన నాలుగు హుక్‌లను విప్పాను. బ్రా దగ్గరకొచ్చేసరికి మాత్రం నేను కదల్లేదు. దాని ఓపెన్ ఎక్కడో తెలియక అతను అలా చేతుల్ని తిప్పడం అద్భుతంగా వుండడంవల్లే నేను సాయం చేయలేదు. వేళ్ళకోసం స్పర్శ చాలదన్నప్పుడే సహకరించాను.

అతని వేళ్ళు బొడ్డువరకు దిగాయి.

'దట్ ఈజ్ శాంపుల్-నాట్ ఫర్ సేల్' అన్నాను చిన్నగా. అతను నవ్వడం అంత చీకట్లోనూ నాకు స్పష్టంగా కనిపించింది.

అలా హాల్లోని సోఫామీదే మా శోభనం జరిగిపోయింది. ఆ తరువాత తెల్లవారేవరకు మాట్లాడుకుంటూనే వున్నాం.

నాలుగు గంటల ప్రాంతాన అతను లేచి తయారయ్యాడు. 'ఎలాగో ఒకలాగా వెళ్ళిపోతాను. తెల్లవారితే మీ అమ్మావాళ్ళు రావచ్చు' అన్నాడు.

వీధితలుపు వరకూ వచ్చి 'గుడ్‌బై' అన్నాను.

'అలా గుడ్‌బై అనకు. దిగులుగా వుంటుంది. మన పెళ్లయ్యాక నిద్రపోయే ముందు గుడ్‌నైట్ చెప్పకోకూడదు. అప్పుడూ గుడ్‌మార్నింగ్ అనే అనుకుందాం. గుడ్‌నైట్ తాత్కాలిక వియోగానికి గుర్తు. ఆ మాత్రం వియోగం కూడా భరించలేను' అన్నాడు.

నేను నవ్వుతూ చేతులూపాను.

అతను వెళ్ళిపోయాడు.

మూడో రోజుకంతా నాన్నకు ఉత్తరం వచ్చింది. 'శాంతా! పెళ్లికొడుకు తండ్రి లెటర్ రాశాడే.

## 'మెడిమిక్స్' రజతోత్సవ వేడుక

మెడిమిక్స్ సబ్బు ఉత్పత్తి మొదలుపెట్టి 25 ఏళ్లు పూర్తయిన సందర్భంగా మెడిమిక్స్ గ్రూప్ సంస్థలు మద్రాసులోని కామరాజ్ మెమోరియల్ హాలులో




ఇటీవల రజతోత్సవ వేడుకను అతివైభవంగా నిర్వహించాయి. అందులో ప్రముఖ తమిళ సంగీత దర్శకుడు ఎం.ఎస్. విశ్వనాథన్ సంగీత ప్రదర్శనలో ప్రముఖ గాయనీ, గాయకులు పి. సుశీల, ఎల్.ఆర్. ఈశ్వరి, చిత్ర, కోవై సుందరరాజన్, సురేందర్ చిత్రగీతాలు పాడారు. హాస్యనటుడు వివేక్ ఓ వ్యంగ్యనాటికను ప్రదర్శిస్తే, సినీనటి శారదా ప్రీతా ఉత్తేజకరమైన నాట్యం చేసింది.

మెడిమిక్స్ గ్రూపు సంస్థల మేనేజింగ్ డైరెక్టర్ డా॥ వి.పి. సిధాన్ తన ప్రసంగంలో 'మెడిమిక్స్ సబ్బులు' విజయవంతం కావడంలో తనకు లభించిన సహాయం, సహకారాల గురించి ప్రత్యేకంగా చెప్పారు. తర్వాత తన కలలు, ఆశయం సఫలమవడంతో గత 25 ఏళ్లుగా తోడ్పడిన గొప్పవారిని పేరు పేరునా గుర్తు చేసుకుని కృతజ్ఞతలు తెలిపారాయన.

ఆ రజతోత్సవ వేడుకకి హాజరైన దర్శకులు కె. బాలచందర్, ఎస్.పి. ముత్తురామన్, డా॥ కళానిధి కూడా ప్రసంగించి మెడిమిక్స్ మరింత అభివృద్ధిచెందాలని శుభాకాంక్షలు తెలిపారు. హాస్యనటుడు వివేక్, నటి వినీత, తదితరులు పాల్గొన్న ఆ వేడుకలో 'మెడిమిక్స్' డైరెక్టర్లు అయిన వి.ఎస్. ప్రదీప్, ఎ.వి. అనూప్, శ్రీమతి ఎమ్.కె. సౌభాగ్యం సిధాన్ ఆహూతులకి స్వయంగా స్వాగతం పలికి, సౌకర్యాలకి లోటులేకుండా చూశారు. ◆

సుళ్ళూరుపేటలోనే పెళ్ళి జరిపించమన్నాడు' అంటూ నాన్న అమ్మకు.అరిచి చెప్పడం డ్రాయింగ్ రూమ్‌లో వున్న నాకు వినిపించింది"

మౌనిక చెప్పడం ఆపింది.

• • •

"నువ్వు మొత్తానికి ధైర్యం చేశావ్. రివర్స్‌అయ్యింటే ఏమిటి దారి?" అంది సుజన.

"నిజమే-కానీ ప్రేమా, సెక్సూ-ఇవి ఆలోచించి, లాభనష్టాలు బేరీజు వేసుకుని చేసేవి కావు"

వాళ్ళిద్దరూ అలా మాట్లాడుకుంటూ వుండగానే ఉమ అక్కడికి పరుగు పరుగున వచ్చింది.

"సుజనా! నాన్న రమ్మంటున్నారు. వెరీ అర్జెంట్. మనింటికి మద్రాసునుంచి ఓ స్వాములవారు వచ్చారు. ఆయనికి నిన్ను పరిచయం చేయాలని తీసుకు రమ్మన్నారు" అంది.

"స్వాములవారా? ఎవరాయన?"

"బ్రహ్మానంద మహరాజ్ అట"

ఇక వెళ్ళక తప్పదని, మౌనికవైపు తిరిగి "ఓకే మౌనికా! తరువాత కలుద్దాం" అని చెప్పి ఇంట్లోకి దారి తీసింది సుజన.

వాళ్ళిద్దరూ ఇంట్లోకి వెళ్ళేసరికి బ్రహ్మానంద మహరాజ్ సోఫాలో ఆసీనులై వున్నారు. ఆయన అచ్చు వంశీలాగా వున్నట్లనిపించాడు సుజనకి. కానీ గెడ్డాలూ మీసాలూ తగిలించుకుని రావడానికి ఇదేమీ సినిమా కాదుకదా. మనుషులు నిజజీవితంలో మారు వేషాలు వేసుకుని రావడం అసాధ్యమని ఆమె గట్టి నమ్మకం. అందుకే వంశీ కాదనీ, అయితే పోలికలు చాలా వున్నాయనీ అనుకుంది. మిగిలినవారికైతే అలాంటి సందేహమే కలగలేదు.

ఆయన జుట్టంతా పెంచి, నెత్తిమీద వల్మీకాన్ని వుంచుకున్నట్లు చుట్టలు తిప్పి కట్టుకుని వున్నాడు. గడ్డం అంత పెద్దది కాదుగానీ సుమారుగానే వుంది. నుదుటిమీద చందనం బొట్టు. దాని మధ్య కుంకుమ ఎర్రగా మెరుస్తోంది. సిల్క్ కాషాయం పంచెమీద అదే రంగు సిల్క్ శాలువా వుంది. అంతేతప్ప బనీనో, జుబ్బానో కూడా లేదు.

ఆయనకెదురుగా ఇంటిల్లిపాదీ వినయంగా నిలుచుని వున్నారు. బామ్మ అయితే భక్తిపారవశ్యంతో కళ్ళు వాల్చేసి వుంది.

"అదిగోండి స్వామీ! ఆమే మా చిన్నమ్మాయి-సుజన" సత్యనారాయణ సుజనను బ్రహ్మానంద మహరాజ్‌కి చూపిస్తూ చెప్పాడు.

"నాకెందుకు తెలియదురా అబ్బీ! ఆమె పేరు సుజన. ఎం.ఏ. చదువుకుంది. ఇటీవలే పెళ్లయ్యింది. ఆమె భర్త పేరు వంశీ. వీళ్ళిద్దరికీ పెళ్లి అయి నెల కావస్తున్నా-ఇంకా శోభనానికి ముహూర్తం కుదరలేదు. రేపు రాత్రికి మంచి ముహూర్తం వుందని నువ్వే ముహూర్తం పెట్టాపుకదరా అబ్బీ" స్వామి చిద్విలాసంగా నవ్వుతూ చెప్పాడు.

"అవును స్వామీ" సత్యనారాయణ ఆయన త్రికాల జ్ఞానానికి ఆశ్చర్యపోతూ చెప్పాడు.



## కనక అక్కసు

"ప్రస్తుతం బొంబాయి నుంచి దిగుమతి అవుతున్న నటీమణులకు మంచి ఆదరణ లభిస్తోంది. నా ఉద్దేశంలో ఈ ఆదరణ కొంతకాలం మాత్రమే! రెండు సినిమాలు వరుసగా ఫెయిల్యూర్ అయితే చాలు! ఆపైన బొంబాయి నటీమణుల కోసం ఎవ్వరూ పరుగులు పెట్టరు.

ఏమో? ఒకవేళ హాలీవుడ్ నటీమణులకోసం పరుగెత్తినా పరుగెత్తగలరు మన వాళ్ళు" అంటూ ఉత్తరాది తారల ఆగమనంపై కామెంట్ చేసింది చేపకళ్ల కనక.

'అందాలున్నా, అవకాశాలు తక్కువకావడంతోనే ఈ అక్కసు' అంటోందో బొంబాయి గువ్వ.

సాక్షాత్తూ ఆ మహావిష్ణువే తమ ఇంటికి వచ్చినట్టు సుజన తప్ప మిగిలిన అందరూ ఆయనవంక భక్తితో చూస్తున్నారు.

అతను వంశీలా వుండడం–ఇవన్నీ చెప్పడాన్ని చూస్తుంటే ఏదో మెలిక వున్నట్లు అనిపిస్తోంది సుజనకు. కానీ అదేమిటో అర్థంకావడంలేదు.

మర్యాద కోసం రెండుచేతులూ జోడించింది.

"సుఖంగా వర్ధిల్లు అమ్మా" ఆశీర్వదించాడు ఆయన. పురుషుల్ని అబ్బీ అనీ, స్త్రీలను అమ్మా అనడం ఇతని స్టైల్ కాబోలనుకుంది.

"స్వామీ! మా చిన్నదాని కడుపులో ఓ కాయ ఎప్పుడు కాస్తుందో సెలవివ్వగలరా?" బామ్మ పారవశ్యంనుంచి బయటపడి ప్రశ్నించింది.

"ఏదీ శోభనం జరగకుండానే ఇదేమి ప్రశ్న అమ్మా! ఆ ముచ్చట తీరిన మూడునెలలకు నువ్వు ముని మనవడ్ని ఎత్తుకునే యోగం సిద్ధిస్తుంది లే అమ్మా"

"మంచి మాట చెవినవేశారు స్వామీ" అన్న పూర్ణమ్మ ఆనందంతో అంది.

"స్వామీ! మీరు లేచి, స్నానాదులు ముగించండి. అంత దూరంనుంచి ఎండలో వచ్చారు" సత్యనారాయణ వినయంగా అన్నాడు.

"అవునురా అబ్బీ! మీరు ఒక్కసారి ఆ ఊరెళ్ళి మీ భక్తుడ్ని ఆశీర్వదించి రండి స్వామీ అని ఆ ఎస్.ఐ. అబ్బి పోరితే ఇటొచ్చాను. అందునా ఆ సర్వేశ్వరుడు కూడా వెళ్ళమంటే వచ్చానురా అబ్బీ" అని బ్రహ్మానంద మహరాజ్ పైకి లేచాడు.

ఇలా స్వాములు రావడం, ఏవో పూజలు చేయడం మామూలే కాబట్టి, అందర్నీ స్వామికి వదిలేసి తను మాత్రం గదిలోకి వచ్చి పడుకుంది సుజన.

వంశీ ఏమయ్యాడోనన్న దిగులూ, గడువు ఈ రాత్రితో ముగుస్తుందన్న వేదనా–రెండూ పెనవేసుకుపోవడంతో ఏమీ తోచక అలానే కళ్ళు మూసుకుంది.

మరో గంట తరువాత మధ్యాహ్న భోజనాలయ్యాయి. బామ్మని కిందనే వుంచి స్వామికి సుజన గదికెదురుగా వున్న బామ్మ గదిని కేటాయించారు.

ఆ గది కావాలని స్వామి అడిగాడో, లేకపోతే ప్రశాంతంగా వుంటుందని డాబామీద గదిని నాన్నే కేటాయించాడో తెలియలేదు సుజనకు. కానీ ఆ వివరాలన్నీ అడిగే మూడ్ లేక తనపాటికి తను రూమ్‌లో పడుకుంది. ఆ గదివైపు చూడనైనా లేదు.

అయిదుగంటల ప్రాంతాన కిందకు దిగింది. అప్పటికే స్వామితోపాటు అందరూ ఫ్రెష్‌గా హాల్లో కూర్చుని వున్నారు. ఆత్మ, పరమాత్మ గురించి స్వామి అనర్గళంగా ఉపన్యాసం ఇస్తుంటే అందరూ తన్మయత్వంతో వింటున్నారు.

ఇక అప్పుడు అమ్మని పిలిచినా రాదని తెలియడం వల్ల తనే వంటగదిలోకి వెళ్ళింది. ఫ్లాస్కులోని కాఫీ పోసుకుని తాగి, ఆ తరువాత స్నానం ముగించింది. అనాలోచితంగానే నీలంపూలున్న తెల్లటి షిఫాన్ చీర కట్టుకుంది. అదే డిజైన్ జాకెట్‌లో ఆమె సాయంకాలంపూట విచ్చుకున్న మల్లెపూలదండలా వుంది.

అమ్మావాళ్ళు ఏ పొజిషన్‌లో వున్నారో చూడడానికి తిరిగి హాల్లోకి వచ్చింది.

ఆమెని చూడగానే స్వామి సోఫామీద అటూ ఇటూ కదలడం ఎవరూ గుర్తించలేదు.

అప్పుడే ఉపన్యాసం ముగిసింది. స్వామితోపాటు అందరూ లేచారు.

"అబ్బీ! హోమానికి ఏర్పాట్లు చేద్దాం. ఇప్పటికే సమయం మించిపోయింది" అన్నాడు స్వామి.

"అలానే స్వామీ" సత్యనారాయణ తల ఆడిస్తూ చెప్పాడు.

చాలా పెద్దతతంగమే జరిగేటట్లుంది. వంశీ ఏదైనా ప్లాన్ వేసుకుని వచ్చినా రాత్రికి శోభనం జరిగేటట్లు లేదనిపించింది సుజనకు. అందుకే అసలు ఏం జరుగుతూ వుందో తెలుసుకోవాలని పెద్దక్క ఉమతోపాటు బయటికి నడిచింది.

"ఏమిటే యాగం గీగం అంటున్నాడు స్వామి?" అని అడిగింది బావిలోంచి నీళ్ళు తోడడానికి ఉపక్రమిస్తున్న ఉమని.

"అదంతా చెప్పే టైమ్ లేదు. సింపుల్‌గా చెబుతాను విను. ఈ రాత్రి తొమ్మిది గంటలకు రుద్రమార్తాండ యాగం చేస్తారట స్వామి. మనింట్లో నాన్న దగ్గరున్న పుస్తకాలు చాలా పవర్‌ఫుల్ అట. వాటి పవర్‌వల్ల ఇంట్లో శక్తంతా హరించుకుపోతోందట. గంగమ్మ అలానే వుంటే ప్రపంచం మాడిపోతుందని వెంటనే ఓ చెంప నరికేస్తారు చూడు అలాంటిదన్నమాట.

అంత పురాతనమైన, శక్తివంతమైన పుస్తకాలను కొయ్యపెట్టెలో దాచివుంచినందుకు నాన్నను చీవాట్లు పెట్టారు స్వామి. దేవిని ఉపాసించాలేగానీ, ఉంచుకోకూడదురా అంటూ మెత్తగా గడ్డిపెట్టారు.

ఆ కొయ్యపెట్టెను ఎవరికీ తెలియకుండా దొడ్లో దూరంగా పూడ్చిపెట్టెయ్యమని చెప్పాడు. పుస్తకాలు లాగేసిన శక్తినంతా తిరిగి ప్రతిష్ఠించేందుకు స్వామి ఒక్కరే హాల్లో యాగం చేస్తారట" అంది ఉమ.

(ఇంకావుంది)

# మా కష్టమర్లలో కొందరికి బట్టలపైన ధ్యాసే వుండదు, దిగంబరంగా నడియాడతారు...

...అర్ధంపర్ధంలేని మాటలు...పేచీపెట్టి మారాం చేయడం. అయితేనేం, వాళ్ళని ప్రపంచంలో కల్లా అందమైన స్త్రీలు మనసారా ముద్దెట్టుకుంటారు ఎప్పుడూను. తల్లులు వాళ్ళు మీలాగే. వాళ్ళ పాపాయిలికి అన్నింటికన్న ఉత్తమమైనవే తప్ప మరింకేమీ వద్దని పట్టుబడతారు.



ఎదిగి పెద్దవాళ్ళయ్యే ఆ లోకంలోకి పుష్టికరమైన తీరులో అడుగిడేలా వాళ్ళకి స్వాగతం పలకడంకోసం, అత్యుత్తమమై, సహజమైన పదార్థాలనే వాడతాం మేం. నిశితమైన పరిశోధన ద్వారా సరియైన పాళ్ళేవో నిర్ణయిస్తాం అత్యంత శ్రద్ధతో. వాడే పదార్థాల పోషణయొక్క విలువను అట్టేబెట్టే ఆ టెక్నాలజీ పైనే విశ్వాసంతో. వాటి సహజమైన రుచీ, సువాసనలని పెంచుతూనే. కృత్రిమమైన సువాసనలూ, రంగులూ చేర్చకుండానే.

ఒక్క విషయంలో మీరు గట్టి నమ్మకంతో వుండవచ్చునిక - మాయొక్క ఆహార పదార్థాల శ్రేణి, అవి ఆరోగ్యరీత్యా 100% పరిశుద్ధతగల స్థితిగతుల్లో తయారుచేయబడ్డాయని. ప్రపంచంలోని అత్యాధునికమైన మిషన్లపైన. మీకు అందేవరకూ ఎవ్వరూ అలా చేతులలో ముట్టుకోకుండావుండేలా ధృవపరుచుకోగల తీరులోని నాణ్యతపై నియంత్రణగల పద్ధతులతో.

మీరందుకే బట్టలపై ధ్యాసలేని వాళ్ళెందరెందరో మా అభిమానులయ్యారంటే ఆశ్చర్యపడం మేం.

మా ఉత్పాదనలలాగే, మా అభిమానులలాగే, అది అలా సహజంకదా.

**హిందూస్థాన్ ఫుడ్స్ లిమిటెడ్**
**ఘనమైన మొట్టమొదటి అడుగు.**



(H)(F) **Hindustan Foods Ltd., Goa.**

Avenues HF 64·94

సీరియల్



# రారా మా ఇంటిదాకా

మేర్లపాక మురళి

"ఆయన హాల్లో ఒంటరిగా యాగంచేస్తే మరి మనం ఎక్కడుండాలి?" అడిగింది సుజన.

"మేమంతా గుంతతవ్వి కొయ్యపెట్టెను పూడ్చాలి. ఎవరికీ సందేహం రాకుండా రాత్రంతా గుంత తవ్వుతూనే వుండాలట. తెల్లవారు జామున నాలుగు గంటలకు మంచి ముహూర్తం వుందట. అప్పుడు పూడ్చమన్నాడు. పెట్టెను పూడ్చిపెట్టిన తరువాతే మేం ఇంట్లోకి రావాలి.

గుంత ముందే తవ్వినా నాలుగుగంటల వరకూ అక్కడే వుండాలట. స్వామి చేస్తున్న యాగం మేము చూడకూడదట. స్వామి పిలిచినప్పుడే మేము లోపలికి రావాలి" చెప్పింది ఉమ.

"మేమూ, మేమూ అంటున్నావు మరి నేనూ?"

"కన్నెపిల్ల గుంతను తవ్వకూడదట. అలా అని యాగమూ చూడకూడదట. నిన్ను నీ రూమ్‌లోనే వుండిపొమ్మన్నాడు. తెల్లవారుజామున నాలుగు గంటలకిగానీ బయటికి రావద్దని చెప్పమన్నాడు"

"కన్నెపిల్ల గుంత తవ్వకూడదా?"

"అవునట. అంతేకాదు-నాన్నగారిని ఇకనుంచీ ముహూర్తాలూ, జాతకాలూ, రాహుకాలాలూ, వాస్తులు గట్రా చూడవద్దనీ అన్నారు.

ఈ యాగంవల్ల చెడు ముహూర్తంలో పనులు తలపెట్టినా భేషుగ్గా జరుగుతాయట" అంది ఉమ.

"నాన్న ఒప్పుకున్నాడా?"

"ఆఁ అంతటి స్వామి చెబుతుంటే వినకుండా వుంటాడా?" అంది ఉమ.

"పోనీలే ఇలాగైనా నాన్న ఛాదస్తం వదిలితే చాలు"

"అలాంటి మాటలనకు. అశుభాలు జరుగుతాయి"

"సరేలే-నువ్వూ ఆ తీగలోని కాయేగదా" అని సుజన ఇవతలికి వచ్చేసింది. డాబా ఎక్కి వంశీ ఇంటి వైపు చూస్తూ రకరకాల ఆలోచనలతో గడిపింది.

**26** మౌనిక తన ఫస్ట్‌నైట్ జరిగిన సంఘటన గురించి సుజనకు చెప్పగా, పెళ్ళి ఎక్కడ జరపాలన్న విషయంలో తన తండ్రి పట్టుదల గురించి, తానా విషయం శ్రీనాథ్‌కి ఉత్తరం రాయడం, ఓ తుపాను రాత్రి శ్రీనాథ్ తమ ఇంటికి రావడం, ఆ సమయంలో తన తల్లితండ్రి ఊళ్ళో లేకపోవడం, అప్పుడు తమ శోభనం జరిగిన సంగతి వివరిస్తుంది.

బ్రహ్మానంద మహరాజ్ రూపంలో వంశీ మద్రాసునుండి సుజన వాళ్ళింటికి వస్తాడు. సుజన తండ్రి సత్యనారాయణ, ఇంట్లోవాళ్ళు వంశీని గుర్తుపట్టరు. ఆతనికి సకలమర్యాదలు ఎంతో భక్తిశ్రద్ధలతో చేస్తారు. సుజన మాత్రం ఆతను వంశీ అని అనుమానిస్తుంది.

ఆస్వామి ఇంట్లో యాగం చేద్దామంటాడు. సుజన యాగం గురించి పెద్దక్క ఉమను అడుగుతుంది. తమ ఇంట్లోని కొయ్యపెట్టెలోని పుస్తకాలు చాలా పవర్ కలవి కావడంవేత ఇంట్లో శక్తి అంతా హరించుకుపోతోందని, అందుకని కొయ్యపెట్టెని ఆ రాత్రి దొడ్లో దూరంగా పూడ్చిపెట్టమని స్వామి చెప్పారని, పుస్తకాలు లాగేసిన శక్తి తిరిగి పొందేందుకు స్వామి యాగం చేస్తారని చెప్పింది ఉమ.

తొమ్మిది గంటల ప్రాంతాన భోజనానికి పిలుపొచ్చింది. ఆ రోజు భోజనం ఎవరూ చేయకూడదనీ, ఫలహారంతో సరిపెట్టుకోవాలనీ స్వామి చెప్పడంవల్ల ఉప్మా, వేరుశనగపప్పు పచ్చడీ చేశారు.

టిఫిన్ తిని, హాల్లోకి వచ్చింది.

అక్కడ యాగానికి కావాల్సిన ఏర్పాట్లన్నీ జరిగిపోయాయి. కొత్త ఇటుకరాళ్ళను రెండువరసల్లో చదరంగా పేర్చారు. దాని మధ్యలో చిన్నచిన్న పుల్లలు వేశారు. వాటిమీద కొద్దిగా పొట్టు పోశారు. పక్కనే రెండు పెద్ద స్టీలు పళ్ళాలలో రకరకాల సామానులు వున్నాయి. మూడు చెంబుల్లో హోమ గుండంలో పోయడానికి నెయ్యి సిద్ధంగా వుంది.

"ఇక మొదలుపెడతానురా అబ్బీ! మీరు కొయ్య పెట్టె, పలుగులూ, పారలూ తీసుకొని దొడ్లోకి వెళ్ళండి. ఇంటికి దూరంగా నేను చెప్పిన దగ్గరనుండి తవ్వండి. ఇంత పెద్ద పెట్టె పూడ్చడానికి గుంత తవ్వాలంటే చాలా టైమే పడుతుంది.

మరో కంటికి తెలియకుండా అత్యంత రహస్యంగా తవ్వాలి. నాలుగు గంటలకి పూర్తిచేయాలి. యాగం పూర్తిచేయడానికి నాకూ అంతకాలం పడుతుంది" సత్యనారాయణతో అని, ఆ పిమ్మట సుజవైపు తిరిగి "నువ్వు కన్నెపిల్లవు కాబట్టి గది వదిలి బయటికి రాకూడదు అమ్మీ" అన్నాడు స్వామి.

పంచాంగాలూ, శాస్త్రాలూ వున్న కొయ్యపెట్టెను తీసుకుని సుజన తప్ప అందరూ బయటికి వెళ్లారు. స్వామి తలుపులన్నీ బంద్ చేశాడు. సుజన మెట్లెక్కి డాబామీదున్న తన గదిలోకి వెళ్ళింది.

హాలు పక్కనుంచే డాబా మీదకు మెట్లుండడంవల్ల స్వామి పఠిస్తున్న మంత్రాలు మెల్లగా విన్పిస్తున్నాయి.

ఇక ఈ రాత్రికి వంశీ వచ్చే ఛాన్స్ లేదనిపించడం వల్ల దిగులు మరింత ఎక్కువైంది సుజనకి. అటూ ఇటూ దొర్లుతుందేగానీ నిద్ర రావడంలేదు.

ఎవరో ముక్కూ ముఖం తెలియనివాడొచ్చి బయట గుంత తవ్వమంటే తవ్వడానికి వెళ్ళిన తన



వాళ్ళనుతలంచుకుంటుంటే జాలి పుట్టింది. బయట చలిలో ఏంచేస్తున్నారో చూద్దామనిపించి పక్కమీద నుంచి లేచి పిట్టగోడ దగ్గరికి నడిచింది.

ఇంటివెనక దూరంగా లాంతరు చీకటిని నాకుతున్న ఎర్రటి పురుగులా వుంది.

శబ్దాలు వస్తే కాటికాపరి వచ్చి సొమ్ములు అడుగుతాడన్న భయంతో నిశ్శబ్దంగా శవాన్ని పూడ్చడానికి తయారైనవాళ్ళలా అందరూ మౌనంగా గుంత తవ్వుతున్నారు. తెల్లవారేటప్పటికైనా వాళ్ళు గుంత పూర్తి చేస్తారన్న నమ్మకం కలగలేదామెకి.

రేపటినుంచీ నాన్న శాస్త్రాల జోలికి పోడన్న సంతోషంవల్ల వాళ్ళు పడుతున్న కష్టం కష్టంలా అనిపించలేదు. ఆ మేరకు స్వామి మంచే చేశాడనుకుంది.

నాన్న తనను చూస్తే గొడవ చేస్తాడనిపించి అక్కడి నుంచి కదిలి తిరిగి తన గదిలోకి వచ్చింది.

మంత్రాలు వినిపించడంలేదు. స్వామి ఏం చేస్తున్నారో తెలియడంలేదు. కిందకి రాకూడదన్న షరతు పెట్టడంవల్ల కిందకి చూడాలన్న కోరికను అణుచుకుని, పడుకుని కళ్ళు మూసుకుంది.

మరో పది నిముషాలు గడిచాయో లేదో ద్వారం దగ్గర ఏదో కదిలినట్లనిపించి కళ్ళు విప్పి చూసింది.

ఎదురుగ్గా వంశీ.

అది ఆశ్చర్యమో. ఆనందమో. కలో. వైష్ణవ మాయో తెలియనంత విభ్రమానికి లోనుకావడంతో ఆమెకు నోరు పెగల్లేదు.

కాసేపటికి తేరుకుని ఎదురొచ్చి అతన్ని గాఢంగా హత్తుకుంది సుజన. అతను కనపడకపోయేసరికి ఆమె ఎంత వేదనకు గురైందీ ఆ కౌగిలింతలోని గాఢత్వమే తెలియజేస్తోంది.

ఏదో తెలియని ఉద్వేగం ఆమెని నిలవనివ్వకపోవడంతో అతనినుంచి విడివడి "వంశీ" అంటూ పిలిచింది.

"ఊఁ"

## జూహీ తక్కువ తినలేదు

అనిల్‌కపూర్‌కి జోడీగా జూహీచావ్లా అతని సొంత సినిమా 'లోఫర్‌'లో నటిస్తున్నా, తనను పొగుడ్తూ అతనాడే మాటల్ని కొట్టిపారేస్తోందామె.

"ఆ పొగడ్తల్ని పట్టించుకోకండి. నా వెనుక మాధురీ దీక్షిత్‌నీ అలాగే పొగుడుతాడు" అని జోక్‌చేస్తోంది.

'జూహీ ఏమన్నా తక్కువ తిందా? ఆమెకి అంత లోకజ్ఞానం, తెలివితేటలుండబట్టే సక్సెస్‌కి ఎక్స్‌పోజింగ్ ముఖ్యమని గ్రహించగానే ఒంపుసొంపుల్ని ప్రదర్శించి సక్సెస్ అయింది. అది తెలుసుకోకుండా పొగడ్డం అనిల్‌కపూర్ తప్పేకదా!' అంటున్నారు.



"ఎక్కడికెళ్ళావ్? నువ్వు కనపడకపోయేసరికి ప్రపంచమే శూన్యంగా తోచింది. ఏదో చెప్పలేని బాధ గుండెల్ని పిండేసింది"

"వచ్చేశాగా" అతను అనునయిస్తూ ఆమె కన్నీళ్లను తుడిచాడు వంశీ.

"ఎలా వచ్చావ్?" ఆమెకి ఇంకా నమ్మకం చిక్కలేదు. కలేమోనన్న భ్రమ ఇంకా వదల్లేదు.

"బ్రహ్మానంద మహరాజ్ వేషంలో"

అప్పుడు ఆమె అతన్ని పైనుంచి పాదాలవరకూ చూసింది. తెల్లటి జుబ్బా, పైజామాలో అప్పుడే కడిగిన ముత్యంలా వున్నాడు.

"ఈ ప్లాన్‌కి నేను పెట్టుకున్న కోడ్ ఏమిటో తెలుసా? 'ప్రిమెచ్యూర్ శోభనం' అని. చిన్న పనిమీద మద్రాసు వెళ్ళాను. ఆ పనేమిటో మళ్ళీ చెబుతాను. అక్కడ శరవణన్‌ని కలిశాను. మాటలమధ్యలో ఆయన మీ నాన్న బ్రహ్మానంద మహరాజ్‌ని పంపించమన్న విషయం తెలిసింది.

మీ నాన్న ఆయనను ఇంతవరకూ చూడకపోవడం కలిసొచ్చింది. శాస్త్రాల జోలికి పోకుండానూ, ఛాలెంజ్‌లో మనం నెగ్గే విధంగానూ ఈ ప్లాన్ చేశాను. నేనే బ్రహ్మానంద మహరాజ్ అవతారమెత్తాను"

"అద్భుతం" అంటూ అతన్ని అప్రిషియేట్ చేయడానికి మరోమారు హగ్ చేసింది. అప్పుడు గుర్తొచ్చింది ఆమెకు తన ఛాలెంజ్ గురించి. అతను కనిపించాడన్న ఆనందంలో దాన్ని మరిచిపోయింది. ఇప్పుడిక ఆలస్యం అనవసరమనిపించి అతని పెదవులపై పెదవులతో అద్దింది.

అన్ని రకాల పళ్ళ రసాలను రంగరించి తాగుతున్నట్లుంది అతనికి. అమృతంకోసమా అన్నట్లు ఆమె నాలుకతో చిలుకుతోంది.

అప్పుడు ఆకాశం బుగ్గమీద నఖక్షతంలా వుంది చంద్రవంక. వీరి శోభనాన్ని చూడడానికి గాలి ఎక్కడో దొంగచాటుగా నక్కినట్లు చడీ చప్పుడు లేకుండా వుంది. రెండు గదుల మధ్యనున్న ఖాళీస్థలంలోనే సృష్టి రహస్యాన్ని ఛేదించడానికి వాళ్ళిద్దరూ ఎంతో ఉవ్విళ్ళూరుతున్నారు.

అతను ఆమె నుదుటన పెట్టుకున్న ముద్దు సిందూరమై మెరిసింది. కళ్లమీద పెట్టుకున్న ముద్దు కాటుకే అయింది. ముక్కుమీద పెట్టుకున్న ముద్దు బంగారు ముక్కెరలా భాసించింది.

కంఠంమీద పెట్టుకున్న ముద్దు ఆభరణంలా అమరింది. నడుంమీద పెట్టుకున్న ముద్దు రతనాల వడ్డాణంలా చుట్టుకుంది. చివరికి సిగ్గుబిళ్ళ కావాల్సిన ముద్దును ఆమె సుతారంగా అడ్డుకుంది.

ఆమెను అలానే కిందకు వంచి అతను విల్లులా మీదకు ఒరిగాడు.

నఖక్షతం కాస్త పంటిగాటు అయినట్లు చంద్రవంక మరింత ప్రకాశవంతమైంది.

గాలి అగరొత్తుల పరిమళమే అయింది.

శోభనం గదిలోకి పెళ్లికూతురు తేవాల్సిన పాలు లేవన్న అతని చింతను ఆమె ఎంగిలి తీర్చింది. బత్తాయిలు లేవన్న బాధను ఆమె బుగ్గలు తీర్చాయి. ఆపిల్‌పళ్ళు లేవన్న అసంతృప్తిని ఆమె ఎద తీర్చింది. నల్లద్రాక్ష లేదన్న ఫీలింగ్‌ను ఆమె చనుమొనలు తీర్చాయి. ఖర్జూరం లేదన్న వెలితిని ఆమె బొడ్డు తీర్చింది. ఎగ్జైట్‌మెంట్‌తో తలలో రక్తం కెరటాలై లేస్తున్నట్లు ఆమె జుట్టు ముడి వీడింది.

ఏదో కావాలన్న ఆరాటంతో ఎద పొంగడంతో జాకెట్టు తన బంధనాలన్నిటినీ తెంచుకుంది. అంత వరకు కాపలా కాచిన బ్రా ఇక తనవల్ల కాదన్నట్లు ఊడింది. చీర సిగ్గుతో కుచ్చిళ్ళను అడ్డం పెట్టుకుని కిందకు జారిపోయింది. తను ఒక్కటి మాత్రం అడ్డం వుండి ఏం ప్రయోజనం అనుకుంది కాబోలు లంగా కూడా అడ్డం తప్పుకుంది.

ఇవన్నీ అతను చేశాడో, ఆమే చేసిందో కూడా ఇద్దరికీ తెలీదు. వాళ్ళు దాన్ని గుర్తించలేని ఉద్రేకంలో ఒకరిలో ఒకరు కలిసిపోవాలనే కాంక్షతో వున్నారు. సుఖానికి మహాప్రస్థానం చేస్తున్న రెండు శరీరాలైపోయారు. ఆమె ఇప్పుడు నగ్నంగా వుంది. మెలికలు తిరిగిన శరీరపు గీతల కింద మాత్రం వెన్నెల తన సంతకాలు చేస్తున్నట్లు నల్లటిచారలు కనిపిస్తున్నాయి.

సుఖం లోతెంతో చూడడానికి అతను ఆమెను పూర్తిగా ఆక్రమించుకున్నాడు.

శరీరం కొత్త బరువుకి విచ్చుకుంటోంది.



## బ్రెజిల్ ప్రజల విజయోత్సాహం

వరల్డ్ కప్ సాకర్‌లో బ్రెజిల్ గెలుపొందడంతో బ్రెజిల్ ప్రజల ఆనందానికి అవధుల్లేకపోయాయి. అక్కడ ఫుట్‌బాల్‌క్రీడపై విపరీతమైన మోజు ప్రదర్శించే అభిమానులు 15 కోట్లమంది వున్నారు. వారు 'బ్రెజిల్-వరల్డ్ ఛాంపియన్స్' అని ముద్రించిన టీ-షర్టులు కొని ధరించడానికి ఎగబడడంతో వాటి అమ్మకం కొన్ని రోజులపాటు 24 గంటలూ సాగింది.

బ్రెజిల్ ప్రజలందరూ తమ విజయోత్సాహాన్ని పార్టీలద్వారా పంచుకున్నారు. బ్రెజిల్‌లో ఫుట్‌బాల్ కేవలం ఓ క్రీడని అనుకోరు. దాన్ని ఓ మతంకంటే ఎక్కువగా భావిస్తారు. సాకర్ క్రీడాకారుడు రొమేరియో, "అది బ్రెజిల్ ప్రజలకి ఆహారంతో కూడిన కంచం లాంటిది. ఆ క్రీడలో గెలుపు వారు అన్నిటినీ మరిచిపోయేలా చేస్తుంది, తమ ఆకలిని కూడా!" అంటూ చేసిన వ్యాఖ్యానంలో ఎంతో నిజముంది.

సాకర్‌లో ప్రపంచ ఛాంపియన్‌గా బ్రెజిల్ గెలుపు సాంబా నృత్య అభిమానులకి మరింత ఆనందం కలిగించింది. ఎందుకంటే, ఆ సందర్భంలో సాంబా నృత్యంలో ప్రవీణులైన యువతులు ఈకలతో చేసిన టోపీని తలపై ధరించి, ఒంటిపై వీలైనంత తక్కువ బట్టలతో ఎంతో ఉత్సాహంగా నృత్యం చేయడం ద్వారా కనువిందు చేశారు. ◆

అంత థ్రిల్లింగ్ లోనూ ఆమెకి ఓ చిలిపి ఆలోచన వచ్చింది. అందుకే ముందుకు దూసుకుపోతున్న అతని కళ్ళల్లోకి చూస్తూ "స్టాట్యూ" అంది.

అప్పుడు ఊరకనే అలా బొమ్మలా నిలబడిపోవడమంటే స్వర్గంలోకి వెళ్ళబోతున్న వ్యక్తిని హఠాత్తుగా వెనకనుంచి కాలర్ పట్టుకుని ఆపడం తప్ప మరేం కాదు. కానీ తమ మధ్యవున్న ఒప్పందం మేరకు స్టాట్యూ అంటూనే ఎలా వుంటే అలా ఆగిపోవాలి.

అతను అలానే చిత్రపటంలా అయిపోయాడు.

ఆమె అల్లరిగా నవ్వుతోంది. "ఆ రోజు గుడిలో ఇలా స్టాట్యూ చెప్పి ముద్దుపెట్టుకున్నావుకదా-అందుకే ఇప్పుడు-టిట్ ఫర్ టాట్" అంది.

అతను మాట్లాడకూడదు కాబట్టి మౌనంగా వుండిపోయాడు.'డౌన్ చెప్పమని కళ్ళు అర్థిస్తున్నాయి.

వెన్నెల్లో ఆమె నగ్నత్వం అతనిని నిశ్శబ్దంగా కవ్విస్తోంది. తమ స్టాట్యూ ఆటను బ్రేక్ చేసెయ్యాలన్న ఉద్రేకం మొదలైనా తమాయించుకున్నాడు.

అతని అవస్థ అంతా ఎంజాయ్ చేసిన ఆమె ఇక ఇబ్బందిపెట్టడం ఇష్టంలేక "డౌన్" అంది.

అతను ఒక్కసారిగా బిగుట్టిన ఊపిరిని వదిలాడు.

మళ్ళీ మహాప్రస్థానం మొదలైంది-అయితే ఈసారి జంటగా. ఆత్మలకు సైతం అలసట వచ్చేంతగా వాళ్ళు సుఖాన్వేషణలో మునిగిపోయారు.

కాలం స్తంభించిపోయింది.

వాళ్ళిద్దరూ ఫస్ట్‌నైట్ అనుభవాన్ని పొంది, ఆ సుఖంలోంచి తేరుకునేటప్పటికి పుణ్యకాలం కాస్త సమీపించింది.

"నేను తిరిగి బ్రహ్మానంద మహరాజ్ అయిపోతాను. ఇప్పుడే మద్రాసు వెళ్లిపోతానని చెప్పి,బస్సు ఎక్కేస్తాను. ఫర్లాంగ్ దూరం పోయాక బస్సు దిగి తిరిగి ఇంటికొచ్చేస్తాను. నేను మహరాజ్‌ననే భ్రమలోనే మీ నాన్నను వుంచి, ఇక శాస్త్రం జోలికి పోకుండా చేస్తాను" అని కిందకు దిగి వచ్చేశాడు వంశీ.

అప్పటికి వాళ్ళు కూడా గుంత తవ్వేశారు. ఇక కొయ్యపెట్టెను అందులో పెట్టి, మట్టి తోయాల్సిన పని మాత్రమే మిగిలివుంది.

సుజన అంతా సర్దుకుని తాపీగా కిందకు వచ్చింది.

తలుపు తీసుకుని దొడ్లోకి వచ్చింది.

"ఏమ్మా? ఇలా వచ్చావ్! స్వామికి తెలుసా నువ్వు ఇటొస్తున్నట్లు" కంగారుగా అడిగాడు సత్యనారాయణ.

"ఆయనే నన్ను లేపి పంపించారు నాన్నా. యాగం అయిపోయింది, ఇక నువ్వు బయటికి రావచ్చు అంటేనే వచ్చాను" అంది సుజన.

"యాగం అయిపోయిందట. ఇది కూడా పూర్తి కావాలి. త్వరగా పూడ్చేద్దాం" అంటూ ఆయన మిగిలినవారిని తొందరచేశాడు.

సుజన, ఉమ దగ్గరికి వెళ్ళి మెల్లగా- "నేనూ సహాయం చేయనా?" అని అడిగింది చిన్నగా నవ్వుతూ.

దానికే ఆమె ఆందోళనపడిపోయింది. "నువ్వు ఈ పనులన్నీ చేయకూడదని స్వామి చెప్పారుగా. కన్నెపిల్లలు దీనికి పనికిరారట" అంది.

"కానీ నేను కన్నెపిల్లను కానుగా"

తన పక్కన బాంబు పేలినట్లు అదిరి పడింది ఉమ.

"నువ్వు కన్నెపిల్లవి కావా! అంతా వేళాకోళంగా వుందా? శోభనం జరగని నువ్వు కన్నెపిల్లవి కాక బిడ్డల తల్లివా?" అని వ్యంగ్యంగా మాటలను సాగదీసింది ఉమ.

"రాత్రివరకు కన్నెపిల్లనే.కానీ ఇప్పుడు మాత్రం కాదు"

ఉమ మరోమారు అదిరిపడింది.

ఏమీ అర్థంకానట్లు చెల్లెలి వంక ఫ్లాట్‌గా చూసింది.

"స్వామి ఎవరనుకున్నావ్? వంశీనే"

ఉమ తన చేతిలోని పలుగు పారేసి సుజనను బరబరా పక్కకి లాక్కొచ్చింది.

వీళ్ళిద్దరి సంభాషణను చూచాయిగా విన్న మిగిలిన ఇద్దరు అక్కయ్యలు కూడా అక్కడికి వచ్చారు.

సుజన జరిగినదంతా చెప్పి- "మరి పందెంలో నేను గెలిచాను. మన మాట ప్రకారం పందెంలో గెలిచినవాళ్ళు ఏం చెబితే అది చేయాలి ఓడిపోయిన వాళ్ళు. మరిక నేను కోరుకోనా?" అని అక్కయ్యల రియాక్షన్ కోసం ఆగింది.

"ఓడిపోయాక తప్పదుకదా! ఏం అడుగుతావో అడుగు-బంగారు నెక్లెసా? పట్టుచీరా? లేక మీ హనీమూన్‌కి ప్లెయిన్ టికెట్లా?" అడిగింది ఉమ.

"అవేమీ వద్దు-మీ ముగ్గురూ మీ ఫస్ట్‌నైట్‌ల గురించి చెప్పాలి" అంది సుజన.

వింటున్న ముగ్గురూ అలా కొయ్యలా బిగదీసుకుపోయారు.

**-: అయిపోయింది :-**















# వినోదిని



అప్పారావు సారాయి తాగి రోడ్డు మీద నల్లుపాలప్ప పడిపోయాడు. అతన్ని లేవడానికి బంధువులు పలు విధాలా ప్రయత్నిస్తున్నారు. నిమ్మకాయ తలకు పెట్టండని కొందరు, తల మీద నీళ్ళు గుమ్మరించండని కొందరు సల హాలు ఇస్తున్నారు.

ఇంతలో ఓ పెద్దాయన "అవేమీవద్దు కానీ 'ఓ ప్యాకెట్ సారాయి' అతని నోట్లో పొయ్యండి, వెంటనే లేస్తాడు" అన్నాడు.

"అదే ఖాయం చేసుకోండి" అంటూ అప్పారావు గబుక్కున లేచాడు.

-జి. వెంకుమోహన్ నాయుడు, బొట్లగూడూరు




"మా దేశంలో స్త్రీలు భర్తతోబాటు సమానంగా పనిచేసి, వారితో సమా నంగా జీతం తీసుకుంటారు" అన్నాడు అమెరికా దేశస్థుడు.

"అదేం గొప్ప మా దేశంలో స్త్రీలు గడపదాటి పనిచెయ్యరు. అయినా భర్త జీతాన్ని మొత్తం తీసుకుంటారు!" చెప్పాడు భారతీయుడు.

-సిరిసిల్లా రజీద్ శిక్షక్, దొన్కల్



"అబ్బబ్బబ్బబ్బా... ఈ ఆర్టీసీ బస్‌లో నిలబడ్డానికి కూడా ఎప్పుడూ చోటుండదు కదా!" విసుక్కున్నాడు ఓ ప్యాసింజర్ బస్సెక్కి.

"మరి ఎప్పుడూ ఖాళీగా వుండడానికి ఇది బస్సులోని ఫస్ట్ ఎయిడ్ బాక్స్ అనుకున్నావుటయ్యా!" పెద్దగా కసురు కున్నాడు కండక్టర్.

-ఋషి, కొత్తగూడెం



పాలం విమానాశ్రయంలో ఒక యూరోపియన్ అమ్మాయి, ఒక ఆంధ్రా అమ్మాయి కలుసుకున్నారు. వారు తమ దేశాల గొప్పలు మాట్లాడుకుంటూ—

"...మావాళ్ళు ప్రతీ పనీ స్పీడ్‌గా చేయాలనుకుంటారు" గర్వంగా చెప్పింది లండన్ అమ్మాయి.

"నేను నమ్మను. మీ మగాళ్ళు ప్రతి పనీ స్పీడ్‌గా చేయాలనుకుంటే, ఆడ ళ్ళకు స్టాకింగ్స్, సస్పెండర్ బెల్ట్స్, జీన్స్ పాంట్స్ ఎందుకు కనిపెడతారు? మా మగాళ్ళలా 'చీరలు' సృష్టించేవారు" -అన్నది అనకాపల్లి ఆడపడుచు.

-జంధ్యం సునీల్ బాబు, పల్లిపాడు

"అయ్యా! ఇందాక మీ షాపులో ఒకరకం పప్పు కట్టి ఇమ్మంటే, మరొక రకం పప్పు కట్టిచ్చారండీ!" అన్నాడు ఓ కొనుగోలుదారుడు.

"అవన్నీ మీరు ముందే చూసుకో వాలి! ఇప్పుడు రిఫండ్ ఇవ్వడం కుద రదు!" గర్జించాడు దుకాణదారుడు.

"చిత్తం! కే.జీ. శనగపప్పుకు డబ్బులు తీసుకొని, కే.జీ. జీడిపప్పు కట్టిచ్చారులెండి! వస్తా!"

-కె. రాధాభవాని, రాజమండ్రి



"ఎనిమిది ఎనిమిదులెంత?" అడి గాడు టీచర్.

"34 సార్" అన్నాడో స్టూడెంట్.

"44 సార్" అన్నాడు మరో స్టూడెంట్.

"24 సార్" అన్నాడింకో స్టూడెంట్.

"64 అని ఒక్క సన్యాసీ చెప్పడేం" విసుక్కున్నాడు టీచర్.

"తమరు చెప్పారుకదండీ" అన్నారు పిల్లలంతా ఏకకంఠంతో.

-కె. బ్రహ్మానందరెడ్డి, అనంతపురం






సుబ్బారావుకి దేవుడు ప్రత్యక్షమై అడక్కుండానే-"నీ కలలన్నీ నిజ మయేటట్టు తిరుగులేని వరం ప్రసా దిస్తున్నాను భక్తా" అంటూ వరమివ్వ బోయాడు.

వెంటనే సుబ్బారావు లేచి దేవుని కాళ్ళపై సాష్టాంగపడిపోయి పాదాలు పట్టుకొని-"అంత పనిమాత్రం చెయ్య కండి మహాప్రభో... నాకొచ్చే కలలన్నీ పీడకలలే..."

-ఎస్. మంజుల, శ్రీకాకుళం



"నాన్నా మీ నాన్న నిన్ను కొట్టే వాడా" అడిగాడు కొడుకు.

"చితకబాదేవాడు" తండ్రి సమా ధానం చెప్పాడు.

"మరి మీ తాత, మీ నాన్నను కొట్టే వాడా" తిరిగి ప్రశ్నించాడు కొడుకు.

"తోలు వలిచేసేవాడు"

"ఎంతోకాలంగా సాగుతున్న ఈ రౌడీయిజాన్ని మనిద్దరం ఆపేద్దాం నాన్నా" అన్నాడు కొడుకు.

-భూమయ్య, పెద్దవాల్గోట్

Regd. No. H/VJ-171

ఆడవాళ్లు కాదు

ఆటంబాంబులు అని

నిరూపించిన చిత్రం

"ఆడవాళ్లకు మాత్రమే"

A FILM BY



కె. దేవీవరప్రసాద్
సమర్పించు



జయభేరి ఫిలిం ప్రొడక్షన్స్

# ఆడవాళ్ళకు మాత్రమే!

నిర్మాత
మురళీమోహన్

దర్శకత్వం
సింగీతం శ్రీనివాసరావు

ఇళయరాజా
రాజశ్రీ

హెచ్చరిక: "స్త్రీమూర్తిలో తల్లిని, చెల్లిని చూడని మగవాళ్లు సమాజానికి పగవాళ్లు"